# గురువందనం-2022

## తంగిరాల వ్యాసమాల
## మొదటి సంపుటం




ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు



"అపూర్వ గురుశిష్యులు" (పూర్వవిద్యార్థి పరిషత్తు)
తెలుగు అధ్యయనశాఖ
బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు

**శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః - గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ - తస్మై శ్రీగురవే నమః ॥**

**తా॥** గురుదేవుడే బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడు. అతడే పరబ్రహ్మ. అట్టి గురువునకు నా నమస్సులు! (శుకోపనిషత్)

**శ్లో॥ నారాయణ సమారంభాం - వ్యాస శంకర మధ్యమామ్ ।**
**అస్మదాచార్య పర్యంతాం - వందే గురుపరంపరామ్ ॥**

**తా॥** శ్రీమన్నారాయణునితో మొదలుకొని - మధ్యలో వేదవ్యాసుడు శ్రీశంకరాచార్యుల వరకును - తరువాత వ్యాసశంకరులనుండి ఇప్పుడు మా గురువర్యులదాక గల గురుపరంపరకు నా నమస్సులు!

# గురువందనం-2022

**బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖలో**
**పూర్వవిద్యార్థులు ("అపూర్వ గురుశిష్యులు") 10-06-2022,**
**శుక్రవారంనాడు నిర్వహించిన గురువందన**
**కార్యక్రమ వివరాలు - ఇతర వ్యాసాలు**


*రచన - సంపాదకత్వం - ప్రచురణ*

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**నివృత్త ఆంధ్రశాఖాధ్యక్షులు**

**(తెలుగు అధ్యయనశాఖ వ్యవస్థాపకులు)**

**బెంగుళూరు విశ్వవిద్యాలయం**

**"జ్ఞానభారతి", బెంగుళూరు-560 056**



**2023**

**GURUVANDANAM -2022** Falicitation to Retired Professors and Present Professor of the Department of Studies in Telugu, Bangalore University, Jnanabharathi, Bengaluru-560056 by the Alumni of the Department on 10th June 2022, (Friday) at Dr. K. Venkatagiri Gowda Auditorium. Essays written, edited and Published by Prof. T.V. Subba Rao.

No. of Pages: xvi + 576 (including 112 Pages of colour Photos)

Price: Rs.720/-

No. of Copies: 500

First Edition: 22.03.2023, బుధవారం శోభకృత్ ఉగాది.

ప్రియమైన పూర్వవిద్యార్థులకు, బంధుమిత్రులకు,
తెలుగు అధ్యయనశాఖకు నా 88వ జన్మదినపు కానుక

***For Copies:***

(1) Prof. T.V. Subba Rao, # 1708, "Siitaavadhaanam" 11th Cross, 1st 'G' Main, Kengeri Satellite Town, BENGALURU–560060, Cell No.99454 22742

(2)Dr. N.R. Sadasiva Reddy, Associate Professor, Dept. of Telugu, S.K.University, Anantapura-515003, Mobile: 94934 23695.

(3) Prof. K.Ashajyothi, Head, Dept. of Studies in Telugu, Jnanabharathi, Bangalore University, Bengaluru-560056. Mobile: 94496 72394.

***DTP & Page Layout by:***

Nagasri Graphics, # 1-18, Brindavana Colony, Near Agni Maremma Temple, Gundlasagaram Village, Kanamapally Post, Kuppam - 517 426, Gudupalli Mandal, Chittoor Dist., A.P. Mobile:8500619283.

***Printing at :***

Omkar Offset Printers, 3/3, 1st Main Road, New Tharagupet, Chamarajpet, Bengaluru-560002, Ph: 080-26708186, 26709026.

# అంకితం

1. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 1974లో తెలుగు స్నాతకోత్తర అధ్యయనశాఖ ను స్థాపించడానికి 1971లో మూడు లక్షల రూపాయల మూలనిధిని ఏర్పాటుచేసిన ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారికి, 1974లో ఉపకులపతిగానున్న డా॥ హెచ్. నరసింహయ్యగారికి, అప్పటి కన్నడ అధ్యయన కేంద్ర డైరెక్టరు, Dean, Faculty of Arts అయిన డా॥ జి.యస్. శివరుద్రప్పగారికి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి, డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారికి, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారికి, 15-03-2023 నాడు స్వర్గస్థులైన "దానరాధేయ" శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారికి... భక్తి ప్రపత్తులతో...
2. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో - కన్నడ అధ్యయన కేంద్రంలో 1969 నుండి 1976 వరకు నా దగ్గర తెలుగు చదివిన B.A.(Hons.) and M.A. కన్నడ విద్యార్థులకు....
3. తెలుగు అధ్యయన శాఖలో - 1974 నుండి 1996 వరకు నా దగ్గర చదివిన తెలుగు ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి. విద్యార్థులకు...
4. 1996 నుండి ఈనాటివరకు చదువుతున్న ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి. విద్యార్థులకు...
5. తెలుగు అధ్యయనశాఖలో నాతో కలిసి పనిచేసిన -
   1) కీ.శే. డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారికి-
   2) కీ.శే. రత్నాకరం శంకరనారాయణరాజుగారికి-
   3) కీ.శే. డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారికి-
   4) కీ.శే. ఆచార్య బాడాల రామయ్యగారికి-5) ఆచార్య జి.యస్. మోహన్‌కి-
   6) ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మికి-7) ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతికి-
6. నాతో కలిసి 1986లో "చైతన్యకవిత"ను స్థాపించిన సోదరుడు ఆచార్య ఆర్.వి.ఎస్. సుందరానికి -
7. నాతోకలిసి 1994లో "శ్రీరస"ను స్థాపించిన డా॥ దివాకర్ల రాజేశ్వరిగారికి, శ్రీమతి అంబికా అనంత్‌గారికి -

**ఆప్యాయంగా....**

**తంగిరాల వెంకట సుబ్బారావు**

# నమస్సులు... ఆశీస్సులు...

మా గురుదేవులకు నమస్సులు... నా ప్రియశిష్యులకు ఆశీస్సులు...

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు అధ్యయనశాఖలో 1974 నుండి 1996 వరకు నా దగ్గర చదువుకున్న విద్యార్థులు "గురువందనం" అనే పేరుతో, 12 ఏళ్ళ వ్యవధిలో నాకు రెండు పర్యాయాలు అత్యంత వైభవోపేతంగా సత్కారం చేశారు. మొదటిసారి 29-08-2010లో బెంగుళూరులో ఒక పెద్ద హోటల్లో ఏర్పాటు చేశారు. నాతోపాటు అప్పటికి సజీవులై ఉన్న 90 ఏళ్ళ వృద్ధులు ఆచార్య రత్నాకరం శంకరణారాయణరాజుగారికి; నా తరువాత తెలుగుశాఖలో పనిచేస్తున్న ఆచార్య జి.ఎస్.మోహన్‌కి, ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మికి, ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతికి కూడా ఘనంగా సన్మానం చేశారు. తిరిగి ఇటీవల, అంటే 10-06-2022, శుక్రవారంనాడు రెండవ పర్యాయం బెంగుళూరు విశ్వవిద్యాలయం "జ్ఞానభారతి" ప్రాంగణంలో ఉన్న డా॥ కె. వెంకటగిరిగౌడ ఆడిటోరియంలో మమ్మల్ని సత్కరించారు. ప్రొ॥ శంకరనారాయణరాజుగారు 2019లో స్వర్గస్థులయ్యారు. అందువల్ల తక్కిన నలుగురుని సత్కరించారు. ఈ పూర్వవిద్యార్థుల గురుభక్తితత్పరతకు నేను ముగ్ధుడనై, వారికి ఋణపడి ఉండకూడదని, ఈ గ్రంథాన్ని రచించి, ఆ శిష్యులందిరికీ మిక్కిలి వాత్సల్యంతో అంకితమిస్తున్నాను.

కేవలం సన్మానసభనుగురించి మాత్రమే వ్రాస్తే పాఠకులకు విసుగు పుట్టవచ్చును. అందువల్ల నేను మా గురుదేవులైన కీ.శే. దిగుమర్తి సీతారామస్వామిగారు, గురువర్యులైన ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు -ఈ గురుత్రయాన్నిగురించి నేను వ్రాసిన వ్యాసాలను ప్రథమభాగంగాను, సన్మానసభా విశేషాలను, నన్నుగురించి శిష్యులు వ్రాసిన వ్యాసాలను, ద్వితీయభాగంగాను, నా రచనల్ని గురించి, చైతన్యకవితనుగురించి మిత్రులు వ్రాసిన వ్యాసాలను, ఇతర కవితావిశేషాలను తృతీయభాగంగాను సమకూర్చాను. నా శిష్యులకు నాయందు ఎంతటి భక్తి ప్రపత్తులున్నాయో, నా గురువులయెడ నాకుకూడా అంతే భక్తి ప్రపత్తులున్నాయి. వారి గొప్పతనాన్నిగురించి, వారి సాహిత్యసేవనుగురించి నా శిష్యులు తప్పక తెలుసుకోవలసిన అవసరం ఉంది. అంత గొప్ప గురువుల దగ్గర నేను చదువుకున్నాను కాబట్టే నేను నా గురుభక్తిని సాహిత్యతృష్ణను నా శిష్యులలో కలిగించగలిగాను. ఇదంతా నా గొప్పతనం కాదు; మా గురుత్రయంవారి ఆశీర్వచనబలం మాత్రమే!

నాకు మా గురుదేవులయెడల ఎంతటి భక్తిప్రపత్తులు ఉన్నాయో, నా యెడల అంతే భక్తిప్రపత్తులు కలిగిన శిష్యశిఖామణులు నాకు లభించడం నా పూర్వజన్మ సుకృతఫలంగా, నా ఇష్టదైవమైన శ్రీకృష్ణపరమాత్మ కృపాకటాక్షవీక్షణప్రభావంగా భావిస్తున్నాను.

ఈ సందర్భంగా మాగురుదేవుల దివ్యస్మృతికి నా వినయపూర్వక నమస్సుమాంజలులు...! నా ప్రియశిష్యులకు వాత్సల్యపూర్వక అనంతమైన ఆశీస్సులు! వీరందిరికీ పరమేశ్వరుడు ఎల్లవేళలా ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని ప్రసాదించుగాక!

బెంగుళూరు

13.07.2022 **తంగిరాల వెంకట సుబ్బారావు**

బుధవారం, గురుపూర్ణిమ

## కృతజ్ఞతలు... ఆశీస్సులు...

ఈ గ్రంథముద్రణకు నేను సుమారు రూ. 2,00,000/–లు (రెండు లక్షల రూపాయలు) ఖర్చుచేశాను. ఎంతో గురుభక్తితో నాకు ఘనంగా సన్మానం చేసిన – శిష్యులమీది వాత్సల్యంతో ఇంత ధనం ఖర్చు చేశాను. ఈ పుస్తకంలో రంగులఫోటోలు 112 పేజీలున్నాయి. వీటి ముద్రణకే నాకు రూ. 70,000.00 ఖర్చుఅయింది. ఈ పుస్తకాన్ని ముద్రించడంలో నా మిత్రులు, నా ప్రియశిష్యులు కొంత ధనసహాయం చేశారు. ముఖ్యంగా నా ప్రియమిత్రులు కీ.శే. చిలకల వెంకటసుబ్బారెడ్డిగారి స్మారకంగా వారి ధర్మపత్ని శ్రీమతి చిలకల పార్వతమ్మగారు, వారి కొడుకులు కూతుళ్లు – అంతా కలిసి నాకు భూరివిరాళాన్ని (రూ. 51,000/–) ఇచ్చారు. వీరికి నా ప్రత్యేకమైన కృతజ్ఞతలు – ఆశీస్సులు. నంద్యాలలోని మిత్రులు శ్రీ వడ్డె బాల నరసింహుడుగారు వారికి ఒక చిన్నపుస్తకం వ్రాసియిచ్చినందుకు నాకు రూ. 20,000/– ఇచ్చారు. ఆ సొమ్మును కూడా ఈ గ్రంథముద్రణకు వెచ్చించాను. రూ. 10,000/– చొ॥న ఇచ్చిన శిష్యులు ముగ్గురు; రూ. 5,000/– చొ॥న ఇచ్చిన శిష్యులు 15 మంది ఉన్నారు. (ఎనిమిదిమంది వాగ్దానం చేశారు కాని ఇంకా ఇవ్వలేదు.) అందరికీ నా కృతజ్ఞతలు–ఆశీస్సులు!

**– తంగిరాల వెంకట సుబ్బారావు**

# గ్రంథముద్రణ దాతలు

ఈ గ్రంథముద్రణకు ఉదారంగా ధనసహాయం చేసిన ఈ క్రింది మిత్రులకు, శిష్యులకు నా ఆశీస్సులు!

1. ప్రియమిత్రులు కీ.శే. చిలకల వెంకట సుబ్బారెడ్డిగారి స్మారకంగా వారి ధర్మపత్ని, పుత్రులు, పుత్రికలు –
   (1) శ్రీమతి చిలకల పార్వతమ్మగారు (అమెరికా)
   (2) శ్రీ చిలకల సుదర్శనరెడ్డి (అమెరికా)
   (3) శ్రీమతి డా॥ శ్యామలారెడ్డి (జమైకా)
   (4) శ్రీ చిలకల శ్రీకాంతరెడ్డి (అమెరికా)
   (5) శ్రీమతి శకుంతలారెడ్డి (ఆస్ట్రేలియా)
   (6) శ్రీ చిలకల నాగార్జునరెడ్డి (అమెరికా)
   రూ.51,000–00
2. శ్రీ వడ్డె బాలనరసింహుడు, నంద్యాల – రూ.20,000–00
3. కీ.శే. భళ్లమూడి ప్రభాకరారవుగారు వాడపల్లి, (పశ్చిమగోదావరిజిల్లా) (మా బావమరిది) రూ.10,000–00
4. ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి (బెంగుళూరు) రూ.10,000–00
5. డా॥ పి.యు.బి. శర్మ – (డా॥ పోతుకూచి ఉమాభట్టీశ్వరశర్మ) హైదరాబాద్ రూ.10,000–00
6. డా॥ ఇ. నాగరాజు (మడకశిర) రూ.10,000–00
7. డా॥ దివాకర్ల రాజేశ్వరి (అమెరికా) రూ.10,000–00
8. శ్రీమతి తంగిరాల సీతామహాలక్ష్మి (బెంగుళూరు) రూ.10,000–00
9. ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతి (బెంగుళూరు) రూ. 5,000–00
10. డా॥ వి. నారాయణప్ప (ఢిల్లీ విశ్వవిద్యాలయం) రూ. 5,000–00
11. డా॥ ఎం. రుక్మాంగదనాయుడు (బెంగుళూరు) రూ. 5,000–00
12. శ్రీ వి. నారాయణరెడ్డి (బెంగుళూరు) రూ. 5,000–00
13. శ్రీమతి అంబికా అనంత్ (బెంగుళూరు) రూ. 5,000–00
14. డా॥ ఇప్పగుంట మాధవరావు, (కందుకూరు ప్రకాశంజిల్లా) రూ. 5,000–00
15. డా॥ ఎన్. భీమన్న (తిరుపతి) రూ. 5,000–00

| | | |
|---|---|---|
| 16. | ఆచార్య జి.యస్. మోహన్ (బెంగుళూరు) | రూ. 5,000-00 |
| 17. | డా॥ తోట వెంకటస్వామి (కుప్పం) | రూ. 5,000-00 |
| 18. | డా॥ ఎన్. ఆర్. సదాశివరెడ్డి (అనంతపురం) | రూ.5,000-00 |
| 19. | శ్రీ ఎ. చిట్టిబాబు (పాకాల) | రూ.5,000-00 |
| 20. | శ్రీ పి. లక్ష్మీనారాయణ (గుంతకల్లు) | రూ.5,000-00 |
| 21. | శ్రీ ఎం. రవిశేఖర్ (హిందూపురం) | రూ.5,000-00 |
| 22. | ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి (బెంగుళూరు) | రూ.5,000-00 |
| 23. | చి॥ తంగిరాల వెంకట నాగ వైజయంతి (బెంగుళూరు) | రూ.5,000-00 |
| 24. | శ్రీమతి మారుతి శ్రీలత (బెంగుళూరు) | రూ.5,000-00 |

**విరాళం ఇస్తామని వాగ్దానం చేసినవారు:-**

1. ఆచార్య ఎం. రామనాథంనాయుడు (మైసూరు)
2. శ్రీ ఎ.గురుమూర్తి (బెంగుళూరు)
3. శ్రీమతి ఉషా (బెంగుళూరు)
4. శ్రీ యస్. జగన్నాథేశ్వర
5. శ్రీమతి కె. మంజులమ్మ (హిందూపురం)
6. శ్రీ హెచ్. కృష్ణమూర్తి (మడకశిర)
7. డా॥ డి.కె. ప్రభాకర్ (బెంగుళూరు)
8. శ్రీ జి. చిత్తనగిరి (హిందూపురం)

దాతలైన కొందరు శిష్యులను సతీసమేతంగా ఉన్న ఫోటోలను పంపమని అడిగాను. కొందరు పంపారు. ఈ దంపతులందరూ నాకు చూడముచ్చటగా ఉన్నారు. వీరిలో డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డిపెళ్లికి, ప్రొ॥ ఎం. రామనాథంనాయుడి పెళ్ళికి నేను వెళ్ళాను. అందరికీ నా అనంతమైన ఆశీస్సులు! **- తంగిరాల**

**ఉ॥ కమ్మని పద్యముల్ విని ఫకాలున సుబ్బన నవ్వేనేని, కుం**
**దమ్ములు విచ్చినట్టులు, సుధారసమొల్కినయట్లు, చంద్రబిం**
**బమ్మది చెక్కలైనటులు, పాలసముద్రము పొంగినట్లు, ము**
**త్యమ్ములు ముక్కలై చెదరినట్టులు తోఁచును చూచువారికిన్**

- కీ.శే. దుగ్గిరాల రామారావుగారు
("మా సుబ్బన్న బావ", సుమనోభిరామమునుండి)

# విషయసూచిక

## మూడవభాగం
## (చైతన్యకవిత – స్పందనలు – ఛలోక్తులు – కవితా! ఓ కవితా!)

**ఉ॥ వాసనలేని పువ్వు, బుధవర్గములేని పురంబు, నిత్యవి**
**శ్వాసములేని భార్య, గుణవంతుఁడుగాని కుమారుఁడున్, సద**
**భ్యాసములేని విద్య, పరిహాసప్రసంగములేని వాక్యమున్,**
**గ్రాసములేని కొల్వు, కొఱగానివి పెమ్మయ సింగధీమణీ!**

## “Are You a Poet?”

నేను 1969 డిసెంబరునెలలో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా చేరాను. 1970 ఏప్రిల్ నెలలో వార్షికపరీక్షలు వచ్చాయి. కొత్తగా వచ్చిన నాకు Invigilation work ఇచ్చారు. సెంట్రల్ కాలేజీలోని Mathematics Bockలో మేడమీద పరీక్షలు జరుగుతున్నాయి. నేను, నాతోపాటు Education Departmentకి చెందిన మరొక లెక్చరర్ Invigilation చేస్తున్నాం. ఏప్రిల్ నెల వసంతఋతువు కదా! చెట్లనిండా రంగురంగులపూలు! ఇంతలో పెద్దగాలితో కూడిన వాన పడింది. ఎదురుగా ఉన్న విధానసౌధవీథిలో చెట్లనుండి రకరకాల పూలు – ముఖ్యంగా పసుపుపచ్చనిపూలు రాలి, రోడ్డంతా పూలపరుపు పరిచినట్టుగా అయిపోయింది. నేను ఎంతో ఆశ్చర్యంతో కిటికీలోంచి రోడ్డువైపు చూస్తున్నాను. ఇటువంటి దృశ్యం నేను తిరుపతిలో ఎప్పుడూ చూడలేదు. Education Department లెక్చరర్ నా దగ్గరకు వచ్చి “Are you a poet?” అని అడిగాడు. నేను “Yes ofcourse!” అన్నాను. ప్రముఖ అభ్యుదయకవి ఆవంత్స సోమసుందర్‌గారు ఒకప్పుడు “భారతి”లో వ్రాసిన “రంగులకెరటాల్లో బెంగుళూరు” అనే కవిత జ్ఞాపకం వచ్చింది. “నాకు బెంగుళూరులో ఉద్యోగం వచ్చింది!” అని చెప్పగానే సోమసుందర్‌గారు “నిన్ను చూస్తే నాకు అసూయగా ఉంది!” అన్నారు. (అందమైన నగరంలో నాకు ఉద్యోగం వచ్చిందని ఆయన వ్యాఖ్యకు భావం.) ఆయనకు ఒకే ఒక్క కూతురు. పేరు “కల్యాణి”. పెండ్లి చేశాక ఆమె భర్తకు బెంగుళూరులోనే ఉద్యోగం వచ్చింది. ఆమెను చూడటానికి ఆయన తరచుగా బెంగుళూరు వస్తూవుండేవారు. మా “శ్రీరస” కార్యక్రమాల్లో పాల్గొనేవారు. వారి అమ్మాయి, అల్లుడుకూడా నాకు సుపరిచితులు.

బెంగుళూరు విశ్వవిద్యాలయం 1973లో సెంట్రల్ కాలేజీనుండి మైసూరురోడ్డులో ఉన్న నూతనప్రాంగణం ‘‘జ్ఞానభారతి’’కి మారింది. అక్కడ కార్యాలయసౌధం (Adminstrative Block)లో మొదటి అంతస్తుకి బయటనుండి వెడల్పుగా పెద్దపెద్ద మెట్లున్నాయి. ఆ మెట్లకు రెండువైపులా రెండు చెట్లున్నాయి. అవి శిశిరఋతువులో ఆకులన్నీ రాల్చేస్తాయి. వసంతఋతువు రాగానే (మార్చి–ఏప్రిల్ మాసాలలో) ఆకులు చిగురించవు. కేవలం పసుపుపచ్చని పూలు మాత్రమే పూస్తాయి. చెట్టునిండా పూలే! ఆకులు ఉండవు. చూడటానికి ఎంతో మనోహరంగా ఉంటాయి. ఇటువంటి చెట్లు బెంగుళూరులో చాలాచోట్ల ఉన్నాయి. ఈ చెట్టు యొక్క Botanical name: TABEBUIA AUREA (“తబెబియా అరియా”). దీనిలాగా చెట్టంతా ఆకులు లేకుండా, కేవలం ఊదారంగు (violet colour) పూలు పూచే చెట్లు, ఎఱ్ఱటి పూలుపూచే చెట్లు కూడా బెంగుళూరునిండా ఉన్నాయి. వీటిలో ఎఱ్ఱపూల చెట్టును “Forest Flame” అంటారు. దీనిని శేషేంద్ర మహాకవి తన కవితల్లో “వనజ్వాల” అన్నారు. కర్ణాటకరాష్ట్రంలో బెంగుళూరు, మైసూరు నగరాలు “పూలతోటల నగరాలు” (Garden Cities)! ■

**గమనిక:** ఈ "గురువందనం-2022" పుస్తకంలో అనుబంధం-6: కీ.శే. సకలా నరసింహులుశ్రేష్ఠిగారికి శ్రద్ధాంజలి. దానిలో 440వ పుటలో ఈ క్రింది **"చిన్న సవరణ"**ను చేర్చుకొని చదువుకోవలసినదిగా పాఠకులకు మనవి **- తంగిరాల**



# ఒక చిన్న సవరణ

శ్రీ సకలా నరసింహులుగారి తండ్రి శ్రీ సకలా సంజీవయ్యగారికి రెండు వివాహాలు జరిగాయి. మొదటిభార్యపేరు శ్రీమతి రుక్మిణమ్మగారు. ఈమెకు పదిమంది సంతానం. కాని వీరిలో ఆరుమంది బాల్యంలోనే చనిపోయారు; ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు మాత్రం బ్రతికి బట్టకట్టారు. వారి పేర్లు: శ్రీ నారాయణ మూర్తిగారు, శ్రీ కృష్ణమూర్తిగారు, శ్రీమతి లక్ష్మీదేవమ్మగారు, శ్రీమతి విశాలాక్షమ్మగారు. నరసింహులుగారు వీరిని సొంత అన్నలు, అక్కలుగానే భావించి, వారిని ఎంతో గౌరవంతోను, భక్తితోను ఆదరించేవారు. ఆ అన్నయ్యలకు, అక్కయ్యలకు వారి సంతానానికి ఎన్నో రకాలుగా సహాయంచేస్తూ ఉండేవారు. అంత ఉదార స్వభావులు, నిష్కపటి, బంధుప్రీతి కలవారు శ్రీ సకలావారు. వీరి అన్నలలో శ్రీ నారాయణమూర్తిగారు బెంగుళూరు వచ్చి స్థిరపడ్డారు. శ్రీ సకలా కృష్ణమూర్తిగారు మాత్రం స్వస్థలమైన హిందూపురంలోనే ఉండిపోయారు.



దిగుమర్తివారు - విశ్వనాథవారు - బి.ఏ. విద్యార్థిగా తంగిరాల
(భీమవరం కళాశాల, 05-02-1956)



గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు
(1926-1981)



**గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు**
**(1926–1981)**



"నాల్గుపయోధులో యనఁగ, నాలుగు దిక్కరులో యనంగ"

నా నలుగురు గురువులు: (ఎడమనుండి) దిగుమర్తి-తిమ్మావజ్ఝుల-పింగళి-నందూరి

# 1. "దైవం మానుషరూపేణ" – గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు

**(1926–1981)**



**శా. "చిమ్మ చీఁకటిఁ జిక్కియున్న నను నాశీశ్శారదజ్యోత్స్నలో**
**నిమ్మా చోటుకుఁ జేర్చి, బాధ్యతగ నన్నీపీఠమెక్కించి, పా**
**ల్గుమ్మల్ పొంగు నదృష్టమిచ్చిన బుధున్ 'కోదండరామా'ఖ్యు,మా**
**తిమ్మావజ్ఝుల సద్గురుం దలఁతు భక్తిన్ భుక్తిఁగొన్వేళలన్!"**

నాకు దైవం ప్రత్యక్షం కాలేదు. కాని గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి రూపంలో మాత్రం నాకు దేవుడు ప్రత్యక్షమయ్యాడని గట్టిగా చెప్పగలను. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో నేను తెలుగు ఉపన్యాకునిగా చేరి స్థిరపడటానికి శ్రీవారే ముఖ్యకారకులు. వీరు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రియశిష్యులు. పరిశోధనలో గురువుతో సమానమైన అంతేవాసులు!

నేను 1961 జూన్–జూలై మాసాలలో తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ.లో చేరాను. అప్పుడు శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారు మా శాఖకు అధ్యక్షులుగా ఉండేవారు. కొన్ని నెలల తరువాత, మద్రాసులోని సర్ త్యాగరాయ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్న శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు మా శాఖకు రీడరుగా నియమితులై వస్తున్నారని తెలిసింది. అంతకు ముందే నేను 'భారతి' మాసపత్రికలో వారి వ్యాసాలను చదువుతూ ఉండేవాణ్ణి, ఆ పరోక్ష పరిచయాన్ని పురస్కరించుకొని వారికి ఒక కార్డు వ్రాశాను. నన్ను ఆశీర్వదిస్తూ వెంటనే ప్రత్యుత్తరమిచ్చారు. కోదండరామయ్యగారు తిరుపతి ఓరియంటల్ కళాశాలలో చదువుతున్నప్పుడు చెన్నారెడ్డిగారి శిష్యులట! "నన్ను

కాదని నా శిష్యుణ్ణి నా శాఖలో ఎలా రీడరుగా నియమిస్తారు?" అని చెన్నారెడ్డిగారు సిండికేట్ సభ్యుల దగ్గర పెద్ద గొడవపెట్టారు. అప్పుడు కోదండరామయ్యగారికి నాలుగు ఇంక్రిమెంట్లు అధికంగా ఇచ్చి, లెక్చరర్‌గా ఆహ్వానించారు. ఆయన వచ్చి చేరారు. అంతకు ముందే తెలుగుశాఖలో కోరాడ మహదేవశాస్త్రిగారు, జి.యన్.రెడ్డిగారు, పంగనామల బాలకృష్ణమూర్తిగారు ఉపన్యాసకులుగా ఉన్నారు. 1961 డిసెంబరునాటికి పింగళి లక్ష్మీకాంతంగారు ప్రొఫెసర్‌గాను, డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు రీడరుగాను నియమితులయ్యారు. అప్పుడు తెలుగుశాఖ సర్వసమగ్రంగా కళకళలాడుతూ కనబడింది!

కోదండరామయ్యగారు "పుదూరు ద్రావిడ" బ్రాహ్మణులు. "పుదూరు" అనే గ్రామం నెల్లూరుజిల్లాలో ఉంది. ప్రముఖ పండితులు వేదం వెంకటరాయశాస్త్రిగారు, వావిళ్ళ రామస్వామిశాస్త్రులుగారు మొదలైన వారంతా ఈ శాఖవారే! గోదావరిజిల్లాలో "ఆరామ ద్రావిడులు" – "పేరూరు ద్రావిడులు" ఉన్నారు. విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో ఉన్న ద్రావిడులను "దివి ద్రావిడులు" అనీ, "తూర్పు ద్రావిడులు" అనీ పిలుస్తారు. వీరంతా కొన్ని వందల సంవత్సరాల క్రిందట (తూర్పు చాళుక్యులకాలంలో కాబోలు) ద్రావిడదేశంనుండి ఆంధ్రప్రాంతానికి వచ్చి స్థిరపడిన గొప్ప పండితవంశములవారు, వేదశాస్త్ర పారంగతులు. పుదూరు ద్రావిడులు ఇప్పటికీ ఇళ్ళల్లో శిథిలమైన తమిళం మాట్లాడుతూ ఉంటారు.

### జననం: విద్యాభ్యాసం

కోదండరామయ్యగారిది నెల్లూరుజిల్లా. కాని వీరి నాన్నగారు పౌరోహిత్యం చేస్తూ తిరుపతిలో స్థిరపడ్డారు. కాబట్టి కోదండరామయ్యగారి విద్యాభ్యాసం అంతా తిరుపతిలోనే జరిగింది. కో.రా.గారు చిత్తూరుజిల్లాలోని "రామకుప్పం" గ్రామానికి సమీపంలో ఉన్న "గునపూడి పాళెం"లో 1926 ఫిబ్రవరి 26వ తేదీని జన్మించారు. వీరి తల్లిదండ్రులు: కామాక్షమ్మ–శివరామయ్య. కో.రా.గారు తిరుపతిలోని తిరుమల తిరుపతి దేవస్థానం హైస్కూలులో 1941లో ఎస్.ఎస్.ఎల్.సి.లో సర్వప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. తరువాత తిరుపతి శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులుగా చేరి, 1946లో విద్వాన్ పరీక్షలో ప్రథమశ్రేణిలో సర్వప్రథములుగా నిలిచారు. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారంలో

పండితుడుగా తమ ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించారు. ఉద్యోగం చేస్తూనే మద్రాసు విశ్వవిద్యాలయంలో బి.ఓ.యల్. (1954), ఎం.ఏ. (1961) పరీక్షలలో ప్రథమశ్రేణిలో సర్వప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. 1968లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంనుండి పిహెచ్.డి. డిగ్రీని పొందారు. "దేశి కవిత్వోద్యమము – పాల్కురికి సోమనాథుడు" అనేది వీరి పరిశోధనాంశం. పిమ్మట 1974లో మదురై విశ్వవిద్యాలయంనుండి భాషాశాస్త్రంలో సర్టిఫికెట్ కోర్సు చేశారు. వీరి విద్యాభ్యాసంలో అన్ని పరీక్షలలోనూ, వీరిది ఫస్ట్‌క్లాస్ అండ్ ఫస్ట్‌ర్యాంక్. అన్నింటిలోను స్వర్ణపతకగ్రహీతలు! అంతటి ప్రతిభాశాలి కోదండరామయ్యగారు. వీరు సంస్కృతాంధ్రాల్లో గొప్ప పండితుడు. అంతేకాదు, ఆంగ్లభాషమీద కూడా వీరికి మంచి పట్టుఉండేది.

**ఉద్యోగజీవితం**

కోదండరామయ్యగారు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారంలో 1946–47 మధ్య పనిచేశారు. తరువాత మద్రాసు త్యాగరాయ కళాశాలలో పండితుడుగా, ఉపన్యాసకుడుగా, తెలుగుశాఖాధ్యక్షుడుగా 1947 నుండి 1961 వరకు ఉద్యోగం చేసి, ఎంతో పేరుగడించారు. పిమ్మట తిరుపతికి వచ్చి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1961 నుండి 1971 వరకు తెలుగుశాఖలో ఉపన్యాసకుడుగా, రీడరుగా పనిచేసి విద్యార్థుల ఆదరాభిమానాలను చూరగొన్నారు. 1972లో తిరుపతినుండి పదోన్నతిమీద మదురై కామరాజు విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా, శాఖాధ్యక్షులుగా పనిచేశారు. 1981లో అకాలమరణం పొందేవరకూ అక్కడే ఉన్నారు. మదురైలో ఎంతో గొప్ప పరిశోధన చేశారు. ఎన్నో గ్రంథాలు రచించారు.

**సారస్వతసేవ**

కోదండరామయ్యగారు యు.జి.సి., ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, తెలుగు అకాడెమీ మొదలైన సంస్థలలో కార్యనిర్వాహక వర్గాలలో సభ్యుడుగా ఉండేవారు. అనేక విశ్వవిద్యాలయాల స్టడీబోర్డులలోను, పరీక్షాసంఘంలోను సభ్యుడుగా పనిచేశారు. మద్రాసులోని వావిళ్ళసంస్థ, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమి, కేంద్రసాహిత్య అకాడెమీ, తిరుమల–తిరుపతి దేవస్థానం, మదురై కామరాజు

విశ్వవిద్యాలయం, స్వీయగ్రంథమాల అయిన "సారస్వత కుటీరము" - అనే సంస్థలద్వారా నిరంతరాయంగా కోదండరామయ్యగారు నిర్వహించిన సారస్వతసేవ, వాఙ్మయారాధన మిక్కిలి ప్రశంసనీయములు. గ్రంథపరిష్కరణం, భారతీయ సాహిత్యాల తులనాత్మక పరిశీలనం, సాహిత్యవిమర్శ, పదసాహిత్యం, వ్యాకరణచ్ఛందోలంకారాలు - వీరి అభిమాన విషయాలు. 1952-1954 మధ్య తిరుమల రామచంద్రగారితో కలిసి "పరిశోధన" అనే పేరుతో ఒక అత్యుత్తమమైన సంశోధనపత్రికను నిర్వహించారు. వివిధ పత్రికలలో కోదండరామయ్యగారు ప్రచురించిన వ్యాసాలు, రేడియోలో చేసిన ప్రసంగాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. ఇవన్నీ గ్రంథరూపాన్ని ధరించలేదు.

**కోదండరామయ్యగారి రచనలు**

**స్వతంత్రములు:** "పాలవెల్లి" (సాహిత్యవ్యాసాలు); కళాపూర్ణోదయ ప్రశంస (1960); భువన విజయము (1961); తెనుగు మఱుగులు (1964); కవిరాజ శిఖామణి (1966); తమిళ సాహిత్య చరిత్రము (1981) మొ॥వి.

**అనువాదములు:** స్వప్నవాసవదత్తము (1958)

తొల్కాప్పియము - పొరళదిగారము (1978) మొ॥వి

**పరిష్కరించిన గ్రంథములు:** అనుభవ సారము (1955); కేయూరబాహు చరిత్రము (1961); శ్రీకాళహస్తి మాహాత్మ్యము (1963); మనుచరిత్రము (1966); మూర్తిత్రయోపాఖ్యానము మొ॥వి.

**కోదండరామయ్యగారి సిద్ధాంతగ్రంథం:** దీనిని "దేశికవిత్వోద్యమ స్థాపకుడు పాల్కురికి సోమనాథుడు'' అనే పేరుతో "శ్రీకోదండరామ మిత్రమండలి" - తిరుపతివారు 2001లో రెండు సంపుటాలుగా ముద్రించి ప్రచురించారు. దీని ముద్రణలో మిక్కిలిగా సహకరించినవారు కో.రా.గారి ప్రియశిష్యులు డా॥ ముదివేడు ప్రభాకరరావుగారు. వీరికి కో.రా.గారి కుటుంబ సభ్యులు, శిష్యకోటి అంతా కృతజ్ఞులుగా ఉన్నారు.

వివిధ పత్రికలలో - ముఖ్యంగా ''భారతి''లోను, ఆంధ్రప్రభ సారస్వతానుబంధంలోను కో.రా.గారు ఎన్నో వ్యాసాలు వ్రాశారు. అవన్నీ పుస్తకరూపంలో రాలేదు.

**శిష్యవాత్సల్యం – నా అనుభవాలు**

ఈ వ్యాస ప్రారంభంలోనే మనవి చేసుకున్నాను – కో.రా.గారు మానవరూపంలో నాకు ప్రత్యక్షమైన దేవుడు! అని. వారు నాకు చేసినమేలు ఇంత అంత అని మాటలలో చెప్పలేను. అయినా ప్రయత్నిస్తాను. కోదండరామయ్యగారు మాకు ఎం.ఏ. ప్రీవియస్‌లో నన్నెచోడుని కుమారసంభవంలోని ప్రథమ ద్వితీయ ఆశ్వాసాలు పాఠ్యాంశంగా చెప్పారు. ఫైనల్‌లో నన్నెచోడుని కావ్యమంతా – మొత్తం 12 ఆశ్వాసాలూ స్పెషల్‌స్టడీగా ఎంతో హృద్యంగా మనస్సుకు హత్తుకొనేలా చెప్పారు. పద్యంకూడా కావ్యధోరణిలో చక్కగా చదివేవారు. వారి దగ్గర ఒక విశిష్టమైన కావ్యాన్ని (నిజానికి అది కావ్యంకాదు, మన తొలిప్రబంధం) సంపూర్ణంగా చదవడంవల్ల మాకు తెలుగుసాహిత్యంలో మంచి పునాది ఏర్పడింది.

1963లో ఎం.ఏ. పూర్తికాగానే రీసెర్చి చేయాలనే కోరికను కో.రా.గారి దగ్గర వెల్లడించాను. వారు ఎంతగానో ఆలోచించి "పల్నాటి వీరచరిత్ర"ను గురించి పరిశోధన చేయుమన్నారు. దీనికి కారణం, 1961లోనే ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు "పల్నాటి వీరచరిత్ర"ను పరిష్కరించడం, విశాలాంధ్రవారు దానిని ప్రచురించడం జరిగింది. పింగళివారే నాకు మార్గదర్శకులుగా ఉండాలి కాబట్టి, ఈ విషయం అయితే వారు ఉత్సాహంగా అంగీకరిస్తారని కోదండ రామయ్యగారి ఆలోచన. కాని పింగళివారు నన్ను ఒక్క పల్నాటి వీరకథలకే పరిమితం కాకుండా, మొత్తం వీరగాథలన్నీ తీసుకోమని అన్నారు. అదీ ఒకందుకు మేలే అయింది. నా పరిశోధనలో కాటమరాజుకు సంబంధించిన ఎన్నో నూతన కథలను (తాటాకు పుస్తకాలలో ఉన్నవాటిని) కనుక్కోగలిగాను; వాటిని వెలుగులోకి తెచ్చాను. కోదండరామయ్యగారు సాంప్రదాయికసాహిత్య పండితులైనా, దేశిసాహిత్యంమీదా, జానపదసాహిత్యంమీదా వారికి ఎంతో అభిమానం ఉండేది. దీనికి కారణం, వారి గురువుగారైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. శాస్త్రిగారు మద్రాసు వ్రాతప్రతుల గ్రంథాలయంలో ఉన్న కాటమరాజుకథల్ని పరిష్కరించారు. కోదండ రామయ్యగారు ఆ కథలను గురించి "ఆంధ్రపత్రిక ఉగాది ప్రత్యేక సంచిక"లో సుదీర్ఘమైన, మంచి పరిశోధనాత్మకమైన వ్యాసం వ్రాశారు. ఆ వ్యాసమే, కాటమరాజుకథల విషయంలో నాకు మార్గదర్శక మయింది. "ఊర్మిళాదేవి నిద్ర" – "లక్ష్మణదేవర నవ్వు" అనే స్త్రీలపాటల్నిగురించి కూడా

కోదండరామయ్యగారు ఇంగ్లీషులో మంచివ్యాసాలు రచించారు. జానపద సాహిత్యంలో (కాటమరాజు కథలలో) వచ్చే "అగుమంచి" - "ఆవులమేపు"- "పొట్లాట" - "జగడం" వంటి అచ్చమైన తెలుగుపేర్లను తలచుకొని, పులకించి పోయేవారు గురువుగారు!

1963 నుండి 1968 వరకు నేను పరిశోధన చేస్తున్న సమయంలోనే, కో.రా.గారు కూడా "ఆంధ్రసాహిత్యములో దేశికవిత్వోద్యమము - పాల్కురికి సోమనాథుని పాత్ర" అనే అంశాన్ని గురించి పరిశోధన చేశారు. నా విషయంలో జరిగినట్లుగానే, వారి విషయంలో కూడా ఇద్దరు మార్గదర్శకులున్నారు. 1963 నుండి 1965 వరకు పింగళివారు, 1965 నుండి 1967 వరకు జి.యన్.రెడ్డిగారు నిర్దేశకులుగా ఉన్నారు. కోదండరామయ్యగారు 1967లో తమ సిద్ధాంతగ్రంథం విశ్వవిద్యాలయానికి సమర్పించారు. 1968లో డిగ్రీ వచ్చింది. గురుశిష్యులమైన మేమిద్దరం ఒకే సమయంలో పరిశోధనలు చేశాం. రెండు పరిశోధన విషయాలకీ కొంత దగ్గరి సంబంధం ఉంది. ఒకటి "దేశి సాహిత్యం" - మరొకటి "జానపద సాహిత్యం".

"వీరగాథలు" లేక "జానపద కథాగేయాలు" (Ballads or Narrative Folk Songs) - వీటిని గురించిన విమర్శ ఆంగ్లంలో ఉంది. ఆ విమర్శలో కొన్ని పారిభాషిక పదాలు వస్తాయి. వాటిని తెలుగులోకి అనువదించి ఎలా చెప్పాలి? అనే విషయంలో కో.రా.గారు ఎంతో ఆలోచించి, చక్కటి అనువాదాలు చేసి, నాకు సహాయం చేశారు. ఉదాహరణానికి:-

"Ballad Commonplaces" = "వీరగాథల వారానువర్తనములు"

"Incremental Repetitions" = "అభివర్ధిత పునరుక్తులు" లేక "పరివర్ధిత పునరుక్తులు"

"Minstrels" = "గాథాకారులు"; "Informants" = "విషయ నివేదకులు" మొదలైనవి. "ఇటువంటి పనులన్నీ కో.రా.గారు చేయడమేమిటి? నీ గైడ్స్ ఉన్నారు కదా! వారు చేయవచ్చుకదా?" అని ఎవరైనా ప్రశ్నించవచ్చును. నాగైడ్స్ గురించి రెండు మాటలు చెప్పాలి -

1963 నుండి 1965 వరకు రెండేండ్లు గైడుగా ఉన్న పింగళివారు వృద్ధాప్యం వల్ల నన్ను ఏమీ గైడ్ చేయలేకపోయారు. వారు 68 సం.ల వయస్సులో (1961

డిసెంబరులో) మాకు ప్రొఫెసర్‌గా వచ్చారు. 70-72 సం.ల వయస్సులో వారు నాకు మార్గదర్శకులుగా ఉన్నారు. తెలుగుశాఖను అభివృద్ధిచేయండని, తాము దానికి సహాయం చేస్తామని చెపుతూ యు.జి.సి. నుండి ఎన్నో లేఖలు వచ్చేవి. శాఖాధిపతియైన పింగళివారు ఆ లేఖలన్నీ చదవనైనా చదవకుండా, చించి చెత్తబుట్టలో పారేసేవారు. పైగా "కోదండరామయ్యా! నా టేబిల్ అంతా క్లీన్! అన్ని పేపర్సూ ఎటెండ్ అయ్యాను!" అనేవారు. నా ఉద్దేశంలో 60 సం.లు నిండిన వ్యక్తిని, అతడు ఎంత గొప్పవాడైనా సరే, మళ్ళీ ఉద్యోగంలో నియమించకూడదు. షష్టిపూర్తి అయిన వారిలో ఉత్సాహం చైతన్యం శూన్యం! ఇప్పుడు మళ్ళీ ముసలివాళ్ళను ఉద్యోగాల్లో కొనసాగించడం ప్రారంభమయింది. రాష్ట్రీయ విశ్వవిద్యాలయాల్లో 62 సం.లు, కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో 65 సం.లు. పదవీవిరమణ వయస్సుగా నిర్ణయించారు. ఇక వీరు పింగళివారిలా పనిచేస్తారనడంలో ఏమీ సందేహం లేదు! ముసలివాళ్ళు 65 ఏళ్ళదాకా పనిచేస్తూ పోతే, ఇక యువకులకు ఉద్యోగాలెలావస్తాయి? నిరుద్యోగం పెరిగిపోవడానికి ఇదొక ముఖ్యకారణం! ఇక్కడ ఇంకో విషయాన్ని ప్రస్తావించాలి. 68 ఏండ్ల వయస్సులో పింగళివారు మాకు ప్రొఫెసర్‌గా వచ్చారని నేను గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారితో చెప్పినప్పుడు, ఆయన ఎంతో నిరుత్సాహంగా "ఈ వయస్సులో కూడా ఇంకా ఎలా పాఠాలు చెపుతున్నారయ్యా? నాకే విసుగొస్తోంది!" అన్నారు - 50 సం.లు కూడా నిండని దిగుమర్తివారు.

1965లో తెలుగు శాఖాధ్యక్షులుగా వచ్చిన ప్రొ॥ జి.ఎన్.రెడ్డిగారు చాలా చురుకుగా పనిచేసేవారు. ఆయన కాలంలో తెలుగుశాఖ మూడుపువ్వులు-ఆరు కాయలుగా ఎంతో అభివృద్ధి చెందింది. ఎన్నో పోస్టులు, ప్రాజెక్టులు శాఖకు రప్పించారు. ఆయన ఎప్పుడూ బిజీగా ఉండేవారు. ప్రయాణాలు చేస్తూ ఉండేవారు. అయినా నేను వ్రాసిన దంతా శ్రద్ధగా చూచేవారు. సలహాలిచ్చేవారు. ఆయన భాషాశాస్త్రజ్ఞుడు, అభ్యుదయవాది. సబ్జెక్టును తప్ప భాషను అంతగా పట్టించుకొనేవారు కాదు. నేను వ్రాసిన ప్రతిప్రకరణాన్ని ప్రతిఅక్షరాన్ని కోదండరామయ్యగారు అతిశ్రద్ధగా చూచేవారు. అక్షరదోషాలు సవరించేవారు. ఆంగ్ల పారిభాషిక పదాలకు అనువాదాలు చేసి యిచ్చేవారు. ఈ వడపోత అంతా అయిన తరువాతనే జి.యన్.రెడ్డిగారికి చూపించేవాడిని. ఆయన సబ్జెక్టు విషయంలో

మంచి సలహాలిచ్చేవారు. వాటిని పాటించి ముందుకు వెళ్ళేవాడిని! కాబట్టి నాకు అఫీషియల్‌గా పింగళివారు, జి.యన్.రెడ్డిగారు గైడ్స్ అయినా, అనఫీషియల్‌గా కో.రా.గారే నా గైడ్! (ఈ విషయం ఆ రోజుల్లో చెప్పడానికి వీలులేదు కాబట్టి ఇప్పుడు చెపుతున్నాను!)

నేను 1963-64 సం.ల మధ్య వీరగాథలకు సంబంధించిన విమర్శ చదివాను. 1964-66 మధ్య దేశమంతా తిరిగి విషయసేకరణ చేశాను. 1966-1967 మధ్య సిద్ధాంతవ్యాసం వ్రాశాను. 1968 జనవరినెలలో విశ్వవిద్యాలయానికి సమర్పించాను. 1969 ఫిబ్రవరినెలలో డిగ్రీవచ్చింది. (ఆ రోజుల్లో పిహెచ్.డి. డిగ్రీ రావడానికి కనీసం ఒక సంవత్సరకాలం పట్టేది. ఇప్పుడు రెండు మూడు నెలలు కాగానే, "రిపోర్టు ఎక్కడ? రిపోర్టు ఎక్కడ?" అంటూ కాళ్ళకింద నిప్పులు పోసేస్తున్నారు!)

ఆ రోజుల్లో డి.టి.పి. సౌకర్యంలేదు. తెలుగు టైపింగ్ ఉండేది. కాని అది మద్రాసులో మాత్రమే ఉండేది. తెలుగు విజ్ఞానసర్వస్వం ఆఫీసులో శ్రీరాయన్ అనే ఆయన ఈ తెలుగు టైపింగ్ చేసేవారు. పేజీకి ఒక రూపాయి ఛార్జి చేసేవారు. నాది బృహద్గ్రంథం! 1500 పేజీలు వచ్చింది వ్రాతలో. దీనినంతా టైపు చేయించాలంటే రూ.1500లు కావాలి. మద్రాసు వెళ్ళి రావడానికి ఖర్చులు. పైగా ఐదు కాపీలు చేయించాలి. వాటిని అందంగా బైండ్ చేయించాలి. నా థీసీస్సులో 100 పైగా ఫొటోలు ఉన్నాయి. వాటిని వేరుగా బైండ్ చేయించాలి. ఆ రోజుల్లో రూ.1500 లు అంటే చాలా ఎక్కువ. (1964-67 మధ్య నాకు యు.జి.సి. ఫెలోషిప్ వచ్చింది. ఫెలోషిప్ ఎంతో తెలుసా? నెలకు 300 రూ.లు మాత్రమే. దాంతో హాయిగా నా సంసారం గడిచిపోయేది!) నేను సిద్ధాంతవ్యాసం వ్రాస్తూంటేనే, "1500 రూ.లు. ఎలాగరా దేవుడా సమకూర్చుకోవడం?" అని బెంగపడ్డాను. వ్రాయడం మానివేశాను. ఈ విషయం కో.రా.గారితో చెప్పాను. ఆయన వెంటనే ఏమన్నారో తెలుసా? "సుబ్బారావ్! నువ్వు ఏమీ ఆలోచించకు. థీసీస్ వ్రాయడం పూర్తిచెయ్యి. నీ దగ్గర డబ్బులు లేకపోతే, మా ఆవిడ నగలు తాకట్టుపెట్టి నీకు డబ్బుతెచ్చి యిస్తాను. భయపడకు!" అన్నారు. నేను ఆశ్చర్యపోయాను! అటువంటి గురువు ఎన్ని జన్మలకైనా మళ్ళీ లభిస్తాడా? అనిపించింది. ఈ విధంగా కోదండరామయ్యగారు నన్ను తన కన్నబిడ్డలా

ఆదరించారు; అభిమానించారు; అక్కున చేర్చుకున్నారు. వారి ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను నేను!

నా థీసిస్సులోని ప్రత్యక్షరమూ నిశితంగా చూచిన కో.రా.గారు నా కృషిని, నా రచనను మిక్కిలి మెచ్చుకొని , "ఇందులో నువ్వు 25 ప్రకరణాలు వ్రాశావు. నేనే నీకు ఎగ్జామినర్ని అయితే 'వీరగాథల ఛందస్సు' అనే ఒకే ఒక్క ప్రకరణానికే నీకు పిహెచ్.డి. డిగ్రీ యిచ్చివేసేవాణ్ణి!" అన్నారు. ('ఛందస్సు' గురించి వ్రాసిన ప్రకరణం నా థీసీస్సులో 20వ ప్రకరణం)

నా థీసీస్సు టైపు చేయించడానికి, గురుపత్ని నగలు తాకట్టుపెట్టే అవసరం లేకుండా, మిత్రులందరి దగ్గరా 200 రూ.ల చొప్పున అప్పు తీసుకున్నాను. ముందుగా కో.రా.గారే ఇచ్చారు. తరువాత శ్రీ మద్దూరి సుబ్బారెడ్డిగారు, శ్రీ ఎల్.బి.శంకరరావు, శ్రీ సానికొమ్ము అక్కిరెడ్డి, శ్రీ ప్రసాదరాయ కులపతిగారు, శ్రీ బొప్పన విశ్వేశ్వరరావుగారు – ఇత్యాదులంతా ఎంతో అభిమానంతో నాకు రెండేసి వందల రూపాయల చొప్పున అప్పు ఇచ్చారు. ఆ మిత్రుల అభిమానాన్ని తలచుకొంటే, ఈనాటికీ నా ఒడలు పులకరించిపోతుంది! (నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఉద్యోగంలో చేరాక, ఆయా మిత్రుల అప్పు తీర్చివేశాను.)

నేను 1969లో కో.రా.గారి ప్రోద్బలంమీద బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్ పోస్టుకి దరఖాస్తు చేశాను. నాకు ఇంటర్వ్యూ వచ్చింది. కాని వెళ్ళడానికి నాకు ఇష్టంలేదు. గురువుగారికీ, మా ఆవిడకీ నేను తొందరగా ఏదో ఒక ఉద్యోగంలో స్థిరపడాలని గట్టి కోరిక. "పిహెచ్.డి. చేసి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో కన్నడ విద్యార్థులకు అ,ఆలు నేర్పాలి"! అన్నాను. "అ,ఆ లు నేర్పితే ఏమిటి? నువ్వు ఒక యూనివర్శిటీలో లెక్చరర్వి. నీ గౌరవం నీకు ఉంటుంది! నీ జీతం నీకు వస్తుంది!" అని ప్రోత్సహించారు గురువుగారు. అయినా సరే నేను తిరుపతిలోనే నాకు ఉద్యోగం వస్తుందనే పెద్ద భ్రమలో ఉండిపోయాను. ఆ భ్రమను తొలగించి, నన్ను దగ్గరుండి బెంగుళూరు తీసికొని వెళ్ళారు కో.రా.గారు. వారికి తెలిసిన ఒక మిత్రుని యింటిలో బసచేశాము. (ఆ మిత్రుని పేరు ఎస్.టి. నారాయణమూర్తిగారు. వీరి స్వగ్రామం తిరుపతి. వీరు బెంగుళూరులో "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" ఆంగ్లదినపత్రికలో సబ్ ఎడిటర్‌గా ఉండేవారు. మంచి సాహిత్యప్రియులు. ఎంతో స్నేహపాత్రులు. తరువాతి కాలంలో ఈ నారాయణమూర్తిగారు, వీరి

భార్య కాంతమ్మగారు, నాకూ మా కుటుంబానికి ఆప్తమిత్రులయ్యారు.)

మర్నాడు ఉదయం నన్ను వాకింగ్‌కి తీసికొని వెళ్ళారు గురువుగారు. “విధానసౌధ” రోడ్డులో నడుస్తున్నాం. (కన్నడిగుల అసెంబ్లీ హాలుకి “విధానసౌధ” అని పేరు. అది చాలా అందంగా ఉంటుంది. దాని ఎదురుగా గోబివర్ణంలో ఆంగ్లేయుల కాలంనాటి హైకోర్టు, వెనుక “కబ్బన్ పార్కు” – అసెంబ్లీకి హైకోర్టుకి మధ్యలో డబల్ రోడ్డు – రోడ్డు మధ్యలో పూలమొక్కలు – అంతా అతిసుందర వాతావరణం!) “ఇదిగో చూడు సుబ్బారావ్! ఈ అందమైన రోడ్డులో మీ ఆవిడతో కలిసి షికారు వెళ్ళొచ్చు. దిక్కుమాలిన తిరుపతో! తిరుపతో! అంటావేమిటి? ఆ మాయదారి తిరుపతిలో ఏముంది నా మొహం!” అని మళ్లీ నన్ను ప్రోత్సహించారు గురువుగారు. ఆ రోజు మధ్యాహ్నం..ఇంటర్‌వ్యూకి తీసికొని వెళ్ళారు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు. ఆచార్య బిరుదురాజు రామరాజుగారు ఎక్స్‌పర్ట్సుగా వచ్చారు. ముందుగానే నా పరిస్థితిని గురించి వారికి చెప్పారు కో.రా.గారు. “మంచి పరిశోధకుడు, తెలివైనవాడు, పిల్లలుగలవాడు, ఇతనికి తప్పక సహాయం చేయాలి!” అని యిద్దరికీ గట్టిగా చెప్పారు. నేను ఇంటర్‌వ్యూ కూడా బాగా చేశాను. (నాకు అప్పటికి 34 ఏండ్ల వయస్సు; ఐదుగురు పిల్లలు!). కో.రా.గారి దయవల్ల నాకు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకుడుగా ఉద్యోగం వచ్చింది. నిత్యం దారిద్ర్యంతో బాధపడే నా జీవితానికి ఒక స్థిరత్వం వచ్చింది. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో, కన్నడశాఖలో రీడరుగా ఉన్న డా॥ ఎం. చిదానందమూర్తిగారిని నాకు పరిచయం చేసింది కూడా కో.రా.గారే! తరువాత కన్నడభాష నేర్చుకొని, కన్నడిగుల ఆదరాభిమానాలు పొంది, ఇక్కడ కీర్తిప్రతిష్ఠలు గడించాను. ఇదంతా గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి చలవే!

1978లో జరిగినా రీడరు పోస్టు ఇందర్‌వ్యూలో కూడా నన్ను గురించి గట్టిగా వాదించారు గురువుగారు! అప్పుడు కూడా, వారిదయవల్లనే రీడరు నయ్యాను. ఆ రోజు ఇంటర్‌వ్యూలో ఆచార్య బి. రామరాజుగారు, ఆచార్య తూమాటి దొణప్పగారు నా విషయంలో అడ్డం తిరిగారు! వీరిద్దరూ నన్ను కాదని శ్రీ రత్నాకరం శంకరనారాయణరాజుగారిని రీడరు చేద్దామని శాయశక్తులా

ప్రయత్నించారు. ఆయనకు 58 సం.లు నిండాయి. గవర్నమెంటు కళాశాలల్లో పనిచేసి రిటైరయ్యారు. ఆయనకు Ph.D. డిగ్రీ లేదు. M.A.డిగ్రీకూడా అప్పటికి నాలుగేళ్ల క్రిందటనే వచ్చింది. అయనా సరే, ఆ రాజుగారినే సమర్థించారు. రామరాజుగారు తన కులంవాడనీ, దొణప్పగారు తమ అనంతపురంజిల్లా వాడనీ శంకరనారాయణ రాజుగారికోసం గట్టిగా పట్టుపట్టారు. ఇంకో expert గా ఉన్న ప్రొ॥ జి.యన్. రెడ్డిగారు ఏమీ మాట్లాడకుండా బెల్లంకొట్టిన రాయిలా నిశ్శబ్దంగా ఉన్నారు. అప్పుడు ప్రొ॥ కోదండరామయ్యగారు లేచి నిలబడి వైస్ఛాన్సలరూ Selletion Committee అధ్యక్షులు అయిన శ్రీ T.R. జయరామన్, I.A.S. గారితో గట్టిగా వాదించారు, "సుబ్బారావు డిపార్టుమెంటులో ఉన్నవాడు. నాలుగేళ్లుగా డిపార్టుమెంటును నడిపిస్తున్నవాడు. Ph.D. డిగ్రీ ఉన్నవాడు. ఇప్పటికే ఒక Ph.D. విద్యార్థిని గైడ్ చేసినవాడు. Internal candidate ను వదిలేసి, బయట నుండి వచ్చిన, అందునా రిటైరయిన వ్యక్తిని, Ph.D. లేని వ్యక్తిని రీడర్‌గా ఎలా నియమిస్తారు?" అని అన్నారు. దానితో వి.సి.గారు నన్నే సమర్థించి, నన్ను రీడరుగా నియమించారు. నాకు ఇంత గొప్ప సహాయం చేసిన మహానుభావుడు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు! ఆయన దైవంకాక ఇంకెవరు! అయినా సరే, తమపట్టువీడకుండా రామరాజుగారు, దొణప్పగారు కలిసి, 58 ఏళ్లు నిండి రిటైరయిన శంకరనారాయణరాజుగారిని తెలుగు డిపార్టుమెంటులో లెక్చరర్‌గా నియమించి తమ పంతం నెగ్గించుకున్నారు. శంకరనారాయణరాజుగారు 1978 నుండి 1980 వరకు రెండేళ్లు పనిచేసి, తన జీవితంలో రెండవసారి రిటైరయ్యారు!

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా చేరిన తరవాత కూడా నా చూపు ఆంధ్రదేశాన్ని విడిచిపెట్టలేదు. హైదరాబాద్‌లో ఉద్యోగం వస్తే వెళ్ళిపోదామనుకున్నాను. అప్పుడు గురువుగారు నా ఉద్దేశం కనిపెట్టి: "చూడు! సుబ్బారావ్! నువ్వు హైదరాబాద్ వెళ్లొద్దు. అది మహాసముద్రం! అక్కడ పెద్ద పెద్ద తిమింగలాలు ఉన్నాయ్! అవి నిన్ను అమాంతంగా మింగివేస్తాయి! ఇక్కడే ఉండు. నీకు మంచి పేరుప్రఖ్యాతలు వస్తాయి!" అని ఆశీర్వదించారు. వారి ఆశీర్వచన ఫలితంగా ఇక్కడ నాకు మంచి గుర్తింపు వచ్చింది. 1980లో కొత్తగా

ఏర్పడిన గుల్బర్గా విశ్వవిద్యాలయానికి నన్ను మొట్టమొదటి Controller of Examinations గా నియమించారు కర్ణాటక రాష్ట్ర గవర్నరుగారు!

కో.రా.గారు 1961-70 మధ్య శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. 1970-72 మధ్య రీడరుగా ఉన్నారు. 1972-81 మధ్య మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గాను, హెడ్‌గాను వ్యవహరించారు. సర్వీసులో ఉండగానే 1981 మే 26వ తేదీని స్వర్గస్థులయ్యారు. అప్పటికి ఆయన వయస్సు 55 సం.లు మాత్రమే!

గురువుగారు తిరుపతిలో లెక్చరర్‌గా ఉన్నప్పుడే మదురై కామరాజ్ యూనివర్శిటీలో "రీడర్"గా ఆహ్వానం వచ్చింది. ఆయన వెళ్ళడానికి ఇష్టపడలేదు. "కొన్నాళ్ళు పోతే ఇక్కడే రీడరు అవుతాను. పిహెచ్.డి. ఉంది కదా!" అని ఊరుకున్నారు. మళ్ళీ కొన్నేళ్ళకు మదురైకి ప్రొఫెసర్‌గా రమ్మని పిలిచారు. అప్పుడు కూడా అక్కడికి వెళ్ళడానికి కో.రా. గారికి ఇష్టం లేదు. రెండు పర్యాయాలూ కూడా జి.యన్.రెడ్డిగారు ఆయనపై పరోక్షంగా కొంత ప్రెషర్ తీసికొని వచ్చారు. జి.యన్.రెడ్డిగారికి శ్రీ కేతు విశ్వనాథరెడ్డి ప్రియశిష్యుడు. నేను కోదండరామయ్యగారికి నమ్మినబంటును. విశ్వనాథరెడ్డి నాకు మంచి మిత్రుడు. జి.యన్.రెడ్డిగారు అతనిని నా దగ్గరకు పంపించి "ప్రమోషన్ వస్తుంది కదా! కో.రా.గారిని మదురైకి వెళ్ళమని చెప్పు!" అని చెప్పించారు. నేను గురువుగారితో ఈ విషయం చెప్పాను. "చూడు సుబ్బారావ్! 40 ఏళ్ళు దాటాక మనిషి కొత్త ఉద్యోగాలకోసం ఎక్కడికీ వెళ్ళకూడదు. ఉన్నచోటులోనే ఉండాలి. వెడితే సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకోవడమే అవుతుంది!" అన్నారు. నేను 1970లో తిరుపతి వదిలి వెళ్ళిన తరువాత ఏం జరిగిందో ఏమిటో, రెండేళ్లు గడవగానే (1972లో) గురువుగారు జన్మభూమి అయిన తిరుపతిని వదిలి, మదురై వెళ్ళారు. అక్కడ అనేక కష్టాలు పడ్డారు. ఇక్కడ కో.రా.గారిని బలవంతంగా మదురై పంపించడంలో ఉద్దేశమేమిటంటే, ఆయన వెళ్ళిపోతే ఒక పోస్టు ఖాళీ అవుతుంది. అందులో శ్రీ కేతు విశ్వనాథరెడ్డిని నియమించవచ్చు. ఇదీ రహస్యం! విశ్వవిద్యాలయాల్లో రాజకీయాలు కులాభిమానాలు ఇలా ఉంటాయి!

**మరికొన్ని ఆసక్తికర విషయాలు:-**

**1. గొప్ప ప్రతిభాశాలి:-** "దేవికవిత్వోద్యమం-పాల్కురికి సోమనాథుడు" అనే అంశాన్ని గురించి పరిశోధన చేస్తూ, కో.రా.గారు ఒక సంవత్సరం తర్వాత ప్రి-పిహెచ్.డి. పరీక్ష వ్రాశారు. ఆ సమాధాన పత్రాన్ని వారికి గైడుగా ఉన్న పింగళివారు దిద్దారు. కో.రా.గారు వ్రాసిన సమాధానాలు చూచి పింగళివారు ఆశ్చర్యపోయారు! "కోదండరామయ్యా! నీ సమాధానపత్రం (Answer book) చాలా బాగుందయ్యా! దీనిని నేను ఉంచేసుకుంటాను!" అన్నారు. తాను వ్రాయబోయే "తెలుగుసాహిత్య చరిత్ర"లో ఈ మేటర్ ఉపయోగించుకోవాలని వారి ఆశ. ఆ ఆశ నెరవేరకుండానే వారు గతించారు!

**2. దస్తూరీ ముత్యాలక్రోవ:-** కో.రా.గారు తెలుగు వ్రాసినా, ఇంగ్లీషు వ్రాసినా అక్షరాలు ముత్యాలక్రోవల్లా ఉండేవి. కంగారు పడకుండా, మెల్లగా శ్రద్ధగా వ్రాసేవారు. వీరి దస్తూరీని చూచి ఆశ్చర్యచకితులైన గురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఒకసారి ఆ దస్తూరీని ముద్దు పెట్టుకొని, కళ్ళకు అద్దుకున్నారట!

**3.ధ్యానం:-** తమ గురుదేవులైన వేటూరివారినుండి "మాస్టర్ సి.వి.వి. ధ్యానం" నేర్చుకున్నారు. దాన్ని తరచుగా ఏకాంత సమయాల్లో చేస్తూ ఉండేవారు. అది చెయ్యగానే వారి శరీరంలో పులకరింతతో కూడిన ఒక జెర్క్ వచ్చి, ఒళ్ళంతా విరుచుకొనేవారు. (నేను స్వయంగా చూచాను)

**4. గొప్ప అధ్యాపకుడు:-** ఆ రోజుల్లో ఎస్వీయూనివర్సిటీలో స్నాతకోత్తర తరగతులే కాకుండా, మామూలు డిగ్రీ (బి.ఏ., బి.ఎస్సీసి., బి.కామ్.) తరగతులు కూడా ఉండేవి. ఒక్కొక్క తరగతిలో 70-80 మంది విద్యార్థులుండేవారు. ఎం.ఏ.లో 10-15 మందికి పాఠం చెప్పే కన్నా, అంతమందికి పాఠం చెపితే బాగుంటుందని, ఒకసారి పింగళివారు ఆ డిగ్రీ తరగతుల్లో తెలుగుపాఠం చెప్పడానికి వెళ్ళారు. ఆ కోతిమూకకు పింగళివారి గొప్పతనం ఏమి తెలుసు? అల్లరి చేశారు. వెంటనే ఆయన క్లాసు వదిలి బయటకు వచ్చేసి "కోదండరామయ్యా! ఈ పాఠాలేవో నువ్వే చూచుకో!" అన్నారు. కో.రా.గారు ఆ విద్యార్థుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తూ పాఠాలు చెప్పేవారు.

**5. మంచి Preparation:-** ఎం.ఏ. తరగతులకు వచ్చేముందు బాగా prepare అయి వచ్చేవారు. ఎంతో చక్కగా పాఠం చెప్పేవారు. ఎప్పుడూ అలాగే

జరిగేది. కాని ఒక రోజు గురువుగారి పాఠం చప్పగా ఉంది. నేను కనిపెట్టేశాను. తరగతిలోంచి బయటకు వచ్చాక, "ఏమిఁటి సార్! ఈ రోజు చప్పగా ఉంది పాఠం?" అని ప్రశ్నించాను. ఆయన కోపగించుకోకుండా శాంతంగా దానికిగల కారణం చెప్పారు. "నేను రెండు రోజుల క్రిందట నెల్లూరు వెళ్ళాను. ఈ రోజు అక్కడినుండి హడావిడిగా బస్సులో తిరుపతికి చేరి, తిన్నగా క్లాసుకి వచ్చేశాను. ప్రిపేర్ అవడానికి టైమ్ లేకపోయింది!" అన్నారు, ఎంతో నిజాయితీగా! ఎంత గొప్ప ఉపాధ్యాయుడైనా సరే, ముందుగా ప్రిపేర్ కాకుండా, పాఠం బాగా చెప్పలేడు – అని దీని తాత్పర్యం!

**6. విద్యార్థుల్ని ప్రోత్సహించడం:–** విద్యార్థులలో ఏ మాత్రం ప్రతిభ ఉన్నాసరే క్లాసులోనే మెచ్చుకొనేవారు. నేను ఎం.ఏ విద్యార్థిగా ఉన్నప్పుడు 'భారతి' మాసపత్రికలో "తిరుపతి కొండ" అనే కవిత వ్రాశాను. దానిని చూచి కో.రా.గారు క్లాసులో "సుబ్బారావ్! 'భారతి'లో నీ కవిత చదివాను. చాలాబాగుంది. ముఖ్యంగా 'కొండయ్య భుజముపై కందువా ఈ మెట్లు!' అన్న భావన గొప్పగా ఉంది!" అన్నారు. నేను ఏనుగునెక్కినంత సంబరపడ్డాను!

**7. యమ Strict:–** అన్ని విషయాలలోను చాలా నిక్కచ్చిగా ఉండేవారు, ఆయన క్లాసులోకి వచ్చిన తరువాత ఏ విద్యార్థి అయినా వస్తే, అతనికి absent mark చేసేవారు. నేను రోజూ 5 నుంచి 10 నిమిషాలు లేటుగా వచ్చేవాడిని. భీమాస్ హోటల్‌లో భోజనం చేసి, వేగంగా నడిచి వచ్చేవాడిని (ఆ రోజుల్లో నాకు సైకిల్ కూడా ఉండేది కాదు). కనీసం ఐదు నిమిషాలైనా ఆలస్యం అయిపోయేది. ప్రతిదినమూ కో.రా.గారు నాకు హాజరు వేస్తున్నారనుకున్నాను. ఒక రోజున ఒక విద్యార్థి కో.రా.గారు క్లాసులోకి వచ్చిన తరువాత వచ్చి, హాజరు వేయమని కోరాడు. అప్పుడు చెప్పారు వారు: "నేను క్లాసులోకి అడుగుపెట్టిన తరువాత ఆ దేవుడే దిగివచ్చినా సరే, అటెండెన్స్ వేయను!" వెంటనే నేను లేచి "అయ్యా! నేను వారంరోజులనుండి మీరు వచ్చిన తరువాతే క్లాసులోకి వస్తున్నాను. నా సంగతేమిటి?" అని అడిగాను. "నీకు వారం రోజులనుండి absent mark చేశాను!" అన్నారు. నేను "చచ్చానురా దేవుడా!" అనుకున్నాను మనస్సులో! దీనికి పూర్తిగా వ్యతిరేకమైన మహానుభావుడు పంగనామల బాలకృష్ణమూర్తిగారు. ఆయన సైకిలుమీద యూనివర్శిటీకి వచ్చేవారు. (ఆ రోజుల్లో జి.యన్.రెడ్డిగారు

కూడా సైకిల్ మీదే వచ్చేవారు). నేను రెండు మూడు నిమిషాలు ఆలస్యంగా వచ్చి "సార్! నా అటెండెన్స్!" అని అడిగితే వెంటనే "వేసేశాను! నువ్వు నడిచి వస్తుంటే మునిసిపల్ ఆఫీస్ దగ్గర నిన్ను చూచాను!" అనేవారు. ఆయన అంత ఉదారుడు; ఈయన యింత పిసినారి!

**8. తిరుపతి సాహిత్యసమితి: –** ఆ రోజుల్లో కో.రా.గారు, జి.యన్.రెడ్డిగారు, ఇతర మిత్రులు కలిసి, "తిరుపతి సాహిత్యసమితి"ని స్థాపించారు. 15 రోజులకొకసారి ఆ సాహిత్య మిత్రులందరూ బాలాజీ కాలనీలో ఉన్న ఆచంట జానకిరాంగారి యింట్లో సమావేశమయ్యేవారు. ప్రతిసారి ఒక సభ్యుడు ఒక విమర్శనాత్మక వ్యాసం వ్రాసుకొచ్చి చదవాలి. దానినిగురించి అందరూ చర్చిస్తారు. ఈ సభలు ఇలా జరుగుతూ ఉండగా ఒకసారి బెజవాడ గోపాలరెడ్డిగారు తిరుపతికి వచ్చారు. "కోదండ రామయ్యగారూ! మీ సాహిత్య కార్యక్రమాలు ఏమిటి?" అని అడిగారు. (ఆయన అలా అడుగుతూ ఉంటే, వీథినాటకంలో రాజుపాత్రధారి "మంత్రీ! నెలకు మూడువానలు కురియుచున్నవా?" అని అడిగినట్లుగా ఉందని తరువాత నాతో చెప్పి నవ్వుకున్నారు గురువుగారు.) "తిరుపతి సాహిత్యసమితి"ని గురించి కో.రా.గారు వివరించి చెప్పారు. అప్పుడు గోపాలరెడ్డిగారు "ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ" అధ్యక్షులుగా ఉండేవారు. వెంటనే ఆయన ఈ సమితికి కొంత ధనసహాయం చేయించారు. ప్రతిసంవత్సరమూ ఆ సహాయం సమితికి అందుతూ ఉండేది. ఆ సొమ్ముతో "తిరుపతి సాహిత్యసమితి వ్యాసావళి" పేరుతో మూడు సంపుటాలు ముద్రించారు. మూడవ సంపుటంలో నేను వ్రాసిన "తిలక్ అభిరుచులు – అలవాట్లు" అనే వ్యాసం కూడా (సగభాగం) వచ్చింది.

**9. శేషేంద్రగారితో పరిచయం: –** ఒకసారి గురువుగారిని హైదరాబాద్ తీసికొని వెళ్ళి "జ్ఞానబాగ్ ప్యాలెస్"లో ఉన్న ప్రముఖకవి శేషేంద్రగారిని, వారి శ్రీమతి రాజకుమారి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్‌గారిని పరిచయం చేశాను. శేషేంద్రతో వాల్మీకి రామాయణాన్ని గురించి, ఇతర సాహిత్య విషయాలను గురించి చాలాసేపు చర్చించారు కో.రా.గారు. మంచికవి, పండితుడు, విమర్శకుడు అయిన శేషేంద్రను పరిచయం చేసినందుకు ఎంతో సంతోషించారు.

**10. సాధించవలసిన మూడు విషయాలు: –** తెలుగు ఉపన్యాసకుడు మూడు విషయాలు సాధిస్తే, వాడు గొప్పవాడని కో.రా.గారు చెపుతూ ఉండేవారు. అవి:

(1) ఒక మంచి సాహిత్యవ్యాసం వ్రాసి, 'భారతి' మాసపత్రికలో ప్రచురించడం; (2) విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా చేరడం; (3) రేడియోలో ప్రసంగం చేయటం (ఈ మూడూ నేను సాధించినందుకు గురువుగారు చాలా సంతోషించారు).

**11. ప్రూఫులు దిద్దడం ఎలాగ?:-** ఈ విషయాన్ని కూడా గురువుగారు నాకు ఎంతో శ్రద్ధగా నేర్పించారు. గుర్తులు, వాటి అర్థాలు, చెప్పారు. "ప్రూఫులు దిద్దటం అంటే చదువుకుంటూ పోవడం కాదు; ఒక్కొక్క అక్షరమే, కన్నులో కన్నుపెట్టి చూడటం! చదువుకుంటూ పోతే, తప్పుల్ని కూడా ఒప్పులుగా చదివేస్తాం!" అని హెచ్చరించేవారు.

**12. బ్రాహ్మణ్యం-దైవభక్తి:-** రోజూ సంధ్యావందనం చేసుకొనేవారు. సాయంకాలం ఇంటికి వచ్చి, కాళ్ళు చేతులూ ముఖం కడుక్కొని, నుదుటిపై విభూతి పిండికట్లు పెట్టుకొని, ఏదైనా పుస్తకం చదువుకుంటూ కూర్చొనేవారు. తాను విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో రీడరుననీ, మేమంతా పరిశోధక విద్యార్థులమనీ భేదం చూపించేవారుకాదు. అందరితోనూ కలివిడిగా ఉండేవారు. కో.రా.గారు, మద్దూరి సుబ్బారెడ్డిగారు (లెక్చరర్), పరిశోధక విద్యార్థులమైన నేను, సానికొమ్ము అక్కిరెడ్డి - మేం నలుగురం మంచి స్నేహంగా ఉండేవాళ్లం. అప్పుడప్పుడు మానసోల్లాసంకోసం సినిమాలకు కూడా వెళ్ళేవాళ్ళం. ఒకసారి ఎన్.టి.రామారావుగారు నటించిన "శ్రీకృష్ణావతారం" సినిమా చూస్తున్నాం. చివర్లో పాలసముద్రంమీద పవ్వళించియున్న, లక్ష్మీదేవీసహితుడైన విష్ణుమూర్తిని (ఎన్.టి.ఆర్.ను) చూపెడుతున్నారు. వెంటనే గురువుగారు ఠక్కున లేచి నుంచున్నారు. నావైపు తిరిగి నవ్వుతూ: "సుబ్బారావ్! వాడు ఎన్.టి రామారావని నాకు తెలుసు! అయినా వాడు సాక్షాత్తు విష్ణుమూర్తిలాగ ఉన్నాడయ్యా!. నేను రెండు చేతులూ జోడించి నమస్కరిస్తాను! నువ్వు మాత్రం నవ్వకూడదు!" అని సినిమా తెరవైపు చేతులు జోడించి భక్తితో నమస్కరించారు!

**13. రాత్రంతా మేల్కొని నా టైప్డ్ థీసిస్‌ను దిద్దటం:-** నా థీసీసు అంతా గురువుగారే మద్రాసులో ఉన్న రాయన్‌గారికి పంపించారు. ఫైనల్ ప్రూఫు చూడటానికి నన్ను తీసికొని మద్రాసు వెళ్ళారు. వారి బావమరిది ఇంట్లో మకాం. రాత్రి 11 గంటలవరకూ ప్రూఫులు దిద్దాం. నాకు నిద్ర ముంచుకొని వచ్చేస్తోంది. నేను పడుకుంటే, గురువుగారే రాత్రి ఒంటిగంటవరకూ ప్రూఫులు

దిద్ది, ఆ పని పూర్తిచేశారు. ఇటువంటి గురువులు ఎక్కడైనా ఉంటారా ఈ లోకంలో?

**14. పెద్దల ఎడల వినయవిధేయతలు:–** గురువుగారు ఒకసారి నాతో ఇలా అన్నారు. "సుబ్బారావ్! దివాకర్ల వెంకటావధానిగారూ ప్రొఫెసరే! నేనూ ప్రొఫెసర్‌నే! కాని నేను ఆయన ఎదురుగా సిగరెట్టు కాల్చలేను! అదీ ఆ మహానుభావుడు కమాండ్ చేసే రెస్పెక్ట్!"

**15. ఒక మెచ్చుకోలు:–** ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అప్పుడు డా. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రీడరుగా ఉండేవారు. ఆయన ఆర్.ఎస్.ఎస్.లో పెద్ద ర్యాంక్‌కి చెందిన సభ్యుడుగా ఉండేవారు. ఆయన డ్రెస్ ప్రసన్న గంభీరంగా ఉండేది. ఖద్దరు పంచ, ఖద్దరు లాల్చీ, ఆ లాల్చీపైన – ప్రకాశం పంతులుగారిలా – అడ్డంగా వేసుకున్న శాలువా, చేయెత్తు మనిషి, చూడముచ్చటగా ఉండేవారు. కో.రా.గారికి ఆ శాస్త్రిగారి వస్త్రధారణ చాలా నచ్చింది. ఆ విషయం నాతో పదే పదే చెప్పేవారు.

**16. ఏకాగ్రతతో పరిశోధన:–** తిరుపతిలో–మునిసిపల్ సైరన్ రోజుకి రెండుసార్లు కూసేది. ఉదయం 8 గంటలకు, తిరిగి రాత్రి 8 గంటలకు. ఉదయం సైరను కూయగానే నేనూ గురువుగారూ డిపార్టుమెంటుకి వెళ్ళిపోయేవాళ్ళం. రాత్రి 8 గం.లకి మళ్ళీ సైరన్ కూసే వరకూ అక్కడే చదువుకుంటూ, వ్రాసుకుంటూ ఉండి పోయేవాళ్ళం. మధ్యాహ్న భోజనం ఇళ్ళ దగ్గరనుండి క్యారియర్స్‌లో వచ్చేది. ఇలాగ మూడు సం.లు (1964–67 మధ్య) ఏకధాటిగా పనిచేశాం. నేను ఈ రీతిగా అహర్నిశలూ పనిచేయడానికి గురువుగారి ప్రోత్సాహమే ప్రధాన కారణం.

**17. "చింతామణి" నాటకం" – "పీసపాటి" నటన:–** తిరుపతిలో తమిళ సంస్కృతి ఎక్కువ. ఇక్కడి ప్రజలు సంగీత కచేరీలు, డోలువాద్యాలు వింటారు కాని, రంగస్థల నాటకాలు చూడరు. అందువల్ల రంగస్థల నాటక బృందాలవారు, శ్రీకాళహస్తివరకూ వచ్చి, వెనక్కి వెళ్ళిపోతారు. ఎప్పుడోకాని తిరుపతికిరారు. ఒకసారి ఒక నాటక బృందం తిరుపతికి వచ్చి, కాళ్ళకూరి నారాయణరావుగారి "చింతామణి" నాటకం ప్రదర్శిస్తున్నారు. ప్రముఖ రంగస్థల నటుడు పీసపాటి నరసింహమూర్తిగారు

బిల్వమంగళుడు. నాటకం చాలా బాగుంటుందని చెప్పి, గురువుగారిని తీసికొని వెళ్ళాను. గురువుగారి యింటి ప్రక్కనే ఉన్న త్యాగరాజ మంటపంలో ప్రదర్శన. పీసపాటి నటనను చూచి గురువుగారు దిగ్భ్రాంతులైపోయారు. ఆయన పద్యపఠనంతీరుకు ముగ్ధులైపోయారు. సాయంకాలం చల్లని పిల్లగాలులతో కూడిన ప్రశాంత వాతావరణ వర్ణన పద్యాన్ని పీసపాటిగారి నోట విని, ఎంత ఆనందించారో మాటలలో నేను చెప్పలేను. ఆ పద్యం యిది -

**ఉ. "చల్లని పిల్లగాడుపులు, చక్కగ విచ్చిన పూలు, కెంపుతో**
**నుల్లసమాడు నాకసము, వ్యూహములన్ జను పక్షిసంతతుల్,**
**మెల్లఁగ మింటఁ దారు చిఱుమేఘము, లయ్యపరాద్రివెన్క రా**
**జిల్లెడు సూర్యబింబము, వచింపఁగ శక్యమె సంధ్యసంపదల్!"**

పీసపాటి నరసింహమూర్తిగారు బాగా చదువుకున్న పండితుడు. నాటకం అయిపోయిన తరువాత కో.రా.గారు పీసపాటిగారితో ఎంతోసేపు చర్చించారు. తీరాచూస్తే ఆయన తిరుపతిలో ఉన్న హిందీ లెక్చరర్, తెలుగు సాహిత్యవేత్త అయిన ముట్నూరి సంగమేశంగారికి మేనమామ కొడుకని తెలిసింది!

**18. "సుబ్బారావ్! మనం ఇప్పుడెక్కడున్నాం?":-** గురువుగారితో కలిసి రైల్లో సుదూర ప్రాంతాలకు ప్రయాణం చేస్తుంటే, ఎక్కడున్నామో తెలిసేది కాదు. అప్పుడు గురువుగారు: "సుబ్బారావ్! మనం ఇప్పుడెక్కడున్నాం? చెప్పు?" అనేవారు. అందువల్ల నేను రైల్వేగైడు కూడా తీసికొని వెళ్ళేవాడిని. అందులోని మ్యాప్ చూపిస్తూ: "సార్! ఇప్పుడు మనం ఇక్కడ ఉన్నాం!" అని చెప్పేవాడిని. చాలా ఆశ్చర్యంగా మ్యాప్ వైపు చూచేవారు!

**19. చిన్నతమ్మునిగురించి శ్రీవారిబాధ:-** గురువుగారి చిన్నతమ్ముడు త్యాగరాయమూర్తి బి.ఏ. స్పెషల్ తెలుగు చదివి, మదనపల్లె బి.టి. కాలేజీలో తెలుగు ట్యూటర్‌గా పనిచేస్తూ ఉండేవాడు. చాలా ఏండ్లు అలా ట్యూటర్‌గానే ఉండిపోయాడు. ఎం.ఏ. తరగతులకు ఎన్నో సంవత్సరాలుగా పాఠాలు చెపుతూన్న కో.రా.గారు ఒకసారి నాతో: "సుబ్బారావ్! ఇంతమంది నా దగ్గర చదివి ఎం.ఏ. డిగ్రీలు తీసుకుంటున్నారు. మా చిన్నతమ్ముడు అలా ట్యూటర్‌గానే ఉండిపోయాడు. 'ఎం.ఏ. చదవరా! లెక్చరర్ అవుతావు' అని ఎంత చెప్పినా

వినడం లేదు!" అని చాలా బాధపడ్డారు. త్యాగరాయమూర్తిలో చైతన్యం తక్కువ. మన్నుతిన్న పాములాగ మందకొడిగా పడిఉండేవాడు. అన్నగారికున్న ప్రతిభాపాండిత్యాలు లేకపోయినా, వారిలాగ సిగరెట్లు కాల్చడం మాత్రం నేర్చుకున్నాడు! చాలా ఏండ్ల తరువాత ఎం.ఏ. తెలుగు పాసై, ఆ కళాశాలలోనే లెక్చరర్ అయ్యాడు.

**20. "చిన్న చిన్న సుఖాలు అనుభవించాలి సార్!":–** ఒకరోజు ఉదయం గురువుగారి యింటికి వెళ్లాను. వారు షేవ్‌చేసుకుంటున్నారు. గడ్డంనిండా గాట్లుపడిపోయి రక్తం వస్తోంది. "ఏవిఁటిసార్! ఏం బ్లేడు వాడుతున్నారు?" అని అడిగాను. "భారత్ బ్లేడ్" అన్నారు. "అది చాలా చీప్ బ్లేడ్ సార్! ఎప్పుడూ 7'O Clock Blade వాడాలి. మెత్తగా తెగుతుంది. గాట్లు పడవు; రక్తం కారదు. జీవితంలో చిన్న చిన్న సుఖాలు అనుభవించాలి సార్!" అన్నాను నవ్వుతూ. ఆయన పకపకా నవ్వి, వారి ధర్మపత్నితో "మా సుబ్బారావు ఇలా చిన్న చిన్న సుఖాలు అనుభవించమన్నాడు" అని చెప్పి, తరువాత 7'O Clock Blade వాడటం ప్రారంభించారు.

**21. "మా రాయలసీమ రచయితలు రాయలసీమభాష వ్రాయడం లేదు సుబ్బారావ్!":–** ఆ రోజుల్లో మధురాంతకం రాజారాం వంటి మంచి మంచి రాయలసీమ రచయితలు, చక్కని కథలు, నవలలు వ్రాసేవారు. 'భారతి'లో వచ్చే వ్యాసాలతోపాటు మంచి కథలు కూడా గురువుగారు చదువుతూ ఉండేవారు. ఒకసారి నాతో: "సుబ్బారావ్! మా రాయలసీమ రచయితలందరూ తమ కథలు, నవలలు రాయలసీమభాషలో వ్రాయడం లేదు; మీ కోస్తా భాషలో వ్రాస్తున్నారయ్యా!" అని బాధపడ్డారు. శ్రీనామిని సుబ్రహ్మణ్యంనాయుడు వచ్చేవరకూ చిత్తూరు మాండలికం కథలలోకి ఎక్కలేదు! అప్పటికి గురువుగారు లేరు!

**22. "ఇక్కడ చదివి, పేరు ప్రతిష్ఠలు గడించిన వారంతా కోస్తాజిల్లాల వాళ్ళే":–** శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1959లో తెలుగు ఎం.ఏ. తరగతులు ప్రారంభ మయ్యాయి. సెకండ్ బ్యాచ్‌లో అద్దేపల్లి రామమోహనరావు, థర్డ్ బ్యాచ్‌లో తంగిరాల సుబ్బారావు, నాల్గవ బ్యాచ్‌లో ప్రసాదరాయ కులపతి, ఐదవ బ్యాచ్‌లో మొవ్వ వృషాద్రిపతి మొదలైనవారు ఉత్తరోత్తర జీవితంలో సాహిత్యరంగంలో కీర్తిప్రతిష్ఠలు గడించారు. వీరెవ్వరూ రాయలసీమవారుకారని గురువుగారు కొంచెం

బాధపడేవారు. కాని, ఫస్టు బ్యాచ్‌లో చదివిన శ్రీ కేతు విశ్వనాథరెడ్డి మంచి కథారచయితగా పేరుపొందాడు. తరువాతి కాలంలో వచ్చిన శ్రీ మేడసాని మోహన్ పండితుడుగా, కవిగా, 'మహాసహస్రావధాని'గా ఆంధ్రదేశమంతటా ఎంతో కీర్తి గడించాడు. వీరిద్దరూ రాయలసీమవారే!

**23. "అవును, ఆయనే నీ గురుదేవులు":-** 1967లో నేను "హంసపదిక" అనే వచన కవితా సంపుటిని ప్రచురించాను. అంతకు ముందే 1964లో "మానసావర్తాలు" అనే వైరాగ్య గీతాలు వ్రాశాను. అవి వివిధ పత్రికలలో వచ్చాయి. "దానిని ప్రచురించనా? 'హంసపదిక'ను ప్రచురించనా?" అని గురువుగారిని అడిగితే "హంసపదిక-ప్రణయ గీతాలు కాబట్టి దీనినే ప్రచురించు. తొందరగా క్లిక్ అవుతుంది!" అన్నారు. ఆ పుస్తకం పీఠికలో కో.రా. గారిని "నా గురుదేవులు" అని సంబోధించాను. ఇంటర్‌లోను, బి.ఏ.లోనూ నాకు పాఠాలు చెప్పిన గురుదేవులు దిగుమర్తి శ్రీ సీతారామస్వామిగారికి నా "హంసపదిక" ఒక కాపీని పంపించాను. ఆయన దానిని తిరుగవేసి, నాకొక లేఖ వ్రాశారు: "చిరంజీవి సుబ్బారావును ఆశీర్వదించి – నీ 'హంసపదిక' చూచాను. నీనుండి నేను ఆశించేది ఇటువంటి చౌకబారు రచన కాదు; మంచి విమర్శను, గొప్ప పరిశోధనను ఆశిస్తున్నాను. పైగా తిమ్మావజ్ఝలవారు నీ గురుదేవులు అని ఈ పుస్తకంలో వ్రాశావు. కాని ఆయన నీ గురుదేవులు కారు; నేనే నీ గురుదేవుడను!" ఈ లేఖ కో.రా.గారికి చూపించాను. "అవును, నిజమే! దిగుమర్తివారే నీ గురుదేవులు! నీకు మొట్టమొదట తెలుగు సాహిత్యంలో మంచి అభిరుచిని కలిగించినవారు ఆయనే కదా!" అన్నారు. అటువంటి గొప్ప సహృదయులు గురువుగారు. 1968లో ఒకసారి దిగుమర్తిగారు, కోదండరామయ్యగారినీ నన్నూ భీమవరం కళాశాలలో జరిగిన ఒక సాహిత్యసభకు ఆహ్వానించి, సత్కరించారు. ఆ సభలో నేను చదివిన "మహాత్మా! నీవు మళ్ళీ జన్మించాలి!" అనే గాంధీ శతజయంతి కవితను చాలా మెచ్చుకున్నారు దిగుమర్తివారు. పైగా, "మా కళాశాలకు వసంతుడిలా వచ్చావయ్యా!" అంటూ తమ ఆనందాన్ని వ్యక్తీకరించారు. కోదండరామయ్యగారు "భారతి" మాసపత్రికలో ధారావాహికంగా వ్రాసిన "తెనుగు మఱుగులు" అనే వ్యాసాలను దిగుమర్తివారు చదివి, మెచ్చుకొని, వారిని భీమవరం కళాశాలకు ఆహ్వానించారు. వారితోపాటుగా నేనూ వెళ్ళాను.

**24. తిక్కన తెలుగు నుడికారం:–** తిక్కన తెలుగు నుడికారాన్ని గురించి, వెటకారాన్ని గురించి, అర్థపరిణామం చెందిన పదప్రయోగాలను గురించి, కాకువును గురించి ఎంతో గొప్పవ్యాసాన్ని రచించారు–కోదండరామయ్యగారు. (ఇది "తిరుపతి సాహిత్యసమితి వ్యాసావళి"లో వచ్చిన జ్ఞాపకం). దీనిపై ఒక రేడియో ప్రసంగాన్ని కూడా (విజయవాడ AIRలో) ఇచ్చారు.

(1) ఉద్యోగపర్వం చివరలో (చతుర్థాశ్వాసంలో) భీష్ముడు, కర్ణుని అర్ధరథుడుగా పేర్కొంటాడు. దానికి కోపగించిన కర్ణుడు దుర్యోధనునితో –

తే.గీ. **"చాలఁగాలంబు పోవక, చతురులైన**
**వృద్ధ జనముల బుద్ధులు విం(దుగాక!**
**ముదియ మదితప్పి నోరికి నొదవినట్లు**
**పలుకు వెడఁగుల మాటలు పాడియగునె?"** – అంటాడు. (ఉద్యోగ. 4–243)

"పండుముసలివాళ్ళు కాకుండా ఉన్న, నేర్పరులైన వృద్ధులయొక్క మంచిమాటలు వినవచ్చును. కాని బాగా ముసలితనం వచ్చేసి, బుద్ధి చెడిపోయి, నోటికి వచ్చినట్లు మాట్లాడే (వాగే) వాళ్ళ వివేకశూన్యమైన వాక్యాలు (పిచ్చిమాటలు) ప్రమాణంగా తీసుకోడానికి వీలవుతుందా? (అవి ధర్మసమ్మతమౌతాయా?)" (ఈ పద్యంలో "కాలము – చతురులు–వృద్ధజనములు – బుద్ధులు'' అనే నాలుగు తత్సమ పదాలు తప్ప, తక్కిన పదాలన్ని అచ్చమైన తెలుగుపదాలే!)

దీనికి భీష్ముడు ఎంతో వెటకారంగా, కర్ణుని దెప్పిపొడుస్తూ ఇలా అంటాడు:–

చ. **"ముదుకఁడనైన నాదు బలమున్, జలమున్, వివిధాస్త్రశస్త్రసం**
**పదయును బోయి నీగురుఁడు భార్గవుచే విను; మాజిభూమి నా**
**కెదిరినవారు పెక్కెడల నేమయిరో యెఱుఁగున్ జగంబు; నా**
**ముదిమియు, నీ కుమారుతనమున్ వరుసన్ విజయుండెఱింగెడున్!"**
(ఉద్యోగ. 4–246)

ఈ పద్యమంతా అచ్చమైన తెలుగునుడికారంతో ఎంతో ధ్వనిగర్భితంగా ఉంది. "కర్ణా! నేను మిక్కిలి ముసలివాడినని నన్ను తూలనాడావు. వృద్ధుడైన నా శక్తి ఎటువంటిదో, నా పట్టుదల ఎటువంటిదో, పలురకాలైన అస్త్రశస్త్ర విద్యలలో నాకు గల ప్రావీణ్యం ఎటువంటిదో, పోయి, నీగురువైన పరశురాముణ్ణి అడిగి తెలుసుకో! పలుచోట్ల యుద్ధరంగంలో నన్ను ఎదిరించిన రాజులు ఏమైపోయారో

ఈ లోకానికి బాగా తెలుసు! నా ముసలితనం, నీ పడుచుదనం వరుసగా అర్జునుడికి తెలుస్తుందిలే త్వరలో!" అన్నాడు భీష్మపితామహుడు!

(2) ఈ ఉద్యోగపర్వం చివరలోనే (చతుర్థాశ్వాసంలోనే) దుర్యోధనుడు, శకుని కుమారుడైన ఉలూకుని ధర్మరాజు దగ్గరకు రాయబారిగా పంపుతాడు. వాడు ధర్మరాజు దగ్గరకు వెళ్ళి, దుర్యోధనుని దుర్మార్గపు మాటలు చెప్పడానికి భయపడుతున్నాడు. అప్పుడు ధర్మరాజు ఉలూకునితో ఇలా అంటాడు –

**ఆ.వె. "నీకు వెఱవనేల? నిన్ను నా బుద్ధిమం**
**తుండు చెప్పుమనిన తులువమాట**
**లెన్ని గలవు వాని నన్నింటి ననుమాన**
**మింతలేక యాడు మెల్ల వినఁగ!"** (ఉద్యోగ. 4-189)

"నీవు భయపడటం దేనికి? ఆ 'బుద్ధిమంతుడు' (దుర్యోధనుడు) మాతో చెప్పుమని నీతో చెప్పి పంపిన 'తులువమాటలు' (తుంటరికూతలు, లేదా కారుకూతలు) ఎన్ని ఉన్నాయో వాటినన్నింటినీ, కొంచెంకూడా అనుమానం లేకుండా, మాతో చెప్పు – అందరూ వింటూ ఉండగా" – అన్నాడు ధర్మరాజు.

ఈ పద్యంలోని తెలుగునుడికారాన్ని పుక్కిలించే రెండు గొప్ప పదాలున్నాయి: ఒకటి "బుద్ధిమంతుడు"; రెండవది "తులువమాటలు". బుద్ధిమంతుడయితే తులువ మాటలు ఎలా పంపుతాడు ఉలూకుని (రాయబారి) ద్వారా? అంటే ఇక్కడ "బుద్ధిమంతుడు" అంటే నిజంగా బుద్ధిమంతుడు కాదు. అర్థపరిణామంలో వచ్చిన వెటకారపుమాట. దీని అర్థం "దుర్మార్గుడు" అని. ఇది "ఏం పెద్దమనిషివయ్యా నువ్వు?"-"అతడేం పెద్దమనిషండీ?" అనే తెలుగువాక్యాలలోని తెలుగు నుడికారమయిన "పెద్దమనిషి" వంటి పదము! "ఆ దుర్మార్గుడైన దుర్యోధనుడు మాతో చెప్పుమని చెప్పిన కారుకూతలన్నీ భయం లేకుండా చెప్పు" – అని ఈ పద్యానికి అసలు అర్థం. ఇది అచ్చమైన తిక్కనమార్కు తెలుగుపద్యం. దీంట్లో "బుద్ధిమంతుడు – అనుమానము" అనే రెండు తత్సమపదాలు తప్ప, తక్కినవన్నీ తెలుగు దేశ్యపదాలే!

**25. "గురుదక్షిణ":–** మాకు తెలుగు ఎం.ఏ. రెండు సంవత్సరాల కోర్సు పూర్తి అయింది. వీడ్కోలుసభలో గురువులందరూ హితోక్తులు చెప్పారు.

తి.కో.రా.గారు Black Board మీద "శివాస్తే పంథానస్సంతు" (శివాః తే పంథానః సంతు! నీ మార్గములు మంగళకరములు అగుగాక!) అని వ్రాశారు. ఇది వాల్మీకి రామాయణంలో సుందరకాండలో హనుమంతుడు సీతను చూచి, రాముని కుశలవార్త చెప్పి, ఆయన అంగుళీకమిచ్చి, సీత దగ్గర చూడామణిని తీసి, తిరుగు ప్రయాణమవుతూంటే ఆమె "నీవు వెళ్ళే మార్గంలో నీకు మంగళమగు గాక!" అని ఆంజనేయుని దీవించింది. సీత హనుమంతునికిచ్చిన దీవెనను గురువర్యులు నూతన జీవితంలో ప్రవేశిస్తున్న విద్యార్థులమైన మా అందరికీ ఇచ్చారు. తరువాత మమ్మల్ని ఒక గురుదక్షిణ కోరారు. "నాయనలారా! మీరంతా ఇళ్ళకు వెడుతున్నారు. ఫలితాలు రావడానికి ఇంకా రెండు మూడు నెలలు పడుతుంది. మీరంతా కాలాన్ని వృథాచేయకుండా, కవిత్రయభారతంలోని 18 పర్వాలూ చదివి, నాకొక ఉత్తరం వ్రాయండి. నేను సంతోషిస్తాను. ఇదే మీరు నాకీయవలసిన గురుదక్షిణ!" అన్నారు. 18 మంది విద్యార్థులలో ఎవ్వరూ ఈ పని చేయలేదు. – ఒక్క ఎల్.బి. శంకరరావు తప్ప! అతనికి కవిత్రయభారతం అంటే చాలా ఇష్టం.ఎన్నో పర్యాయాలు చదివాడు. తరువాతికాలంలో నేను వ్యాసభారతం (తెలుగు వచనం) అతనికి బహూకరించాను. దానిని కూడా అతడు ఆమూలాగ్రం చదివి ఆనందించాడు! నాకు ఫోనుచేసి చెప్పాడు. ఆనాడు కో.రా.గారు మమ్మల్ని అడిగిన ఈ "గురుదక్షిణ", తెలుగు ఎం.ఏ. చదివిన విద్యార్థులందరూ, ఆనాడూ ఈనాడే కాదు, అన్ని కాలాల్లోనూ చెల్లించవలసిన గురుదక్షిణ! దీనితో స్వర్గంలో ఉన్న మా గురువుగారు ఎప్పుడూ సంతోషిస్తారు!

**26. "దుర్మార్గుడు!":–** గురువుగారికి ఎవరిమీదైనా కోపం వస్తే "దుర్మార్గుడు" అని మాత్రమే తిట్టేవారు. అంతకు మించిన పరుషవాక్యం పలికేవారు కాదు.

**27. "రాళ్ళపల్లివారి పక్షపాతం":–** 1958లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమివారు నన్నెచోడుని కుమారసంభవకావ్యాన్నిగురించి విమర్శపోటీ జరిపారు. దానికి ముగ్గురు వ్యక్తులు తమ రచనలను పంపారు. (1) తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు; (2) అమరేశం రాజేశ్వరశర్మగారు, (3) వేదం వేంకటరాయశాస్త్రిగారు (ఈయన అసలు వేదం వేంకటరాయశాస్త్రిగారి మనుమడు. కన్ఫ్యూజన్ లేకుండా, తనపేరు ప్రక్కన బ్రాకెట్సులో "శాస్త్రి మనుమడు" అని వ్రాసుకొనేవారు.) ఈ ముగ్గురిలో మొదటి ఇద్దరూ తెలుగు – సంస్కృత భాషలలో

మంచి పండితులు. విశ్వవిద్యాలయాల్లో ఉపన్యాసకులు. "శాస్త్రిమనుమడు" మాత్రం తెలుగు సాహిత్యానికి ఏమాత్రమూ సంబంధించినవాడు కాడు. ఆయన చరిత్రలో ఎం.ఏ. చేసినవాడు. విచిత్రమేమిటంటే ఈ "శాస్త్రిమనుమడి"కి బహుమతి వచ్చింది! అందరూ ఆశ్చర్యపోయారు. తరువాత పై మూడు రచనలూ పుస్తక రూపంలో వచ్చాయి. మొదటి రెండు పుస్తాకాలూ చాలా బాగున్నాయి. మూడవ పుస్తకం మిక్కిలి పేలవంగా ఉంది. దీనికి న్యాయనిర్ణేత: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. రాళ్ళపల్లివారిది పక్షపాతనిర్ణయమని కోదండరామయ్యగారు చాలాసార్లు బాధపడ్డారు నా దగ్గర. నేను మూడు పుస్తకాలూ చదివాను. కో.రా.గారికికాని, అమరేశం రాజేశ్వరశర్మగారికి కాని బహుమతి రావలసి ఉంది; కాని రాలేదు.

**28. కుమారసంభవ వ్యాఖ్య: –** తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు నన్నెచోడుని కుమారసంభవకావ్యానికి వ్యాఖ్యవ్రాయడం మొదలుపెట్టారు. "సంవత్సరానికి రెండు ఆశ్వాసాలకు వ్రాస్తాను" అని నాతో కూడా చెప్పారు. ఆరు ఆశ్వాసాల వరకూ వ్రాశారు. ఇంతలో అకాలమరణం చెందారు. తరువాత ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు నన్నెచోడును కావ్యానికి వ్యాఖ్య వ్రాయుమని డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారిని కోరారు. గురువుగారు వ్రాసిన ఆరు ఆశ్వాసాల వ్యాఖ్య వారికి పంపించాడు మిత్రుడు ప్రొ॥ గిరిప్రకాష్. కో.రా.గారి వ్యాఖ్యను మృత్యుంజయరావుగారు పూర్తిగా ఉపయోగించుకున్నారు. కాని ఎక్కడా కో.రా.గారి పేరు ప్రస్తావించలేదు! కుమారసంభవంలో మొత్తం 12 ఆశ్వాసాలున్నాయి. సగం వరకూ కో.రా.గారు వ్రాశారు. ఆ వ్రాతప్రతి జొన్నలగడ్డవారి దగ్గరే ఉండిపోయింది. తిరిగి వెనక్కి రాలేదు. ఇదొక విషాదం!

**29. "కవిత్వం కానిదానిని కవిత్వంగా దబాయించావయ్యా!: –** గురువర్యులు కోదండరామయ్యగారికి దేశిసాహిత్యంమీదా, పాల్కురికి సోమనాథుని మీదా ఎంత అభిమానం ఉన్నా, ఆయన ప్రధానంగా పండితుడు, పరిశోధకుడు. ప్రాచీన సాహిత్యంమీద ప్రగాఢమైన భక్తికలవారు. పండితులకు సహజంగా జానపద సాహిత్యంమీద చిన్నచూపు ఉంటుంది. అందువల్ల నా థీసీస్సు అంతా పూర్తి అయిన తరువాత, కో.రా.గారు: "చూడు సుబ్బారావ్! నువ్వు కవిత్వం కానిదానిని కవిత్వంగా 1500 పేజీలలో దబాయించావయ్యా!" అని పకపకా నవ్వారు. నేను తెల్లమొహం వేశాను!

**30. "అదంతా మా గురువుగారు వ్రాశారయ్యా!":–** గురువుగారు పై విధంగా అనేసరికి, నేను వీరగాథాకవిత్వంలో మంచి "కండపట్టు"గల భాగాల కోసం వెదకడం ప్రారంభించాను. "గంగుల పినయెల్లయ" అనే జానపదకవి రచించిన "కాటమరాజుకథ" ను కో.రా.గారి గురుదేవులైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించారు. కాని పీఠిక వ్రాయకుండా వారు స్వర్గస్థులయ్యారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచేత దానికి పీఠిక వ్రాయించి, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారం వారు ముద్రించారు. ఈ పుస్తకంలో "ఖడ్గతిక్కన–బ్రహ్మరుద్రయ్యల ద్వంద్వయుద్ధం" మహాద్భుతంగా వర్ణింపబడింది. –ఈ వర్ణనలో వీరరసం పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించింది:–

**"అప్పుడు తిక్కన యగ్ని చందముఁ**
**గదిసెను గోపాగ్ని కన్నుల నురల**
**నదలించి రుద్రుని నడ్డాన వైచె**
**వడి రుద్రుఁడంత నా వాటు దప్పుకొనెఁ**
**గరవాలు గైకొని కదిసె రుద్రుండు**
**విడిబడి రిద్దఱు వీరయుద్ధమున**
**ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు**
**లంఘించి వెనుకకు రాగడిల్లుచును**
**బ్రాకుచు దూఁకుచుఁ బైకి రేఁగుచును**
**దాటించి నఱకుచుఁ దాఁకి పొద్దుచును**
**నురవడితో వచ్చి పరువడి సేసి**
**కటపెట ఖంఖంగు ఘల్లుఘల్లనుచు**
**మెఱపులవలె మీఱి మెఱయుచుఁ బిడుగు**
**చఱపులవలె గొప్ప సడిని వ్రేయుచును**
**నిర్వురు పోరిరి దుర్వారు లగుచుఁ**
**దిక్కఁడుద్రిక్తుడై తెగవ్రేయ రుద్రుఁ**
**దక్కడఁ జెక్కలై యవనిపైఁ బడియెఁ**
**బడుచునే రుద్రుఁడాపక ఖడ్గధారఁ**
**దడయక యా మంత్రితలఁ ద్రుంచివైచె!"**

పై ఘట్టాన్ని గురువుగారికి చూపించాను. ఆయన మళ్ళీ పకపక నవ్వుతూ:"ఇదంతా ఆ జానపదకవి వ్రాయలేదయ్యా! మా గురువుగారు (వేటూరివారు) వ్రాశారు!" అన్నారు. (మన ప్రాచీన కావ్యాలలోని అవతారికా భాగాలన్నీ కందుకూరి వీరేశలింగం గారు వ్రాశారని ఎవరో విమర్శకులు అనగా విన్నాను.)

నాకు అనుమానం వచ్చింది. పరిష్కరణ పేరుతో పండితులు పూర్వకవుల కావ్యాలను చాలాభాగాలు మార్చివేశారని విమర్శకులు అంటూ ఉంటారు. ఇంకో గురువుగారు భద్రిరాజు కృష్ణమూర్తిగారు కూడా మా క్లాసులో హాస్యంగా ఇలా అంటూ ఉండేవారు: "ఆముక్తమాల్యదను శ్రీకృష్ణదేవరాయలు వ్రాయలేదు; వేదం వేంకటరాయశాస్త్రిగారు వ్రాశారు!" ఈ మాటలన్నీ నా బుర్రలో ఉండిపోయాయి. ఎందుకైనా మంచిది, నా అనుమానం తీర్చుకుందామని మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారానికి వ్రాసి "కాటమరాజుకథ" వ్రాతప్రతి జిరాక్సుకాపీని తెప్పించాను. పై ఘట్టాన్ని పోల్చి చూచాను. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంధులు చేసి, యడాగమాలు – నగాగమాలు చేసి, శకటరేఫలు – అరసున్నలు ఉంచి, పరుషములకు సరళములు – గసడవాదేశాలు చేశారు. యతిమైత్రి తప్పినచోట్లు సరిచేశారు. అంతే! ద్వంద్వయుద్ధ వర్ణన అంతా (ఇంచుమించుగా) పై విధంగానే ఉంది. కో.రా.గారి మాటలను బట్టి "పండితులకు జానపద సాహిత్యమంటే చిన్నచూపు" అనే విషయాన్ని దృఢీకరించుకున్నాను.

**31. సాహిత్యలోకంలో సంక్షిప్త నామాల సరదాలు ("రారా" – "చేరా" – "బేరా" – "బూరా" – "తికోరా"):–** తెలుగు సాహిత్యలోకంలో కొందరు సంక్షిప్త నామాలతో ప్రసిద్ధులయ్యారు. అసలు, ప్రసిద్ధకవి "శ్రీశ్రీ"యే ఒక సంక్షిప్తనామం. "శ్రీరంగం శ్రీనివాసరావు"గారు సంక్షిప్తంగా "శ్రీశ్రీ" అయ్యారు. నా చిన్నతనంలో "వాసమూర్తి" (వారణాసి సత్యనారాయణమూర్తి), "మురయా" (మునిమాణిక్యం రమణ యాజ్ఞవల్క్య) కథలు వ్రాసేవారు. "రారా" (రాచమల్లు రామచంద్రారెడ్డి) ప్రసిద్ధ అభ్యుదయ విమర్శకులు. నా సమకాలికులలో – "చేరా" (చేకూరి రామారావు) – "బేరా" (బోతవోలు రామబ్రహ్మం) – "బూరా" (బూదరాజు రాధాకృష్ణ)లు ప్రసిద్ధ విమర్శకులు, పండితులు, భాషాశాస్త్రవేత్తలు. తెలుగు విజ్ఞానసర్వస్వంలో, భాష–సంస్కృతి సంపుటాలలోని వ్యాసాలు వ్రాసినవారి పేర్లు, వ్యాసం చివర్లో,

సంక్షిప్తంగానే ఇచ్చేవారు. గురువర్యులు తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు వ్రాసిన వ్యాసాల చివర "తి.కో.రా." అని ఉండేది. నా సహాధ్యాయి గాదిరాజు సుబ్రహ్మణ్యం, ఒకసారి నాతో "గురువుగారిపేరును తిరగవేసి చదివిచూడు" అని పకపకనవ్వాడు! ఇంకోసారి నా ప్రియశిష్యుడు చిరంజీవి ఆర్. శేషశాస్త్రి నన్ను "కోబ్రా" అని పిలిచాడు. "అంటే ఏమిటయ్యా?"అని అడిగాను. "కోస్తా బ్రాహ్మణుడు" అని కిలకిల నవ్వాడు! "చేరా–బేరా–బూరా"లతోపాటు మనం "బారా"కూడా చేర్చవచ్చు. "బారా" అంటే బాడాల రామయ్యగారు! కాని ఆయన అంత ప్రసిద్ధకవి, విమర్శకుడు, పరిశోధకుడు కాడు. పింగళి లక్ష్మీకాంతంగారు "P.L.Kantham" అని చేవ్రాలు చేసేవారు. కొందరు ఆయన్ని "పిలకాంతం" అనేవారు.

**32. "మా తమిళంవాళ్ళు లేకపోతే మీ తెలుగువాళ్ళకి రాయలవారి 'ఆముక్తమాల్యద' అర్థమయ్యేది కాదు, తెలుసా?":–** గురువర్యులు కోదండరామయ్యగారు నాతో చాలా చనువుగా ఉండేవారు. నేను కూడా వారితో జంకూ గొంకూ లేకుండా మాటలాడేవాడిని. ఒకసారి గురువుగారితో "మీకు తెలుగులో గొప్ప పండితులు, పరిశోధకులు, విమర్శకులు, ఆచార్యులు. అయినా మీ మూలాలు (రూట్స్) తమిళంలో ఉన్నాయి!" అన్నాను సరదాగా. వారు కూడా అంతే సరదాగా "అవునయ్యా! నేను తమిళుడనే! మా తమిళంవాళ్ళు లేకపోతే మీ తెలుగువాళ్ళకి రాయలవారి 'ఆముక్తమాల్యద' అర్థమయ్యేది కాదు, తెలుసా?" అన్నారు–వేదం వేంకటరాయశాస్త్రిగారి ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్యను దృష్టిలో పెట్టుకొని. నేను తెల్లమొహం వేశాను!

**33. "నీవు చేసిన కృషి నీ పేరుతోనే ప్రకటితం కావాలి" (గురువర్యుల సలహా):–** 1974లో అనుకుంటాను – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు జానపద సాహిత్యానికి సంబంధించిన ఒక ప్రాజెక్టు ఇచ్చారు. (1) "తెలుగు జానపదగేయాలు" ఆచార్య బి. రామరాజుగారికి; (2) "శక్తి కథలు డా॥ నాయని కృష్ణకుమారిగారికి, (3) "వీరగాథలు' నాకు కేటాయించారు. నా దగ్గర కాటమరాజుకథలకు సంబంధించిన కొత్త కథలతో కూడిన 20–30 తాటాకు పుస్తకాలు ఉన్నాయి. "వాటిని మాకు పంపించండి; మేము చూసుకుంటాం" అని కబురుచేశారు – సాహిత్య అకాడెమీ పరంగా రామరాజుగారు. ఈ విషయం గురువుగారితో చెప్పాను. "వద్దు; వాళ్లకు పంపవద్దు. నేనే ఎడిట్ చేస్తాను – అని వాళ్ళతో

స్పష్టంగా చెప్పు. ఆ తాటాకు పుస్తకాలన్నీ నువ్వు వాళ్లకు పంపితే., ఆ కథలన్నీ వాళ్ల పేరుతో ముద్రించుకుంటారు." అని నన్ను హెచ్చరించారు. నేను అలాగే చేశాను. "కామరాజుకథలు" – మొదటిసంపుటం 1976లోను, రెండవ సంపుటం 1978లోను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు ముద్రించారు. ఈ గ్రంథాలు నాకు ఎంతో కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టాయి. ఈ తాటాకు పుస్తకాలలోని కథలను ఎత్తి వ్రాయడంలో నా ప్రాణమిత్రులు డా॥ చెన్నాప్రగడ తిరుపతిరావుగారు నాకు ఎంతో తోడ్పడ్డారు. నేను సహాయ సంపాదకుడుగా వారి పేరు ముద్రించాను. ఈ పని కూడా కోదండరామయ్యగారికి నచ్చలేదు. "నీ కీర్తిలో ఎవరికీ భాగం పంచిపెట్టకూడదు. కృతజ్ఞతలలో 'తిరుపతిరావుగారు నాకు సహాయం చేశారు' అని చెపితే చాలు!" అన్నారు.

**34. జీవితమాధుర్యం:–** గురువుగారికి మధ్యవయస్సు దాటాక మధుమేహం (డయాబెటిస్) కనబడింది. అప్పుడు నాతో "సుబ్బారావ్! నాకు జీవితంలో మాధుర్యం పోయిందయ్యా!" అని పకపక నవ్వారు.

**35. హెచ్చరిక:–** "నీవు కేవలం జానపదం మాత్రమే పట్టుకొని వ్రేలాడుతూ కూర్చుంటే 'వీడు వట్టి జానపదంగాడు' అనే ముద్ర పడిపోతుంది. ప్రాచీనకవిత్వం, ఆధునిక కవిత్వం – అన్నింటిలోనూ కృషిచెయ్యి!" అని హెచ్చరించారు. ఈ హెచ్చరికను నా జీవితంలో పాటించాను.

**36. గురువుగారి యింటిపేరు డి.టి.పి. చేయడం చాలా కష్టం:–** కోదండరామయ్యగారు విద్వాన్‌లో చేరిన కొత్తలో తన యింటి పేరును వ్రాస్తూ "ఝ" క్రింద "ఝువత్తు" వ్రాశారట. అప్పుడు వారి గురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "ఇలా కాదు నాయనా! 'జ' క్రింద "ఝువత్తు" వ్రాయాలి" అని సరిదిద్దారట. ఈ విషయం గురువుగారే నాతో చెప్పారు. అయితే డి.టి.పి. చేయిస్తూంటే "జ" క్రింద "ఝువత్తు" రావడం లేదు; 'ఘువత్తు" వస్తోంది. ఉచ్చారణ తప్పుతోంది. అందువల్ల నా ప్రియశిష్యుడు చిరంజీవి తోట వెంకటస్వామితో "జ్ఝు" అని టైపు చేయమన్నాను. ఏం చేస్తాను? మరో మార్గంలేదు కనపడలేదు మరి!

## గురువుగారి హాస్యప్రియత్వం:–

కోదండరామయ్యగారిలో అణువణువునా హాస్యప్రియత్వం కనబడేది. ఎంతో

సరదాగా ఛలోక్తులు విసురుతూ ఉండేవారు. ప్రతిసన్నివేశంలోనూ ఉండే హాస్యాన్ని వెలికి తీసేవారు. తనలోని లోపాలను కూడా గుర్తించి, హాస్యరసమిళితంగా చెప్పేవారు. దిగువ కొన్ని సంఘటలను తెలియజేస్తున్నాను:–

**1. "నాకు చిన్నప్పుడు లవ్ చేసే ఛాన్సు లేకుండా చేశాదు మానాన్న!":–** ఒకసారి మేము ఎవరెవరో ప్రేమికుల్ని గురించి మాట్లాడుకుంటున్నాము. అప్పుడు కో.రా.గారు "మానాన్న నాకు 18 ఏళ్ళు నిండకుండానే పెళ్ళి చేసేసి, నాకు ఏ అమ్మాయినీ ప్రేమించే ఛాన్స్ లేకుండా చేసిపారేశాడు" అన్నారు.

**2. "వీడయ్యా ధృతరాష్ట్రుడంటేను!":–** తిరుపతిలో కో.రా.గారి యిల్లు కపిలతీర్థం రోడ్డులో ఆంజనేయస్వామిగుడికి ఎదురుగా ఉండేది. వారి పెద్ద తమ్ముడిగారి కుటుంబం అవతలి వీథిలో ఉండేది. వాళ్ళ పెద్దతమ్ముడు తిమ్మావజ్ఝుల కృష్ణమూర్తిగారు ఫారెస్ట్ ఆఫీసర్. ఎక్కడో తూర్పుగోదావరి జిల్లాలోని 'పాడేరు'లో పనిచేస్తూ ఉండేవారు. పిల్లల చదువుల నిమిత్తం కుటుంబాన్ని తిరుపతిలో ఉంచేశారు. ఆ పిల్లలు తరచుగా వీరి యింటికి వచ్చి, వీళ్ళ పిల్లలతో ఆడుకుంటూ ఉండేవారు. ఒకసారి సాయంత్రం వాళ్ళ తమ్ముడిగారి అమ్మాయి వచ్చి "పెదనాన్నా! 10 రూపాయలియ్యి, మేం సినిమాకి వెళ్ళాలి!" అంది. కో.రా.గారు 10 రూపాయలిచ్చారు. (ఆ రోజుల్లో 10 రూ.లకి నలుగురైదుగురు హాయిగా సినిమాచూడవచ్చు!) తమ్ముని పిల్లలు సినిమాకి వెళ్ళిపోయారు. ఆ తరువాత నేను వెళ్ళాను గురువుగారిని చూద్దామని. అప్పుడు నాతో "సుబ్బారావ్! ఇందాక మా తమ్ముడి కూతురువచ్చి, సినిమాకి వెళ్ళడానికి 10 రూపాయలు తీసికొని వెళ్ళింది. డబ్బు ఇచ్చాను కాని, 'అయ్యో! ఈ రోజు నాకు 10 రూపాయలు పోయాయే' అని నా మనస్సు బాధపడింది. అయితే ఇలాగే సినిమాకోసం 10 రూ.లు మా పిల్లలకు ఇచ్చివుంటే, నా మనస్సు ఈ విధంగా బాధపడి ఉండేది కాదు. వీడయ్యా! ధృతరాష్ట్రుడంటేను!" అన్నారు. నేను ఆశ్చర్యపోయాను వారి ఆత్మవిమర్శను చూచి!

**3. మనసులో ధృతరాష్ట్రుడులేని రాయలసీమ రెడ్డిగారు:–** తరువాత చాలా ఏండ్లకు నేను ఉయ్యాలవాడ నారసింహారెడ్డిగారినిగురించి మరింత పరిశోధన చేయడానికి కర్నూలుజిల్లాలోని 'కోవెలకుంట్ల'కు వెళ్ళాను. అక్కడ నారసింహారెడ్డిగారి

వంశానికి చెందిన శ్రీ పేరా రామసుబ్బారెడ్డిగారిని చూచాను. ఆయన 'కుందేరు' ప్రక్కన తనకు ఉన్న 30 ఎకరాల పొలాన్ని నాకు చూపించారు. "మేము ఇద్దరు అన్నదమ్ములం. నాకు ఒకే ఒక్క కొడుకు. మా తమ్ముడికి ఇద్దరు కొడుకులు. మా అన్నదమ్ములం ఆస్తి పంచుకుంటే చెరొక 15 ఎకరాలు వస్తుంది. ఆ తరువాత మా అబ్బాయికి 15 ఎకరాలు వస్తుంది. మా తమ్ముని యిద్దరు పిల్లలకి ఒక్కొక్కనికి 7½ ఎకరాలు మాత్రమే వస్తుంది. నేను ఈ విభజనను ముందుగానే ఊహించి, మొత్తం ఆస్తిని (30 ఎకరాలను) మూడు వాటాలుగా చేసి, ఒక్కొక్కరికి 10 ఎకరాల చొప్పున మా అబ్బాయికి, మా తమ్ముడి పిల్లలు ఇద్దరికీ – మొత్తం ముగ్గురికీ సమానంగా పంచి వేశాను!" అన్నారు ఆ రెడ్డిగారు. నాకు గురువుగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి. "మనసులో ధృతరాష్ట్రుడు లేని" ఒక మహానుభావుణ్ణి చూసినందుకు ఎంతో ఆనందించాను. ఆ రెడ్డిగారిని మనసారా అభినందించాను.

**4. "రాళ్ళపల్లివారి ట్రిక్కులు":–** గురువుగారు, తిరుమల రామచంద్రగారు సన్నిహిత మిత్రులు. ఇద్దరూ కలిసి "పరిశోధన" అనే మంచి సాహిత్య పత్రికను నడిపినవారు. రామచంద్రగారు రాళ్ళపల్లివారికి దూరపు బంధువు కూడా. ఒకసారి తనతో రామచంద్రగారు చెప్పినట్టుగా ఇలా అన్నారు కో.రా. గారు: "రాళ్ళపల్లివారికి సంగీత సాహిత్యాలు రెండింటిలోనూ పరిచయం ఉంది. అయితే సంగీత విద్వాంసులు వచ్చినప్పుడు, వారితో సాహిత్య విషయాలు చర్చించేవారు. సాహిత్యవేత్తలు వచ్చినప్పుడు వారితో సంగీత విషయాలు చర్చించేవారు. ఆయన సాహిత్యంలో ఎంతో గొప్పవాడని సంగీత విద్వాంసులు, సంగీతంలో ఎంతో గొప్పవాడని సాహిత్యవేత్తలు భ్రమపడేవారు!"

"చేసిన కృషి తక్కువ; వచ్చిన కీర్తి ఎక్కువ – అయిన వారిలో నందూరి రామకృష్ణమాచార్యులుగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఉన్నా"రని మా గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు ఒకసారి నాతో అన్నారు. ఈ లిస్టుకి మరోపేరు కూడా చేర్చాలని ఇటీవల మిత్రులు శ్రీమల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తిగారు సూచించారు. ఆపేరే "కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు!"

రాళ్ళపల్లివారు చేసిన మరొక అసంబద్ధమైన ట్రిక్కును గురించి మా గురుదేవులు దిగుమర్తివారు నాతో చెప్పి బాధపడ్డారు. ఒకసారి, రాజమండ్రిలోని

ఒక ప్రసిద్ధ సాహిత్యసంస్థవారు ఆదికవి నన్నయభారతాన్నిగురించి ప్రసంగించ వలసిందిగా రాళ్ళపల్లివారిని ఆహ్వానించారు. ఆయన అక్కడకు వెళ్ళి, నన్నయను గురించి కాకుండా, తిక్కనను గురించి మాట్లాడి వెళ్లిపోయారట. పైగా నన్నయకన్నా తిక్కనగొప్పకవి అని – తమ ప్రాంతంవాడని నన్నయను ఎంతో అభిమానించే రాజమండ్రిలో చెప్పారట! శ్రోతలందరూ చాలా నిరుత్సాహపడ్డారు. "నేను నన్నయను గురించి మాట్లాడలేను; తిక్కనను గురించి మాత్రమే మాట్లాడగలను!" అని రాజమండ్రి సాహిత్యసంస్థకు ముందుగా తెలియజేయాలి కదా! అలా చేయకుండా, ఇలా చేయడమేమిటి? ఇది అసంబద్ధచర్య! రాళ్ళపల్లివారిని గురించి ఇలా చెప్పిన దిగుమర్తివారే, నేను 1961లో తిరుపతి వెళ్ళి తెలుగు ఎం.ఏ. లో చేరి వచ్చిన తరువాత వారు నాకు వేసిన మొట్టమొదటి ప్రశ్న: "రాళ్ళపల్లివారిని చూచావా?" అని. నేను "లేదు" అనగానే చాలా కోపపడి, "ఈసారి వెళ్ళినప్పుడు తప్పక చూడు! మరిచిపోకు! ఆయన గొప్ప విమర్శకుడు!" అన్నారు. నేను తరువాత తిరుపతిలో ఉన్నప్పుడు రాళ్ళపల్లి వారిని చాలాసార్లు కలిసి సాహిత్య విషయాలు చర్చించబోయాను. కాని ఆయన నాతో ఎక్కువగా సంగీతంలోని రాగతాళాల గురించే చర్చించారు!

1974లో (17.03.1974 నాడు) నేను మిత్రులు చన్నాప్రగడ తిరుపతిరావు గారు కలిసి, విశ్వనాథవారిని బెంగుళూరుకు ఆహ్వానించి, ఘనంగా సత్కరించాము. ఆ సత్కారసభలో పాల్గొనవలసిందిగా, బెంగుళూరులోనే తన పెద్దకొడుకు శ్రీఫణిశాయిగారి దగ్గర ఉన్న రాళ్ళపల్లివారిని ఆహ్వానించాము. వారు కోపంగా ముటముటలాడుతూ మొహంపెట్టి, "విశ్వనాథవారు నన్ను ఎన్నోసార్లు అవహేళన చేశారు. నేను రాను!" అన్నారు. మేము ఎంత బ్రతిమాలినా ఆయన రాలేదు. ఇలాగే మేము మైసూరు వెళ్ళి, మరో జ్ఞానపీఠ బహుమతి గ్రహీత ప్రొ।। కె.వి. పుట్టప్పగారిని (కువెంపు"గారిని) కూడా ఆహ్వానించాము. ఆయన "విశ్వనాథవారు తమ రచనలలో వర్ణాశ్రమధర్మాలను సమర్థిస్తారటగా! నేను రాను!" అన్నారు పెడసరంగా. బెంగుళూరులో విశ్వనాథవారి సన్మానసభ హడావిడి అంతా అయిన తరువాత, మర్నాడు విశ్వనాథవారు "రాళ్ళపల్లివారు ఈ ఊళ్ళో ఉన్నారట కదా! పదండి, ఓ సారి ఆయన్ని చూద్దాం!" అని ఎక్కడో జయనగర్లో ఉన్న రాళ్ళపల్లివారి

యింటికి వెళ్ళి, ఆయనతో ఎంతోసేపు, చాలా ఆప్యాయంగా సంభాషించారు. నేను అక్కడే ఉన్నాను. That is Viswanatha!

ఆ సన్మానసభలో గురువర్యులు కోదండరామయ్యగారు విశ్వనాథవారి సాహిత్యాన్ని గురించి జరిగిన సెమినార్లో పాల్గొని, రామాయణ కల్పవృక్షాన్ని గురించి చక్కని ప్రసంగం చేశారు.

**5. "నాకు మనసులో ఒక్కటే బాధయ్యా సుబ్బారావూ!":-** నేను గురువుగారితో కలిసి పరిశోధన చేస్తున్న రోజుల్లో భారత రాష్ట్రపతి పదవికి ఎన్నికలు జరిగాయి. మేమంతా "కాంగ్రెసు అభ్యర్థి నెగ్గితే బాగుండును" అనుకున్నాం. కాని అప్పటి కాంగ్రెసు ప్రభుత్వ ప్రధానమంత్రి పొడిచిన వెన్నుపోటువల్ల కాంగ్రెసు అభ్యర్థి ఓడిపోయాడు. స్వతంత్ర అభ్యర్థి నెగ్గాడు. మేం ఆశ్చర్యపోయాం! ఆ స్వతంత్ర అభ్యర్థికి గంపెడు పిల్లలు. ఆయన కుటుంబంలో కూతుళ్ళు, కొడుకులు, అల్లుళ్ళు, కోడళ్ళు, మనుమలు, మనుమరాండ్రు- ఇలా మొత్తం 30 మందిదాకా ఉండేవారు. అప్పుడు కోదండరామయ్యగారు మాతో "ఈయన నెగ్గితే నెగ్గాడు కాని, ఈయన కుటుంబపటాలమంతా వెళ్ళి ఆ రాష్ట్రపతిభవన్‌ను గలీజు చేస్తారయ్యా! దానిని తలచుకుంటే నాకు చాలా బాధగా ఉందయ్యా సుబ్బారావూ!" అన్నారు. మేమంతా పకపకా నవ్వాము.

**6. "ఇందులో భయపడటానికేముంది?":-** ఒకసారి నేను గురువుగారితో "అయ్యా! మన భారతదేశ చరిత్రలో రాజపుత్రులు, విజయనగర రాజులు, మహారాష్ట్రులు (ముఖ్యంగా రాణాప్రతాప్‌సింగ్, శ్రీ కృష్ణదేవరాయలు, ఛత్రపతి శివాజీ మొదలైనవారు) ముస్లింలను అడ్డుకున్నారు కాబట్టి సరిపోయింది. లేకపోతే మనమంతా ఈ పాటికి ముస్లిములం అయిపోయి ఉండేవాళ్ళం!" అన్నాను. దానికి కో.రా.గారు చమత్కారంగా: "ఇందులో భయపడటానికేముంది? ఇప్పుడు బొట్టుపెట్టుకొని భగవద్గీత చదువుతున్నాము. అప్పుడు గడ్డాలు పెంచుకొని ఖొరాన్ చదువుతాం అంతే!" అన్నారు.

**7. గురువుగారి తీరిన కోరిక:-** చాలాసార్లు కో.రా.గారు నాతో: "సుబ్బారావ్! మీ గోదావరిలో స్నానంచేసి, దాని ఒడ్డున కూర్చొని సంధ్యావార్చుకోవాలని ఉందయ్యా!" అనేవారు. ఆ కోరికను దృష్టిలో పెట్టుకొని ఒకసారి గురువుగారిని మా పశ్చిమ గోదావరిజిల్లాలో కొవ్వూరులోని గోపాదక్షేత్రానికి తీసికొనివెళ్ళాను.

ఆ రేవులోని మెట్లన్నీ దిగి వెళ్ళి స్నానంచేసి, ఆ మెట్లమీదే కూర్చొని భక్తితో సంధ్యవార్చుకుంటున్నారు కో.రా.గారు. నేను మెట్లపైకి వచ్చి గోదావరి ఒడ్డున, ఒక చెట్టుక్రింద కూర్చొన్నాను. ఎంత సేపటికీ గురువుగారు రావటం లేదు. నాకు భయమేసి, రేవులోని మెట్లు దిగి వెళ్ళాను. వారు నన్ను చూచి నవ్వుతూ: "పెద్దిబొట్ల సుబ్బరామయ్యగారి కథ 'నీళ్ళు'లో లాగ అయిందనుకున్నావా?" అన్నారు. ఆ రోజుల్లో "భారతి" మాసపత్రికలో పెద్దిబొట్లవారి "నీళ్ళు" కథ ప్రచురితమయింది. అందులో నీళ్ళకోసం కటకటలాడే జిల్లాలోని ఒక గ్రామంనుండి ఒక యువకుడు ఉద్యోగరీత్యా బెజవాడ వస్తాడు. అక్కడ కృష్ణానదిని, ఆ పట్టణంలోని నీటి సదుపాయాన్నీ చూచి చాలా ఆశ్చర్యపోతాడు. ఆఫీసులో ప్రతిరోజూ ఎంతో ఆప్యాయంగా కూజాలోని నీళ్ళు గ్లాసులోకి వంపుకొని, దానిని ఆనందంగా చూస్తూ, తాగుతూ ఉంటాడు. ఒక రోజు పొద్దున్నే కృష్ణలో స్నానంచేద్దామని వెడతాడు. ఆ నీళ్ళను చూచి ఆనందపరవశుడై, లోతుకి, ఇంకా లోతుకి వెడతాడు. నీళ్ళులేని ఊళ్ళోనివాడు కాబట్టి అతనికి ఈతరాదు. కృష్ణలో మునిగి చనిపోతాడు! గురువుగారు నీటికొరత ఉన్న రాయలసీమవాడు కదా! అందువల్ల అలా జోక్ చేశారు.

**8. "సొంత డబ్బా!":–** ఒకసారి నేను గురువుగారింటికి వెళ్ళి "ఆచంట జానకిరాంగారింటికి వెడదాం, వస్తారా?" అన్నాను. ఆయన విసుగ్గా: "ఉండవయ్యా! ఆయన ఎంతసేపూ తన డబ్బాయేకాని, మన డబ్బా వినిపించుకోడు! నేను రాను!" అన్నారు. నిజంగానే, జానకి రాంగారు సొంతడబ్బా బాగా వాయించుకొనేవారు. ఇక్కడ గురువుగారు "మన డబ్బా" అనడంలో గొప్పతనం ఉంది! నిజాయితీ ఉంది! (సొంత డబ్బాకొట్టుకోవడంలో మా మధ్యకోస్తాజిల్లావాళ్ళు సుప్రసిద్ధులు. జానకిరాంగారు పశ్చిమగోదావరిజిల్లావారు!)

**9. "కాకాపట్టడం:–** "చూడు సుబ్బారావ్! ఎంతసేపూ డిపార్టుమెంట్‌లో ప్రొఫెసర్‌కే కాదు, ఇంట్లో పెళ్ళానికి కూడా మనం కాకాపట్టాలోయ్! లేకపోతే పనులు జరగవు." అని పకపకా నవ్వేవారు.

**10. "మెదడుకి పదునుపెట్టడం":–** కో.రా.గారు సిగరెట్లు బాగా కాల్చేవారు. (ప్రొ.జి.యన్.రెడ్డిగారు కూడా పొగత్రాగే వారు. కేతు విశ్వనాథరెడ్డి ఈ కళలో ఇంకా ఆరితేరినవాడు!) "ఏమిటండీ! మీరు సిగరెట్లు కాలుస్తున్నారు?" అని నేను

ఒకసారి ప్రశ్నించాను. దానిని ఇలా సమర్థించుకున్నారు: “పొగత్రాగడంవల్ల మెదడు చాలా చురుగ్గా పనిచేస్తుందయ్యా! సిగరెట్లు బాగా కాల్చడం వల్లనే నార్ల వెంకటేశ్వరరావు మంచి మంచి సంపాదకీయాలు వ్రాయగలుగుతున్నాడు – ‘ఆంధ్రప్రభ’లో, తెలుసా?” అన్నారు కో.రా.గారు.

**11. “సవ్యసాచి”: –** హొసూరులో ఒక సాహిత్యసభలో ప్రసంగిస్తూ: “నేను ఒక చేత్తో ‘మనుచరిత్ర’ చదవగలను; ఇంకో చేత్తో ‘మరోచరిత్ర’ (సినిమాపై వచ్చిన) విమర్శకూడా చదవగలను!” అన్నారు.

**12. “వచనకవిత్వం చదువుతూ నీ నోరెందుకు పాడుచేసుకుంటావు?”: –** ఒకసారి, ఏదో సందర్భంలో ప్రాచీన సాహిత్యంలోని ఒక పద్యాన్ని కావ్యధోరణిలో అందంగా భావయుక్తంగా చదివాను. గురువుగారు ఎంతో సంతోషించారు. “సుబ్బారావ్! ఇంత అందంగా పద్యం చదువుతున్నావు కదా! ఈ నోటితో ఆ మాయదారి వచనకవిత్వం చదువుతూ నీ నోరెందుకు పాడుచేసుకుంటావు?” అని మందలించారు.

**13. “పేకేటి అసలు ఏడుపు!”: –** “పేకేటి శివరాం’ అనే చలనచిత్ర నటుడు, దర్శకుడు ఉండేవాడు. అతడు కన్నడంలో కూడా చాలా సినిమాలకు దర్శకత్వం వహించాడు. ఎంతో పేరు గడించాడు. సినిమానటి ‘జయంతి’ పేకేటి శివరాంగారి భార్య. తరువాత కొన్నేళ్ళకు జయంతి అతనిని వదిలివేసింది. ఆ సమయంలోనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్యగారు చనిపోయారు. తిరుపతిలో యూనివర్సిటీలో ఒక సంతాపసభ పెట్టారు. దాంట్లో పేకేటి శివరాం పాల్గొన్నాడు. తనకూ సంజీవయ్యగారికీ గల స్నేహాన్ని గురించి చెపుతూ, తట్టుకోలేక భోరున ఏడ్చేశాడు. గురువుగారు, మద్దూరి సుబ్బారెడ్డిగారు, నేను, అక్కిరెడ్డి ఆ సభలో ఉన్నాం. సభానంతరం గురువుగారు మాతో ఛలోక్తిగా “పేకేటి శివరాం, సంజీవయ్యగారు చనిపోయినందుకు ఏడవలేదయ్యా!; జయంతి తనను వదిలేసినందుకు ఏడ్చాడు! తెలుసా?” అన్నారు. మేమంతా కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నాం!

**14. “అతనే అన్నమయ్యగా మారిపోయాడయ్యా!”: –** ఎం.ఏ.లో మా సహాధ్యాయి శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు తరువాతికాలంలో అన్నమయ్య కళామందిరానికి, అన్నమయ్య ప్రాజెక్టుకు డైరెక్టరు అయ్యాడు. అప్పుడు

గురువుగారిని చాలాసార్లు తిరుపతికి ఆహ్వానించి అన్నమయ్యగురించి ఉపన్యాసాలిప్పించాడు. ఆ రోజుల్లో శ్రీనివాసులు జుట్టు పొడుగ్గా పెంచుకొని, నుదుటి మీద నిలువుగా ఎర్రటి నామం తీర్చిదిద్దుకొని, ధోతీకట్టుకొని, లాల్చీవేసుకొని, నాటకంలో వేషధారిలాగ గమ్మత్తుగా ఉండేవాడు. అతడు కోదండరామయ్యగారి పర్యవేక్షణలో అన్నమయ్యకీర్తనలను గురించి పరిశోధన చేయడానికి తన పేరు రిజిస్టరు చేయించుకున్నాడు. ఒకసారి గురువుగారు బెంగుళూరు వచ్చినప్పుడు, "ఎలా ఉన్నాడండి మన కామిశెట్టి శ్రీనివాసులు? అతని రిసెర్చి ఎంతవరకు వచ్చింది?" అని అడిగాను. "అతడు అన్నమయ్య ప్రాజెక్టుకు డైరెక్టరుకాదు; అతడే అన్నమయ్యగా మారిపోయాడయ్యా! ఇంక రిసెర్చి ఏమిచేస్తాడు?" అని చెప్పి, అతడి పొడుగాటి జుట్టును, నామాన్ని, వస్త్రధారణని వర్ణించి చెప్పారు.

**15. "మనం కానట్టు!":–** ఎవరైనా కారుడ్రైవరుకాని, బస్సుడ్రైవరుకాని యాక్సిడెంట్ చేస్తే, "ఆ డ్రైవరు త్రాగుబోతువెధవ! పీకలదాకా త్రాగి యాక్సిడెంట్ చేశాడు!" అని మనం తిడుతూ ఉంటాం. అప్పుడు గురువుగారు మెల్లగా "మనం కానట్టు!" అని పకపకా నవ్వేవారు. నేటి విద్యార్థికుల్లో 90% మద్యపానప్రియులే కదా! అని వారి ధ్వని!

**16. "మనం కూడా అలాగ...":–** ఆరోజుల్లో ఎస్వీ.యూనివర్శిటీ ఎకనామిక్స్ డిపార్టుమెంటులో ఒక గొప్ప ప్రొఫెసర్ ఉండేవాడు. (కేరళ రాష్ట్రంవాడు. పేరెందుకు లెండి!) ఆయన ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అర్థికశాస్త్ర ఆచార్యుడు. మహాద్భుతంగా పాఠంచెప్పేవాడు. కాని ఆయన మద్యపానప్రియుడు. ఒక రోజు యూనివర్శిటీకి వస్తూ, త్రాగినమైకంవల్ల సైడుకాలవలో పడిపోయాడు! దానిని చూచిన గురువుగారు, "సుబ్బారావ్! ఆ త్రాగుడులో అంత గొప్పమహిమ ఉంటుందంటావా? అంత గొప్ప ప్రొఫెసర్‌ని అలా సైడుకాల్వలో పడేసిందేమిటి? నిజంగా మద్యంలో అంత గొప్ప మహిమ ఉంటే, మనం కూడా దానిని సేవించి, అలా సైడుకాలవలో పడిపోవాలయ్యా!" అని గట్టిగా నవ్వేశారు!

**17. "రాముడు కూడా వాల్మీకిని మంచిచేసుకొని ఉంటాడయ్యా!":–** ఒకసారి గురువుగారు నాతో ఇలా చెప్పారు: "నేను మద్రాసులో ఒక కాలేజీలో పనిచేశాను. ఆ కళాశాల పాలకవర్గం అధ్యక్షుడు సకల 'దుర్గుణనిధి'. ఆయన తన కులంవాడైన

ఒక హరిదాసును రప్పించి, నెలరోజులు రామాయణం హరికథ చెప్పించాడు. ప్రతిదినమూ కథాప్రారంభానికి ముందు 10-15 నిమిషాలు ఆ అధ్యక్షుణ్ణి సకల సద్గుణ సంపన్నునిగా వర్ణించి చెప్పేవాడు ఆ హరిదాసు. వింటున్న వాళ్ళంతా మిక్కిలి ఆనందించేవారు! ఆ అధ్యక్షుని నిజస్వరూపం తెలిసిన నేను మాత్రం ఆశ్చర్యపోయే వాడిని! అప్పుడు నా మనసులో ఒకటి అనుకున్నానయ్యా! రాముడు కూడా వాల్మీకిని మంచిచేసుకొని, తనను సకల గుణాభిరామునిగా వర్ణించేట్లా చేసుకున్నాడేమో అని నా అనుమానం!" అని నవ్వేవారు!

**18. "శ్రీనాథుడు నడుస్తూ నడుస్తూ పద్యాలు చెప్పాడయ్యా!":-** గురువుగారికి తిక్కనకవిత్వంలోని తెలుగునుడికారం, పద్యశిల్పం, రచనలోని జిగిబిగి, నాటకీయత మొదలైనవి చాలా ఇష్టం. శ్రీనాథుని కవిత్వంలో ధారాశుద్ధి ఉన్నా, అది ఆశు కవిత్వంలా వదులుగా (లూజ్‌గా) ఉంటుందని శ్రీవారి అభిప్రాయం. "శ్రీనాథుడు నడుస్తూ నడుస్తూ పద్యాలు చెప్పాడయ్యా! అయన వెనకాలవస్తున్న శిష్యులు వాటిని వ్రాసుకుంటూ పోయారు! అంతే!" అనేవారు నవ్వుతూ.

**19. "మీరు నెల్లూరులో ఎందుకు ఉపన్యాసం చెయ్యరు?":-** "గురువుగారూ! మీరు ఆంధ్రదేశంలో అన్నిచోట్లా ఉపన్యాసాలు చేస్తారు. కర్ణాటకరాష్ట్రంలోనూ, తమిళనాడులోనూ కూడా ఉపన్యాసాలు చేస్తారు. కాని మీ నాన్నగారి స్వస్థలమైన నెల్లూరులో ఎందుకు ఉపన్యాసాలు చెయ్యరు?" అని ఒకసారి నేను ప్రశ్నించాను. అప్పుడు తన భయాన్నిగురించి వివరిస్తూ ఇలా సమాధానం చెప్పారు: "ఉండవయ్యా! మా నెల్లూరులో ఉన్న రెడ్లు, తిక్కన భారతం బాగా చదువుకున్నారు. కాని వారికి విమర్శను అభినందించే మనస్తత్వం లేదు. ఎంత సేపూ 'వాడు వీడికి ఏమవుతాడు? - వీడు వాడికి ఏమవుతాడు?' అని ప్రశ్నిస్తూ ఉంటారు. నేను మహాభారతాన్ని విమర్శదృష్టితో చెప్పగలనుకాని, ఆ పాత్రల బంధుత్వాలను గురించి ప్రశ్నిస్తే చటుక్కున చెప్పలేను. అందువల్ల నెల్లూరు మా వూరయినా అక్కడికి వెళ్ళను!"

**20. "నెల్లూరు కష్టమే ఎం.ఏ. క్లాసులో వచ్చిపడింది!":-** మాకు ఎం.ఏ. తరగతిలో తిక్కన స్త్రీపర్వం మహాద్భుతంగా పాఠం చెప్పారు కో.రా.గారు. ఒకసారి అందులో ఈ క్రింది పద్యాన్ని గద్యాన్ని విమర్శిస్తున్నారు:-

సందర్భం: సంజయుడు పుత్రశోకంతో దుఃఖిస్తున్న ధృతరాష్ట్రుని ఓదారుస్తున్నాడు:-

**ఆ.వె.** **"నీకు నితరులట్ల శోకింపఁదగునె? యె**
**వ్వరిఁ దలంచి యింక వనరువాఁడ**
**వీవు? శోకమునకు నెయ్యది తుది? యిది**
**వలవ, దుడుగు, వినుము, వసుమతీశ!"** (స్త్రీ. 1-6)

**వ. "పదునెనిమిది యక్షౌహిణులు సమసెఁ, బితామహ పితృ భ్రాతృ పుత్ర పౌత్ర సఖి సుహృత్సహాయులుందెగి, రందు వగపునకుం బనిగానివారలు గలరే? యేది కొలందిగా వగచె, దండఱకు నగ్నికార్యంబు నిర్వర్తింపను, దగినవారలకుం దిలోదక ప్రదానంబులు సేయను వలయుఁ, బొలిగలనికి వేంచేయు" మనుటయు** - (స్త్రీ. 1-7)

పై గద్యంలో "పితామహ, పితృ" అనే చోట, ధృతరాష్ట్రునకు "పితృ" (పితరుడు - తండ్రి) భీష్ముడు. ఆయన యుద్ధంలో కూలిపోయిన సంగతి అందరికీ తెలుసు. కాని కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొని, వీరస్వర్గమలంకరించిన ధృతరాష్ట్రుని పితామహుడెవరు? - అనే అనుమానం నా ప్రియమిత్రుడు శ్రీ ఎల్.బి. శంకరరావుకు వచ్చింది. నెల్లూరురెడ్డిగారిలాగే లేచి గురువుగారిని ప్రశ్నించాడు. ఆయన ఏమీ తోచక కాసేపు ఆగిపోయారు. "చూచి, రేపు చెపుతానయ్యా!" అన్నారు. మర్నాడు వచ్చి: "నాయనా! శంకరరావూ! నీ ప్రశ్నకు సమాధానం: ధృతరాష్ట్రుని పితామహుడు "బాహ్లికుడు". ఇతడు శంతనునికి తమ్ముడు; భీష్మునకు పినతండ్రి. ఇతడు కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొన్నాడు. భీమునిచేత చంపబడ్డాడు" - అని వివరించారు. భీష్ముని పితామహుడు "ప్రదీపుడు" లేక "ప్రతీపుడు". అతనికి ముగ్గురు కొడుకులు: (1) దేవాపి (2) శంతనుడు (3) బాహ్లికుడు. దేవాపి చిన్నతనంలోనే విరక్తుడై తపోవనాలకు వెళ్ళిపోయాడు. అందువల్ల రెండవ కుమారుడు శంతనుడు హస్తినాపురానికి ప్రభువయ్యాడు. బాహ్లికుడు బాహ్లికదేశానికి రాజయ్యాడు. అతని కొడుకు "సోమదత్తుడు"; మనుమడు "భూరిశ్రవుడు". బాహ్లికునితోపాటు అతని కొడుకు, మనుమడు కూడా కురుక్షేత్రసంగ్రామంలో పాల్గొని వీరమరణం పొందారు. బాహ్లికుడు, సోమదత్తుడు, భూరిశ్రవుడు మహావీరులు. వీరిని అధర్మంగానే చంపించాడు కృష్ణుడు.

**21. "ఊడగొట్టిన నాగలి":-** తాను అందరిమీదా ఛలోక్తులు విసరడం కాదు, ఎవరైనా తన మీద ఛలోక్తి వేస్తే కూడా, ఎంతో సహృదయంతో స్వీకరించి నవ్వేవారు కోదండరామయ్యగారు. తిరుపతిలో నేను పరిశోధన చేసే రోజుల్లో 1964 నుండి 1970 వరకూ దుంపా శ్రీరాములురెడ్డిగారి యింట్లో అద్దెకు ఉండేవాడిని. ఆయన కడపజిల్లావాడు. ఆయన మాటల్లో అడుగడుగునా రాయలసీమ మాండలిక పదాలు, నుడికారాలు, సామెతలు జాలువారుతూ ఉండేవి. ఆయన నాకూ, మా గురువుగారికీ మంచి మిత్రుడు. తిరుపతిలో కలపవ్యాపారం, రియల్ ఎస్టేటు వ్యాపారం చేసేవాడు. గురవుగారు మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో చేరిన కొత్తలో, ఆయన మదురైలో ఉంటే, వారి కుటుంబం పిల్లల చదువులకోసం తిరుపతిలో ఉంది కొన్నాళ్ళు. ఆ సమయంలో నేను ఒకసారి శ్రీరాములురెడ్డి గారితో: "మా గురువుగారు ఎక్కడో మదురైలో ఉన్నారు. వారి కుటుంబం తిరుపతిలో ఉండిపోయింది. ఎంతో అవస్థ పడుతున్నారు పాపం!" అన్నాను చాలా బాధగా. దానికి రెడ్డిగారు వెంటనే "ఊడగొట్టిన నాగలి ఎండలో ఉంటే ఏమిటి? నీడన ఉంటే ఏమిటి? స్వామీ!" అని ఒక రాయలసీమ సామెతను విసిరారు. ఇద్దరం నవ్వుకున్నాం. ఈ విషయం ఒకసారి గురువుగారితో చెప్పాను. ఆయన పడీ పడీ నవ్వారు-ఎంతో సేపు! ఏమీ కోపగించుకోలేదు. అదీ వారి గొప్పతనం! తన మీద జోక్ వేసినా హాయిగా నవ్వి ఆనందించేవారు.

**22. తీరని "అంకితం" కోరిక:-** "సుబ్బారావ్! నాకోపుస్తకం అంకితమియ్య వయ్యా!" అని చాలాసార్లు అడిగారు గురువుగారు. నేను "అలాగేనండి!" అంటూ వచ్చాను. ఏదైనా పుస్తకం ముద్రిద్దామంటే నాకు చేతిలో డబ్బులు ఉండేవికావు. చాలా ఏండ్లు గడిచిపోయాయి. అనుకోకుండా, హఠాత్తుగా 1981లో కో.రా.గారు స్వర్గస్థులయ్యారు. వారి కోరిక తీర్చలేకపోయినందుకు చాలా బాధపడ్డాను. తరువాత నేను 1983లో గుల్బర్గా విశ్వవిద్యాలయంలో 'కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్'గా ఉన్నప్పుడు, నా సిద్ధాంతగ్రంథంలోని రెండుప్రకరణాలను (శక్తికథాచక్రము -పలనాటి వీరకథాచక్రము) కలిపి, "తెలుగు వీరగాథాకవిత్వము -రెండవ సంపుటము" పేరుతో ప్రచురించాను. దానిని గురువుగారికి అంకితమిచ్చాను. వారినిగురించి ఆ పుస్తకంలో ఈ క్రింది అంకిత కవిత వ్రాశాను:-

## అంకితము

పండిత ప్రకాండులు
ప్రసిద్ధ పరిశోధకులు
నా నిరంతర శ్రేయోభిలాషులు
నా యీ సర్వతోముఖాభివృద్ధికి
ముఖ్యకారకులు
అయిన దేశికోత్తములు
ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి
దివ్యస్మృతికి.... భవ్యమనస్సుతో...

* * * * *

గురువర్యా!
నాది ఉత్తరం, మీది దక్షిణం
నాది తెలుగు, మీది తమిళం
అయినా, ఏమిటి యీ అనుబంధం!
మీరెవరు? నేనెవరు?
మీ మేనత్త కొడుకునా? మేనమామ కొడుకునా?
మీ వెన్నంటి పుట్టిన తమ్ముడనా?
మీ రక్తాన్ని పంచుకొన్న కన్నకొడుకునా?
ఏదీ కాదే!
ఎందుకు నన్ను ఇంతగా ప్రేమించారు?
మీ వాత్సల్య సుధాస్రవంతిలో
తలమున్కలు కావించారు?

మీరు చెప్పిన పనులన్నీ
భక్తి శ్రద్ధలతో చేశాను–
ఒక్క 'గుల్బర్గా' విషయం తప్ప!
అందుకే కాబోలు నామీద కోపం వచ్చి

చెప్పకుండా వెళ్ళిపోయారు!
ఎంత అన్యాయం చేశారు మేస్టారూ!

మీరు లేని ఈ లోకంలో
నా చుట్టూ శూన్యంతో కలిసి
క్రమ్ముకున్న చిమ్మచీకట్లు!
నాలో జీవం చచ్చిపోయింది!
ఉరకలు వేసే ఉత్సాహం
హరించుకు పోయింది!
నవ్వడం పూర్తిగా మరిచిపోయాను
మౌసలపర్వంలోని అర్జునుడులా
మిగిలిపోయాను!
దిగులు దిగులుగా భయం భయంగా
దిక్కుతెలియని శూన్యాన్ని కప్పుకొని
ఏదో బ్రతకలేక బ్రతుకుతున్నాను మాస్టారూ!
"సుబ్బారావూ! నాకో పుస్తకం అంకితమియ్యవయ్యా!"
అంటూ ఎన్నోసార్లు ఎంతో ఆప్యాయంగా అడిగారు.
మీరు బ్రతికుండగా
ఆ పని చేయలేకపోయిన అభాగ్యుణ్ణి!
ఇదిగో! ఇప్పుడిస్తున్నాను
స్వీకరించండి!
స్వర్గంనుండి నా శిరస్సుపై
మీ ఆశీస్సుల పూలవాన కురిపించండి!
మాస్టారూ!
ఒక్కటి మాత్రం గుర్తుపెట్టుకోండి –
ఎన్ని జన్మలకైనా
మీరే గురువు!
నేను శిష్యుణ్ణి !

**23. భరతవాక్యం:-** నా జీవితంలో గురువర్యులు తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు నన్ను ఎలా నడిపిస్తే అలా నడిచాను. కాని నాకు గుల్బర్గా విశ్వవిద్యాలయంలో కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్ ఉద్యోగం వచ్చినప్పుడు, వారు నన్ను వెళ్ళవద్దని ఆదేశించారు. అడ్మినిస్ట్రేషన్‌లో పడితే, అకడమిక్ వర్కు దెబ్బతింటుందని హెచ్చరించారు. కాని వారిమాట వినకుండా నేను వెళ్ళాను. అష్టకష్టాలూ పడ్డాను. 1983లో నేను తిరిగి బెంగుళూరు వచ్చేసరికి, ఇక్కడి ప్రొఫెసర్ పోస్టును కాస్తా బాడాల రామయ్యగారు ఆక్రమించుకున్నారు. మళ్ళీ నేను ప్రొఫెసర్ కావడానికి 1987 వరకూ వేచివుండవలసివచ్చింది.

గుల్బర్గా విషయంలో నేను గురువుగారి మాట వినకపోవడానికి దారితీసిన పరిస్థితులను ఇక్కడ తెలియజేస్తున్నాను. 1978-80 సంవత్సరాలలో నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో మెన్స్ హాస్టల్ ఛీఫ్‌వార్డెన్‌గా పనిచేశాను. విద్యార్థుల అల్లర్లవల్ల (ముఖ్యంగా దళితవిద్యార్థుల గొడవలవల్ల) నానా బాధలూ పడ్డాను. మనశ్శాంతి లేదు. దీనిని తప్పించుకొనేందుకు గుల్బర్గా వెళ్ళాను. పెనంమీదనుండి మండుతున్న పొయ్యిలో పడ్డట్టుగా అయింది నాపని! విశ్వవిద్యాలయాలలో ఉద్యోగాలు చేసే ఉపాధ్యాయులు జీవితంలో రెండు పనులు ఎట్టి పరిస్థితులలోను చేయకూడదు: (1) హాస్టల్ వార్డెన్‌గా ఉండటం (2) కంట్రోలర్‌గా కాని, రిజిస్ట్రార్‌గా కాని ఉండటం. ఈ ఉద్యోగాలు చేస్తే, షుగర్, బి.పి., హార్ట్ ఎటాక్ లు తప్పకుండా వస్తాయి! ఇది స్వానుభవంతో చెప్పేమాట!

అప్పటి (1971 నాటి) ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు గారిచ్చిన 3 లక్షల గ్రాంటువల్ల 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగులో స్నాతకోత్తర తరగతులు ప్రారంభమయ్యాయి. అప్పటినుండి 1980 వరకూ గురువుగారిని బోర్డ్ ఆఫ్ స్టడీస్ మెంబరుగా, బోర్డ్‌ఆఫ్ ఎగ్జామినర్స్ మెంబర్‌గా, ఎం.ఫిల్., పిహెచ్.డి. పరీక్షలకు ఎగ్జామినర్‌గా పిలిచాను; వారు వచ్చి నన్ను ఆశీర్వదించారు. చివరికి చనిపోవడానికి ఒక సంవత్సరం ముందుగా 1980లో గుల్బర్గా విశ్వవిద్యాలయానికి కూడా ఎగ్జామినర్‌గా వచ్చి, నా కంట్రోలర్ వైభవాన్ని చూచి ఆనందించారు! తమ ఆశీస్సులు అందించారు! (మదురై విశ్వవిద్యాలయంలో కూడా ఎందరో శిష్యుల్ని కన్నబిడ్డలకన్నా మిన్నగా ప్రేమించి, వారి హృదయాలలో దైవంగా ఆరాధింపబడ్డారు ఆచార్య కోదండరామయ్యగారు.)

చివరిగా చెప్పాలంటే సాక్షాత్తూ ఆ పరమేశ్వరుడే ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి రూపంలో వచ్చి, ఐదుగురు పిల్లలతో – నిరుద్యోగంతో – నిత్యదారిద్ర్యంతో బాధపడుతున్న నన్ను ఉద్ధరించి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఉద్యోగమిప్పించ్చి, నా జీవితం సాఫీగా సాగడానికి ముఖ్యకారకులయ్యారు! నేను జీవితంలో గడించిన కీర్తి ప్రతిష్ఠలన్నింటికీ కోదండరామయ్యగారి ఆశీస్సులే ప్రధానకారణాలు! ఆయన ఋణం ఈ జన్మలో తీర్చుకోలేకపోయాను! మరుజన్మలో మళ్ళీ ప్రయత్నిస్తాను!

(ఇది కలంతో వ్రాసిన వ్యాసం కాదు; నా గుండెతో వ్రాసిన వ్యాసం!)



## చెళ్లపిళ్ల చెణుకులు

ఆంధ్ర నాటక కళాపరిషత్తు పక్షాన 1948లో శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి విజయవాడలో సన్మానంజరిగింది. అప్పుడు వారు ఆస్థానకవి కూడా! వారు విజయవాడలోనే నివాసం ఉంటున్నారు. సన్మానసభ అయిపోయిన తర్వాత చెళ్ళపిళ్ళవారి శిష్యప్రశిష్యులంతా వారితో కలసి గ్రూప్ ఫోటో తీయించుకోవాలని ఉబలాటపడ్డారు. శాస్త్రిగారు అప్పటికి లేచి నడిచేస్థితిలో లేరు. మెల్లగా వారిని కుర్చీలో కూర్చోబెట్టి ఇంట్లోంచి బయటకు తీసుకువచ్చారు. చుట్టుప్రక్కల జనం చాలామంది పోగయ్యారు. “అయ్యోపాపం...! ఎప్పుడూ...?” అన్నారు కొందరు విచారం వ్యక్తంచేస్తూ.

“లేదు, లేదు, మేం గురువుగారితో ఫొటో తీయించుకుంటున్నాం” అని శిష్యులు వారికి నచ్చచెప్పి పంపించివేశారు. ఫొటోతీశాక శాస్త్రిగారికుర్చీని పల్లకిలాగా మోసుకుని లోపలికి వెళ్తుంటే “ఫర్వాలేదు, నేను పోయానని తెలిస్తే కనీసం ఒకవందమంది అయినా వస్తారన్నమాట!” అన్నారు ముసిముసి నవ్వులు నవ్వుతూ.

## బహుముఖ ప్రజ్ఞాశాలి, ఆచార్యులకు ఆచార్యులు

# 2. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు

**(1894–1972)**



తిరుపతి వేంకట కవులలో రెండవవారైన శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రియశిష్యులు పింగళి లక్ష్మీకాంతంగారు. పింగళి లక్ష్మీకాంతంగారి ప్రియశిష్యులు దిగువర్తి సీతారామస్వామిగారు. దిగుమర్తి సీతారామ స్వామిగారి ప్రియశిష్యుణ్ణి నేను. దిగుమర్తి వారి దగ్గర నేను 1952–54 మధ్య ఇంటర్మీడియేట్ (జనరల్ తెలుగు); 1955–57 మధ్య బి.ఏ. స్పెషల్ తెలుగు చదివాను. (బి.ఏ.లో ప్రముఖ రచయిత "ఉషశ్రీ'గారు, కవి, పండితుడు అయిన తమ్మన వెంకటేశ్వరరావుగారు నా సహాధ్యాయులు.) బి.ఏ. డిగ్రీ తరువాత, ఎం.ఏ. చదవడానికి నా ఆర్థిక పరిస్థితులు అనుకూలించక పోవటంవల్ల, నాలుగేళ్ళపాటు (1957–61) పోస్టాఫీసులో గుమాస్తాగా పనిచేశాను. తరువాత మా "బుల్లితమ్ముడు" (కర్నల్ టి.కె.మూర్తి) ఆర్థిక సహాయం చేయడంవల్ల, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో (1961 జూన్‌లో) తెలుగు ఎం.ఏ.లో చేరాను. నా పూర్వజన్మ సుకృతంవల్ల అక్కడికి 1961 డిసెంబరులో పింగళి లక్ష్మీకాంతంగారు ఆచార్యులుగా వచ్చారు. ఈ విధంగా నాకు దిగుమర్తివారి దగ్గర, వారి గురుదేవులైన పింగళివారి దగ్గర తెలుగుసాహిత్యాన్ని అధ్యయనంచేసే అదృష్టం కలిగింది! ఈ అదృష్టాన్ని మిత్రులు కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఎప్పుడూ మెచ్చుకుంటూ ఉండేవారు.

నేను పింగళివారి దగ్గర 1961–63లో తెలుగు ఎం.ఏ. చేశాను. అప్పుడు ప్రీవియస్‌లో "తెలుగు సాహిత్యచరిత్ర", "సంస్కృత వ్యాకరణం", "రఘువంశం" చెప్పేవారు పింగళివారు. ఫైనల్‌లో "సాహిత్య విమర్శ" బోధించేవారు. పింగళివారి పాఠప్రవచనం వినడం ఒక అపూర్వమైన అనుభవం! ఎంతో స్పష్టంగా, విద్యార్థుల

మనస్సుల్లో ఏమీ సందేహాలకు తావు లేకుండా, మనస్సుకు హత్తుకుపోయేలా పాఠం చెప్పేవారు. వారి పాఠం విన్నాక మళ్ళీ మనం చదువవలసిన అవసరం ఏమీ ఉండేది కాదు. తిన్నగా పరీక్ష హాలులోకి వెళ్ళి పరీక్ష వ్రాసెయ్యవచ్చును. అంతబాగా చెప్పేవారు పాఠం. అటువంటి ఉపన్యాసకుణ్ణి నా జీవితంలో నేను చూడలేదు!

నాకు చిన్నతనంలో, ఇంటర్మీడియేట్ అయిపోగానే (1954లో) పెండ్లి అయింది (మేనరికం). బి.ఏ. ఫైనల్ ఇయర్‌లో ఉండగా (1957లో) కొడుకు పుట్టాడు. నాలుగేళ్ళ విరామం తరువాత ఎం.ఏ.లో చేరేనాటికి (1961 నాటికి) నేను ముగ్గురు పిల్లల తండ్రిని! 1963లో ఎం.ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను. పిహెచ్.డి. చేయాలని ఎన్నాళ్ళనుండో నా కోరిక. ఈ విషయం పింగళివారికి విన్నవించుకున్నాను. ఆయన "వద్దుగాక వద్దు!" అన్నారు. "పిల్లలు గలవాడివి. వెంటనే ఏదైనా ఉద్యోగంలో చేరు. పరిశోధనలో పడితే అది తెమలదు. జీవితంలో దెబ్బతింటావు" అని నన్ను ఎన్నోసార్లు హెచ్చరించారు. ధృతరాష్ట్రుడు విదురనీతులు విననట్లుగా నేను గురువుగారిమాట వినలేదు. నక్షత్రకుడిలా వారిని వెంబడించాను; పీడించాను. ఏవిషయాన్ని గురించి రీసెర్చి చేయాలో ముందుగానే, గురువర్యులు, నా నిరంతర శ్రేయోభిలాషులు అయిన తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారితో చర్చించి ఉంచుకున్నాను. 1961లో పింగళివారు పరిష్కరించిన "పల్నాటి వీరచరిత్ర"ను విశాలాంధ్రవారు ప్రచురించారు. దానిమీద పరిశోధనచేస్తే బాగుంటుందని కోదండరామయ్యగారు సూచించారు. ఆ విషయాన్నే నేను అప్లికేషన్ ఫారంలో వ్రాసి ఉంచుకున్నాను. వరుసగా మూడు రోజులు పీడించాను పింగళివారిని. మూడవ రోజు, వారు అర్జంటుగా సెనేట్ మీటింగుకు వెడుతున్నారు. నేను వారి వెనకాలేపడ్డాను. ఇక చేసేది లేక "సరే ఇలా ఇయ్యి" అని అప్లికేషన్ తీసికొని "A Study of Palnati Veera Charitra" అనే సబ్జెక్టును కొట్టిపారేసి, "Ballad Poetry in Telugu" అని వారి స్వహస్తాలతో వ్రాసి, సంతకం చేసి, నాకు ఇచ్చారు. ఆనాటి వారి ఆశీస్సులతో నేను పరిశోధన చేయడం, బి. రామరాజుగారి తరువాత జానపద సాహిత్యవేత్తగా మంచి కీర్తిప్రతిష్ఠలు గడించడం సంభవించాయి. వారు మొదట చెప్పినట్టుగా నేను ఏ కాలేజీలోనైనా చేరివుంటే, వారు చెప్పినట్టుగా నా పెళ్ళాంపిల్లలు సుఖంగా ఉండేవారు, నిజమే! కాని, నేను

ఒక విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేసి ఉండేవాడిని కాను. నేనూ, పెళ్ళాం పిల్లలూ ఐదేళ్ళపాటు అష్టకష్టాలు పడినప్పటికీ చివరికి బెంగుళూరువంటి మహానగరంలో, విశ్వవిద్యాలయంలో మన తెలుగు స్నాతకోత్తరశాఖను స్థాపించి, దానికి అధ్యక్షుడనై పేరు గడించాను! తెలుగు భాషకు ఎంతో కొంత సేవచేయగలిగాను!

ఇక్కడ ఒక సెంటిమెంటును గురించి చెప్పాలి. నాకు గురువుగారు ఇచ్చిన పిహెచ్.డి. సబ్జెక్టు ("Ballad Poetry in Telugu") చాలా ఏండ్ల క్రిందట ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తన మరో శిష్యుడైన ఎఱ్ఱోజు మాధవాచార్యులవారికి ఇచ్చారట. ఆయన ఈ సబ్జెక్టుకి ఒక దండం పెట్టేసి పారిపోయి, నూజివీడు కాలేజీలో తెలుగు ఉపన్యాసకుడుగా చేరిపోయారు. ఈ విషయం నాకు తరువాత తెలిసింది. “దేవుడా! ఈ పరిశోధన పూర్తిచేసి, గట్టెక్కుతానా? లేదా?” అనే సెంటిమెంటుతో కొంతకాలం భయపడ్డాను. తరువాత ధైర్యంచేసి ముందడుగు వేశాను. (మాధవాచార్యులవారు ఏమైనా వీరగాథలు సేకరించారేమో అనే ఆశతో సంప్రదిస్తే, విషయసేకరణ ఏమీ జరగలేదని తెలిసింది.)

1952–54 మధ్య నేను భీమవరం కళాశాలలో బై.పి.సి. గ్రూపుతో ఇంటర్ చదివాను. సెకండ్ లాంగ్వేజ్‌గా తెలుగు చదివాను. (మా తమ్ముళ్ళిద్దరూ సంస్కృతం చదివారు. నేను మాత్రమే భాషాప్రవీణులైన మా అన్నయ్యగారి ప్రభావంతో తెలుగు చదివాను.) దానిని దిగుమర్తివారు బోధించేవారు. నేను తెలుగులో మంచి చురుకుగా ఉండేవాడిని. కవితలు కూడా వ్రాసి, వారికి చూపుతూ ఉండేవాడిని. ఇంటర్ తరువాత బోటనీ బి.యస్‌సి.లో చేరాను. ఒకరోజు కళాశాల ప్రాంగణంలో దిగుమర్తివారు ఎదురుపడ్డారు. “ఏం చేస్తున్నావయ్యా?” అని అడిగారు. “బోటనీ బి.యస్‌సి.లో చేరానండి!” అన్నాను. ఆయన వెంటనే “అదేమిటయ్యా! ఇలా చేశావు? నువ్వు తెలుగును ఉద్ధరిస్తావనుకున్నాను. బోటనీలో చేరావేమిటి?” అని ఆశ్చర్యపోయారు. ఆయన ముఖంలో ఎంతో నిరుత్సాహం కనపడింది. నేను ఏదో తెలియని ఆవేశంతో “అయితే రేపేవచ్చి తెలుగును బి.ఏ.లో చేరుతానండి!”అనేశాను. ఆయన ఎంతో సంతోషించారు. చెప్పినట్టుగానే స్పెషల్ తెలుగుతో బి.ఏ.చదివాను. కాని అప్పుడప్పుడు నా మనస్సులో– “నేనేమిటి? తెలుగును ఉద్ధరించడమేమిటి?” అనుకొనేవాడిని.

1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో, అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రియైన పి.వి. నరసింహారావు గారిచ్చిన మూదులక్షల గ్రాంటుతో తెలుగు స్నాతకోత్తరశాఖను స్థాపించగలిగిన తరువాత దిగుమర్తివారు అన్న "ఉద్ధరించడం" అనే మాటకు అర్థం తెలిసింది. గురువాక్కు అమోఘం కదా!

1961లో నేను తిరుపతిలో ఎం.ఏ.లో చేరాననీ, పింగళివారు మాకు ఆచార్యులనీ నేను చెప్పగానే ఎంతో సంతోషించారు దిగుమర్తివారు. అంతేకాదు, నన్ను గురించి మంచిగా చెపుతూ పింగళివారికి ఒక లేఖ వ్రాశారు. ఆ లేఖవల్ల పింగళివారు నన్ను ప్రత్యేకంగా అభిమానించేవారు. నా గరుదేవులు దిగుమర్తివారు, వారి గురుదేవులు పింగళివారు నన్ను ఆశీర్వదించడం వల్ల, నాలో సాహిత్యాభిరుచి ఎంతో పెరిగి, ఇంతవాడినయ్యాను! లేకపోతే ఏ పాతాళంలోనో ఉండిపోయేవాడిని!

పింగళివారి శిష్యరికంలో నేను 1961–63 మధ్య తెలుగు ఎం.ఏ., 1963–65 మధ్య తెలుగు వీరగాథలను గురించిన పిహెచ్.డి. పరిశోధన చేశాను. 1965లో పింగళివారు రిటైరయ్యారు. తరువాత కూడా వారు 1971 వరకూ తిరుపతిలోనే ఉండిపోయారు. నేను 1965–68 మధ్య ఆచార్య జి.యన్.రెడ్డిగారి మార్గదర్శకత్వంలో పరిశోధన పూర్తిచేశాను. 1969లో డిగ్రీ వచ్చింది. అదే సంవత్సరం డిసెంబరు నెలలో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకుడుగా ఉద్యోగం వచ్చింది. 1970లో కుటుంబంతో సహా బెంగుళూరు వెళ్ళిపోయాను. కాబట్టి 1961 నుండి 1970 వరకూ తొమ్మిదేళ్ళపాటు పింగళివారితో ఉన్నానని చెప్పవచ్చును.

పింగళివారి నడకలో, ప్రవర్తనలో ఒక విధమైన రాజఠీవి కనబడేది. మాటలో ఎంతో గాంభీర్యం ఉండేది. శిష్యుల్నికన్నబిడ్డల్లా ప్రేమించేవారు. చేతనైనంత సహాయం చేసేవారు. మా మిత్రుడొకడు, పింగళివారికి ముందున్న ప్రొఫెసర్ వల్ల, నానా బాధలూ పడ్డాడు. Pre-Ph.D. పరీక్షలో ఫెయిలయ్యాడు. అతడు తెలివి తక్కువవాడు కాదు. మంచి పండితుడు, కవి. కాని కావాలని అతన్ని ఫెయిల్ చేశారు. అతడు వచ్చి పింగళివారిని ఆశ్రయించాడు. వృద్ధాప్యంలో వారికి నిజంగా కన్నకొడుకులాగే సేవచేశాడు. అందరూ అతన్ని ఆయనకొడుకనే అనుకునేవారు. పింగళివారు అతనికి ఎంతో సహాయం చేశారు. Ph.D. డిగ్రీ ఇచ్చారు. ఒక సిండికేట్ మెంబరుతో చెప్పి, అనంతపురం పి.జి. సెంటర్‌లో

ఉద్యోగం ఇప్పించారు. తరువాత అతడు మద్రాసు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా, శాఖాధ్యక్షుడుగా పనిచేసి పేరు ప్రతిష్ఠలు గడించాడు. అతడు తిరుపతిలో ఉన్న రోజులలో, నేను మిత్రుడు శంకరరావూ గురుశుశ్రూషలో అతనిని మించిపోవాలని శతవిధాల ప్రయత్నించి ఘోరంగా విఫలమయ్యాం. పింగళివారు ద్రోణుడు; అతడు అర్జునుడు! నేనూ శంకరరావూ కర్ణదుర్యోధనుల్లా మిగిలిపోయాం!

1931లో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బి.ఏ. ఆనర్సు తెలుగు తరగతులను ప్రారంభించి, ఈ కోర్సుకు ఒక ప్రణాళికను సిలబస్‌ను ఏర్పాటు చేసి, 1949 వరకూ ఎందరో శిష్యులను తయారుచేసి, ఆంధ్రదేశం నలుమూలలకూ పంపించి, తెలుగుసాహిత్యానికి, తెలుగుఉపన్యాసకులకు ఒక విధమైన గౌరవాన్ని పలుకుబడిని కలిగించిన దేశికోత్తముడు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు. మా చిన్నతనంలో ఆంధ్రదేశంలో అన్ని కళాశాలల్లోనూ పింగళివారి శిష్యులే ఉండేవారు. వారు తిరుపతి వచ్చాక, ఒకసారి నేను వారితో "మీరు మహాభారతంలో ద్రోణుని వంటివారు. కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొన్న వీరులందరూ ద్రోణుని శిష్యులే! అలాగే ఈనాడు ఆంధ్రదేశంలో అన్ని కళాశాలల్లోనూ మీ శిష్యులే ఉన్నారు!" అన్నాను. అప్పుడు ఆయన నవ్వుతూ "అవునవును, నేను ద్రోణుడనే! కాని నాకు ధృష్టద్యుమ్నుడులాంటి శిష్యులుకూడా ఉన్నారు. ఆ సంగతి మరచిపోవద్దు!" అన్నారు. నేను నోరు వెళ్ళబెట్టాను! తన దగ్గర చదువుకొని, తనకే శఠగోపంపెట్టిన శిష్యులు ఆయన మదిలో మెదిలి ఉంటారు.

నేను తిరుపతిలో ఎం.ఏ. (తెలుగు)లో చేరాననీ, పింగళివారు మాకు ప్రొఫెసరుగా రాబోతున్నారనీ భీమవరం వెళ్ళి, గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారితో ముందుగానే చెప్పాను. వెంటనే ఆయన ఒక హెచ్చరిక చేశారు: "తిక్కనగురించి చెప్పేటప్పుడు ఆయనకు 'పూనకం' వస్తుంది. నువ్వు ఆ పూనకంలో పడి కొట్టుకు పోవద్దు. నీ సొంత అభిప్రాయాలు నువ్వు ఏర్పరచుకో!"

పింగళివారు ఎప్పుడూ అందరికవులకన్నా తిక్కనను ఎక్కువచేసి మాట్లాడేవారు. అలాగే విశ్వనాథవారు అన్ని సభలలోనూ నన్నయను అతివేలంగా పొగిడేవారు. (తిక్కన నియోగి కావడం, నన్నయ వైదికి కావడం దీనికి కారణం కావచ్చు. విమర్శకుడు ఎల్లవేళలా సమచిత్తంతో విమర్శ చేయాలి. తన విమర్శలోకి కులభేదాలను, శాఖాభేదాలను ప్రవేశపెట్టకూడదు.) దీనిని గురించి దిగుమర్తివారు

ఒకసారి నాతో ఇలా అన్నారు: "చూడు సుబ్బారావ్! పింగళివారు ఎప్పుడూ తిక్కనను పొగుడుతూ ఉంటారు. విశ్వనాథవారు ఎప్పుడూ నన్నయను పొగుడుతారు. కాని పింగళివారు నన్నయలాగ, విశ్వనాథవారు తిక్కనలాగ పద్యాలు వ్రాస్తారు. గమనించావా ఈ విచిత్రం?" గొప్ప విమర్శకుడైన దిగుమర్తివారు కూడా ఒకొక్కప్పుడు ఈ శాఖాభేదాన్ని కవులపై చూపించేవారు. నిగమశర్మోపాఖ్యానం పాఠంచెపుతూ నాతో "తెనాలి రామకృష్ణుడు మావాడయ్యా!" అన్నారు సగర్వంగా. దిగుమర్తివారు శుక్లయజుర్వేదులు, ప్రథమశాఖవారు. తెనాలి రామకృష్ణుడూ అదేశాఖ! కాని, అందరి కవులకన్నా శ్రీనాథుడంటే దిగుమర్తివారికి చాలా ఇష్టం.

కవులలోను, కళాకారులలోను ఏదో ఒక దురభ్యాసం ఉంటుంది. పింగళివారు చుట్టలు కాల్చేవారు. రోజస్తమానం కాదు; ఉదయంపూట కాలకృత్యాలు తీర్చుకొనే సమయంలో ఒక్క చుట్ట కాల్చేవారు. (వీరి జంటకవి కాటూరి వెంకటేశ్వరరావుగారు ఎల్లవేళలా కాల్చేవారు). నేను గోదావరి జిల్లావాడిని. గోదావరి మధ్యలో లంకలు ఉంటాయి. అక్కడ పొగాకు పండిస్తారు. ఆ పొగాకుతో చుట్టిన చుట్టలు మంచి ఘాటుగా బాగుంటాయని చెప్పుకుంటారు. అప్పుడు తణుకులో నా బాల్యమిత్రుడు "బత్తుల ఆంజనేయులు" పొగాకు వ్యాపారం చేసేవాడు. నేను అతనితో చెప్పి, మంచి "లంకపొగాకు చుట్టలు" సన్నగా నాజూకుగా చుట్టించి, ఒక డబ్బాలో పెట్టి, 'పరిమళం' చెడిపోకుండా గట్టిగా మూతపెట్టి, తిరుపతి తీసికొని వచ్చి, భక్తితో గురువుగారికి సమర్పించుకొనేవాడిని! ఆయన చాలా సంతోషించేవారు.

పూర్వం పల్లెలలో నియోగులు మీసాలు పెంచుకొని చుట్టలు కాల్చేవారు; వైదికులు మీసాలు తీసివేసి ముక్కుపొడుం పీల్చేవారు! నిజానికి రెండూ దురభ్యాసాలే! అలాగే పేకాటకూడా గురువుగారికి చాలా ఇష్టం. (వీరి జంటకవి కాటూరివారు ఇందులో 'ఘనపాఠీ'!) అదేమిటో, ఎవ్వరూ లేకుండా, ఒక్కరే కూర్చొని ఆడుకుంటూ ఉండేవారు. తన ముక్కలు, ఎదుటివాడి ముక్కలు ఆయనే వేసి ఆడుతూ ఉండేవారు. (దీనిని 'పాతాళం' అంటారట!) మాతో సాహిత్య విషయాలు చర్చిస్తూనే, తన ఆట తాను కొనసాగిస్తూ ఉండేవారు. ఒకసారి "ఆశుకవి చక్రవర్తి" - "అవధాని శేఖర" బులుసు వెంకట రామమూర్తిగారు పింగళివారి యింటికి వచ్చి "ఇదేమిటీ? మీలో మీరే ఇలా ఆడుకుంటున్నారు?" అని ప్రశ్నించారు. పట్టరానికోపంతో, తోకత్రొక్కిన త్రాచుపాములా లేచారు గురువుగారు ఆయనమీదికి!

ఆయన కుక్కిన పేనులా ఊరకుండిపోయాడు పాపం!

పింగళివారి మొత్తం 78 ఏండ్ల జీవితాన్ని పరిశీలిస్తే, నాకు వారిలో ఏడు ప్రత్యేకమైన దశలు గోచరించాయి. అవి (1) స్వగ్రామదశ; (2) బందరుదశ; (3) మద్రాసుదశ; (4) విశాఖపట్టణందశ; (5) విరామదశ; (6) విజయవాడ దశ; (7) తిరుపతిదశ. (ఇక్కడ "దశ" అంటే "జీవితకాలము" లేక "స్థితి" అని అర్థం).

**(0) వంశచరిత్ర:**

"పింగళి" అనే గ్రామం మహారాష్ట్రలో ఉంది. అక్కడ "పింగ్లి" అనే రైల్వేస్టేషను, "ఇంద్రవాణి" అనే నది (దీనికి "పింగళిగడ్డ" అనే పేరు), ప్రాచీనమైన పింగళేశ్వర దేవాలయం ఉన్నాయి. తరువాత పింగళివారు హైదరాబాద్, వరంగల్లు, నల్లగొండ, పానుగల్లు ప్రాంతాల్లో స్థిరపడ్డారు. ఈ వంశంలో ఎందరో మహామహులు పుట్టారు. 12వ శతాబ్దానికి చెందిన మల్లికార్జున పండితారాధ్యుణ్ణి సత్కరించిన పింగళి గోవిందమంత్రి (పానుగల్లు); 16వ శతాబ్దానికి చెందిన ప్రసిద్ధకవి పింగళి సూరన; 17వ శతాబ్దానికి చెందిన అక్కన్న-మాదన్న (వీరి మేనల్లుడే "రామదాసు" - కంచర్లగోపన్న); ఈ 17వ శతాబ్దానికే చెందిన ఛత్రపతి శివాజీకి ప్రధానమంత్రియైన "మోరోపంత్ పింగళె"; 19వ శతాబ్దంలో ఈయన మునిమనుమడు "మోరోపంత్ త్రయంబక్ పింగళె"; (ఇతని భార్య భాగీరథీబాయి), ఈతని కుమార్తె ఝాన్సీలక్ష్మీబాయి; 20వ శతాబ్దంలో జాతీయపతాకకర్త పింగళి వెంకయ్య, డా.పింగళి నాగేశ్వరరావు, పింగళి నాగేంద్రరావు (సినీ రచయిత) మొదలైన వారందరూ పింగళివంశంలోని మహానుభావులు. ఈనాడు పింగళివంశానికి చెందిన కుటుంబాలు కృష్ణా, గుంటూరు, హనుమకొండ-వరంగల్లు ప్రాంతాలలో ఉన్నాయి.

**(1) స్వగ్రామదశ (1894-1907=13 సం.లు)**

కృష్ణాజిల్లా దివిసీమలో "చిట్టూర్పు" అనే గ్రామం ఉంది. ఇక్కడ స్థిరపడిన పింగళివారి వంశంలో "పింగళి వెంకటరత్నంగారు" ఒకరు. ఈయన బందరు తాలూకాలోని "అర్తమూరు" గ్రామానికి చెందిన మోచర్లవారి ఆడుపడుచు "కుటుంబమ్మ"గారిని పెండ్లి చేసుకున్నారు. ఈ దంపతులకు ముగ్గురు కొడుకులు,

ఒక కూతురు. కొడుకులు "నరసయ్య, లక్ష్మీకాంతం, వీరయ్య"; కూతురు "సుందరమ్మ". లక్ష్మీకాంతంగారు 1894 జనవరి 10వ తేదీనాడు అర్తమూరులో మాతామహుల యింట జన్మించారు. చిట్టూర్పు వీథిబడిలో 5వ తరగతివరకూ చదువుకున్నారు. మొదటి ఫారం (6వ తరగతి), రెండవ ఫారం (7వ తరగతి) రేపల్లెలో చదివారు. తరువాత హైస్కూలు చదువుకోసం (మూడవ ఫారం నుండి ఎస్.ఎస్.ఎల్.సి. వరకు) బందరు వెళ్ళవలసివచ్చింది. ఈ స్వగ్రామదశ 13 సం.లు జరిగింది.

**(2) బందరుదశ (1907-1927=20 సం.లు)**

బందరు హిందూ హైస్కూలులో శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు తెలుగు పండితులు. పింగళివారు శాస్త్రిగారికి శుశ్రూషచేసి, కవితాశక్తిని, అవధానయుక్తిని సంపాదించారు. 5వ ఫారంలో ఉండగా లక్ష్మీకాంతంగారి తండ్రిగారు చనిపోయారు. ఆర్థికపరిస్థితి దెబ్బతిన్నది. అయినా బందరులోని కొందరు పెద్దల సహాయసహకారాలతో S.S.L.C.; F.A.; B.A.లు పూర్తిచేయ గలిగారు. వీరి కళాశాలవిద్య బందరు నోబుల్ కాలేజీలో జరిగింది. బి.ఏ.లో ఉత్తీర్ణుడైన పిమ్మట, నోబుల్ హైస్కూలులో తెలుగు పండితుడుగా నియమింపబడ్డారు.

1912లో లక్ష్మీకాంతంగారికి పెండ్లి అయింది (మేనరికం). అప్పుడు ఆయన వయస్సు 18 ఏండ్లు; పెండ్లి కూతురు లక్ష్మీనరసమ్మగారి వయస్సు 11 ఏండ్లు. ఈ పుణ్యదంపతుల కుమారులు: శ్రీ వెంకటరత్నం, శ్రీ సూర్యసుందరం, డా. శ్రీనివాస్; కుమార్తెలు: శ్రీమతి తులశమ్మ, శ్రీమతి అలమేలు.

1917లో పింగళివారికి, చెళ్ళపిళ్ళవారి మరొక శిష్యుడైన కాటూరి వెంకటేశ్వర రావుగారితో పరియమయింది. ఇద్దరూ కలిసి జంటకవిత్వం చెప్పాలనుకున్నారు. బందరు బుట్టయ్యపేటలోని శ్రీ సీతారామస్వామివారి కోవెలలో, ఆంజనేయస్వామి సన్నిధిలో కూర్చుండి 50 రోజులలో ఆశువుగా ఒక శతకం పూర్తిచేశారు. తరువాత "తొలకరి" అనే ఖండకావ్యం; "సౌందరనందము" అనే కథాకావ్యం రచించారు. సౌందరనందం వీరికి గొప్ప కీర్తిని తెచ్చింది. దీనిని తమ గురువుగారి షష్టిపూర్తికి (1932లో) వారికి అంకితం చేశారు. దీని రెండవ ముద్రణలో పింగళివారు వ్రాసిన పద్యం:

**ఉ॥ "బంధువు, లేకమానసులు, బాల్యసఖుల్, సహపాఠులున్, సమ**
**స్కంధులు, పింగళాన్వయుఁడు కాంతుఁడు, కాటురి వేంకటేశుఁడున్**
**సుందరనంద రాగరస శోభిత వృత్తము, రమ్యతత్త్వ మీ**
**సౌందరనంద సత్కృతిని సల్పిరి దేశికుఁడిచ్చమెచ్చగన్!"**

తరువాత కాటూరివారు విడిగా "పౌలస్త్య హృదయము" – "గుడిగంటలు" అనే కావ్యాలు వ్రాశారు. లక్ష్మీకాంతంగారు కూడా విడిగా "మధుర పండితరాజము" – "ఆత్మలహరి" అనే కావ్యాలు వెలువరించారు. చిన్నతనంలో – అంటే హైస్కూలు దశలో పింగళి – కాటూరి కవులిద్దరూ కలిసి అష్టావధానాలు, శతావధానాలు కూడా చేశారు. తరువాతి రోజులలో కాటూరి వెంకటేశ్వరరావుగారు తరచుగా మద్రాసు వెళ్ళి, ప్రముఖ భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారితో మిక్కిలి స్నేహంగా ఉండేవారు. వీరిస్నేహం పింగళివారికి నచ్చేది కాదు. తమ అసంతృప్తిని ఒకసారి నా దగ్గర వెలిబుచ్చారు.

పింగళి లక్ష్మీకాంతంగారు కవి మాత్రమే కాదు, గొప్ప నటుడు. గురుదేవులు చెళ్ళపిళ్ళవారి ఆశీస్సులతో పాండవోద్యోగవిజయాలలో ధర్మరాజుపాత్ర వేసి, చాలా గొప్పగా మెప్పించారు. (వీరి అన్నగారు నరసయ్యగారు భీముని పాత్ర అత్యద్భుతంగా పోషించేవారట.) పింగళివారు ఇతర నాటకాలలో కూడా వివిధ నాయక పాత్రలు సమర్థవంతంగా పోషించేవారు. పింగళివారి నటనాకౌశలాన్ని గురించి ప్రశంసిస్తూ పురాణం సూరిశాస్త్రిగారు తన "నాట్యాంబుజం" అనే గ్రంథంలో ఇలా వ్రాశారు: "రసభావయుక్తముగ, నుచితమగు సంగీతముతో, శ్రవణానందముగ పద్యము చదువనేర్చినవాడు లక్ష్మీకాంతమే....(ఇతడు) ధర్మరాజునందలి నిజస్వభావమును చక్కగా గ్రహించియున్నాడు. ధర్మరాజు గుణాభినయములో లక్ష్మీకాంతమును మించిన నటుడు లేనేలేడు".

పింగళివారు, దేవగాంధారి, మోహన, కేదారగౌళ రాగాలు బాగా పాడేవారట. ఒకసారి (1920లో) రాజమహేంద్రవరంలో పాండవోద్యోగ విజయాలు నాటకం ఆడుతున్నారు. ఆ సభలో వ.సు.రాయకవి (వడ్డాది సుబ్బారాయకవి) గారు ఉన్నారు. ఆయన తాను రచించిన వేణీసంహారం నాటకంలో ధర్మరాజుపాత్ర ధరించేవారు. పింగళివారి ధర్మరాజుపాత్రపోషణ చూచి, ఆశ్చర్యచకితులై "ఎవరు నాయనా నీవు?" అని ప్రశ్నించారు. వెంటనే ఆశువుగా

ఇలా ఒక పద్యం చెప్పారు లక్ష్మీకాంతంగారు:

**ఉ. "వీరరసావతారుడని విశ్రుతికెక్కిన నాటకుండు వా**
**క్ప్రౌరుఁడు మా నృసింహునకు కూరిమి తమ్ముఁడ, హాస్య శోక శృం**
**గార రసప్రధానముల నాయక వేషధరుండ, సత్కవిన్,**
**పేరునకేను కాంతుడ, పవిత్రపు పింగళివంశజాతుఁడన్!"**

కవిగా, అష్టావధానిగా, ఉపాధ్యాయుడుగా, నటుడుగా బందరులో 20 సం.లు గడిపారు లక్ష్మీకాంతంగారు. తరువాత మద్రాసు విశ్వవిద్యాలయంలో Research Fellow గా చేరారు.

**(3) మద్రాసుదశ (1927-1931=4 సం.లు)**

1927 ప్రాంతంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో కోరాడ రామకృష్ణయ్య గారు తెలుగు ప్రొఫెసరుగా ఉండేవారు. ఆ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా "ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం" (Oriental Manuscripts Library) ఉండేది. ఇది తెలుగు ప్రొఫెసరుగారి పర్యవేక్షణలో ఉండేది. కోరాడవారు తనకు సహాయంగా ఒక పరిశోధకుడు కావాలని అన్వేషిస్తున్నారు. వేమవరపు రామదాసుపంతులుగారు లక్ష్మీకాంతంగారి పేరును వారికి సూచించారు. విశ్వవిద్యాలయాధికారులు పింగళివారికి లేఖ వ్రాశారు. 20 సం.లుగా ఉన్న, ఎంతో పలుకుబడి సంపాదించుకున్న బందరును వదలి వెళ్ళాలా? వద్దా? అనే మీమాంసలో పడ్డారు లక్ష్మీకాంతంగారు. చివరికి నోబుల్ కాలేజీ ప్రిన్సిపాల్ జాన్‌స్టన్‌గారి ప్రోత్సాహంతో మద్రాసు వెళ్ళారు. ఈ సంఘటనే పింగళివారి భావిజీవితానికి బంగారుబాటలు వేసింది.

ఫెలోషిప్ పరిశోధనలోని ముఖ్యాంశం మహాభారతానికి సంబంధించిన వివిధప్రతుల అధ్యయనం. తంజావూరులోని సరస్వతీ మహల్ లైబ్రరీలోని వ్రాత ప్రతులను కూడా పరిశీలించారు. ఒకవైపు రీసెర్చిపని చేస్తూనే, మరోవైపు మద్రాసు విశ్వవిద్యాలయంవారి ఎం.ఏ. పరీక్షకు సిద్ధమైనారు. తెలుగు, సంస్కృత భాషలు తీసికొని M.A.(Languages) లో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై, మొదటిర్యాంకు, స్వర్ణపతకం గెలుచుకున్నారు. తరువాత పింగళి సూరన రచించిన "ప్రభావతీ ప్రద్యుమ్నము -మూలములు" అనే అంశాన్ని గురించి పరిశోధన చేసి, M.A.

(Hons.) డిగ్రీని కూడా తీసుకున్నారు. దీనిని మద్రాసు విశ్వవిద్యాలయంవారు ప్రచురించారు.

రెండున్నర సంవత్సరాల తరువాత ఫెలోషిప్ అయిపోయింది. అయినా లక్ష్మీకాంతంగారు మద్రాసు విడిచిపెట్టకుండా అక్కడే ఉండి, ఎన్నో కష్టాలు పడి, సాహిత్యరంగంలో ఎంతో కృషిచేశారు. "History of England" అనే ఆంగ్లగ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. దీనిని Indian Publishing House వారు ప్రచురించారు (1931). తరవాత ఇది పాఠ్యగ్రంథమయింది. ఈ కాలంలోనే పింగళివారు కాళిదాసుని మేఘసందేశాన్ని ఆంధ్రీకరించాలనుకున్నారు. కాని మానవల్లి రామకృష్ణకవిగారు అశ్వఘోషుని "సౌందరనందం" అనువదించుమని సలహా ఇచ్చారు. మూలంలోని అలౌకిక సంఘటనలను తీసివేసి, కాటూరివారితో కలిసి, దానిని ఒక రసరమ్యమైన స్వతంత్రకావ్యంగా రూపొందించాలని సంకల్పించారు పింగళివారు.

ఇంతలో విశాఖపట్టణంలోని ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో తెలుగులో బి.ఏ. (ఆనర్సు) కోర్సులు ప్రారంభించారు. ఇంటర్మీడియేట్ తరువాత మూడు సంవత్సరాలు చదవాలి. మూడు సంవత్సరాలకీ కలిపి ఒకే పరీక్ష. ఒకే ప్రయత్నంలో ఆ సబ్జెక్టులన్నీ ప్యాస్ కావాలి. ఒక సంవత్సరం తర్వాత కొంతడబ్బు కడితే ఎం.ఏ. డిగ్రీ ఇస్తారు. అక్కడ ప్రారంభమైన తెలుగుశాఖకు అధ్యక్షులుగా పింగళి లక్ష్మీకాంతంగారు నియమితులైనారు. ఈ ఉద్యోగవిషయంలో కూడా వీరికి వేమవరపు రామదాసు పంతులుగారి సహకారం లభించింది. 1931లో మద్రాసునుండి విశాఖపట్టణానికి వెళ్ళారు. మద్రాసుజీవితం నాలుగేళ్ళపాటు సాగి ముగిసింది.

**(4) విశాఖపట్టణందశ (1931–1949=18 ఏండ్లు)**

1931 జూన్‌లో లక్ష్మీకాంతంగారు విశాఖపట్టణంలోని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు లో తెలుగు లెక్చరర్‌గా, శాఖాధ్యక్షులుగా పదవీ బాధ్యతలు చేపట్టారు. అప్పుడు సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు వి.సి.గా ఉండేవారు. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, వజ్ఝుల చినసీతారామశాస్త్రిగారు తెలుగుశాఖలో పండితులుగా పనిచేస్తూ ఉండేవారు. వాళ్ళిద్దరూ సంస్కృతాంధ్రాలలో, వ్యాకరణంలో ఉద్దండపండితులు. ఆనర్సు విద్యార్థులకు సంస్కృతపాఠప్రవచనం ఆ పండితులకు ఇవ్వకుండా, తామే చెప్పేవారు లక్ష్మీకాంతంగారు. ఇలా చేసినందుకు ఆ

పండితులిద్దరికీ పింగళివారిమీద చాలా గుర్రుగా ఉండేది. పింగళివారు సంస్కృతపాఠం చెప్పి వెళ్ళిపోయాక, బోర్డుమీద వ్రాసి ఉంచిన సంస్కృత వ్యాకరణ సూత్రాలను, ఉదాహరణ పదాలను చూస్తూ, ఆ పండితులిద్దరూ వెటకారంగా "అబ్బో! చాలావరకూ వచ్చిందే మీ సంస్కృత పాఠం!" అనేవారని పింగళివారే నాతో స్వయంగా చెప్పారు. పైగా "నేను సింహాలతో సర్కసు చేయించా నోయ్!" అని సగర్వంగా నావైపు చూసేవారు. నిజంగా పండితులకు గొప్ప పాండిత్యం ఉంటుంది కాని, విద్యార్థులకు ఎలా పాఠం చెప్పాలో (ముఖ్యంగా వ్యాకరణ పాఠాలు) తెలియదు. ఇది నాకు స్వానుభవం. నేను బి.ఏ. స్పెషల్ తెలుగు చదివేటప్పుడు దర్భా సర్వేశ్వరశాస్త్రిగారని గొప్ప సంస్కృత వైయాకరణుడు మాకు బాలవ్యాకరణం పాఠం చెప్పేవారు. బోర్డుమీద ఒక్క అక్షరంముక్క వ్రాసేవారు కాదు. కూర్చొని పురాణం చెపుతున్నట్లుగా చెప్పుకుంటూ వెళ్ళిపోయేవారు. నాకు ఒక్క ముక్క అర్థమయ్యేది కాదు! పింగళివారి తెలుగుశాఖలో గంటి జోగిసోమయాజులుగారు "ఫైలాలజీ" (భాషాశాస్త్రం) బోధించేవారు.

1933 ప్రాంతంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఒక లెక్చరర్ పోస్టు ప్రకటించారు. పింగళివారి చిరకాలమిత్రుడు, ప్రముఖకవి విశ్వనాథ సత్యనారాయణగారు ఆ పోస్టుకి అప్లైచేశారు. విశాఖపట్టణం వచ్చి, పింగళివారి ఇంట్లోనే కొన్ని రోజులుండి ప్రయత్నం చేశారు. కాని ఆ పోస్టు ఆయనకు రాలేదు. పింగళివారు తనకు సహాయం చేయలేదని విశ్వనాథవారికి చాలా కోపం వచ్చింది. అప్పటినుంచీ ఆయన, ఆయన శిష్యులు పింగళివారిని తిట్టడం ప్రారంభించారు. అసలు "సౌందరనందం" రచనలో పింగళివారిచేయి లేదనీ, అంతా కాటూరివారే వ్రాశారనీ, పింగళివారికి అందంగా పద్యం వ్రాయడం రాదనీ, ప్రచారం చేయడం మొదలుపెట్టారు. దీనితో బాధపడిన పింగళివారు కూడా విశ్వనాథవారినీ, ఆయనతోపాటు వైదికుల్ని దుమ్మెత్తి పోయడం ప్రారంభించారు. ఆ సమయంలో తన కవితాశక్తిని గురించి ఒక పద్యం వ్రాసుకున్నారు లక్ష్మీకాంతంగారు.

**ఉ. "ప్రీణిత సద్రసజ్ఞుఁడగు పింగళి కాంతుని కావ్యశిల్ప ని**
**ర్మాణధురీణ బుద్ధిగరిమంబున కిర్వురె సాక్షు లిమ్మహిన్**
**వాణికి వాణియైన గురువర్యుఁడు చెళ్ళిళ వేంకటేశుఁడున్**
**ప్రాణము ప్రాణమైన గుణరమ్యుఁడు కాటురి వేంకటేశుఁడున్!"**

పింగళివారి జీవితచరిత్రను వ్రాసిన వారి రెండవ కుమారుడు శ్రీ పింగళి సూర్యసుందరంగారు, తన తండ్రి విశ్వనాథకు తన శాఖలో ఉద్యోగం ఇవ్వకపోవడాన్ని సమర్థించుకున్నారు. పింగళివారు డిపార్టుమెంటులో చేరి రెండు మూడేండ్లు మాత్రమే అయిందనీ, ఇంకొకరికి ఉద్యోగం ఇప్పించేటంత శక్తి వారికి లేకపోయి ఉండవచ్చుననీ – అన్నారు. ఇది సరికాదు. నేను ఇంకోరకంగా ఊహిస్తున్నాను. పింగళివారికి అప్పటి వైస్‌ఛాన్సలర్ అయిన సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారితో మంచి పరిచయం ఉంది. పైగా తాను తెలుగుశాఖాధ్యక్షుడు. వి.సి.తో ఒక్కమాట చెపితే, విశ్వనాథవారికి తప్పక ఆ ఉద్యోగం వచ్చి ఉండేది. మరి ఎందుకు సహాయం చేయలేదు? ఆరువేల నియోగులంటే సామాన్యులు కారు. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేవారు! పూర్వం రాజులదగ్గర మహామంత్రులుగా పనిచేసి, చక్రంత్రిప్పినవారు! గ్రామాలలో కరణాలుగా పొలంగట్లతోపాటు, రైతుల తలలుతీసి తలలుమార్చిన ఘనులు వారు! విశ్వనాథవారు తనకన్నా ప్రతిభావంతుడని, కవి అని, పండితుడని పింగళివారికి బాగా తెలుసు. ఆయనను తన డిపార్టుమెంటులో చేర్చుకుంటే, తనను అమాంతంగా మ్రింగివేస్తాడనీ, తాను ఫేడ్ అవుట్ అయిపోతాననీ గ్రహించి, ఆయనకు ఆ ఉద్యోగం రాకుండా అడ్డుపడ్డారు. ఇలాంటి తప్పే తరువాతి కాలంలో కూడా రెండుసార్లు చేశారు పింగళివారు. ఒకసారి, గొప్ప పరిశోధకుడు, పండితుడు, కవి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి శిష్యుడు అయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని కాకుండా, విద్వాన్ తృతీయశ్రేణిలో ఉత్తీర్ణులైన దువ్వూరి వెంకట రమణశాస్త్రిగారిని తెలుగు శాఖలోనికి పండితుడుగా తీసుకున్నారు పింగళివారు.

కొన్నిఏండ్ల తరువాత డిపార్టుమెంటులో మరోసారి ఉపన్యాసకుని ఉద్యోగం ప్రకటింపబడింది. మా గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు, దివాకర్ల వేంకటావధానిగారు, కె.వి.ఆర్.నరసింహంగారు ఆ ఉద్యోగానికి దరఖాస్తులు పెట్టుకున్నారు. దిగుమర్తివారితోను, దివాకర్లవారితోను పోలిస్తే, నరసింహంగారు నథింగ్! కాని నరసింహంగారికే ఆ ఉద్యోగం ఇచ్చారు పింగళివారు. మొదటినుండీ తనను ఆశ్రయించుకున్నవాడని ఆయనమీద పింగళివారికి ఎంతో అభిమానం. నరసింహంగారు తనకు ఎంత విధేయుడైన శిష్యుడో చెపుతూ, ఒకసారి నాతో ఇలా అన్నారు: "సుబ్బారావ్! నరసింహానికి నేను ఎంత చెపితే అంతే! నేను ఏమి

చెపితే దానిని సమర్థించేవాడు! నేను 'నరసింహం! అది కుక్కలా ఉంది, చూడు!' అంటే 'అవునండి! అది కుక్కేనండి!' అంటాడు. వెంటనే నేను 'అది కుక్కకాదోయ్! పిల్లిలా ఉంది!' అని అంటే, 'అవునండి మాస్టారూ! అది పిల్లేనండోయ్!' అంటాడు. అంత విధేయుడు నాకు!" (ఇటువంటి అతివిధేయుడైన శిష్యునితో పింగళివారికి చివరి రోజుల్లో ఎందుకో కోపం వచ్చింది. నరసింహంగారిని ఛెడామడా తిట్టిపోసేవారు.)

ఒకసారి కె.వి.ఆర్. నరసింహంగారికి ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఉద్యోగం వచ్చిన సంగతి గురుదేవులు దిగుమర్తివారితో ప్రస్తావించాను. ఆయన ఎంతో కోపంతోను, ఉక్రోషంతోనూ–"ఆ నరసింహం ఉన్నాడు చూశావ్! పింగళివారి గుమ్మంముందు.... లాగ పడుకుని ఆ ఉద్యోగం సంపాదించాడయ్యా!" అన్నారు. తెలుగు ప్రబంధ వాఙ్మయాన్ని గురించి నరసింహంగారు వ్రాసిన సిద్ధాంత వ్యాసం గ్రంథరూపంలో రాలేదు. "వస్తే దాని బండారం బయటపడిపోతుంది!" అనే వారు దిగుమర్తివారు. (అప్పుడప్పుడు కొంచెం విమర్శించినా, మా గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామివారికి, వారి గురుదేవులైన పింగళి లక్ష్మీకాంతంగారంటే ఎనలేని భక్తి! పింగళివారు చనిపోయారన్న వార్తవిని, ఎంతో బెంగపెట్టుకొని, సరిగ్గా నాలుగురోజుల తర్వాత దిగుమర్తివారు కూడా చనిపోయారు. పింగళివారి మరణం 1972 జనవరి 10వ తేదిని కాగా, దిగుమర్తివారి మరణం అదే సంవత్సరం జనవరి 14వ తేది సంక్రాంతి పండుగదినంనాడు జరిగింది.)

పింగళివారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగుశాఖాధ్యక్షులుగా ఉండగానే వేయిరూపాయల బహుమతితో నవలాపోటీలు నిర్వహింపబడ్డాయి. విశ్వనాథవారి "వేయిపడగలు" నవల– అడవి బాపిరాజుగారి "నారాయణరావు" నవల పోటీపడ్డాయి. సెలెక్షన్ కమిటీ ఛైర్మన్ పింగళివారు. వారు విశ్వనాథవారి నవలను తొక్కిపెట్టి, బాపిరాజుగారి నవలకు ప్రథమబహుమతి ఇవ్వాలని నిశ్చయించు కున్నారు. దీనిని గమనించిన జైపూర్‌మహారాజా విక్రమదేవవర్మగారు లక్ష్మీకాంతంగారిని పిలిచి "ప్రథమ బహుమతిని ఇద్దరికీ పంచండి" అన్నారు. ఇద్దరికీ పంచడానికి మా దగ్గర డబ్బుల్లేవు!" అన్నారు లక్ష్మీకాంతంగారు ఎలాగైనా విశ్వనాథవారిని తప్పించాలనే దురుద్దేశంతో. "తక్కువైన డబ్బు నేను ఇస్తాను. నేను చెప్పినట్టు చేయండి!" అన్నారు విక్రమదేవవర్మ. వర్మగారు ఆంధ్ర

విశ్వవిద్యాలయ పోషకులు. లక్ష్మీకాంతంగారు భయపడి, ఇక చేసేది లేక ఆయన చెప్పినట్లు చేయవలసివచ్చింది! విశ్వనాథవారి "వేయిపడగలు" – బాపిరాజుగారి "నారాయణరావు" – రెండూ చదివిన వారికి ఎవరికైనా మొదటిది "All time Great Novel" అనీ, రెండవది పరమబోర్ అనీ స్పష్టమవుతుంది.

డిపార్టుమెంటులోని తనకన్నా ఎక్కువ పాండిత్యం ఉన్నవారిని రాకుండా, తనకన్నా తక్కువ పాండిత్యం ఉన్నవారిని తీసుకోవడం అనే పింగళివారు చేసిన తప్పునే తిరుపతిలో మా గురువర్యులు ప్రొ॥ జి.యన్.రెడ్డిగారు కూడా చేశారు. తనకన్నా తెలివైనవారినందరినీ డిపార్టుమెంటునుండి తరిమివేశారు. తనకన్నా తక్కువ తెలివితేటలుగలవారిని ముఖ్యంగా తన కులంవాళ్లని తెలుగుశాఖలో చేర్చుకున్నారు. నెల్లూరుకు చెందిన బండి నాగరాజు అనే ప్రముఖ పండిత విమర్శకుడు ఒకసారి ఎస్వీయులోని తెలుగుశాఖను గురించి ఒక పత్రికలో వ్రాస్తూ వ్రాస్తూ "శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖ అనే రెడ్డిరాజ్యంలో..." అని వ్యాఖ్యానించాడు. ఈ కులాభిమానజాడ్యం కర్ణాటకరాష్ట్రంలో కూడా ఉంది. మైసూరు విశ్వవిద్యాలయం కన్నడశాఖలో నూటికి 90మంది గౌడకులంవారే ఉంటారు! అలాగే ధార్వాడలోని కర్ణాటక విశ్వవిద్యాలయం కన్నడశాఖలో 99% లింగాయతులే ఉంటారు!

ప్రొ॥ జి.యన్.రెడ్డిగారు తెలుగుశాఖనంతా రెడ్లతో నింపివేస్తూ ఉంటే చూచి, కోపంవచ్చిన ఇంకో ప్రొఫెసర్‌గారు జాస్తి సూర్యనారాయణగారు (కమ్మవారు) "ఏమిటి? డిపార్టుమెంటునంతా మీవాళ్ళతోనే నింపివేస్తున్నారు?" అని నిలదీశారు. అప్పుడు రెడ్డిగారు "ఇంగ్లండులో ఉండి 'అంతా ఇంగ్లీషు వాళ్ళే ఉన్నారు' అంటే ఎలాగ?" అని తన చర్యను సమర్థించుకున్నారు. "రాయలసీమలో ఎక్కువగా రెడ్లే ఉన్నారు. అందువల్ల ఇక్కడి విశ్వవిద్యాలయాల్లో కూడా రెడ్లే ఎక్కువగా ఉంటారు." అని జి.యన్.రెడ్డిగారి మాటలకు తాత్పర్యం. జనాభా నిష్పత్తినిబట్టి ఉద్యోగాలిస్తారా? లేక ప్రతిభనుబట్టి ఉద్యోగాలిస్తారా? అలా ఇద్దామన్నా 'రెడ్లు' అగ్రకులమేకాని, రిజర్వుడుకులం కాదుకదా! (అలాగే కర్ణాటక రాష్ట్రంలో గౌడకులంకాని, లింగాయత్‌కులంకాని వెనుకబడిన కులాలవారు కాదు. ఆంధ్రప్రదేశ్‌లో రెడ్డి, కమ్మ కులాలవలెనే రాజకీయంగా మిక్కిలి బలమైన కులాలు. తరతరాలుగా, ఇతర కులాలను అణగద్రొక్కి ప్రజలను పాలిస్తున్న దౌర్జన్య నిరంకుశ కులాలు!)

పింగళివారిలాగ, జి.యన్.రెడ్డిగారిలాగ ఇటువంటి తప్పులు చేయని ఒకే ఒక మహానుభావుడైన తెలుగు ప్రొఫెసర్ ఉండేవారు. ఆయన పేరు "ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు". ఉస్మానియా విశ్వవిద్యాలయంలో, తనకన్నా ప్రతిభావంతుడు, పండితుడు అయిన దివాకర్ల వేంకటావధానిగారిని తన శాఖలో నిస్సంకోచంగా చేర్చుకున్నారు. ఆయనకు నా hats off ! అవధానిగారిలాగే మరో గొప్ప పండితుడైన పాటిబండ్ల మాధవశర్మగారిని కూడా లక్ష్మీరంజనంగారు తన శాఖలో చేర్చుకున్నారు. అటువంటివారు అరుదుగా ఉంటారు.

పూర్వకాలంలో తెలుగుశాఖలలోను, సంస్కృతశాఖలలోను అందరూ బ్రాహ్మణులే ఉండేవారు. ఈ బ్రాహ్మణులకు తెలిసింది ఒకే ఒక వృత్తి; అది "చదువుకోవడం". అందువల్ల అప్పుడు ఆ పరిస్థితి ఉండేది. క్రమంగా ఆస్తులన్నీ కరిగిపోయి, ఆర్థికంగా చితికిపోయి చదువుకొనే శక్తిలేక పరిస్థితులు తారుమారయ్యాయి. దీనికి ఒక చిన్న ఉదాహరణం ఇస్తాను. ఆకాలంలో, తెలుగు ప్రొఫెసర్ల సమావేశాలలో గురువర్యులు జి.యన్.రెడ్డిగారు: "I am the only non-Brahmin Professor in the State! " అని సగర్వంగా చెప్పుకొనేవారు. ఇటీవల నేను ద్రావిడ విశ్వవిద్యాలయానికి వెళ్ళినప్పుడు, అక్కడి తెలుగు ప్రొఫెసర్ డా॥ జె.వి.సత్యవాణి "I am the only Brahmin Professor in the State!"అని చాలావిచారంగా చెప్పింది! తమిళనాడులో లాగే, ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఒక ప్రణాళికాబద్ధంగా సమాజంలో ఈ మార్పు తీసుకొనివచ్చినట్లుగా కనబడుతోంది!

ఇక్కడ పాఠకులు ఒక ముఖ్య విషయాన్ని గమనించాలి. నాకు తిరుపతి యూనివర్శిటీలోకానీ, అనంతపురం పి.జి.సెంటర్లోకానీ ఉద్యోగం రాలేదు కాబట్టి, గురువర్యులైన ప్రొ॥ జి.యన్.రెడ్డిగారి మీద ఇటువంటి ఆరోపణలు చేస్తున్నానని భావించకూడదు. రెడ్డిగారికి నా మీద అపారమైన వాత్సల్యం ఉండేది. నాకు ఎలాగైనా ఉద్యోగం ఇవ్వాలని శతవిధాల ప్రయత్నించారు. మొట్టమొదట నన్ను అనంతపురం పి.జి. సెంటర్ తెలుగుశాఖలో ట్యూటర్‌గా నియమించారు. (అప్పుడు అనంతపురం తెలుగుశాఖ తిరుపతిలోనే ఉండేది) తరువాత ఆ శాఖలో ఒక లెక్చరర్ పోస్టు వచ్చింది. దానిని నాకు ఇవ్వాలని చూచారు రెడ్డిగారు. దానికి నేను, శ్రీ శలాక రఘునాథశర్మగారు పోటీ పడ్డాము. ఆ పోస్టులో నియమింపబడే ఉపన్యాసకుడికి తెలుగుతోపాటు సంస్కృతం కూడా వచ్చి వుండాలి. అందువల్ల

శలాకవారు సెలక్టు అయ్యారు. (వారు నాకన్నా వేయి రెట్లు గొప్పవారు). అప్పుడు రెడ్డిగారు నాతో: "సుబ్బారావ్! నీకు సంస్కృతం వచ్చివుంటే నిన్ను సెలక్ట్ చేసి వుండేవాడినయ్యా!" అన్నారు విచారంగా. కాబట్టి నాకు తిరుపతిలో కాని, అనంతపురంలోకాని ఉద్యోగం రాకపోవడానికి రెడ్డిగారు కారణం కానే కాదు; నేనే కారణం! నా లోపమే కారణం! తెలుగుతోపాటు సంస్కృతం కూడా చదువుకోని బ్రాహ్మణుడు బ్రాహ్మణుడే కాదు! తెలుగు సంస్కృతాలతోపాటు వేదంకూడా చదువుకొన్నవాడు ఉత్తమోత్తముడైన బ్రాహ్మణుడు! (అటువంటి సద్బ్రాహ్మణుని పాదాలకు నేను ఎల్లప్పుడూ భక్తితో నమస్కరిస్తాను.)

అయితే ఇక్కడ నేను ఇంకో విషయం చెప్పదలచుకున్నాను. 1969 డిసెంబరు నెలలో నేను బెంగుళూరు వచ్చేసిన తరువాత ప్రొ॥ జి.యస్. రెడ్డిగారు తిరుపతిలోను, అనంతపురంలోను ఎందరినో ఉపన్యాసకులుగా నియమించారు. వారిలో ఎవ్వరికీ సంస్కృతం రాదు; ఒక్క కె. సర్వోత్తమరావుగారికి తప్ప. ఒక విశ్వవిద్యాలయంలో కాని, ఒక కళాశాలలోకాని ఒకరికి ఉద్యోగం రావడం రాకపోవడం అనేది అంతా దైవనిర్ణయం; మానవులు నిమిత్తమాత్రులు. మా కులదైవం శ్రీ వేంకటేశ్వరస్వామివారు. అందువల్ల నేను ఎలాగైనా తిరుపతిలో ఉద్యోగం సంపాదించాలను కున్నాను. యూనివర్శిటీలో కాకపోతే కనీసం యస్.వి.ఆర్ట్స్ కాలేజీలోనైనా ఉద్యోగంవస్తే బాగుండును అనుకున్నాను. ఒక ఇంటర్వ్యూకి కూడా వెళ్లాను; కాని రాలేదు. భగవంతుడు నన్ను బెంగుళూరు పొమ్మన్నాడు. అక్కడ కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకోమన్నాడు. ఇక్కడికి వచ్చి, నేను మా పిల్లలు ఎంతో బాగుపడ్డాం. నిజంగా తిరుపతిలోనే నాకు ఉద్యోగం వచ్చి వుంటే "సవాలక్ష లింగాల్లో ఒక బోడిలింగం"గా మిగిలిపోయి ఉండేవాడిని! అది భగవంతుడికి ఇష్టంలేక, నన్ను ఈ కర్ణాటక రాష్ట్రానికి పంపించాడు. అంతా దైవఘటన అని ఇప్పుడు అనిపిస్తోంది. ("అందని ద్రాక్షపళ్లు పుల్లన" అని పాఠకులు అనుకున్నా నాకు ఫరవాలేదు.)

ఆంధ్రదేశంలో తెలుగు ఎం.ఏ తరగతులకు ఒక రూపకల్పన చేసి, పాఠ్యాంశ ప్రణాళికను సిద్ధంచేసినవారు పింగళి లక్ష్మీకాంతంగారు. ఈ సిలబస్ సుమారు 50 సంవత్సరాలపాటు అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ కొనసాగింది.

1936లో సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు వి.సి. పదవినుండి తప్పుకున్నారు. సి.ఆర్. రెడ్డిగారు వి.సి.గా వచ్చారు. లక్ష్మీకాంతంగారు రెడ్డిగారితో కూడా

సత్సంబంధాలు పెంపొందించుకున్నారు. పింగళి–కాటూరి కవుల 'తొలకరి' ఖండకావ్యానికి రెడ్డిగారు పీఠిక వ్రాశారు. వీరి 'సౌందరనందం' అంటే రెడ్డిగారికి చాలా ఇష్టం. పింగళివారు, తంజావూరు లైబ్రరీలో తాను చూచిన ద్విపదభారతాన్ని తెప్పించి, పరిష్కరించి, విశ్వవిద్యాలయపరంగా ప్రచురించారు. రంగనాథ రామాయణానికి మంచిపీఠిక వ్రాసి ప్రచురించారు. తంజావూరు లైబ్రరీలో ఉన్న యక్షగానాలను కూడా తెప్పించి, యూనివర్శిటీ తరఫున ప్రచురించడానికి ఏర్పాట్లు చేశారు. ఆ ప్రాజెక్టు పూర్తి కాకుండానే 1949లో, 55 సం.ల వయస్సు నిండగానే రిటైరయ్యారు. (ఆ రోజుల్లో రిటైర్‌మెంట్ ఏజ్ 55 సం.లే! ఈ రోజుల్లో ల్లాగ 65 సం.లు కాదు. పైగా పెన్షన్ కూడా లేదు!)

1931లో ఆంధ్రాయూనివర్శిటీలో తెలుగు లెక్చరర్‌గా చేరిన లక్ష్మీకాంతంగారు, 1944లో రీడరయ్యారు. ప్రొఫెసర్ కాకుండానే, రీడరు హోదాలోనే 1949లో రిటైరయ్యారు. తరువాత, చాలాకాలానికి, 1961లో అప్పటి రాష్ట్రపతియైన సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి సూచనతో, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా, శాఖాధ్యక్షులుగా నియమింపబడి, 1965 వరకూ నాలుగేళ్ళపాటు ఆ హోదాలో ఉన్నారు. దీనికి ముందుగానే సి.ఆర్.రెడ్డిగారు, పింగళివారిని మైసూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా నియమించాలని చూశారు. కాని అది కార్యరూపం దాల్చకుండానే రెడ్డిగారు గతించారు.

**(5) విరామదశ (1949–1954 = 5 ఏండ్లు)**

ఆ రోజుల్లో యూనివర్శిటీలో పనిచేసి రిటైరయిన వారికి పెన్షన్ ఉండేది కాదు. (ఇప్పుడు ఒక్కొక్కరికి దాదాపుగా లక్ష రూపాయల పెన్షన్ వస్తోంది!) సర్వీసులో ఉండగా కూడా జీతాలు వందలలోనే కాని, ఈ రోజుల్లోలాగ లక్షల్లో ఉండేవికావు. 1948లో పింగళివారి గురువు చెళ్ళపిళ్ళవారు మద్రాసురాష్ట్ర ప్రభుత్వ "ఆస్థానకవి'' అయ్యారు. 1950లో మహాశివరాత్రినాడు చెళ్ళపిళ్ళవారు స్వర్గస్థులయ్యారు. అప్పుడు పింగళివారు "గురుకీర్తనము'' అనే పేరుతో మూడు పద్యాలు వ్రాసి 'భారతి'లో ప్రచురించారు. అందులో ఒక చమత్కారమైన పద్యం:–

**తే.గీ.** **"ఆంధ్రవితా జగద్గురుఁ డమరపురికిఁ**
**దరలిపోయెను శిష్య సంతతుల విడిచి,**

**సహజ గీర్వాణవాణి ప్రసక్తులైన**
**దేవతలు చెప్పగలరింకc దెల్గుకవిత!"**

ఈ విరామదశలో పింగళివారు తన దృష్టిని కవిత్వంవైపు మళ్ళించారు. జగన్నాథపండితరాయలు సంస్కృతంలో వ్రాసిన "గంగాలహరి" "అన్యాపదేశ లహరి" అనువదించారు. మయూరుని సూర్యశతకంలోని కొన్ని శ్లోకాలను "తేజోలహరి" పేరుతో అనువదించారు. ఇవన్నీ 'భారతి'లో ప్రచురింపబడ్డాయి. ఈ దశలోనే విద్యార్థులకోసం "గౌతమ నిఘంటువు", ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు తాను వ్రాసిన వ్యాసములతో "గౌతమ వ్యాసములు" ప్రచురించారు. నూతనంగా స్థాపింపబడిన "కేంద్రసాహిత్య అకాడెమీ"లో తెలుగు సలహాదారుగా నియమింపబడ్డారు.

**(6) విజయవాడదశ (1954-1961=7 సం.లు)**

కేంద్రప్రభుత్వ సమాచార ప్రసారశాఖ (Ministry of Information and Broadcasting) వారు, సంగీత సాహిత్యాది శాఖలలో బహువిధ కృషిచేసిన లబ్ధప్రతిష్ఠులను, ఆకాశవాణి (All India Radio) లో "సలహాదారులు"గా నియమించాలని నిర్ణయించారు. తెలుగు కార్యక్రమాల సాహిత్య సలహాదారుగా విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పింగళి లక్ష్మీకాంతంగారిని నియమించింది కేంద్రప్రభుత్వం. ఈ నియామకం 1954లో జరిగింది. అందువల్ల పింగళివారు విశాఖపట్టణంనుండి బెజవాడకు వచ్చారు. ప్రసంగాల విభాగానికి ప్రయోక్తగా ఉండేవారు. ప్రసిద్ధ రచయిత బుచ్చిబాబు, శ్రీవాత్సవ, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు అక్కడ పింగళివారితో కలిసి పనిచేశారు. రజనీగారు పింగళివారి శిష్యులే! తెలుగు సాహిత్య కార్యక్రమాలను, "అమరవాణి" పేరుతో సంస్కృత కార్యక్రమాలను ప్రసారంచేసేవారు లక్ష్మీకాంతంగారు. సంస్కృత నాటకాలను, ముఖ్యంగా భాసుని నాటకాలను చక్కని తెలుగులోనికి అనువదించి, నటులకు మంచి శిక్షణనిచ్చి ప్రసారం చేసేవారు. ఈ నాటకాలు ఎంతో అద్భుతంగా ఉండేవి. నేను ఒకసారి భాసుని "దూత ఘటోత్కచం" విన్నాను. ఎంతగా ఆనందించానో మాటలలో చెప్పలేను. అభిమన్యుని మరణానంతరం, ఘటోత్కచుడు పాండవదూతగా ధృతరాష్ట్రుని కొలువుకూటానికి వస్తాడు. "నాయనా! మనుమడా! పాండవులేమిచేయుచున్నారు?" అని ప్రశ్నిస్తాడు ధృతరాష్ట్రుడు. దానికి ఘటోత్కచుడు:

"అబ్బే! ఏమీ చేయటంలేదు తాతా! అభిమన్యుని శరీరంలో నాటిన బాణాలను తీసి, వాటిమీద ఉండే వీరుల పేర్లను పట్టికగా తయారుచేస్తున్నారు, అంతే!" అంటాడు. దీనిలో ఎంతో ధ్వని ఉంది! "అభిమన్యుని అన్యాయంగా గుమిగూడి చంపిన వీరులెవ్వరినీ పాండవులు విడిచిపెట్టరు సుమీ!" – అనే హెచ్చరిక దాగి ఉంది. ఈ సంస్కృత నాటకాల రిహార్సల్సు, ప్రయోగం – అన్నీ లక్ష్మీకాంతంగారే చూచుకొనేవారు. ప్రసిద్ధ రంగస్థలనటుడు బందా కనకలింగేశ్వరరావుగారు కూడా పింగళివారితో కలిసి పనిచేశారు. రేడియోలో అష్టావధానాన్ని ప్రవేశపెట్టింది లక్ష్మీకాంతంగారే! (మొదటి అవధానం ప్రసాదరాయ కులపతిగారిచేత చేయించారు.)

విజయవాడ ఆకాశవాణికేంద్రానికి డైరెక్టర్లు వస్తూ ఉండేవారు. కొన్నాళ్ళకు బదిలీ అయిపోయి వెళ్ళిపోతూ ఉండేవారు. "నాయర్" అనే డైరెక్టరు బదిలీ మీద వెళ్ళిపోతూ, కొత్తగా వచ్చిన "టి.శంకరన్" అనే డైరెక్టరుకు పింగళి లక్ష్మీకాంతంగారిని పరిచయం చేస్తూ... "He conducts Sanskrit programmes!" అన్నాడట. దానికి శంకరన్ లక్ష్మీకాంతంగారివైపు చూస్తూ, "I am enemy number one of Sanskrit!" అన్నాడట. దానికి లక్ష్మీకాంతంగారు వెంటనే (కుక్కకాటుకు చెప్పుదెబ్బలా) "Sanskrit loses nothing on that account!" అన్నారట. సత్యాన్ని అంతధైర్యంగా ప్రకటించేవారు. ఎవ్వరినీ లెక్కపెట్టేవారు కారు.

**(7) తిరుపతిదశ (1961-1971=10 ఏండ్లు)**

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రారంభదినాలలో సి.ఆర్.రెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణగారల వంటి హేమాహేమీలు ఉన్నా, అక్కడి తెలుగుశాఖలో ప్రొఫెసరు పోస్టు ఉండేది కాదు. (ఇతర శాఖలన్నింటిలోనూ ఉండేది). అందువల్ల లక్ష్మీకాంతంగారు అక్కడ పనిచేసినప్పుడు ప్రొఫెసర్ కాలేకపోయారు. ఆ లోటు 12 ఏండ్ల తరువాత తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తీరింది. ఆనాటి భారతరాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి సూచన మేరకు, పింగళివారు తిరుపతిలో తెలుగు ప్రొఫెసర్ అండ్ హెడ్‌గా నియమితులయ్యారు. అందువల్ల వారిదగ్గర చదువుకొనే భాగ్యం నాకు కలిగింది!

పింగళివారు తిరుపతి ఎస్వీ యూనివర్సిటీలో 1961 నుండి 1965 వరకూ ప్రొఫెసరుగానూ, తెలుగుశాఖాధ్యక్షులుగాను పనిచేశారు. భద్రిరాజు కృష్ణమూర్తిగారు, జీరెడ్డి చెన్నారెడ్డిగారు, కోరాడ మహదేవశాస్త్రిగారు,

తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు మొదలైనవారు పింగళివారితో పనిచేశారు. 1965లో పాఠ్యగ్రంథాలలో తెలుగుభాషాశైలిని గురించి మూడురోజులపాటు పెద్దగోష్ఠిని నిర్వహించారు లక్ష్మీకాంతంగారు. ఆయనే ఆ గోష్ఠికి అధ్యక్షులు. 40 మంది కవులు, పండితులు, విమర్శకులు, అధ్యాపకులు, పత్రికా సంపాదకులు ఆ గోష్ఠిలో పాల్గొన్నారు. అక్కడ గ్రాంథికభాషావాదులకు, వ్యావహారిక భాషావాదులకు సంధిని ఏర్పరచి, ఒక మధ్యేమార్గాన్ని సూచించారు అధ్యక్షులవారు. దాని ఫలితమే 1966లో ఏర్పడిన "తెలుగు అకాడెమీ".

పింగళివారు నాలుగేండ్లు తిరుపతి విశ్వవిద్యాలయంలో పనిచేసి, మరో ఆరేండ్ల శేషజీవితాన్నికూడా తిరుపతిలోనే గడిపారు. వారు శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తులు. వారి ఇలువేల్పు ఆ స్వామియే! అందువల్ల తిరుపతిలోనే ఎంతో ఇష్టంగా ఉండిపోయారు!

**కవిత్వంవ్రాసే విద్యార్థి పరిశోధనకు పనికిరాదు**

గురువర్యులు భద్రిరాజు కృష్ణమూర్తిగారు ప్రపంచ ప్రసిద్ధిగాంచిన భాషాశాస్త్రవేత్త. ఆయన మాకు ఒక్క సంవత్సరం (1961–62) మాత్రమే భాషాశాస్త్రం బోధించారు. తరువాత ప్రొమోషన్ మీద (రీడరు నుండి ప్రొఫెసర్‌గా) ఉస్మానియా విశ్వవిద్యాలయం వి.సి. ప్రొ॥ డి.ఎస్. రెడ్డిగారి ప్రత్యేక ఆహ్వానంపై, అక్కడ భాషాశాస్త్ర ఆచార్యులుగా వెళ్ళిపోయారు. (పిమ్మట కొన్నేండ్లకు హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీకి వి.సి.గా కూడా నియమింపబడ్డారు.) భద్రిరాజుగారికి గల కొన్ని నిశ్చితమైన అభిప్రాయాల్లో "కవిత్వంవ్రాసే విద్యార్థి పరిశోధనకు పనికిరాదు!" అనేది ఒకటి. ఆయన కన్ను నా మీద పడింది. భద్రిరాజుగారు మా క్లాసులో బాహాటంగా చెపుతూ ఉండేవారు: "నాకు ఇద్దరే శిష్యులు: ఒకడు పి.ఎస్. సుబ్రహ్మణ్యం; రెండవవాడు చేకూరి రామారావు". నిజంగానే భాషాశాస్త్రంలో భద్రిరాజుగారి తరువాత వీరిద్దరూ గొప్ప కృషిచేసిన వ్యక్తులు. (ఇద్దరూ తరువాతికాలంలో నాకు మంచి మిత్రులయ్యారు.) ఒక్కొక్కసారి క్లాసులో భద్రిరాజుగారు నావైపు తిరిగి: "నీ కవిత్వానికి గోరీకడతాను; చేకూరి రామారావు కవిత్వానికి అలాగే గోరీకట్టాను!" అని నవ్వేవారు. (పి.ఎస్. సుబ్రహ్మణ్యంగారు విద్యార్థిదశనుంచీ కవికాదు; అందువల్ల ఆయన కవిత్వానికి గోరీ కట్టవలసిన పని తప్పింది గురువుగారికి!)

భద్రిరాజు కృష్ణమూర్తిగారు, హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి వెళ్ళిపోయిన తరువాత, ఒకసారి తిరుపతికి వచ్చారు. పింగళివారిని చూడటానికి వారి యింటికి వచ్చారు. అప్పుడు నేను పింగళివారి దగ్గర పరిశోధక విద్యార్థిగా ఉన్నాను. నన్ను చూచి భద్రిరాజుగారు ఆశ్చర్యపోయారు: "ఇదేమిటి? ఇతను పరిశోధనకు పనికిరాడే! ఇతన్ని ఎలా తీసుకున్నారు?" అని పింగళివారిని ప్రశ్నించారు. ఆయన ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు. పింగళివారు స్వతహాగా మంచికవి (సౌందరనందకావ్య రచయిత). "కవిత్వంవ్రాసే విద్యార్థి పరిశోధనకు పనికిరాడు" అనే అభిప్రాయం వారికి ఉండేది కాదు.

నేను చాలా ఏండ్లు (సుమారు 27 సం.లు) బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పనిచేసిన తరువాత, ఎందరో పరిశోధక విద్యార్థులను పరిశీలించిన తరువాత, గురువర్యులు ప్రొ॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారి మాటలు తలచుకొన్నాను. వారు చెప్పింది నిజమే అనిపించింది. సృజనాత్మక సాహిత్యాన్ని సృష్టించేవాడు, పరిశోధన లోతులను పూర్తిగా దర్శింపలేడు. "కవితారచన, పరిశోధన" – ఈ రెండూ రెండు విభిన్నమైన రంగాలు. రెండింటిలోనూ కృషిచేస్తున్నానని భావించేవాడు, జోడుగుఱ్ఱాలమీద స్వారీచేసేవాడు! దేనికీ న్యాయం చేయలేడు. కవితారచన ఒక వ్యసనం. దానిని వదలించుకోవడం అంత సులభం కాదు! (ఇలా చెప్పిన భద్రిరాజుగారే, వి.సి.గా రిటైరయిపోయిన తరువాత, చిన్నతనంలో తాను వ్రాసిన పద్యకవితలన్నీ ఒక సంపుటిగా ముద్రించి, అప్పటి భారత ప్రధానియైన పి.వి. నరసింహారావుగారికి అంకితం చేశారు!)

భద్రిరాజు కృష్ణమూర్తిగారు మిక్కిలి పేద కుటుంబంలో జన్మించారు. వీరికి చిన్నతనంలోనే తండ్రి చనిపోయారు. తల్లి శ్రీమతి భారతిగారు ఎన్నో అవస్థలు పడి తన సోదరుని సహాయంతో వీరిని చదివించారు. వీరు హైస్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడే కవితారచన చేసేవారు. ఇంటర్మీడియేట్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైన తరువాత, తనపేదరికాన్ని వివరిస్తూ, తనకు బి.ఏ.ఆనర్సులో సీటు ఇవ్వవలసిందిగా పింగళిలక్ష్మీకాంతంగారికి పద్యాలలో పెద్దలేఖ వ్రాశారట. ఈ విషయం భద్రిరాజుగారే నాతో చెప్పారు. తనను చదివించడంలో తల్లి పడిన కష్టాలకు గుర్తుగా, హైదరాబాదులో తాను కట్టించుకున్న ఇంటికి "భారతి" అని పేరు పెట్టుకున్నారు. తనకు ఎన్నో విధాల సహాయం చేసిన తన మేనమామ గారంటే ఈయనకు ఎంతో గౌరవం. ఆయన ఎదురుగా సిగరెట్టు కాల్చేవారు కారు.

## సతీవియోగం

1969లో పింగళివారికి సతీవియోగం కలిగింది. అప్పుడు "లక్ష్మీ నిర్గమనము" అనే పేరుతో చిన్న కావ్యాన్ని రచించారు. దాని ఆవిష్కరణసభ తిరుచానూరు పద్మావతీదేవివారి ఆలయంలో జరిగింది. ఆ సభలో నేను ఆ కావ్యాన్ని గురించి ప్రసంగించాను.

ఈ స్మృతికావ్యంలోని కరుణరసభరితమైన ఒక మంచి పద్యం:

**ఉ. "ప్రేయసి నిర్గమించెను, శరీరము సత్త్వవిహీనమయ్యె, నా**
**ప్రాయము జారుచుండెఁ, గనుపాపల తేజము మందగించె, సౌ**
**ఖ్యాయుతలేమి దోఁచెఁ, బ్రతుకాశ యథాతథమై చెలంగె, నీ**
**కాయముమీద నింతమమకారము దేహికిదేల కేశవా?"**

వేదాంత మిళితమైన మరొక పద్యం:

**ఆ.వె. "ప్రాణి పుట్టగానె పగబట్టు మృత్యువు**
**త్రాచుపాము వోలె, దాని కాటు**
**తప్పుకొనుట యనఁగ తనువు తాల్పకయుంట,**
**అదియె మోక్షమనఁగ నంబుజాక్షి!"**

"కవిత్వము–వేదాంతము: ఒకే రెమ్మకు పూచిన రెండు పువ్వులు" అని చెప్పేవారు గురువుగారు మా విమర్శపాఠాలలో.

## పద్యపఠనం

గురువర్యులు పింగళి లక్ష్మీకాంతంగారు గొప్ప రంగస్థలనటులనీ, ధర్మరాజు పాత్రపోషణలో సిద్ధహస్తులనీ, చక్కని రాగాలతో భావయుక్తంగా పద్యాలు చదివేవారనీ పెద్దలు చెప్పగా నేను విన్నాను. కాని మాకు రఘువంశం పాఠం చెపుతూంటే శ్లోకాలు మామూలుగా చదివేవారు. నేను గురువుగారిని చాలాసార్లు అడిగేవాడిని – రాగయుక్తంగా ఒక్క శ్లోకమైనా చదవమని ప్రార్థించేవాడిని. ఆయన ఏమీ వినిపించుకొనేవారు కాదు. మామూలుగానే శ్లోకాలు చదువుకుంటూ వెళ్ళిపోయేవారు. కాళిదాసుని రఘువంశం మహాకావ్యంలో మొదటిసర్గ అంతా ఒకే ఛందస్సులో (అనుష్టుప్ ఛందస్సులో) సాగుతుంది. సర్గాంతంలో మాత్రం హఠాత్తుగా ఛందస్సుమార్చి ఒక శ్లోకం వ్రాస్తాడు కాళిదాసు. గురువుగారు సర్గఅంతా

పాఠం చెప్పేశారు. చివరలో "ప్రహర్షిణీ వృత్తం" ఉంది. నా వైపు తిరిగి, ఒక చిరునవ్వు నవ్వి, ఆ ప్రహర్షిణీ వృత్తాన్ని రాగచ్ఛాయలో భావయుక్తంగా ఎంతో అందంగా చదివారు. నేను తన్మయుడనైపోయాను! నేనేకాదు, మొత్తం తరగతిలోని విద్యార్థినీ విద్యార్థులందరూ రసానందంలో తలమునకలై పోయారు!

**మల్లాది రామకృష్ణశాస్త్రిగారిమీద కోపం:**

"అమ్మకు జేజే-నాన్నకు జేజే-గురువుకు జేజే" అనే పుస్తకంలో ఆరుద్రగారు, శ్రీవి.ఎ.కె.రంగారావుగారు తమ గురువుగారైన మల్లాది రామకృష్ణశాస్త్రిగారిని గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నారు. మల్లాదివారు దొక్కశుద్ధిగల మంచిపండితుడు, చేయితిరిగిన కథారచయిత కావచ్చు. ఏ సాహిత్యవేత్త అయినా సాహిత్యరంగంలో ఎంతో గొప్పవాడు కావచ్చు; కాని వైయక్తిక జీవితంలోకూడా గొప్పవాడుగా నీతిమంతుడుగా ఉండాలి. అప్పుడే అతడు పరిపూర్ణుడైన రచయిత. ఒకసారి పింగళివారి దగ్గర మల్లాది రామకృష్ణశాస్త్రిగారి ప్రసక్తి వచ్చింది. "తల్లి పుట్టిల్లు మేనమామకు తెలియదా?" అన్నట్టు, బందరులోని కవిపండితుల జీవితాలన్నీ గురువుగారి కరతలామలకం! మల్లాదివారి ప్రసక్తిరాగానే, పింగళివారికి ఎంతో కోపం వచ్చింది. "పురాణం సూరిశాస్త్రిగారు తన ఏకైక కుమార్తెనిచ్చి మహావైభవంగా పెండ్లి చేస్తే, ఆమెను బందరులో వదిలేసి, మద్రాసు పారిపోయి, సినిమావాళ్ళతో కలిసిపోయిన పరమ దౌ....డు!" అని తిట్టిపోశారు!

**"ఏమోయ్!" తెచ్చిన ఇబ్బంది:**

"ఏరా!"-"ఏమండీ!" ఈ రెండు సంబోధనలకు మధ్యలో "ఏమోయ్!" అనే ఒక సంబోధన కోస్తాజిల్లాల్లో ఉంది. ఇది "ఏరా!" కి ఎక్కువ; "ఏమండీ!"కి తక్కువ. మొత్తానికి గౌరవ ప్రదమైన సంబోధనే! (సాధారణంగా అత్తమామలు - అల్లుళ్ళని ఇలా సంబోధిస్తూ ఉండేవారు.) పింగళివారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రొఫెసర్ అండ్ హెడ్‌గా ఉండే రోజుల్లో ఆ శాఖలో "లక్ష్మీనారాయణ" అనే అటెండర్ ఉండేవాడు. అతడు మంచివాడు, వినయశీలి, భయభక్తులున్నవాడు. కోస్తాజిల్లాల పద్ధతిలో లక్ష్మీకాంతంగారు అతనిని "ఏమోయ్! లక్ష్మీనారాయణా!" అని పిలిచేవారు. అతడు చాలా ఇబ్బంది పడిపోయేవాడు! పెద్దవారైన పింగళివారితో చెప్పలేక పోయేవాడు. ఎందుకంటే,

చిత్తూరుజిల్లాలో బావమరిదిని "ఏమోయ్!" అని సంబోధిస్తారట! అందువల్ల తనగోడును డా॥ జి.యన్.రెడ్డిగారికి చెప్పుకున్నాడు. ఆయన ఏకాంతంగా పింగళివారితో ఈ విషయం చెప్పారు. తరువాత పింగళివారు ఆ అటెండర్‌ను "లక్ష్మీనారాయణా!" అని మాత్రమే పిలిచేవారు!

**నిత్యజీవితంలో "నటన":**

పింగళి లక్ష్మీకాంతంగారు రంగస్థలం మీద గొప్ప నటులు – అని ఇంతకుముందు "బందరుదశ"లో తెలియజేశాను. ఒక్కొక్కసారి నిత్యజీవితంలో కూడా అందంగా నటించేవారు. నేనొక సన్నివేశాన్ని చూచాను. 1962–63 సంవత్సరంలో–నేను ఎం.ఏ. ఫైనల్ చదువుతున్న రోజులలో–ఢిల్లీనుండి యు.జి.సి. కమీషన్ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పర్యవేక్షణకు వచ్చింది. అప్పుడు మా విశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపాల్ ప్రొ॥ కందుల పంపాపతిరావుగారు (మా రాజమండ్రికి చెందినవారు, ప్రపంచ ప్రఖ్యాతి చెందిన జంతుశాస్త్రవేత్త). యు.జి.సి. ఛైర్మన్ ప్రొ॥ కొఠారిగారు ప్రిన్సిపాల్‌గారి గదికి వచ్చారు. పంపాపతిరావుగారికి పింగళివారంటే ఎనలేని గౌరవం. కొఠారిగారికి లక్ష్మీకాంతంగారిని చూపించాలని పంపాపతిరావుగారి కోరిక. తన ప్యూన్ ద్వారా "కొఠారిగారు మిమ్మల్ని చూడటానికి వస్తున్నారు" అని పింగళివారికి కబురు చేశారు. ఆయన వెంటనే తన అటెండర్ లక్ష్మీనారాయణను గది బయట ఉండమని, ప్రిన్స్‌పాల్‌గారు, యు.జి.సి. ఛైర్మన్‌గారు వస్తుంటే తనకు చెప్పమన్నారు. కొంచెం సేపట్లో వారుద్దరూ వస్తున్నారని తెలిసి, తనగదిలో, లోపలి భాగంలో (Wooden Screen కి లోపల) కూర్చుని, వాల్మీకి రామాయణ శ్లోకాలను గొంతెత్తి మంచి రాగయుక్తంగా చదవడం ప్రారంభించారు. (వారు రంగస్థల నటులు, చక్కటి రాగాలు తెలుసు!). ఇంతలో పంపాపతిరావుగారు, కొఠారిగారు వచ్చారు. గది బయట ఉండగానే పింగళివారి శ్లోకాలు వారి చెవిని పడ్డాయి. గదిలోకి వచ్చి, Wooden Screen ని tap చేశారు ప్రిన్సిపాల్‌గారు. "Yes! come in" అన్నారు పింగళివారు. ఇద్దరూ లోపలికి వచ్చారు. గురువుగారి గంభీరమైన ఆకారాన్ని, పొందూరు ఖద్దరు పంచె కట్టును, సిల్కు కోటును, జరీకండువాను చూచి ఆశ్చర్యపోయారు కొఠారిగారు! "He is a great Professor and a great poet in Telugu. He is an asset to our University!" అన్నారు ప్రిన్సిపాల్‌గారు. కొఠారిగారు చిరునవ్వు నవ్వుతూ "What are you doing

Professor?" అని అడిగారు. "I am reading Valmiki's Ramayana!"అన్నారు పింగళివారు సగర్వంగా. "Yes! A Professor should be like this!"అని ప్రశంసించి వెళ్ళిపోయారు కొఠారిగారు. వారు వెళ్ళిపోగానే రామాయణంతీసి, టేబిలుమీద పడేసి, పడక కుర్చీలో పడుకుని, హాయిగా నిద్రపోయారు గురువుగారు! పింగళి వారు గొప్పవారే! అందులో ఏమీ సందేహం లేదు. కాని వారి గొప్పతనం ఉత్తరాదినుండి వచ్చిన ప్రొ॥ కొఠారిగారికి ఎలా తెలుస్తుంది? అందువల్ల, వారికి మంచి ఇంప్రెషన్ కలిగించడానికి ఇలా నటించారు. అంతే!

**గురుపత్ని గొప్పతనం:**

గురువర్యులు పింగళి లక్ష్మీకాంతంగారు ఎంత గొప్ప వ్యక్తిత్వం కలవారో, వారి ధర్మపత్ని కీ.శే. పింగళి (మోచర్ల) లక్ష్మీనరసమ్మగారు కూడా అంతే గొప్ప వ్యక్తిత్వం కలవారు. ఈ దంపతులు తిరుపతిలో ఉన్న రోజులలో, ఆమె ఆ ఊరిలోని మహిళామణులందరినీ చేరదీసి, ఒక సంస్థను ఏర్పాటు చేశారు. తిరుమల-తిరుపతి దేవస్థానంవారినుండి కొంత గ్రాంటును సంపాదించి "శ్రీపద్మావతీ ప్రార్థనా మందిరం" అనే భవనాన్ని నిర్మించారు. అక్కడ పేద మహిళలను కుట్టుపని, హస్తకళలు వంటివి నేర్పించేవారు. (ఆ భవనం ఇప్పటికీ తిరుపతిలో ఉందని భావిస్తున్నాను.) ఆమె గొప్ప సాహిత్యాభిరుచి కలవారు. "చల్లని సంసారం" అనే నవల రచించారు.

గురువుగారు ఎల్లప్పుడూ సాహిత్య చర్చలే తప్ప, సంసారంలోని లౌకిక విషయాలను అంతగా పట్టించుకొనేవారు కారు. అన్నీ గురుపత్నే చూసుకొనేవారు. ఎప్పుడైనా గురువుగారు లౌకిక విషయాలలో కలుగజేసుకోవాలని ప్రయత్నిస్తే, "మీకు తెలియదు! మీరు ఊరుకోండి! నేను చూస్తానుగా!" అని గద్దించేవారు గురుపత్ని. ఆయన "ఓహో! అలాగా! సరే!" అని ఎంతో గంభీరంగా తన ఓటమిని అంగీకరించి, నావైపు తిరిగి, "సూబ్బారావ్! మనపని చూడు!" అనేవారు-తిరిగి సాహిత్యంలోకంలోకి వచ్చి.

ఒకసారి, నేను-గురుపత్నిగారు-"స్త్రీలు-పురుషులు"-ఇంకా స్పష్టంగా చెప్పాలంటే – "భార్యలు-భర్తలు" అనే విషయాన్ని గురించి చర్చించుకుంటున్నాం." భార్య పాతివ్రత్యాన్ని పాటిస్తూ, భర్తకు అణిగిమణిగి ఉండి, అతనికి అనారోగ్యం వచ్చినప్పుడు ఎంతో సేవచేస్తూ, గొప్ప త్యాగశీలాన్ని చూపుతోంది. భర్త ఈ

స్థాయిలో భార్యకు కృతజ్ఞత చూపడంలేదు. పైగా, వైయక్తిక జీవితంలో, ఏకపత్నీవ్రతుడై ఉండకుండా, విశృంఖలంగా ప్రవర్తిస్తున్నాడు" – ఇది గురుపత్నిగారి వాదం. నేను మంచి భర్తల పరంగా కొంత వాదించి చూచాను, ఫలితం లేకపోయింది. నా వితండ వాదనతో ఆమె అగ్గిమీద గుగ్గిలమై పోయారు! "ఈ మగాళ్ళంతా వెధవలు! అందులో, తెలుగు చదువుకున్నవాళ్ళు మరీ వెధవలు!!" అన్నారు. ఆమె ఉగ్రరూపాన్ని చూచి, నేను భయపడి మెల్లగా ఇంటికి జారుకున్నాను.

ఇంటికి వెళ్ళి గురుపత్నిగారు చేసిన సిద్ధాంతాన్ని గురించి పదే పదే మనసులో చర్చించుకున్నాను. ఆమె చెప్పింది సత్యమే అని నా మనసు అంగీకరించింది. నాకు తెలిసిన ఎందరో తెలుగు ఆధునిక సాహిత్యవేత్తల, కవుల, కళాకారుల వైయక్తిక జీవితాలను సింహావలోకనం చేసుకున్నాను. వారిలో 90% మంది (నాతోసహా, ఒకరిద్దరు నా ఆప్త మిత్రులతో సహా) ఆమె దూషణకు అర్హులైనవారే! అందరూ పెండ్లినాటి "నాతి చరామి" ఒట్టును తీసి గట్టున పెట్టినవారే! అందరూ దక్షిణ నాయకులే! సిగ్గుతో తలవంచు కున్నాను! గురుపత్నిగారిలో ఇంతటి స్త్రీవాదం ఉండటాన్ని చూచి ఆశ్చరపోయాను!

**పండితులు, విమర్శకులు అంటే అసహనం:**

పింగళివారికి సంప్రదాయబద్ధంగా సంస్కృతాంధ్రాలు చదువుకున్న పండితులన్నా, తనను విమర్శించే వారన్నా మిక్కిలి అసహనం. ఒక చిన్న ఉదాహరణం చెపుతాను. 1964లో అనుకుంటాను, నేను రాజమండ్రి రైల్వేస్టేషన్‌లో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు అనే గొప్ప పండితుణ్ణి కలిశాను. వారు కాకినాడ పి.ఆర్. కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా ఉండేవారు. గొప్ప పండితుడు, అంతకన్నా గొప్ప విమర్శకుడు. శ్రీనాథుణ్ణి గురించి ఎంతో పరిశోధన చేశారు. శృంగారనైషధాది కావ్యాలు రచించిన శ్రీనాథుడు వేరు, పల్నాటివీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడు వేరు – అని వారి సిద్ధాంతం. ఇద్దరి గోత్రాలు భిన్నంగా ఉండటమే దీనికి కారణమన్నారు.

రాజమండ్రిలో నేను వారిని కలిసినప్పుడు నేను పింగళివారి దగ్గర తెలుగు వీరగాథలను గురించి పరిశోధన చేస్తున్నట్టు చెప్పాను. వారు చాలా సంతోషించి, పల్నాటి వీరచరిత్రను గురించి ఒక నూతన విషయం నాతో చెప్పారు: "పింగళివారి పరిష్కరణలో వెలువడిన పలనాటి వీరచరిత్రలో పూర్వభాగం చాలా సంక్షిప్తంగా

ఉంది. అది మద్రాసు వ్రాతప్రతులలోనిది కాదు. వారికి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ఇచ్చిన ఒక సంక్షిప్త ప్రతిని వారు అనుసరించారు. 'పలనాటి వీరచరిత్ర– పూర్వభాగం' విపులంగా ఉన్న తాళపత్రగ్రంథం ఒకటి పోలవరం జమీందారుగారి దగ్గర ఉంది. దానిని వారు కాపీ చేయించి కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తు గ్రంథాలయానికి ఇచ్చారు" అని చెప్పారు. నేను చాలా సంతోషించి, కాకినాడ వెళ్లి ఆప్రతిని చూడాలని మనస్సులో నిశ్చయించుకున్నాను. తిరుపతి వచ్చిన తర్వాత శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారిని కలిసిన విషయం, వారు చెప్పిన నూతనాంశాలు పింగళివారితో చెప్పాను. అంతే! ఆయన తోకతొక్కిన తాచుపాములా లేచారు. "వాడికి ఒక ఉత్తరం వ్రాయి; నేను డిక్టేట్ చేస్తాను! కాని ఆ ఉత్తరం నువ్వు వ్రాసినట్లుగా వ్రాయాలి!" అన్నారు. అమాయకుడనైన నేను 'సరే!' అన్నాను. ఒక ఇన్‌లాండ్ లెటర్ తీసుకొని కూర్చున్నాను. పాపయ్యశాస్త్రిగారిని ఛెడామడా తిడుతూ ఉత్తరం డిక్టేట్ చేశారు. ఆ ఉత్తరం పుచ్చుకొని గదికి వచ్చాను. అంత గొప్ప పండితుణ్ణి తిడుతూ నా పేరుతో ఉత్తరం పోస్టు చెయ్యడం ఎలాగ? అని సందిగ్ధంలో పడిపోయాను. రూమ్‌మేట్ శ్రీ L.B. శంకరారావుతో విషయం చెప్పాను. అతను చాలా తెలివైనవాడు; లోకజ్ఞానం బాగా ఉన్నవాడు. "ఉత్తరం వ్రాస్తే వ్రాశావుకాని, దానిని చింపివెయ్యి! పోస్టు చెయ్యద్దు! ఆ పండితుడు బాధపడతాడు. గురువుగారికి "పోస్టుచేశాను" అని అబద్ధం చెప్పు!" అని సలహా యిచ్చాడు. నాలుగు రోజులు ఆగాను. ప్రియమిత్రుడు శంకరరావు ఇచ్చిన మంచి సలహాను పెడచెవిని పెట్టి, ఆ ఇన్‌లాండ్ లెచరు పోస్టు చేశాను! నేను వెర్రివెధవను; లోకజ్ఞానశూన్యుడను! ("వెర్రి సుబ్బన్న" గారి కొడుకును! మా నాన్నగారికి మా ఊళ్లో "వెర్రిసుబ్బన్నగారు" అని పేరు. మమ్మల్ని చిన్నతనంలో "వెర్రి సుబ్బన్నగారి పిల్లలు!" అని పిలిచేవారు. దానికి మేము చాలా బాధపడేవాళ్లం!) వారంరోజుల్లో చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు ఎంతో మానసిక క్షోభను అనుభవిస్తూ నాకు ప్రత్యుత్తరమిచ్చారు. అందులో ఒక కాళిదాసు శ్లోకాన్ని కూడా ఉదాహరించారు. ఆ ఉత్తరం నేను వ్రాయలేదనీ, పింగళివారు డిక్టేట్ చేశారని వారికేం తెలుసు, పాపం? ఈ పని చేసి, ఒక ఉత్తమ పండితుణ్ణి క్షోభపెట్టినందుకు ఇప్పటికీ బాధపడుతున్నాను.

పై విధంగా పాపయ్యశాస్త్రిగారి స్నేహం బెడిసికొట్టినందువల్ల, అన్యాయంగా

వారికి మనస్తాపం కలిగించినందువల్ల, పలనాటి వీరచరిత్ర పూర్వభాగాన్ని ఈ నాటివరకూ నేను సేకరించలేకపోయాను. తరువాతి కాలంలో కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయానికి వెళ్లి వెతికాను కాని దొరకలేదు. అది బహుశః పాపయ్యశాస్త్రిగారిదగ్గరే ఉండిపోయి వుంటుంది! కాకినాడలో వారి సంతతికోసం ప్రయత్నించాను; ఎవరూ దొరకలేదు. ఈ వ్రాతప్రతి మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారంలో కూడా ఉంది: డి.నెం.1140; డి.నెం.1153 (రెండు ప్రతులు). వీటికోసం ఎంతో ప్రయత్నిస్తున్నాను. లభించేలా కనపడటంలేదు. ఈ వ్రాతప్రతిలో "పెద్దన్న బాదరాజు పెండ్లికథ" – "అనుగురాజు దక్షిణాది యాత్రకథ" – "బ్రహ్మనాయని పుట్టుక" – "నాయకురాలు కథ" – మొదలైన అపురూపమైన వీరగాథలున్నాయి. ఎవరైనా యువకులు ప్రయత్నిస్తే బాగుండును!

**గురువుగారు వార్తాపత్రికలు చదివేవారు కారు:**

గురువర్యులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తిరుపతిలో ఉండగా ఏనాడూ వార్తాపత్రికలు చదవడం నేను చూడలేదు. ఉండబట్టలేక, ఒకరోజు అడిగేశాను: "సార్! మీరు న్యూస్ పేపర్స్ చదవరేమిటి?". ఈ ప్రశ్నకు పింగళివారు చెప్పిన సమాధానం: "నాయనా! న్యూస్ పేపర్స్‌లో దేశంలో ఉన్న ఎన్నో సమస్యలను గురించి (పేదరికం, నిరుద్యోగం, ఆకలిచావులు, హత్యలు, రోడ్డు ప్రమాదాలు మొదలైన వాటిని గురించి) వ్రాస్తారు. ఆ సమస్యలను మనం పరిష్కరించలేం! ఊరికే చదివి బాధపడటం దేనికి? అందువల్ల నేను వార్తాపత్రికలు చదవడం మానేశాను!". ఈ సమాధానం విన్నాక "అవును! గురువుగారు చెప్పింది నిజమే కదా!" అనిపించింది నా మనస్సులో…

**గురువుగారి ఫేస్ రీడింగ్ శక్తి:**

మా నాన్నగారు సుబ్బావధానులుగారు మిక్కిలి అమాయకులు. లోకవ్యవహారాలు ఏమీ తెలియవు. ఎప్పుడూ పడకకుర్చీలో పడుకొని వేదం వల్లెవేసుకుంటూ ఉండేవారు. సంసారంలోని పనులన్నీ మా అమ్మగారే నిర్వహించుకొనేవారు. అప్పుడప్పుడు విసుగుచెంది "ఆడపని మగపని అన్నీ నేనే చేసుకోవాలి" అని బాధపడేవారు. మా నాన్నగారి అమాయకత్వం అంతో ఇంతో మా అక్కయ్యలిద్దరికి, మా అన్నదమ్ములు నలుగురికి వచ్చింది. గురువుగారు

ఒకసారి నా ముఖంలోకి చూచి “సుబ్బారావ్! నీ ముఖం చూచి నీ మనస్సులో ఏముందో చెప్పేయగలను!” అన్నారు. నేను ఆశ్చర్యపోయాను! నా ముఖంలో అమాయకత్వం తొంగిచూస్తోందని గ్రహించుకున్నాను.

**అస్తమయం**

సతీవియోగం తరువాత తిరుపతిలోని ఒంటరిగా ఉంటున్న పింగళివారు 1971 ఆగస్టు నెలలో అస్వస్థులయ్యారు. వైద్యంకోసం హైదరాబాదు వెళ్ళారు. అక్కడే 1972 జనవరి 10వ తేదీన స్వర్గస్థులయ్యారు. వారు పుట్టినది కూడా (1894) జనవరి 10వ తేదీయే! జన్మించిన తేదీనాడే మరల మరణించడం ఒక ఆశ్చర్యకరమైన విషయం! దీనిని నా సహాధ్యాయియైన కవిమిత్రుడు డా॥ మల్లెల గురవయ్య ఇలా వర్ణించాడు:

**క.“జనవరి పది జననంబా!**
**జనవరి పదినాడె దైవసాయుజ్యంబా!**
**ఘనమగు నీ సాధర్మ్యము**
**జననము-మృతి యొక్కటన్న సత్యము చాటెన్!”**

పూర్తిగా 78 సం.లు జీవించిన దేశికోత్తముడు పింగళివారు!

పింగళి లక్ష్మీకాంతంగారు 1931 నుండి 1949 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగుసాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ, సంస్కృతం బోధించారు. ఎన్నో నూతన సిద్ధాంతాలు ప్రతిపాదించారు. ప్రాచ్య పాశ్చాత్య విమర్శలకు ఒక సమన్వయం చేకూర్చారు. కాని తన బోధనను ఆనాడు గ్రంథరూపంలో పెట్టలేక పోయారు. తిరుపతి వచ్చాక, వృద్ధాప్యదశలో, ఆ ప్రయత్నం చేసినా, వాటికి సమగ్రత చేకూరలేదు. కేవలం తన విద్యార్థుల నోట్సుమీద ఆధారపడటమే దీనికి కారణం కావచ్చును. పైగా సాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ కాలానుగుణంగా మార్పులు చెందుతూ, పింగళివారిని దాటి, బాగా ముందుకు వెళ్ళిపోయాయి. అయినా ఈ రెండింటికి పునాదులు వేసింది మాత్రం లక్ష్మీకాంతంగారే అన్న సంగతి మనం మరచిపోకూడదు!

22 సం.లు విశ్వవిద్యాలయంలో తెలుగు సాహిత్యం బోధించటం వలన (విశాఖ పట్టణంలో 18 సం.లు – తిరుపతిలో 4 సం.లు) పింగళి లక్ష్మీకాంతంగారికి ఎందరో శిష్యగణం ఏర్పడ్డారు. వారు తరువాతి కాలంలో సాహిత్యలోకంలో

విస్తారమైన కీర్తిప్రతిష్ఠలు గడించారు. ఉదాహరణానికి: దివాకర్ల వేంకటావధాని గారు, కె.వి.ఆర్. నరసింహంగారు, బాలాంత్రపు రజనీకాంతరావుగారు, పి.ఎస్.ఆర్. అప్పారావుగారు, భద్రిరాజు కృష్ణమూర్తిగారు, కొత్తపల్లి వీరభద్రరావుగారు, నందూరి రామకృష్ణమాచార్యులవారు, దిగుమర్తి సీతారామస్వామిగారు, నాయని కృష్ణకుమారిగారు, అద్దేపల్లి రామమోహనరావుగారు, ఎల్.బి. శంకరరావుగారు, తంగిరాల సుబ్బారావుగారు, ప్రసాదరాయ కులపతిగారు, మొవ్వ వృషాద్రిపతిగారు, మల్లెల గురవయ్యగారు ఇత్యాదులు.

**"పిండితార్థం ("సారాంశం" అనడానికి పింగళివారు ఈ పదప్రయోగం చేసేవారు):**

1970లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ పింగళివారిని విశిష్టసభ్యునిగా ఎన్నుకున్నది. అదే సంవత్సరం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు వీరికి గౌరవ డాక్టరేటును ఇచ్చి సత్కరించారు. ఆ సందర్భంగా, తెలుగుశాఖాధ్యక్షులైన ప్రొ॥ జి.యన్.రెడ్డిగారు ఇచ్చిన సైటేషన్ పింగళివారి వ్యక్తిత్వానికి ఎత్తిపట్టిన మణిదర్పణం:- "పింగళివారు కవిశేఖరులు మాత్రమే కాదు, సాటిలేని సాహిత్యాచార్యులు కూడా. తెలుగు ఎం.ఏ., ఎం.ఏ.(ఆనర్స్), పిహెచ్.డి. డిగ్రీలను అపూర్వంగా రూపొందించి, ఉన్నతవిద్యారంగంలో తెలుగుభాషాధ్యయనానికి సముచిత స్థానాన్నీ, గౌరవాన్నీ కల్పించిన ఆద్యులు శ్రీ పింగళివారు. సాధారణంగా పండితులలో కన్పించే ఛాందసమూ, ఆశ్రయింపూ, ఆత్మన్యూనతా - ఇత్యాది అవగుణాలకు శ్రీ లక్ష్మీకాంతంగారు అతీతంగా ఉంటూ - ఆత్మవిశ్వాసాన్నీ, ఆత్మగౌరవాన్నీ నిర్భయంగా ప్రకటించి, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన కట్టమంచి రామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణుల గౌరవానికీ, అభిమానానికీ పాత్రులైనారు. శ్రోతలను ఆకట్టుకొని, మంత్రముగ్ధులను చేయగల వాక్చాతురి పింగళివారి ప్రతిభా విశేషాలలో ఒకటి.... చక్కని కవితలను అల్లగలిగిన కవులు, చక్కనివచన రచనలు కావించటం అరుదు. శ్రీ పింగళివారు ఎంతటి మధుర మంజులమైన కవిత్వాన్ని వ్రాయగలరో, అంతటి మనోజ్ఞమైన వచన రచన చేయగల సమర్థులు. వచనశైలిలో పింగళివారిశైలి పింగళివారిదే!... పింగళివారి రచన సలక్షణమయ్యును సరళము; సరళమయ్యునూ సాంద్రభావసముపేతము; సాంద్రభావసముపేతమయ్యునూ సుబోధము. శ్రీ పింగళివారి నడకలోని ఠీవి, నడవడిలోని నిండుదనం, వ్యక్తిత్వంలోని గాంభీర్యం, వారి వచనశైలిలో ఉట్టిపడుతూ ఉంటాయి."

పింగళివారి ప్రియశిష్యుడు, మా గురువర్యులు అయిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారు తమ గురుదేవులను ఇలా వర్ణించారు:-

**ఉ. "నీ తలయూపు, నీ నడక, నీనుడికారము, ఠీవి యే మహీ**
**నేతకు గల్గు? తెల్గునకు నీవలనంగద గల్గె నేటి వి**
**ఖ్యాతి, కవీంద్రులన్ మలచినట్టి కవీశ్వర! సాహితీపరం**
**జ్యోతివి నీవు పింగళిమహోదయ! విశ్వకళా జగద్గురూ!!"**

గురుదేవులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి గంభీరమైనమూర్తిని కళ్ళకు కట్టినట్టుగా చిత్రించిన ఒక సుందర తైలవర్ణచిత్రం వంటి చక్కని వర్ణనతో నా వ్యాసానికి ముగింపు పలుకుతున్నాను....

**సీ॥ ఎగదువ్వగా వంగకెగయు పట్టుతురాయి**
**వలె నిల్చు తెలికేశముల బెడంగు,**
**నిడుదైన నొసటిపై నిలువుగా దిద్ది తీ**
**ర్చిన యెఱ్ఱచాదు వాసనల సౌరు,**
**మడతపెట్టిన బెట్టుమాయని నునుపట్టు**
**బంగారు పొడవుజుబ్బా పసందు,**
**చలువచేసిన సన్న తెలినూలు పొందూరు**
**మడుగు ధోవతి పింజెమడుగుల తీరు,**
**తే.గీ. నయనముల తాలుచు సులోచనముల మెఱుపు,**
**కంఠమున వ్రేలు గ్రైవేయకమ్ము ఠీవి,**
**వేదికను నిల్చి నటియించు విగ్రహమ్ము,**
**గురులకు గురుండొ, మారు శ్రీవరుడొ యనరె!**

-శ్రీవారి శిష్యుడు: డా॥ బాలాంత్రపు రజనీకాంతరావుగారు

**పింగళివారి రచనలు:-**

**i) కాటూరివారితో కలిసి**

1) తొలకరి (ఖండకావ్య సంపుటి), 1923

2) సౌందరనందము (కావ్యం), 1932.

**ii) స్వతంత్రంగా:-**

a) కవిత్వం: 1) మధుర పండిత రాజము (ఖండకావ్యం), 1962.

2) ఆత్మలహరి (ఖండకావ్యం), 1973.

b) గద్యం: 1) గౌతమ వ్యాసములు, 1952

2) నా రేడియో ప్రసంగములు, 1963

3) సాహిత్యశిల్ప సమీక్ష (విమర్శ), 1966

4) సవిమర్శ ఆంధ్ర సాహిత్య చరిత్ర, 1998.

c) ఇతరములు: 1) గౌతమ నిఘంటువు (ఇంగ్లీషు–తెలుగు డిక్షనరీ), 1961

2) సంస్కృత కుమార వ్యాకరణము, 1968

d) అనువాదములు: 1) ఆంగ్లదేశ చరిత్ర, 1931

2) మానవులందరు సోదరులు, 1964

3) మాబీడిక్, 1967

e) పరిష్కరించిన గ్రంథములు: 1) ద్విపద భారతము, 1949కి పూర్వం

2) పల్నాటి వీరచరిత్ర, 1961

(ఈ వ్యాసానికి ప్రధానమైన ఆధారగ్రంథం: పింగళి లక్ష్మీకాంతంగారి ద్వితీయ పుత్రుడు శ్రీ పింగళి సూర్యసుందరంగారి రచన "పింగళి లక్ష్మీకాంతం" (1894–1972), సి.పి.బ్రౌన్ అకాడమి ప్రచురణ, 2010. శ్రీ సూర్యసుందరంగారికి మిక్కిలి కృతజ్ఞుడను.)



**ఉ॥ "చూచును మిత్రకోటిఁ దన సోదరులట్టుల, శిష్యసంతతిన్**
**జూచును పుత్రులన్ బలెఁ, దెనుంగునఁ గన్నడమందుఁ గీరితిన్**
**మోచెను, లేరు వాని సరిపోలెడువారని యందురందఱున్**
**మా చినబావగారొక అమాయకుఁడే యెవరెన్ని చెప్పినన్!"**

– దుగ్గిరాల రామరావుగారు ("మా సుబ్బన్నబావ"నుండి)



# 3. గురుదేవులు దిగుమర్తివారి జ్ఞాపకశకలాలు (1914-1972)

**మ॥ తన వాత్సల్యసుధాబ్ధి ముంచి, నను ఏతన్మాత్రుగా తీర్చి, అం**
**తన చాలింపక, పింగళాన్వయునిచేతన్ తీర్చిదిద్దించి, దీ**
**వన లందించిన దేశికోత్తముడు, వాక్ ప్రాగల్భ్యదుగ్ధాబ్ధి, వం**
**దనముల్ మా "దిగుమర్తి" వంశ్యునకు "సీతారామశ్రీస్వామి"కిన్.**

నేను పశ్చిమ గోదావరిజిల్లాలోని భీమవరంలో W.G.B. College (West Godavari Bhimavaram College – ఇప్పుడు D.N.R. College)లో 1952–54 మధ్య ఇంటర్మీడియేట్ (Bi.P.C. Group), 1955–57 మధ్య B.A. (Special Telugu) చదివాను. అప్పుడు గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు మాకు తెలుగు బోధించారు. ఆయనవల్లనే నాకు తెలుగుసాహిత్యంమీద మంచి అభిరుచి కలిగింది. నాలుగేళ్ల తరువాత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి దగ్గర ఎం.ఏ. (తెలుగు), పిహెచ్.డి. తెలుగు చేశాను. పింగళివారు దిగుమర్తిగారికి గురుదేవులు.

దిగుమర్తి వేంకట సీతారామస్వామిగారు క్రీ.శ. 1914 మే 13వ తేదీన, నేటి విజయనగరంజిల్లా బొబ్బిలి (వీరభూమి)లో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ.(ఆనర్సు) తెలుగు చదివి, 1946లో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తరవాత W.G.B. కళాశాలలో 1947 జూలై నెలలో తెలుగు ఉపన్యాసకులుగా ప్రవేశించారు. సుమారు 25 సంవత్సరాలు అక్కడ పనిచేసి, సర్వీసులో ఉండగానే 1972 జనవరి 14వ తేది సంక్రాంతి పర్వదినాన స్వర్గస్థులయ్యారు. "సప్తశతీసారము" (1951) – "ఋతుసంహారము" (1956) – "సుహృల్లేఖ" (1968) – "స్వామి పుష్కరిణి" (1974) – "అనర్ఘమణులు"

(1991) – "హిమని" (1992) –వీరి ముద్రిత రచనలు. 1952–54 మధ్య నేను ఇంటర్‌మీడియేట్ చదివినప్పటి వారి జ్ఞాపకాలను, 1955–57 మధ్య నేను బి.ఏ. (స్పెషల్ తెలుగు) చదివినప్పటి వారి జ్ఞాపకాలను, తరవాత 1961–1971 మధ్య నేను M.A., Ph.D. చదివి ఉద్యోగంలో చేరిననాటి జ్ఞాపకాలను దిగువ ఇస్తున్నాను. ఇవి అప్పుడప్పుడు జరిగిన సంఘటనలు; అనుస్యూతంగా లేవు. అందువల్ల "జ్ఞాపక శకలాలు"గా పేర్కొన్నాను. ఈ శకలాలను మూడు శీర్షికల క్రింద సర్దిపెట్టాను. (1) ఇంటర్ చదువుతున్నప్పుడు (1952–54); (2) బి.ఏ. చదువుతున్నప్పుడు (1955–58); (3) ఎం.ఏ., పిహెచ్.డి., ఉద్యోగం చేస్తున్నప్పుడు (1961–72).

**I. ఇంటర్‌మీడియేట్ చదువుతున్నప్పుడు (1952–54) జరిగిన సంఘటనలు:**

**1) పైజామా–కోటు:–** దిగుమర్తి సీతారామస్వామిగారు (ఇక మీదట "దిసీరా") తెల్లటి పైజామా, దానిమీద సన్నగళ్ళ షర్టు లేదా తెల్లషర్టు లేదా లేతరంగు షర్టు, (ఫుల్‌హాండ్స్, కఫ్‌లింగ్స్‌తో) ధరించేవారు. ఆ షర్టు మీద లైట్‌కలర్ కోటు ఒకటి వేసుకొనేవారు. కాళ్ళకి పల్చని ఆకుజోడు, చేతిలో గొడుగు – ఇదీ దిసీరా వేషం. ఎవరైనా ప్యాంటు షర్టు టక్ చేసికొని, దాని మీద కోటు వేసుకుంటారు కాని, పైజామా షర్టు మీద కోటు ఎవరూ వేసుకోరు. అందువల్ల విద్యార్థులు వారి వేషాన్ని రహస్యంగా ఆక్షేపించేవారు. మా బ్యాచ్‌లో వుద్దగిరి శరభేశ్వరరావు అనే నా వైశ్యమిత్రుడు గురువుగారిని "పైజామాకోటు" అనే వాడు. తరువాతి కాలంలో చదివిన వారిలో పల్లికొండ ఆపదరావు అనే విద్యార్థి వారిని "అత్తరు సాయెబు" అని పిలిచేవాడు. తెలుగుశాఖాధిపతులైన నందూరు రామకృష్ణమాచార్యులవారు మాత్రం పంచెకట్టు, లాల్చీ, భుజంమీద సిల్కు కండువాతో క్లాసుకు వచ్చేవారు. వీరు 1955లో గవర్నమెంటు సర్వీసులోకి మారిపోగా దిగుమర్తివారు తెలుగు హెడ్ అయ్యారు. దిసీరాగారి జుట్టు బాగా నెరిసిపోయి ముగ్గుబుట్టలా ఉండేది. మీసాలు ఉండేవి కావు. మాటలు ఆడవాళ్ళమాటల్లా బాగా సాగదీస్తూ మాట్లాడేవారు. గొప్ప విమర్శకులు. తెలుగు పాఠాలు చాలా గొప్పగా చెప్పేవారు. వారికి ప్రాచీన కవులలో శ్రీనాథుడు అంటే చాలా యిష్టం. "తెలుగుదేశాన్ని, తెలుగు స్త్రీలను వర్ణించిన కవి ఎవడున్నాడు? – ఒక్క శ్రీనాథుడు తప్ప?" అనేవారు.

ఈ శ్రీనాథాభిమానం వారి శిష్యులందరికీ కలిగింది. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు శ్రీనాథుని గురించి పిహెచ్.డి. పరిశోధన చేశారు. నేను మా అబ్బాయికి "శ్రీనాథకవిసార్వభౌముడు" అని పేరు పెట్టాను.

**2) అన్న తెలుపు - తమ్ముడు నలుపు:-**

దిగుమర్తివారు తెల్లగా, పచ్చదబ్బపండు శరీరచ్ఛాయతో అందంగా ఉండేవారు. వారి తమ్ముడు డా॥ దిగుమర్తి సుందర శివరావుగారు విశాఖపట్టణం మెడికల్ కాలేజీలో వైస్-ప్రిన్సిపల్‌గా ఉండేవారు. ఆయన పోలిక, మాటలాడే విధానం అన్నీ అన్నగారిలాగే ఉన్నా, శరీరంరంగు మాత్రం నల్లటి నలుపుతో, నల్లటి ఉంగరాల జుట్టుతో ఉండేవారు. దిగుమర్తివారికి ఇద్దరు కొడుకులు. పెద్దకొడుకు నల్లగా ఉండేవాడు; రెండవ కొడుకు చి॥ జగన్నాథశౌరి తెల్లగా మేస్టారులాగే ఉండేవాడు. దీనిని బట్టి దిసీరా తల్లిదండ్రులలో ఒకరు తెల్లగానూ, మరొకరు నల్లగానూ ఉండి ఉంటారని నేను ఊహించుకున్నాను.

**3) "నేను పాడితే మీరు ఆడతారయ్యా!":-**

దిసీరా ఛలోక్తులు బాగా విసిరేవారు (క్లాసులోను బయటా కూడా). ఇంటర్‌లో మాకు కవిత్వం బోధించేవారు. వారు పద్యాలను మామూలుగా భావగర్భితంగా చదవేవారు; కావ్యధోరణిలో పాడేవారుకారు. తెలుగుశాఖలో ఇంకొక పండిత ఉపన్యాసకులు ఉండేవారు. వారి పేరు చిలుకూరి వీరభద్రశాస్త్రిగారు. ఆయన ఇంటర్‌లో మా క్లాసుకు కాకుండా, ఇతర క్లాసులకు వెళ్ళేవారు ఆయన తెలుగు పద్యాన్ని ఎంతో మధురంగా పాడేవారు. విద్యార్థులంతా తన్మయులై వినేవారు. ఆయన కంఠం కంచుకంఠంగా ఖంగున మ్రోగేది. వారిని విద్యార్థులు "ఘంటసాల మాస్టారు" అని ఆప్యాయంగా పిలిచేవారు. ఒకసారి ఒక విద్యార్థి మా క్లాసులో దిగుమర్తివారిని: "సార్! మీరు పద్యాన్ని ఎందుకు పాడరు?" అని అడిగాడు. దానికి వారు "నేను పాడితే మీరు ఆడుతారయ్యా!" అన్నారు. అంతా గొల్లున నవ్వారు.

**4) ఛలోక్తులు:-**

దిసీరా విసిరే ఛలోక్తులలో "tit for tat" ఎక్కువ పదునుగా ఉండేది. ఒకసారి మా కళాశాల ప్రిన్స్‌పాల్ అయిన ఇ.లక్ష్మీనాథరావుగారు దిసీరాను "మీ

తెలుగు సబ్జెక్ట్‌లో ఎక్కువ మార్కులు ఎందుకు వెయ్యరు?" అని అడిగారు. దానికి దిసీరా: "తెలుగులో ఎక్కువ మార్కులు వేయడమనేది పేపర్లు దిద్దేవాడి అజ్ఞానాన్ని బట్టి ఉంటుంది!" అన్నారు.

**5) "ఎవరిమెడలో వేయునో!:–**

ఇంటర్‌లో దిసీరా మాకు పొయిట్రీనే కాకుండా Composition (వ్యాసం) కూడా బోధించేవారు. ఒకసారి ఆ కాంపోజిషన్ క్లాసులో "వ్యాసం–విమర్శ" అనే విషయాలు మాకు dictate చేస్తున్నారు: "తెలుగులో అన్ని ప్రక్రియలు అభివృద్ధి చెందుతున్నాయి. కాని విమర్శమాత్రం ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్నట్టుగా ఉంది. సరియైన విమర్శకులు మనకులేరు" – అనే విషయాన్ని నొక్కి చెపుతూ – "భవిషత్తులో విమర్శరంగంలో కృషిచేసేవారికి గొప్ప కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి!" అనే విధంగా ఒక వ్యాసం మాకు dictate చేస్తున్నారు. మేమంతా శ్రద్ధగా నిశ్శబ్దంగా వ్రాసుకుంటున్నాం. ఆ వ్యాసంలో చివరి వాక్యం: "కీర్తికాంత పూలహారమును తీసికొని సిద్ధముగా నున్నది!" అని చెప్పారు. వెంటనే నా మిత్రుడు వుద్దగిరి శరభేశ్వరరావు అనే అతడు "ఎవరి మెడలో వేయునో!" అన్నాడు మెల్లగా తలవంచుకొని. క్లాంతా గొల్లుమని నవ్వింది. వెన్వెంటనే గురవుగారు: "మెడలు నిక్కించినంతమాత్రమున వేయదు; తగిన కృషి సలుపవలెను" అన్నారు. మళ్ళీ క్లాసంతా పకపకా నవ్వింది. "ఇది కూడా వ్రాసుకోండి!" అన్నారు దిసీరా. మళ్ళీ అంతా నవ్వి, ఆ వాక్యం కూడా వ్రాసుకున్నాం నోట్సులో.

**6) ప్రతాపరుద్రీయం నాటకప్రదర్శన:–**

ఒకసారి మా కళాశాలలోని అధ్యాపకులంతా కలిసి వేదం వేంకటరాయశాస్త్రి గారు రచించిన ప్రతాపరుద్రీయం నాటకాన్ని ప్రదర్శించారు. mathematics department లో ఉన్న జోస్యుల ఎస్. వెంకటేశ్వర్లు (J.S.V)గారు ప్రతాపరుద్రుడు గాను, పేరిగాడుగాను అమోఘంగా నటించారు. ఆయన సన్నగా పొడుగ్గా తెల్లగా చక్కని కనుముక్కు తీరుతో చాలా అందంగా ఉండేవారు. వీరి పేరు మధ్యలో ఉన్న "S" అంటే "శ్రీ" అని కాని "సత్య" అని కాని "సూర్య" అని కాని అయి ఉంటుంది. సరిగ్గా జ్ఞాపకం లేదు.) అలాగే ఆంగ్లశాఖలో పనిచేసే బోగం సుబ్బారావుగారు యుగంధరమంత్రిగాను, ఒక హిందీ ఉపన్యాసకులు ఢిల్లీ

సుల్తానుగాను చక్కగా నటించారు. నాటకం మధ్యలో విరామం వచ్చింది. అప్పుడు దిసీరాగారిని నాటకాన్ని గురించి రెండు మాటలు చెప్పమన్నారు. అప్పుడు వారు: "నాటకం మధ్యలో నేను ప్రసంగించడం, సినీమా ఇంటర్‌వెల్‌లో "షోడా! షోడా!" అని అరిచినట్టుగా ఉంటుంది!" అని చమత్కరించి, నాటకాన్నిగురించి చక్కగా వివరించారు.

**7) "తెప్పపై ఒప్పుల కుప్ప":-**

దిసీరా సంప్రదాయవాది. ప్రాచీన సాహిత్యాన్ని ఎక్కువగా అభిమానించేవారు. ఆధునికులలో ఒక్క విశ్వనాథవారు తప్ప ఇంకెవ్వరూ ఆయనకు నచ్చేవారు కాదు. మాకు ఇంటర్‌లో సెట్టి లక్ష్మీనరసింహంగారి "భీష్మప్రతిజ్ఞ" అనే ఖండిక ఉండేది. దానిలో మత్స్యగంధిని వర్ణిస్తూ: "తెప్పపై ఒప్పుల కుప్ప..." అనే పద్యంలో ద్విత్వపకారంతో అంతమయ్యే ఎన్నో పద్యాలు వస్తాయి. ఆ పద్యమంతా చదివి దిసీరా "నయమే! చిప్ప అనలేదు, సంతోషం!" అని వ్యాఖ్యానించారు. క్లాసంతా గొల్లున నవ్వింది.

**8) "గాలి మహాసముద్రం మీదనుంచి రావాలి కాని పిల్లకాలవ మీదనుంచి కాదు!":-**

నేను 1952లో ఎస్.ఎస్.ఎల్.సి. తణుకు హైస్కూలులో సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడనయ్యాను. అప్పుడు మా అన్నయ్య టి.వి.కె. సోమయాజులుగారు నాకు శ్రీశ్రీ "మహాప్రస్థానం" ఇచ్చి చదవమన్నాడు. అది ముద్రిత ప్రతికాదు; లిఖిత ప్రతి. మా అన్నయ్య మిత్రుడైన ఒక B.Sc., B.Ed. మేస్టారు (సాహిత్య ప్రియుడు) స్వహస్తాలతో ముద్రితప్రతినుండి కాపీచేసికొనిన ప్రతి. ఆ రోజుల్లో ముద్రిత ప్రతి ఖరీదు: మూడు రూపాయల ఎనిమిది అణాలు. అంటే ఈ రోజుల్లో రూ.1350/- లకు సమానం. పేదలనుగురించి కవితలు అల్లిన శ్రీశ్రీగారు అంత ఖరీదు ఎందుకు పెట్టాడో అర్థంకాలేదు. అంత ఖరీదు భరించలేక ఆయన చేతితో కాపీ చేసుకున్నాడు. (ఆ రోజుల్లో జిరాక్స్ యంత్రాలు లేవు.) నేను ఆ వ్రాతప్రతి మహాప్రస్థానమంతా చదివాను. ఎంతో ఆశ్చర్యానికి, ఆనందానికి లోనయ్యాను. ఈ మూలనుండి ఆ మూలకు అంతా కంఠస్థం చేసివేశాను. దాని ప్రభావంతో ఇంటర్‌లో కవితలు వ్రాయడం మొదలుపెట్టాను. ఎంతో గొప్ప కవిత్వం వ్రాసినట్టుగా భ్రమపడి సిగ్గులేకుండా వాటిని దిగుమర్తివారికి చూపించేవాడిని. ఆయన వాటిని

చూచి, నేను శ్రీశ్రీని అనుకరిస్తూ వ్రాస్తున్నానని గ్రహించి, చిరునవ్వు నవ్వుతూ, "నాయనా! గాలి మహాసముద్రం మీదనుండి రావాలి కాని, పిల్లకాలువ మీదనుండి రాకూడదు!" అన్నారు. అంటే ప్రాచీనసాహిత్యం మహాసముద్రం; శ్రీశ్రీ పిల్లకాలువ!

### 9) పేరు మధ్యలో "వేంకట" శబ్దం కత్తిరించి:–

దిసీరాగారి పూర్తిపేరు: దిగుమర్తి వేంకట సీతారామస్వామిగారు. తెలుగు వాళ్ళల్లో పేర్లకు ముందు "వేంకట" శబ్దం ఉండటం సర్వసాధారణం కాని దానిని మనం గుర్తించం. ఉదా॥ గురజాడ అప్పారావు (గురజాడ వేంకట అప్పారావు); దేవులపల్లి కృష్ణశాస్త్రి (దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి); నండూరి సుబ్బారావు (నండూరి వేంకట సుబ్బారావు); బసవరాజు అప్పారావు (బసవరాజు వేంకట అప్పారావు) ఇత్యాదులు. అందువల్ల దిసీరా కూడా తమ పేరులో "వేంకట" శబ్దం తీసివేసి, కేవలం "దిగుమర్తి సీతారామస్వామి" అని మాత్రమే వ్రాసేవారు. ఆ రోజుల్లో దిగుమర్తివారి కవితలు (పద్యాలు) "భారతి" మాసపత్రికలో తరచుగా వచ్చేవి. ఆ కవితల క్రింద "వేంకట" శబ్దం తీసివేసి వ్రాసేవారు. ఇంగ్లీషులో మాత్రం "D.V. Sitarama Swamy" అని వ్రాసేవారు. గురువుగారి పద్యరచన చాలా ప్రౌఢంగా ఉండేది. కాళిదాసు ఋతుసంహారాన్ని కూడా ప్రౌఢంగానే అనువదించారు.

### 10) "తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?":–

ఒకసారి గుంటూరు ఎ.సి. కాలేజీలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేసే ప్రసిద్ధ రచయిత "అమరేంద్ర" (చతుర్వేదుల నరసింహశాస్త్రిగారు) భీమవరం కళాశాలలో ప్రసంగించడానికి వచ్చారు. ఆ సభకు దిగుమర్తివారు అధ్యక్షులు. అమరేంద్ర, శ్రీశ్రీ కవిత్వాన్ని ప్రశంసిస్తూ "తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అని ఎంత గొప్పగా ప్రశ్నించాడు? – అన్నారు. సభాధ్యక్షులు దిసీరా తన ముగింపు ప్రసంగంలో శ్రీశ్రీ పాదాలను ఆక్షేపిస్తూ "గర్భధానం గదిలోకి వెళ్ళి 'ఈ చీర ఖరీదు ఎంత?' అని అడిగినట్టుగా ఉన్నాయి శ్రీశ్రీ పాదాలు?" అన్నారు. అంతా గొల్లున నవ్వారు. అమరేంద్ర: "ఈ అధ్యక్షులవారిముందు మాట్లాడాలంటే నాకు కాళ్ళు వణుకుతున్నాయి!" అన్నారు. "ఒక అందమైన వస్తువును చూస్తుంటే, ఆ సౌందర్యాన్ని ఆస్వాదించాలి కాని, ఇలా ప్రశ్నించకూడదు!" అనేది దిసీరా

అభిప్రాయం. నేను శ్రీశ్రీకి గుడ్డి అభిమానిని. మర్నాడు గురువుగారిని క్లాసులో "ఏమిటండీ, నిన్న సభలో అలా అన్నారు? ఒక అందమైన వస్తువును చూస్తుంటే, ఒకసారి కాకపోతే మరొకసారైనా దీనిని నిర్మించిన కూలీలెవరని అనుకుంటాం కదా?" అన్నాను నేను అజ్ఞానంతో. దానికి దిసీరాగారికి చాలా కోపం వచ్చి, "వంకాయకూర చాలా రుచిగా ఉంటే, దానికి మూలమైన పందిపెంటను తలుచుకుంటామా?" అని ఎదురు ప్రశ్నించారు. నేను కొయ్యబారిపోయాను!

**11) శ్రీపాదవారి అద్భుతమైన ఆధునిక కవిత్వోపన్యాసం:-**

ఒకసారి నేను గురువుగారితో – "అయ్యా! శ్రీశ్రీని మన కళాశాలకు పిలిపించండి!'' అన్నాను. దానికి వారు: ''వాళ్ళ అలవాట్లను మనం భరించలేమయ్యా!" అన్నారు. శ్రీశ్రీ భయంకరమైన త్రాగుబోతు అనే విషయాన్ని ధ్వనింపజేస్తూ.

ఇంకోసారి "జాషువాగారిని మన కాలేజీకి పిలిపించకూడదా?" అన్నాను. దానికి గురువుగారు: "ఆయన వేదికనెక్కి 'నాకు ఈ సన్మానం జరగలేదు! ఆ సన్మానం జరగలేదు!' అంటూ ఒకటే నసపెడతాడు; బీదఆర్పులు అరుస్తాడు!" అన్నారు. ఈ యిద్దరు కవుల విషయంలోనూ గురువుగారు చెప్పింది ప్రత్యక్షర సత్యాలు!

విశ్వనాథవారిని మాత్రం రెండు మూడు సార్లు పిలిపించారు. ఒకసారి 1953లో డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి చేత ఆధునిక కవిత్వాన్ని గురించి అద్భుతమైన ఉపన్యాసం ఇప్పించారు. నాకు ఒళ్ళు పులకరించిపోయింది. శ్రీపాదవారు ఉదాహరించిన శ్రీశ్రీ, పఠాభి, కాళోజీ మొదలైన కవులు కవితలు నేను ఇప్పటికీ మరచిపోలేదు. వారు విశ్వనాథను కవికాదన్నారు. ఆంధ్రప్రశస్తిలోని ఒక పద్యాన్ని ఉదాహరిస్తూ "ఏరాజు పంచెనో యిచట శౌర్యపు పాయసంబుల నాగుల చవితినాళ్ళ!" అనే పాదం చదివి, "నాగులచవితికి, చలిమిడి చిమ్మిలి చేసుకుంటారు కాని, పాయసం వండుకుంటారా?" అని విమర్శించారు. "విశ్వనాథ కవికాడు, నవలాకారుడు మాత్రమే!" అని తీర్పు చెప్పి "ఏకవీర"లో నుండి ఎన్నో పంక్తులు ఉదాహరించారు. శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని గురించి మాట్లాడుతూ శ్రీపాదవారు "పదండి ముందుకు! పదండి త్రోసుకు! పోదాం పోదాం పైపైకి!"

అనే మహాప్రస్థానగీతాన్ని ఉదాహరిస్తూ: "ఏమిటిదీ? నిద్దట్లోంచి లేచి కేకలు పెడతావ్? ఇది కవిత్వం కాదు!" అన్నారు. తిరిగి "భిక్షువర్షీయసి" – అనే కవితను ఉదాహరిస్తూ: "దారిపక్క చెట్టు కింద / ఆరిన కుంపటి విధాన / కూర్చున్నది ముసలి దొకతె / మూలుగుతూ ముసురుతున్న / ఈగలతో వేగలేక" – "అదీ అలారా దారికి"–అన్నారు. "రాయి విసిరినా రాకెట్టు విసిరినా / కిట్టని వానిని కొట్టుటకే కద?" అనే కాళోజి పాదాలు ఉదాహరించారు. పఠాభి "హంసయాన"కు బదులుగా "హైకీల్డుయాన" అన్నాడన్నారు. ఇలాగ 1953లో శ్రీపాదవారు ఉదాహరించిన కవితలు నేను ఇప్పటికీ మరిచిపోలేదు. అంతగొప్ప ఉపన్యాసం అది. ఇంటర్ విద్యార్థుల్ని ఉర్రూతలూగించిన ఉపన్యాసం అది.

మరోసారి గుంటూరునుండి వావిలాల సోమయాజులుగారు వచ్చి, ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకాన్ని గురించి ఎంతో అద్భుతంగా ప్రసంగించారు. ఇవన్నీ Bi.P.C.విద్యార్థినైన నన్ను సాహిత్యంలోకి లాక్కుపోయాయి!

డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఫిజిక్స్‌లో డాక్టరేట్ డిగ్రీ పొందిన శాస్త్రజ్ఞుడు. కాని ఆయన తెలుగు ఆధునిక కవిత్వంలోను, జానపద కవిత్వంలోను, ఎంతో పరిశోధన చేసిన గొప్ప విమర్శకుడు; గొప్ప ఉపన్యాసకుడు. నేను 1953లో ఇంటర్‌లో ఉండగా ఆయన ఉత్తేజకరమైన ఉపన్యాసం విని, నేను ఎప్పటికైనా ఆయనలాగ ప్రసంగించాలని మనసులో నిశ్చయించుకున్నాను. సుమారు 20 ఏండ్ల తరువాత నేను జానపద సాహిత్యంలో వీరగాథలను గురించి పరిశోధన చేసి, కీర్తి ప్రతిష్ఠలు గడించిన తరువాత, హైదరాబాదులో ఒక సాహిత్యసభలో నేను శ్రీపాదవారితో కలిసి జానపద కవిత్వాన్ని గురించి ప్రసంగించాను. అప్పుడు వారితో "మీరు 1953లో మా కళాశాలకు వచ్చి ఆధునిక కవిత్వాన్ని గురించి అత్యద్భుతంగా ఉపన్యసించారు. నేను ఎప్పటికైనా మీలాగ ప్రసంగించాలని ఆనాడే నిర్ణయించుకున్నాను" అన్నాను. దానికి వారు పకపకా నవ్వుతూ, "ఈ రోజు నువ్వు నాకన్నా బాగా మాట్లాడావు!" అన్నారు. నేను ఉబ్బితబ్బిబ్బయిపోయాను!

**12) ప్రథమశాఖవారు (శుక్లయజుర్వేదులు):–**

దిసీరా బ్రాహ్మణులతో ప్రథమశాఖకు చెందినవారు. అంటే శుక్లయజుర్వేదం వారు. వీరు మామూలు నియోగులు; ఆరువేలుకాదు. ఆధునికులలో

వి.వి.గిరిగారు, స్థానం నరసింహారావుగారు, చన్నాప్రగడ భానుమూర్తిగారు, పులిపాటి వెంకటేశ్వర్లుగారు, ఆదుర్తి సుబ్బారావుగారు, "శ్రీరమణ"గారు మా చన్నాప్రగడ తిరుపతిరావుగారు మొదలైన ప్రముఖులు ఈ శాఖకు చెందినవారు. ప్రాచీన కవులలో తెనాలి రామకృష్ణుడు శుక్లయజుర్వేది. గురువుగారు "తెనాలి రామకృష్ణుడు మావాడయ్యా!" అనే వారు సగర్వంగా. అలాగే ప్రముఖ రామభక్తుడు కంచెర్ల గోపన్నకూడా ఇదే శాఖవాడు. ప్రముఖ పాత్రికేయులు ఆంధ్రశేషగిరిరావు గారు, వారి పుత్రిక ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారు కూడా ఈ ప్రథమశాఖకు చెందినవారే!

**13) ధృష్టద్యుమ్నుడు:-**

మా భీమవరం కళాశాలలో ఆంగ్లశాఖలో శాఖాధిపతులు తరచుగా మారిపోతూ ఉండేవారు. తెలుగుశాఖలో ఎప్పుడు నందూరి రామకృష్ణమాచారిగారే శాఖాధిపతులుగా ఉండేవారు. దీనిని చమత్కరిస్తూ ఒకసారి దిసీరా "మాది పాండవ పక్షం. ఎప్పుడూ ధృష్టద్యుమ్నుడే మా సేనాని! ఆంగ్లశాఖవారిది కౌరవపక్షం. అందువల్ల సేనాని తరచుగా మారుతూఉంటాడు!" అనేవారు.

**14) అల్లూరి మేనల్లుడు:-**

ప్రముఖ విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజుగారి మేనల్లుడు మా కళాశాల ఆంగ్లశాఖలో ట్యూటర్‌గా ఉండేవారు. అచ్చంగా మేనమామ పోలికే! కాని ఆయన చాలా సాధువుగా అమాయకంగా ఉండేవారు. నెమ్మదిగా మాటలాడేవారు. (ఆ రాజుగారి పేరు మరచిపోయాను.) ఆయన్ని చూచి దిసీరా నాతో ఒకసారి "ఇతని చూచి మనం అల్లూరి సీతారామరాజును ఊహించుకోలేం!" అన్నారు నవ్వుతూ. నేను కూడా నవ్వుకున్నాను.

**15) "ఎఱ్ఱజీర" (నా మొట్టమొదటి కవిత):-**

నేను ఇంటర్‌లో ఉండగా (1952-54) "తెలుగు స్వతంత్ర" అనే వారి పత్రికను చదువుతూ ఉండేవాడిని. అందులో ఎన్నో వచన కవితలు వచ్చేవి. వాటిలో "సా.జోగిరాజు" అనే కవి వ్రాసిన కవితను అనుకరిస్తూ నేను "ఎఱ్ఱజీర" అనే కవిత వ్రాశాను. దానిని గురుదేవులు కళాశాల మ్యాగజైన్‌లో ముద్రించారు.

అదే పత్రికలో ముద్రితమైన నా మొట్టమొదటి కవిత. అది నాకు ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది. దిసీరా పరమపదించిన ఎన్నో ఏండ్లకు తర్వాత వారు రచించిన "హిమాని" అనే సూక్తి రూపమైన మినీ కవితలను 1992లో నేను ముద్రించాను. ఇది ఒక దైవలీల!

**16) "దాస్యంలోనే సుఖమున్నదయ్యా!":–**

ఒకసారి నేను గురువుగారిని "మీరు ఇంకా శాఖాధిపతి (Head of the Department) కాలేదేం?" అని అడిగాను. దానికి వారు వెంటనే "దాస్యంలోనే సుఖమున్నదయ్యా!" అన్నారు.

**17) "యఙ్ఞా కన్నయ్య":–**

మేం ఇంటర్‌లో చేరిన కొత్తలో గురువుగారు మొట్టమొదటిసారిగా అటెండెన్స్ తీసుకుంటున్నారు. ఆ పేర్లలో ఒక పేరు "యఙ్ఞా కన్నయ్య". మాస్టారు ఆ పేరు చదవగానే క్లాసులోని పిల్లలందరూ ఒక్కసారిగా పెద్దగా నవ్వారు. దిసీరా అందరినీ వారించి: "అదేమిటయ్యా! అలా నవ్వుతారు? ఇది 'కృష్ణయ్య' అనే తత్సమపదానికి అచ్చమైన తెనుగుపదం 'కన్నయ్య' – అని వివరించి చెప్పి అందరినోళ్ళూ మూయించారు. యఙ్ఞా కన్నయ్య మా తణుకువాడే! నాతో కలిసి హైస్కూల్లో చదువుకున్నాడు. నాకు మంచి మిత్రుడు. బి.ఏ. అయిన తర్వాత మద్రాసు వెళ్ళి తన అన్నగారైన యఙ్ఞా అప్పారావుగారితో కలిసి, "గాంధారి గర్వభంగం" – "మనసే మందిరం" (హిందీవెర్షన్) మొదలైన సినిమాలు తీశాడు.

**II. బి.ఏ. స్పెషల్ తెలుగు చదువుతున్నప్పుడు (1955–57) జరిగిన సంఘటనలు:**

**1) "నువ్వు తెలుగును ఉద్ధరిస్తావనుకున్నానయ్యా!":–**

నేను ఇంటర్ Bi.P.C. గ్రూపుతో చదివి 1955లో పాసయ్యాను. అదే సంవత్సరం మా కళాశాలలో Botany లోను Zoology లోను B.Sc., కోర్సులు ప్రారంభించారు. నేను B.Sc., Zoology లో చేరుదామనుకున్నాను. అక్కడ "రామారావు" అనే కన్నడిగుడు మంచి లెక్చరర్ ఉండేవారు. ఆయన్ని అందరూ "Zoology Rama Rao" అని పిలిచేవారు. మంచి పెర్సనాలిటీ. క్రికెట్ అద్భుతంగా ఆడేవాడు. ఆయనంటే విద్యార్థులకు చాలా ఇష్టం. అందువల్ల పోలోమని అందరూ Zoology B.Sc.లో చేరిపోయారు. 20 సీట్లూ నిండిపోయాయి. ఇంక గతిలేక

నేను Botany B.Sc.,లో చేరాను. అక్కడ "కుందు" అనే లెక్చరర్ ఉండేవారు. నేను బాగా చదువుతున్నాను. ఇంతలో ఒక రోజు కళాశాల ఆవరణలో గురువుగారు దిగుమర్తివారు ఎదురుపడ్డారు:-

దిగుమర్తి : "ఏమయ్యా! ఏం చేస్తున్నావ్?"

నేను : Botany B.Sc., లో చేరానండి!"

దిగుమర్తి : "అదేమిటయ్యా! అలాచేశావ్? నువ్వు తెలుగును ఉద్ధరిస్తావను కున్నానయ్యా!" అన్నారు.

నేను : (ఏదో తెలియని ఆవేశంతో) "అయితే సరేనండి! రేపే వచ్చి B.A. Special Telugu లో చేరిపోతాను!"

దిగుమర్తి: "సరే! మంచిది! శుభం!"

మర్నాడు Botany B.Sc. నుండి మారిపోయి, తెలుగు బి.ఏ.లో చేరిపోయాను. Botany Department లోని అధ్యాపకులందరూ ఎంతో వారించారు, ముఖ్యంగా Chemistry Head B. కామేశ్వరావుగారు. వారు "అదేమిటయ్యా! నీకు B.Sc.లో First Class వస్తుంది. తెలుగులో చేరితే ఎలా పైకి వస్తావు?" అని ఎంతగానో నచ్చజెప్పారు. నేను వినలేదు. అంతా దైవఘటన!

అప్పటికే ఉషశ్రీ, తమ్మన వెంకటేశ్వరరావు వంటి ఉద్దండ పండితులు తెలుగు బి.ఏ.లో ఉన్నారు. "వీళ్ళు చాలా గట్టివారు! వీళ్ళతో పోటీపడి చదవాలి నువ్వు!" హెచ్చరించారు నన్ను దిగుమర్తివారు. నేను 'సరే' అన్నాను కాని, నాటకాలలో పడి సరిగ్గా చదవలేదు. B.Sc. అయితే practicals ఉంటాయి. ఒళ్ళు దగ్గర పెట్టుకొని చదవాలి. బి.ఏ. అయితే ఆడుతూ పాడుతూ చదువుకోవచ్చు. ఇదీ నా అంతరాంతరాల్లోని ఆలోచన కాబోలు! Easy going mind అంటే ఇదే!

అయితే గురువుగారు అన్నమాట: "నువ్వు తెలుగును ఉద్ధరిస్తావను కున్నానయ్యా!" అనే మాట నాకు అప్పుడు అర్థంకాలేదు. "నేనేమిటి? తెలుగును ఉద్ధరించడమేమిటి?" అని పదేపదే మనసులో అనుకోసాగాను. తర్వాత 19 ఏళ్ళు గడిచాక, 1974లో నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ.ను ప్రారంభించినప్పుడు, గురుదేవుల వాక్కులు నా మనసులో తళుక్కున మెరిశాయి! కర్ణాటక రాష్ట్రంలో విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగు అధ్యయనశాఖను స్థాపించిన వాడిని నేనేకదా! "గురువాక్కు అమోఘమైనది!" అని ఆశ్చర్యపోయాను.

**2) రఘువంశం – కుమారసంభవం:–**

ఆదివారాల్లోను, సెలవు దినాలలోను నేను దిగుమర్తివారింటికి వెళ్ళి, కాళిదాసు రఘువంశం, కుమారసంభవం చదివాను. "సిప్రానది" బొమ్మ నా చేత వేయించుకున్నారు గురువుగారు. నేను All India Oriental Confernece‌కు ఉజ్జయిని వెళ్ళినప్పుడు "సిప్రానది"ని చూశాను. అది పూర్తిగా ప్రజల నిర్లక్ష్యానికి లోనై ఒక మురికికాలవలాగ ఉంది. ("సిప్రానది" ని కాళిదాసు తన మేఘసందేశంలో గొప్పగా వర్ణించాడు.)

**3) రాళ్ళపల్లివారి తప్పు:–**

ప్రముఖ విమర్శకులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చేసిన ఒక తప్పు పనిని గురించి దిగుమర్తివారు నాతో చెప్పారు:– "రాజమండ్రిలోని ఒక సాహిత్య సంస్థవారు నన్నయను గురించి ప్రసంగించమని రాళ్ళపల్లివారిని ఆహ్వానించారు. ఆయన అంగీకరించి అక్కడికి వెళ్ళారు. తీరా అక్కడికి వెళ్ళాక 'నన్నయ్య కంటె తిక్కన గొప్పకవి' అని చెప్పి తిక్కనను గురించి ఉపన్యసించారు. ఇది ఎంత తప్పుపని!" అన్నారు దిసీరా. "నీకు నన్నయను గురించి ప్రసంగించడం ఇష్టంలేకపోతే 'నేను రాను' అని ముందుగానే చెప్పాలి. ఒప్పుకొని అక్కడికి వెళ్ళి తిక్కనను గురించి ప్రసంగించడమేమిటి?" ఇదీ దిగుమర్తివారి భావం. పింగళి వారిలాగే రాళ్ళపల్లివారు కూడా "తిక్కన భజన సంఘం"లో సభ్యుడు! (తెలుగు పద్యంలోని సంగీతాన్ని లయను చంపివేసినవాడు తిక్కన. మాయదారి అచ్చతెలుగు మాటలు కలిపేసి, వట్టి వచనాన్ని గణాల్లో సర్ది పద్యాలు అల్లుతాడు. కొన్ని పద్యాలలో అన్వయం కుదరదు. ఒక్కొక్కసారి ఆయన వాడే అచ్చతెలుగు పదాలు అశ్లీలార్థాన్ని కూడా ఇస్తాయి. (దీనిని గురించి తరువాత చెపుతాను). మా చన్నాప్రగడ తిరుపతిరావుగారు చెప్పినట్లుగా "తిక్కన పద్యాలు తిక్కతిక్కగా ఉంటాయి!" శ్రీకృష్ణదేవరాయలు, విశ్వనాథ సత్యనారాయణగారు కూడా తిక్కనలాగే వ్రాస్తారు. నాకు నన్నయ, శ్రీనాథుడు, పోతన, పెద్దన, ముక్కుతిమ్మన వంటి కవుల రసగుళికల వంటి పద్యాలు (ఇక్షురస ప్రవాహాలవంటి కావ్యాలు) నాకు ఇష్టం! (ఈ లక్షణం మా అన్నయ్యగారినుండి నాకు సంక్రమించింది.)

**4) తిక్కనగారి తిక్కతిక్క పద్యాలు:–**

ఉద్యోగపర్వంలో సంజయుని రాయబారం సందర్భంలో ధర్మరాజు

సంజయునితో ఇలా అంటాడు:-

**శా॥ చాపాచార్యుఁడు, భీష్ముదుం, గృపుఁడు, నశ్వత్థామయుం, గర్ణుఁడున్,**
**భూపశ్రేష్ఠుఁడుఁ, దారు మున్నెఱుఁగరే పోరెట్లుఁ? గయ్యంబులా**
**శాపాశంబులు చుట్ట లావెతిఁగియుం జావేడి మార్కొందు, రిం**
**తేపో! తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులంజేయవే?** (ఉద్యోగ,1-321)

ప్రసిద్ధ చలనచిత్రనటుడు కొంగర జగ్గయ్యగారు తన వద్దకు ఏ సాహిత్య వేత్తవచ్చినా పై పద్యం చెప్పి అన్వయించమనేవాడు. రెండవ పాదంలో "మున్నెఱుఁగరే పోరెట్లుఁ గయ్యంబు లాశాపాశంబులు చుట్ట" అనే దానిలో "తారు మున్నెఱుఁగరే పోరు + ఎట్లుకయ్యంబులు" అని విడదీయాలా? లేక "తారు మున్నెఱుఁగరే పోరెట్లు + కయ్యంబులు" అని విడదీయాలా? సరిగా తెలియదు. కొందరిలాగా, మరికొందరలాగా విడదీస్తారు.

తిరుపతి వేంకటకవులు భారతనాటకాలు వ్రాస్తూ తిక్కన పద్యాలను అడుగడుగునా అనుకరించారు. అందువల్ల ప్రసన్నమధురంగా మెత్తగా నన్నయలాగ పద్యాలు వ్రాసే ఈ జంటకవులకు తిక్కనగారి తిక్క అంటుకుంది. పాండవోద్యోగం నాటకంలో 'రాయబారం సీను' (సెంటర్ సీను)లో ఈ క్రింది సుప్రసిద్ధ పద్యాన్ని చూడండి:-

**ఉ॥ చెల్లియొ చెల్లకో తమకుఁజేసిన యెగ్గులు సైచి రందఱుం**
**దొల్లి గతించె నేడు నను దూతగఁబంపిరి సంధిసేయ నీ**
**పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపఁగఁ బొందుసేసెదో!**
**యెల్లి రణంబు గూర్చెదవొ! యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!**

(-పాండవోద్యోగము, తృతీయాంకము)

పై పద్యంలో "తమకుఁజేసిన యెగ్గులు సైచిరందఱున్ + తొల్లిగతించె" అని విడదీయాలా? లేక "తమకుఁజేసిన యెగ్గులు సైచిరందఱుందొల్లి+గతించె" అని విడదీయాలా? ఈ విషయం తెలియక కృష్ణపాత్రధారులందరూ ఇప్పటికీ కొట్టుమిట్టాడుతున్నారు. పీసపాటి నరసింహమూర్తి గారు మొదటిరకంగా విడదీసి పఠిస్తారు. షణ్ముఖి ఆంజనేయరాజుగారు రెండవ రకంగా విడదీసి రాగాలాపనతో పాడుతారు. మా దగ్గర తిరుపతి వేంకటకవుల భారతనాటకాలపై పరిశోధన

చేసిన డా॥ పి.యు.బి. శర్మగారు పీసపాటివారిని కలిసి, "ఏ విభజన తప్పు? ఏ విభజన ఒప్పు?" అని అడిగారు. పీసపాటి బాగా చదువుకున్న పండితుడు. "ఏదీ తప్పుకాదు; రెండూ ఒప్పే!" అన్నారాయన.

**5) తిక్కనగారి అచ్చుతెనుగు పదాలతో వచ్చిన అనర్థం:-**

మాకు బి.ఏ. Second Language తెలుగులో తిక్కనగారి "కీచకవధ", తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యంలోని "నిగమశర్మోపాఖ్యానం" ఉండేవి. ఈ రెండు పాఠాలూ దిగుమర్తివారే ఎంతో బాగా చెప్పారు. ఒకసారి "కీచకవధ" చెపుతున్నారు. తిక్కన కీచకుని విరహాన్ని అతి వేలంగా వర్ణించడం, పతివ్రతయైన ద్రౌపదిని అశ్లీలంగా ఊహించుకుంటూ మాట్లాడటం దిసీరాకు నచ్చలేదు. వ్యాసభారతంలో ఉన్న చిన్న విరాటపర్వాన్ని తిక్కన చాలా పెంచి వ్రాశాడు. ప్రబంధంగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం కనబడుతుంది. పరాంగనా రతి ఎంత చెడ్డదో, ఎంత ప్రమాదకారియో చెపుతూ సుదేష్ణ మాటలు ఒక సీసపద్యంలో వ్రాశాడు తిక్కన. ఆ పద్యాన్ని చెపుతూ: "తిక్కన, అటూ ఇటూ చూసి, పెళ్ళాంకూడా చూడకుండా ఈ పద్యాన్ని వ్రాసి ఉంటాడు!" అని చమత్కరించాడు దిగుమర్తివారు.

"జాత్యము కాని సంస్కృతమెయ్యెడఁ జొన్ప" అని ప్రతిజ్ఞచేసి, తిక్కన అచ్చుతెలుగు పదాలతో పద్యాలు వ్రాయడం ఎంత ప్రమాదకరమో ఒక చోట చెప్పారు దిసీరా. సుదేష్ణ దుర్బుద్ధితో సైరంధ్రిని (ద్రౌపదిని) కీచకుని ఇంటికి వెళ్ళి మదిర తెమ్మంటుంది. ద్రౌపది "ఇటువంటి నీచపు పనులు నేను చేయనని నీకు మొదటే చెప్పాను. నన్ను తప్పించి ఇంకెవరినైనా పంపు" అంటుంది. ఈ సందర్భంగా అచ్చుతెలుగు పదాలతో తిక్కన వ్రాసిన పద్యంలో "నన్నుడుగుమొడ్లను బంపుము" అని ఉంది. "నన్ను+ఉడుగుము+ఒడ్లను బంపుము" అని పదవిభాగం. "నన్ను వదలిపెట్టుము-ఇతరులను పంపుము" అని తాత్పర్యం. "ఇది చాలా అశ్లీలంగా ఉంది. దీనిని ఈ విధంగా మార్చుకోండి" అని చెప్పి మా గురువుగారు ఆ పాదాలను "నన్నుడిగి, యొడ్లను బంపుము" అని మార్పించారు.

దిసీరాగారు విద్యార్థిదశలో ఉన్న మాకు రెండు హెచ్చరికలు చేసేవారు –

1) మీ వ్రాతలో ఒక పదం చివర 'ప'కారము, తరువాతి పదం మొదటి 'క'

కారము ఉకారంతో కూడి రాకుండా జాగ్రత్తపడండి.

2) ఎప్పుడూ "తెలుఁగు" అనే పదాన్నే వాడండి; "తెనుఁగు" అనే పదం వాడకండి. 'తెనుఁగు" అనే పదంలో మొదటి అక్షరం సరళాదేశం పొందితే "దెనుఁగు" అవుతుంది. ఒకొక్కప్పుడు పదమధ్యాక్షరంలోని ఉత్వంలోపించి అశ్లీలపదం ఏర్పడుతుంది; జాగ్రత్త!

**6) నన్నయ-తిక్కన x విశ్వనాథ-పింగళి:-**

గురువుగారు ఒకసారి నాతో ఇలా అన్నారు: "విశ్వనాథవారు ఎల్లప్పుడూ నన్నయగారిని పొగుడుతూ ఉంటారు. పింగళివారు ఎల్లప్పుడూ తిక్కనను పొగుడుతూ ఉంటారు. కాని సుబ్బారావ్! చూడు విచిత్రం! విశ్వనాథవారు తిక్కనలాగ పద్యాలు వ్రాస్తారు; పింగళివారు నన్నయలాగ పద్యాలు వ్రాస్తారు. చూశావా గమ్మత్తు?"

**7) "ఆ యిద్దరు":-**

బి.ఏ. స్పెషల్ తెలుగులో మేము తొమ్మిది మంది విద్యార్థులం ఉండేవారం. మిత్రుడు పెమ్మరాజు గోపాలకృష్ణ "మనం నవరత్నాలం" అనేవాడు సగర్వంగా. అందరూ తెలివైన విద్యార్థులే కాని ఇద్దరు మాత్రం (బ్రాహ్మణ విద్యార్థులు) చాలా అయోమయంగా ఉండేవారు. చదువులో కూడా డల్‌గా ఉండేవారు. భీమవరం సమీపంలోని ఒక గ్రామం ("చినమెరం"?) నుండి సైకిళ్ళమీద వచ్చేవారు. ఒకసారి దిసీరా నాతో ఏకాంతంగా "మీరందరూ జీవితంలో పైకి వస్తారు అని చెప్పగలను. వాళ్ళిద్దర్నీ గురించీ ఏమీ చెప్పలేక పోతున్నానయ్యా!" అన్నారు. బాగా చదివి పైకి వస్తాననుకున్న నేను ఇంకో తణుకుమిత్రుడు లంకంసాని శ్రీరామకృష్ణతో కలిసి నాటకాలు ఆడుతూ కాలం వృథాచేస్తూంటే దిసీరా చాలా బాధపడి "తెలుగు డిపార్టుమెంటుకి శనిపట్టింది!" అన్నారు ఎంతోబాధతో ఒకసారి. ఆ మాట జ్ఞాపకం వస్తే ఇప్పుడు కూడా గిల్టీగా ఫీలవుతాను నేను!

**8) "ఆఖరికి రథికత్రయం మిగిలిందన్నమాట":-**

బి.ఏ.లో ఉండగా రెండవ సంవత్సరం మార్చినెల వచ్చింది. పరీక్షలు దగ్గర పడుతున్నాయి. అందరూ ఇళ్ళదగ్గరుండి చదువుకుంటున్నారు; క్లాసులకు

రావడంలేదు. చివరి working day నాడు నేను మరో యిద్దరు మిత్రులు కలిసి మొత్తం ముగ్గురం క్లాసుకు వెళ్ళాం. మమ్మల్ని చూసి దిసీరా "ఈ కురుక్షేత్ర మహాసంగ్రామంలో రథికత్రయం మిగిలారన్నమాట!" అన్నారు. మహాభారత యుద్ధంలో కౌరవపక్షంలో అందరూ చనిపోయారు–ముగ్గురు తప్ప. వారు అశ్వత్థామ – కృపాచార్యుడు–కృతవర్మ. వీరిని "రథికత్రయం" అంటారు. పాండవ పక్షంలో ఏడుగురు మాత్రం మిగిలారు: పాండవులు ఐదుగురు, శ్రీకృష్ణుడు, సాత్యకి.

**9) జీతం ఎంత వస్తుందో కూడా సరిగా తెలియదు:–**

ఒకసారి నేను గురువుగారిని "అయ్యా! మీరు తెలుగు శాఖాధిపతులు కదా! మీకు జీతం ఎంత వస్తుంది?" అని అడిగాను. ఆయన "ఏమో నయ్యా! నాకు సరిగా తెలియదు. ఆ 'రామారావు' (College Head Clerk) కూడుతాడు, తీసేస్తాడు. మళ్ళీ కూడుతాడు, మళ్ళీ తీసేస్తాడు. చివరికి నా చేతిలో 400 రూ.లు పెడతాడు!" అన్నారు. ఆ రోజుల్లో అధ్యాపకులు అలా ఉండేవారు. ఎంతో గొప్పగా పాఠాలు చెప్పేవారు. తమకు ఎంత జీతం ఇస్తున్నారో కూడా సరిగా పట్టించుకునేవారు కారు. ఈ రోజుల్లో అధ్యాపకులు దానికి పూర్తిగా వ్యతిరేకం! పాఠాలు శ్రద్ధగా చెప్పరు. "ఇంక్రిమెంట్లు ఎప్పుడు వస్తాయా? కొత్త స్కేలు ఎప్పటినుండి అమలులోకి వస్తుంది? ఎరియర్స్ ఎంత వస్తాయి?" ఎల్లప్పుడూ ఇవే చర్చలు! ఇదే గోల!

**10) పాండిత్యం – పద్యకవిత్వం:–**

నాకు పద్యాలు వ్రాయాలని ఛందస్సు నేర్చుకోవాలని IV form (9వ తరగతి–1949) నుండి కోరిక. కాని ఎస్.ఎస్.ఎల్.సి.లో కాని ఛందస్సు చెప్పరు. అది కూడా ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభం నాలుగు వృత్తాలకే చెపుతారు. మా తెలుగు పండితుడు వేదుల సూర్యనారాయణశర్మగారు గొప్ప పండితుడే కాని పెద్ద బద్ధకస్తుడు. పైగా పుట్టెడు చెవుడు. ఏమీ చెప్పలేదు. ఇంటర్‌లో దిగుమర్తివారిని అడిగితే "సులక్షణసారం చూసుకోవయ్యా!" అన్నారు. ఆ పుస్తకం ఎక్కడ దొరుకుతుందో తెలియదు. మా సహాధ్యాయులలో తమ్మన వెంకటేశ్వరరావుగారు మంచి కవి, పండితుడు. అప్పటికే "శ్రీధరశతకము" వ్రాసి ముద్రించారు. దంతులూరి సుబ్బరాజు అనే మరో సహాధ్యాయి కూడా పద్యాలు

వ్రాసేవాడు. (నేను ఇంటర్‌లో ఉండగా, మా సీనియర్ శనగన నరసింహస్వామిగారు అత్యద్భుతంగా పద్యాలు వ్రాసేవారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం పద్యపోటీలలో ప్రథమబహుమతి పొందారు. ఆయన వ్రాసిన "అనార్కలీ" అనే పద్యాలు కాలేజీ మాగజైన్‌లో వస్తే వాటిని మేమంతా కంఠస్థం చేసివేశాము. కొర్లపాటివారు బి.ఏ. ఫైనల్‌లో ఉండేవారు. కవిత్వం వ్రాసేవారు. ఆయన వ్రాసిన "చిత్రశాల" అనే నవలకు ఆంధ్రవిశ్వవిద్యాలయ బహుమతి వచ్చింది.)

మిత్రులు తమ్మన వెంకటేశ్వరరావుగారు ఒకసారి నాతో: "మనుచరిత్ర, పారిజాతాపహరణం" కంఠస్థం చేసివెయ్యండి మీకు పాండిత్యము, కవితాశక్తి రెండూవస్తాయి" అన్నారు. నేను వారి మాట వినలేదు. ఒకసారి దంతులూరి సుబ్బారాజును "పద్యాలు వ్రాసే శక్తి ఎలావస్తుంది?" అని అడిగాను. అతడు "పోతన భాగవతంలో నూరు పద్యాలు కంఠస్థం చెయ్యి. పద్యరచనాశక్తి దానంతట అదే వచ్చేస్తుంది?" అన్నాడు. ఆ పనీ చేయలేదు. పద్యాలు ఎలా వ్రాయగలను? పద్యాలు వ్రాయడం ఒక తపస్సు. దానికి ప్రాచీన సాహిత్యంలో మంచి ప్రవేశం ఉండాలి. ఛందస్సు యతిప్రాస సూత్రాలు బాగా అధ్యయనం చేయాలి. భీమవరం కళాశాలలో చదివిన కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, శనగన నరసింహస్వామిగారు, తమ్మన వెంకటేశ్వరరావుగారు, ఉషశ్రీగారు మంచి పండితులుగా, కవులుగా లోకంలో ప్రసిద్ధికెక్కారు. నేను చిన్నతనంలోనే శ్రీశ్రీ ప్రభావంలో పడి, ప్రాచీన సాహిత్యాన్ని అశ్రద్ధచేసి, వచనకవిగా, జానపద పరిశోధకునిగా మిగిలిపోయాను!

ఒక బ్యాంకు ఉద్యోగి (పేరు మరిచిపోయాను) మనుచరిత్రను కంఠస్థంచేసి భీమవరంలో ఒక రోజంతా అప్పచెప్పాడు (పద్యాలేకాదు, గద్యాలుకూడా). నేను ఆశ్చర్యపోయాను! రాజమండ్రి తెలుగు విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా పనిచేసిన కట్టి నాగార్జునశ్రీగారు వసుచరిత్ర అంతా ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కకు అప్పచెప్పేవారు. ఊరికే అప్పచెప్పటం కాదు, పద్యాన్ని మిక్కిలి కర్ణపేయంగా చదివేవారు. ఆయన పద్యం చదువుతుంటే కర్ణామృతంగా ఉండేది. తెలుగు పద్యాలు అమృతోపమానంగా చదివే వ్యక్తుల్ని మరి కొందర్ని చూశాను; డా।। ప్రసాదరాయ కులపతిగారు, కోట వెంకట లక్ష్మీ నరసింహంగారు, ప్రొ।। బాడాల రామయ్యగారు, డా।। బోచ్కర్ ఓం ప్రకాశ్‌గారు మొ।।

**11) "మొదటిమెట్టు":-**

1955లో కొందరు విద్యార్థి కవులు, రచయితలు కలిసి ఒక సాహిత్య సంకలనం తీసికొని వచ్చారు. దాంట్లో మా భీమవరం కళాశాల విద్యార్థులే కాకుండా ఇతర కళాశాలల విద్యార్థులు కూడా ఉన్నారు. ఉదాహరణానికి - గుంటూరు ఎ.సి. కాలేజీనుండి కొలకలూరి ఇనాక్‌గారి కవిత ఇందులో ఉంది. దీనికి దిగుమర్తివారిచేత మంచి పీఠిక వ్రాయించాము. ఈ సంకలన గ్రంథానికి శీర్షిక కూడా వారే పెట్టారు. ఇవి విద్యార్థుల తొలి కవితలు కాబట్టి ఈ పుస్తకానికి మా గురువుగారు "తొలిమెట్టు" అని పేరుపెట్టారు ఎంతో ధ్వనిగర్భితంగా.

**12) "పళ్ళు గట్టిగా ఉన్నప్పుడే జంతికలు తినాలి!":-**

మాకు బి.ఏ. స్పెషల్ తెలుగులో రాయలవారి ఆముక్తమాల్యదలోని "మాలదాసరి కథ" పాఠ్యాంశంగా ఉండేది. విద్వాన్ కలిదిండి బంగార్రాజుగారు ఆ పాఠం చెప్పేవారు. (ఆయన్ని విద్యార్థులు "ఇటుకల బంగార్రాజు" అని పిలిచేవారు. ఆయన ఇటుకల వ్యాపారం చేసేవారు కాబోలు!) నాకు తిక్కన పద్యాలు, రాయల పద్యాలు, విశ్వనాథవారి పద్యాలు నచ్చవని ముందే చెప్పాను కదా! ఒకసారి రాయలవారి పద్యాల కాఠిన్యాన్ని గురించి చెపుతూ దిసీరా గారిని నేను: "ఏమిటండీ ఈ పద్యాలు జంతికల్లా కటకటలాడుతున్నాయి?" అని అడిగాను. ఆయన వెంటనే "పళ్ళు గట్టిగా ఉన్నప్పుడే జంతికలు తినాలి నాయనా!" అన్నారు. అంటే చిన్నతనంలోనే ఇటువంటి కఠినమైన పద్యాలను అభ్యాసం చేస్తే పాండిత్యం అలవడుతుంది అని వారి భావం!

**13) ఆకాశవాణిలో వక్తృత్వపు పోటీలు:-**

ఒకసారి విజయవాడ ఆకాశవాణి కేంద్రంవారు కళాశాల విద్యార్థులకు వక్తృత్వపు పోటీలు నిర్వహించారు. ఉషశ్రీగారు అప్పటికే లబ్ధప్రతిష్ఠుడు. "భారతి" మాసపత్రికలో కథలు వ్రాసేవాడు. "విశ్వశ్రీ" అనే పత్రికను నడిపి, విశ్వనాథమీద ఒకటి, శ్రీశ్రీ మీద ఒకటి-రెండు ప్రత్యేక సంచికలు తీసికొని వచ్చాడు. అనేక కవులతో, రచయితలతో పరిచయాలుండేవి. మేము హొటల్లో ఒక రూము తీసికొని ఉండవచ్చును. కాని ఉషశ్రీగారు తిన్నగా బొందలపాటి శివరామకృష్ణ (దేశికవితామండలి) గారి యింటికి తీసికొనివెళ్ళాడు. అక్కడ ఇద్దరం బస చేశాం.

మర్నాడు రేడియో స్టేషన్‌కి వెళ్ళాలి. ఒక మామిడి తోటలో ఉంటుంది విజయవాడ ఆకాశవాణి కేంద్రం. ఒక మామిడి చెట్టు క్రింద ఒక అందమైన వ్యక్తి తెల్లటి దుస్తులు ధరించి, ఒక పెద్ద బేసిన్‌లో ఇడ్లీలు పెట్టుకొని మమ్మల్ని ఆహ్వానించి తినమన్నాడు. నాకు ఆకలిగా ఉంది. తినాలని ఉంది. కాని ఉషశ్రీ పొగరుబోతు. "ఒక గదిలో మనకు టిఫిన్ పెట్టాలి కాని, చెట్టుకింద తినమంటాడేమిటి?" అని తిరస్కరించాడు. పైగా ఆయన్ని నాకు చూపెడుతూ "ఆయనే బుచ్చిబాబు - 'చివరకు మిగిలేది' నవల వ్రాసినవాడు!" అన్నాడు. అప్పటికే నేను వారినవల చదివి ఉన్నాను. ఆయన్ని ప్రత్యక్షంగా చూచి ఆశ్చర్యపోయాను! నిజానికి ఆయన రేడియో స్టేషన్ డైరెక్టరు. ఆయన ఆహ్వానాన్ని కూడా ఉషశ్రీ తిరస్కరించాడు. ఆ రోజు డిబేట్‌లో "మొక్కై వంగనిది మానై వంగుతుందా?" అనేది చర్చనీయాంశం. నేను దానికి వ్యతిరేకంగా ప్రసంగించాను. ఉషశ్రీగారు తాను తరచుగా వాడే ఏవో కొన్ని పడికట్టు పదాలతో ("తిరస్కార పురస్కారాలు" వంటివి) ప్రసంగించాడు. నాకేమీ అర్థంకాలేదు.

**14) "మృచ్ఛకటికం" నాటకం:-**

మాకు బి.ఏ. స్పెషల్ తెలుగులో శూద్రకుని మృచ్ఛకటికం నాటకానికి, తిరుపతి వేంకటకవుల అనువాదం పాఠ్యగ్రంథంగా ఉండేది. దానిని దిగుమర్తివారు అత్యద్భుతంగా బోధించేవారు. ఒక్క ప్రథమాంకమే మూడు నెలలు చెప్పారు. తిరుపతి కవుల అనువాదాన్ని అడుగడుగునా మూలంతో పోలుస్తూ, ఎక్కడెక్కడివో ఎన్నెన్నో సాహిత్య విషయాలతో జోడించి చెపుతూ, ఒక్క ప్రథమాంకానికే మూడు నెలలు తీసుకున్నారు. తరువాత "ఇలా చెపితే ఒక సంవత్సరానికి కూడా ఈ నాటకం పూర్తికాదు!"అని చెప్పి మామూలుగా, వేగంగా చెప్పి నాటకం ముగించారు. అంతటి ప్రతిభావంతుడైన విమర్శక శిరోమణి దిగుమర్తి సీతారామస్వామిగారు.

ఆ నాటకంలో దిగుమర్తివారు నొక్కి చెప్పిన కొన్ని అందమైన అంశాలు సంవత్సరాలు దాటిపోయినా నేను మరిచిపోలేదు. అంతగొప్ప అధ్యాపకుడు ఆయన!

(1) ప్రథమాంకంలో నాయకుడు చారుదత్తుడు చీకటిలో నిలబడిన వసంతసేనను చూచి, తన చేటి రదనికగా భావించి, తాను కప్పుకొనిన శాలువాను,

వసంతసేన మీదికి విసిరి, నిద్రిస్తున్న తనకుమారుడు రోహిసేనునకు కప్పుమని అంటాడు. ఆ శాలువా జాజిపూల పరిమళంతో ఉంటుంది. చారుదత్తుని ప్రేమిస్తున్న వసంతసేన ఆ శాలువాను ఆప్యాయంగా ఒంటినిండా కప్పుకొని, జాజిపూల పరిమళాన్ని ఆస్వాదిస్తూ, చారుదత్తుని గురించి "యౌవన మీతని యెడ ఇంకను ఉదాసీనము కాలేదు!" అని స్వగతంలో అనుకుంటుంది. ఈ మాటలు ఎంత అద్భుతంగా ఉన్నాయి! యౌవనం కొంచెందాటినా తాను అతనిని ప్రేమించవచ్చునని ఆమె పలుకుల అంతరార్థం. చారుదత్తునకు అప్పటికే వివాహమయింది. ఒక కొడుకుకూడా ఉన్నాడు (రోహసేనుడు).

(2) చారుదత్తుడు–వసంతసేన మొదటిసారి పరిచయమైనప్పుడు వారిద్దరూ పరస్పరం ఎంతో గౌరవంగా వంగి నమస్కరించుకుంటారు. అప్పుడు విదూషకుడు (మైత్రేయుడు) "ఏమిటి? మీరిద్దరూ పండిన వరిచేనువలె ఒకరిపై నొకరు వ్రాలి నమస్కరించుకొనుచున్నారు?" అని చమత్కరిస్తాడు. ఎంత సహజమైన ఉపమాలంకారం!

(3) చారుదత్తుడు – మైత్రేయుడు (విదూషకుడు) కలిగి రేభిలుని సంగీత సభకు వెళ్ళి, రాత్రి ప్రొద్దుపోయేదాకా సంగీతం విని, ఇంటికి వస్తూ ఉంటారు. చారుదత్తుడు రేభిలుని సంగీతానికి ఒళ్ళంతా పులకరించి, దారి పొడవునా విదూషకుని దగ్గర ఆ సంగీత విద్వాంసుని ప్రశంసిస్తూ ఉంటాడు. విదూషకుడు అతని మాటలేమీ పట్టించుకోకుండా చాలా విసుగ్గా "ఉండు మిత్రమా! రోడ్డు మీద కుక్కలు కూడా హాయిగా నిద్రపోవుచున్నవి. మనకు మాత్రం నిద్రలేదు" అంటాడు.

(4) శర్విలకుడు అనే దొంగ చారుదత్తుని యింటికి కన్నం వేసి, వసంతసేన అతనికి ఇల్లడగా ఇచ్చిన సువర్ణభాండం అనే నగ ఎత్తుకు పోతాడు. తెల్లవారి అందరూ ఆ నగపోయినందుకు ఎంతో బాధపడుతూ వుంటారు – ఒక్క చారుదత్తుడు తప్ప. అతడు శర్విలకుడు ఇంటిగోడకు పూర్ణకుంభంవలె అందంగా చేసిన కన్నాన్ని మెచ్చుకుంటూ ఉంటాడు. చారుదత్తుడు అంతటి కళాప్రియుడన్నమాట!

కాని ఇదే సీతారామస్వామిగారు "తెలుగు సాహిత్య చరిత్ర" (History of Telugu Literature) ను మాత్రం క్లాసులో పాఠంగా బోధించేవారు కాదు. తాను B.A. (Hons) లో వ్రాసుకున్న నోట్సు డిక్టేట్ చేసేవారు. ఆ క్లాసు పరమబోరుగా ఉండేది!

**15) "Yes, Pass on!":-**

ఆ రోజుల్లో మాకు బి.ఏ. మూడు భాగాలుగా ఉండేది Part-I First Language: English అది అందరికీ Compulsory. Part-II Second Language: తెలుగు లేక హిందీ. Part-III Main : "Special Telugu", Subsidiory: "South Indian History". ఇంగ్లీషులో రెండు Shakespeare Dramas ఉండేవి మాకు: (i) Henry IV Part-I, (ii) Mackbeth ఇంగ్లీషు డిపార్టుమెంటు హెడ్‌గా లచ్చయ్యశాస్త్రిగారు ఉండేవారు. ఆయన తెలుగు వాక్యాలు సాగదీసి పలికినట్లుగా ఇంగ్లీషు వాక్యాలు సాగదీసి పలికేవారు. కొంచెం ఎబ్బెట్టుగా ఉండేది. మేం స్పెషల్ తెలుగులో తొమ్మిదిమంది విద్యార్థులం మాత్రమే. అందువల్ల language classes కోసం Mathematics B.A. వారితో కలిసి కూర్చొనేవారం. వాళ్ళు 60 మంది ఉండేవారు. వాళ్ళు ముందుగానే క్లాసులో ఉంటారు కాబట్టి మేం తొమ్మిదిమందిమీ వచ్చి వెనుక చివరి బెంచీలలో కూర్చొనేవాళ్ళం. ఒక రోజు లచ్చయ్యశాస్త్రిగారు Henry IV Part I చెపుతున్నారు. అందులో Hotesper అనే వీరుడు ఉంటాడు. వాడు ఎందరినో ద్వంద్వయుద్ధంలో జయిస్తూ గొప్ప కీర్తిని గడిస్తాడు. Fall Staff అనే విదూషకుడు అసలు హీరో అయిన ప్రిన్స్‌తో ఇలా అంటాడు "ఏవిటీ నువ్వు ఇలా క్లబ్బుల వెంబడి తిరుగుతూ వున్నావు? అవతల 'హాట్స్‌పర్' ఎందరో వీరుల్ని జయించి ఎంతో కీర్తి గడిస్తున్నాడు!" దానికి రాకుమారుడు "సమయం వచ్చినప్పుడు నా శక్తిని చూపించి హాట్స్‌పర్‌ని ఓడిస్తాను. అప్పుడు నల్లని నేలమీద తెల్లని లోహంలా తళుక్కున మెరుస్తాను. చూసుకో!" అంటాడు. అక్కడ షేక్స్‌పియర్ "I will shine like a white metal on a black soil" అనే అర్థంలో ఒక కవితా వాక్యం వ్రాశాడు. దానిని లచ్చయ్యశాస్త్రిగారు వివరిస్తున్నారు. ఒకసారి చెప్పారు; మాకు అర్థమయింది. మళ్ళీ రెండవసారి చెప్పారు. మాకు విసుగొస్తోంది. అదే విషయాన్ని తిరిగి మూడవసారి చెపుతున్నారు. అప్పుడు మా తెలుగు బి.ఏ. సహాధ్యాయి పెమ్మరాజు గోపాలకృష్ణ చివరి బెంచీలో కూర్చుని తలవంచుకొని "Yes, Pass on!" అన్నాడు మెల్లగా. శాస్త్రిగారికి కోపం వచ్చింది. పెద్దగా అరుస్తూ: "Who is that! you are not here to dictate me!" అన్నారు. విద్యార్థులందరూ నిశ్శబ్దం అయిపోయారు. మా గోపాలకృష్ణ చాలా తెలివైన విద్యార్థి; మంచివాడు. ఇంటర్ మద్రాసులో చదివి వచ్చాడు.

ఎప్పుడూ ఖద్దరు పైజామా లాల్చీ ధరించేవాడు. పేదవాడు. అతని బావగారు (అక్కభర్త) మోచర్ల జానకిరామయ్యగారు మాకు ఇంగ్లీషు లెక్చరర్‌గా ఉండేవారు. గోపాలకృష్ణ బి.ఏ. అయిన తరువాత కాకినాడ పిఠాపురం రాజా కళాశాలలో తెలుగు ట్యూటర్‌గా చేరాడు. "ఇదమహం" అనే పేరుతో ఒక గొప్ప నాటికను రచించాడు. మానవునకు పూర్వజన్మస్మృతి ఉంటే ఎన్ని అనర్థాలు వస్తాయో దీనిలో ఎంతో ప్రతిభావంతంగా నిరూపించాడు. ఈ నాటికలో అతడు స్వయంగా నటించేవాడు; దీని దర్శకత్వం కూడా అతనిదే! ఆ నాటికకు ఎన్నో బహుమతులు వచ్చాయి. దానిని తిరుపతిలో ప్రదర్శించినప్పుడు (1965లో కాబోలు) భార్యతో మాయింటికి వచ్చాడు. తరువాత కొన్నాళ్ళకు అకాలమరణం పాలయ్యాడు. అతడు కాకినాడలో ఉండగా నాకు ఉత్తరం వ్రాస్తూ దానిలో "కాకినాడ" అనే పేరు ఇంగ్లీషు వాళ్ళు పెట్టినదనీ, దాని అసలు పేరు: "కోకనదం" అనీ పేర్కొన్నాడు. నేను ఆశ్చర్యపోయాను! (మా గురుదేవులకథలో ఇది ఒక ఉపాఖ్యానం).

### 16) "పుస్తకం వనితా విత్తం...":–

గురుదేవుల దగ్గర ఎన్నో గొప్ప గొప్ప పుస్తకాలు ఉండేవి. వాటిని రెండు మూడు చెక్కరాక్స్‌లో అమర్చి, అవి కనపడకుండా వాటిపై తెరలు వ్రేలాడదీసేవారు. ఏ పుస్తకమూ ఎవ్వరికీ ఇచ్చేవారు కారు. ఎవరైనా అడిగితే "లైబ్రరీలో ఉంటుంది కదా! చూసుకో!" అనేవారు.

### 17) మనుచరిత్రను గురించి:–

"మనుచరిత్రను గురించి నా దగ్గర చాలా కొత్త విషయాలు ఉన్నాయి!" అనేవారు నాతో. కాని ఆ నూతన విషయాలను గురించి వ్యాసాలు వ్రాసి 'భారతి'లో ప్రకటించడం కాని, వాటిని పుస్తకరూపంలో ముద్రించడం కాని చేయలేదు. అవన్నీ వారితోనే పోయాయి.

### 18) "ఆ మాట చెప్పవలసింది మీరు కాదు; నేను!":–

గురువుగారి తమ్ముడు డా॥ సుందర శివరావుగారు మెడికల్ కాలేజీలో వైస్–ప్రిన్సిపాల్‌గాను, ప్రిన్సిపాల్‌గాను పనిచేసేవారని చెప్పాను కదా! ఒకసారి దీసీరా తనకు ఒంట్లో ఏదో నలతగా ఉంటే తమ్ముడు దగ్గరు వెళ్ళి మెడికల్ చెకప్ చేయించుకున్నారు. డాక్టర్లు అన్ని పరీక్షలు చేసి "మీకు ఏ విధమైన అనారోగ్యమూ

లేదు; వెళ్ళండి!" అన్నారు. "ఆ మాట చెప్పవలసింది మీరు కాదు; నేను!" అన్నారు చమత్కారంగా.

**19) నేతాజీ అభిప్రాయాన్ని ఖండించడం:-**

ఒకసారి నేతాజీ సుభాస్ చంద్రబోస్ గారు భారతీయభాషల్ని గురించి ఒక అభిప్రాయాన్ని వెల్లడించారు. "భారతదేశంలో ఉన్న భాషలన్నింటికీ ఒకే లిపి పెడితే, భారతీయుల మధ్య ఐకమత్యం పెరుగుతుంది. ఆ ఏకలిపి 'రోమన్ స్క్రిప్ట్'గా ఉంటే మంచిది". ఈ అభిప్రాయాన్ని దిసీరా తీవ్రంగా ఖండించారు. "రాజకీయ వేత్తలు భాషాసాహిత్య విషయాలలో కలుగజేసుకోకూడదు!" అన్నారు. ఇలా కలుగజేసుకోవడంవల్ల ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన ఒక అనర్థాన్ని గురించి చెపుతాను. అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రముఖ ఆంధ్రరాజకీయవేత్త. 1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు అసెంబ్లీ స్పీకరుగా పనిచేశారు. ఆయన బెజవాడ వాస్తవ్యుడు. బెజవాడ మునిసిపాలిటికి ఛైర్మన్‌గా కూడా పనిచేశారు. బెజవాడలో ఆయన పేరుతో ఒక పెద్దమార్కెట్టుకూడా ఉంది. ఆయన "బెజవాడ" అనే పేరు ఆంగ్లేయులు పెట్టిన పేరుగా భ్రమించి, దానిని "విజయవాడ"గా మార్చివేశారు. ఇది చాలా తప్పు. "బెజవాడ" అనే పేరు చాలా ప్రాచీనమైనది. క్రీ.శ. 10వ శతాబ్దంలోని "యుద్ధమల్లుని బెజవాడశాసనం"లోను, అంతకుముందున్న శాసనాలలోను, "బెజవాడ" అనేశబ్దమే ఉంది. ఇది అచ్చతెలుగు శబ్దం. దీనిని సంస్కృతీకరిస్తే "విజయవాటిక" అవుతుంది. అంతేకాని "విజయవాడ" కాదు. విజయవాడ దుష్టసమాసం. "విజయ" సంస్కృత శబ్దం; "వాడ" తెలుగు శబ్దం. బెజవాడ ఎంతో ప్రాచీనమైన శబ్దం కాబట్టే ఆ పేరు ఇంటిపేరుగా కలవారు ఎందరో ఉన్నారు.(ఉదా॥ బెజవాడ గోపాలరెడ్డి, బెజవాడు రామచంద్రారెడ్డి మొ॥)

**20) "యస్వీ"-"యశస్వి" అవుతాడు:-**

నా చిన్నతనంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో "యస్వీ జోగారావుగారు" యక్షగానాలమీద పరిశోధన చేస్తూ ఉండేవారు. వారి వ్యాసాలు "భారతి"లో వస్తూ ఉండేవి. అప్పటికింకా వారికి పిహెచ్.డి. డిగ్రీరాలేదు. అందువల్ల ఒకసారి గురుదేవులు: "యస్వీ త్వరలో యశస్వి కాబోతున్నాడు" అన్నారు.

**21) "కృష్ణశాస్త్రిని కత్తితో పొడిస్తే రక్తం కారదు, కవిత్వం కారుతుంది!":–**

దిగుమర్తివారికి కృష్ణశాస్త్రిగారంటే ఎంతో యిష్టం. ఒకసారి నాతో ఇలా అన్నారు: "కృష్ణశాస్త్రికి నిలువెల్లా కవిత్వమే! అతన్ని కత్తితో పొడిస్తే రక్తం కాదు, కవిత్వం కారుతుంది!" ఇది ఎంత గొప్పమాట! శేషేంద్రశర్మగారు తన కవితల్లో ఒక దాంట్లో ఇదే భావాన్ని వ్రాశారు:–

"నన్ను కత్తితో పొడు
రక్తం కాదు, కవిత్వం కారుతుంది!"

ఈ కవితను చదివి నేను వారితో – "మా గురుదేవులు దిగుమర్తి సీతారామ స్వామిగారు 1955–57 సంవత్సరాలలో కృష్ణశాస్త్రిని గురించి సరిగ్గా ఇలాగే అన్నారు!" అని వారి దృష్టికి తెచ్చాను. "అవునా"? అలా అన్నారా? నాకు తెలియదే!" అని ఆశ్చర్యపోయారు!

**22) "ముద్రిస్తే జానపద కవిత్వం నశించిపోతుంది!":–**

దిసీరా మాకు తెలుగు సాహిత్యచరిత్ర పాఠంచెపుతూ (అంటే నోట్సు చెపుతూ) ఒక గొప్ప అభిప్రాయాన్ని వెలువరించారు. "ముద్రిస్తే జానపదకవిత్వం నశించిపోతుంది. దానిని పాడే భిక్షువుల్ని, వృత్తిగాయకుల్ని మనం పోషించాలి. అలా చేస్తే అది ఎప్పుడూ సజీవంగా ఉంటుంది." ఈ వాక్యాలను నేను నా సిద్ధాంత గ్రంథంలో ఉదాహరించాను.

**23) "మన పిల్లలకి మనమే చదువు చెప్పకూడదు":–**

దిసీరాగారికి ఇద్దరు పిల్లలు, ఇద్దరూ మగపిల్లలే. "రఘు–జగన్నాథశౌరి". ఇద్దరూ హైస్కూల్లో చదువుతున్నారు. ఒక రోజు నేను గురువుగారి యింటికి వెళ్ళాను. ఒక ప్రవేటి మాస్టారు వచ్చి వాళ్ళకి ట్యూషన్ చెపుతున్నాడు. నేను గురువుగారితో: "పిల్లలకి మీరే చదువు చెప్పవచ్చు కదా! ప్రయివేటు ఎందుకు?" అన్నాను. వెంటనే వారు: "మన పిల్లలకు మనమే చదువు చెపితే, వాళ్ళకి మనమీద ఉండే గౌరవం పోతుంది" అన్నారు.

**24) "ఋతుసంహారము":–**

ఇది కాళిదాసు ఋతుసంహారానికి పద్యానువాదం. దీని ఆవిష్కరణ నేను

బి.ఏ. చదువుతూ ఉండగా 05.02.1956 నాడు జరిగింది. ఆ సభకు "కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చారు. అప్పుడు మా స్పెషల్ తెలుగు విద్యార్థులం తొమ్మిది మందీ కలిసి విశ్వనాథవారితో ఫోటో తీయించుకున్నాం. మా కళాశాల ప్రిన్సిపాల్ ఇ. లక్ష్మీనాథరావుగారు కూడా ఆ ఫోటోలో పాల్గొన్నారు. ఈ కావ్యాన్ని గురుదేవులు తమ ధర్మపత్నికి అంకితం చేశారు. ఆమె పేరు శ్రీమతి వెంకట సీతారత్నం. కాని గురువుగారు ఆమె పేరును ఈ పుస్తకంలో "శతతారాదేవి"గా మార్చారు. చాలా అందమైన పేరు.

**25. తెలుగు సాహిత్య చరిత్ర:-**

గురువుగారు నాకు ఇంటర్‌లోను, బి.ఏ.లోను కవిత్వం, నాటకం, ఉపన్యాసాలు, ఆఖరికి Composition కూడా ఎంతో బాగా బోధించేవారు. ఇంటర్‌లో ప్రాచీనకవిత్వం, రాళ్ళపల్లివారి "సారస్వతాలోకము" (వ్యాసాలు), Composition చెప్పారు. బి.ఏ.లో తిక్కన "కీచకవధ", తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యంలోని "నిగమశర్మోపాఖ్యానం", తిరుపతి వేంకటకవుల 'మృచ్ఛకటిక' నాటకం చెప్పారు. ఏది చెప్పినా అద్భుతం! ఒక్క సాహిత్యచరిత్ర మాత్రం పాఠాలుగా బోధించేవారు కాదు. తాను తన బి.ఏ.(ఆనర్సు)లో వ్రాసుకొన్న నోట్సు మాకు డిక్టేట్ చేసేవారు. అది వ్రాసుకోవడం మాకు చాలా విసుగ్గా ఉండేది. మా ముఖాలలో ఉన్న విసుగును చూచి వారు చిరునవ్వు నవ్వుతూ "ఏం చెయ్యను? తప్పదు! వ్రాసుకోండి! ఇంతకన్న మార్గం లేదు." అనేవారు. పైగా ఆ నోట్సంతా గ్రాంథికభాషలో ఉండేది. (అప్పుడు ఎం.ఏ.లో కూడా గ్రాంథికభాషలోనే ప్రశ్నలకు సమాధానాలు వ్రాయాలి.) అంతేకాదు, దానిలోని వాక్యాలు అలంకార భూయిష్ఠంగా ఉండేవి. నోట్స్ అంతా అయిపోయిన తర్వాత చిట్టచివర ఒక పద్యపాదం వ్రాసుకోమన్నారు మా గురుదేవులు. "హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్!" ఇది తిక్కనగారి 15 పర్వాలలో చిట్టచివరి పద్యంలో చిట్టచివరి పాదం. నేను ఎం.ఏ. చదివేటప్పుడు (1961-63) ప్రొ॥ జి.యన్. రెడ్డిగారు మాకు తెలుగు సాహిత్యచరిత్ర బోధించారు. వీరు పూర్తిగా డిసీరాకు వ్యతిరేకం. "నేను నోట్సు చెప్పను. మెల్లగా పాఠం చెపుతూ ఉంటాను. మీరు నోట్సు వ్రాసుకోండి!" అనేవారు. బాగా వివరించి చెప్పేవారు. "సాహిత్యచరిత్ర విషయప్రధానమైనది. దీనికి ఆలంకారికమైన శైలి అవసరంలేదు" అనేవారు.

**26) హిందీ ఎం.ఏ. ఎక్కడ చదవాలి? ఇంగ్లీషు ఎం.ఏ. ఎక్కడ చదవాలి?:-**

దిసీరా మాతో తరచుగా ఇలా అనేవారు: "హిందీభాషలో ఎం.ఏ. చదవాలంటే ఉత్తరభారతదేశానికి వెళ్ళి (ముఖ్యంగా ఉత్తరప్రదేశ్‌కి వెళ్ళి) చదువుకోవాలి. ఆంగ్లంలో ఎం.ఏ.చేయాలంటే ఇంగ్లాండు వెళ్ళి చదువుకోవాలి. అక్కడ మన చుట్టూ ఆ భాషల వాతావరణం ఉంటుంది. ఆ భాషల ఉచ్చారణ, ఆ భాష జీవసారం మనకు పట్టుపడతాయి."

దీనికి నా అనుభవంలో మరికొంత చేరుస్తున్నాను. పార్ట్-2 తెలుగు చదివిన బి.ఏ. విద్యార్థుల్ని తెలుగు ఎం.ఏ.లో చేర్చుకుంటే వారికి తెలుగు పాండిత్యంరాదు. సంస్కృతం రాదు. సంస్కృతం బాగా చదువుకోవాలి. తెలుగు సాహిత్యమంతా సంస్కృతంలోంచే వచ్చింది. అందువల్ల బి.ఏ. విద్యార్థులను కాకుండా, భాషాప్రవీణ, విద్వాన్, బి.ఒ.ఎల్. (ఇప్పుడు బి.ఏ.(ఒ.ఎల్.) వంటి ఓరియంటల్ డిగ్రీలు చదివిన విద్యార్థులను చేర్చుకుంటే మంచిది. అప్పుడే వారికి గట్టి పునాది ఏర్పడుతుంది. సంస్కృతం రాకుండా తెలుగు సాహిత్యం చదవడం అంటే నేల విడిచి సాము చేయడమే!

**27) "ఎవరిని సైన్యాధ్యక్షుణ్ణి చేద్దాం?":-**

మహాభారతంలో భీష్ముడు 10 రోజులు యుద్ధంచేసి అంపశయ్యమీద పడిపోయాడు. అప్పుడు దుర్యోధనుడు "ఇప్పుడు ఎవరిని సైన్యాధ్యక్షుణ్ణి చేద్దాం?" అని తన మిత్రుడు కర్ణుణ్ణి అడుగుతాడు. అతడు "అందరిలోకీ పెద్దవాడు, అందరికీ గురువు అయిన ద్రోణుణ్ణి చేద్దాం" అంటాడు. ద్రోణుడు ఐదు రోజులు యుద్ధం చేసి చనిపోయాడు. అప్పుడు దుర్యోధనుడు ఈ సారి కర్ణుణ్ణి అడగకుండా, అశ్వత్థామని అడుగుతాడు: "ఇప్పుడు ఎవరిని సేనానిని చేద్దాం?" అని. దీనికి కారణం ఏమిటి? అని అడిగాను ఒకసారి గురువుగారిని. వారు "దుర్యోధనుడు సేనానిపదవి ఎవరికి ఇవ్వకూడదని మనసులో అనుకుంటున్నాడో వాళ్ళని అడుగుతున్నాడు తెలివిగా. వాళ్ళు నాకు ఇవ్వమని అడగలేరుకదా! అదీ దుర్యోధనుడి ఎత్తుగడ!" అన్నారు. అంత గొప్ప విమర్శకుడు దిసీరా!

**28) నాటకాల్లో అనౌచిత్య సంఘటనలు:-**

తిరుపతి వేంకట కవుల 'పాండవోద్యోగం' నాటకంలో రాయబారానికి

వెళ్ళబోయే ముందు శ్రీకృష్ణుడు పాండవులను తమ తమ అభిప్రాయాలను చెప్పమంటాడు. ఎప్పుడూ కౌరవులమీద కోపంగా ఉండే భీముడు కూడా శాంతిని కోరుకుంటూ మాట్లాడతాడు. భీమునితో రౌద్రాన్ని రెచ్చగొట్టాలనే ఉద్దేశంతో శ్రీకృష్ణుడు అతనిని వేళాకోళం చేస్తూ కొన్ని పద్యాలు పాడుతాడు. భీముడు కూడా కోపంతో శ్రీకృష్ణుని నిందిస్తాడు కొన్ని పద్యాలలో. అలాగే చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి 'గయోపాఖ్యానం' నాటకంలో చివరి అంశంలో శ్రీకృష్ణార్జునులు యుద్ధానికి తలపడటానికి ముందు ఒకరినొకరు పెద్ద పెద్ద సీసపద్యాలలో నిందించుకుంటారు. "ఈ రెండు నాటకాలలోని ఆయా సంఘటనలు, మిక్కిలి అనౌచిత్యంగాను, చాలా చౌకబారుతనంగాను ఉన్నాయి - అనే వారు మా గురుదేవులు దిగుమర్తివారు. "ఉదాత్తపాత్రలు మామూలుగా మధ్యతరగతి జీవుల్లా నిందించుకోవడం ఏమిటి?" అనేవారు.

**29) సినిమాల మీద దిసీరా వ్యాఖ్యలు:-**

29.1 గురువుగారు మంచి మంచి సినిమాలు చూచేవారు. వాటిని కూడా తన విమర్శ దృష్టితో చూచి క్లాసులో మా దగ్గర వ్యాఖ్యలు చేసేవారు. "తెనాలి రామకృష్ణ" సినిమా చూచి: "అది రాయల భువన విజయంలాగ లేదు; ఎన్.టి.ఆర్. సభలాగ ఉంది!" అన్నారు.

29.2 చిత్తూరు నాగయ్యగారు నటించిన "భక్తపోతన" సినిమా చూశారు దిసీరా. అందులో పోతనగా నాగయ్య; శ్రీనాథుడుగా జంధ్యాల గౌరీనాథశాస్త్రి నటించారు. నాగయ్యలావుగా ఉన్నాడు; గౌరీనాథశాస్త్రి సన్నగా పొడుగ్గా ఉన్నాడు. వారిని చూసి గురువుగారు: "పోతన వ్యవసాయం చేసుకుంటూ కష్టపడి జీవిస్తున్నాడు. అందువల్ల ఆయనవేషం వేసేవ్యక్తి సన్నగా ఉండాలి కాని దుక్కలా ఉండకూడదు. శ్రీనాథుడు రాజభోగాలు అనుభవిస్తూ, రోజూ మృష్టాన్న భోజనం చేసేవాడు. అందువల్ల ఆయనవేషం వేసినవాడు లావుగా ఉండాలి కాని సన్నగా పీలగా ఉండకూడదు" అన్నారు.

29.3 "సినీమాలలో హీరోగా నటించిన యువకుడు అందగాడు అయిన వ్యక్తి హీరోగానే నిష్క్రమించాలి. అంతేకాని వయస్సుమళ్ళాక తండ్రి వేషాలు, తాతవేషాలు వేయకూడదు. అది లేకితనం అనిపించుకుంటుంది. అలాగే హీరోయిన్ వేషాలు వేసిన అందమైన యువతి, హీరోయిన్‌గానే

నిష్క్రమించాలి కాని అమ్మ వేషాలకు అమ్మమ్మ వేషాలకు కక్కుర్తి పడకూడదు!" – దిసీరా ఉవాచ.

29.4 "సినిమా హీరోయిన్ల కళ్ళు కనుబొమలు అంత అందంగా ఉంటాయని అనుకోకండి. కనుబొమలు పూర్తిగా తీసివేసి, పెన్సిల్‌తో అందంగా కావలసిన రీతిలో తీర్చిదిద్దుతారు. అలాగే కనురెప్పలకు అందంగా వంకర తిరిగిన వెంట్రుకలు అతికిస్తారు." – దిసీరా ఉవాచ.

29.5 "దేశవిభజన ఇతివృత్తంతో తీసిన "పడోసి" సినిమాలో దర్శకుడు శాంతారాం ఒక ముస్లింనటుడిచేత హిందువువేషం, ఒక హిందూనటునిచేత ముస్లిం వేషం వేయించాడు. అదీ నటన అంటే! హిందువు – హిందువుగాను, ముస్లిం – ముస్లింగానూ నటిస్తే అది నటన కాదు!" – దిసీరా ఉవాచ.

29.6 "ఒక రాజ్‌కపూర్ సినిమాలో ("సంగం" అనుకుంటాను) రాజ్‌కపూర్ (నాయకుడు) వైజయంతీమాల (నాయిక) ఫ్రాన్సులో ఈఫిల్‌టవర్ ఎక్కిచూస్తూ ఉంటారు. అక్కడ విదేశీ ప్రేయసీ ప్రియులు ఒకరినొకరు గట్టిగా కౌగిలించుకొని ముద్దుపెట్టుకుంటూ వుంటారు. వారిని చూచి రాజ్‌కపూర్ కూడా వైజయంతీమాలను ముద్దుపెట్టుకోబోతాడు. ఆమె తిరస్కరిస్తుంది. వీరిని చూచి ఒక విదేశీయుడు "Are you Indians?" అని అడుగుతాడు. "ఎంత బాగుందో చూడండి!" అని క్లాసులో చెప్పారు. "ఆ సినిమా చూశారా?" అని మమ్మల్ని అడిగారు. మేము చూడలేదని చెప్పాం. "యువకులు మంచి మంచి సినిమాలు చూడాలయ్యా!" అన్నారు.

**30) "చేసిన కృషి తక్కువ; వచ్చిన పేరు ఎక్కువ":–**

"తెలుగు సాహిత్యవేత్తలలో కొందరు చేసిన కృషి తక్కువగా ఉంటుంది; వారికి వచ్చిన కీర్తి ఎక్కువగా ఉంటుంది" అని చెపుతూ గురుదేవులు ముగ్గురి పేర్లు ఉదాహరించారు: "రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పింగళి లక్ష్మీకాంతం, నందూరి రామకృష్ణమాచార్య". ఒక మిత్రుడు ఈ విషయం విని "ఈ పేర్లకు జంధ్యాల పాపయ్యశాస్త్రిగారిపేరు, జాషువాగారిపేరు కూడా చేర్చాలి" అన్నాడు.

**31) లేఖకు వెంటనే సమాధానం:–**

గురుదేవులకు నేను లేఖ వ్రాస్తే వెంటనే జవాబు వ్రాసేవారు. అయితే

ఎప్పుడూ కార్డు ముక్క మాత్రమే వ్రాసేవారు. వారి దస్తూరీ అంత బాగుండదు. డాక్టర్ల Prescription లా ఉండేది. అలాగే కష్టపడి చదువుకొనేవాడిని.

**32) నాకునచ్చని ఒకే ఒక విషయం:-**

మేము బి.ఏ. చదువుతూ ఉండగా గురువుగారికి మాతృవియోగం కలిగింది. నేను రోజూ స్నానం చేసే పిల్లకాలవగట్టున (కలిదిండి బంగార్రాజుగారి యింటికి ఎదురుగా) పురోహితుని సమక్షంలో గురువుగారు కర్మకాండ నిర్వహిస్తున్నారు. నేను వారిని చూచి ఆశ్చర్యపోయాను. గుండుకొట్టించుకోలేదు; పిలక పెట్టించుకోలేదు; క్రాపు అలాగే ఉంచుకొని తల్లికి కర్మచేస్తున్నారు. ఇది నాకు సుతరామా నచ్చలేదు. పోనీ ఆయన క్రాపు నల్లగా ఉంగరాలజుట్టుతో ఉంటుందా? అంటే అదీ లేదు. అంతా ముగ్గుబుట్టలా నెరిసిపోయిన జుట్టు. అందంగా నల్లగా ఉంగరాలు తిరిగిన జుట్టు ఉన్న కొడుకులు కూడా తల్లిదండ్రులు చనిపోతో, గుండుకొట్టించుకొని పిలకపెట్టించుకొని, భక్తి శ్రద్ధలతో కర్మకాండ నిర్వహిస్తారు. మా గురువుగారు క్రాపుతో తల్లికి కర్మకాండ చేయటం నాకు చెప్పరానంత బాధకలిగించింది!

## III. ఎం.ఏ (1961-63) - పిహెచ్.డి. (1963-68) - ఉద్యోగం (1969-72) సమయంలో జరిగిన సంఘటనలు:-

### 3.1 ఎం.ఏ (1961-63):-

**1) పింగళివారికి సిపార్సులేఖ:**

నేను 1957 బి.ఏ. ప్యాసయ్యాను. వెంటనే పోస్టాఫీసులో గుమాస్తాగా ఉద్యోగం వచ్చింది. నాకు మనసులో ఎం.ఏ. (తెలుగు) చదవాలని ఉన్నా, మా తమ్ముళ్ళిద్దరూ కాకినాడ ఇంజనీరింగ్ కాలేజీలో బి.ఇ.లో చేరడంవల్ల ఎం.ఏ. చదవడానికి డబ్బుల్లేక పోస్టాఫీసు ఉద్యోగంలో చేరాను. 1961లో మా చిన్నతమ్ముడు ("బుల్లితమ్ముడు") బి.ఇ. మెకానికల్ పూర్తిచేసి, ఢిల్లీలో ఉద్యోగంలో చేరాడు. వాడు ఎంతో ఉదారంగా నన్ను "నువ్వు ఎం.ఏ.లో చేరరా! నేను డబ్బు పంపుతాను!" అన్నాడు. నేను ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర, మద్రాసు- నాలుగు విశ్వవిద్యాలయాలకు దరఖాస్తు పెట్టుకున్నాను. నాలుగు చోట్లా సీటు వచ్చింది. ఎక్కడ చేరాలో తెలియలేదు. గురుదేవులకు ఉత్తరం వ్రాశాను. "అన్నీ

వటవృక్షాలే ఎక్కడైనా చేరు; ఫరవాలేదు" అని సమాధానం వ్రాశారు. మా కులదైవం శ్రీ వేంకటేశ్వరస్వామివారు. పైగా అది కొత్తగా పెట్టిన యూనివర్శిటీ. అక్కడ చేరి, రిసెర్చి కూడా చేస్తే అక్కడే ఉద్యోగం దొరుకుతుంది అనే ఆశతో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చేరాను. చేరిన కొద్ది నెలలకే, నా అదృష్టం కొద్దీ గురుదేవులు దిసీరా గారికి గురుదేవులైన పింగళి లక్ష్మీకాంతంగారు అక్కడికి ప్రొఫెసర్‌గా వచ్చారు. (ప్రపంచ ప్రసిద్ధికెక్కిన భాషాశాస్త్రవేత్త డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు రీడర్‌గా వచ్చారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులు ప్రముఖ పరిశోధకులు తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు సీనియర్ లెక్చరర్‌గా వచ్చారు. నేను భీమవరం వెళ్ళి దిసీరాగారికి చెప్పాను. పింగళివారికి ఒక సిపార్సు లేఖ ఇమ్మని వారిని అడిగాను. "నువ్వు వెళ్ళు! నేను తరవాత వారికి లేఖ వ్రాస్తాను" అన్నారు. (అలాగే నన్ను గురించి మంచిగా ఒక లేఖ వ్రాశారు. దానితో పింగళివారు నన్ను ఎంతో అభిమానంతో చూస్తూ వచ్చారు.) ఈ సందర్భంగా దిసీరా నాకో హెచ్చరిక కూడా చేశారు. "తిక్కనను గురించి చెపుతూంటే పింగళి వారికి పూనకం వస్తుంది! ఆ పూనకంలో పడి కొట్టుకుపోకు, జాగ్రత్త! నీ సొంత అభిప్రాయాలు ఏర్పరచుకో!"

దిగుమర్తివారు పింగళివారికి అభిమాన శిష్యులు. అయినా అవకాశం వచ్చినప్పుడు వారికి ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఉద్యోగం ఇవ్వలేదు. వీరినీ, దివాకర్ల వేంకటావధానిగారినీ ప్రక్కన పెట్టి, కె.వి.ఆర్. నరసింహంగారికి ఉద్యోగం ఇచ్చారు. దీనిని దృష్టిలో పెట్టుకొని నాకు మరో హెచ్చరిక కూడా చేశారు: "పింగళివారు నీకు ఉపకారం చేసేవరకూ చేశారని అనుకోవద్దు!"

**2) "గొప్పగొప్ప సాహిత్యవేత్తలను దర్శించాలి:–**

నేను 1961 జూన్ నెలలో తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ.లో చేరాను. దసరా సెలవులకు వచ్చినప్పుడు భీమవరం వెళ్ళి గురువుగారిని చూశాను. వారు వేసిన మొట్టమొదటి ప్రశ్న: "రాళ్ళపల్లివారిని చూశావా?" అని. నేను: "లేదు!" అన్నాను. గురువుగారు చాలా కోపపడ్డారు. "ఈసారి వెళ్ళినప్పుడు తప్పక చూడు. గొప్ప గొప్ప సాహిత్యవేత్తలను తప్పక కలవాలి; వారి ఆశీస్సులు తీసుకోవాలి! మరిచిపోకు!" అన్నారు.

**3) దుర్మార్గులైన విద్యార్థులు:-**

దిసీరాగారిని కళాశాలలో విశ్వవిద్యాలయ పరీక్షలలో Invigilator గా వేస్తే చాలా strict గా ఉండేవారు. జంతుశాస్త్ర విభాగంలో ఉపన్యాసకులుగా ఉన్న "జూఆలజీ రామారావుగారు" కూడా అలాగే చాలా strict గా ఉండేవారు. రాను రాను గురుభక్తిలేని దుర్మార్గులైన రౌడీ విద్యార్థులు బయలుదేరారు. ఒక పరీక్షలో గురువుగారిని వారి చేతిలో ఉన్న గొడుగుతోనే ఒక రౌడీ విద్యార్థి పొడిచాడని విని చాలా బాధపడ్డాను. అలాగే ఒక రాత్రివేళ జూఆలజీ రామారావుగారి యింటికి వెళ్ళి ఆయనను కత్తితో పొడిచారట! కలికాలం!

**3.2 పిహెచ్.డి. పరిశోధన (1963-68):**

**1) "హంసపదిక":**

నేను 1964లో "హంసపదిక" అనే పేరుతో వచన గీతాలలో ఒక ప్రణయకావ్యం వ్రాశాను. (దీనిలో శృంగరరసం కొంచెం మోతాదు మించింది!) ఈ కాపీ ఒకటి దిసీరాకు పంపించాను. వెంటనే వారు నాకు ఒక లేఖ (కార్డు) వ్రాశారు. (వారు లేఖలు కూడా గ్రాంథిక భాషలోనే వ్రాసేవారు.) "నీనుండి నేను ఆశించునది ఇట్టి రచనలు కాదు!" ఆ కవితా సంపుటి పీఠికలో నేను తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారిని "గురుదేవులు" అని సంబోధించాను. దానికి కూడా దిసీరా అభ్యంతరం చెప్పారు. "నీ గురుదేవులను నేనే! కోదండ రామయ్యగారు కాదు!" అని వ్రాశారు. నా తప్పు తెలిసికొని అప్పటినుండి దిసీరాగారిని మాత్రమే "గురుదేవులు" అని, తక్కిన పింగళి-తిమ్మావజ్ఝుల - జి.యన్.రెడ్డిగారలను "గురువర్యులు" అని సంబోధించడం మొదలు పెట్టాను. దిసీరాగారి లేఖను కోదండరామయ్యగారికి చూపించాను. ఆయన కూడా పెద్దమనసుతో దిసీరాగారిని సమర్థిస్తూ: "అవును; సీతారామస్వామిగారే నీ గురుదేవులు!" అన్నారు.

**2) మిక్కిలి చిక్కగా ఫ్రూట్ జ్యూస్:-**

1964లో తిరుపతిలో నేను పరిశోధన చేస్తున్నప్పుడు దిసీరా మా యింటికి వచ్చారు. అప్పుడు వారి తమ్ముడు డా॥ దిగుమర్తి సుందరశివరావుగారు తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర మెడికల్ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తూ ఉండేవారు. వారిని చూడటానికి వచ్చారు. మా యింటికి వచ్చిన గురుదేవులకు

ఒక గాజుగ్లాసులో ఫ్రూట్ జ్యూస్ కలిపి ఇచ్చాను. మా ఆవిడను జ్యూస్ కలపమంటే పలుచగా కలుపుతుందని నేనే స్వయంగా చిక్కగా కలిపి యిచ్చాను. చాలా తియ్యగా ఉంది కాబోలు, వారు నన్ను చూసి నవ్వుతూ: "నీ అభిమానమంతా ఇందులో చూపించావయ్యా!" అన్నారు.

**3) "శ్మశానంలో కాపురం":-**

దిసీరా తిరుపతి వచ్చినప్పుడు (1964) నేను అత్యుత్సాహంగా వారితో ఇలా అన్నాను: "ఈ తిరుపతిలో అన్ని రకాల కాలేజీలూ ఉన్నాయండి. మెడికల్, ఇంజినీరింగ్, వెటర్నరీ, అగ్రికల్చర్, మహిళా కళాశాల, ఓరియంటల్ కళాశాల, విశ్వవిద్యాలయం మొదలైనవి అన్నీ ఉన్నాయి. ఇక్కడ కాపురం ఉంటే, పిల్లల్ని ఏ కోర్సులో అయినా చేర్పించి చదివించుకోవచ్చు!" దానికి గురుదేవులు నవ్వుతూ, వారికి సహజమైన చమత్కారంతో ఇలా వ్యాఖ్యానించారు: "ఎలాగూ చచ్చిపోతాం కదా అని శ్మశానంలో కాపురం ఉంటామటయ్యా?"

**4) "చంద్రగిరిదుర్గం:-**

దిసీరా తిరుపతి వచ్చినప్పుడు (1964) నేను వారికి చారిత్రక స్థలమైన "చంద్రగిరిదుర్గం' చూపించాలని తాపత్రయపడ్డాను. ఇద్దరం కలిసి సాయంకాలం వేళ తిరుపతినుండి బస్సులో బయలుదేరాం. బస్సు అక్కడికి ఆలస్యంగా వెళ్ళింది. మసక మసక చీకటి పడుతోంది. రాజమహలు దగ్గర రాణిమహలు దగ్గర విద్యుద్దీపాలు లేవు. చంద్రగిరి దుర్గం చీకటిలో సరిగా కనపడలేదు. నేను చాలా నిరాశచెందాను." ఫరవాలేదులే! ఇంకోసారి బాగా వెలుగుండగా వద్దాం!" అని ఓదార్చారు గురువుగారు.

**5) మరదలు మాత్రమే ఉన్న ఇల్లు నచ్చలేదు:-**

ఒకసారి దిసీరా తిరుపతి వచ్చినప్పుడు (1964) వారి తమ్ముడు డా॥ సుందర శివరావుగారు ఊళ్లో లేరు. మరదలు మాత్రమే ఉన్నారు. ఆమె కూడా ఎక్కడో ఉద్యోగం చేస్తోంది. అందువల్ల గురువుగారు ఎక్కువ రోజులు అక్కడ ఉండటానికి ఇష్టపడలేదు. ఆ అభిప్రాయం నా దగ్గర వెల్లడించారు.

**6) "రేవతి" కాదు - "రేవతీశశిప్రియ":-**

1965లో నాకు ఆడపిల్ల పుట్టింది. మా ఆవిడకు కుటుంబ నియంత్రణ

ఆపరేషన్ చేయించాను. ఆ ఆపరేషన్ చేసిన డాక్టరుగారి పేరు "రేవతి". మా అమ్మాయి పుట్టిన నక్షత్రం కూడా రేవతే! అందువల్ల నేను పాపకు "రేవతి" అని పేరు పెట్టాలనుకున్నాను. గురుదేవులకు లేఖవ్రాశాను. వెంటనే వారు జవాబు వ్రాశారు: "రేవతి" అని కాదు, "రేవతీ శశిప్రియ" అని పేరు పెట్టమన్నారు. నేను అలాగే పేరు పెట్టాను. ఈ పాపే పెద్దదై ఇంగ్లీషులో ఎం.ఏ., పిహెచ్.డి.లు చేసి ఒక ఇంజినీరింగు కాలేజీలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేస్తోంది. ఆమె పేరు తలచుకొన్నప్పుడల్లా గురుదేవులు జ్ఞప్తికి వస్తారు. (నిజానికి రేవతీ నక్షత్రం చంద్రునికి ప్రియురాలు కాదు; చంద్రుడు "రోహిణీ ప్రియుడు"!)

**7) గ్రాంథిక భాషా? వ్యావహారిక భాషా?:-**

1964 ప్రాంతంలో అనుకుంటాను – శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో గురువర్యులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు ఒక పెద్ద చర్చాగోష్ఠిని జరిపించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ చర్చాగోష్ఠిని ఏర్పాటు చేయని పింగళి వారిని ఆదేశించింది. చర్చాగోష్ఠి విషయం ఏమిటంటే – విశ్వవిద్యాలయ కళాశాలల్లో Second Language Telugu; Part-III Group లోని అనువాద గ్రంథాలు గ్రాంథిక భాషలో ఉండాలా? లేక వ్యావహారిక భాషలో ఉండాలా? అని. ఈ చర్చాగోష్ఠి రెండు రోజులపాటు జరిగింది. దేశంలోని అనేక ప్రసిద్ధ పండితులు, కవులు, ఆచార్యులు పత్రికాసంపాదకులు ఆ సదస్సులో పాల్గొన్నారు. ఆ సభలకు పింగళివారు అధ్యక్షులు. ఈ సభకు వారి ప్రియశిష్యులైన దిసీరాను కూడా ఆహ్వానించారు. అప్పుడు ప్రముఖ భాషాశాస్త్రవేత్త డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు కూడా ఆ గోష్ఠిలో పాల్గొన్నారు. ఆయన వ్యావహారిక భాషావాది. దిసీరా గ్రాంథిక భాషావాది. ఇలాగ గోష్ఠిలోని పండితులు రెండు వర్గాలుగా చీలిపోయి ఉన్నారు. పింగళివారు సరళగ్రాంథిక వాది. భాషాశాస్త్రవేత్తలు, పత్రికా సంపాదకులు వ్యావహారిక భాషను సమర్థించారు. సంప్రదాయవాదులు గ్రాంథికభాషను సమర్థించారు. ఆ చర్చాగోష్ఠిలో ఆనాటి ఆంధ్రప్రభ దినపత్రిక సంపాదకులు నీలంరాజు వెంకట శేషయ్యగారు వ్యావహారిక భాషను సమర్థిస్తూ, ఆనాడు స్త్రీలు వ్యావహారిక భాషలో వ్రాస్తూన్న నవలల ప్రజాదరణను గురించి చెపుతూ, "మా అబ్బాయి భోజనంచేస్తూ కూడా, ఎడంచేత్తో నవల పట్టుకొని చదువుతూ

ఉంటాడు" అన్నారు. వెంటనే దిగుమర్తివారు లేచి "అంతమాత్రంచేత ఆ ప్రక్రియ గొప్పదికాదు!" అని ఖండించారు నిష్కర్షగా. రెండు రోజులు సుదీర్ఘ చర్చల తరువాత, పింగళివారు రెండు వర్గాలవారినీ సంతృప్తి పరుస్తూ మధ్యేమర్గాన్ని సూచించి ఒప్పించారు. Part-II Second Language Telugu లోని పాఠ్యగ్రంథాలు సరళ గ్రాంథికంలో ఉండాలి; Part-III లోని శాస్త్రగ్రంథాలు (Sciences, Social Studies, Commerce మొదలైనవి, ఆంగ్లంనుండి తెలుగులోనికి అనువదింప బడినవి) శిష్టవ్యావహారికభాషలో ఉండాలి. ఈ విధంగా తీర్మానించారు. అందరూ అంగీకరించారు.

**8) "మా కళాశాలకు వసంతుడిలా వచ్చానయ్యా!":-**

మహాత్మాగాంధీగారు క్రీ.శ. 1869 అక్టోబరు 2వ తేదీన గుజరాత్‌లోని పోర్‌బందర్ పట్టణంలో జన్మించారు. అందువల్ల 1968-69వ సంవత్సరం మన దేశంలో "గాంధీ శతజయంతి సంవత్సరం"గా పాటించబడింది. అప్పుడు మా గురువర్యులు ప్రొ॥ జి.యన్. రెడ్డిగారు నన్ను గాంధీజీని గురించి ఒక కవిత వ్రాయమన్నారు. నేను "మహాత్మా! నువ్వు మళ్ళీ అవతరించాలి!" అనే వచన కవిత వ్రాశాను. దానిని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగిన గాంధీశత జయంతి సభలో చదివాను. సభాసదులందరూ ఒక్కపెట్టున కరతాళ ధ్వనులతో దానిని మెచ్చుకున్నారు. అదే సంవత్సరం (1968లో) దిగుమర్తివారు మా విశ్వవిద్యాలయంలో రీడరుగా ఉన్న ప్రముఖ పండితులు, పరిశోధకులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులు, అస్మద్గురువర్యులు అయిన డా॥ తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారిని భీమవరం కళాశాలకు ఆహ్వానించారు. 'భారతి'లో వారి పరిశోధనాత్మక వ్యాసాలు చదివి, మెచ్చుకొని పిలిచారు (ముఖ్యంగా "తెలుఁగు మఱుఁగులు" అనే వ్యాస పరంపర చూచి). భీమవరం మా ప్రాంతం కాబట్టి వారితో నేను కూడా వెళ్ళాను.

భీమవరం కళాశాలలో క్రొత్తగా నిర్మించిన పెద్ద ఆడిటోరియంలో సభ ఏర్పాటు చేశారు. కోదండరామయ్యగారు నన్నయకాలంనాటి చారిత్రక పరిస్థితులను గురించి వివరిస్తూ చాలా గొప్ప ఉపన్యాసం చేశారు. కాని అది చాలా సీరియస్ ఉపన్యాసం. అందువల్ల ఇంటర్ విద్యార్థులకు, డిగ్రీవిద్యార్థులకు అది అర్థంకాలేదు.

శ్రోతల అసంతృప్తిని గమనించి, అధ్యక్షులైన దిగుమర్తివారు ఇలా అన్నారు: పండితుడు, పరిశోధకుడు అయిన వక్త తేలిక విషయాలు మాట్లాడితే, "ఓస్! ఇంతేనా!" అని పెదవి విరుస్తారు శ్రోతలు. బరువైన విషయాలు మాట్లాడితే తెల్లమొహం వేస్తారు" అన్నారు. ఆ సమయంలో నేను వ్రాసిన "గాంధీకవిత"ను గురించి కోడందరామయ్యగారు దిగుమర్తివారి చెవిలో ఊదారు. వారు నన్ను వేదిక మీదికి పిలిచారు. నేను వెళ్ళి ఎంతో ఉత్సాహంతో, గంభీరమైన కంఠంలో "మహాత్మా! నువ్వు మళ్ళీ అవతరించాలి!" అనే కవితను మైకులో చదివాను. విద్యార్థులందరూ ఉర్రూతలూగిపోయారు! కరతాళధ్వనులు మిన్నుముట్టాయి! గురుదేవులు ఉబ్బితబ్బిబ్బయిపోయారు. నన్ను చూచి పరమానందంతో – "మా కళాశాలకు వసంతుడిలా వచ్చావయ్యా!" అన్నారు ఎంతో కవితాత్మకంగా.

బసకు వెళ్ళిన తరువాత గురువర్యులు కోదండరామయ్యగారితో: "గురువుగారూ! అంతకఠినమైన విషయం మాట్లాడారేమిటి?" అని అడిగాను. "ఉండవయ్యా! నా టార్గెట్ (శ్రోతలు) తేలికపాటి విద్యార్థులు కాదు; గొప్ప విమర్శకుడైన మీ దిగుమర్తివారు! ఆయన్ని మెప్పించాలి నేను" అన్నారు.

**9) "దేశమంటే మట్టికాదోయ్!": –**

మహాకవి గురజాడ తన "దేశభక్తి" గేయంలో "దేశమంటే మట్టి కాదోయ్! దేశమంటే మనుషులోయ్!" అన్నాడు. ఇవి చాలా ప్రసిద్ధమైన పాదాలు. కాని మా గురుదేవులు ఈ మాటలను తీవ్రంగా ఖండించారు. "దేశమంటే మట్టి కాకపోతే మనం (భారతీయులం) 1962లో చైనాతోను, 1965లో పాకిస్థాన్‌తోను దేనికోసం పోట్లాడాము? మట్టికోసం కాదా?" అని అడిగారు.

**10) నా పరిశోధన గురించిన మెచ్చుకోలు: –**

నేను 1963 నుండి 1968 వరకు ఐదు సంవత్సరాలపాటు "తెలుగు వీరగాథాకవిత్వము" అనే అంశాన్ని గురించి పరిశోధన చేశాను. ఈ పరిశోధనాంశాన్ని సూచించిన మహనీయులు పింగళివారు. 1963 నుండి 1965 వరకూ పింగళివారు, 1965 నుండి 1968 వరకు ప్రొ॥ జి.యన్. రెడ్డిగారు నాకు మార్గదర్శకులు. మొదటినుంచీ నేపథ్యంలో మార్గదర్శకులు ప్రొ॥ కోదండ రామయ్యగారు. ఈ పరిశోధనాంశాన్ని గురుదేవులు దిగుమర్తివారికి చెపితే "రోడ్డు

ప్రక్కన అమ్మే గుజిలీ ప్రతులు సేకరిస్తే చాలు; నీ పరిశోధన అయిపోతుంది!" అన్నారు. నిజానికి అంత తేలిక కాలేదు. ఎన్నో ఊళ్ళు తిరిగి, ఎన్నో తాళపత్ర గ్రంథాలు సేకరించాను. ఎన్నో వీరగాథలు వృత్తిగాయకులు పాడుతూంటే నోటు బుక్స్‌లో ఎత్తి వ్రాసుకున్నాను. ఎంతో సమయం పట్టింది. మొత్తానికి ఆలస్యంగా నయినా పూర్తి అయింది. సుమారు 1500 పేజీల సిద్ధాంత గ్రంథం వ్రాయడం పూర్తి చేశాను. ఆరోజు 1968 జనవరి 23వ తేదీ. అది సరిగ్గా భారత మహావీరుడు నేతాజీ సుభాస్ చంద్రబోసుగారి పుట్టిన దినం! నేను ఆశ్చర్యపోయాను! (కొన్నేండ్ల తరువాత సరిగ్గా అదే "నేతాజీ జన్మదినం" నాడు కటక్‌లో ఆయన పుట్టిన ఇల్లు చూశాను. ఆ రోజు ప్రజలు ఆ యింటిని ఎన్నో పూలతో అలంకరించారు.) 1968 జనవరి నెలలో సమర్పించిన నా సిద్ధాంతగ్రంథానికి 1969 ఫిబ్రవరినెలలో పిహెచ్.డి. డిగ్రీ వచ్చింది. కాబట్టి పరిశోధనలో నేను కనుగొన్న నూతనాంశాలను బహిర్గతం చేయవచ్చును. 'భారతి'లో ఎన్నో వ్యాసాలు వ్రాశాను. పరిశోధన సారాంశాన్నంతా చిన్న రేడియో ప్రసంగంగా వ్రాసి, విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో మాట్లాడాను. "నా ప్రసంగం ఫలానా తేదీనాడు వస్తుంది; మీరు తప్పక వినాలి"అని గురుదేవులు దిసీరాగారికి లేఖ వ్రాశాను. ఆయన ఎంతో జ్ఞాపకం పెట్టుకొని, రేడియోలో నా ప్రసంగాన్ని శ్రద్ధగా విని, పరమానంద భరితులై, నాకు లేఖ వ్రాశారు. ఆ లేఖలో చివరి వాక్యం ఇలా ఉంది: "ఈ ఆంధ్రదేశంలో వీరగాథలను గురించి నీవొక్కనివే ప్రసంగింపగలవు!" అని ఆశీర్వదించారు. వారి ఆశీర్వచన బలంతోనే నాకు జానపదరంగంలో వీరగాథా శాఖలో మిక్కిలి కీర్తిప్రతిష్ఠలు లభించాయి. ఈ విధంగా "హంసపదిక" అనే చెత్తకవితా సంపుటని ప్రకటించి, గురుదేవులకు పంపి, వారి మనస్సునొప్పించిన దోషాన్ని తొలగించుకున్నాను.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని నేను ప్రచురించే నాటికి దిగుమర్తివారు ఈ లోకంలో లేరు. పింగళివారు, జి.యన్.రెడ్డిగారు, కోదండరామయ్యగారు కూడా స్వర్గస్థులయ్యారు. ఒక్క ప్రొ॥ కోరాడ మహదేవశాస్త్రిగారు మాత్రం 90 ఏళ్ళ వయస్సులో అనంతపురంలో ఉన్నారు. వారికి నా శిష్యుడు ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి ద్వారా నా సిద్ధాంతగ్రంథం పంపించాను. అంతటి వృద్ధాప్యంలో కూడా

మహదేవశాస్త్రిగారు నా వీరగాథాకవిత్వ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ఎంతో మెచ్చుకుంటూ నాకు లేఖ వ్రాశారు. (వీరు 11-10-2016నాడు స్వర్గస్థులయ్యారు)

నా సిద్ధాంత గ్రంథం టైపుచేసిన ప్రతిని 1970-71లోనే ప్రొ॥ జి.యన్.రెడ్డి గారిదగ్గరనుండి తీసికొని, ఆమూలాగ్రం చదివిన ప్రముఖ విరసం కార్యదర్శి, ఉత్తమ పరిశోధకులు అయిన ప్రొ॥ కె.వి. రమణారెడ్డిగారు నాకు ఈ క్రింది విధంగా లేఖ వ్రాశారు: "This is not 'research'! This is not 'search' even! This is an 'adventure'! Hates off to you! I want to see you!" తరువాత కావలిలో ఉన్న వారియింటికి వెళ్ళి వారిని దర్శించి వచ్చాను. రమణారెడ్డిగారు నాకు 1947 ఆగస్టు 15వ తేదీనాటి – అంటే భారత స్వాతంత్ర్య దినోత్సవంనాటి "ఆంధ్రపత్రిక దినపత్రిక ప్రత్యేక సంచికను, నందిరాజు చలపతిరావుగారి "స్త్రీలపాటలు-మొదటిసంపుటి"ని బహూకరించారు. సంతోషంగా వాటిని స్వీకరించి భద్రంగా యింటికి తెచ్చుకున్నాను.

**11) "అద్దేపల్లి అతిగా వ్రాశాడు!" ("శ్రీశ్రీ కవితా ప్రస్థానం"):-**

1964-65 ప్రాంతాల్లో కాబోలు, నా మిత్రుడు (నాకు ఎం.ఏ.లో సీనియర్) అద్దేపల్లి రామమోహనరావు ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని ఆకాశానికి ఎత్తేస్తూ, సీరియల్‌గా ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. మహాప్రస్థానాన్ని గురించి తెలుగులో వచ్చిన మొట్టమొదటి విమర్శ అది. దానితో అతనికి బాగా పేరు వచ్చింది. (తరువాత ఆ వ్యాసాలన్నీ కలిపి "శ్రీశ్రీ కవితా ప్రస్థానం" అనే పేరుతో పుస్తక రూపంలో కూడా తీసుకువచ్చాడు.) ఆంధ్రప్రభలో వచ్చిన ఆ వ్యాసాలన్నీ గురుదేవులు దిగుమర్తివారు చదివారు. నేను వారిని దర్శించినప్పుడు ఆ వ్యాసాల ప్రసక్తి వచ్చింది. "శ్రీశ్రీ కవిత్వాన్ని గురించి అంత గొప్పగా వ్రాయవలసింది అందులో ఏమీలేదు. అద్దేపల్లి అతిగా వ్రాశాడు!" అన్నారు. నేను తరువాత ఆ వ్యాసాలను సూక్ష్మంగా పరిశీలిస్తే గురుదేవులవాక్కు నిజమని తెలుసుకున్నాను. అద్దేపల్లి మొట్టమొదట విశ్వనాథవారి శిష్యుడు. విశ్వనాథవారు "నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి" – "ఒకడు నాచన సోమన" – "అల్లసానివాని అల్లిక జిగిబిగి" మొదలైన వ్యాసాలు వ్రాశారు. వారు నన్నయ-సోమన-పెద్దనల కవిత్వాన్ని ఎలా విశ్లేషించారో ఆ సూత్రాలను

అనుసరిస్తూ, వాటిని శ్రీశ్రీకి అన్వయించాడు అద్దేపల్లి. విశ్వనాథవారి శైలిని కూడా అనుకరించాడు. ("ఇచట నొక రహస్యమున్నది" - "ఈ పదమును ప్రయోగించుటలో నొక విశేషమున్నది" మొదలైన వాక్యాలను అనుకరించాడు.) కాని ఎంత అభ్యుదయకవి అయినా శ్రీశ్రీ-కవిత్రయం, సోమన, పెద్దనలతో తులతూగలేదు కదా! అందువల్ల అద్దేపల్లి ధోరణి దిగుమర్తివారికి అతి అనిపించింది. నాకు కూడ అలాగే అనిపించింది!

**12) మరికొన్ని సంగతులు:-**

**12.1 మన జాతీయగీతం ఎవరిని గురించి?:-** "జనగణమన అధినాయక" అనేది మన జాతీయగీతం. దీనిని రవీంద్రనాథ్ టాగూరు రచించాడు. కాని యిది మన భారతదేశాన్ని గురించి వ్రాసిన పాట కాదు; బ్రిటన్ చక్రవర్తి George-V మన దేశానికి వచ్చినప్పుడు ఆయన్ని ప్రశంసిస్తూ వ్రాసినపాట. ఇది భారతదేశ జాతీయ గీతమేమిటి? దీనికన్నా "వందేమాతరం" పాటను జాతీయగీతం చేసివుంటే బాగుండేది! (ఈ అభిప్రాయాన్ని దీసీరా నా దగ్గర వెలిబుచ్చిన జ్ఞాపకం)

**12.2 "శ్రీలకు చెదపట్టిందయ్యా!":-** ఆరోజుల్లో కవులు రచయితలు "శ్రీ" తో అంతమయ్యే కలంపేర్లు పెట్టుకొనేవారు. మా సహాధ్యాయి "ఉషశ్రీ" గారే దీనికి ఉదాహరణం. (కాని మంచి పండితుడైన తమ్మన వెంకటేశ్వరరావు గారు "ఉషశ్రీ" అనే పేరు తప్పు; "ఉషస్సు + శ్రీ = ఉషశ్శ్రీ" అవ్వాలి - అనేవారు.) ఇంకా "మంజుశ్రీ" - "హితశ్రీ" - "సాంధ్యశ్రీ" - "కవిశ్రీ" - "కరుణశ్రీ" (జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు) మొదలైన కలంపేర్లు చాలా ఉండేవి. వారిని చూచి నేను కూడా "ఫణిశ్రీ" అనే పేరు పెట్టుకొని కొన్ని రచనలు చేశాను. దానిని చూచి గురుదేవులు "ఈ శ్రీలకు చెదపట్టిందయ్యా! వద్దు!" అని మందలించారు.

**12.3 ఆడవాళ్ళ అందమైన పేర్లు:-** "అపర్ణ" - "ఊర్మిళ" అనే పేర్లు అందంగా ఉన్నాయనే భ్రమతో ఇవి ఆడపిల్లలకు పెట్టకండి. "అపర్ణ" అంటే "ఆకులు కూడా తిననిది" అని అర్థం. "ఊర్మిళ" అంటే "కునికి పాట్లు పడేది" అని అర్థం. "ఈ రోజుల్లో బాలికల ఉన్నత పాఠశాలల్లోను, స్త్రీల కళాశాలల్లోను

హాజరు పట్టికలు చూడండి; ఎంతో అందమైన పేర్లు కనబడతాయి" అనేవారు. (గురుదేవులు తాము అనువదించిన కాళిదాసు ఋతు సంహారాన్ని వారి ధర్మపత్నికి అంకితమిచ్చారు. ఆమె పేరు "వెంకట సీతారత్నం" కాని ఆ పేరును "శతతారాదేవి"గా మార్చి, అంకితమిచ్చారు.)

**12.4 "అరిగిపోయిన మాటలు వాడకండి":–** "సస్యశ్యామలం" వంటి అరిగిపోయిన మాటల్ని వాడకండి – అని మమ్మల్ని హెచ్చరించేవారు. వారి రచనలలో "ఆభాణకము (=సూక్తి) – "శశవిషాణము" (=కుందేటికొమ్ము) "సాకిరి" (=సాక్షి) అనే మాటలు వాడేవారు.

**12.5 "నిదురించు సింగంబు నోట..":–** నేను 1954 మార్చిలో ఇంటర్ పరీక్షకు వెళ్ళవలసింది. కాని పరీక్షల ముందు నాకు టైఫాయిడ్ జ్వరం వచ్చింది. హోటల్ భోజనం పడకపోవడం వల్ల వచ్చింది. 1954 మార్చిలో పరీక్షలకు కూర్చోలేకపోయాను. 1954 సెప్టెంబరు పరీక్షలలో ఇంగ్లీషు, తెలుగు భాషలు వ్రాశాను. 1955 మార్చి పరీక్షలలో బై.పి.సి. గ్రూపు పరీక్షలు వ్రాశాను. ఇంగ్లీషులో చాలా మంచి మార్కులు వచ్చాయి. అలాగే గ్రూపులో ఫస్ట్ క్లాస్ వచ్చింది. నాకు విశాఖపట్టణం వెళ్ళి బి.ఎ. (ఆనర్స్) ఇంగ్లీషు చదవాలనిపించింది. అప్లై చేస్తే సీటు రాలేదు. అక్కడికి వెళ్ళి ఇంగ్లీషు ప్రొఫెసర్‌ని కలిస్తే సీటు వస్తుందన్నారు. కొందరు పెద్దలు. నాకు తణుకు భీమవరం తప్ప వేరే పట్టణాలు తెలియవు. పల్లెటూరువాడిని. విశాఖపట్టణం వెళ్ళాలంటే భయం. అందువల్ల వెళ్ళలేదు. "విశాఖపట్టణం వెళ్ళి ఇంగ్లీషు ప్రొఫెసర్ని కలిస్తే నాకు సీటు వచ్చేది" అనే విషయం దీసీరాగారికి చెప్పాను. వారు వెంటనే ప్రయత్నం చేయకుండా కార్యమెలా సిద్ధిస్తుంది? – అదే విషయాన్ని జ్ఞప్తికి తెస్తూ "నిదురించు సింగంబు నోట మృగంబులు తమంతతాము చొరబడవు కదా!" అన్నారు – చిన్నయసూరి మిత్రభేదాన్ని ఉదాహరిస్తూ.

**12.6 "రాంపండు":–** సీతారామస్వామిగారు పచ్చదబ్బపండు ఛాయలో మిగలమగ్గిన జాంపండులా ఉండేవారు. వారిని ఇంట్లో తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్లు "రాంపండు" అని పిలిచేవారని ఒకసారి వారి తమ్ముడు డా॥ సుందర శివరావుగారితో మాట్లాడుతుండగా తెలిసింది.

"రామస్వామి" కాబట్టి "రాంపండు" అయ్యారు. మా పెద్దక్కయ్యగారి ఊళ్లో (పేకేరులో) ఒక ఉపాధ్యాయుడు తెల్లగా ఇలాగే ఉండేవాడు. ఆయన్ని అందరూ "జాంపండు మేస్టారు" అని పిలిచేవారు.

**12.7 "నేను గుళ్ళో పురాణాలు చెప్పుకొని బ్రతికేస్తాను! మీరెలా బ్రతుకుతారు?":–** ఒకసారి మా తెలుగు శాఖాధిపతి నండూరి రామకృష్ణమాచార్యుల వద్ద ప్రిన్స్‌పాల్ ఇ. లక్ష్మీనాథరావుగారు (కెమిస్ట్రీ ఆయన సబ్జెక్టు) తెలుగు భాషను కొంచెం తేలిక చేసి మాట్లాడారట. అప్పుడు నండూరివారు: "అయ్యా! నాకు ఈ ఉద్యోగం పోతే, నేను గుళ్ళల్లో పురాణాలు చెప్పుకుంటూ బ్రతికేస్తాను. మీరు కెమిస్ట్రీవారు. ఈ ఉద్యోగం పోతే ఎలా బ్రతకగలరు?" అని ప్రశ్నించారట. ప్రిన్స్‌పాల్ పకపకా నవ్వి ఊరుకున్నారట!

**12.8 విద్యార్థులు పెట్టిన Nick Names:–** మా ప్రిన్సిపాల్ ఇ. లక్ష్మీనాథరావుగారు కాపు. ఆయన్ని ఎందువల్లనో విద్యార్థులు "గూనిచాకలి" అని పిలిచేవారు. ఆ రోజుల్లో కెమిస్ట్రీశాఖకు అధిపతి పాలగుమ్మి పద్మరాజుగారు. వీరు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన కథారచయిత, కవి. వీరు వ్రాసిన "గాలివాన" అనే కథానికకు ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయబహుమతి వచ్చింది. (ప్రథమబహుమతి ఎవరికీ రాలేదు). వీరు "పురిటిపాట" అనే కవిత మిక్కిలి ప్రసిద్ధమైనది. ఈ పద్మరాజుగారు "రాంపండు"–"జాంపండు" అయిన సీతారామస్వామిగారికి dead opposite గా కారునలుపులో సన్నగా ఉండేవారు. వీరిని విద్యార్థులు "కాకి" అని పిలిచేవారు. మా గురువుగారు పైజామా, చొక్కా కోటు ధరిస్తారు కాబట్టి వీరిని "అత్తరు సాయెబు" అని పిలిచేవారు. ఒక అమ్మాయి సన్నగా, పొడుగ్గా, ముందుకీ వెనక్కీ ఊగుతూ నడుస్తూ వచ్చేది కాలేజీకి. ఆమెకు "Camel" అని పేరుపెట్టారు. మా క్లాసులో ఒక అమ్మాయికి ముక్కు పొడుగ్గా ఉండేది. చూపులు అదోరకంగా ఉండేవి. ఆమెను "కోడి" అని పిలిచేవారు. ఇంకొక రజకుల అమ్మాయి కళాశాలలో చదువుకొనేది. ఆమెను చూడగానే "501 బార్ సోప్" అని అరిచేవారు. ఇవన్నీ చాలా తప్పుడు పనులని ఇప్పుడు తెలుస్తున్నాయి. ఆ రోజుల్లో ముఖ్యంగా స్త్రీలు నిమ్నకులాలవారు ముందుకు వచ్చి కాలేజీ చదువులు చదవడం గొప్ప విషయం. వారిని ప్రోత్సహించాలి కాని,

ఇలా మారుపేర్లతో హింసించకూడదు! అజ్ఞానంవల్ల అటువంటి పనులు చేసేవారు.

**12.9 Principal × Vice-Principal :–** ఆ రోజుల్లో మా ప్రిన్సిపాల్ ఇ. లక్ష్మీనాథరావుగారు (Chemistry); వైస్–ప్రిన్సిపాల్ ధూళిపాళ అర్కసోమయాజులుగారు (Mathematics). ప్రిన్స్‌పాల్ అంటే మా గురుదేవులకు ఎందుకో అంతగా రుచించేదికాదు. "ప్రిన్స్‌పాల్ సెలవులో ఉండి, వైస్–ప్రిన్స్‌పాల్ ఇన్‌ఛార్జిగా ఉన్నప్పుడు వెళ్ళి నా పనులు చేయించుకొని వచ్చేస్తాను!'' అన్నారు దినీరా ఒకసారినాతో. (లక్ష్మీనాథరావుగారు కాపు; అర్కసోమయాజులుగారు బ్రాహ్మణుడు కావడం దీనికి కారణం కావచ్చు.)

**12.10 "నువ్వు అందరినీ నమ్ముతావయ్యా!":–** నేనొకసారి నెల్లూరికి (?) ఒక సెమినార్‌కి వెళ్ళాను. అక్కడికి భీమవరం కళాశాలనుండి యువకుడైన ఒక లెక్చరర్ వచ్చాడు. ఆయన పేరు డా॥ బులుసు పూర్ణేశ్వరరావు. (ఈయన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి బంధువు) భీమవరం నుండి వచ్చాడనే సంతోషంతో "దిగుమర్తి సీతారామస్వామిగారు బాగున్నారా?" అని అడిగాను. "బాగున్నారు" అన్నాడు. "నేను వారి శిష్యుణ్ణి. వారికి నా నమస్కారాలు చెప్పండి!" అన్నాను. "సరే!" అన్నాడు; కాని చెప్పలేదు. నేను తరువాత కొన్నాళ్ళకు గురువుగారిని కలిసినప్పుడు "పూర్ణేశ్వరారావుగారు నాకు ఫలానా ఊళ్లో కలిశాడు. మీ శాఖలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడట. మీకు నా నమస్సులు చెప్పమన్నాను. చెప్పాడా?" అని అడిగాను. ఆయన చిరునవ్వు నవ్వుతూ "నువ్వు అందరినీ నమ్ముతావయ్యా!" అన్నారు నిర్వేదంగా!

**12.11"నాటకం ఎలా ఉందో చదివి చెప్పకూడదు; ప్రదర్శిస్తూంటే చూచి చెప్పాలి!":–**

నేను ఒకసారి ఒక నాటకం వ్రాశాను. అది ఆంధ్రప్రభ వారపత్రికలో ముద్రింపబడింది. దానిని గురుదేవులకిచ్చి, ఎలా ఉందో చెప్పమన్నాను. అప్పుడు "నాటకం ఎలా ఉందో చదివి చెప్పకూడదు; ప్రదర్శిస్తూంటే చూచి చెప్పాలి!'' అన్నారు. అంతటి సూక్ష్మ విమర్శకులు ఆయన!

**13. మరికొన్ని ఉపాఖ్యానాలు:-**

1955-56 విద్యాసంవత్సరంలో మొదటి మూడు నెలల వరకు నండూరి రామకృష్ణమాచార్యులవారే తెలుగు శాఖాధిపతిగా ఉన్నారు. వారి పూర్తిపేరు ఎన్.వి.ఆర్. కృష్ణమాచార్యులు-నండూరి వెంకట రామకృష్ణమాచార్యులు. మనిషి చాలా సరదాగా నవ్వుతూ నవ్విస్తూ ఉండేవారు. వారూ పింగళివారి శిష్యులే. బి.ఏ. స్పెషల్ తెలుగులో మాకు నన్నయ "శిశుపాలవధ" బాగా నాటకీయంగా చెప్పారు. వారి పాఠం విన్న ఆనందతో నేను "దీనిని సినిమాగా తీస్తే చాలా బాగుంటుందండి!" అన్నాను. ఆయన నవ్వుతూ "నువ్వు దర్శకుడుగా అయినప్పుడు తీద్దువుగాని!" అన్నారు. తరువాతి కాలంలో ఎన్.టి.రామారావుగారు కృష్ణుడుగా, రాజనాల శిశుపాలుడా "శ్రీకృష్ణపాండవీయం" సినిమాలో ఈ శిశుపాలవధా ఘట్టాన్ని ఎంతో అందంగా తీశాడు. అగ్రపూజ గ్రహించిన పళ్లెంలో పోక చెక్కలు (వక్కలు) ఉంటాయి. శిశుపాలుడు కృష్ణుణ్ణి తీవ్రంగా దూషిస్తూ ఉంటాడు. కృష్ణుడు తన ఒళ్లో ఉన్న పళ్లెంలోంచి ఒక్కొక్క వక్కనే తీసి బయట పడేస్తూ ఉంటాడు. శిశుపాలుడి నూరు తప్పులూ అయిపోతాయి. పళ్ళెం ఖాళీ అయిపోతుంది. వెంటనే కృష్ణుడు ఆ పళ్ళేన్ని తీసి చేత్తో పట్టుకొని శిశుపాలుడి మీదికి విసురుతాడు. అది సుదర్శనచక్రంగా మారిపోయి శిశుపాలుని శిరస్సు ఖండిస్తుంది. ఎంతో అద్భుతమైన అందమైన సినిమా సన్నివేశం! ఇంతలో నండూరివారికి ప్రభుత్వ కళాశాలలో తెలుగుహెడ్‌గా ఉద్యోగం వచ్చింది. వెళ్ళిపోయారు. అప్పుడు దిగుమర్తివారు శాఖాధిపతి అయ్యారు. రామకృష్ణమాచార్యులవారిని గురించినకొన్ని ఉపాఖ్యానాలు:

**13.1 చరిత్రపాఠం:-** కృష్ణమాచార్యులవారు విశాఖపట్టణంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో B.A. (Hons) చదువుతున్నప్పుడు Subsidiory South Indian History లో ఆయన ఒక్కరే విద్యార్థి. (తక్కినవారందరూ సంస్కృతం తీసుకున్నారు కాబోలు!) ప్రముఖ చరిత్రకారుడు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు దక్షిణభారతదేశచరిత్ర పాఠం చెప్పేవారు. పెద్దహాలులో బిక్కుబిక్కుమంటూ కృష్ణమాచార్యుల వారు ఒక్కరే విద్యార్థి కూర్చునేవాడు. ఆ హాలుకి కటకటాలు ఉన్నాయి. బయటనుండి అందరూ చూడవచ్చు. మల్లంపల్లివారు వేదికమీద అటూ ఇటూ పచార్లుచేస్తూ క్లాసులో వందమంది

విద్యార్థులు ఉన్నట్లుగా పెద్ద గొంతుకతో అరుస్తూ హిస్టరీ పాఠం చెప్పేవారు. కటకటాలకు బయటనుంచొని ఎందరో విద్యార్థులు ఆశ్చర్యంగా కృష్ణమాచార్యుల వారిని, వారి గురువు శర్మగారిని చూస్తూ ఉండేవారట! ఆచార్యులవారు సిగ్గుతో భయంతో ముడుచుకొని పోయేవారట! (ఈ విషయం కృష్ణమాచార్యులవారే నాతో చెప్పారు)

**13.2 "ఇతోధికాచారి!": –** ఒకసారి కృష్ణమాచారిగారు, పిప్పరలో జమీదారుగా ఉన్న తుమ్మలపల్లి సత్యనారాయణశ్రేష్ఠిగారి యింట్లో జరిగిన ఒక పెండ్లికి వెళ్ళారు. నూతన వధూవరులను ఆశీర్వదిస్తూ "ఇతోధికంగా బిడ్డల్ని కనండి!" అని వారిపై అక్షతలు వేశారు. పండితులందరూ తమలో తాము నవ్వుకున్నారు. "ఇతోధికంగా" అంటే "ఇప్పటికన్న ఎక్కువగా" అని అర్థం. అంటే వధూవరులకు అప్పటికే పిల్లలున్నారనే చెడు అర్థం వస్తుంది. అందువల్ల అప్పటినుండి భీమవరం చుట్టుప్రక్కలనుండే పండితులు రామకృష్ణమాచార్యులవారిని "ఇతోధికాచారి" అని పిలిచేవారు.

**13.3 "కవితాప్రభాస": –** భీమవరం కళాశాల యాజమాన్యం కళాశాల ఆవరణలోనే ఒక ప్రక్కగా ఉపన్యాసకులకు ఇళ్ళస్థలాలు మంజూరు చేశారు. అందులో నండూరివారు, పాలగుమ్మిపద్మరాజుగారు మొదలైన వారు ఇళ్ళు కట్టుకున్నారు. నండూరివారు తమ యింటికి "కవితాప్రభాస" అని పేరుపెట్టు కున్నారు. వీరు కులభేదాలు పాటించకుండా తమయింట్లో అందరికీ భోజనాలు పెట్టేవారు. (వైష్ణవుడు కదా! బ్రహ్మనాయుడి పద్ధతిలో వెళ్ళేవారు!) దిగుమర్తివారిలో ఈ ఔదార్యం ఉండేదికాదు. ఆయన కొంచెం మడికట్టుకొనే ప్రవర్తించేవారు.

**13.4 "కర్ణుణ్ణి పోగొట్టుకున్న కుంతిలా బాధపడుతున్నాను నాయనా!": –** దిగుమర్తివారు నాకు ఇంటర్‌లోను, బి.ఏ.లోను నాలుగేళ్ళు పాఠాలు చెప్పారు. అందువల్ల నన్ను వారు మరచిపోయే అవకాశమే లేదు. నండూరివారు ఇంటర్‌లో నాకు పాఠాలు చెప్పేలేదు. స్పెషల్ తెలుగు బి.ఏ. మూడు నెలలు మాత్రమే పాఠాలు చెప్పారు. అందువల్ల తరువాతికాలంలో ఆయన నన్ను మరచిపోయారు. నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖను స్థాపించి దానికి హెడ్‌గా ఉండి, అనేక ప్రాంతాల్లో సాహిత్యోపన్యాసాలు

చేస్తూ పేరు ప్రతిష్ఠలు గడించిన సంగతి నందూరివారికి తెలియదు. ఒకసారి హొసూరు సాహిత్య సభలో నేను నందూరివారు కలుసుకున్నాం. సభకు మిత్రులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు అధ్యక్షులు. నేనూ నందూరి వక్తలం. ముందుగా పెద్దలు నందూరివారు ప్రసంగించారు. వారు తమ ప్రసంగాన్ని ముగిస్తూ "నేను మాట్లాడిన తరువాత ఇంకెవరు మాట్లాడినా fade out అయిపోతారు!" అని కూర్చున్నారు. అధ్యక్షులు తిరుపతిరావుగారు నందూరివారితో "ఈ మాట మీరు తంగిరాలవారు ప్రసంగించాక చెపితే బాగుండేది!" అన్నారు. నేను మామూలుగానే బాగా prepare అయ్యి చక్కగా ప్రసంగిస్తాను. ఆ రోజు నందూరివారు అలా అనడంతో ఇంకా శ్రద్ధగా, ఇంకా అందంగా ప్రసంగించాను. చివర్లో అధ్యక్షులు "చాశారా! సుబ్బారావుగారు ఎలా మాట్లాడారో?"– "శిష్యాధిచ్ఛేత్ పరాజయం!" అన్నారు. నందూరివారు చాలా ఆశ్చర్యపోయి! "ఎవరు నువ్వు నాయనా?" అని అడిగారు. నేను భీమవరం కళాశాలలో 1955లో మీ శిష్యుణ్ణి! అన్నాను. "ఏం చేస్తున్నావ్?" అన్నారు. "బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖకు హెడ్‌గా ఉన్నాను!" అన్నాను. నందూరివారు బ్రహ్మానంద భరితులైపోయి: "నిన్ను చూచి కర్ణుణ్ణి పోగొట్టుకున్న కుంతిలా బాధపడు తున్నాను నాయనా!" అన్నారు.

**13.5 "చైతన్యకవిత" – నందూరివారి ప్రత్యేక సంచిక:–** నేను 1986 నుండి 2009 వరకు "చైతన్యకవిత" పేరుతో ఒక కవిత్వపత్రిక (షాణ్మాసిక) నడిపాను. దానిని 1996 లో డా॥ నందూరి రామకృష్ణమాచార్యులవారి ప్రత్యేకసంచికగా వెలువరించాను. వారి జీవితము, వారి రచనలు తెలియజేస్తూ, "ఆంధ్రప్రదేశ్ ప్రద్యకవితా సదస్సు"ను ఏర్పాటుచేసి పద్యవిద్యను సంరక్షిస్తున్న వారి కృషిని ప్రశంసిస్తూ ఆ ప్రత్యేక సంచిక బాగా వచ్చింది. (చూ.చైతన్యకవిత, 24, ధాత శరత్తు – అక్టోబరు 1996). పదికాపీలు హైదరాబాదులో ఉన్న నందూరివారికి పంపించాను. వారు ఎంతో సంతోషించి: "నాయనా! నేను చనిపోయాక ఈ ప్రత్యేక సంచికను తెస్తావనుకున్నాను. నేను బ్రతకుండగానే తీసికొనివచ్చావు. ఎంతో

ఆనందిస్తున్నాను. నీకు నా అనంతమైన ఆశీస్సులు!" అని నాకు లేఖవ్రాశారు. ఈ చైతన్యకవిత ప్రత్యేకసంచికను గురుదేవులు దిగుమర్తివారికి అంకిత మిచ్చాను.

నండూరివారి కజిన్ బ్రదర్ ఎన్.వి.ఎల్. నరసింహాచార్యులుగారు (ఆయన ఇంటిపేరూ నండూరివారే) "పాండవోద్యోగ విజయము" నాటకంలో దుర్యోధనుని పాత్ర, ముఖ్యంగా మయసభ సీను బ్రహ్మాండంగా నటించేవారు!

నండూరివారు బెంగుళూరు విశ్వవిద్యాలయానికి వచ్చి మా తెలుగు శాఖను చూస్తానన్నారు: "I want to see the lion in its den!"అన్నారు నాతో. కాని ఎందువల్లనో రాలేకపోయారు. ఇది నాకు జీవితంలో ఒక తీరనికోరికగా మిగిలిపోయింది.

### 14. ఇంటర్‌లో (1952-54) జరిగిన మరికొన్ని ముచ్చట్లు:-

మోచర్ల జానకిరామయ్యగారని ఒక ఇంగ్లీషు లెక్చరర్ ఉండేవారు. శరీరంలో ఒక కాలికి ఒక చేతికి కొంచెం పక్షవాతం వచ్చింది. అలాగే కొంచెం వంకరగా నడుస్తూ క్లాసుకు వచ్చి ఇంగ్లీషు పాఠాలు చాలా బాగా చప్పేవారు ("Gulliver's Traveles" చెప్పారు). వీరు ఎంతో హాస్యంగా మాట్లాడేవారు. మద్రాసులో ఏదో కాలేజీలో కొన్నేళ్ళు పనిచేసి తరవాత భీమవరం కళాశాలకు వచ్చారు.

**14.1 మేనమామ పోలికలు:-** జానకి రామయ్యగారు ఇంగ్లీషుపాఠం నోట్సు చెపుతూ ఉండేవారు. మేము వ్రాసుకుంటూ వ్రాసుకుంటూ ఏదైనా spelling అనుమానం వచ్చే, వ్రాయడం మానివేసి వారి ముఖంవైపు చూసేవాళ్ళం. ఆయన వెంటనే "ఏవో మేనమామ పోలికలు వ్రాసుకోండి! ఇంటికెళ్ళి చూసుకోండి!" అనేవారు.

**14.2 వీరస్వర్గం చూరగొంటాను:-** ఒకడు ఒక కత్తి పుచ్చుకొని శత్రువును "పొడుస్తాను! జాగ్రత్త!" అన్నాడట. వాడు "పొడవరా! పొడవరా! వీరస్వర్గం చూరగొంటానురా!" అన్నాడట. వాడెక్కడ వీరస్వర్గం చూరగొంటాడో అనే అసూయతో వీడు పొడవడం మానేశాడట!

**14.3 "ఉంగళ్ పేర్ ఎన్న?":-** ఒకడు మరొక వ్యక్తిని తమిళభాషలో "నీపేరేమిటి?" - "ఉంగళ్‌పేర్ ఎన్న?" - అని అడిగాడట. ఎదుటి వ్యక్తి వెంటనే "పింగళి సూరన్న!" అన్నాడట.

**14.4 "లాకు తలుపులు తెరుస్తారు!":–** పరీక్షలముందు మోచర్లగారు, విద్యార్థులను బాగా చదువుకోమని, ఫెయిలయితే కొత్త విద్యార్థులతో కలిసి చదువుకో వలసి వస్తుందని, గోదావరి పరిభాషలో హెచ్చరించేవారు. గోదావరినదికి ధవళేశ్వరం దగ్గర కాటన్‌దొర పెద్దఆనకట్ట కట్టించాడు. అక్కడనుండి అనేక కాలువలద్వారా నీరుడెల్టాలోని పంటపొలాలకు అందుతూ ఉంటుంది. ఆ కాలవల్లోని నీటిని క్రమబద్ధం చేయటంకోసం, మధ్యమధ్య కొన్నిఊళ్ళ దగ్గర "లాకులు" (ఇనుముతోను చెక్కతోను చేసిన పెద్ద పెద్ద తలుపులు) ఉంటాయి. వాటిని మూస్తూ, తెరుస్తూ ప్రవహించే నీటిని క్రమబద్ధంచేస్తారు. అలాగే ఆనకట్ట దగ్గర గోదావరినుండి కాలువల్లోకి నీరు ప్రవహించే చోట పెద్ద పెద్ద లాకులు ఉంటాయి. కొత్తగోదావరి నీరువచ్చినప్పుడు ఈ లాకులు తెరుస్తారు. ఎర్రటి బురదనీరువచ్చి, నల్లటి పాతనీటిలో కలుస్తుంది. దీనిని దృష్టిలో పెట్టుకొని జానకిరామయ్యగారు: "లాకు తలుపులు తెరిచేస్తారు. కొత్తనీరు పాతనీరు ఏకమైపోతుంది. జాగ్రత్త!" అనేవారు.

**14.5 "ఏ గయుడూ – పార్థుడూ మిమ్మల్ని రక్షించలేడు!":–** ఇది జానకి రామయ్యగారు మా విద్యార్థులకు చేసే మరో హెచ్చరిక. విద్యార్థులలో ఎక్కువమంది ఇంగ్లీషు, తెలుగు, గ్రూపు అన్నింటిలోను ఎక్కువగా "Guides" మీద ఆధారపడి ఉండేవారు. ఒక్కొక్క క్లాసులో 80 నుండి 100 మంది వరకు విద్యార్థులుండేవారు. ఎవరో కొద్దిమంది లెక్చరర్లు తప్ప, ఎక్కువ భాగం పాఠాలు సరిగా చెప్పేవారు కారు. అందువల్ల గైడ్సే విద్యార్థులకు గతి. ఈ రోజుల్లో "నారాయణ" – "శ్రీచైతన్య" మొదలైన కార్పోరేట్ కళాశాలల్లో ఎంతోబాగా చదువు చెపుతున్నారు. విద్యార్థులు మంచి మంచి Ranks తో Pass అయ్యి, ఇంజనీరింగులోను, మెడిసిన్‌లోను సులభంగా సీట్లు సంపాదిస్తున్నారు. ఈ ఏర్పాట్లు మా రోజుల్లో లేవు. కాని "గైడ్స్ చదవద్దు; టెక్ట్స్‌బుక్స్ చదవండి" అని జానకి రామయ్యగారు హెచ్చరించే వారు. "ఏ గయుడూ–పార్థుడూ మిమ్మల్ని రక్షించడు!" అనే వారు, చిలకమర్తివారి గయోపాఖ్యానం నాటకాన్ని దృష్టిలో పెట్టుకొని. ఆ నాటకంలో శ్రీకృష్ణుడు గయుణ్ణి చంపుతానంటాడు. గయుడు వెళ్ళి పార్థుణ్ణి శరణు వేడతాడు. పార్థుడు అతనికి అభయమిస్తాడు.

**14.6 Please come in! why do you want Invitation?:-** లెక్చరర్ క్లాసులోకి వచ్చాక, విద్యార్థులు క్లాసులోకి అనుమతి లేకుండా రాకూడదు. అందువల్ల ఆలస్యంగా వచ్చిన విద్యార్థి తరగతిహాలు గుమ్మందగ్గర నిరీక్షించేవాడు. అతనిని చూచి మోచర్ల జానకిరామయ్యగారు పైవిధంగా అనేవారు.

**14.7 డాక్టర్ల ప్రిస్క్రిప్షన్:-** డాక్టర్ల Prescripion చీటిలో ఏమి వ్రాశాడో ఒక్క compounder కి మాత్రమే అర్థమవుతుంది. దీనిని గురించి ఛలోక్తి విసురుతూ జానకిరామయ్యగారు ఇలా అనేవారు: "ఒక డాక్టరు పెళ్లానికి ప్రేమలేఖ వ్రాశాడట. అది ఏమిటో ఆమెకు తెలియక కాంపౌండర్ దగ్గరకు వెళ్లి చదివించుకొందట!"

**14.8 వానపాము నిచ్చెన:-** మా బైపిసి. గ్రూపులో మంగపతిరాజు అనే విద్యార్థి ఉండేవాడు. అతడు శుద్ధమొద్దు; సరిగా చదివేవాడు కాదు. ఒక రోజున ప్రాక్టికల్ క్లాసులో జూఆలజీ లెక్చరర్ గారు 'వానపాము' (Earth worm) బొమ్మ గీసుకొని రమ్మన్నారు. మంగపతిరాజు రెండు నిలువుగీతలు పొడుగ్గా గీసి, వాటిని అడ్డంగా చిన్న చిన్న గీతలతో కలిపి బొమ్మవేసి లెక్చరర్‌కి చూపించాడు. ఆయన కోపంగా 'ఇదేమిటి? Earth worm బొమ్మ వెయ్యమంటే నిచ్చెన బొమ్మ వేసుకొచ్చావ్?'' అని అరిచారు. క్లాసంతా గొల్లున నవ్వారు. తరువాత రోజుల్లో ఈ సంగతి పదే పదే చెప్పి, నా Room mate మరకాని హరిహరరావు కడుపు చెక్కలయ్యేలా నవ్వేవాడు!

**3.3 నేను ఉద్యోగంలో చేరిన కొత్తలో (1969-1972):-**

**(1) ఉద్యోగ ప్రవేశం:-** నేను 1969 డిసెంబరు 27వ తేదీ శనివారంనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయం - సెంట్రల్ కాలేజీలో కన్నడ డిపార్టుమెంటులో తెలుగు లెక్చరర్‌గా చేరాను. ఒకరోజు ఉదయంపూట సెంట్రల్‌కాలేజీకి ప్రక్కనే ఉన్న మైసూర్ బ్యాంక్ సర్కిల్‌లో ఒక ట్రాఫిక్ పోలీసు నిలబడి డ్యూటీ చేస్తున్నాడు. అతడు చక్కగా నుదుటిమీద విభూతి పెట్టుకున్నాడు. నేను ఆశ్చర్యపోయాను. మన ఆంధ్రప్రదేశ్‌లో పోలీసులు బొట్టుపెట్టుకోవడంకాని, విభూతి పెట్టుకోవడంకాని నేనెప్పుడూ చూడలేదు. తరవాత నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా చేరిన విషయం గురుదేవులకు లేఖవ్రాస్తూ: "ఇక్కడ ట్రాఫిక్ పోలీసు

నుదుటిమీది విభూతిరేఖల్లో కూడా బసవేశ్వరుని వీరశైవమతప్రభావం ఎంత బలంగా ఉందో చూడవచ్చు" అన్నాను. (ఈ చమత్కార ధోరణి నాకు గురుదేవుల నుండి సంక్రమించినదే!) భీమవరం కళాశాలలో తన శిష్యుడనైన నేను, ఒక విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడనైనందులకు దిగుమర్తివారు ఎంతగానో సంతోషించారు.

**(2) ఆచార్యదేవో భవ! :–** ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు 1972 జనవరి 10వ తేదీన హైదరాబాదులో స్వర్గస్థులయ్యారు. దిగుమర్తి సీతారామస్వామిగారికి తమ గురుదేవులు పింగళివారంటే ఎంతో భక్తి, అభిమానం. తమగురుదేవులు అస్తమించారన్న బెంగతో కాబోలు నాలుగు రోజులు గడవగానే దిసీరాకూడా జనవరి 14వ తేదీ సంక్రాంతినాడు పరమపదించారు. అప్పటికింకా రెండేళ్ళ సర్వీసు ఉంది. వరుసగా సంభవించిన ఈ రెండు మరణాలూ నన్ను మిక్కిలిగా బాధించాయి. నాకు తెలుగుసాహిత్యంలో మిక్కిలి అభిరుచిని పుట్టించి నాలో Poetic Sensibility ని నిలువెల్లా ప్రవహింపజేసిన గురుదేవులకు నా సహస్ర ప్రణామాంజలి!

**భరతవాక్యం:–**

**(1) ఎప్పుడో జరిగిన విషయాలు ఇప్పుడెలా జ్ఞాపకం వచ్చాయి?:–**

మా గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారిని గురించిన పై జ్ఞాపకాలు నిన్నటివి మొన్నటివి కావు. ఇప్పటికి 50 ఏళ్ళనుండి 70 ఏళ్ళకు పూర్వం జరిగినవి. 1952–1972 మధ్య 20 ఏళ్ళల్లో జరిగిన సంఘటనలు. నాకు 17వ సంవత్సరం నుండి 37వ సంవత్సరం వరకూ జరిగిన సంగతులు. ఇప్పుడు నాకు 87 ఏళ్ళు. ఇంత వయస్సులో 70ఏళ్ళ క్రిందటి విషయాలు ఎలా జ్ఞాపకం ఉన్నాయి? ఇది నాకే ఆశ్చర్యం కలిగించిన విషయం! ఇది కేవలం దైవకృప తప్ప వేరొకటికాదు. నాకు గురుదేవుల ఎడ గాఢమైన భక్తి కూడా కొంత కారణం కావచ్చును. ఏదో తెలియని దైవశక్తిచేత సుమారు 70 సంవత్సరాల క్రితం జరిగిన జ్ఞాపకశకలాలు మీ ముందు ఉంచగలిగాను. ధన్యుణ్ణి!

(25–06–2022 శనివారం రాత్రి 11 గంటలకు నిద్రకు ఉపక్రమిస్తూంటే గురుదేవులను గురించి రెండు points జ్ఞాపకం వచ్చాయి. వెంటనే లేచి నోటు బుక్కులో వ్రాసుకోవలసింది; బద్ధకించాను. మర్నాటు వ్రాసుకోవచ్చులే!

అనుకున్నాను. తెల్లవారి వ్రాసుకోబోతే "రాంపండు" అనే point ఒక్కటే జ్ఞాపకం వచ్చింది. రెండవ point ఎంత గింజుకున్నా జ్ఞప్తికి రాలేదు!).

**(2) ఒక ఆత్మవిచారం - ఒక ఆత్మసంతృప్తి:-**

నా ప్రియశిష్యులు నాకు అత్యంత భక్తి శ్రద్ధలతో చేసిన ఘనసన్మానాలు రెండు: 29-08-2010నాడు మొదటి సన్మానం; 10-06-2022 నాడు రెండవ సన్మానం. నేను ఎంతో సంతోషించాను. కాని యిటువంటి ఘనసన్మానాలు నా గురుత్రయం: దిగుమర్తి-పింగళి-తిమ్మావజ్ఝుల గారలకు ఒక్కటికూడా చేయలేకపోయానే! -అనే బాధ నన్ను అప్పుడప్పుడు బాధిస్తూ ఉంటుంది. ఇది నా ఆత్మ విచారం!

కాని, నా శిష్యులు నాకు ఎందుకు సన్మానం చేశారు? వారికి నేను మంచి సాహిత్యాభిరుచిని కలిగించాను కాబట్టి. ఈ శక్తి నాకు ఎలా వచ్చింది? నా గురుత్రయం (దిగుమర్తి-పింగళి-తిమ్మావజ్ఝుల)వారి శిష్య వాత్సల్యంతో కూడిన కరుణాకటాక్షవీక్షణాలతో కూడిన అనంతమైన ఆశీస్సులవల్ల! అందువల్ల నా శిష్యులు నాకు చేసిన ఘనసన్మానాలు రెండూ అసంకల్పితంగా (automatic గా) మా గరుత్రయానికి కూడా చెందుతాయి. ఇది నా ఆత్మసంతృప్తి!!

సర్వేజనాః సుఖినో భవంతు!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!!



**శా॥ శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్, లోకర**
**క్షైకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో**
**ద్రేకస్తంభకుఁ, గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా**
**నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనాడింభకున్!**

(-పోతన భాగవతము)




దిగుమర్తివారి కవితాసూక్తులు

(ప్రకాశకులు: తంగిరాల, 1992)

# 4. గురుదేవుల సూక్తివైచిత్రి

**(దిగుమర్తివారి 'హిమాని' కావ్యసమీక్ష)**

కీ.శే. దిగుమర్తి వేంకటసీతారామస్వామి మా గురుదేవులు. వీరివల్లనే నాకు తెలుగు సాహిత్యంలో అభిరుచి ఏర్పడింది. ఈనాడు నేనొక విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసరుగా ఉండి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించానంటే, దానికి కారణం ఈ గురుదేవుల చల్లని ఆశీస్సులే!

గురుదేవులు సీతారామస్వామిగారు క్రీ.శ. 1914 మే 13వ తేదీని, నేటి విజయనగరం జిల్లాలోని బొబ్బిలిలో జన్మించారు. వీరి తల్లిదండ్రులు అచ్చమ్మగారు, రఘునాథరావుగారు. వీరి విద్యాభ్యాసం విశాఖపట్టణం, ఛత్రపురం, బందరు, ఏలూరు, గుంటూరు, యలమంచిలి మొదలైన ప్రదేశాల్లో జరిగింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సర్.కట్టమంచి రామలింగారెడ్డిగారు వైస్-ఛాన్సలర్గా ఉన్నప్పుడు, సీతారామస్వామిగారు బి.ఏ. (ఆనర్సు) తెలుగు చదివి, 1946 ఏప్రిల్లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. వీరు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారికి మిక్కిలి ప్రియమైన శిష్యులు. ఆనర్సు విద్యార్థిగా ఉన్నప్పుడే, వీరు తెలుగుతో పాటు సంస్కృత ప్రాకృత భాషల్లో కూడా పాండిత్యాన్ని గడించి, పెదకోమటి వేమారెడ్డిగారి సప్తశతీసారాన్ని ఆంధ్రీకరించారు.

సీతారామస్వామిగారు, పశ్చిమ గోదావరిజిల్లా భీమవరంలోని W. G. B. కళాశాల (ఇప్పటి D.N.R. కళాశాల)లో 1947 జూలై నెలలో ప్రవేశించారు. అక్కడ ఆంధ్రోపన్యాసకులుగానూ, ఆంధ్రశాఖాధ్యక్షులుగానూ పాతిక సంవత్సరాల పాటు పనిచేశారు. అనేక విద్యార్థి కిశోరాల హృదయాలలో సాహిత్య చైతన్యజ్యోతులు వెలిగించారు; వారి భవిష్యజ్జీవితానికి పూలబాటలు వేశారు. శ్రీయుతులు కొర్లపాటి శ్రీరామమూర్తి, పురాణపండ సూర్యప్రకాశదీక్షితులు, (ఉషశ్రీ), శనగన నరసింహస్వామి, తమ్మన వెంకటేశ్వరరావు, తంగిరాల వెంకట సుబ్బారావు, లకంసాని చక్రధరరావు, నందుల గోపాలకృష్ణ, పల్లికొండ ఆపదరావు మొదలైన సాహిత్యవేత్తలందరూ దిగుమర్తి సీతారామస్వామిగారు తీర్చిదిద్దిన శిష్యకోటిలోనివారే. ఇటువంటి దేశికోత్తములు ఉద్యోగవిరమణ చేయడానికి

పూర్వమే 1972 జనవరి 14వ తేది సంక్రాంతి పర్వదినాన తమ ప్రియాంతే వాసుల్ని దుఃఖసాగరంలో ముంచి పరమపదించారు.

దిగుమర్తి సీతారామస్వామిగారు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి మెప్పును పొందిన గొప్ప కవీశ్వరులు; పింగళివారి ప్రశంసలందుకొనిన సునిశిత విమర్శకులు "ఈయన చక్క ని పండితుడు. పాండిత్యము లోతైనది. అంతకంటే లోతైనది యీయన భావుకత. ఈయన వట్టి సాహిత్యవేత్తయే కాదు, సంగీత రహస్యవేత్త కూడ... ఇంత ఆంధ్రసారస్వతములో నన్నయగారికి తెలిసినంత వారి వాగ్దేవతయందు ప్రసన్నతను దాల్చిన శ్రుతిరహస్యజ్ఞాన మెవ్వరికిని లేదు. అది తెలిసిన కొద్దిమందిలో.. సీతారామస్వామిగాకొకరు. ఆయన భావుకత్వము ప్రథమశ్రేణికిఁ జెందినదనుట కిది యొక్కటి చాలును" అని విశ్వనాథవారి మెచ్చుకోలు ('స్వామిపుష్కరిణి' పీఠిక 1974).

సీతారామస్వామిగారు రచించిన కావ్యాల్లో 'సప్తశతీసారము' (1951), 'ఋతుసంహారము' (1956), 'సుహృల్లేఖ' (1968), 'స్వామి పుష్కరిణి' (1974) ప్రకటింపబడ్డాయి. వీరి సాహిత్య సంపుటిని 'అనర్ఘమణులు' అనే పేరుతో, అన్నగారు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు 1991లో ప్రకటించారు. వారి ఆజ్ఞతో నేనిప్పుడు 'హిమాని' అనే గురుదేవుల కవితాసూక్తుల్ని పుస్తకరూపంలో వెలువరిస్తున్నాను (1992).

దిగుమర్తి సీతారామస్వామిగారు తమ కవితాసూక్తులకు 'హిమాని' అని పేరు పెట్టారు. 'హిమాని' అంటే 'హిమసమూహం' అని అర్థం. ('మహద్ధిమం హిమానీ'). కాని ఇక్కడ ఈ శబ్దానికి 'మంచుబిందువులు' అని అర్థం చెప్పుకోవాలి. ఈ చిన్న చిన్న కవితా సూక్తులు హేమంతంలోని హిమబిందువులవలె అతి మనోహరంగా ఉంటాయని గురుదేవుల ధ్వని. (ఇలా ధ్వనింపజేస్తూ అనేక సూక్తులు అల్లారు. (16, 114, 159, 164, 308, 339). వీటి రచన కూడా హేమంత ఋతువులోనే జరగడం గమనార్హం. అగ్రజులు కొర్లపాటివారు వీటి ఆవిర్భావాన్ని గూర్చి ఇలా తెలియజేశారు:–

"భావసంవత్సర హేమంతర్తువునందు దిగుమర్తి సీతారామస్వామిగారు రచించిన 'హిమాని' అను గ్రంథము 360 మినీ కవితల సంహిత. ఇట్టి 'కావ్యము 1934–35 లోనే రచింపబడుట ఒక విశేషము. ఇంతవరకు ముద్రితము కాక

పోవుట ఇతోధిక విశేషము. పదవీవిరమణ చేయకుండనే శరీరవిరమణ చేసిన గురుమిత్రులు సీతారామస్వామిగారి కుటుంబసభ్యులనుండి సేకరించి, ఇప్పటికైనను ప్రచురింపగలుగు చున్నాము" ("చైతన్యకవిత-2, అక్షయశరత్తు 1986).

ఈ కవితాసంపుటిలో 360 సూక్తులున్నాయి. నెలకి 30 రోజుల చొప్పున సంవత్సరానికి 360 రోజులు అవుతాయని స్థూలంగా చెప్పుకోవచ్చు. కాలగమనాన్ని ధ్వనింపజేయడం కోసం గురుదేవులు ఈసంఖ్యను పూరించారని భావించవచ్చు. (360 సూక్తులు వ్రాసిన కవికి మరో ఐదు సూక్తులు వ్రాయడం కష్టం కాదు). ఇది 'పఠాభి' 'పన్ చాంగాన్ని' స్మృతికి తెస్తోంది. కాని పఠాభిది కేవలం చమత్కారానికి మాత్రమే పరిమితమైన రచన. ఇది సౌందర్య దృష్టితో, రసధ్వనితో సృష్టింపబడిన అపూర్వ రచన. ఉదయ సూర్యకిరణాలుపడి తళతళ మెరిసే హిమబిందు రత్నాలవంటి ఉత్తమ కవితారచన. (పైగా పఠాభి రచన దీనికన్న అర్వాచీనమైనది).

ప్రకృతి పరమేశ్వరుని స్వరూపం. ప్రకృతిని వర్ణిస్తే పరమేశ్వరుని స్తుతించినట్లే! దిగుమర్తివారు ప్రకృతి సౌందర్యానికి పరవశులై దానిని తమ ఉత్తమ భావుకత్వంతో వర్ణిస్తూ, ఆ భగవత్స్వరూపమైన ప్రకృతి వర్ణనలోనే మానవనైజాన్ని, లోకరీతిని ధ్వనింపజేశారు; మన సమాజంలోని లోపాల్ని వేలెత్తి చూపించారు; సత్పురుషులు ఔన్నత్యాన్ని ప్రశంసించారు; నీచుల నైచ్యాన్ని తూర్పారబట్టారు; జీవితంతో ముడిపడివున్న తాత్వికతను ఆవిష్కరించారు.

ఈ కవితాసూక్తులన్నీ ఎక్కువగా కవి తానుగా మనకు చెప్పినవే. కాని కొన్ని కొన్ని చోట్ల సంభాషణా శిల్పాల్ని ఆశ్రయించారు గురుదేవులు. రెండు పాత్రలు సంభాషించినట్లుగా ఉంటుంది: (ఒక పాత్రయొక్క స్వగతాలుగా కూడా కొన్ని సూక్తులు లేకపోలేదు).

నెమలి : కోకిలా! నీ గానమునకు నృత్యము లోటు

కోకిల : నీ నృత్యమునకు గానము లోటు (21)

ఈ పాత్రలు మానవులు కావచ్చు; పక్షులు కావచ్చు; తొడిమె - రేకులు వంటి పుష్పభాగములు కావచ్చు; సముద్రము-ఆ కాశము వంటి పంచభూతములు కూడా కావచ్చు. ఏ విధంగా చెప్పినా, ప్రతిసూక్తిలోనూ, ఏదో ఒక ధ్వని ఇమిడి వుంటుంది; అది మానవుల స్వార్థబుద్ధిని వెక్కిరిస్తూ ఉంటుంది. ఈ సంభాషణా

శిల్పంలో అంతర్భాగంగా కాని, విడిగా కాని ఒక్కొక్కప్పుడు ప్రశ్నశిల్పం కూడా ఉంటుంది. ఒకే ప్రశ్న; ఒక ప్రశ్న – ఒక జవాబు; ప్రశ్నకు మరల ప్రశ్న; అనేక ప్రశ్నలు–ఒక జవాబు ఇత్యాదిగా ఈ ప్రశ్నశిల్పం కొనసాగుతుంది.

ఈ కవితాసూక్తులన్నీ "అల్పాక్షరముల అనల్పార్థరచన" కావించిన కవి వివేకానికి ప్రత్యక్ష, సాక్ష్యాలుగా ఉన్నాయి. ఈ సంపుటిలో ఒకటి రెండు పాదాలలో పూర్తి అయిపోయే సూక్తులే ఎక్కువ. మూడుపాదాలు దాటిన సూక్తుల్ని వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు.

**I. అల్పాక్షరాలలో అనల్పార్థరచన:–**

**1) ధ్వని:–** ఒకే ఒక చిన్న వాక్యంలో ఎంతో ధ్వనిని దట్టిస్తారు దిగుమర్తి వారు:

"పచ్చని పైరునకే దిష్టిబొమ్మ యవసరము" (27)
"ముళ్లున్నను గులాబీని జనులాశ్రయింతురు" (28)
" వేగిన పిదప వేగుచుక్కకు గౌరవము లేదు". (44)
"గరళము క్షీరమిశ్రితమైనను గరళమే" (49)
"దీపము క్రిందనే చీకటి యున్నది" (54)
"తేనెపట్టంతయు తేనెతో నిండియుండదు" (86)
"చవిటి నేలను చీపుర్లు ముక్కలు శ్లాఘించును" (184)
"అద్దము పగులగొట్టినను ఆకృతి బాగుపడదు' (313)
"వరివెన్ను జీవితమున వట్టి పొల్లు కూడ నిండియున్నది" (324)
"విఖ్యాత రత్నము విషరసపూరితము" (346)

**2) అల్పుడు–ఉత్తముడు:–** ఒక అల్పుడు లెక్క చేయనంతమాత్రాన ఉత్తముడు తన కర్తవ్యాన్ని నెరవేర్చడం మానడు – అనే సత్యాన్ని గురుదేవులు తమ సూక్తులలో వెల్లడించారు:

"పడియలు ఉప్పొంగనంతమాత్రమున
చంద్రకాంతి వ్యర్థము కాదు" (123)
"వృక్షము లానందింపని మాత్రమున
పికము పాడుట మానదు" (152)

కప్పలు బెక బెకలాడిన మాత్రమున

కంధరము వర్షింపకమానదు". (కందరము = మేఘము) (264)

**3) కాకి–కోకిల ప్రతీకలు:–** భగవత్స్వరూపమైన ప్రకృతిలోని సౌందర్యము సహజమనీ, దాని నెవ్వరూ నిరోధించలేరనీ చెప్తుతూ, పై రీతిగా నీచపాత్రలనుగాక ఉత్తమపాత్రనే ప్రతీకగా గ్రహిస్తారు దిగుమర్తి వారు. చాలా సూక్తులలో మంచి విషయాలను చెప్పటానికి ఉపయోగించిన కోకిల ప్రతీకను ఇక్కడ వ్యతిరేకభావంలో వాడుకోవడం గమనించతగ్గది : (ఇది ఒకే ప్రశ్నతో కూడిన సూక్తి.)

"కోపించి కోయిల కూయుట మానిన

వసంత వైభవము వట్టిపోవునా?" (262)

కాకి–కోకిల ప్రతీకలు తీసికొని, ఒకే విషయాన్ని రెండు రకాలుగా చెపుతారు: 'అల్పుడి ప్రవర్తనకీ – ఉన్నతుడి ప్రవర్తనకీ తేడా ఉంటుంది. సుమా' అనేది ఇక్కడి ధ్వని:

"కోకిల బుద్ధి తీయమామిడివైపు

కాకి మనసు జెముడుపండు దిక్కు" (41)

"కోకిలమునకు గౌరవ మెందులకు?

కాకివలె ఇంటిచుట్టును తిరుగదు కనుక" (43)

(ఇది ఒక ప్రశ్న – ఒక జవాబుతో కూడిన సూక్తి. దీని వివరణమే 163వ సూక్తి).

"కాకి యింటి చుట్టును తిరిగి పరిచయురాలైన

కోకిల తన పాట తియ్యదనముచేత పరిచయురాలౌను"

ఇలా ఉన్నతుడికి ప్రతీకగా వాడిన కోకిలను కూడా సమయం వస్తే పరిహసించడానికి వెనుకాడరు సీతారామస్వామిగారు. మంచిగుణాలు పోగొట్టు కున్నాక ఉన్నతుడికీ అల్పుడికీ తేడా ఉండదని చెపుతూ కోకిలప్రతీకనే ఉపయోగించారు.

"కూజితము మరచిన పిదప కోకిలకును కాకికిని విభేదమేమి?"

(ఇది ఒకే ప్రశ్నతో కూడినసూక్తి) మరొకచోట శ్రమైకజీవన సౌందర్యాన్ని ప్రశంసించేటప్పుడు కాకిని పొగడటానికీ, కోకిలను తిట్టడానికీ కూడా దిగుమర్తి వారు సందేహించ లేదు.

కాకి జీవితౌన్నత్యము కష్టపడువానికి తెలియును

కోకిల ఘనత కూర్చుండి కూనిరాగము తీయువాని కవగతమగును (298)

**4) ఒకే సూక్తిని మార్చి రెండు రకాలుగా చెప్పడం:-** ఒక సూక్తి, సందర్భానుసారంగా మరోచోట భంగ్యంతరంగా చెప్పబడుతుంది:

"రాత్రి, నక్షత్ర మాలికలను ధరించితి" నని

ప్రభాతాకాశము పలికినప్పుడు

మంచుబిందువుల నేపమున

పచ్చిక బయళ్ళు పరిహసించినవి! (159)

ధనికుడు విలువైన వస్తువులనుపయోగిస్తూ గర్విస్తే, పేదవాడు తనకున్న వస్తువులతోనే ఆనందాన్ని అనుభవిస్తాడు అన్నది ఇక్కడ ధ్వని. ఇదే విషయాన్ని ఇంకొంచెం మార్పుచేసి ఇలా అంటారు. ది.సీ.రా.

"చంద్రుడు నిర్లక్ష్యముతో హిమబిందువును విరజల్లెను

శాద్వలములు వానిని భ క్తితో ధరించెను" (808)

ధనికులు నిర్లక్ష్యంగా చూచే వస్తువులే పేదలకు మిక్కిలి ఆదరణీయాలవుతాయి అనేది ఇక్కడి ధ్వని.

**5) ఒక విషయాన్ని రెండు సార్లు రెండురకాలుగా చెప్పడం:-** ఇలాగే ఒక విషయాన్ని రెండుసార్లు రెండురకాలుగా చెప్పడం వల్ల సారూప్యం ఉన్న కవితాసూక్తులు కూడా మనకంట పడతాయి.

"మేఘము తృష్ణలేని నది నీరిచ్చుచున్నది

ఎడారి దప్పిక నది గమనించుట లేదు". (107)

మేఘం-నది-ఎడారి ప్రతీకలకు బదులుగా, నదులు-సముద్రం-ఎడారి-ప్రతీకలు గ్రహించి ఇదే విషయాన్ని ఇంకోచోట ఇలా చెప్పారు :

"జలములుగల కడలికే నదులు జలములిచ్చును

జలహీనమైన ఎడారికి కాదు" (128)

**6) రెండుచోట్ల ప్రతీకలు - రెండు విరుద్ధవిషయాల ధ్వని:-** ఒక్కొక్కప్పుడు ఒకే ప్రతీకను రెండు సందర్భాలలో ప్రయోగించి, రెండు విరుద్ధవిషయాలను ధ్వనింపజేయడం కూడా ఉంది. 'నది' ప్రతీకను తీసికొని, నది తన రహస్యాలను

చెపుతుంది అని ఒక చోట, నది తన గుట్టును చెప్పదు – అని మరోచోట అంటారు ది.సీ.రా.గారు.

"నదిలో సుడిగుండము లున్నట్లు నదీజలమే తెలుపును" (74)

"ఉత్తముడు తనలోని లోపాలను అంగీకరిస్తాడు" – అనేది ఇక్కడ ధ్వని. దీనికి వ్యతిరేకంగా మరొకచోట 'ఉత్తముడు తన కుటుంబములోని లోపాలను కప్పిపుచ్చుకొని, కుటుంబ గౌరవాన్ని కాపాడుతాడు'– అనే విషయాన్ని ఇలా ధ్వనింపజేస్తారు:–

"నదీ గర్భములోని నిమ్నోన్నతములను
నదీ జలములు, పైకి కాన రానీయక
సమముగ జేయును' (170)

ఇలా ఈ 'హిమాని'లో అన్నీ ప్రతీకలే; అన్నీ ధ్వనులే, అన్నీ శబ్దచిత్రాలే. అందువల్లనే గురుదేవుల కలం హేమంతఋతువులో వెదచల్లిన ఈ మంచు ముత్యాలు అతిమనోహరంగా ఉన్నాయి!

**II. విలువైనవి–విలువలేనివి:–**

ప్రకృతిలోని విలువైన వస్తువును, విలువలేని వస్తువును రెండింటిని స్వీకరించి, ది.సీ.రా.గారు కొన్నిచోట్ల విలువలేని వస్తువును సమర్థిస్తారు; మరికొన్ని చోట్ల విలువైన వస్తువునే సమర్థిస్తారు. విలువలేని వస్తువును సౌందర్యదృష్టితో సమర్థించడం:

"గానుగ చెట్టునకుండు శోభ
గందపు చెట్టునకుండదు" (4)

విలువైన వస్తువునే సమర్థించడం:

"ఉన్నత సౌధ గవాక్షమునకు తోచు ప్రకృతి విపులత
కుటజమునకు తోపదు" (361)

ఇక్కడ 'కుటజము' అంటే 'గుడిసె' అని అర్థం. (ఇంకోచోట 'చెట్టు' అనడానికి 'కుటజము' అని వాడారు) ఈ కవితా సూక్తులన్నీ గ్రాంథిక భాషలో వ్రాయడం, ఈ వ్రాతలో కావ్యభాషనూ కవిసమయాలనూ గ్రహించడం, పదకోశాన్ని ఆశ్రయించవలసిన పదాలను ప్రయోగాగించడం గురుదేవుల ప్రౌఢకవితా

ప్రియత్వాన్ని చాటిచెపుతాయి. (సాఫీగా ప్రయాణం చేయడానికి అలవాటుపడిన ఆధునిక పాఠకులను ఈ 'ఎదురుగొప్పుల' నుండి రక్షించడానికి కఠిన పదాలకు అర్థాలు పాదసూచికలలో ఇచ్చాను.)

**III. అర్థాంతరన్యాసాలంకారం:**

ఈ కావ్యంలో ఇంచుమించు అన్ని సూక్తులూ ధ్వనిగర్భితంగా ఉన్నా, గొన్ని చోట్ల ది.సీ.రా. విశేషాన్ని సామాన్యంతోనూ, సామాన్యాన్ని విశేషంతోనూ సమర్థించి చెప్పే అర్థాంతరన్యాసాలంకారాలను సృష్టించారు. (ఈ సూక్తులతో నాలుగింట ఒక వంతు. అర్థాంతరన్యాసాలున్నాయి.)

"జనోపయోగకరమైన ద్రాక్షతీగ నిష్కంటకము;
నిరుపయోగమైన గచ్చపొద సకంటకము
సాధువుకున్న అసాధువు క్రూరవర్తనుడు కదా!" (17)

ఇక్కడ విశేషాన్ని సామాన్యంతో సమర్థించారు. ఎక్కు వ సూక్తులు ఇలాగే సాగాయి. (32, 35, 36, 46, 48, 71, 74ఎ, 78, 80, 81, 84, 85, 214 మొదలైనవి) సామాన్యాన్ని విశేషంతో సమర్థించడం మిక్కిలి తక్కువ. (ఇటువంటి ఉదాహరణం నాకంట పడలేదు.) ఉపమాలంకారంతో చెప్పడం (162, 191, 196, 207, 209, 244, 288) బింబ ప్రతిబింబంగా చెప్పడం (125, 291) కూడా గమనించవచ్చు. కాని వీటి సంఖ్య తక్కువ.

**IV. రుచిరార్థసూక్తులు:–**

నన్నయలాగే సుమతి శతక కారుడు, వేమన "నానారుచిరార్థ సూక్తి నిధులు". వీరి ప్రభావం కొంత ఈ హిమబిందు సృష్టిసమయంలో ది.సీ.రా.గారిమీద పడిందని చెప్పడం సాహసం కాదు.

"కల్లునకు కంపు ఎక్కువ
తేనెకు వాసన ఉండదు" (29)

– అనే సూక్తి వినగానే "అల్పుడెపుడు పల్కు నాడంబరము గాను, సజ్జనుండు పల్కు చల్లగాను" అనే వేమనసూక్తి స్మరణకు రావడం యాదృచ్ఛికం కాదు.

**V. సూక్తులలో సామెతల ధ్వని:–**

ఈ కావ్యంలోని కొన్ని కవితాసూక్తులు ప్రసిద్ధమైన సామెతలను జ్ఞప్తికితెస్తాయి:

"ఫలపుష్ప హీనములగు కుటజములయందు
పత్రములకే అగ్రస్థానము" (112)

అని అన్నప్పుడు "ఏమిలేనిచోట ఆముదం వృక్షమే మహావృక్షం" అనే సామెత తళుక్కుమంటుంది.

ముల్లు వచ్చి అరిటాకుమీద పడినా, అరిటాకు వచ్చి ముల్లు మీద పడినా అరిటాకు కే ఇష్టం' అనే సామెత; ' పేదవాని కోపం పెదవికి చేటు' అనే సామెతే ఈ క్రింది సూక్తిలో ప్రతిబింబిస్తాయి.

"ఒడ్డు సముద్రములోనికి పోయినను
సముద్రము ఒడ్డుపైకి వచ్చినను
ఒడ్డుకే నష్టము;
బీదవాడు గొప్పవానిపై దండెత్తినను
గొప్పవాడు బీదవానిపై దండెత్తినను
బీదవానికే నష్టము" (269)

"అన్నీ ఉన్న ఆకు అణిగే ఉంటుంది; ఏమీలేని ఆకే ఎగిరెగిరిపడుతుంది". అనే సామెత ఈ క్రింది సూక్తిలో సూచితమవుతోంది;

"అనంతకోటి తారకారత్నములు గలిగిన ఆకసము
అతి ప్రశాంతముగనే కన్పట్టును;
గులకరాళ్ళు కలిగిన సెలయేరు గలగల ధ్వనించును"(188)

**VI. ధ్వని - భావుకత:-**

ఏది ఏమైనా 'హిమాని'లో చాలా గొప్పకవిత్వం ఉన్నదన్న విషయం మాత్రం నిర్వివాదాంశం.

**1) ధ్వని:-** 'స్వార్థం కన్నా త్యాగం గొప్పది' అనే విషయాన్ని ధ్వనింపజేస్తూ స్వామిగారు అందమైన సూక్తులు చెప్పారు :

"తురాయి రాజుమూర్ధమును
చిరకాలము తానే యధిష్ఠించును;
పుష్పమో, ఆటుకాక తన స్థానమును
తన వంశీయులకొరకు విడిచిపెట్టి పోవును" (106)

"ఆకాశము ప్రత్యూషమునకు
అన్ని తారళా రత్నములను దానము చేసియు
మౌనమే వహించును" (157)

**2) భావుకత:–** కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు మెచ్చుకొనిన గురుదేవుల అద్భుత భావుకతకు ఈ క్రింది ఒక్క ఉదాహరణం చాలు:

"భావములు నడచిపోవగా నేర్పడిన
పదచిహ్నములే అక్షరములు" (103)

**3) సూక్తులు:–** అందమైన ఊహలతో కూడిన కవితాసూక్తులు ఈ కావ్యంలో కోకొల్లలుగా లభిస్తాయి:

"శరదిందు హాసమే ఘనీభవించి
హేమంత వసుంధరాంకమున హిమానియైనది" (164)

"సముద్రమజస్ర మెందులకు ఘోషించును?
తన ప్రియుడుగు చంద్రుడు తనకు సుదూరమున నుండుటచే". (187)
(అజస్రము = ఎల్లప్పుడును)

"శంఖమున కట్టి ఘోష నెవరు నేర్పిరి?
తండ్రియగు సముద్రుదే !" (195)

"అలలు విరుగుటకు వీలులేని అబ్ధిగర్భము
అల్లకల్లోలముగా నుండును
భావములు వెలిబుచ్చలేని మూగహృదయము
బాధ పడదా?" (215)

"చెలియలికట్ట వినక మూకీభావము వహించినను
జలనిధి తన విషాదజీవిత రహస్యములను
ఏకరువు పెట్టక మానదు" (232)

"విరహిణీ ! నీవు చంద్రు నుపాలంభింప నవసరము లేదు
నీ వియోగాగ్ని శిఖలచే
అతని వక్షమీవరకే కమిలి నల్లనైనది" (260)

"పికమా ! నీ పాటల వలన నాకు కలిగిన సుఖము
నీవు చిగురులు తినుటచేత కలిగిన గాయముల బాధను
అంతగ అధః కరించినది" అని తియ్యమామిడి
కలకంఠముతో పలికెను. (293)

**VII. సౌందర్యదృష్టి:-**

కృష్ణశాస్త్రి అంటే మా గురుదేవులకు చాలా ఇష్టం. "కృష్ణశాస్త్రి శరీరంలో ఎక్కడ పొడిచినా రక్తం కారదు; కవిత్వం కారుతుంది" అని ది.సీ.రా.గారి మెచ్చుకోలు! అందువల్ల కృష్ణశాస్త్రిలో ఉండే సౌందర్యదృష్టి గురుదేవుల సూక్తులలో అడుగడుగునా కానరావడంలో ఆశ్చర్యం లేదు:

"వేకువ తనయందు నింపిన హిమకణములు
తనకు నక్షత్రము లంపిన కానుకలని
గడ్డిపూవు గర్వించును" (114)
మొదలైన సూక్తులెన్నో ఉన్నాయి.

**VIII. విజ్ఞానశాస్త్ర సత్యాలు:-**

ది.సీ.రా.గారు కేవలం ఊహల్లోనే విహరించకుండా విజ్ఞానశాస్త్రసత్యాల (Scientific Truths)ను కూడా తమ కవితల్లో పొదిగారు.

"రాత్రివేళ మార్యుడు కాన్పింప నప్పటికిని
సూర్యుడుండుట చేతనే చంద్రునకు
ప్రకాశము కలుగుచున్నది. (173)

**IX. సామాజికస్పృహ:-**

నిజమైన కవిత్వం భావకవిత్వంలోనే సాక్షాత్కరిస్తుంది. అంతమాత్రం చేత మా గురుదేవులు కేవలం సౌందర్యారాధకులే అనీ, పలాయనవాది అనీ అనడానికి వీల్లేదు. ఈయన తన ప్రకృతివర్ణనలో ప్రత్యక్షరంలోనూ మానవసమాజాన్ని ధ్వనింపచేస్తున్నారు. సామాజిక స్పృహతోనే ప్రతిసూక్తినీ సృష్టించారు.

(1) ఈ దోపిడీ సమాజాన్ని చూసి మా గురుదేవులు "All is well with the World" అని ఎప్పుడూ భావించలేదు.

"నీరు, పైకి నిశ్శబ్దముగను ప్రశాంతముగను కనుపట్టును

నీటిలో ఒక చేప యింకొక చేపను భక్షించుచున్నది" (94)

మా గురుదేవుల సామాజిక స్పృహకు ఈ కవిత ఎత్తిన జయపతాక!

(2) "కష్టాల్లో ఉన్న వాడికి ప్రకృతి సౌందర్యం కనపడదు" అనే ముఖ్య సూత్రం కూడా మా గురుదేవులకు తెలుసు. అందుకే–

"సముద్రమున మునిగిపోవు వానికి
చంద్రోదయము సుఖప్రదము కాదు" (280)

అని అనగలిగారు.

ఈ నా సిద్ధాంతాన్ని సమర్థించే సూక్తులు ఈ 'హిమాని' లో అసంఖ్యాకంగా ఉన్నాయి.

(3) 'శ్రమజీవుల్ని దోచుకొని శ్రీమంతులు సుఖస్తున్నారు' అనే ధ్వని ఈ క్రింది సూక్తిలో కొట్టవచ్చినట్టు కనబడుతోంది.

"వేళ్ళు భూగర్భమున కష్టపడి గణించిన దాని నారగించి
వృక్షశాఖలు కరువలితో సరసమాడును" (105)

(కరువలి = గాలి)

శ్రమజీవులే మన సమాజానికి పునాది వంటివారు –అనేమార్క్సుసిద్ధాంతం కూడా ఇందులో ధ్వనిస్తోంది.

(4) మోసగాళ్ళయిన రాజకీయవేత్తలు ప్రజల్ని నిలువునా దోపిడీ చేస్తూనే, తాము ప్రజల్ని ఉద్ధరిస్తున్నామని ఉపన్యాసాలివ్వడం క్రింది సూక్తుల్లో గురుదేవులు ధ్వనింపజేశారు:

డేగ, పావురమును తినుచు "ఆహా!
నేను దీనిని ఆకటి దుఃఖమునుండి
తరింపజేసితిని కదా" యనుకొనెను (55)

సర్పము : "ఈ కప్పలను నా కుక్షియందుంచిన
వాని జీవితము నిరపాయము"

గ్రద్ద : 'నా గూడు చెట్టు చివరనున్నది
నీకందు నిరపాయము, రమ్ము' (56)

(5) రాజకీయవేత్త అమాయక ప్రజలను మోసగించి ఓట్లు సంపాదించడం

ఈ క్రింది సూక్తిలో ధ్వనితం :

"పుష్పంధయము పూవు పూవును చేరి పొగడుట
పుష్పరస సంపాదనకే" (224)

"చంద్రుడు చకోరము కొఱకే చదలున విహరింపకున్నను
చకోరము తనకొఱకేయని భ్రమించుచున్నది.
శశి – కాలవశమున తటస్థపడినప్పుడు
సాగరము 'నా ప్రియుడా' యని
తనకొఱకే వచ్చినట్లు కలవరించుచున్నది.
ఎవరిని గాంచినపుడు వారితో
'మీ కొఱకే! మీ కొఱకే' యని
సుధాకరుడు పలుకుచున్నాడు!" (240)

రాజకీయవేత్తలూ పార్టీలూ తమపబ్బం గడుపుకోవడంకోసం ఎన్నికలు నిర్వహిస్తుంటే, పిచ్చి ప్రజలు తమ్ము ఉద్ధరించడంకోసమే వారు ఎన్నికల పర్వాన్ని సృష్టిస్తున్నారని భావించడం ఇక్కడి ధ్వని.

(6) "ఈ దోపిడీదారులు తమ తప్పును ఒప్పుకోరు, పైగా సమర్థించు కుంటారు" అనే విషయాన్ని గురుదేవులు ఎంత చమత్కారంగా వెల్లడించారో గమనించండి:

"మృగమును హింసించునది బాణము కాని
నేను కాదు" అని వేటగాడనెను;
కొందరు తమ తప్పును పరిజనులపై పడవైతురు (146)

"పక్షికి సౌందర్యమును కూర్చు యీకలను ప్రకృతి కిచ్చి
పలలమును మాత్రమే భక్షించు మేము
ప్రకృతి సౌందర్యోపాసకులమే" అని
మాంసభక్షకుల తీర్పు. (185)
(పలలము = మాంసము)

"మణులనుపేర రాళ్ళుమోయుచు
నీవలెనే నేనును కష్టించుచున్నానని
చక్రవర్తి సామాన్యునితో ననెను" (320)

పాంథుడు : 'వ్యాఘ్రమా! నాపై నేల దుమికెదవు?'

పులి : 'నీ బిడ్డలు ధరించుట కనువుగ
నాగోళ్లను నీ యెముకలపై సానబెట్టుటకు!' (336)

(7) పేదవారైన ప్రజలు ఈ దోపిడీ విధానాన్ని గుర్తించి, జాగ్రత్తగా మసలుకోవాలనే హెచ్చరిక ఈ క్రింది సూక్తులలో కనబడుతుంది:

జాలరి : "మీనమా! జలభవనము నీవెరిగినదే!
స్థలభవనమున కేల రాకూడదు?'

మీనము : "జలభాగమున కడుగుననే
స్థలభాగమున్నది లెమ్ము" (335)

"బర్హి ఎంత చక్కగా నర్తించినను, పాములు మెచ్చుకొనవు' (193)

"తన తూలికలు రాజులు ధరింతురని మరాళము సంతోషింపదు'(116)

(8) ప్రభుత–జనత అనే రెండు విరుద్ధ వర్గాలను గ్రహించి, ది.సీ.రా. గారు ఎప్పుడూ జనతనే సమర్థిస్తారు; ప్రజాస్వామిక భావాలను ప్రపంచిస్తారు.

"నదులను నిరాకరించిన, సముద్రమైనను ఎండవలసినదే" (26)

"కంఠీరవమెంత గొప్పదైనను
ఖగము నేమియు చేయజాలదు" (179)

"అవరోధ బద్ధయగు రాణి వీణాలాపము
అంతఃపురములోనే మరణించును;
స్వేచ్ఛాకుమారుడగు గొల్లని మురళీధ్వని
బయలునంతటను వ్యాపించును" (360)

(9) ప్రజలను నిరాకరిస్తే, వారు ప్రభుత్వాన్ని కూల్చి వేస్తారనే హెచ్చరిక ఈ క్రింది సూక్తిలో ఉంది:

"వాన చినుకు చిన్నది అయినను
విశాల పద్మపత్రముపై బడి
చీల్చివేయుచున్నది" (182)

కాని ఇంకొక చోట దీనికి సరిగ్గా విరుద్ధమైన అభిప్రాయాన్ని వెల్లడించారు గురుదేవులు. తిరుగుబాటు చేయడంవల్ల పేదవాడు దెబ్బతింటాడనీ, సర్దుకొని పోవడంలోనే సుఖం ఉందనీ ధ్వనింపజేశారు :

"కొబ్బరి ఆకులు గాలికెదమిచ్చి సుఖించును;
అరటి యాకులు గాలినెదుర్కొని చిరిగిపోవును" (322)

(10) మరొక చోట - 'ఖైదీగా బ్రతకడంలో సుఖం ఉండదు; నిర్బంధంలో స్వేచ్ఛ ఉండదు' అనే విషయాన్ని ధ్వనింపజేస్తూ ఇలా అంటారు:

"పంజర మెంత పెద్దదియైనను
పంజరపు టూచలు మాత్రము క్రిక్కిరిసియే యుండును" (137)

ఈ సూక్తిలో - 'పంజరం ఇరుకుగా ఉందంటే, దానిని 'పెద్దది చేస్తారే కాని స్వేచ్ఛను మాత్రం ప్రసాదించరు? అనే విషయం సూచితమవుతోంది. అంటే దోపిడిదారులు శ్రమజీవులకు చిన్నచిన్న సదుపాయాలు కల్పించినా, తమ గుప్పిట్లోంచి మాత్రం వారిని విడిచిపెట్టరు-అనే అంశంకూడా ఇక్కడ ధ్వన్యాత్మకంగా ప్రదర్శితమవుతోంది.

(11) ప్రజల శ్రమైకజీవన సౌందర్యంలోనే పరమేశ్వరుడున్నాడు కాని, అధికార గర్వంతో ఉన్న ప్రభుత్వంలో కాదు- అనే విషయాన్ని ఈ క్రింది న్యూక్తి ధ్వనింపచేస్తోంది:

"సైరికుని నాగటి చాలులతో
సర్వేశ్వరుని అడుగులు కనిపించును;
సార్వభౌముని రథచక్రముల జాడలలో కాదు." (148)

కష్టించి పనిచేసే రైతే రాజ్యానికి మూలాధారమని ఘోషిస్తారు:

"రైతు నెత్తిపై బుట్టయే
రాజు తలమీది కిరీటమును పోషించుచున్నది." (272)

'హిమాని'లోని కవితాసూక్తులన్నింటికీ ఆధారం ప్రకృతి, చెట్లు, పూవులు, ఎండ, వాన, మేఘములు, కోయిలలు, తుమ్మెదలు, నెమళ్లు, పగలు, రాత్రి, సూర్యచంద్రులు, నక్షత్రములు, హిమబిందువులు, వెన్నెల, చీకటి, కప్పలు, పాములు, గ్రద్దలు

మొదలైన చరాచర ప్రకృతిని ఆధారంగా చేసికొని ఈ కవితలు అవతరించాయి. ఈ ప్రకృతిమూలకంగా మానవస్వభావం ధ్వన్యాత్మకంగా చెప్పబడింది.

(12) ఇలా కాకుండా మనుష్యులను ప్రత్యక్షంగా వర్ణించిన సూక్తులు ఈ కావ్యంలో మిక్కిలి తక్కువ.

"సుకృత సుమములచే నిండియున్న
మానవ జీవిత పథములందు మాత్రమే
కీర్తికోమలి విహరింపగలదు" (140)

ఇక్కడకూడా గురుదేవులు సుమముల సహాయం తీసుకున్నారు. ఇది 'పుణ్యైర్యశో లభ్యతే' అనే ఆర్యోక్తికి ఛాయ.

ప్రేయసి : 'నీ హృదయము మంచువలె కఠినమయ్యు
మంచువలెనే సులభముగా కరిగిపోవును' (156)

ఇంతకుముందు ఉదాహరించిన 360వ సూక్తి కూడా ఇటువంటి ప్రత్యక్ష మానవవర్ణనాసమన్విత సూక్తియే. కాని ఇటువంటివి సంఖ్యేయములు.

**X. ధ్వనిసిద్ధాంతం:–**

ఆలంకారిక సిద్ధాంతాలలో ధ్వనిసిద్ధాంతం కోహినూరు! దీనిని మించిన సిద్ధాంతం ఇంతవరకూ ప్రపంచంలో పుట్టలేదు. ఇటువంటిధ్వని సిద్ధాంతానికి ఈ మా గురుదేవుల 'హిమాని' అంతా అభినవ 'సప్తశతీసారము'!

"స్వాధీనపతిక తల యెత్తినది –
మావికొమ్మనుండి వ్రేలు మాలతి కనుపించినది :
ఖండిత తలవంచుకొని
కాలివ్రేలుతో నేలవ్రాయుచున్నది–
పూవురేకుల తునకలు
గాలికి కొట్టుకొని వచ్చి
కాలికి తగిలినవి" (97)

(ఇది కూడా మానవుల్ని ప్రత్యక్షంగా వర్ణించిన సంఖ్యేయములైన సూక్తులలోనొకటి.

**XI. తాత్త్వికచింతన – ఆత్మజ్ఞానం:–**

మా గురుదేవుల గురుదేవులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పి

నట్లు "కవిత్వము- వేదాంతము ఒకే కొమ్మకు రెండుపువ్వులు". తాత్త్వికదృష్టి లేనిదే కవిత్వానికి బరువు ఉండదు. ధ్వనిగర్భితాలైన ఈ 'హిమాని' సూక్తులలో, మానవస్వభావ విశ్లేషణతోపాటు ది.సీ.రా.గారు తాత్త్వికచింతనను కూడా ప్రవేశపెట్టి తమ మినీకవితలకు సాటిలేని మేటిగౌరవాన్ని సంతరించుకున్నారు:-

"మన నీడ మనలను ఎండనుండి రక్షింపలేదు" (57)

"వర్షించినపుడు పయోధులతోపాటు పడియలును నిండును :
భగవంతుని ప్రేమ విశ్వజనీనము" (71)

"భరింపరాని ఎండలోను
భరింపగలిగిన వెన్నెలలోను
నీడపడుట తప్పదు;
ఎట్టి దశలో నున్నను మృత్యువు అలంఘనీయము" (81)

"కాలమను నాణెమునకు
ఒక ప్రక్క నుండు అక్షరములు చుక్కలు
రెండవప్రక్కనుండు బొమ్మ సూర్యుడు" (139)

"పండుటాకుల మర్మరధ్వనుల భావమేమి?
ప్రకృతి పరిణామము చివరి కింతేయని" (176)

(ఈ సూక్తిలో ఒక ప్రశ్న- ఒక జవాబు శిల్పాన్ని గమనించవచ్చు 331, 333 సూక్తులు కూడా ఇట్టి శిల్పానికే ఉదాహరణాలు)

"ద్రుమమున చివరకు మిగులునది తొడిమయే" (321)

"కోడి కూతలో నేమున్నది?
మరణించు రాత్రి మూలుగున్నది" (331)

"చెదపురుగా! నీ వేదాంతమేమి?"
చెదపురుగు-"చివరకంతయు మన్నే యగునని" (333)

ఇటువంటి వేదాంత పరమైన సూక్తులు ఈ కావ్యంలో పుష్కలంగా లభిస్తాయి. (చూడుడు : 180, 233, 303). తాత్వికత పరాకాష్ఠను చేరేది ఆత్మజ్ఞానంతోనే. ఇటువంటి ఆత్మజ్ఞాన సంబంధమైన సూక్తులకుకూడా 'హిమాని' లో కొరత లేదు.

'నా' అని అభిమానించు గుల్లలోని పురుగు
నశించినతోడనే– సముద్రము
గుల్లను ఒడ్డుకు కొట్టివేయును" (345)

ఆత్మ : "శరీరమా ! నను లెక్క సేయక
నీవు యథేచ్ఛగా ప్రవర్తించిన
నాకు కష్టము కలుగదా?"

శరీరము: "ఎప్పటికైనను నన్ను వీడిపోవు
నీకు కష్టము కలిగిన
నాకు నష్టమేమి?" (344)

ఇక్కడ తాత్త్వికతతో పాటు కొంత హాస్యం కూడా చోటు చేసుకుంది.

"లీలావతీ! నీ కన్నులలోని చపలత
నీ హృదయమును నిరూపింపదు కద?" (175)

మొదలైన సూక్తులలో హాస్యం నిండుగా తొణికిసలాడుతుంది.

**XII. సంభాషణలు:–**

గురుదేవులకు భాసుని నాటకాలన్నా, భట్టనారాయణుని వేణీసంహారమన్నా, మురారి అనర్ఘరాఘవమన్నా చాలా ఇష్టం. ఈ కవితా సూక్తుల్లో కొన్ని నాటక సంభాషణలను జ్ఞప్తికి తెస్తాయి అనడంలో సందేహంలేదు:

మిణుగురు: "నక్షత్రమా ! నా రెక్కలు నీ కిచ్చెదను
నీ కాంతిని నాకిమ్ము"

నక్షత్రము: "అట్లే చేయవచ్చును.
ఇచ్చటికి రమ్ము" (306)

గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు 'హిమాని' పేరుతో నేను పుట్టకముందే వారి విద్యార్థి దశలోనే (1934–35లోనే) ఇంత అత్యద్భుతాలైన కవితాసూక్తుల్ని ఎందుకు చెప్పారు? ఎలా చెప్పారు?" అంటే ఈ చరాచర ప్రకృతినీ, దీని సౌందర్యాన్నీ నిశితంగా పరిశీలించిన గురుదేవుల మనస్సులో ఎన్నో ప్రశ్నలు చెలరేగాయి. జవాబుకోసం పరితపించారు. ప్రకృతిసౌందర్యంలో మానవస్వభావం ధ్వనించింది; ఆశ్చర్యపోయారు! ఈ సమస్త చరాచరప్రకృతీ పరమేశ్వరుని స్వరూపమనీ, మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేయడంకోసం ఆ భగవంతుడు ఈ పెద్ద

మ్యూజియం పెట్టాడనీ గ్రహించారు. వెంటనే వారి హృదయంలో కవితాఝురి పొంగి పొరలింది!

వత్తియందును, నూనెయందును లేని శాంతి
తజ్జనితమగు దీపికకెట్లు కలిగినది?
రెండు కాలాభ్రముల సంశ్లేషమున
విద్యుత్తెట్లు పుట్టుచున్నది?
సాగరతరంగము, 'వేలావక్షమున క్రీడించునపుడు
స్వచ్ఛడిండీర మెట్లు జనించుచున్నది?
ఇది ప్రకృతి చిత్రము!
ప్రకృతి భగవంతుని వస్తుప్రదర్శనశాల కదా! (213)

**3**

'గురుదేవుల 'హిమాని' కావ్యాన్ని ప్రచురించాలనే ఆలోచన నాకు ఇచ్చినవారు దిగుమర్తివారి శిష్య పరంపరకు అగ్రజులైన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు. (దీనిని చైతన్యకవితలో ధారావాహికంగా ప్రచురించుమని చెప్పిందికూడా కొర్లపాటి వారే.) వారు స్వయంగా 'ఎంతో కష్టించి, సీతారామస్వామిగారి వ్యాసాలూ పీఠికలూ సేకరించి 'అనర్ఘమణులు' వెలుగు చూసేలా చేశారు. ఆగ్రంథావిష్కరణసభను విశాఖపట్టణంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో వైభవంగా ఏర్పాటు చేశారు (డిసెంబరు 21, 1991). ఆ సభలోనే 'హిమాని' కావ్యాన్ని నేను ప్రచురిస్తానని వాగ్దానం చేశాను. ఫలితంగా ఇప్పుడు ఈ కవితాసంపుటి మీ చేతులలో ఉంది. కాని ఒక కొరత నా హృదయంలో గాలంముల్లులా గుచ్చుకుంటోంది. 1991 డిసెంబరు 21 వ తేదీని జరిగిన అనర్ఘమణుల ఆవిష్కరణసభలో గురుపుత్రునితోపాటు గురుపత్ని శ్రీమతి దిగుమర్తి వెంకట సీతారత్నం(శతతారాదేవి)గారు కూడా పాల్గొన్నారు. గురుదేవుల సోదరులు డా॥ సుందరశివరావుగారూ, సోదరీమణులూ, బంధువర్గమూ అంతా ఆ సభను అలంకరించారు. తిరిగి ఈ డిసెంబరులో వీరందరి సమక్షంలోనూ 'హిమాని' ఆవిష్కరించాలనుకున్నాను. కాని విధివిలాసం విచిత్రం కదా! గురుదేవుల ధర్మపత్ని సీతారత్నంగారు ఆకస్మికంగా. 21-10-1992 బుధవారంనాడు ఉదయం 7-30 గంటలకు పరమపదించారనే పిడుగులాంటి వార్త నాకు చేరింది. గురుపత్ని బ్రతికి ఉండగా ఈ కావ్యాన్ని

ప్రకటించ లేకపోయానే అనే బాధ నన్ను పీడిస్తోంది. దీనికి కొంత ఉపశమనంగా ఈ 'హిమాని' కావ్యాన్ని సీతారత్నంగారికి అంకితం చేస్తున్నాను. గురుదేవులు 1956లో కాళిదాసు ఋతుసంహారాన్ని ఆంధ్రీకరించి, తమ ధర్మపత్నికి 'శత తారాదేవి' అనే పేరుపెట్టి ఆ కావ్యాన్ని ఆమెకు అంకితం ఇచ్చారు. ఆ కావ్యావిష్కరణ సభకు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చారు. భీమవరంలో స్పెషల్ తెలుగు బి.ఏ. చదువుతున్న విద్యార్థిగా నేను కూడా ఆ సభలో పాల్గొన్నాను. అది ఋతువర్ణన; ఇది ప్రకృతివర్ణన. ఋతువర్ణన ప్రకృతివర్ణనలో భాగమే కదా!

"జ్ఞానభారతి"<br>
బెంగుళూరు

**తంగిరాల వెంకట సుబ్బారావు**<br>
**25-10-1992**<br>
**అంగీరస - దీపావళి**



## "నిజలింగప్పకు" అనారోగ్యం

తన చిత్రానికి పాటరాసి ఇవ్వమని అడిగిన చాలా రోజులకు ఆ నిర్మాత కృష్ణశాస్త్రిగారిని దర్శించి పాటమాట జ్ఞాపకం చేశాడు. దానికి జవాబుగా దేవులపల్లివారు కాయితం మీద 'నిజలింగప్పకు అనారోగ్యం' అని రాసి చూపారు. నిర్మాతకు ఏమీ బోధపడలేదు. ఎక్కడో బెంగుళూరులో వున్న నిజలింగప్పకు అనారోగ్యమైతే శాస్త్రిగారు పాటరాయక పోవడమేమిటో అసలే అర్థం కాలేదు.

ఇక శాస్త్రిగారికి బదులు చెప్పడానికి, ఎదురు ప్రశ్న వేయడానికి సంకోచించిన నిర్మాత తర్వాత మళ్ళీ కలుద్దామని తిరిగి వచ్చేశారు. మాటల సందర్భంలో ఆ నిర్మాత ఈ సంగతి శ్రీశ్రీతో అంటే ఆయన భాష్యం చెప్పాట్ట! నిజలింగప్ప అంటే ఆత్మారాముడని, అనారోగ్యం శాస్త్రిగారికేనని. ఒక క్షణం ఆలోచించి 'ఓహో' అనుకున్నాడు నిర్మాత అర్థం చేసుకుని.

# 5. డా॥ నందూరి రామకృష్ణమాచార్యగారి వ్యక్తిత్వం-కవిత్వం (1921-2004)

**- ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి**

డాక్టర్ నందూరి రామకృష్ణమాచార్య శిష్యవాత్సల్యం మూర్తీభవించిన గురువు. ప్రాతక్రొత్తల మేలికలయికల కవి. రంగస్థలంమీద రక్తికట్టిన నాటకరచయిత. చరిత్రలోను, సాహిత్యంలోను సారగ్రహణం చేసిన పరిశోధకుడు, "రమ్యహాస లోలుడు". సంభాషణ చతురుడు. కార్యసాధకుడు. మనస్సు వున్న మనీషి, "నిండు మనంబు నవ్యనవనీత సమానము." కాని, "పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము" కాదు; "శిరీష కుసుమ పేశల" సదృశం.

ఇరవై రెండవయేట పశ్చిమగోదావరిజిల్లా భీమవరం కళాశాల తెలుగుశాఖ తొలిఅధ్యక్షునిగా అధ్యాపకవృత్తిని ఆరంభించి, వివిధ ప్రభుత్వ కళాశాలల్లో ప్రిన్సిపాలై, ఏభైయెన్మిదవయేట పదవీవిరమణ చేసిన ధన్యజీవి. అరవై యెన్మిదవయేట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారభాషా సంఘానికి అధ్యక్షులై, తెలుగుభాష వెలుగొందడానికి, ఆ సంఘం అస్తిత్వాన్ని జేగీయమానం చేసిన ప్రజ్ఞానిధి. డెబ్బైయైదవయేట ఆంధ్ర పద్యకవితా సదస్సు అధ్యక్షులై, తెలుగు పద్యం తేజరిల్లడానికి, ఆ సదస్సు మనుగడని దేదీప్యమానం చేస్తున్న దీక్షా కంకణధారి. వయోభారాన్ని మాత్రమేగాకుండా, వ్యయభారాన్ని కూడా లెక్క చేయకుండా, పద్యపునరుద్ధరణకి శేషజీవితాన్ని అంకితంచేసిన శేముషీ ధురంధరుడు. ఉదారస్వభావానికి ఒక ఉదాహరణం. నిష్కామకర్మాచరణకి ఒక నిదర్శనం.

**"కాంతి నిచ్చి మలగు కర్పూరహారతై**
**చదువుకొరకు ఎవని బ్రదుకు వెలుగు?**
**జీవితమ్ములోన శిష్యులే తనకంటె**
**గొప్పవారలగుట కోరునెవడు?"**

- అని గీతా ప్రవచనం చేయడమే గాకుండా, అక్షరాలా "శిష్యులే తనకంటె గొప్పవారలగుట కోరు" కొంటున్న గురువు. శిష్యులు ఏనాటి కళాశాల విదార్థులో అయినా, ఈ నాటికీ ఏనాటికీ వారి అభివృద్ధికి దోహదంచేసే దొడ్డగురువు డాక్టర్ నందూరి రామకృష్ణమాచార్య. ఇది వారి వ్యక్తిత్వానికి కరదీపిక.

ఇక కవిత్వం - ప్రారంభదశలో పరిణతమైన "తారాతోరణము", పరిణత దశలో ప్రారంభమైన "ప్రగతిగీత" ప్రసిద్ధ ఖండకావ్యాలు. ఇరవైయేదు ఖండికల సంపుటికి "నక్షత్రమాల" అని దువ్వూరి రామిరెడ్డి నామకరణం. "తారాతోరణము" అని నండూరి రామకృష్ణమాచార్య నామకరణం. అది కేవలం పద్యకావ్యం. ఇది పద్యగేయోభయకావ్యం. అజ్ఞాతకౌంతేయం, శకుంతలానిర్గమనం మొదలైన సంప్రదాయ కవితలు; సూక్తవసంతము, శీర్ణమేఖల మొదలైన నవ్యకవితలు; జీవితసూక్తము, ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః మొదలైన ప్రబోధకవితలు రాశీభూతమైన ప్రాత క్రొత్తల మేలికలయిక "తారాతోరణము".

శ్రీకృష్ణుని రాయబారం తర్వాత, కుంతీకర్ణుల ఏకాంతసమావేశమే అజ్ఞాత కౌంతేయం. ఇతివృత్తం భారతార్థమైనా, ఇందులో కర్ణుని మాతృగవేషణ ఇతోధిక విశేషం.

**"మనమున భావనాపటిమ మాతృకృపాకమనీయ దివ్యమూ**
**ర్తిని దరిశింపగా కలవరించితి తీయకలల్ సృజించు తీ**
**రని నిరుపేద కోర్కుల; పురాతన సత్యమువోలె నన్ కద**
**ల్చెను భవదీయ వాక్కులు విచిత్ర విషాదము రేపి నా హృదిన్.**

**కస్తూరినిదు రాధ కనుపాప నొకనాడు**
**కన్నతల్లియె నాకు కానుపించె**
**ఉయ్యాల జోకొని ఊగిననా దమ్మ**
**అతిలోక హస్తమే అరసినాద**
**చిరుత ప్రాయములో నిదుర చెందిన నన్ను**
**కలలోన జనయిత్రి కౌగిలించె**
**అంగ సింహాసన మధివసింపగ నాకు**
**అజ్ఞాత మాతయే ఆజ్ఞనిచ్చె**
**రేలుపవలెల్ల అస్పష్టరీతి నక్క**
**దక్కద ఇచట నచట నేనరయుచుంటి**
**అవ్యయ కృపాతరంగిణి అమ్మకొరకు;**
**కాని - ఆమె యీ నిర్భాగ్యుకంట పడదు.**

**ఘోరభారతయుద్ధాగ్ని కుండమందు**
**ప్రాణమర్పింపవలె రాజరాజుకొరకు**
**కన్నతల్లిని గాంచు భాగ్యమ్మునొంద**
**లేను కాబోలు నీ జన్మలోన నేను."**

ఇది తన్నుగూర్చి ఏవో కథలూ, ఏవేవో గాథలూ విన్న కర్ణుని మనోవేదన. కరుణరసకంపం కలిగించే కవిత్వం.

అర్జునుని యెడల అసూయ కలగడానికి కర్ణుడు చెప్పిన కారణం ఒక నగ్నసత్యం. మనస్తత్వ మర్మం.

**"అర్జునుని పైన నా కసూయ యని ప్రజలు**
**పలుకుచుందురు నిజము కావచ్చు కొంత;**
**ప్రేమను కృతకముగ చంపివేయునెడల**
**ఈర్ష్యయౌచు తిరిగి జన్మమెత్తుచుండు"**

పుత్రప్రేమను కృతకంగా చంపివేసింది కన్నతల్లి కుంతి. అది కర్ణాకర్ణిగ విన్న కర్ణునికి ఈర్ష్య కలగడం సహజం.

కుంతి అడిగిన మీదట కర్ణుడు వరమివ్వడం మహాభారతంలోని విషయం. కుంతి అడుగకుండానే కర్ణుడు వరమివ్వడం అజ్ఞాతకౌంతేయంలోని విశేషం.

**"అర్జునుడు తప్ప పాండవులాహవమున**
**చేత చిక్కిన కూడ హింసింపబోను**
**అర్జునుడు తన్ను దానె కాపాడుకొనును**
**అడుగకుండ నీకిచ్చితినమ్మ వరము"**

అమ్మకోసం అంతగా అలమటించిన కర్ణుడు, అడుగకుండానే అమ్మకు వరమివ్వడం అత్యంత సముచితం. అంతేకాదు. ఎంత ఈర్ష్యాళువైనా, ఇంత వరప్రదాత కావడం కర్ణుని ఉదాత్తలక్షణం.

కర్ణపాత్ర చిత్రణం కర్ణరసాయనమైన అజ్ఞాత కౌంతేయం ఉదాత్త రసాన్వితం.

శీర్ణమేఖల అంటే మణిమేఖల జ్ఞప్తికి రావడం సహజం. అది తమిళ కావ్యం. కావ్యనాయిక బౌద్ధభిక్షువు పేరు మణిమేఖల. అదే కావ్యం పేరు. ఇది తెలుగు కావ్యఖండిక. కావ్యనాయిక పేరు కాదు. శీర్ణమైన మేఖలే శీర్ణమేఖల. తెగిన మొలనూలు. భానుమతి, దుర్యోధనుడు, కర్ణుడు, భారతపాత్రలైనా; సంఘటన,

సందర్భం, సన్నివేశం – సర్వం – కవ్యపజ్ఞం. గాఢమైత్రిని ప్రతిపాదించే ఇతివృత్తం. అపార్థం చేసుకోవడానికి అవకాశం వున్న సంఘటన. అయినా అపార్థానికి తావులేని, ప్రగాఢమైత్రి ప్రకాశించిన సందర్భం. అవైయాసకం.

ఖండిక ఎత్తుగడే కుతూహలం కలిగిస్తుంది.

**ఈ నడిరేయిలో ఇభపురేశ్వరు అంతః పురాన హర్మ్యసో**
**పాన పరంపరాగ్రముల పైకి యెకాయెకి నెక్కు నెవ్వడీ**
**మానిసి? రాణి భానుమతి మందిర రత్నకవాట కాంతిలో**
**ఆననసీమ వెల్గెడిని అంగధరేశుడు సూతసూనుడే!**

అర్ధరాత్రి అంతఃపుర ప్రవేశం! అది కూడా దుర్యోధనుడి భార్య భానుమతి అంతఃపురంలో కర్ణుని ప్రవేశం!! ఎంత మిత్రుడైనా వింతగొలిపే విషయం. అంతఃపుర ద్వారపాలకులు అదమరిచి నిదురపోతున్నారా? కాదు.

**అనుగు సఖుని దుర్యోధను నరయు కొరకు**
**పవలు రేలనక అతడు వచ్చుచుండు**
**కంటికిని కూర్కు లేకుండ కాచుచున్న**
**ద్వారపాలకులెవరాపనేరరతని.**

దుర్యోధనుడి అంతరంగంలో వున్న కర్ణుణ్ణి, భానుమతి అంతఃపుర ద్వారపాలకులు ఆపలేని మాట నిజము. అర్ధరాత్రి అయినా సరే! ఆ సమయంలో దుర్యోధనుడు అంతఃపురంలో లేడు! భానుమతి అందమైన తల్పంమీద చెలికత్తెతో చదరంగం ఆడుతున్నది. కర్ణుడు బంగరుగద్దెపై ఆసీనుడయ్యాడు. "ఎచ్చటికేగినాడు ధరణీశ్వరుడు?" అని అడిగాడు. "చెచ్చెర వత్తునంచు చనె శీఘ్రముగా నెటొ పాదచారియై; వచ్చుచునుందురంచు మది భావన చేసెద" నని సమాధాన మిచ్చింది భానుమతి. "పోయెదనంచు" లేచాడు కర్ణుడు. "వచ్చెడు వేళయయ్యె ఈ రేయి భవత్ సఖుండు నిదురింపడు మీ గమనమ్ము విన్నచో, పోయినదేమి ఆగుడు, ప్రభుండిదె వచ్చుచునుండు" అన్నది భానుమతి. కర్ణుడు ఆగిపోయాడు. భానుమతి చదరంగం ఆడటానికి ఉపక్రమించింది. ఆట చూస్తున్న కర్ణుడు చెలికత్తె స్థానం ఆక్రమించి ఎత్తులు కదపసాగాడు. భానుమతి, కర్ణుడు చదరంగం ఆడటం వింత.

**ఎంతటి మాట! హస్తినగరేశ్వరు పట్టపురాణి యట్టు లే**
**కాంతగృహమ్ములోన నిజకాంతుడు లేని నిశీధి నేక శ**

**యాంతర వర్తియై తమిని అన్యునితో చదరంగమాడు నా**
**వింతను తొంగిచూచె వినువీథిని తారలు పుల్కరించుచున్.**

ఆట "మాంఛి రసకంధాయం"లో పడింది. కర్ణుడు "త్రోసిరాజొ, ఉయ్యాల త్రోసిరాజొ" అని గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతుండగా అరుదెంచాడు దుర్యోధనుడు! భానుమతి చూచింది. లేచింది. చూడని కర్ణుడు నిలవరించడానికి భానుమతి మేఖల పట్టుకొన్నాడు. ఆమె విదళించింది. మేఖల తెగిపోయింది. అప్పుడు కర్ణుని కంటపడ్డాడు దుర్యోధనుడు!

**కట్టెదుట నున్న కౌరవనాథుని**
**ప్రాణమిత్రుని మోము నరయ లేక**
**హైమ కాంచిని వీడి అందందు పడిపోయి**
**చెదిరిన మణులేర చేయిరాక**
**స్తంభించి నిలిచిన సతి కురుపట్టమ**
**హిషి అవస్థ మదినూహింపలేక**
**ఏమియెరుగకయె ఇంతలు సలిపిన**
**తన్నుగూర్చి తన కర్థమ్ము గాక**
**కనక తల్పము జారిన కర్ణహృదయ**
**మందు విద్యుల్లతారోచి అశనిపాత**
**మగ్ని పర్వతజృంభణ మబ్ధిఘోష**
**ధరణి కంపమ్ములేకమై తాండవింప**

ఇది కర్ణుడి అవస్థ. మఱి దుర్యోధనుడి వ్యవస్థ-

**మంద మనోజ్ఞహాస సుషమా మృదుభావ మరీచి వీచికల్**
**కందుదలందు వెల్లిగొన కౌరవనాథుడు ఆత్మదేవికిన్**
**చిందిన మేఖలా మణులు చెచ్చెర నేరి యొసంగి "ఆగ్రహం**
**బందిరొ రాణివారు? క్షమకర్హుడు నా ప్రియమిత్రుడిమ్మెయిన్.**

**ఎరిగి చేసిన తప్పుగా దెంతవారి**
**కైన క్రమ్మును చదరంగమందు మత్తు**
**ఎప్పటియటుల కర్ణుని మన్నింపు" మనుచు**
**ప్రార్థనలు సలపె ఛలోక్తి పరిఢవింప**

అని కర్ణుణ్ణి తీసికొని మేడమీదకు వెళ్ళిపోయాడు. ఇది కర్ణదుర్యోధనుల "సుకుమార హృదయ పవిత్రమైత్రి." కర్ణ దుర్యోధనులు ఎలాంటి వారైనా వారి మైత్రి పవిత్రమైనదే. మైత్రి విషయంలో వారి హృదయాలు సుకుమారమైనవే.

అజ్ఞాత కౌంతేయంలోని కర్ణపాత్ర చిత్రణం ఉదాత్తమేగాని, శీర్ణమేఖలలోని దుర్యోధనపాత్ర చిత్రణం మహోదాత్తమైనది. అంతే కాదు, ఆద్యంతం నాటకీయపద్ధతి జీవనాడిగా సాగిన కావ్యఖండిక శీర్ణమేఖల. ఇది కూడ ఉదాత్త రసాన్వితమే, వ్యాసప్రోక్తం కాని, కవిత్రయసూక్తం కాని – శీర్ణమేఖల నవ్యకవిత్వం.

విజ్ఞానశాస్త్రం వికసిస్తున్నది. సౌకర్యాలు సమకూరుస్తున్నది. యవనికాభ్యంతరంలో విలయతాండవం విజృంభిస్తున్నది. ఇది తత్త్వశాస్త్రవేత్తల్ని కలచివేస్తున్నది. అది ప్రతిఫలించింది "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః".

**'ఆటము బాంబు' రెక్కల జలాంతరగాముల కాలకూటదుష్**
**కీటక వాయు జృంభణము క్రిందులు మీదులు లేక సంగరో**
**చ్చాటన సల్పుచున్ బ్రదుకు చావుల దుఃఖసుఖాల క్లిష్టశృం**
**గాటకమందు నిల్చిరి జగచ్చరితంబున నేటి మానవుల్**

ఇది 1950 నాటి స్థితి. ఇప్పటి స్థితి ఇంతే. అప్పుడే కవి ఆగ్రహోదగ్రు డయ్యాడు.

**ఓ నవశాస్త్ర దారుణ మహోగ్ర కఠోర వికార ఘోర వి**
**జ్ఞాన వికాసమూర్తి! విషచారిత రక్తరసప్లుత ప్రభా**
**లీన కటాక్ష మేల ప్రసరించెదవోయి? సహస్రశీర్ష పం**
**చానన విశ్వరూప విలయాంతర భీకర గర్జనార్భటిన్.**

ఇది ప్రసాదగుణ ప్రధానమైన ఖండకావ్యంలోని ఓజోగుణభూయిష్ఠమైన రచన. ఇది రౌద్ర బీభత్స భయానక రసోచితం. ఎంత క్రోధం ప్రదర్శించినా, మఱెంత జుగుప్స ప్రకటించినా, ఇంకెంత భయపెట్టినా, ఘోరవిజ్ఞానవికాసమూర్తికి చీమ కుట్టినట్టు కాదు. సుకుమార సోల్లుంఠనమే విషకన్యాపరిష్వంగం. ఇది "ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" లోని అపూర్వ విశేషం.

**"ఈ పెనుమంటి దిబ్బ వసియించి రొకానొకనాడు మానవుల్**
**పాపము! శేముషీవిభవ పారగులై ప్రకృతిన్ జయించి వి**

**శ్వాపరసృష్టి సల్పి ప్రళయాంతక బుద్ధిని గుండెలేక ఆ**
**త్మోపహతిన్ వినాశనము నొందిరి యందరు జ్ఞానశూన్యులై”**

**అనుచు హతశేషమై యంత యవని మిగులు**
**ఏ పిపీలికలో రచియించుకొనును**
**కరుణగీతులను తమ వాఙ్మయములోన**
**నయ్యది యవశ్యభవితవ్యమేమొ మనకు!**

విజ్ఞానశాస్త్ర వికాసం ప్రపంచ సంగ్రామానికి పాల్పడితే, యావత్ప్రపంచం పెద్ద మట్టిదిబ్బ కావడం అపరిహార్యం. ఏ చీమలో మిగిలితే అవి తమ వాఙ్మయంలో మానవుల జ్ఞానశూన్యులని విషాదగీతాలు విరచించుకోవడం అవశ్యభవితవ్యమే! నిజానికి చీమలు జ్ఞానంలేనివి. మానవులు జ్ఞానం కలవారు. అటువంటిది చీమలు జ్ఞానంకలవికావడం, మానవులు జ్ఞానశూన్యులు కావడం విజ్ఞాన శాస్త్ర విపరిణామ విపర్యయం. అంతేకాదు, ప్రపంచ సంగ్రామానికి ప్రాతిపదిక అనైక్యత. అనైక్యత లేనిది చీమలబాటు. చీమలనుండి మానవులు నేర్చుకోవలసింది ఐక్యత అని ధ్వన్యర్థం.

**“సకలధరణి శాసనపరిషత్తు తోడ**
**ప్రజలు వసుధైక సామ్రాజ్యపౌరులగుచు**
**భూమి యేకకుటుంబమై పొందునంది**
**విశ్వమానవ కల్యాణవేది యగును.”**

అని శాంతి వచనం. వసుధైకకుటుంబం, విశ్వమానవకల్యాణం నండూరి రామకృష్ణమాచార్య నాదబ్రహ్మోపాసన.

ఇరవైయేడు ఖండికల తారాతోరణంలోని అజ్ఞాత కౌంతేయం, శీర్ణమేఖల, ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః అనే మూడు ఖండికలూ ఆధునికాంధ్ర కవితావిహాయస వీథిలోని ధ్రువతారలు!

హాస్యప్రియత్వం, మానవతాదృక్పథం, ప్రగతి దృక్పథం త్రివేణీ సంగమమైన ఖండకావ్యం “ప్రగతిగీత”. కేవలం పద్యకావ్యం. ఇదొక సప్తశతి. శృంగార రసప్రధానం కాదు. ధ్వని ప్రధానం కాకపోదు. అందుకే “అద్యతన సాహితీ సప్తశతి” అన్నారు.

ఇందులో మూడు భాగాలున్నాయి. 1. వెన్నల వడగళ్ళు. 2. ముత్యాల గొడుగు. 3. పన్నీటిజల్లు.

**"ఎందుకీ వ్రాతలు గీతలున్?"** అని ప్రశ్న వేసికొని,

ఇచ్చిన సమాధానంలోని సారాంశం ఇది:

**"... ... వెలుగుబాటలు తీరిచిదిద్ది గుండెలో**
**లోతులు పాతులున్ తరచి లోకము పోకడ చూచి నిల్పుతన్**
**శ్రోతల మానసాల చిరుజ్యోతులు. . . . . . . "**

ప్రగతిగీతలోని ప్రత్యంశం వెలుగుబాటలు తీర్చిదిద్దేదే. గుండె లోతుపాతులు తరచి లోకంపోకడ చూపేదే. ఏ పాటి మానవత్వం వున్నా, మానసవీథిలో చిఱుజ్యోతులు నిలిపే మాట నిజమే. ఇందుకు వెన్నెల వడగళ్ళులోని "కోటీశ్వరుని కుక్క" ఒక ప్రముఖోదాహరణం.

ఒకసారి తీవ్రమైన చలిగాలికి ఒక్క బీహారులోనే వెయ్యిమందికి పైగా చనిపోయారు. కోటీశ్వరుని కుక్క మాత్రం చావలేదు. కారణం?

**కుక్కపిల్లకొరకు కుట్టించె ఒక కోటు**
**పట్టువంటి ఉన్నిబట్ట పెట్టి**
**పసిడి గొలుసుతోడ పచ్చని మొలత్రాడు.**
**వేలకొలది ఖర్చుపెట్టి కట్టె**

***

**కుక్కపిల్లతోడ కోటీశ్వరుడు మేడ**
**వదలలేదు తెల్లవారువరకు**
**తెల్లవారి నంత దినపత్రికలు లేవు**
**చచ్చినట్టివారి సంఖ్య తెలుప**

ఉన్నికోటు కాదు, ముతకగుడ్డ లేనివారు; మేడకాదు, గుడిసె వదలవలసిన వారు చలిగాలికి చనిపోయారు!

**భరతఖండమందు నిరుపేద గుడిసెలో**
**మనుజజన్మ యెత్తి మసలుకంటె**
**కుక్కజన్మ మేలు కోటీశ్వరుని యింట**
**భరతదేశ మెపుదు బాగుపడునొ!!**

అని కవి ఆవేదన. అంతేకాదు. "మాతృక ఒక అమెరికను కవిత. (అమెరికాలో బీదవారి దైన్యమును చిత్రించిన కవితా మాతృక వెలువడగానే, అచటి శాసనసభ్యుల హృదయములు కరిగి, పేదల శ్రేయస్సునకై క్రొత్తచట్టములు వెలువడినట్లు తెలియుచున్నది.)" అని కవి అధస్సూచిక. ఇచటి శాసనసభ్యుల హృదయములు కరగి పేదల శ్రేయస్సునకై క్రొత్తచట్టములు వెలువడినపుడు భారతదేశము బాగుపడునేమో!

వెన్నెల వడగళ్ళులోని 'భోగిమంటలు' అనే ఖండిక ప్రగతి శీలానికి ఒక ప్రత్యేకోదాహరణం.

**"కాలదోషమ్ము పట్టిన గతచరిత్ర**
**ఎండిపోయిన పిడకల దండవోలె**
**కట్టగట్టి కన్నులు మూసి కాల్చవోయి**
**భోగిమంటలలో నీకు పుణ్యముండు.**

***

**స్వస్థాన వేషభాషా మమత్వముచేత**
**గుండె గప్పిన సాలెగూళ్ళనెల్ల,**
**స్వీయమతాభినివేశమ్ము మనసులో**
**పెంచిన పెనుముండ్ల కంచెలెల్ల,**
**జాత్యభిమానపిశాచి పూనుటచేత**
**బుట్టకెత్తిన గంగవెఱ్ఱులెల్ల!**
**విద్యామదము పదవీమదమ్ము ధనమ**
**దమ్ము వేసిన వెఱ్ఱితలలనెల్ల**
**కారణాంతరముల కలగూరవోలె**
**ఒడలిపై మొలిచిన కుక్కగొడుగులెల్ల**
**భోగిమంటలలో వేల్చి కాగబెట్టి**
**వేడినీరు శిరస్స్నాన మాడుమయ్య!**

**కడుపు మాడి గుంటపడిన కంటిమంట**
**భోగిమంట గొలిపి ఆరిపోయినట్టి**

**గరళకంఠుని మూడవ కన్నునిపుడు**
**రగులుకొల్పుము దుష్టమారణముకొరకు!".**

'ముత్యాల గొడుగు' ముఖ్యంగా 'ముక్తకాల' సంపుటి. సుమారు మూడువందల పాతిక పద్యాలు. ముత్యాలసరులు పోహళించినట్టు అకారాద్యనుక్రమణికలో ఉన్నాయి. కొన్ని మచ్చుతునకలు:

**అగ్నిపరీక్ష**

**"అగ్నియందు కరగి అపరంజి వెలుగొందు**
**మట్టి – గట్టిపడును మాడిపోయి**
**దొడ్డవాడు వెలుగు దురదృష్టదశయందు**
**అల్పుడైన యెడల అణగిపోవు"**

**కవి**

**"కవివరేణ్యుడనిన అవతారపురుషుండు**
**సాహితీచరిత్ర చదువునపుడు**
**కవియొకండు ప్రక్క గదిలోన నివసింప**
**ప్రహసనమ్ములోని పాత్ర అతడు!"**

**చిత్ర లేఖనము**

**"దున్నపోతు కొట్టె తోకతో గోడపై**
**బురదగుంటయందు దొరలి వచ్చి**
**నవ్యచిత్రలేఖనమ్ములో అల్లదే!**
**వచ్చెననిరి జనము స్వర్ణశకము!"**

**తెలుగు పద్యము**

**"అందచంద మొలుకు ఛందస్సు రుచిగల్గి**
**యతులు గలిగి ప్రాసయతులు గలిగి**
**తీపిలయలు గలిగి తెలుగులో పద్యాలు**
**హొయలు గలిగి యెదదలూపగలవు"**

పెద్దపదవి

"ఏనుగెక్కినపుడు ఎత్తుగా కన్పించు
పొట్టివాడు గూడ పుడమినుండి
తెలివిలేని జడుడు తేజస్విగా దోచు
పెద్దపదవియన్న గద్దెమీద"

యంత్రనాగరకత

'యంత్ర నాగరకత యావజ్జగత్తులో
దొరతనమ్ము చేయదొడగె నేడు
మనిషి యంత్రమందు మరమేకుగా మారి
అస్వతంత్రుడగుచు అలమటించు!"

శాంతి

"విసిరివేయలేవు వింజామరలు వేయి
గగనమందు గ్రమ్ము కారుమబ్బు
ప్రజల గుండెలందు రగులు సంక్షోభమ్ము
త్రోసివేయలేవు శాసనాలు"

హక్కులు

"హక్కులున్నవనుచు ఆరాటపడనేల?
బాధ్యతలను మరిచి పౌరజనులు
పరమనిష్ఠతోడ బాధ్యతల్ నెరవేర్ప
అడుగకుండ వచ్చు హక్కులెల్ల."

క్షమ

"చదువు మీది మెట్లు సంస్కృతి – సహనముల్
చదువు క్రింది మెట్లు చాలగలవు
సంస్కృతికిని క్షమకు జనయిత్రి యొకతెయే
క్షమకు మీదిమెట్టు స్వర్గమొకటె."

'పన్నీటి జల్లు' కూడా ముక్తకాల సంపుటమే. ఇందులో 112 శీర్షికలున్నాయి. అవీ అకారాద్యనుక్రమణికలోనే. అంతేకాదు, ఈ 112 పద్యాలకి "రమ్యహాసలోల రామకృష్ణ" అని మకుటం వుంది. అన్నీ ఆటవెలదులే. వేమనపద్యాల సరణి, స్వరూపాన్నిబట్టి శతకప్రాయం. అని చెప్పి సంప్రదాయ కవిత్వం కాదు. ఆధునిక విషయాలపైన మాత్రమే అధిక్షేపాత్మకమైన రచన. స్వభావాన్నిబట్టి నవ్యకవిత్వమే. పన్నీటిజల్లు పరిమళాలకి కొన్ని మచ్చుతునకలు:

**అభ్యర్థి**

**"ఓడి విశ్రమింపలేదు గెల్చెడిదాక**
**ఎన్నికలకు నిల్చి ఎవ్వడైన**
**నెగ్గి ఓడు వరకు తగ్గబోడెవడైన**
**రమ్యహాసలోల రామ రామకృష్ణ"**

**ఆత్మహత్య**

**"పందుకొనెను రైలుపట్టాల కడ్డమ్ము**
**ఆత్మహత్య కొరకు అతివ యొకతె**
**ఆమె యెట్టికోక ఆపివేసెను రైలు ॥రమ్య॥**

**ఓట్లుకొనుట**

**"ఓట్లుకొనెడివాడు ఉరకే యిచ్చునా?**
**దాచిపెట్టినట్టి ధనము తెచ్చి!**
**అమ్మివేయగలడు అతడు దేశమ్మునే ॥రమ్య॥**

**తత్త్వమసి**

**"శౌర్యసాహసములు సార్వభౌముల జేసె**
**పెంచె దైవసంఖ్య పిరికితనము**
**నిన్ను నీవు తెలియ నీవె దేవుడవయా! ॥రమ్య॥**

**పరిపాలన**

**"నాడు–కుక్క–తోకనాడించుచుండెబో**
**దొరలు ఏలుచుండ భరతభూమి**
**నేడు–తోక–కుక్కనాడించుటకు పూనె ॥రమ్య॥**

**భీష్మద్రోణులు**

**"ఊరిలోన పెద్దలున్నార లెందరో**
**ద్రోణభీష్మసములు దొడ్డవారు**
**ఒక వికర్ణుడున్న ఇక చాలు వెదకరా!** ॥రమ్య॥

**విరోధాభాస**

**"తల్లి రత్నగర్భ, తనయుండు నిరుపేద**
**బాష్పధారగార్చు భరతమాత!**
**ఎంతవింతయైన దీ విరోధాభాస?** ॥రమ్య॥

ఇవి దయార్ద్రహృదయం, ఆధునికతామేధ కురిపించిన కన్నీటికణాల పన్నీటిజల్లులు. హాస్యరసశబలితమైన కరుణరస గుళికలు. సమాజ రుగ్మతలకి కస్తూరి గుళికలు! నండూరి రామకృష్ణమాచార్య "తారాతోరణం"లో కవిమాత్రుడు! "ప్రగతిగీత"లో ప్రవక్తభూతుడు!!



**సీ॥ తాటంకయుగ ధగద్ధగిత కాంతిచ్ఛటల్**
**చెక్కుటద్దములపైఁ జీరువాఱ,**
**నిటలేందు హరినీల కుటిలకుంతలములు**
**చిన్నారిమోముపైఁ జిందులాడ;**
**బంధుర మౌక్తిక ప్రకట హారావళుల్**
**గుబ్బపాలిండ్లపై గునిసియాడ;**
**కరకంకణ క్వణక్వణ నిక్వణంబులు**
**పలుమాఱు ఱాతిపైఁ బరిఢవిల్ల;**
**తే॥నోరచూపుల విటచిత్త మూఁగులాడ;**
**బాహుకుశలతఁ జక్కని మోహనాంగి**
**పాటఁబాడుచుఁ గూర్చుండి ఱోటిమీఁదఁ**
**బిండి రుబ్బంగఁ గన్నులపండువయ్యె!** (-శ్రీనాథుని చాటువు)

# రెండవభాగం

# 2. శిష్యుల గురువందనం

## 2.1 బెంగుళూరు విశ్వవిద్యాలయం

## తెలుగు అధ్యయనశాఖ చరిత్ర

**– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

నేను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతిలో 1961-63 మధ్య ఎం.ఏ తెలుగు చదివాను. 1963 నుండి 1968 వరకు "తెలుగు వీరగాథా కవిత్వం" అనే అంశాన్ని గురించి పరిశోదన చేశాను. 1969 ఫిబ్రవరి నెలలో నాకు పిహెచ్.డి. డిగ్రీవచ్చింది. ఉద్యోగాన్వేషణచేస్తూ బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్ పోస్టు ప్రకటన వస్తే దరఖాస్తు చేశాను. 1969 అక్టోబరు నవంబరు నెలల్లో కాబోలు ఇంటర్వ్యూకి పిలిచారు. మొత్తం పదముగ్గురు అభ్యర్థులు పోటీ పడ్డారు. అందులో నలుగురు పిహెచ్.డి.లు ఉన్నారు. వారిలో నేనొకణ్ణి. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ఆచార్య బిరుదురాజు రామరాజుగారు Experts గా వచ్చారు. రామరాజుగారు జానపద సాహిత్యవేత్త కావడంతో నన్ను ఇష్టపడ్డారు. అవధానిగారు కొంచెం అటూ ఇటూగా ఉన్నా మొత్తానికి ఒప్పుకున్నారు. ఆయన శ్రీ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు అనే పండితుని వైపు మొగ్గుచూపారు. అప్పటి acting Vice-chancellor, Govt. Educational Secretary శ్రీ సి. రామచంద్రన్ I.A.S గారు. విశ్వనాథశాస్త్రిగారికి అప్పటికే 55 సం॥లు ఉన్నాయి. నేను యువకుణ్ణి. అందువల్ల V.C. గారు నన్ను support చేశారు. నేను ఇంటర్వ్యూకూడా బాగా చేశాను. "It you take that old man, you have to advertise this post again in a few years. Take this young man!" అన్నారు. దీనితో అవధానిగారు కూడా అంగీకరించక తప్పలేదు.

నేను 1969 డిసెంబరు 27వ తేదీ శనివారం నాడు మధ్యాహ్నం Central College Acting Principal, Mathematics Professor "Narhona" గారికి నా Joing Report ఇచ్చాను. ఈ విధంగా నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో

అడుగుపెట్టాను. Kannada Department లో తెలుగు లెక్చరర్‌గా చేరాను. అప్పుడు Prof. R.S. ముగళి లేక రం.శ్రీ. ముగళిగారు Kannada Department Head. Dr. G.S. శివరుద్రప్పగారు, Dr. M. చిదానందమూర్తిగారు రీడర్లుగా ఉండేవారు.

ఆ రోజుల్లో Central College లో – అదే అప్పుడు Bangalore University - B.A. (Hons), B.Sc. (Hons0, M.A., M.Sc., M.Com. తరగతులుండేవి. B.A. (Hons), B.Sc. (Hons) తరగతులలో Second Language Electives లో Telugu ఒక Subject గా ఉండేది. అంతేకాకుండా, B.A. (Hons.) Kannada లో కూడా Second Langauge electives లో తెలుగు ఒక subject గా ఉండేది. సంస్కృతం, హిందీ, తెలుగు, తమిళం, ఫ్రెంచి మొదలైనవి ఈ elective subjects. నేను వచ్చేటప్పటికి మిత్రులు శ్రీ రత్నాకరం శంకరనారాయణరాజుగారు, శ్రీ దీక్షితులుగారు తెలుగు బోధించేవారు. రాజుగారు గవర్నమెంటు Arts & Science College లోను (దీనిని GAS College అనేవారు), దీక్షితులుగారు Maharani's మహిళా కళాశాలలోను పనిచేస్తూ ఉండేవారు. St. Joseph's College లో శ్రీ గడియారం సుబ్బయ్యశాస్త్రిగారు ఉండేవారు. శ్రీ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు కోలారు Govt. College లో పనిచేసేవారు. తరవాత బెంగుళూరులోని ప్రభుత్వ కళాశాలకు వచ్చారు.

B.A. (Hons), B.Sc. (Hons) లలో Second Language తెలుగును తెలుగులోనే బోధించవచ్చును. కాని B.A. (Hons), Kannada లో తెలుగును కన్నడంలో బోధించాలి. అప్పటికి నాకు కన్నడంలో ఒక్కముక్క రాదు.[1] వాళ్ళకి "మనుచరిత్ర"లో ప్రథమాశ్వాసం ఉండేది. దానిని చాలాకష్టపడి ఇంగ్లీషులో

1. ఆ రోజుల్లో తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా శ్రీవిష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు ఉండేవారు. ఒకసారి ఆ బోర్డు మీటింగుకు గురువర్యులు ప్రొ॥ జి.యన్.రెడ్డిగారు వచ్చారు. ఆ మీటింగు సందర్భంగా అక్కడికి వచ్చిన దీక్షితులుగారు (మహారాణి ప్రభుత్వ కళాశాల ఉపన్యాసకుడు) నన్ను కన్నడంలో ప్రశ్నించారు (నాకు కన్నడం రాదని తెలిసికూడా). ప్రక్కనే ఉన్న ప్రొ॥ జి.యన్.రెడ్డిగారు దీక్షితులుగారితో "కంగారు పడకండి – కొద్దిరోజులు ఆగండి. మా సుబ్బారావు కన్నడంలో మాట్లాడటమే కాదు, ఉపన్యాసం కూడా చేస్తాడు!" అన్నారు. అలాగే రెండేళ్లలో కన్నడం బాగా నేర్చుకొని, సెంట్రల్ కాలేజీ సెనేట్ హాలులో జరిగిన కన్నడ డిపార్ట్‌మెంట్ సెమినార్‌లో "పంప–నన్నయ" అనే అంశంమీద అనర్గళంగా ఉపన్యసించగా హాలంతా చప్పట్లతో దద్దరిల్లిపోయింది! ఇది గురువుల ఆశీర్వచన బలం!

బోధించేవాడిని. ఇలా కుదరదని, కష్టపడి మూడు నెలల్లో కన్నడం నేర్చుకొని, కన్నడంలో Diploma పరీక్షకూడా pass అయ్యి కన్నడంలో బోధించడం ప్రారంభించాను. కన్నడ భాషమీద పట్టు సాధించి, కన్నడంలో Research Papers వ్రాసి సెమినార్లలో పాల్గొనేవాడిని. కొన్నాళ్ళకు Prof. R.S. ముగళిగారు retire అయ్యారు. Dr. G.S. శివరుద్రప్పగారు Kannada Department Head అయ్యారు. Kannada M.A. లో 8 papers లో సంస్కృతం ఒక paper. శివరుద్రప్పగారు దానిని Elective గా చేసి, Sanskrit or Telugu గా మార్చారు. ఎందుకంటే Kannada Department లో నేను తెలుగు లెక్చరర్‌గా చేరాను కదా! నాకు work ఇవ్వడంకోసం. సంస్కృతంలో liberal గా మార్కులు వేస్తారు. అందువల్ల తెలుగు తీసుకుందుకు ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడు శివరుద్రప్పగారు, చెప్పాను కదా ఆయనకు తెలుగంటే అభిమానమని, Kannada M.A. క్లాసులోకి వెళ్ళి, “మీలో కోలారు జిల్లా వాళ్ళు ఎవరున్నారు?” అని ప్రశ్నించాను. 5 గురు విద్యార్థులు నిలబడ్డారు. “మీరంతా తెలుగు elective గా తీసుకోండి!” అని order చేశారు. అలాగ, మొదటి batch లో 1970-71 సం॥లో నాకు ఐదుగురు విద్యార్థులు లభించారు. వారికి ఎంతో శ్రద్ధగా, Intersting గా పాఠాలు చెప్పి, సంస్కృతంలో సమానంగా మార్కులు వచ్చేలా చేశాను. నా పేరు ప్రఖ్యాతులు విద్యార్థులలో వ్యాపించి, తరువాతి సంవత్సరంనుండి Telugu Electives కి తండోపతండాలుగా విద్యార్థులు రావడం ప్రారంభించారు. ఒక దశలో సంస్కృతం కన్నా తెలుగువారే ఎక్కువ విద్యార్థులుండేవారు.

నేను కన్నడం బాగా నేర్చుకుని, కన్నడ Seminars లో పాల్గొనడం ప్రారంభించాను. ఒకసారి Kannada Dept.లో “పంప-ఒందు అధ్యయన” అనే పెద్ద సెమినారు జరిగింది. ప్రొ॥ శివరుద్రప్పగారి సలహాపై నేను “పంప- నన్నయ” అనే తులనాత్మక వ్యాసం కన్నడంలో వ్రాసి, Central College Senate Hallలో జరిగిన ఆ సెమినార్‌లో చాలాబాగా చదివాను. ఎన్నో ప్రశంసలు పొందాను. అలాగే తరువాతి కాలంలో “కన్నడ సాహిత్య పరిషత్తు”లో జరిగిన ఒక సభలో “నాల్కు బగెయ తెలుగు కావ్య” (“నాలుగు రకాల తెలుగు కవిత్వం”) అనే paper చదివాను. Kannada Dept.ప్రచురించిన “సర్వజ్ఞ” గ్రంథంలో “వేమన-సర్వజ్ఞ - ఒందు తులనాత్మక అధ్యయన” వ్యాసం వ్రాశాను. ఇలాగ కన్నడశాఖలో ఒకడిగా కలిసిపోయాను. ప్రొ॥ శివరుద్రప్పగారి అభిమానాన్ని పొందాను.

నేను తిరుపతిలో Ph.D. పరిశోధన చేస్తున్న రోజులలో (1963–68 మధ్య) "English-Telugu Dictionary Scheme" ఒకటి ఆచార్య పింగళి లక్ష్మీకాంతగారు ప్రారంభించారు. దానిలో శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావుగారు చేరారు. వీరు గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా "కోవెలమూడి" అనే గ్రామానికి చెందినవారు. తెలుగు, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు అనే నాలుగు భాషల్లో గొప్ప పండితులు (చతుర్భాషాకోవిదులు). వీరు నాకన్న రెండు మూడేండ్లు ముందుగానే బెంగుళూరు వచ్చి, "ఆచార్య పాఠశాల కళాశాలలో" తెలుగు లెక్చరర్‌గా చేరారు. నేను 1969లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో చేరాక, వీరితో నాకు గాఢమైన మైత్రి ఏర్పడింది. వీరు తిరుపతిలో S.V.University Dictionary Scheme లో ఉండగానే, వీరితో నాకు కొంత పరిచయం ఉన్నా, Close Friendship మాత్రం బెంగుళూరు వచ్చాకే ఏర్పడింది. ఇద్దరం కలిసి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుపీఠం (Telugu Chair) ఏర్పాటు చేయడానికి పథకాలు రచించడం మొదలుపెట్టాం. బెంగుళూరులో Govt. Arts & Science College లో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీ విష్ణుభొట్ల విశ్వనాథ శాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో చాలా గొప్ప పండితులు. వీరు కూడా మాతోచేరి మాకు సలహాలు ఇస్తూ ఉండేవారు. వీరికి బెంగుళూరులో ఉన్న ఎందరో తెలుగు ప్రముఖులతో మంచి పరిచయాలు ఉండేవి. ఆ రోజుల్లో బెంగుళూరులోని "తెలుగు విజ్ఞానసమితి"కి శ్రీ చెలికాని అన్నారావుగారు President గా ఉండేవారు. విశ్వనాథశాస్త్రిగారు Vice-President అయ్యారు. వీరు మైసూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా ఉన్న కె. సుబ్బరామప్పగారి దగ్గర (ఎఱ్ఱన కృతులపై) పరిశోధనచేసి, Ph.D. డిగ్రీ పొందారు.

1971లో తిరుపతిరావుగారు నా దగ్గర Ph.D. Research కి చేరారు. నేను Kannada Dept. లో లెక్చరర్‌ని. అందువల్ల Dept. Head అయిన శివరుద్రప్పగారు అంగీకరించాలి. ఆయన సంతోషంగా ఒప్పుకున్నారు. అప్పటికి కన్నడంలో ఎవ్వరూ Ph.D. కి చేరలేదు. తిరుపతిరావుగారికి నంది తిమ్మన పారిజాతాపహరణం అన్నా, అందులోని సత్యభామపాత్ర అన్నా చాలా ఇష్టం. కన్నడ శాఖలో పరిశోధన కాబట్టి, కన్నడ భాషను కూడా కలుపుకోవాలని "నందితిమ్మన పారిజాతాపహరణము – రుద్రభట్టు జగన్నాథ విజయ – తులనాత్మక

అధ్యయనం" అనే పేరుతో చాలా గొప్ప పరిశోధన చేసి, 1973లో Ph.D. డిగ్రీపొందారు. ఇది బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగులోనే కాదు, కన్నడశాఖలో కూడా మొట్టమొదటి Ph.D.

తిరుపతిరావుగారు రీసెర్చికి చేరిన సంవత్సరంలోనే, అంటే 1971లోనే, నేనూ, తిరుపతిరావుగారూ, విశ్వనాథశాస్త్రిగారు కలిసి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఒక తెలుగుపీఠం స్థాపించడానికి ప్రయత్నాలు ముమ్మరం చేశాం. అదృష్టవశాత్తు, అప్పుడు శ్రీ P.V. నరసింహారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నారు. ఆయన గొప్ప సాహిత్యప్రియుడు, బహుభాషావేత్త. విశ్వనాథ వారి "వేయిపడగలు" నవలను "సహస్రఫణ్" అనే పేరుతో హిందీభాషలోకి అనువదించిన మహానుభావుడు. ఆ నరసింహారావుగారికి లేఖ వ్రాయాలని నిర్ణయించాం. ముగ్గురం కలిసి లేఖ సిద్ధం చేశాం. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుపీఠం స్థాపించడానికి సహాయం చేయమని కోరుతూ ఆ లేఖ వ్రాశాం. ఆ లేఖను మేమే Direct గా పంపితే అంత effect ఉండదని గ్రహించాం. బెంగుళూరులో ప్రాచీనమైనదీ, పెద్దదీ, 1952లో తెన్నేటి విశ్వనాథంగారిచేత స్థాపించబడినదీ అయిన "తెలుగు విజ్ఞానసమితి" ద్వారా పంపించాలని నిశ్చయించాం. మా విశ్వనాథశాస్త్రిగారికి ఇచ్చాం. ఆయన అప్పుడు సమితి ఉపాధ్యక్షులు; చెలికాని అన్నారావుగారు అధ్యక్షులు. శాస్త్రిగారు ఆ లేఖను అన్నారావుగారి చేతికిచ్చారు. ఆయన ఎంతో సంతోషించి, దానిని executive committee లో పెట్టి పాస్ చేయించి, హైదరాబాద్‌లోని ముఖ్యమంత్రి ఆఫీసుకి పంపించారు. అంతే! వారం రోజుల్లో సాహితీ ప్రియంభావుకులైన శ్రీ పి.వి. నరసింహారావుగారు మూడు లక్షల రూపాయల గ్రాంటును బెంగుళూరు విశ్వవిద్యాలయానికి Sanction చేశారు! ఆ రోజుల్లో (1971లో) 3 లక్షలు అంటే, ఇప్పుడు మూడు కోట్ల రూపాయలతో సమానం! Grant వచ్చిన విషయం నాకు తెలియలేదు. అయిన Dept.Head Prof. G.S.శివరుద్రప్పగారికీ తెలియదు. గవర్నమెంటుతో వ్యవహారం కదా! అంత తొందరగా సమాధానం వస్తుందని ఊహించలేదు మేము.

నేను 1969 డిసెంబరులో (27వ తేదీ, శనివారంనాడు) బెంగుళూరు విశ్వవిద్యాలయంలో చేరినప్పుడు Govt. Educational Secretary శ్రీ సి.

రామచంద్రన్ I.A.S. గారు Acting V.C. తరువాత కొన్నాళ్ళకి Regular V.C. ని appoint చేశారు. ఆయన పేరు శ్రీ T.K. తుకోల్‌గారు; Retired Chief Justice of Karnataka High Court.

Prof. G.S. శివరుద్రప్పగారు చాలా గొప్పవ్యక్తి. ఆయన కొత్త V.C.ని చూడటానికి వెడుతూ, వారితోపాటు నన్ను కూడా తీసికొని వెళ్ళారు. నేను afterall ఒక చిన్న లెక్చరర్‌ని. అయినా ఆయన నాకు గొప్ప గౌరవాన్నిచ్చి V.C.దగ్గరకు తీసికొని వెళ్ళారు. నన్ను పరిచయం చేస్తూ "He is Dr. T.V. Subba Rao, newly appointed Telugu lecturer in our Dept. " అన్నారు.

వెంటనే తుకోల్‌గారు: "Yes, Yes. We received a grant of Rs.3 lakhs from the Govt. of A.P. What shall I do with it?" అన్నారు నా వైపు తిరిగి. నేను వెంటనే "You can start P.G. Dept. in Telugu Sir!" అన్నాను; నేను అనలేదు, దైవం నాచేత అలా అనిపించింది. నిజానికి ఆ Grant "Telugu Chair" ఏర్పాటు చేయడంకోసం.

V.C. గారు: "Yes, Yes! We will see!" అన్నారు.

తుకోల్‌గారు ఉన్న మూడేళ్ళలోనూ ఏ ప్రయత్నాలూ జరగలేదు. 1973లో Dr. H. నరసింహయ్యగారిని V.C. గా appoint చేశారు. ఆయన కోలారు జిల్లాకు చెందిన తెలుగువాడు. మనసులో తెలుగంటే చాలా అభిమానం కలవాడు. ఆయన A.P. Govt. ఇచ్చిన గ్రాంటుతో తెలుగు P.G. Dept. ప్రారంభించడానికి ఎంతో కృషి చేశారు. వారికి Kannada Head of the Dept. గాను, Dean గాను ఉన్న ప్రొ॥ శివరుద్రప్పగారు ఎంతో support ఇచ్చారు.

మిత్రులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారికి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారంటే చాలా ఇష్టం. విశ్వనాథవారికి 1970లో జ్ఞానపీఠ బహుమతి వచ్చింది – రామాయణ కల్పవృక్ష రచనకు. వారికి బెంగుళూరులో ఘనంగా సన్మానంచేయాలని తిరుపతిరావుగారు తలపెట్టారు. నేను వారికి కుడిభుజంగా పనిచేశాను. 1973 ఫిబ్రవరి 17వ తేదీని బెంగుళూరు గాయన సమాజంలో పెద్ద ఎత్తున సన్మానం చేశాం. ఉదయం 10 గంటలనుండి మధ్యాహ్నం 2.00 గంటవరకూ కల్పవృక్షంపై సెమినారు చేశాం. ప్రొ॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు, ప్రొ॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు,

Dr. T.B.M. అయ్యవారుగారు, ఉషశ్రీగారు శ్రీ రత్నాకరం శంకరనారాయణ రాజుగారి గోష్ఠిలో పాల్గొన్నారు. సాయంత్రం 5 గంటలకు సన్మానం. బెంగుళూరు విశ్వవిద్యాలయం V.C. Dr. H. నరసింహయ్యగారు అధ్యక్షులు. Retired Chief Justice of Karnataka High Court శ్రీ నిట్టూరి శ్రీనివాసరావుగారు కూడా ఈ సభలో విశిష్ట అతిథిగా పాల్గొన్నారు. విశ్వనాథవారి కన్నా ముందుగా జ్ఞానపీఠ బహుమతి పొందిన ప్రొ॥ కె.వి. పుట్టప్పగారిని కూడా ఈ సభకు పిలిచాం కాని వారు రాలేనన్నారు. సభ తెలుగువారితో కిటకిటలాడి పోయింది. ఆ సభలో తిరుపతిరావుగారు విశ్వనాథవారిచేత ఒక మాట అనిపించారు. "ఇక్కడ ఇంత మంది తెలుగు వాళ్ళున్నారు కదా! బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ. ఎందుకు ప్రారంభించకూడదు?" అన్నారు విశ్వనాథ. వెంటనే సభాధ్యక్షులు, బెంగుళూరు విశ్వవిద్యాలయ V.C. అయిన Dr. H. నరసింహయ్యగారు– "తప్పకుండా త్వరలో ప్రారంభిస్తాం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారినుండి మాకు గ్రాంటుకూడా వచ్చింది!" అని ప్రకటించారు. సభంతా చప్పట్లతో మారుమ్రోగింది!

తరువాత కొన్నాళ్ళకు V.C. నరసింహయ్యగారు Telugu P.G. Dept. Billను మొదట Academic Council లో ప్రవేశపెట్టారు. ఒక వీర కన్నడాభిమాని లేచి – "మనం ఇక్కడ తెలుగు P.G. Dept. ప్రారంభిస్తాం, సరే! హైదరాబాద్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో Kannada P.G. Dept. ఉందా?" అని గట్టిగా బల్లగుద్ది ప్రశ్నించాడు. వెంటనే మహానుభావుడు ప్రొ॥ జి.యస్. శివరుద్రప్పగారు లేచి – "ఉంది! చాలా ఏండ్లుగా ఉంది. నేను ఆ కన్నడ శాఖలో కొన్నేళ్లు పనిచేసి ఇక్కడికి వచ్చాను!" అంటే, ఆ వీరకన్నడిగుడు నోరుమూసుకున్నాడు. Bill Pass అయింది. ఎవరైనా స్వభాష మీద దురభిమానంతో ఉంటారు. ఇతర భాషలను ద్వేషిస్తారు. కాని ప్రొ॥ శివరుద్రప్పగారు ఎంతో విశాల హృదయంతో తెలుగు P.G. శాఖను గట్టిగా సమర్థించారు. ఫలితంగా 1974 జూన్-జూలై నెలల్లో తెలుగు P.G. శాఖ ప్రారంభమయింది. ప్రొ॥ శివరుద్రప్పగారి చేతులమీదుగానే ప్రారంభమహోత్సవం జరిపించాను. ఈ తెలుగుశాఖ స్థాపనకు మూలకారకులైన త్రిమూర్తులు – A.P.C.M. శ్రీ P.V. నరసింహారావుగారు, B.U.B.V.C. Dr. H. నరసింహయ్యగారు, అప్పటి Dean & Kannada Head of the Dept. శివరుద్రప్పగారు. వీరి ఫోటోలు Dept.లో ఏర్పాటు చేశాను–వారి ఎడల నాకుగల కృతజ్ఞతాభావంతో...

1974-76లో తెలుగు ఎం.ఏ. మొదటి Batch ప్రారంభమయింది. 18మంది విద్యార్థులు చేరారు. నేను ఒక్కడినే Lecturer. లెక్చరర్‌గా ఉన్నవాడు హెడ్ కావడానికి వీలులేదు. అందువల్ల Arts Faculty Dean అయిన ప్రొ॥ G.S.శివరుద్రప్పగారే తెలుగు Dept.కి కూడా Head గా వ్యవహరించారు. డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు, డా॥ చెన్నాప్రగడ తిరుపతిరావుగారు, శ్రీరత్నాకరం శంకరనారాయణరాజుగారు - వీరు ముగ్గుర్నీ Guest Lecturers గా తీసుకున్నాను. విశ్వనాథశాస్త్రిగారు, శంకరనారాయణ రాజుగారు అప్పుడు గవర్నమెంటు కాలేజిల్లోను, తిరుపతిరావుగారు ఆచార్య పాఠశాల కాలేజీలోను లెక్చరర్స్‌గా ఉండేవారు. ముగ్గురూ ఉద్దండ పండితులు; సంస్కృతాంధ్రాల్లో దిట్టలు. ఈ ముగ్గురు మహానుభావులతో కలిసి తెలుగుశాఖను ప్రారంభించడం, వారితో కలిసి పనిచేయడం నాకు చాలా గర్వకారణం. నలుగురం కలిసి విద్యార్థుల్ని బాగా తయారుచేశాం.

1976లో M.A. మొట్టమొదటి batch పరీక్షకు వెళ్లింది. నేను కేవలం లెక్చరర్‌ని. అందువల్ల నన్ను Examinar గా నియమించలేదు. Examination Board లో ఉండాలంటే కనీసం Reader అయినా అయి ఉండాలి. మొదటి batch M.A. papers అన్నింటికీ రెండు valuations కీ external examiners నే నియమించారు. Internal Assessment 10 మార్కులు మాత్రం నా చేతిలో ఉంచారు. విద్యార్థులు ఏమౌతారో Results ఏ విధంగా వస్తాయో అని నేను చాలా భయపడ్డాను. మొదట 18 మంది విద్యార్థులకూ సమానంగా ఐదేసి మార్కులు కలిపివేశారు. అయినా నా భయం పోలేదు. Internal Assessment Marks list పంపించే ముందు మిగిలిన ఐదేసి మార్కులు కూడా అందరికీ సమానంగా వేసి list పంపించాను. ఒక్కొక్క విద్యార్థికి 1st valuation లో ఎన్నెన్ని మార్కులు వచ్చాయి? 2nd valuation లో ఎన్నెన్ని మార్కులు వచ్చాయి? ఏమీ నాకు తెలియదు. అంతా blind గా ఉంది. అందువల్ల ఒక్కొక్క విద్యార్థికి నా చేతిలో ఉన్న 10 మార్కులు Internal Assessment భేదం లేకుండా అందరికీ సమానంగా పంచివేశాను. ఫలితాలు వెలువడ్డాయి. ముగ్గురు విద్యార్థులకు ఈ క్రింది విధంగా మార్కులు వచ్చాయి. అన్ని పేపర్లూ కలిసి Average marks: కె. సౌజన్యకుమారి - 61, సి.జయలక్ష్మి-60, ఎం. రుక్మాంద నాయుడు-59.

సౌజన్యకుమారి, జయలక్ష్మి సంతోషించారు. రుక్మాంగదనాయుడు చిన్న బోయాడు. ఎందుకంటే ఒక్కమార్కులో First Class తప్పిపోయినందుకు. అతనికి నా పరిస్థితిని explain చేశాను. అతడు సంతృప్తిచెంది, ఇప్పటికీ నాయందు గొప్ప ఆరాధనా భావంతో ఉన్నాడు. అతనికి ఉద్యోగం కూడా నేనే ఇప్పించాను. P.E.S. College Principal Prof. M. దొరస్వామి నాయుడుగారికి phone చేసి చెప్పాను. ఆయన దయతో రుక్మాంగదనాయుడికి ఉద్యోగం ఇచ్చారు. కాని Marks Card చూసి "ఇదేమిటి? 59 మార్కులేమిటి? ఇంకో మార్కు వేసి First Class ఇవ్వచ్చుకదా!" అన్నారట. నేను జరిగిన విషయాన్ని నా అసహాయతను వారికి phoneలో వివరించాను. నేను Reader కాక పోవడం వల్ల, Head of the Dept. కాలేకపోయాను. Examinership రాలేదు. దానివల్ల 1st batch విద్యార్థులు కొంత దెబ్బతిన్నారు.

1978లో నేను Reader అయ్యాను;Head of the Dept. కూడా అయ్యాను. Board of Studies Chairman, Board of Examiners Chairman అన్నీ వచ్చాయి.

ప్రతిసంవత్సరం 10 మందికి తక్కువ కాకుండా విద్యార్థులు వచ్చి చేరుతున్నారు. ముఖ్యంగా కర్ణాటక రాష్ట్రానికి సమీపంలో ఉన్న అనంతపురం జిల్లా, చిత్తూరుజిల్లాలనుండి, తమిళనాడులోని హోసూరు తాలుకానుండి విద్యార్థులు వచ్చేవారు. అయితే బయటనుండి వచ్చే S.C., S.T., B.C. విద్యార్థులకు ఒక ఇబ్బంది వచ్చింది. కర్ణాటకరాష్ట్రంలోని S.C., S.T., B.C. లకు తప్ప ఆంధ్రప్రదేశ్ నుండి వచ్చే ఈ తరగతి విద్యార్థులకు ఇక్కడి ప్రభుత్వం స్కాలర్‌షిప్ ఇవ్వడం మానివేసింది. దీనితో విద్యార్థుల సంఖ్య క్రమంగా తగ్గుతూ వచ్చింది.

నేను 1980లో గుల్బర్గా విశ్వవిద్యాలయానికి Controller of Examinations గా deputation మీద వెళ్ళాను. Academic field వదిలేసి, Administration field లోకి వెళ్ళడం వల్ల చాలా ఇబ్బందులకు లోనయ్యాను. మూడేళ్ళు అక్కడ అవస్థలు పడి తిరిగి వచ్చే సరికి బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో చాలా మార్పులు వచ్చేశాయి. మైసూరులోని యువరాజా కళాశాలలో తెలుగు రీడర్‌గా పనిచేస్తున్న డా॥ బాడాల రామయ్యగారు ఇక్కడ Professor & Head గా నియమితులయ్యారు. డా॥ జి.ఎస్. మోహన్, డా॥ సి. జయలక్ష్మి లెక్చరర్స్‌గా

నియమితులయ్యారు. నేను Reader గా Dept.లో చేరాను. 1983 నుండి 1990 వరకు రామయ్యగారు మన తెలుగు శాఖలో పనిచేశారు. నేను 1987లో Professor & Head of the Dept. అయ్యాను.

మన తెలుగుశాఖలో తులనాత్మక అధ్యయనాలు ఎక్కువగా జరిగాయి. కవిత్రయ భారతంలోని రెండు రెండు పర్వాలు తీసికొని వ్యాసభారతంతో పోల్చడం, "పంప-నన్నయ", "తెలుగు కన్నడ భారతాలలో కర్ణుడు", "వేమన - సర్వజ్ఞ - తిరువళ్ళువర్", "తెలుగు-కన్నడ భాషలలో పొడుపుకథలు" మొదలైనవి ఎన్నో జరిగాయి. అసలు Dept. ప్రారంభం కాకముందే శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావుగారు నందితిమ్మన పారిజాతాపహరణాన్ని - రుద్రభట్టు జగన్నాథ విజయంతోను, హరివంశంతోను, విష్ణుపురాణంతోను పోల్చి చాలా గొప్ప థీసిస్ వ్రాశారు. తరువాత వారి అమ్మాయి. శ్రీమతి చన్నాప్రగడ జయలక్ష్మి "విశ్వనాథ రామాయణ కల్పవృక్షాన్ని కువెంపు రామాయణ దర్శనంతో పోలుస్తూ మంచి పరిశోధనచేసి డాక్టరేటు పట్టాను పొందింది. ఈ రెండు సిద్ధాంత గ్రంథాలూ నా దగ్గర వచ్చిన పరిశోధన లన్నింటిలోకి ఉత్తమోత్తమమైనవి. ఈనాటికీ మన తెలుగుశాఖలో మంచి పరిశోధనలు జరుగుతున్నాయి.

నేను 1995లో అక్టోబరు నెలలో రిటైరయ్యాను. Academic year end వరకు - అంటే 1996 ఏప్రిల్ వరకూ extension ఇచ్చారు. చివరికి 1996 ఏప్రిల్ 17వ తేదీని ఉద్యోగ విరమణ చేశాను. నా తరువాత ప్రొ॥ జి.ఎస్. మోహన్, ఆ తరువాత ప్రొ॥ చన్నాప్రగడ జయలక్ష్మి తెలుగుశాఖకు మార్గదర్శకత్వం వహించారు. నేనుండగానే డా॥ కొలకలూరి ఆశాజ్యోతిని Research Assistantగా తీసుకున్నాను. తరువాత ఆమె క్రమక్రమంగా లెక్చరర్‌గా, Reader గా, Professor and Head of the Dept. గా అయింది. ఇప్పుడు తెలుగుశాఖ ఆమె ఆధ్వర్యంలో మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది! ఆమెకు నా శుభాశీస్సులు...

(08-12-2020 నాడు బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖ నిర్వహించిన ఒక "వెబినార్"లో నేను చేసిన ప్రసంగం)



## 2.2 చి॥ రుక్మాంగదనాయుడుకి 59% మార్కులువచ్చిన కథ

తెలుగు ఎం.ఏ. 1974-76 సంవత్సరాలలో చదివిన మొట్టమొదటి బ్యాచ్‌లో 18 మంది విద్యార్థులు ఉండేవారు. ఈ 18 సంఖ్య భారతీయ సంస్కృతిలో చాలా గొప్ప సంఖ్య. వ్యాస మహాభారతంలో 18 పర్వాలున్నాయి. కురుక్షేత్ర సంగ్రామం 18 రోజులు జరిగింది. ఆ యుద్ధంలో 18 అక్షౌహిణుల సేనలు పాల్గొన్నారు. ఆ రణరంగ ప్రారంభంలో శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన భగవద్గీతలో కూడా 18 అధ్యాయాలే ఉన్నాయి. అందువల్ల నేను 18 మంది విద్యార్థులతో ప్రారంభించిన తెలుగుశాఖ ఈనాడు స్వర్ణోత్సవాలు జరుపుకుంటోందని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. ఇప్పుడు "59% మార్కుల కథ"లోకి వెడదాం.

1974-76లో నేను కేవలం లెక్చరర్‌ని మాత్రమే. ఐదు సంవత్సరాల పి.జి. టీచింగ్ అనుభవంలేదు. అందువల్ల Dean, Faculty of Arts అయిన ప్రొ॥ జి.యస్. శివరుద్రప్పగారు Head of the Department of Telugu. ఎం.ఏ. విద్యార్థుల పరీక్షల పేపర్ల Valuation (Internal and External) రెండూ బయటి విశ్వవిద్యాలయాలలోని ప్రొఫెసర్లకే ఇచ్చారు. నా చేతిలో కేవలం 10 మార్కుల Internal Assessment మాత్రమే ఉంచారు. 1976 మార్చి-ఏప్రిల్ మాసాలలో పరీక్షలు జరిగాయి. Internal Assessment పంపమని నాకు వర్తమానం వచ్చింది. 18 మంది విద్యార్తులకూ ఒక్కొక్కరికి ఐదేసి మార్కుల చొప్పున వేసి, ఆ Marks Sheet ను Controller of Examinations కి పంపుదామని సిద్ధమయ్యాను. ఇంతలో మనస్సులో భయం పట్టుకుంది. "ఈ పిల్లలు పరీక్షలు ఎలా వ్రాశారో ఏమిటో! రెండు మూల్యాంకనలూ బయటి ప్రొఫెసర్లవి. వాళ్ళు మార్కులు ఉదారంగా వేశారో! లేక పిసినిగొట్టుల్లా వేశారో! ఎందుకైనా మంచిదని నా చేతిలో ఉన్న పది మార్కులూ 18 మంది విద్యార్థులకు సమానంగా పంచివేశాను (ధర్మరాజులాగ!). Marks Sheet పంపించివేశాను.

జూన్-జూలై మాసాలలో ఫలితాలు వచ్చాయి. జయలక్ష్మికి, సౌజన్యకుమారికి just first classes (60-61 మార్కులు) వచ్చాయి. రుక్మాంగదనాయుడికి first class just miss అయ్యింది. (59 మార్కులు వచ్చాయి). అంటే నిజంగా సౌజన్యకుమారికి 51 మార్కులు, జయలక్ష్మికి 50 మార్కులు, రుక్మాంగదనాయుడికి 49 మార్కులు మాత్రమే వచ్చాయన్నమాట! నేను Internal Assessment పదేసి

మార్కులు వేయడంవల్ల ఆ సంఖ్యలు సౌజన్యకుమారికి–51+10=61; జయలక్ష్మికి – 50+10=60; రుక్మాంగదనాయుడికి–49+10=59గా మారాయి. దీనిలో నా ప్రమేయం ఏమీ లేదు; నాయుడికి ఒక్కమార్కు కలిపే అధికారంకాని, అవకాశంకాని నాకులేదు. తరవాత ఉద్యోగంకోసం నాయుణ్ణి P.E.S. College Principal and Director అయిన నా మిత్రులు ప్రొ॥ ఎం.ఆర్. దొరస్వామి నాయుడుగారి దగ్గరకు పంపించాను. ఆయన రుక్మాంగదనాయుడి Marks Card చూచి: "ఇదేమిటి? సుబ్బారావు ఇలా చేశాడు? ఒక్క మార్కు వేసి నీకు first class ఇవ్వలేదా?" అన్నారట. ఈ విషయం రుక్మాంగదనాయుడే నాకు చెప్పాడు. నేను నా అశక్తతను, నిస్సహాయతను నాయుడికి చెప్పాను. అతడు విషయం గ్రహించాడు. ఇప్పటికీ నా మీద ఎంతో గురుభక్తితో ఉంటాడు.

తరువాత రుక్మాంగదనాయుడు నా దగ్గర Ph.D. చేశాడు. ("రాయప్రోలువారి కవిత్వం"గురించి). P.E.S. College లో తెలుగు ప్రొఫెసర్‌గా రిటైరయిన తర్వాత "Sri Krishna Group of Institutions" అనే పెద్ద విద్యాసంస్థను ఏర్పాటు చేసి, మూడు పువ్వులు ఆరుకాయలుగా ఎంతో అభివృద్ధిలో ఉన్నాడు!

**గమనిక:–** మైడియర్! నాయుడూ! ఈ విషయాలు నువ్వు చదివి, తర్వాత మీ దొరస్వామినాయుడుగారికి చదివి వినిపించు! ఇలా చేసిన తర్వాత నాకు ఫోను చేసి చెప్పు! సంతోషిస్తాను! అప్పుడు నా మనస్సు తేలికగా ఉంటుంది!

## 2.3 "వెండికొండ" మోహన్!–"సువర్ణసుందరి" ఆశాజ్యోతి!!:

నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు అధ్యయనశాఖను 1974 జూలై నెలలో స్థాపించాను. 1999 జూలై నెలకి 25 సం॥లు పూర్తి అయ్యాయి ("రజతోత్సవం"). అప్పటి శాఖాధ్యక్షుడైన ఆచార్య జి.యస్. మోహన్ 2000 సం॥ జనవరి నెలలో తెలుగుశాఖ రజతోత్సవాలు మూడురోజులపాటు ఘనంగా నిర్వహించాడు. తెలుగుశాఖను ప్రారంభించిన నేను, విశ్వనాథశాస్త్రిగారు, శంకరనారాయణరాజుగారు, తిరుపతిరావుగారు, సెంట్రల్‌కాలేజి సెనేట్‌హాలులో జరిగిన ఆ రజతోత్సవసభలకు హాజరయ్యాం. అందువల్ల చి॥ మోహన్‌ని "రజతమోహనుడు" లేదా "వెండికొండ" అని పిలుస్తున్నాను!

అలాగే మన తెలుగు అధ్యయనశాఖకు 2024 జూలై మాసంతో 50 సం॥లు నిండుతాయి ("స్వర్ణోత్సవం"). ఈనాటి శాఖాధ్యక్షురాలైన ఆచార్య కె. ఆశాజ్యోతి

తన సువర్ణహస్తాలతో ఆ స్వర్ణోత్సవం ఘనంగా జరగబోతోంది. ఈ స్వర్ణోత్సవాలు ఈ సంవత్సరం (2023) జూలై మాసంలోనే ప్రారంభించవచ్చును. అప్పుడే ఈ "గురువందనం-2022" అనే గ్రంథాన్ని కూడా ఆవిష్కరింపజేస్తానని ప్రొ॥ ఆశాజ్యోతి నాతో చెప్పింది. నేను ఎంతో ఆనందించాను. ఆమెను మన తెలుగు అధ్యయనశాఖ పాలిటి "సువర్ణసుందరి"గా అభివర్ణిస్తున్నాను.

నేను స్థాపించిన తెలుగుశాఖకు "వెండిపండుగ" ("బెళ్ళిహబ్బ")ను జరిపిన చి॥ మోహన్‌కు, "బంగారుపండుగ" ("హొన్నుహబ్బ") జరుపబోతున్న చి॥సౌ॥ ఆశాజ్యోతికి ఆయురారోగ్యసంపత్సపరంపరాభివృద్ధిని ఆకాంక్షిస్తున్నాను. ఈ రెండు పండుగలు చూచే అదృష్టాన్ని నాకు ప్రసాదించిన ఆ పరమేశ్వరునకు భక్తి ప్రపత్తులతో సాష్టాంగనమస్కారాలు అర్పిస్తున్నాను... (-తంగిరాల)

## 2.4 ఈ గ్రంథముద్రణకు ముఖ్యకారణం:-

బెంగుళూరు విశ్వవిద్యాలయంలోని తెలుగు అధ్యయనశాఖలో నా దగ్గర చదువుకున్న పూర్వవిద్యార్థులు నామీదగల భక్తితో 2010లో ఒకసారి, 2022లో మరొకసారి "గురువందనం" అనే పేరుతో నన్ను, మిగిలిన అధ్యాపకులను మిక్కిలి ఘనంగా సన్మానించారు. దీనికి కొన్ని లక్షల రూపాయలు (సుమారు రెండు మూడు లక్షలు) ఖర్చుపెట్టి ఉంటారు. వారికి నేను ఎంతో ఋణపడి ఉన్నాను. వారి ఋణం తీర్చుకుందుకు నేను కూడా సుమారు రెండు లక్షల రూపాయలఖర్చుతో ఈ పుస్తకాన్ని ముద్రిస్తున్నాను. దీంట్లో రంగుల ఫోటోలు 112 పేజీలు ఉన్నాయి. వీటి ముద్రణకే నాకు రూ. 70,000/- ఖర్చు అయింది. అయినా ఫరవాలేదు; పూర్వవిద్యార్థులు "గురువందనం" కార్యక్రమానికి ఖర్చుపెట్టిన ధనంతో పోలిస్తే ఇది లెక్కలోకిరాదు. ఈ గ్రంథముద్రణకు ఎందరో మిత్రులు, శిష్యులు ధనసహాయం చేశారు. అలాగే తెలుగుశాఖను గురించి నాకు కావలసిన విషయాన్ని (ఇన్‌ఫర్మేషన్‌ను) ఎప్పటికప్పుడు అతిశీఘ్రంగా అందజేసినది నేటి శాఖాధ్యక్షురాలైన ఆచార్య కె. ఆశాజ్యోతి. అలాగే పూర్వవిద్యార్థుల సెల్‌ఫోన్ నెంబర్లను, ఇతర విషయాలను తెలియజేసినవాడు నా పూర్వవిద్యార్థి శ్రీ ఏటిగడ్డ అశ్వత్థనారాయణ. వీరిద్దరికీ నా కృతజ్ఞతలు! నా అనంతమైన ఆశీస్సులు...!!

**- తంగిరాల వెంకట సుబ్బారావు**



# 2.5 గురువందన కార్యక్రమం

## (పూర్వవిద్యార్థుల సమావేశం)

**– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**తేది: 10-06-2022, శుక్రవారం (ఉదయం 11 గంటల నుండి సాయంకాలం 4 గంటలవరకు)**

**స్థలం: డా॥ కె. వెంకటగిరిగౌడ ఆడిటోరియం, జ్ఞానభారతి, బెంగుళూరు విశ్వవిద్యాలయం.**

ఎంతో భక్తి శ్రద్ధలతో నాకు ఇతర అధ్యాపకులకు అత్యద్భుతంగా, మిక్కిలి ఘనంగా సన్మానం చేశారు. సుమారు 60 మంది విద్యార్థులు తమ తమ కుటుంబాలతో సహా సమావేశమయ్యారు. ప్రస్తుతం తెలుగుశాఖలో ఉన్న అధ్యాపకులు, పరిశోధన విద్యార్థులు, ఎం.ఏ. విద్యార్థులు కూడా ఈ సభలో పాల్గొన్నారు. సభావేదికను (హాలును) ఎంతో సుందరంగా పూలతో అలంకరించారు. సభకు ప్రస్తుతం తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షురాలు ప్రొ॥ కె. ఆశాజ్యోతి అధ్యక్షత వహించారు. బెంగుళూరు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ప్రొ॥ కె.ఆర్. వేణుగోపాల్‌గారు జ్యోతి ప్రజ్వలనం చేసి సభను ప్రారంభించారు. ఆచార్య తంగిరాలు వెంకట సుబ్బారావు, ఆచార్య జి.ఎస్. మోహన్, డా॥ దివాకర్ల రాజేశ్వరి సభలో పాల్గొన్నారు. ప్రొ॥ ఆశాజ్యోతి సభను నిర్వహించారు. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఆచార్య తంగిరాల, ఆచార్య మోహన్, డా॥ రాజేశ్వరి, డా॥ టి. నారాయణ, డా॥ పి.బి. శివణ్ణ (కన్నడ ఎం.ఏ. పూర్వవిద్యార్థి) సభనుద్దేశించి ప్రసంగించారు.

మధ్యాహ్నం 1.30 గంటలనుండి 2.30 గంటలవరకు భోజన విరామం. భోజన విరామం తరువాత తిరిగి సభ మధ్యాహ్నం 2.30 గంటలనుండి సాయంకాలం 4 గంటలవరకు కొనసాగింది. పూర్వవిద్యార్థులు బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖలో తాము తెలుగు ఎం.ఏ. చదువుకొనిన రోజుల్ని నాటి అనుభవాలను తన్మయత్వంతో నెమరువేసుకున్నారు. డా॥ ఇ. నాగరాజు, డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి, శ్రీ ఎం. రవిశేఖర్, శ్రీ ఏటిగడ్డ అశ్వత్థ నారాయణ, శ్రీ ఎ. గురుమూర్తి, శ్రీ జి.కృష్ణప్ప, శ్రీ జి. చిత్తనగిరి, శ్రీ కె.

లక్ష్మీనారాయణ, శ్రీమతి ఎన్. రాజేశ్వరి, శ్రీమతి కె. మంజులమ్మ, శ్రీ ఎ. చిట్టిబాబు మొదలైన పూర్వవిద్యార్థులు ఎంతో అనర్గళంగా ప్రసంగాలు చేసి సభను ఆకట్టుకొన్నారు.

తరువాత గురుసత్కారం జరిగింది. ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు, ఆచార్య జి.ఎస్. మోహన్, ఆచార్య కె. ఆశాజ్యోతిగార్లను పూర్వ విద్యార్థులు ఘనంగా సత్కరించారు. అనారోగ్యంతో సభకురాలేకపోయిన ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మిగారు వీడియోలో తమ సందేశాన్ని వినిపించారు. డా॥ ఇ. నాగరాజు వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది. 2024లో జరుగబోయే తెలుగు అధ్యయనశాఖ స్వర్ణోత్సవాలకు అందరూ వచ్చి ఇలాగే ఉత్సాహంతో పాల్గొనాలని విజయవంతం చేయాలని ప్రొ॥ ఆశాజ్యోతి అందరినీ కోరగా అందరూ సంతోషంగా అంగీకరించారు. సభానంతరం కొందరు విద్యార్థులు ప్రొ॥ జయలక్ష్మి గారి యింటికి వెళ్ళి ఆమెను కూడా ఘనంగా సత్కరించారు. ఆమె పూర్వవిద్యార్థుల గురుభక్తికి ఎంతగానో పులకరించిపోయి వారిని మనసారా ఆశీర్వదించారు.

ఈ సభ పూర్వవిద్యార్థులకు, అధ్యాపకులకు జీవితంలో ఒక మధురానుభూతిగా మిగిలిపోయింది అనడంలో ఏమీ సందేహం లేదు. సరిగ్గా 12 సంవత్సరాలకు పూర్వం అంటే 29.08.2010 నాడు బెంగుళూరులోని ఒక పెద్ద హాలుల్లో ఇదే విద్యార్థులు గురువందన కార్యక్రమం మొట్టమొదటిసారి జరిపారు. అప్పుడు 1974-80 మధ్య నాతో కలిసి తెలుగు అధ్యయనశాఖలో పనిచేసిన ఆచార్య రత్నాకరం శంకరనారాయణరాజుగారు కూడా ఉన్నారు. (వీరు 100 సం.లు బ్రతికి 2019 డిసెంబరు నెలలో స్వర్గస్థులయ్యారు. వీరు భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారి అన్నగారు) అప్పుడు నాకు, ఆచార్య శంకర నారాయణరాజు గారికి, ఆచార్య జి.యస్. మోహన్‌కి, ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మికి, ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతికి పూర్వవిద్యార్థులు మిక్కిలి భక్తిశ్రద్ధలతో ఇదే విధంగా ఘనంగా సత్కారం చేశారు.

## పూర్వవిద్యార్థులకు నా సందేశం:

**0.** ప్రియమైన పూర్వవిద్యార్థులందరికీ నా మనఃపూర్వక శుభాశీస్సులు... తెలుగు శాఖలో నాతో కలిసి పనిచేసిన ఆచార్య జి.యస్. మోహన్‌కి, ఆచార్య

చన్నాప్రగడ జయలక్ష్మికి నా శుభాశీస్సులు...

నేను 1974లో స్థాపించిన స్నాతకోత్తర తెలుగుశాఖను ఈనాడు దీక్షాదక్షతలతో నిర్వహిస్తున్న ఆచార్య కె. ఆశాజ్యోతికి, ఆమెకు సహకరిస్తున్న డా॥ డి.కె. ప్రభాకర్‌కి ఇతర అతిథి ఉపన్యాసకులకు, పరిశోధన విద్యార్థులకు, ఎం.ఏ. విద్యార్థులకు నా శుభాశీస్సులు...

**1.శ్రీ పి.వి.నరసింహారావుగారు గొప్ప సాహిత్యవేత్తయైన ఉత్తమ రాజకీయవేత్త:–** వీరు 1971లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నేను, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు, డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు కలిసి వారికి ఒక లేఖ వ్రాశాము. దానిని తెలుగు విజ్ఞానసమితి అధ్యక్షులైన శ్రీ చెలికాని అన్నారావుగారి ద్వారా పంపించాము. వెంటనే వారంరోజుల్లో నరసింహారావుగారు బెంగుళూరు విశ్వవిద్యాలయానికి మూడు లక్షల రూపాయల గ్రాంటు పంపించారు. దానితో 1974లో తెలుగుశాఖ స్థాపించబడింది.

**2.సంగీత సాహిత్యాలు మానవుని ఉత్తమ మానవునిగా తీర్చిదిద్దుతాయి:–** మీరంతా తెలుగు సాహిత్యం చదువుకున్నారు. కాబట్టి మీరంతా ఉత్తమ మానవులు.

సాహిత్యంయొక్క ప్రయోజనం ఏమిటి? **సాహిత్యం మానవుని ఉత్తమ మానవునిగా తీర్చిదిద్దడమే కాకుండా సమాజంలో నీతినియమాలను ఎల్లప్పుడూ కాపాడుతూ ఉంటుంది.** సాహిత్యం మన మనస్సులో ఒక పోలీసు ఇన్‌స్పెక్టరును, ఒక జడ్జిని నిమిస్తుంది. వారు "ఇది తప్పు – ఇది ఒప్పు – ఇలా చేయకూడదు – ఇలా చేయాలి" అని మనల్ని ఎల్లప్పుడూ హెచ్చరిస్తూ ఉంటారు. దీనికి ఒక సజీవమైన ఉదాహరణ (livinig example) ఇస్తాను.

1993లో కేంద్రంలో శ్రీ పి.వి. నరసింహారావుగారు కాంగ్రెసు ప్రధానమంత్రిగా ఉన్నారు. వారిది మైనారిటీ ప్రభుత్వం. అంటే పార్లమెంటులో పూర్తి మెజారిటీ లేదు. అప్పుడు బీహారు రాష్ట్రంలో "జార్ఖండ్ ముక్తిమోర్చా" అనే పార్టీ ప్రత్యేకరాష్ట్రంకోసం ఆందోళన చేస్తోంది (ఆంధ్రప్రదేశ్‌లో "తెలంగాణా రాష్ట్రసమితి"లాగ) – దానికి "శైలేంద్ర మహతో" నాయకుడు ఆ పార్టీకి పార్లమెంటులో ఆరుమంది ఎం.పి.లు ఉన్నారు. వీరు కాంగ్రెసును బలపరిస్తే ప్రభుత్వం బలపరీక్షలో నెగ్గుతుంది. అందువల్ల మన బెంగుళూరునుండి ఇద్దరు

పారిశ్రామికవేత్తలు మూడుకోట్ల రూపాయలు ఢిల్లీకి పంపి, "జార్ఖండ్ ముక్తి మోర్చా" ఎం.పీ.లు ఆరుగురికీ, ఒక్కొక్కరికి 50 లక్షల రూపాయలు చొప్పున పంచివేశారు. వారు ఆరుగురూ బలపరీక్షలో చేతులెత్తారు. ప్రభుత్వం నెగ్గింది. కాని ఎవరో కిట్టనివారు సుప్రీంకోర్టులో కేసువేశారు – ఆ ఆరుగురూ లంచం తీసికొని ఓటువేశారని ఫిర్యాదు చేశారు. సుప్రీంకోర్టు, వారిని అరెస్టు చేసి జైల్లో పెట్టించింది. మొదటి విచారణలో సుప్రీంకోర్టు జడ్జి, ఆ పార్టీ నాయకుడైన శైలేంద్ర మహతోను "మీరు లంచం తీసికొని ఓటువేశారా?" అని ప్రశ్నించాడు. శైలేంద్ర: "అబ్బెబ్బె! మేము ఒక్కపైసాకూడా తీసుకోలేదండి మనఃపూర్తిగానే ఓటువేశామండి!" అని గట్టిగా చెప్పాడు. మళ్లీ ఆరుగుర్ని జైల్లో వేశారు.

ఆరునెలలు గడిచాక, తిరిగి కేసు విచారణకు వచ్చింది:-

జడ్జి : "మీరు లంచం తీసికొని ఓటు వేశారని మీమీద ఆరోపణ. తీసుకున్నారా? లేదా?"

శైలేంద్ర : "తీసుకున్నామండి! ఒక్కొక్కరు రూ.50 లక్షలు చొప్పున మూడు కోట్లు లంచం తీసుకున్నాం!

జడ్జి : (నిర్ఘాంతపోయి) ఇదేమిటయ్యా! ఆరునెలల క్రిందట అడిగితే లంచం తీసుకోలేదన్నారు? ఇప్పుడు తీసుకున్నామంటున్నారు? ఇలా మాట మార్చడానికి కారణం ఏమిటి?

శైలేంద్ర : "అయ్యా! ఈ ఆరునెలలకాలంలో నేను జైల్లో రామాయణం శ్రద్ధగా చదివాను. అందువల్ల అసత్యం చెప్పలేను!"

ఇదీ సాహిత్యంయొక్క ప్రయోజనం!

ఇది కథకాదు! నిజంగా జరిగిన సంఘటన! ఇది 1993లో వార్తాపత్రికలలో ప్రచురించబడింది; నేను చదివాను.

కాబట్టి సాహిత్యం సమాజంలో నీతి నియమాలను కాపాడుతుంది. సత్యాన్ని, ధర్మాన్ని సుస్థిరం చేస్తుంది.

**3. సాహిత్యం మానవుని ఉత్తమమానవునిగా తీర్చిదిద్దుతుంది. ఎంతో జ్ఞానాన్ని కలిగిస్తుంది:-** దీనికి ఉదాహరణంగా కొన్ని శ్లోకాలను పద్యాలను తెలియజేస్తాను. మా అన్నయ్యగారు టి.వి.కె. సోమయాజులుగారు (1930-2021)

సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడు, కవి, ఉత్తమవక్త, నాకు సాహిత్యంలో మొట్టమొదటి గురువు. ఆయన తన జీవితమంతా కష్టపడి, అపురూపమైన ఆణిముత్యాల వంటి 300 పద్యాలను, 300 శ్లోకాలను సేకరించారు. నేను వాటిని 2006లో "ఏరిన ముత్యాలు" అనే పేరుతో ఒక పుస్తకంగా వేశాను. వాటిలో నీతి, చమత్కారం, హాస్యం, శృంగారం అనే నాలుగు వర్గాలు కనబడతాయి. వాటిలో నుండి ఉదాహరణాలు ఇస్తున్నాను:-

**3.1 సంగీత సాహిత్యాలు:-** బ్రహ్మదేవుడు మనకు రెండు చెవులు ఇచ్చాడు: ఒకటి సంగీతం విని ఆనందించడానికి. రెండవది సాహిత్య విని ఆనందించడానికి. ఎవరైనా ఒకరు "నాకు సంగీతం ఇష్టం లేదు" అంటే అతనికి/ఆమెకు ఒక చెవి పనిచేయటం లేదు అని అర్థం. ఎవరైనా ఇంకొకరు "నాకు సాహిత్యం యిష్టంలేదు" అంటే అతనికి/ఆమెకు కూడా ఒక చెవి పనిచేయటంలేదు అని అర్థం. ఎవడైనా ఒకడు, ఔరంగజేబులాంటివాడు ఉండి, "నాకు సంగీతసాహిత్యాలు రెండూ ఇష్టంలేదు" అంటే, వాడే నిజమైన చెవిటివాడు - అన్నారు మన పెద్దలు!

**శ్లో॥ సంగీత సాహిత్య రసానుభూత్యై**
**కర్ణద్వయం కల్పితవాన్ విధాతా ।**
**ఏకేనహీనః పునరేక కర్ణో**
**ద్వాభ్యాం విహీనో బధిరస్సయేవ ॥**

**3.2 సంగీత సాహిత్యాలు:-** జీవితానికి సుఖ సంతోషాలు, మనస్సుకు శాంతిని ప్రసాదించేది సంగీత సాహిత్యాలు. వీటిని ఆస్వాదించని వాడు మనిషికాదు, పశువు - అన్నారు మన పెద్దలు.

సంగీత సాహిత్యాలు విని ఆస్వాదించనివాడు-సాక్షాత్తు తోక కొమ్ములు లేని పశువు! ఈ వింత పశువు గడ్డి మేయకుండానే బ్రతికేస్తోంది! ఎందువల్లనంటే - లోకంలో ఉన్న పశువులు చేసికొన్ని గొప్పఅదృష్టంవల్ల! (ఈ వింత పశువు కూడా గడ్డిమేయటం మొదలుపెడితే, అసలు పశువులకు గడ్డిదొరక్కుండా పోతుందికదా!)

**శ్లో॥ సంగీత సాహిత్య కళావిహీనః**
**సాక్షాత్ పశుః పుచ్ఛ విషాణ హీనః ।**

**తృణం నఖాదన్నపి జీవమానః**
**తద్భాగధేయం పరమం పశూనామ్ ॥**

వినిన వెంటనే ఆనందాన్ని కలిగిందే సంగీతం; ఆలోచించిన కొద్దీ ఆనందాన్నిచ్చేది సంగీతం. సంగీతం మనస్సును ఆర్ద్రంచేస్తుంది; సాహిత్యం మనిషికి సంస్కారాన్ని నేర్పుతుంది.

**3.3 ఉత్తమ ధర్మం:-** గొప్పగొప్ప ధర్మాలన్నింటిలోకి ఉత్తమమైన ధర్మం ఏది? - ఇది మహాభారతంలో శాంతిపర్వంలో ధర్మరాజు వేసిన ప్రశ్న. దీనికి భీష్ముని సమాధానం (తిక్కనగారి అనువాదం):

**క॥ ఒరులేయవి యొనరించిన**
**నరవర! అప్రియము తన మనంబునకగు, తా**
**నొరులకు నవి సేయకునికి**
**పరాయణము పరమధర్మపథములకెల్లన్!**

నా చిన్నతనంలో ఈ పద్యాన్ని ఆంధ్రపత్రిక దినపత్రికలో సంపాదీయంపైన ముద్రించేవారు "విశ్వదాత" కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

ఇతరులు ఏవైనా ఒక చెడ్డపని నీ యెడల చేస్తే, నీ మనస్సు బాధపడుతుందో, అటువంటి ఆ పనిని నీవు ఇతరులకు చేయవద్దు. ఇదే ఉత్తమధర్మాలన్నింటిలోకి ఉత్తమోత్తమమైనది.

**3.4 లోకంలో చిత్రమైన విషయం:-** లోకంలో చిత్రమైన విషయం ఏమిటి? అనే ప్రశ్నకు మహాకవి భర్తృహరి సమాధానం చెప్పాడు. "ముసలితనం ఆడపులిలా ఎదురుగా నిలబడి "మీద పడతా! మీదపడతా!" అని బెదరిస్తోంది. రకరకాల రోగాలు శత్రువులవలె శరీరాన్ని చితక కొడుతున్నాయి. ఆయుర్దాయం భీటలు తీసిన కుండలోని నీళ్ళులాగ ప్రతిదినమూ బొట్లుబొట్లుగా కారిపోతోంది. తన పరిస్థితి ఇన్ని లోపాలతో కూడి వున్నా సరే, మానవుడు ఇతరులకు అపకారం చేస్తూనే ఉన్నాడు. ఇది చాలా చిత్రంగా ఉంది సుమా!

**శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ,**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్ ।**

**ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివాంభః,**
**లోకస్తథాపి అహిత మాచరతీతి చిత్రమ్ ॥**

**3.5 ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విషయం:–** ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విషయం ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానం మహాభారతం అరణ్య(వన)పర్వంలో ధర్మరాజు యక్షునితో చెప్పాడు. ప్రతిదినము అనేక జీవులు మరణిస్తూనే ఉన్నాయి. (యముని ఇంటికి వెడుతూనే ఉన్నాయి.) కాని మిగిలిన జీవులు మాత్రం తాము స్థిరంగానే ఉంటామన్నట్లుగా జీవయాత్ర సాగిస్తూనే ఉన్నాయి. బాగా ఆలోచిస్తే, ఇంతకన్నా ఆశ్చర్యమేముటుంది?

**శ్లో॥ అహన్యహని భూతాని – గచ్ఛన్తీహ యమాలయమ్ ।**
**శేషాః స్థిరత్వమిచ్ఛన్తి – కిమాశ్చర్య మితః పరమ్? ॥**

**3.6 విధివిలాసం:–** విధి విలాసం విచిత్రంగా ఉంటుంది. అంటే బ్రహ్మ దేవుడు చేసే పనులు విచిత్రంగా ఉంటాయని అర్థం. భర్త అందంగా ఉండే – అతని భార్య కురూపిణిగా ఉంటుంది. భార్య అందంగా ఉంటే–ఆమె భర్త కురూపిగా ఉంటాడు. భార్యాభర్తలు ఇద్దరూ అందంగా ఉంటే – ఆ సంసారంలో దారిద్ర్యం తాండవిస్తూ ఉంటుంది. బ్రహ్మదేవుని చేష్టలన్నీ ఇలా విచిత్రంగా ఉంటాయి.

**శ్లో॥ యస్సుందరః – తద్వనితా కురూపా**
**యాసుందరీ – సాపతి రూపహీనా ।**
**యత్రోభయం – తత్ర దరిద్రతా చ**
**విధేర్విచిత్రాణి – విచ్చేష్టితాని ॥**

**3.7 పాప పుణ్యాలు:–** ఒక కవి "కోటి గ్రంథాలలో ఉండే విషయాన్ని ఒక అర్ధశ్లోకంలో చెపుతాను" అన్నాడు. అనుష్టుప్పు శ్లోకంలో నాలుగు పాదాలుంటాయి. కాబట్టి రెండు పాదాలలో చెప్పేస్తాను – అన్నాడు. ఇతరులకు అపకారం చేస్తే పుణ్యం; అపకారం చేస్తే (పీడిస్తే) పాపం!" – అన్నాడు.

**శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి – యదుక్తం గ్రంథకోటిభిః ।**
**పరోపకారః పుణ్యాయ – పాపయ పరపీడనమ్ ॥**

**3.8 పురుషులకు మిక్కిలి ఆనందప్రదమైనది:-** సారంలేని ఈ సంసారంలో పురుషులకు సారవంతమైనది – అంటే మిక్కిలి ఆనందాన్ని కలిగించేది అత్తవారిల్లు! అందువల్లనే విష్ణువు పాలసముద్రం మీద పడుకున్నాడు; శివుడు హిమాలయాలపై నివసిస్తున్నాడు. (లక్ష్మి పాలసముద్రంలోంచి పుట్టింది; పార్వతి హిమవంతుని కూతురు.)

**శ్లో॥ అసారే ఖలు సంసారే - సారం శ్వశురమందిరమ్ ।**
**క్షీరాంభసి హరిశ్శేతే - శివశ్శేతే హిమాలయమ్ ॥**
**(హిమాలయే హరశ్శేతే - హరిశ్శేతే మహోదధౌ ॥)**

**3.9 కోరిక (భాగవతంలో ఒక శ్లోకం):-** "నాకు రాజ్యం అక్కర లేదు! స్వర్గం అసలే వద్దు! మోక్షం అంతకంటే వద్దు! దుఃఖంతో పరితపించే ప్రాణుల బాధను తొలగించుటయే నా కోరిక!"

**శ్లో॥ నత్వహం కామయే రాజ్యం - న స్వర్గం నా పునర్భవమ్ ।**
**కామయే దుఃఖతప్తానాం - ప్రాణినాం ఆర్తినాశనమ్ ॥**

**3.10 కవితా కథానిక:-** సంస్కృతంలో ఒక చక్కని చమత్కార భరితమైన శ్లోకం ఉంది. అది శివుని గురించిన ప్రార్థన. శ్లోకరచయితయైన ఆ కవి మనల్ని ఆశీర్వదిస్తున్నాడు. "హరః పాతువః" = శివుడు మిమ్మల్ని కాపాడుగాక!: "నగ్నోహరః పాతువః" =దిగంబరుడైన శివుడు మిమ్మల్ని కాపాడుగాక!; "హ్రియా, నతముఖో, నగ్నోహరః పాతువః" = సిగ్గుతో తలవంచుకున్న, దిగంబరుడైన శివుడు, మిమ్మల్ని కాపాడుగాక! ఇప్పుడు శివుడు దిగంబరుడు ఎలా అయ్యాడో హాస్యరసగర్భితంగా చెపుతున్నాడు కవి.

ఒకనాడు విష్ణుమూర్తి, శ్మశానంలో ఉండే దిగంబరుడైన శివునికి ఒక వార్త పంపించాడు: "అయ్యా! మీతో నాకు కొంచెం పని పడింది; మీ దగ్గరకు వస్తున్నాను" అని. ఎల్లప్పుడూ పట్టుపీతాంబరాలు ధరించే గొప్పవాడైన విష్ణుమూర్తి తన దగ్గరకు వస్తూ ఉంటే, తాను దిగంబరంగా ఉంటే బాగుండదని, శివుడు హడావిడిగా ఒక పామును మొలత్రాడుగా చుట్టుకొని, గజచర్మాన్ని గోచీగా పెట్టుకుని, విష్ణుమూర్తిని ఆహ్వానించడానికి బయలుదేరాడు. ఇంతలో విష్ణుమూర్తి తన వాహనమైన

(హెలికాప్టర్) గరుత్మంతుని మీద దిగాడు. శివుడు గౌరవసూచకంగా ఆయనకు ఎదుర్కోలు పలకడానికి సమీపిస్తున్నాడు. అప్పుడు శివుడు తన మొలత్రాడుగా చుట్టుకున్న పాము, గరుత్మంతుని చూచి గడగడ వణికిపోయి, ఒక్కసారిగా భూమి మీదికి దూకి పారిపోయింది! మళ్ళీ శివుడు. యథాప్రకారంగా దిగంబరుడయి పోయాడు! విష్ణుమూర్తి ముందు సిగ్గుతో తలవంచుకున్నాడు. అటువంటి శివుడు మిమ్మల్ని రక్షించుగాక! (గరుత్మంతునికి పాములు ఆహారం. అవి కనపడితే గుటుక్కున నోట్లో వేసుకుంటాడు)

**శ్లో॥ విష్ణోరాగమనం నిశమ్య, సహసాకృత్వా ఫణీంద్రం గుణం,**
**కౌపీనం పరిధాయ చర్మకరిణః, శంభుః పురోధావతి ।**
**దృష్ట్వా విష్ణురథం సకంపహృదయః సర్పో పతత్ భూతలే,**
**కృత్తిర్విస్ఖలితా, హ్రియా, నతముఖో, నగ్నో, హరః పాతు వః ॥**

**3.11 కవితా కథానిక:–** "హరికథా పితామహుడు" ఆదిభట్ల నారాయణ దాసుగారు హరికథ చెప్పబోతూ, "హరికథ చెప్పమంటారా? గిరికథ చెప్ప మంటారా?" అని అడిగారు సరదాగా శ్రోతల్ని. సభలో ఉన్న ఒక కొంటెవాడు "మాకు హరికథ వద్దు, గిరికథ చెప్పండి!" అన్నాడు ("మాయాబజార్" సినిమాలో మాకు "కంబళి" వద్దు, "కింబళి" కావాలి అని –"తల్పం" వద్దు "గిల్పం" కావాలి అని అడిగినట్టుగా). దాసుగారు "సరే! 'గిరికథ' చెపుతున్నాను, వినండి!" అని పార్వతీ కల్యాణం హరికథ చెప్పబోతున్నారు. ఇంతలో ఆయన శిష్యుడు, "అయ్యా గురువుగారూ! ఈ రోజు మీ హరికథ వినడానికి కలెక్టరుదొరగారు వచ్చారు. కాబట్టి మీరు ఆంగ్లంలో ప్రార్థన చేయండి. దొరవారికి బాగా అర్థమవుతుంది" అన్నాడు. దాసుగారు "ఓ! దానికేముంది! అలాగే చేస్తాను!" అని ఆశువుగా, ఒక ఉత్పలమాల పద్యంలో ఆంగ్లపద మిశ్రితంగా, శివుణ్ణి గురించి ఈ క్రింది విధంగా ప్రార్థన చేశారు: –

**ఉ॥ హెడ్డున మూను, స్కిన్నుపయి నెంతయు దస్టును, ఫైరు నేత్రమున్,**
**సైడున గ్రేటుబుల్లు, బహుచక్కని గాంజెసు హైరులోపలన్,**

**బాడికి హోఫెయౌచు నలపార్వతి మౌంటెనుదాటరుండ, ఐ**
**షుద్దు డివోటు దండములు సోకగ ప్రేయరుసేతు నెప్పుడున్!**

**3.12 కవితా కథానిక:-** ఒక పెండ్లిలో ఆంగ్లవిద్యాపారంగతులైన వధూవరులను ఆశీర్వదిస్తూ, ఒక హాస్యకవి, వధువును తన చెల్లిగా సంబోధిస్తూ, సంసారపు మెలకువలు చెపుతూ ఈ క్రింది సీసపద్యం చదివాడు:-

**సీ॥ "హస్బెండు" తెచ్చిన "అన్‌వాల్యుథింగైన"**
**"మోస్టు బ్యూటీ" యంచు మురిసికొనుము;**
**"రిక్వెస్టు" చేయగా "రెఫ్యూజు" చేయక**
**"థేంక్స"ని అద్దాని తీసికొనుము;**
**"సిల్లి"గా ఎపుడైన చిలిపిచేష్టలు చేయ**
**"సీరియస్" కాబోకు చెల్లి! నీవు;**
**"ఆఫీసు" వేళైన, "కాఫీ"కి "లేటైన"**
**"సారీ"ని చెప్పుమా సారసాక్షి!;**
**తే॥ ఆంగ్లభాషకు అలవడ్డ అయ్యవార్ల-**
**తోడి కాపురమును చేయు జాడ లెఱిగి**
**స్త్రీలు వర్తించునట్టివౌ "సీకిరేట్లు"**
**ఎఱిగి మసలిన వారికి "హెవెను" మెట్లు!!**

**3.13 కవితా కథానిక:-** ఒక కవిశేఖరుడు శతావధానం చేస్తున్నాడు. ఆ అవధానిని పరాభవం చేయాలని కొందరు సభ్యులు మాటిమాటికి అల్లరిచేస్తున్నారు. అవధానికి చాలా కోపం వచ్చి, ఆ అల్లరి చేసేవాళ్ళందరినీ గట్టిగా తిట్టాలని నిశ్చయించుకున్నాడు. ప్రత్యక్షంగా తిట్టడం కుదరదు కదా! అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు. ఇంతలో ఒక పృచ్ఛకుడు "అందఱి కందణే మఱియు నందఱి కందఱె అందఱందఱే!" అనే సమస్య ఇచ్చాడు. అవధానికి అల్లరిచేసే వాళ్ళని ఛెడామడా తిట్టడానికి మంచి అవకాశం దొరికింది. ఆ సమస్యను ఆధారంగా చేసికొని, ఆ అల్లరిగాళ్ళను ధ్వనిగర్భితంగా గట్టిగా చీవాట్లు పెట్టాడు ఈ క్రింది పద్యంలో:-

**ఉ॥ కొందఱు పార్థు టెక్కెములు! కొందఱు కాలుని వాహనంబులున్!**
**కొందఱు భైరవాశ్వములు! కొందఱు నీశ్వరు వాహనంబులున్!**
**కొందఱు కృష్ణజన్మమున కూసిన ధన్యులు! ఎంచి చూడగా**
**అందఱి కందఱే మఱియు నందఱి కందఱె! అందఱందఱే!!**

**తా॥** "ఈ సభలో కొందరు అర్జునుని జెండాలు (కోతులు) – కొందరు యమధర్మరాజుగారి వాహనాలు (దున్నపోతులు) – కొందరు భైరవుని గుఱ్ఱాలు (కుక్కలు) – కొందరు ఈశ్వరుని వాహనాలు (ఎద్దులు)! – కొందరు కృష్ణుడు జన్మించినప్పుడు కూసిన ధన్యజీవులు (గాడిదలు)! పరిశీలిస్తే అందరికందరే సరైనవాళ్ళు!" సభలో అల్లరి చేస్తున్నవాళ్ళని "కోతులు – దున్నపోతులు – కుక్కలు– ఎద్దులు – గాడిదలు" అని వారందరూ సిగ్గుపడేలాగా తిట్టి కసితీర్చుకున్నాడు ఆ అవధానిగారు.

**3.14 రమణీయార్థం–చమత్కారం:–** "ఈశ్వరుడు భక్తులయందు మిక్కిలి ప్రేమకలవాడు; తిన్నడు పెట్టిన ఎంగిలి మాంసం కూడా తిన్నాడు" – అంటే కవిత్వం కాదు. కవిత్వంలో రమణీయార్థం, చమత్కారం ఉండాలి. ధూర్జటి మహాకవి ఏమంటున్నాడో చూడండి:

**శా॥ నీకున్ మాంసము వాంఛయేని కఱవా? నీచేత లేదుండగా,**
**జోకైనట్టి కుఠారముండ, అనలజ్యోతుండ, నీరుండగా,**
**పాకంబొప్ప ఘటించి, చేతి పునుకన్ భక్షింప, కా బోయచే**
**చేకొంటెంగిలి మాంస, మిట్లు తగునా? శ్రీకాళహస్తీశ్వరా!**

**తా॥** ఓ ఈశ్వరా! నీకు మాంసం తినాలని అంతగా కోరిక వుంటే నీకేమి లోటు వచ్చిందయ్యా? ఒక చేతిలో జింక ఉంది; మరొక చేతిలో పదునైన గొడ్డలి ఉంది; నుదుటి మీద నిప్పు ఉంది; నెత్తిమీద నీళ్ళున్నాయి. గొడ్డలితో జింకను చంపివేసి, రుచిగా వండుకొని, చేతిలో ఉన్న కపాలంలో పెట్టుకొని హాయిగా తినవచ్చును కదా! ఆ బోయవాడు పెట్టిన ఎంగిలి మాంసం తీసుకున్నావు. ఈ పని ఏమైనా బాగుందా? చెప్పు?

**3.15 చివరకు మిగిలేది:-**

**శ్లో॥ ద్రవ్యాణి భూమౌ, పశవశ్చ గోష్ఠే,**
**భార్యా గృహద్వారి, జనః శ్మశానే,**
**దేహశ్చితాయాం, పరలోకమార్గే**
**కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః...."**

**తా॥** సంపాదించిన ధనం భూమిమీద ఉండిపోతుంది; పశువులు శాలలో (కొట్టంలో) ఉండిపోతాయి; భార్య గృహద్వారం లోపల ఉండిపోతుంది; బంధుమిత్రులు శ్మశానం దగ్గరనే నిలిచిపోతారు; దేహం చితిపై మిగిలిపోతుంది. ఒక్క జీవుడు మాత్రమే తాను చేసిన కర్మను అనుసరించి ఒంటరిగా ప్రయాణం చేస్తాడు!

**3.16 ఐదు భాషలలో ఒకే వాక్యం :-** ఒక ఊళ్ళో ఒక బావగారు అతని బావమరిది కలిసి చాలా ఆవుల్ని మేపుతున్నారు. వాటిలో ఒక ఆవు ఈనింది. "ఆవు ఈనిందిరా బావమరిదీ!" అన్నాడు బావగారు. "ఏ ఆవురా బావా?" అని అడిగాడు అతని బావమరిది. ఈ వాక్యంలో ఐదు భాషలు కలిసి ఉన్నాయి.

**"ఏ ఆవ్ రా బావా?"**

(1) "ఏ" = మరాఠీ భాష = "ఇలారా!" అని అర్థం

(2) "ఆవ్" (ఆవో) = హిందీభాష = ఇలారా!

(3) "రా" = తెలుగు భాష = ఇలారా!

(4) "బా" = కన్నడ భాష = ఇలారా!

(5) "వా" = తమిళ భాష = ఇలారా!

**4. చివరిగా నా ప్రియమైన పూర్వవిద్యార్థులకు కొన్ని ముఖ్యమైన సలహాలు ఇస్తున్నాను:-**

4.1 మీరంతా తెలుగు పండితులుగాను, ఉపన్యాసకులుగాను, అసిస్టెంట్ ప్రొఫెసర్స్‌గాను, అసోసియేట్ ప్రొఫెసర్లుగాను, ప్రొఫెసర్లుగాను పనిచేస్తున్నారు. కాబట్టి మీరు రోజూ ఒక గంటసేపు ఏదైనా ఒక మంచి పుస్తకం చదువుతూ ఉండాలి. లేకపోతే ఇనుము తుప్పుపట్టినట్టు తుప్పుపట్టేస్తారు. ఆదివారాల్లోను, సెలవురోజుల్లోను అయితే రెండు మూడు గంటలు చదువుతూ ఉండండి.

4.2 రోజూ భగవద్గీతలో రెండు మూడు శ్లోకాలు అర్థతాత్పర్యాలతో చదువుకోండి; మనస్సు ప్రశాంతంగా ఉంటుంది.

4.3 వాల్మీకి రామాయణం చదవండి. శ్లోకాలు ప్రతిపదార్థ తాత్పర్యాలతో లభిస్తుంది. (ప్రొ॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారి బాలానందినీ వ్యాఖ్య, ఆర్షవిజ్ఞాన పరిషత్తు, హైదరాబాద్.) శ్లోకాలు చదవలేకపోతే, కనీసం వచనంలోనైనా చదవండి. (శ్రీనివాస శిరోమణిగారి వచన రామాయణం, నవరత్న బుక్ హౌస్, విజయవాడ.)

4.4 కవిత్రయ భారతం చదవండి. పోతన భాగవతం చదవండి. ఈ రెండూ తిరుమల తిరుపతి దేవస్థానం వారు టీకాతాత్పర్య సహితంగా ప్రచురించారు. ఈ రెండూ జీవితాంతం మీ దగ్గర ఉండవలసిన గ్రంథాలు.

4.5 మనుచరిత్ర, పారిజాతాపహరణం చదవండి. టీకాతాత్పర్య సహితంగా దొరుకుతాయి. (వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, హైదరాబాద్; ఎమెస్కో బుక్స్, విజయవాడ.)

4.6 ఆధునిక సాహిత్యంలో –

(1) విశ్వనాథ "వేయిపడగలు" నవల

(2) జాషువా : ఖండకావ్యాలు (6 సంపుటాలు), లఘుకావ్యాలు: పిరదౌసి, గబ్బిలం.

(3) కృష్ణశాస్త్రి : కృష్ణపక్షం, వ్యాసాలు

(4) శ్రీశ్రీ : మహాప్రస్థానం

(5) తిలక్ : అమృతం కురిసినరాత్రి, తిలక్ కథలు

(6) స్త్రీవాద కవిత్వం, దళితవాద కవిత్వం, మైనారిటీవాద కవిత్వం మొ॥

(7) శరత్ నవలలు, కథలు

(8) రావిశాస్త్రి అల్పజీవి నవల, కథలు

(9) వందేళ్ళ కథకు వందనం – గొల్లపూడి మారుతీరావుగారి సంకలనం

(10) అనుభవాలు – జ్ఞాపకాలు (ఆత్మకథ) – శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(11) శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథలు

(12) బుచ్చిబాబు : చివరకు మిగిలేది (నవల), బుచ్చిబాబు కథలు

(13) కోతి కొమ్మచ్చి (ఆత్మకథ) – ముళ్ళపూడి వెంకటరమణ

(14) అమ్మకడుపు చల్లగా (ఆత్మకథ) – గొల్లపూడి మారుతీరావు

(15) ఇంటిపేరు ఇంద్రగంటి (ఆత్మకథ) – ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

(16) డి.వి.నరసరాజుగారి "అదృష్టవంతుడి ఆత్మకథ" – "తెరవెనుక కథ"

ఇంకా మీకు ఇష్టమైన నవలలు, కథలు చదవండి.

**5.** నేను 1969 డిసెంబరు 27వ తేది శనివారం మధ్యాహ్నం, బెంగుళూరు విశ్వవిద్యాలయం – సెంట్రల్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా చేరాను. 1969 నుండి 1974 వరకు కన్నడ శాఖలో తెలుగు లెక్చరర్‌గా పనిచేశాను. బి.ఏ. (హానర్స్) కన్నడ, ఎం.ఏ. కన్నడ విద్యార్థులకు తెలుగు పాఠాలు చెప్పాను. 1974లో తెలుగుశాఖ స్థాపించాను. 1996లో రిటైరయ్యాను. 22 సంవత్సరాలలో మధ్యలో 1980–83 మధ్య గుల్బర్గా విశ్వవిద్యాలయంలో First Controller of Examinations గా పనిచేశాను. ఆ మూడు సంవత్సరాలు తీసివేస్తే 22–3=19 ఏండ్లు ఎం.ఏ. తెలుగు విద్యార్థులకు పాఠాలు చెప్పాను. ఎం.ఫిల్. విద్యార్థులను, పిహెచ్.డి. విద్యార్థులను గైడ్ చేశాను. ఎందరో విద్యార్థులు నా దగ్గర చదువుకొని వెళ్ళారు. కాని కొందరు మాత్రమే ఇప్పటికీ నన్ను గుర్తుపెట్టుకొని భక్తి శ్రద్ధలు ప్రకటిస్తున్నారు. మధ్య మధ్య బెంగుళూరు వచ్చి నన్ను చూసి వెడుతూ ఉంటారు. వీరికి నా ప్రత్యేకమైన అభినందనలు, ఆశీస్సులు... ఈ అద్భుత ఆశ్చర్యకర గురువందన కార్యక్రమానికి డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి, డా॥ ఇ. నాగరాజు, శ్రీ ఎ. గురుమూర్తి శ్రీ ఎం. రవిశేఖర్, శ్రీ ఏటిగడ్డ అశ్వత్థనారాయణ సారథ్యం వహించారు. తక్కిన అందరూ వీరికి సహకరించారు. అందువల్ల ఈ సర్వాంగ సుందరమైన సన్మాన సభను ఏర్పాటు చేయగలిగారు. అందరికీ నా శుభాశీస్సులు....

**6.** సరిగ్గా 12 సంవత్సరాల క్రిందట 2010 ఆగస్టు 29వ తేదీని, సిటీలో ఒక పెద్దహోటల్లో ఇటువంటి బ్రహ్మాండమైన గురువందన కార్యక్రమం ఏర్పాటు చేశారు– ఇదే విద్యార్థులు. "ఇంక మళ్ళీ చేయవద్దు నాయనా! అనవసరంగా డబ్బు ఖర్చుపెట్టవద్దు!" అని నచ్చచెప్పాను. అయినా నా మాట వినకుండా మళ్ళీ చేస్తున్నారు. గురుభక్తితో లక్షల ధనం (సుమారు 2 లక్షలు) వెచ్చించారు. వీరి ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు. ఒక పుస్తకాన్ని ముద్రించి, ద్రోణునకు అర్జునుని వంటి శిష్యులైన వీరందరికీ అంకితం చేయాలనుకుంటున్నాను. (ఆ

పని ఇప్పుడు ఈ గ్రంథముద్రణతో నెరవేరుతున్నందుకు సంతోషిస్తున్నాను. ఇంతవరకూ నన్ను ఆరోగ్యంగా బ్రతికించిన ఆ పరమేశ్వరునకు భక్తితో నమస్కరిస్తున్నాను. ఈ గ్రంథముద్రణకు నాకు ధనసహాయం చేసిన మిత్రులకు, ప్రియశిష్యులకు నా కృతజ్ఞతలు, ఆశీస్సులు తెలియజేస్తున్నాను.)

2010లో జరిగిన మొదటి గురువందన కార్యక్రమంలో 1974-80 మధ్య నాతో పనిచేసి కీ.శే. రత్నాకరం శంకరనారాయణరాజుగారిని కూడా సత్కరించారు. ఆయన ఎంతో సంతోషించారు. పైగా ఈ విద్యార్థులలో 90% మంది అనంతపురం జిల్లా వారే! ఈ విషయం తెలిసి రాజుగారు బ్రహ్మానందభరితులయ్యారు. ఎందుకంటే ఆయన అనంతపురం జిల్లావారు; భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారి అన్నగారు. మా జి.యస్. మోహన్ కూడా అనంతపురం జిల్లావాడే! ఒక రకంగా నేటి ప్రొఫెసర్ డా॥ కొలకలూరి ఆశాజ్యోతిది కూడా అనంతపురమనే చెప్పవచ్చు. ఆమె తండ్రి నా చిరకాలమిత్రులు ప్రొ॥ కొలకలూరి ఇనాక్‌గారు గుంటూరు జిల్లాలో తెనాలి తాలూకావారు. తల్లిగారిది మా పశ్చిమగోదావరి జిల్లాలోని భీమవరం. కాని ప్రొ॥ ఆశాజ్యోతి పుట్టింది, పెరిగింది, విద్యాభ్యాసం చేసిందీ అనంతపురం పట్టణంలోనే కాబట్టి ఆమెది కూడా అనంతపురం జిల్లానే. ఈ విధంగా మొత్తం అనంతపురం జిల్లానే నాకు సన్మానం చేసినట్టుగా భావిస్తున్నాను...

నాయనలారా! ఎప్పుడో మీరంతా 20 సంవత్సరాల నూనూగుమీసాల నూత్నయౌవనంలో ఉన్నప్పుడు మీ ముఖాల్లోకి చూస్తూ పాఠాలు చెప్పాను. ఇప్పుడు మీరంతా 50 ఏళ్ళు నిండి. అరవై ఏళ్ళకు సమీపిస్తున్నారు. ఇప్పుడు మిమ్మల్ని చూస్తూంటే ఒక విచిత్రమైన అనుభూతి కలుగుతోంది నాకు. తిలక్ చెప్పినట్టుగా – "శిశిర వసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పుని గుర్తుకు తెస్తోంది యిన్నేళ్ళ తర్వాత!"

**భరతవాక్యం:-**

నేను 1969లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా చేరినప్పుడు పండిత మిత్రులు శ్రీ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు నాతో ఒకమాట అన్నారు: "సుబ్బారావుగారూ! ఈ కన్నడ రాష్ట్రంచాలా మంచి రాష్ట్రం. ఇక్కడి ప్రజలు ఉత్తమోత్తములు. మీరు ఇక్కడ హాయిగా బ్రతకవచ్చును. ఇక్కడ మీకు

ఎవ్వరూ ఏ విధమైన హాని చేయరు. మీరు నిశ్చితంగా ఉండవచ్చును. ఒక వేళ మీ జీవితంలో ఎప్పుడైనా ఎవరైనా మీకు అపకారం చేస్తే, వాడు తప్పక తెలుగువాడై ఉంటాడు కాని కన్నడవాడుగా మాత్రం ఉండడు. గుర్తుపెట్టుకోండి!" అన్నారు. 1969 నుండి ఇంతవరకూ (2022) ఇక్కడ జీవిస్తున్నాను. విశ్వనాథశాస్త్రిగారి మాట అక్షరాలా నిజమని నిరూపింపబడింది!



## అంతా హాస్యమయం

1972లో తూర్పు గోదావరిజిల్లా రచయితల మహాసభలు కాకినాడలో జరిగాయి. ఓ వందమంది పైగా ప్రతినిధులు పాల్గొన్న ఆ సభలో మొక్కపాటి నరసింహశాస్త్రిగారు అధ్యక్షపీఠం అలంకరించారు. ఉదయం పదిగంటలకు ప్రారంభమైన సాహిత్య సభ సాగి సాగి మధ్యాహ్నం ఒంటిగంటదాకా నడిచింది.

ఆనాటి ఎజెండాలో చివరి అంశం 'దివంగతులైన కవి ప్రముఖులకు సంతాపం ప్రకటించడం-' ప్రతినిధులు అప్పట్లో ఏ ఏ దేశాల్లో ఎవరెవరు ప్రముఖ రచయితలు మరణించారో ఒక జాబితా తయారు చేస్తున్నారు. లిస్టు క్రమక్రమంగా పెరిగిపోతోంది. కాలాతీతం అయిపోతోంది. అధ్యక్షపీఠంనుంచి మొక్కపాటివారు సమావేశాన్ని ముగించడానికి తొందరపడుతున్నారు. అవతల భోజనసమయం మించిపోతోంది. సభ్యులు యిదేమీ పట్టించుకోకుండా లిస్టులో పేర్లు సూచించే పనిలో పడిపోయారు. ఈ పరిస్థితి మొక్కపాటివారికి వినుగు, కోపం తెప్పించింది. ఆయన మైకు అందుకుని – "అయ్యా, సభ ముగిద్దామంటే మీరు వినకుండా గతించిన పెద్దల లిస్టు తయారు చేస్తున్నారు. వంటలు పూర్తి అయినాయి. పదార్థాలు చల్లారిపోతున్నాయి. మీరు ఇక ఎంత మాత్రం జాప్యంచేసినా నా పేరు కూడా ఆ జాబితాలో చేర్చవలసివస్తుంది." అన్నారు తన అసహనాన్ని కూడా హాస్యంలోకి మారుస్తూ...

**– శ్రీరమణగారి 'హాస్యజ్యోతి' నుండి**

# 2.6 తెలుగుశిష్యుల గురువందనం

## 2.6.1 ఉన్నతమనస్వి - ఆచార్య తంగిరాల

**- ఆచార్య జి.యస్. మోహన్**

పూజ్యులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు నాకు ప్రియతమ గురువులు. మా గురుశిష్య సంబంధం 1972లో మొదలైంది. నేను 1972 జూలైలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ., తెలుగు పాసయి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో సెప్టెంబరులో డా॥ తంగిరాలగారి వద్ద పిహెచ్.డి.కి చేరాను. దీనికి కారణం మా నాన్నగారు జి. శ్రీనివాసరావుగారు. ఆయనే తంగిరాలవారిని కలిసి మా అబ్బాయికి పిహెచ్.డి.కి సీటు ఇవ్వాల్సిందిగా కోరారు. డా॥ తంగిరాల గారు సమ్మతించారు. నా ముక్కుమొహం తెలియకుండా, నన్ను పరిశోధన చేయడానికి అంగీకరించడంలో గురువుగారి గొప్పదనం కన్పిస్తుంది. అప్పట్లో డా॥ తంగిరాలవారు బెంగుళూరు విశ్వవిద్యాలయం, కన్నడశాఖలో తెలుగు లెక్చరర్‌గా ఉన్నారు.

1974లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారి చొరవతో, డా॥ విశ్వనాథ సత్యనారాయణగారి ఆశీస్సులతో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుస్నాతకోత్తరశాఖ 1974 జూలై నెలలో ప్రారంభమైంది. తెలుగుశాఖ ప్రారంభం కావడానికి ఆచార్య తంగిరాలవారు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు శాయశక్తులా కృషిచేశారు.

1974లో నేను కర్నాటకలోని గౌరీబిదనూరు నేషనల్ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గాను, అక్కడే ఆచార్య జూనియర్ కళాశాలలో పార్ట్‌టైం లెక్చరర్‌గాను పనిచేస్తున్నాను. నేను రీసెర్చి విషయంగా ఎప్పుడు బెంగుళూరు వచ్చినా మెజిస్టిక్‌లోని నియో మైసూరు కేఫ్‌లో బసచేసేవాడిని. ఒకసారి ఆచార్య తంగిరాలవారు నా ప్రియమిత్రుడు డా॥ ఆర్. శేషశాస్త్రితో మావాడు రీసెర్చి విషయంగా బెంగుళూరు వచ్చి హోటల్‌లో ఉంటున్నాడని చెప్పడం, వెంటనే శేషశాస్త్రి ఆ రోజు సాయంకాలమే హోటల్ రూము ఖాళీచేయించి వాళ్ళింటికి పిలుచుకొని వెళ్ళడం జరిగింది. నేను ఎప్పుడు బెంగుళూరు వచ్చినా శేషశాస్త్రి ఇంట్లో ఉండేవాడిని.

ఇలా వస్తూపోతూ రీసెర్చి చేయడం ఇబ్బందిగా ఉన్న కాలంలోనే తెలుగుశాఖలో రీసెర్చి అసిస్టెంట్ పోస్టు ఉందనీ, వెంటనే వచ్చి అప్లై చేసుకోమని శేషశాస్త్రితో తంగిరాలవారు చెప్పిపంపారు. వెంటనే వచ్చి అప్లై చేశాను. ఇలా నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఆచార్య తంగిరాలవారి ఆశీస్సులతో తెలుగు శాఖలో అడుగు పెట్టాను. Research Assistant గా, Honorary Teacher గా, temporary lecturer గా, permanent lecturer గా, Reader & Head గా, Professor & Head గా అంచెలంచెలుగా 37 సంవత్సరాలు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పనిచేసి నవంబరు, 2011లో రిటైరయ్యాను. గురువర్యులు ఆచార్య తంగిరాలవారు ఒక ప్రక్క పిహెచ్.డి. మార్గదర్శకులుగా, మరోప్రక్క నా జీవిత మార్గదర్శకులుగా నా శ్రేయస్సును కాంక్షించిన సహృదయులు.

ఆచార్య తంగిరాలవారు ఉత్తమ జానపదసాహిత్యపరిశోధకులు. 'తెలుగు వీరగాథా కవిత్వం' మీద పరిశోధనచేసి 1500 పుటల బృహద్గ్రంథాన్ని రచించి ప్రచురించారు. ఈ సిద్ధాంతవ్యాసానికి ముందుమాట వ్రాస్తూ ఆచార్య తంగిరాలవారు 'ముసలితనంలో ఒక ముచ్చట' (వృద్ధాప్యంలో ఒక తీరనికోరిక) అంటూ 'ఆచార్య బిరుదురాజు రామరాజుగారి పుస్తకంలా, నా సిద్ధాంత గ్రంథాన్నంతా ఒకే సంపుటంగా ముద్రించలేకపోయానే' అనే బాధ నా మనస్సులో గూడుకట్టుకొని ఉంది. 2011లో మా అన్నగారైన శ్రీ టి.వి.కె. సోమయాజులుగారి దగ్గర నా బాధ వెళ్ళగ్రక్కాను. 'నీకిప్పుడు 76 సంవత్సరాల వయస్సు! నాకు 80 సంవత్సరాలు. ఎంతకాలం బ్రతుకుతామో తెలియదు. We are about to fly అందువల్ల నీవు రెండు పనుల్లో ఒక పని అర్జంటుగా చెయ్యాలి. ఒకటి నీ మనస్సులోంచి ఆ కోరికను త్రుంచి వేసుకోవాలి. లేదా, రెండు నీ కోరికను వెంటనే నెరవేర్చుకోవాలి. There is no time అన్నారు. నేను రెండవవైపు మొగ్గుచూపాను" అని వ్రాసుకొన్నారు. పట్టువదలని విక్రమార్కుడిలా ఆచార్య తంగిరాలవారు తమ సిద్ధాంత గ్రంథాన్ని 2013లో ముద్రించారు.

ఆచార్య తంగిరాలవారి Ph.D. Thesis గురించి ముచ్చటిస్తూ Prof. K.V. Ramana Reddy గారు "'This is not research. This is not search even. This is an adventure. Hats off to you! I want to see you" అన్నారు. ఆయనే 'డాక్టర్ పట్టాపొందిన తంగిరాల వెంకట సుబ్బారావుకు శ్రావ్యమైన

కంఠస్వరం పెట్టనివరం. గానానికి ఒదిగి మెళకువలెన్నో చూపగల తన గొంతుకనుంచి తానే సేకరించిన ఒక వీరగాథను (సర్వాయి పాపని కథను) వినడం తటస్థించింది. శృంగార, కరుణరస ప్రకటనకే యోగ్యం అని భ్రమ గొలిపేంత కోమలమైన ఆ కంఠస్వరం, వీరాన్ని సైతం పలికించగలిగి ఆశ్చర్యం గొలిపింది" అంటారు 1986 జూన్ నెల 'భారతి'లో.

ఆచార్య తంగిరాలవారు తమ పరిశోధనకోసం పది, పన్నెండు పిహెచ్.డి., పట్టాలకు సరిపడే విషయసేకరణ చేశారు. ఆంధ్రదేశమంతా వీరగాథలకోసం గాలించారు. విషయ సేకరణే కాకుండా విషయ వర్గీకరణలోను, వివరణాత్మకమైన రచనలోను విశేషమైన కృషిచేశారనడానికి వారి బృహత్ సిద్ధాంతగ్రంథమే సాక్ష్యం. ఎన్నో వ్యయప్రయాసలకోర్చి అహర్నిశలు శ్రమించి ఒక ఉత్తమ పరిశోధన వ్యాసాన్ని రూపొందించి, ఒక మహత్కార్యాన్ని సాధించి, ఆంధ్రదేశంలోని పండిత, పరిశోధకుల మన్ననలు పొందారు. అందుకనే ఆయన 'వీరగాథల సవరాల జిమ్మడు' బిరుదుగాంచారు. (పల్నాటియుద్ధంలో అలరాజు అధిరోహించే అశ్వంపేరు సవరాల జిమ్మడు.) వస్తువిషయంలోను, బృహదాకారంలోను ఉన్న ఈ సిద్ధాంత వ్యాసానికి మరే సిద్ధాంతగ్రంథమూ సాటిరాదు.

ఆచార్య తంగిరాలవారు జానపద పరిశోధకులేకాదు ఆధునిక కవి, రచయిత, 'చైతన్యకవిత' సంపాదకుడు, 'శ్రీరస' సంస్థాపకుడు, తెలుగు–కన్నడ సాహిత్యవేత్త.

ఎప్పుడూ చిరునవ్వుతో పలకరించే ఆచార్య తంగిరాల వారిని గురించి నా మాటలలో చెప్పడం కంటే 'నవకవితాపితామహ' డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారి కవితల్ని, 'మధురకవి' దుగ్గిరాల రామారావుగారి కవితల్ని పేర్కొంటాను. ఇవి వారి వ్యక్తిత్వానికి మచ్చుతునకలు

**ఉ॥ క్రోధములేని సాధువు, అకుంఠిత నైతిక శీలశాలియున్,**
**ఆధునికాంధ్ర వాఙ్మయ మహార్ణవ నౌక, కవిత్వమాధురీ**
**శీధు పిపాసి, మిత్రజన సింధు శరద్వర పౌర్ణమాసియున్,**
**సౌధములేని రాజునకు సాంద్రనమస్సులు 'తంగిరాల'కున్!**

**శా॥ సాయంకాల శశాంకరేఖ, మధుమాసాయాత చూతాంకుర**
**చ్ఛాయాపాయి కిశోరకోకిలము, విశ్వాకాశ కోశాంతర**

**ప్రేయోవాయు సుపర్ణబిందువు, వచః పీయూష యోషిత్ కృపా**

**శ్రేయోజన్ముని, 'తంగిరాల' సఖునిన్ ప్రేమింతు, శేషేంద్రుడన్!**

– అని గుంటూరు శేషేంద్రశర్మగారు తంగిరాలవారిని ప్రశంసిస్తే, శ్రీ దుగ్గిరాల రామారావుగారు ఆచార్య తంగిరాలవారిని "మా సుబ్బన్నబావ" పేరుతో 51 పద్యాలతో ప్రస్తుతించారు. ఇవి మొదట 'చైతన్యకవిత'లోనూ, తరువాత రామారావుగారి "సుమనోభిరామం" అనే కావ్యంలోనూ ముద్రితమయ్యాయి.

**చ॥ పలుకులదేవి సేవలను పండిన శీర్షము, దబ్బపండుతోఁ**
**గలబడు మేను, కాశ సువికాసము వాసము మీసకట్టు, మ**
**ల్లెలు విరబూయు తేనగవురేకలు, 'సుబ్బనబావ' పండువె**
**న్నెల దిగజారు మేరుధరణీధరశృంగముభంగిఁ గన్పడున్!**

– అని అంటూ

**సీ॥ 'చైతన్యకవిత'కు సంపాదకుడు స,**
**ద్గ్రంథ సంతతికి ముద్రాపకుండు**
**అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు**
**ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుండు**
**వలచి చేకొను 'శకుంతకు దుష్యంతుండు'**
**పరిణతిగన్నట్టి పండితుండు**
**'సోమయాజులు'కుఁ గూర్చు సహోదరుఁడు, తంగి**
**రాలాబ్ధి తరుణసారంగధరుఁడు**

**తే॥ భావబంధుర మధుర సంభాషణుండు**
**ముచ్చటం గొల్పు వినయ విభూషణుండు**
**జానపదసాహితీవిశేషముల తావు,**
**సుగుణముల ప్రోవు, వేంకట సుబ్బరావు!**

– అని ప్రశంసిస్తూ, మరొక సీసపద్యం చివర్లో –

**"ధన్యజీవి మా ఆచార్య తంగిరాల / వర్ధిలునుగాత నూరు సంవత్సరాలు"**

– అని ఆశీర్వదించారు.

ఆచార్య తంగిరాలవారు 1969నుండి 1996వరకు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పనిచేశారు. 1996లో రిటైరు అవుతూ వీడ్కోలు సభలో మాట్లాడుతూ 'నాలుగేళ్ళలో మన తెలుగుశాఖ రజతోత్సవాలను చేసుకోవాలి, మోహన్ చేయాలి మరి' అన్నారు. ఆయన మాటను శిరసావహించి నేను 2000 జనవరి నెలలో మూడు రోజులపాటు రజతోత్సవాన్ని నిర్వహించడం జరిగింది.

1972నుండి నేను రిటైరు అయ్యేదాకా (2011 వరకు) బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగుఅధ్యయనశాఖతో నాకు గాఢమైన అనుబంధం ఉంది. ఆచార్య తంగిరాలవారితో గురుశిష్యసంబంధం, అనుబంధం కొనసాగుతూనే ఉన్నాయి. ఆచార్య తంగిరాలవారి పర్యవేక్షణలో నేను రూపొందించిన సిద్ధాంతవ్యాసం "'స్త్రీలపాటలు (అనంతపురం జిల్లా)" ఇది స్త్రీలపాటల మీద వచ్చిన మొట్టమొదటి సిద్ధాంతవ్యాసం (1978). ఆచార్య తంగిరాలవారి భాషాసాహిత్యసేవలను గుర్తించి అనేక పురస్కారాలను వివిధ సంస్థలు ప్రదానంచేసి సన్మానించాయి. కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ డా॥ చిలుకూరి నారాయణరావుగారు మా మాతామహులు. ఆ మాతామహుల స్మారకంగా మా తల్లిదండ్రులు కీ.శే. జి. శ్రీనివాసరావు, శ్రీమతి చిలుకూరి రమాబాయిగారల జ్ఞాపకార్థం నేను ఏర్పాటుచేసిన డా॥ చిలుకూరి నారాయణరావు స్మారక పురస్కారాన్ని సెప్టెంబరు 10, 2014లో మద్రాసు విశ్వవిద్యాలయంలో పూజ్యగురువర్యులు ఆచార్య తంగిరాలవారికి ప్రదానంచేయడం జరిగింది. అది నాకు మధురక్షణం!

ఆచార్య తంగిరాలవారు ఆయురారోగ్యాలతో, భోగభాగ్యాలతో తులతూగాలని మనసారా ఆకాంక్షిస్తూ, వయస్సు పైబడినా సమధికోత్సాహయౌవనంతో సాహిత్యంతో సహవాసంచేస్తూ, తమకంటూ ఒక ప్రత్యేకస్థానం సంపాదించుకొన్న గురువుగారి పాదాలకు వందనం; అభినందన చందనం!

బెంగుళూరు
01.02.2023 **జి.ఎస్.మోహన్**



# 2.6.2 అపార కరుణామూర్తి

– ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి

**సదాశివ సమారంభాం, శంకరాచార్య మధ్యమామ్,**
**అస్మదాచార్యపర్యంతాం, వందే గురుపరంపరామ్!**

**"తన యెదయెల్ల మెత్తన, పదమ్ములు పల్కిన నంతకన్న మె**
**త్తన, తన శిష్యులన్న నెదదంగల ప్రేముడి చెప్పలేని మె**
**త్తనయయి, రాజశేఖరుడుఁ తానగు సత్కవి వేం**
**కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్పగు బెంగుళూరునన్!"***

ఆజాను బాహుడు, స్మితవదనుడు, స్ఫురద్రూపి, విద్యార్థులయందు మిక్కిలి వాత్సల్యము కలవాడు, అందగాడు, సంభాషణా చతురుడు, అనర్గళ ఉపన్యాసకుడు, సభారంజకుడు, ధోవతి కట్టితే యన్.టీ.ఆర్., ఏ.యన్.ఆర్‌లను మించిన సౌందర్యం కలవాడని జ్ఞానభారతి కాంపస్ అంతాకీర్తిపొందిన father of five children తంగిరాల వెంకట సుబ్బారావుగారు మా మాష్టారు అని చెప్పుకోవటం నిజంగా మా విద్యార్థుల అదృష్టమే! మానాన్నగారు చన్నాప్రగడ తిరుపతిరావుగారు తమవిద్యాభ్యాసం బి.ఏ. నుండి యం.ఏ. వరకు ప్రయివేటుగా చేశారు. ఆయన ఎప్పుడూ "నాకు గురువులు లేరు. గురువులేని విద్య అక్కరకురాదు" అని బాధపడుతూ ఉండేవారు. కాని ఆయనకు Ph.D లో డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు గైడ్‌గా ఉన్నారు. వారినే నాగురువులు అంటూ ఉండేవారు మా నాన్నగారు. వారు మాష్టారుకంటె పదిసంవత్సరాలు పెద్దవారు. ఐనా, నాకంటే చిన్నవారని ఆయన ఏనాడు చిన్నతనంగా భావించలేదు. కాళిదాసు మహాకవి అన్నట్లుగ "నధర్మ వృద్ధేషు వయసమీక్షతే" అని సంతోషించారు.

మానసగంగోత్రి (మైసూరు విశ్వవిద్యాలయం) నుంచి విడివడి జ్ఞానభారతి (బెంగుళూరు విశ్వవిద్యాలయం)గా ఏర్పడిన తరువాత కన్నడ విభాగంలో తెలుగును ఒక ఐచ్ఛిక విషయంగా ప్రారంభించారు. దానికిగాను ఒక తెలుగు ఉపన్యాసకులను

---

* ఈ పద్యంలో దొర్లిన గణభంగ దోషాలను సరిచేసిన మిత్రులు "యుగళ సహస్రావధానులు" శ్రీ కోట వెంకట లక్ష్మీనరసింహగారికి నా కృతజ్ఞతలు – తంగిరాల.

నియమించారు. వారే డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు. వీరు తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో Ph.D. చేస్తున్నప్పుడు మా నాన్నగారు అక్కడ రీసెర్చి అసిస్టెంట్‌గా ఉండేవారు. అలా వారిరువురికి పూర్వపరిచయం ఉన్నది. తిరుపతిరావుగారు పరిశోధన చేయాలని సంకల్పించి గైడుకోసరం ప్రయత్నిస్తున్న సమయంలో సుబ్బారావుగారు ఇక్కడికి రావటంతో వారివద్ద బెంగుళూరు విశ్వవిద్యాలయంలోనే మొట్టమొదటి Ph.Dచేసి గుర్తింపు పొందారు. అలా మాష్టారి మొదటి విద్యార్థి తిరుపతిరావుగారు.

ఆ రోజుల్లో బెంగుళూరులో తెలుగులో కాలేజీ అధ్యాపకులు ఐదుగురు మాత్రమే ఉండేవారు. డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారూ, శ్రీ రత్నాకరం శంకరనారాయణ రాజుగారు, శ్రీ గడియారం సుబ్బయ్యశాస్త్రిగారు, శ్రీ దీక్షితులుగారు, తిరుపతిరావుగారు. వీరితో పాటుగ మాష్టారు చేరుకున్నారు. మాష్టారు మా ఇంటికి దగ్గరలోనే ఇల్లు తీసికొని ఉండేవారు. దానితో వీరిరువురు మంచి స్నేహితులయ్యారు. తిరుపతి వేంకటద్వయంచేరి తెలుగుభాషకు ఎంతో సేవచేసారు. మొదటగ బెంగళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుచైర్‌కి మాష్టారు 3 లక్షల రూపాయల గ్రాంటును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంనుండి సంపాదించారు (1971). తరువాత వీరిరువురు కలిసి పదవీవిరమణ పొందిన తెలుగు అధ్యాపకులకు సన్మానం చేశారు. అనంతరం 1974 మార్చి 17వ తేదీనాడు అంగరంగ వైభవంగా కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి సన్మానం చేశారు. విశ్వనాథ సత్యనారాయణగారి అనుగ్రహ భాషణలో బెంగళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు M.A. ప్రారంభించాలని సూచన చేశారు. ఆ సభకు అధ్యక్షత వహించిన V.C. H. నరసింహయ్యగారు అందుకు అంగీకరించారు. త్వరలో తప్పక ప్రారంభిస్తామని సభాముఖంగా వాగ్దానంచేశారు. వాగ్దానమైతే చేశారు కాని ప్రారంభానికి ముందుచేయాల్సిన కృత్యాది అవస్థలన్నీ దాటటానికై (తిరుపతి వేంకట మిత్రులు) వీరిరువురు, బరిలోకి దిగి, ఎలాగయితేనేమి 1974 జూలైలో M.A. మొదటి బ్యాచ్ ప్రారంభం చేశారు.

మొదటి బ్యాచ్‌లో మేము 18 మంది విద్యార్థులం. అలా డా॥ సుబ్బారావుగారు నాకు గురువు అయినారు. ఆనాటినుండి (1974) ఈ నాటికివరకు (2023) కూడ మాష్టారు నాయందు అపారమైన కరుణాకటాక్షములు వర్షించుతూనే

ఉన్నారు. నాకు విద్యార్థుల పేర్లుకాని అంకెలుగాని జ్ఞాపకం ఉండవు. ఎప్పుడూ విద్యార్థుల పేర్లను తప్పుగానే పిలిచేదాన్ని. కాని పద్యాలుమాత్రం పాఠం చెప్పేటప్పుడు అలవోకగా చెప్పేదాన్ని. అది విన్న విద్యార్థులు మీరు పద్యాలను మాత్రం ఎలా జ్ఞాపకం పెట్టుకున్నారు? అని అడుగుతుండేవారు. దానికి కారణం సుబ్బారావు మాష్టారు. మాష్టారు ప్రతిశనివారం పద్యపఠనం అని క్లాసులు తీసికుంటూ ఉండేవారు. “శతశ్లోకేన పండితః” అని మా అందరిచేత పద్యాలు చదివించుతూ ఉండేవారు. ముఖ్యమైన కవుల పద్యాలు పదియైనా వచ్చి ఉండాలని చెప్పేవారు. వక్తృత్వ పరీక్ష(viva)లో పద్యాలుకూడ చెప్పమనేవారు. అలాగే మానాన్నగారు కూడ పరీక్షల్లో ఎన్ని పద్యాలు కోట్ చేస్తే అంత మంచిది అనేవారు. వీరిద్దరు నాకు ఇచ్చిన ట్రైయినింగ్ వల్ల పద్యాలు అలా నామదిలో నిలిచిపోయాయి. నేను కూడ క్లాసులో విద్యార్థులకు పద్యాలు నేర్చుకోండి బాబు అని ఎంతో చెప్పేదాన్ని. క్లాసులో పద్యాలు తప్పుల్లేకుండ చదవమని ప్రోత్సాహం కలిగించేదాన్ని.

సుబ్బారావుమాష్టారుగారు ప్రతివిద్యార్థిగురించి శ్రద్ధ తీసికొనేవారు. వారికి హాస్టల్ వసతులు భోజనం గురించిన వివరాలు తెలుసుకుంటు ఉండేవారు. విద్యార్థుల ఆరోగ్యం గురించి ఎక్కవగా శ్రద్ధతీసుకొనేవారు. వ్యాయామం చేయమని వాకింగ్ చేయమని ప్రోత్సహించేవారు. ఆడపిల్లల విషయంలో మరీ జాగ్రత్తలు తీసుకొంటూ ఉండేవారు. మేము నలుగురం ఆడపిల్లం. బుద్ధవరపు మహాలక్ష్మి కుమారి, సౌజన్య కుమారి, ఉషాస్నేహలత, నేను ఉండేవారం. మహాలక్ష్మి, నేను బెంగుళూరునుంచి వచ్చినవాళ్ళమైతే, సౌజన్య, ఉషా కడపనుండి వచ్చారు. వారిద్దరు సెంట్రల్ కాలేజీ లేడీస్ హాస్టలులో ఉండేవారు. సాయంకాలం ఎందుకైనా క్లాసులు అవ్వక లేటయితే, బస్సులు వెళ్ళిపోతే, అబ్బాయిలను తోడిచ్చి పంపేవారు. తరువాత కొన్నేళ్ళకి లేడీస్ హాస్టలును “జ్ఞానభారతి” కాంపస్‌కి మార్చారు. అప్పుడు కూడ సెంట్రల్ కాలేజీలో మీటింగులు అవి అయి రాత్రి ఎనిమిది అయితే హాస్టల్ అమ్మాయిలను మగపిల్లలను తోడిచ్చి హాస్టలులోనికి వెళ్ళేవరకు ఉండమనేవారు.అంత బాధ్యత తీసుకునేవారు. M.Phil, Ph.D. కోసం వచ్చిన విద్యార్థులకు తమ ఇంటిలో తాత్కాలిక ఆశ్రయం ఇచ్చేవారు.

మొదటి సంవత్సరం మాష్టారు మాకు తెలుగు భాషాచరిత్ర,

విశ్వనాథశాస్త్రిగారు సాహిత్యము, శంకరనారాయణరాజుగారు తెలుగు సాహిత్యచరిత్ర, మానాన్నగారు వ్యాకరణం చెప్పేవారు. రెండవ సంవత్సరం మాష్టారు సాహిత్య విమర్శ, శాస్త్రిగారు స్పెషల్ ఆథర్ కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద, రాజుగారు తులనాత్మక అధ్యయనం (కన్నడ–తెలుగు). మానాన్నగారు సంస్కృతం చెప్పేవారు, శనివారం సెంట్రల్ కాలేజీలో సుబ్బారావుగారు మాత్రం క్లాసులు తీసికొనేవారు. M.A. కోచింగ్ వీరందరికి కొత్త అయినా బాగా క్లాసులు తీసుకొనేవారు. మేమందరం కాలేజీ లెక్చరర్‌లుగా స్థిరపడ్డామంటే మా మాష్టర్ల కరుణాకటాక్షములేనని ధృడంగా నమ్ముతాను.

మాష్టారు తెలుగు విభాగాన్ని నెమ్మదిగా అభివృద్ధి చేస్తూ వచ్చారు. UGC స్కాలర్లుగా దివాకర్ల రాజేశ్వరిగారు తెలుగువిభాగంలో చేరారు. మా రెండవ సంవత్సరంలో G.S. మోహన్‌గారు రీసెర్చ్ అసిస్టెంట్‌గా చేరారు. తరువాత కొన్నేళ్ళకి, కొలకలూరి ఆశాజ్యోతిగారుకూడ రీసెర్చి అసిస్టెంటుగా చేరారు. Ph.D., M. Phil. చేయటానికి వచ్చిన విద్యార్థులకు కూడ అడపా దడపా క్లాసులు ఇస్తూ ఉండేవారు. భావరాజు రంగనాయకమ్మగారి పేరున Endoment lecture పెట్టించారు. University gold medal కూడా రంగనాయకమ్మగారిపేరున ఇప్పించడం మొదలు పెట్టారు. శ్రీ సకలా నరసింహలు శ్రేష్ఠిగారి ప్రోత్సాహంతో విశ్వనాథ సత్యనారాయణ జయంతి జరిపేవారు. శ్రీ బుల్లా సుబ్బారావుగారి ఆర్థిక సహాయంతో గుఱ్ఱం జాషువా జయంతికూడ మొదలుపెట్టారు. ఉపన్యాసాల కొరకు ప్రముఖ పండితులను ప్రొఫెసర్‌లను పిలిపించేవారు. విద్యాసంవత్సరం చివర్లో హొటల్లో పార్టీ ఇచ్చి గ్రూప్ ఫోటో తీయించేవారు. మాచేత కన్నడ MA (తెలుగు) విద్యార్థులకు సెండాఫ్ ఇప్పించారు. మాకు కన్నడ విద్యార్థులకు దోస్తి బాగుండేది. మమ్మల్ని కన్నడ డిప్లొమో క్లాసులకు చేర్పించారు.

మాష్టారు మధ్యలో కొంతకాలం (1980–83) గుల్బర్గాకు controller of examinations గా వెళ్లినా, తిరిగి వచ్చి మళ్ళీ HOD గా బాధ్యతలు స్వీకరించారు. వారు గుల్బర్గా వెళ్ళిన మధ్యకాలంలో బాడాల రామయ్యగారు HODగా ఉన్నారు. తంగిరాలవారు చైతన్యకవిత సాహిత్య షాణ్మాసికపత్రిక చాలా ఏండ్లు నడిపారు. కాటమరాజుకథలు మొదలుగ ఎన్నో పుస్తకాలను అలుపెరగని

బాటసారిగ 88వ దశలో ఈ నాటికి కూడ ప్రచురించుతున్నారు. 1994లో "శ్రీరస" (శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య)ను స్థాపించి, ఈనాటివరకు సారస్వత సమావేశాలు "నెలనెలావెన్నెల" పేరుతో నిర్వహిస్తున్నారు. మాష్టారి 81 ఏండ్ల సహస్రచంద్రదర్శనం సందర్భంగా తమ విద్యార్థులనే, పిలిచి వారిని సత్కరించటం మాష్టారి అపారకరుణ, వాత్సల్యాలకు నిదర్శనం.

ఇంత చెప్పిన తరువాత మాష్టారి కుటుంబానికి మాకుటుంబానికిగల సంబంధం చెప్పకుండా ఉండలేను. మా రెండు కుటుంబాలు దగ్గరగా ఉండటంతో అనుబంధం ఎక్కువగా ఉండేది. మానాన్నగారు మాష్టారు అన్నా తమ్ముళ్ళలాగ ఉండేవారు. మా అమ్మగారు శకుంతలమ్మగారు (మాష్టారుగారి భార్య) అక్కా చెల్లెళ్లుగా ఉండేవారు. మాష్టారుగారి పిల్లలందరు నన్ను "అక్కా" అని, మా అన్నయ్యను "అన్నా" అని, మావారిని "బావగారు" అని పిలిచే అంత సన్నిహితులుగా ఉండేవాళ్ళం. శకుంతలమ్మగారు మావారిని "అల్లుడుగారు" అని పిలిచేవారు. మా అమ్మగారు అమాయకురాలు; ఏమితెలియనిది. నాకు ఏమయిన సమస్యలు వస్తే (ఆడపిల్లగా) శకుంతలమ్మగారికి చెప్పుకునేదాన్ని. ఆమె మా అమ్మను "సీతమ్మగారు మీకేమి తెలియదు ఊరుకోండి" అనే అంత చనువు ఉండేది. మా ఇంట్లో మా అమ్మకు సహాయంగా విశేషమైన పర్వదినాలలో వంటకూడ చేసేవారు. వారి పిల్లలు మా ఇంట్లో అంతచనువుగానే ఉంటూ భోజనానికి కూడ వచ్చేవారు. మాష్టారు యూనివర్సిటీ క్వార్టర్స్‌కు వెళ్ళేవరకు మా కుటుంబాల అనుబంధం అలాగే ఉండేది. తరువాత కూడ పిల్లలు అప్పుడప్పుడు వచ్చి మా ఇంటిలో ఉండేవారు. మాష్టారుకి నేనంటే చాలప్రేమ. క్లాసులు సెంట్రల్ కాలేజీలో ఉన్నప్పుడు అప్పుడప్పుడు కబ్బన్ పార్కుకి తీసికెళ్ళేవారు. అప్పుడు "జయమ్మ అది చూడు! ఇదిచూడు!" అని నాకు ప్రత్యేకంగా చెప్పేవారు. అది విని సౌజన్య "ఏమిటి మాష్టారు? జయలక్ష్మి ఇక్కడి అమ్మాయేగా! తనకు ఎందుకు ప్రత్యేకంగా చెబుతారు? బయటనుంచి వచ్చింది మేము; మాకు చెప్పాలి" అనేది. దానికి మాస్టారు "మీరెక్కడైనా బతక గలుగుతారు. జయలక్ష్మి అమాయకురాలు. ఏమి తెలియదు" అనేవారు. అలాగే నాపెళ్ళిగురించి కూడ మా నాన్నగారితో అభిప్రాయాలు పంచుకునేవారు. మానాన్నగారు చనిపోయిన తరువాత పినతండ్రిగా

భావించి నాకు కాలేజిసమస్యలు ఏమి వచ్చినా మాష్టారుగారికి చెప్పుకునే దాన్ని. మాష్టారు సాంత్వన వచనాలు చెప్పి ధైర్యంగా ఉండమనే వారు.

కాటమరాజుకథల ముద్రణకు మాష్టారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ నుండి గ్రాంట్స్ సంపాదించారు. తాళపత్ర గ్రంథాలను పరిష్కరించటానికి మా నాన్నగారు మాష్టారుగారు మా ఇంట్లో దాదాపు ఆరునెలలపాటు కృషిచేశారు. ఆ సమయంలో వారిరువురు అనేక సాహిత్య విషయాలు సాహితీ వేత్తల విషయాలు చర్చించుకుంటూ ఉండేవారు. మాష్టారు ప్రతివారిలో గల ప్రతిభని గుర్తించి ప్రోత్సహించేవారు. ఏ ఊరికి వెళ్ళినా ఇన్ని పుస్తకాలు మోసుకొని వచ్చేవారు. ఊరికి వెళ్ళి మిఠాయిలు గిఫ్టులు తెచ్చి పిల్లలకి ఇచ్చే తండ్రిలాగ మా అందరికీ ఇచ్చేవారు. అదికూడ ఏవో పుస్తకాలు కాక మాకు సంబందించినవే ఇచ్చేవారు. అంటే మోహన్‌గారికి జానపదమని, ఆశాజ్యోతిగారికి ఆధునికకవిత్వమని, నాకు ప్రాచీనకవిత్వమని, ఇలా గుర్తుపెట్టకుని తెచ్చేవారు.

ఎంతవారికైనా కాలగతులతోపాటుగ పోవలసిందే. మాష్టారికి 2002లో హార్టెటాక్ వచ్చింది. తట్టుకొని నిలబడ్డారు. 2006లో "గుండెకింద గులాబీ చిట్టి" (శకుంతలమ్మ)గారు కాలగర్భంలో కలిసిపోయారు. అంతకంటే దారుణమైన హృదయాఘాతము 2018లో రెండవ కుమారుడు సీతారామరాజు మృత్యుసంకెళ్ళకి బలైపోయాడు. అయినా ఇన్ని ఆటుపోట్లని తట్టుకొని రచనావ్యాసంగంలో నిమగ్నమయినారు. వారి స్ఫూర్తి అందరకు ఆదర్శం కావాలి! వారి ఉత్సాహం అందరిలోనూ చైతన్యాన్ని నింపాలి!

శ్రీ గురుభ్యో నమః !!

**మ॥ అరయన్ శంతనుపుత్రుపై, విదురుపై, నక్రూరుపైఁ గుబ్జపై,**
**నరుపై, ద్రౌపదిపైఁ, గుచేలునిబయిన్, నందవ్రజశ్రేణిపైఁ,**
**బరగంగల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము! నీ**
**చరణాబ్జంబులు నమ్మినాను, జగదీశా! కృష్ణ! భక్తప్రియా!**

(-ప్రార్థన పద్యం-చాటువు)

## 2.6.3 అమృత హృదయులు ఆచార్య తంగిరాలవారు

– ఆచార్య కె.ఆశాజ్యోతి

1988 అక్టోబరు 21వ తేది. నేను బెంగళూరు విశ్వవిద్యాలయం, తెలుగు శాఖలో రీసెర్చి అసిస్టెంటుగా చేరినరోజు. ఎక్కడో రాయలసీమ అనంతపురం జిల్లాలో పిహెచ్.డి చేస్తున్న నాకు, బెంగళూరు విశ్వవిద్యాలయంలో రీసెర్చ్ అసిస్టెంటుగా చేరే అవకాశం కల్పించినది ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు. అప్లికేషను ఇంటికి పంపి, అప్లైచెయ్యమనడంతో నేను అప్లికేషను వెయ్యడం, సెలెక్ట్ కావడం జరిగిపోయాయి. (తరువాత 1994లో లెక్చరర్‌గా పర్మనెంటు అయ్యాను. ప్రస్తుతం ప్రొఫెసర్‌గా ఉన్నాను.) అప్పట్లో నేను పరిశోధన చేస్తున్న తెలుగుశాఖ, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో సర్టిఫికెట్ కోర్సులు కన్నడం, తమిళం కొత్తగా ప్రారంభం కావడం, నేను కన్నడ సర్టిఫికెట్ కోర్సు చేసి యూనివర్సిటి ఫస్ట్ రావడం, ఇంటర్వ్యూ సమయంలో కన్నడ సర్టిఫికెట్ చేతిలో ఉండడం, బెంగళూరులో ఇది ఉపయోగపడడం అంతా చరిత్ర. నా జీవితంలో ఆచార్య తంగిరాల సుబ్బారావు గారికి ప్రముఖస్థానముంది. నేను ఉద్యోగంలో చేరడానికే కాదు, నా వివాహం ఆచార్య కట్టమంచి జనార్దన్‌గారితో జరగడానికి మూలమూ తంగిరాలవారే! దగ్గరుండి వివాహం జరిపించారు! నేను ఉద్యోగంలో చేరుతున్నప్పుడు నాన్నను (కొలకలూరి ఇనాక్‌గారు) దిగులు పడొద్దని ధైర్యం చెప్పారు! భాష కొత్త, స్థలం కొత్త! ఐనా నేను బెదురు లేకుండా ఉండడానికి ధైర్యం ఇచ్చింది తంగిరాలవారు, వారి శ్రీమతి శకుంతలమ్మగారే! నేను నాన్నతో కలిసి ఉద్యోగంలో చేరడానికి వచ్చిన రోజు తంగిరాలవారు మమ్మల్ని ఇంటికి తీసుకెళ్ళారు. శకుంతలమ్మగారు భోజనం వడ్డించారు. నా కష్టంలో దన్నుగా నిలబడ్డారు శకుంతలమ్మగారు. బెంగళూరు వంటి చల్లటి వాతావరణం నాకు పడక అవస్థ పడేదాన్ని, శకుంతలమ్మగారు ఆయుర్వేదం మందులిచ్చేవారు.

నిజానికి తెలుగుశాఖ ప్రారంభం కావడానికి ప్రధానకారకులు తంగిరాలవారు. వారితోపాటు తెలుగుశాఖ ప్రారంభానికి కృషిచేసినవారు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు. ప్రతి ఒక్కరూ, వారి ఆదరణను, ఆప్యాయతను పొందినవారే! అందుకే విద్యార్థులందరూ తంగిరాలవారంటే గురుభక్తితో

అభిమానంగా, ఆత్మీయంగా ఉంటారు. అందరినుండి ఆ ప్రేమను తంగిరాల వారు పొందారు. మా తెలుగుశాఖలో చేరిన అధ్యాపకులంతా వారి చలువతో చేరినవారే! ఆచార్య జి.యస్.మోహన్, ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి అందులో ముఖ్యులు. మేము కాకుండా ఆయన సమకాలికులు ఆచార్య బాడాల రామయ్య, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు, విద్వాన్ ఆర్. శంకరనారాయణరాజుగార్లు ఉండేవారు. నేను బెంగళూరు విశ్వవిద్యాలయంలో చేరేటప్పటికి ఆచార్య బాడాల రామయ్యగారు ఉన్నారు. ఆ తరువాత రెండు సంవత్సరాలకు రామయ్యగారు రిటైరయ్యారు.

తంగిరాలవారు నిత్య చైతన్యశీలి. తెలుగుశాఖకూడా కళకళలాడేది. సాహిత్య సందర్భం వెతికి, ఒక సమావేశం ఏర్పాటుచేసి, అప్పటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ నుండి వక్తలను పిలిపించి, ఉపన్యాసాలు ఇప్పించేవారు. ఆ విధంగా ఇక్కడ చదువుకునే విద్యార్థులకు సాహితీప్రముఖులను చూడగలిగే సదవకాశం కలిగేది. అలా ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, వద్దిపర్తి పద్మాకర్, శ్రీ ప్రసాదరాయ కులపతి వంటి వారిని ఎందరినో చూడగలిగే అవకాశం విద్యార్థులకు కలిగింది. శాఖలో కొంతమందే ఉన్నా నిరంతరం కోలాహలంగా ఉండేది. ప్రతి సంవత్సరం పరీక్షలకు ముందు ఒక రోజు సహోద్యోగులను, విద్యార్థులను, పరిశోధక విద్యార్థులను తీసుకెళ్ళి భోజనాలు పెట్టించి, ఎం.జి. రోడ్డులో ఉన్న జి.కె.వేల్ స్టుడియోలో గ్రూప్ ఫోటో తీయించేవారు. తంగిరాలవారు రిటైరయ్యాక అంటే 1996 తరువాత తెలుగుశాఖలో నిజంగా ఆ చైతన్యం లేకుండా పోయింది. నిజానికి తంగిరాలవారు రిటైరైనప్పుడు తీసుకున్న ఫోటోలే చివరివి. అ తరువాత ఒక్కటంటే ఒక్క ఫోటో విద్యార్థుల జ్ఞాపకంగా కానీ, తెలుగుశాఖ జ్ఞాపకంగా కానీ లేదు. ఆచార్య జయలక్ష్మి కొంత ప్రయత్నించారు కానీ, పెద్దగా ఫలితం రాలేదు. ఇప్పుడంటే మొబైల్ చేతిలో ఉంటోంది కనుక విరివిగా ఫోటోలు తీసుకోగలుగుతున్నాం కానీ, తంగిరాలవారు తీయించిన ఫోటోలు తప్ప ఆ తరువాత ఫోటోలు తెలుగుశాఖలో లేకపోవడం బాధే! ఒక మంచి సంప్రదాయం అక్కడితో ఆగిపోయింది. 'గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్' అని ఇలాంటి సందర్భాలలోనే అనిపిస్తుందేమో!

తంగిరాలవారిలో ఒక సహృదయలక్షణం ఉంది. ఎవరిపట్లా కోపం ప్రదర్శించక పోవడం. అన్నిటికీ చిరునవ్వుతో సమాధానం ఇవ్వడం. ఎవరినీ పరుషంగా మాట్లాడింది నేనెప్పుడూ కనలేదు-వినలేదు. నేనే కాదు తెలుగుశాఖలో ఎవరూ వినలేదు. ఎదుటి వ్యక్తిలో ఏ మంచి లక్షణం కనబడినా వెంటనే ప్రశంసిస్తారు. బాగా చదివే విద్యార్థులకు బహుమతిగా పుస్తకాలు ఇచ్చేవారు. తంగిరాలవారితో జ్ఞాపకాలు, వారందించిన సాహిత్యసౌరభం ఎవరూ మరవలేనివి. తిలక్ ప్రభావం తంగిరాలవారి మీద బలంగా ఉందనిపిస్తుంది నాకు. తిలక్ శతజయంతి సందర్భంగా (2021) 'రసగంగాధర తిలకం' పేరుతో విమర్శ వ్యాసాలు వెలువరించారు. శ్రీశ్రీకూడా బాగానే ప్రభావితం చేశాడు. శిఖామణి 'మువ్వల చేతికర్ర'ను తలచుకుని మురిసిపోయేవారు 'ఏం రాశాడు' అని. అలాగే ఎండ్లూరి సుధాకర్‌కవిత్వానికి పులకించేవారు-అభివ్యక్తి అద్భుతంగా ఉందనీ, ఉపమలు ఉల్లాసాన్నిస్తున్నాయనీ! మంచికవిత్వానికి పొంగిపోయేవారు. అందరూ చదవాలి అని ప్రోత్సహించేవారు! 'చైతన్యకవిత' పత్రికను చాలాకాలంపాటు (24 సం॥లు) తీసుకొచ్చారు. "శ్రీరస" సాహిత్యసంస్థను స్థాపించి 'నెలనెలా వెన్నెల' పేరుతో ప్రతీనెల సాహిత్య కార్యక్రమం నడిపేవారు.

తంగిరాలవారు వీరగాథలపైన చేసిన కృషి వారికి ఆశేషమైన కీర్తిని తెచ్చింది. కర్నాటకలో తంగిరాలవారు ఉంటూ వీరగాథలను, కథాచక్రాలను సేకరించడం ఒకపనైతే, ఆ సేకరించిన వాటిని ముద్రించడం మరో పెద్దపని; శ్రమతో కూడుకున్నది. బుడ్డా వెంగళరెడ్డి, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఆంధ్రదేశానికి చేసినసేవ, చూపిన కరుణను వివరిస్తూ 'రేనాటి సూర్యచంద్రులు' అనే పేరుతో పుస్తకం వేశారు. వారి 'వీరగాథాకవిత్వము' వెయ్యి పుటల గ్రంథం. కాటమరాజుకథలు (మూడు సంపుటాలు), అంకమ్మ కథాచక్రం ముద్రించారు. వీరగాథలమీద తంగిరాలవారు చేసిన కృషి భవిష్యత్తరాలవారికి దారిదీపం. ఎంతో శ్రమకోర్చి చేసిన కృషి ఇది. తపాలాశాఖలో పనిచేస్తూ, ఆ ఉద్యోగం వదిలేసి ('తపాలా బంట్రోతు' పేరుతో తిలక్ చేత తనపై కవిత రాయించుకున్నారు. అంతే కాదు తిలక్ రాసిన 'సుందరి-సుబ్బారావు'కథలో సుబ్బారావు తంగిరాలవారేనని చెప్పుకున్నారు.) ఒక విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఎదగడం అన్నది ఒక సుదీర్ఘమైన ప్రయాణం. ఆ ప్రయాణం సమాజహితానికి ఉపయోగించిన మాన్యులు

తంగిరాలవారు. ఆ సాహిత్య ప్రయాణంనుండి భవిష్యత్తరాలు నేర్చుకోవడానికి వలసినంత సాహిత్యంఅందించారు.

వజ్రం లక్షణం కాంతినివ్వడం. వజ్రం తనను ముక్కలు చేసినా వెలిగింది! సూర్యకిరణం వాలినా, వెన్నెల తళుకులీనినా మరింతగా వెలిగింది; ఆహ్లాదకర కాంతిని పంచింది. ఆచార్య తంగిరాల సుబ్బరావుగారు చిరునవ్వనే వజ్రాయుధంతో సాహితీలోకాన్నీ, సమాజాన్నీ వెలిగించారన్నది అక్షరసత్యం. అదే చిరునవ్వుతో తంగిరాలవారు మరింతగా సాహితీకాంతులను పంచాలని ఆకాంక్షిస్తున్నాను. ఆ భగవంతుడు వారికి ఆయురారోగ్యైశ్వర్యాలు సమృద్ధిగా ఇవ్వాలని కోరుకుంటున్నాను.

(ఆచార్య కట్టమంచి(కొలకలూరి)ఆశాజ్యోతి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో
తెలుగు అధ్యయనశాఖ వర్తమాన అధ్యక్షురాలు-తంగిరాల)

**మ॥ అలినీలాలకఁ, బూర్ణచంద్రముఖి, నేణాక్షిం, బ్రవాళాధరన్,**
**గలకంఠిన్, నవపల్లవాంఘ్రియుగళన్, గంధేభకుంభస్తనిన్,**
**బులినశ్రోణి, నిభేంద్రయాన, నరుణాంభోజాతహస్తన్, మహో**
**త్పలగంధిన్, మృగరాజమధ్య గని, విభ్రాంతాత్ములై రందఱున్.**

తా॥ తుమ్మెదలవంటి నల్లని ముంగురులు కలది; పూర్ణచంద్రునివంటి ముఖము గలది; లేడికన్నులవంటి కన్నులు గలది; పగడమువంటి ఎఱ్ఱని పెదవులు కలది; మనోహరమైన కంఠము కలది; లేతచిగుళ్లవంటి పాదములు కలది; మత్తగజముయొక్క కుంభస్థలములవంటి స్తనములు కలది; ఇసుక తిన్నెలవంటి విశాలమైన కటిప్రదేశము కలది; శ్రేష్ఠమైన గజమునడకవంటి నడకకలది; ఎఱ్ఱని పద్మములవంటి చేతులు కలది; ఉత్తమమైన కలువపూల పరిమళమువంటి సువాసనగల శరీరము కలది; సింహమునడుమువంటి సన్నని నడుముకలది – ఇటువంటి అందమైన లక్షణములు కలిగిన రుక్మిణిని చూచి, స్వయంవరానికి వచ్చిన రాజులందరూ ఆశ్చర్యచకితులైపోయారు.

(–పోతన భాగవతము, రుక్మిణీ కల్యాణము)

## 2.6.4 గురువందనం

- డా॥ జోస్యుల సదానందశాస్త్రి

చిరునవ్వులొలికెడు చిన్మయంబగుమూర్తి
తనరెడు పరమవిద్యాస్వరూపు
దంభోధిగంభీరు డఖిలశిష్యాత్ముండు
సతము భారతిసేవ సలుపువాడు
వరలు సైనికకుటుంబమునకు చెందిన
క్రమశిక్షణకు పేరు విమలయశుడు
అకళంకపూర్ణిమాప్రకటచంద్రుడితండు
సొబగగు చల్లని సూర్యుడితడు
శ్రీసరస్వతికిష్టుడై చెలగుబిడ్డ
తంగిరాల వంశాబ్దిని పొంగజేసి
తనరు టీ.వి.సుబ్బారావు ధన్యగురుడు
తత్కరుణ నెప్పుడున్మది దలచుచుందు

నిజంగా గురుశబ్దానికి లక్ష్యమూ లక్షణమూ కాదగిన వ్యక్తులు ఈ కాలంలో ఎవరైనా ఉన్నారా? అని వెతుక్కోవాలంటే కష్టపడకుండా దొరికే ఒక ఉదాహరణం- గురువుగారు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు. ఆయన సంక్షేప నామం టి.వి.సుబ్బారావుగారైనా టీవీలకున్న అవలక్షణాలేవీ అయనలో వెతికినా కనిపించకపోవడంవల్ల, ఆయనను "ఠీవి" సుబ్బారావని అంటే - ఆయనకున్న భీష్మసదృశరూపగుణవైభవగాంభీర్యాల కారణంగా అచ్చంగా అది సరిపోవచ్చు.

గురువుగారి మనస్సు పసిపాపలాంటిది. భగవంతుని దర్శనం పొందిన జ్ఞానివరేణ్యులను గురించి చెప్పే సందర్భంలో వారు "బాలోన్మత్తపిశాచత్" ఉంటారని చెబుతారు. ఆ లక్షణాలలో మిగతావి ఎలాఉన్నా "బాల" అనేదిమాత్రం గురువుగారిలో అచ్చుగుద్దినట్లు కనిపిస్తుంటుంది. ఆయన మనస్సులో ఏదీ దాగదు. ఏదైనా అది ఎదుటివారికి నచ్చవచ్చు నచ్చకపోవచ్చు తమ అభిప్రాయాన్ని సున్నితంగా చెప్పేస్తారు. ఎదుటివారు కాదన్నారనుకోండి. దాన్నిపట్టుకుని పిడివాదం

చేసే గుణం ఆయనలో వెతికినా కనిపించదు. అలాగంటారా నాకైతే అలా అనిపిస్తుంది మరి అనేస్తారు అంతే.

డాక్టరేట్ కోసం బెంగళూరు విశ్వవిద్యాలయంలో నాకు సీటు కల్పించడం అనేది ఒక విచిత్రమైన సన్నివేశంలో జరిగింది. నాకు మిత్రుడు గురువు హితైషి ఆత్మీయుడూ అన్నీ అయిన డా॥ ఆర్.శేషశాస్త్రిగారికి కూడా గురువే అయిన గురువుగారు ఏదో సందర్భంగా ఇలా జరిగిందంటూ ఒక లేఖను శేషశాస్త్రిగారికి రాశారు. అప్పుడు ఈయన "మా సదానందశాస్త్రిగారికి మీరు పిహెచ్.డి.కి సీటు ఇవ్వాలి" అని అడిగారు. పుట్టపర్తిలో ఒక వ్యక్తి ఉన్నాడనీ, ఆయన తన సీటు వదులుకుంటే ఆ సీటు ఇవ్వవచ్చుననీ గురువుగారు చెప్పడం, శ్రీశేషశాస్త్రిగారూ నేనూ పుట్టపర్తికి వెళ్ళడం, ఆ వ్యక్తి అంగీకార సూచకంగా పత్రం రాసి ఇవ్వడం, ఆ ఖాలీ అయిన సీటును గురువుగారు నాకు ఇవ్వడం జరిగిపోయాయి.

అది మొదలు అనేకపర్యాయాలు నేను గురువుగారి ఇంటికి వెళ్ళాను. వెళ్ళినప్పుడల్లా గురువుగారు అలాగే గురుపత్నిగారు చూపిన ఆదరాభిమానాలను మరచిపోలేను. తల్లి కడుపుచూస్తుందట, గురువు తల్లి లాంటివాడే అనేందుకు నిదర్శనంగా ఇంటికి వెళితే చాలు: 'అయ్యా బ్రాహ్మణోత్తమా! ఏమైనా తిన్నారా లేదా? మీరు ఉపవాసం ఉంటే నాకు మహాపాపం' అంటూ భోజనం పెట్టించేవారు. నేను బ్రాహ్మణోత్తముడనా కాదా అనేది పక్కనపెట్టండి. ఆయన మాత్రం గురూత్తములే!

మొదట నేను శ్రీకనకదాసుల నలచరిత్ర – శ్రీనాథుని శృంగారనైషదాలను తులనాత్మక పరిశోధనాంశంగా స్వీకరిద్దాము అనుకున్నాను. కనకదాసులు కర్ణాటక హరిదాస పరంపరకు చెందినవారు. వారు నలచరిత్రను షట్పదికావ్యంగా రచించారు. నా కోరికను గురువుగారు ఒప్పుకోలేదు. అంతకంటె సమానమైన విషయం ఛందోవిషయగాంభీర్యాలు ఉండే గ్రంథాలను స్వీకరిస్తే బాగుంటుందన్నది గురువుగారి అభిప్రాయం. తరువాత వారే కన్నడ ఆదికవి పంప–తెలుగు ఆదికవి నన్నయలను గురించిన తులనాత్మన అధ్యయనం నిర్వహించమని సలహా ఇచ్చారు. పూర్వ నిర్ణయమేదీ నా మనసులో లేనందువల్లా, కన్నడ పరిశోధనారంగంలో ఋషితుల్యులైన శేషశాస్త్రిగారు నా ప్రక్కలోనే అనంతపురంలో ఉండడంవల్లా, వారు అంగీకరించి సరి అనడం వల్లా అదే అంశాన్ని స్వీకరించాను.

ప్రీ-పిహెచ్.డి. పరీక్షకు వెళ్ళినప్పుడు నా వద్ద విశేషమైన సాధనాంశం ఏమీ లేదు. గురువుగారే తాము పూర్వం తయారు చేసి ఉంచిన ఒక సమగ్రవ్యాసాన్ని అందించారు. నేను ఆ వ్యాసాన్ని మెచ్చుకున్నప్పుడు గురువుగారు "నన్ను మెచ్చుకోవడం కాదండీ! మీరు ఇలాంటిది తయారు చేయగలగాలి" అని చెప్పిన భవిష్యన్మార్గ దర్శకమైన మాటను నేను ఎన్నడూ మరచిపోలేదు. బహుశా ఆ మాటే ఆశీస్సుగా పనిచేసి సుమారు 20 పుస్తకాలకు పైగా నాద్వారా తెలుగు కన్నడాలలో వచ్చేందుకు కారణమైందేమో!

పరిశోధనలో ఆద్యంతమూ శ్రీశేషశాస్త్రిగారు నాకు భారతఘోర రణంబునందు నారాయణునట్లు అభిమతస్థితి తోడయి ఉండి అది నిర్వహించ బడేటట్లు చేశారు గురువుగారు.

పరిశోధన ముగిసి పుస్తకం రాతప్రతి దగ్గర దగ్గర ఎనిమిదివందల పుటలకు వచ్చింది. ఐదు కాపీలను మోసుకుని వెళ్ళేసరికి గురువుగారు దాని పరిమాణం. చూసి తమ పరిశోధన వ్యాసం పుస్తకాలను ఆటోలో వేసుకుని పోయిన నాటి స్మృతులను నెమరువేసుకున్నారు.

తరువాత అనేక సందర్భాలలో వారితో అనేక కార్యక్రమాలలో పాల్గొనడం జరిగింది. ఎప్పుడు వారితో కలసినా సంభాషణంతా నవ్వులతో నిండిపోతుంది. "మీరు ఆ శేషశాస్త్రి కలిశారంటే నవ్వించి నవ్వించి చంపేస్తారు" అని పలికే గురువుగారి మాటలు అంతరంగంలో తృప్తిని ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. ఓ సారి సెంట్రల్ యూనివర్సిటీలో ఒకానొక విషయంమీద నిర్వహింబడడిన కార్యక్రమంలో కలిశాము. మధ్యలో గురువుగారు ఒకానొక విషయం గురించి నన్ను అడిగారు. "సార్! పక్కలోనే శేషశాస్త్రిగారు ఉండగా నన్ను అడగడమేమిటి సార్?" అన్నాను. అందుకు గురువుగారు నవ్వుతూ "అమ్మో! ఆయనతో ప్రమాదం. బ్రహ్మను బ్రహ్మడు అనేస్తాడు" అన్నారు. అందరం నవ్వుకున్నాము.

జ్ఞానభారతిలోనూ, గంగావతిలోనూ నా అవధానాలు నిర్వహింపజేశారు. ఎవరికైనా మొదట "వీరు నా శిష్యులు. మంచి పండితులు" అని కన్నులలో ఒక గర్వరేఖ తొణికిసలాడుతూండగా నన్ను పరిచయం చేస్తారు గురువుగారు. అది వారికి నాపై ఉన్న ఆదరానికీ వాత్సల్యానికీ నిదర్శనం అంతే!

గురువుగారి సలహా మేరకు డా॥ ఆర్. శేషశాస్త్రిగారితో కలసి గురువుగారి సంపాదకత్వంలో డా॥ ఏ.ఆర్.మిత్రగారి సమీక్షకత్వంలో డా॥ ఎం. వీరప్ప మొయిలిగారి సిరిముడిపరిక్రమణను తెలుగుకు అనువదించడం జరిగింది. ఇందులో పీఠికభాగాన్ని శ్రీమతి రోహిణీ సత్యగారు అనువదించారు.

నా పరిశోధనాప్రబంధాన్ని ముద్రించమని గురువుగారు పలుమార్లు చెప్పారు. కాని నేను ఆ పని చేయలేకపోయాను. మొత్తంగా దాన్ని శ్రీ అర్కసాలి వృషభేంద్రాచారిగారికి ఆయన కోరిక మేరకు పంపాను. వారు దాన్ని కన్నడకు తెచ్చే ప్రయత్నం చేస్తున్నారు. పంపభారతాన్ని తెలుగుకు అనువదించమని కూడా గురువుగారు ఇటీవల చెప్పారు. కన్నడ వచనానువాదాన్ని కూడా పంపారు. పరిస్థితులు అనుకూలించి టీకాతాత్పర్యాలతో పంపను తెలుగుకు తెచ్చే ప్రయత్నం ఇటీవల మొదలు పెట్టాను. డా॥ కె.ఆర్.గణేశగారు కావలసిన పుస్తకాలన్నిటినీ అనంతపురానికే తెచ్చి ఇచ్చారు. డా॥ శేషశాస్త్రిగారు వెన్ను తట్టి ప్రోత్సహించారు. “ఈ పని చాలా గొప్పదవుతుంది” అంటూ ఇటీవల వారి ఇంటికివెళ్ళినప్పుడు తృప్తిగా ఆశీర్వదించారు గురువుగారు.

గురువుగారిది సైనిక కుటుంబం. ఆ క్రమశిక్షణ వారిలో కనిపిస్తూనే ఉంటుంది. వసుధైకకుటుంబక జీవనం వారిది.

గురువుగారు శతాధికవర్షాయుష్కచిరంజీవులై అనేకరీతుల సాహిత్య రచనలను వెలార్చి తెలుగుసాహిత్యసరస్వతీసేవలో చిరంతన కీర్తిసంభరిత జీవనులు కావాలని ఆశిస్తూ, గురువుగారికి నమశ్శతసమర్పణచేస్తూ ఉన్నాను.

(డా॥ జోస్యులు సదానందశాస్త్రి
కన్నడాంధ్రావధాని; నివృత్తాంధ్రోపన్యాసకుడు;
శ్రీసాయిబాబా నేషనల్ జూనియర్ కాలేజ్; అనంతపురము)

ఈ గ్రంథములో నన్నుగురించి, నేను స్థాపించిన తెలుగు అధ్యయన శాఖను గురించి సమగ్రమైన సమాచారం ఉందని నేను భావిస్తున్నాను. అలాగే తెలుగు అధ్యాపకులుగా పనిచేస్తున్న నా పూర్వవిద్యార్థులకు ఉపయోగకరంగా ఉంటుందని తెలుగులోను, సంస్కృతంలోను ఉన్న మంచి మంచి పద్యాలు, శ్లోకాలు ఇచ్చాను. – తంగిరాల

## 2.6.5 గురుదేవులతో నా అనుబంధం

– డా॥ ఇప్పగుంట మాధవరావు

45 సంవత్సరాల క్రిందటి జ్ఞాపకం. నేను కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా దొండపాడు ప్రాథమికోన్నత పాఠశాలలో గ్రేడు-2 తెలుగు పండితునిగా పనిచేస్తున్న రోజులవి. అప్పటికే ఎం.ఏ. తెలుగు పూర్తిచేసాను. వేసవి సెలవులకు మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆచార్యునిగా పనిచేస్తున్న డా॥ లింగమనేని బసవ శంకరరావుగారు వారి స్వగ్రామానికి వచ్చారు. కళాశాలలో ఉపన్యాసకుడుగా చేరాలంటే పరిశోధన పట్టా ఉండాలనేది నిబంధన. ఎం.ఫిల్. సీటుకోసం వారిని సంప్రదించాను. నా అదృష్టవశాత్తు వారికి నా పై సదభిప్రాయం కలిగి "నా వద్ద అవకాశం లేదు. నా మిత్రుడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఉన్న ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి లేఖ రాస్తాను వారిని సంప్రదించ"మన్నారు.

ఆచార్య తంగిరాలవారికి లేఖ వ్రాసాను. చిన్న స్థాయిలో ఉన్న నాకు కూడ ప్రత్యుత్తరమిచ్చారు. తగిన ఏర్పాట్లు చేసుకొని ఉద్యోగానికి సెలవుపెట్టి నేరుగా వారి ఇంటికే వెళ్ళాను. ఆచార్య తంగిరాలవారి ధర్మపత్ని కీ॥శే॥ శ్రీమతి శకుంతలా దేవిగారు నన్ను సొంత బిడ్డలాగ ఆదరించి కొన్ని రోజులు ఆశ్రయమిచ్చారు. వారు చూపిన ఆదరాభిమానాలు ఇప్పటికీ మరచిపోలేను. తెలుగురాష్ట్రంలో ఎక్కడా అవకాశంలేని నాకు ఎం.పిల్. డిగ్రీకి సీటు ఇచ్చి నిస్వార్థంగా సహాయంచేసిన ఆచార్య తంగిరాలవారి సహృదయాన్ని ఇంతకాలమైనా ఇప్పటికీ మరచి పోలేకున్నాను. ఓ చిన్నపాఠశాలలో తెలుగుపండితుడుగా ఉన్న నేను ఓ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ప్రధానాచార్యునిగా పదవీ విరమణ చేశానంటే, నాడు వారు ఇచ్చిన అవకాశమే మూలకారణం. ఇది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అప్రయత్నంగా కన్నీళ్లు స్రవిస్తాయి. నాకు కీ.శే. ఆచార్య చన్నాప్రగడ తిరుపతిరావుగారిని పర్యవేక్షకునిగా నియమించి ఎం.పిల్. డిగ్రీ రావడానికి సహకరించారు. తంగిరాల వారు లాల్చీ ధరించి పంచెకట్టుతో బొట్టు పెట్టుకొని వస్తూ ఉంటే అపర శ్రీనాథునిలా ఉండేవారు. గోదావరియాస వారిలో ఉట్టిపడేది. నవ్వుతూ పలుకరించే నిష్కల్మషత్వం వారి మంచితనానికి తార్కాణం. వారు పాడే పల్నాటి వీరగాథలు, జానపద

బాణీలు వినసొంపుగా ఉండేవి. వారు కేవలం విద్యాబోధన చేయటమేకాక తమ విద్యార్థులపట్ల సమదృష్టితోచూపే ప్రేమాభిమానాలు చిరస్మరణీయాలు. వారు నిండునూరేళ్ళు సాహితీసేవ చేస్తూ! ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడపాలని భగవంతుని ప్రార్థిస్తూ.... మీ పూర్వ విద్యార్థి.


**– డా॥ ఇప్పగుంట మాధవరావు**
విశ్రాంత ప్రధానాచార్యులు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల

కందుకూరు
సెల్: 81977 65800
26.01.2023.




**సీ॥ ఏ నీ గుణంబులు కర్ణేంద్రియములు సోఁక**
**దేహతాపంబులు దీఱిపోవు;**
**ఏ నీ శుభాకార మీక్షింపఁ గన్నుల**
**కఖిలార్థలాభంబు గలుగుచుండు;**
**ఏ నీ చరణసేవ లేప్రొద్దు చేసిన**
**భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు;**
**ఏ నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ**
**దడవిన బంధసంతతులు వాయు;**
**తే॥ అట్టి నీయందు నా చిత్తమనవరతము**
**నచ్చియున్నది, నీయాన, నానలేదు;**
**కరుణఁజూడుము కంసారి! ఖలవిదారి!**
**శ్రీయుతాకార! మానినీచిత్తచోర!**

(– పోతన భాగవతము, రుక్మిణీ కల్యాణము)

# 2.7. కన్నడశిష్యుల గురువందనం

## 2.7.1 ఉత్సాహపు ఊట - ఆత్మీయతకు ఆకరం

**- ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి**

**(కన్నడ ఎం.ఏ. 1970-72 బ్యాచ్)**

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు, నేను బి.ఎ.(ఆనర్స్) చదివేటప్పుడు 1969 డిసెంబరు నెలలో బెంగళూరు విశ్వవిద్యాలయానికి తెలుగు అధ్యాపకులుగా వచ్చినారు. బి.ఎ. ఆనర్స్‌లో నేను తెలుగుభాషను 'మైనర్' సబ్జక్ట్‌గా చదివినాను. అప్పుడు మాతెలుగు అధ్యాపకులుగా ఉండినవారు విద్వాన్ రత్నాకరం శంకరనారాయణరాజుగారు. వారు చాలా మంచి అధ్యాపకులు.

అదే సమయంలో మా గురుబృందంలో ఉండిన డా॥ కె.ఎం. కృష్ణరాయగారు హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రాధ్యాపకులుగా నియమితులైనారు. అప్పుడు కన్నడవిభాగం పక్షాన వారికి వీడ్కోలు కార్యక్రమం ఏర్పాటుచేసినారు. ఆ సందర్భంగా మాట్లాడిన, వారి పలువురు విద్యార్థులలో మా ఇంటిభాష తెలుగు అయినందువల్ల నేనూ ఉన్నాను. ఉండనీ. నా మాటలలో ఒక ప్రత్యేకత చూపించుదాము అనుకొని, నా మాటలు కొనాన "నా తెలుగునాడుకు కన్నడపరిమళం అందిచ్చేదానికి, బయలుదేరిన గురువులైన డా॥ కె.ఎం. కృష్ణరాయగారూ! మీకు తెలుగువాళ్ళపరంగా నేను శుభస్వాగతం కోరుతున్నాను. అట్లనే తెలుగుభాషా సాహిత్యపరిమళం అందిచ్చేదానికి వచ్చిన డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారూ! మీకు మా కన్నడిగులపరంగా స్వాగతం కోరుతున్నాను" అని తెలుగుభాషలో చెప్పినాను. చప్పట్లతో నా మాట ముగిసింది. ఆ సందర్భంలో నిండా పులకితులైనవారు ఎవరంటే డా॥ తంగిరాలగారు. నాటినుండి నేటివరకు వారితో నా బాంధవ్యం పెరుగుతూనే ఉంది. వారు నన్ను శిష్యునిలాగా, ఆత్మీయమిత్రుని మాదిరి, తోడబుట్టిన తమ్ముని మాదిరి, విద్వాంసునిమాదిరి భావించినారు. నిండుహృదయంతో ఆత్మీయతతో తిట్టే వారితిట్లు నేటికీ నాకు ప్రియమైనవే! నేను వారిని చూచి నమస్కరించగానే వారు "అయ్యా! నీ దొంగనమస్కారాలు. నక్క వినయాలు చాలు. నువ్వు పెద్దదొంగ..." అని

మొదలుపెట్టితేనే నాకు తృప్తి. చాలా తొందరగానే నేను వాళ్ళ ఇంట్లో ఒక్కణ్ణయిపోయినాను. డా॥ తంగిరాలగారి భార్య శకుంతలాదేవిగారయితే నన్ను తమ కొడుకుమాదిరి వాత్సల్యంతో చూసినారు. వారి ఇంటికి పోయినప్పుడు నా కోలారుతెలుగు వాళ్ళకు అర్థంచేసుకోవడము కష్టమైపోయేది. అట్లనే నాకు గోదావరిప్రాంతపువారి తెలుగు అర్థం అయ్యేది కష్టమైంది. వారు కన్నడభాష నేర్చుకున్న తరువాత నా తెలుగు బాగా అర్థం కాదొడగింది. గురువుగారు విశ్వవిద్యాలయం క్వార్టర్స్‌కు పోయేంతవరకు వారానికి ఒకసారైనా వారిఇంటికి పోయివచ్చేవాణ్ణి. అప్పుడు గురువుగారు ఆధునిక తెలుగు సాహిత్యాన్ని నాకు పరిచయంచేసేవారు. శ్రీశ్రీ, బాలగంగాధరతిలక్, విశ్వనాథ సత్యనారాయణ, ఇట్లా అనేకులను పరిచయం చేసినారు. వారిలో శ్రీ కే.వి. రమణరెడ్డిగారివంటి మార్క్సువాది విమర్శకులు కూడా ఉన్నారు. డా॥ తంగిరాలవారికి పరమగురువైన డా॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు నన్ను బాగా ఇష్టపడినారు. వారికి నా కోలారుభాష ప్రియంగా ఉండింది. మా ఊరి తెలుగు జానపదసాహిత్యాన్ని నా ద్వారా సంగ్రహం చేయించి అధ్యయనం చేసేవారు.

డా॥ తంగిరాలగారికి నన్ను కవిని చేయాలనే కోరిక చాలా ఉండింది. దానికోసం నన్ను తమ ఊరికి పిలుచుకొనిపోయి గోదావరినదిలో దినానికి రెండుసార్లు చొప్పున ఎనిమిది దినాలు మునిగించినారు. గోదావరిలో ఒకసారి మునిగినవాడు కవి అవుతాడు అనేది ఆయన దృఢమైన నమ్మకం. కొనాదినం నేను వారితో “ఎలుకతోలుతెచ్చి ఏడాది ఉతికినా నలుపు నలుపె గాని తెలుపు కాదు” అనే వేమన మాటను చెప్పినప్పుడు జోరుగా నవ్వేసినారు. ఆ నవ్వు గోదావరి అలలమాదిరి అలలు అలలుగా ప్రసరించింది!

వారి తమ్ముడు శ్రీ కృష్ణమూర్తిగారు భారతీయసేనలో అప్పుడు మేజర్‌గా ఝాన్సిలోఉండినారు. నన్ను అక్కడికీ పిలుచుకునిపోయినారు. అప్పుడు శ్రీ కృష్ణమూర్తిగారు మమ్మల్ని ఖజురాహొాకు పిలుచుకునిపోయినారు. అక్కడి దేవాలయాల వాస్తుశిల్పం, మూర్తిశిల్పం (వాత్స్యాయన కామసూత్రానికి సంబంధించిన ఎన్నో శృంగార శిల్పాలు) నన్ను ఆకర్షించినవి. ఆ దేవాలయాలను చూస్తూ “సార్ మీరు ఇక్కడికి నిండా ఆలస్యంగా వచ్చినారు. నేను కొంచెం త్వరగా వచ్చినాను” అన్నప్పుడు పడిపడి నవ్వినారు!

సుమారు ఒక వారం రాజమండ్రి, విజయవాడ మొదలైన సర్కారు సీమలో తిప్పినారు. విశ్వనాథ సత్యనారాయణగారి ఇంటికి పిలుచుకునిపోయి వారి దర్శనభాగ్యం కలిగించినారు. వారు "ఈ బక్కవాడు చాలాహుషారుగా ఉన్నాడు" అని మా గురువుగారికి చెప్పినప్పుడు వారి కన్నులలో ఆనందం కదలాడుతూ ఉండింది.

నేను ఎం.ఎ. చదివేటప్పుడు తెలుగుభాష ఎలక్టివ్‌గా చదవాలనేది వారి కోరిక. నేను వారి కోరికకు విరుద్ధంగా కర్నాటక సాంస్కృతికచరిత్ర మరియు శాసనశాస్త్రాన్ని ఐచ్ఛిక విషయంగా తీసుకున్నాను.

నేను కర్నాటక వీరగల్లుల విషయాన్ని పిహెచ్.డి. డిగ్రీకోసం తీసుకున్నప్పుడు ఆయన ఎంత సంతోషించినారో! "నేను వీరగాథలను గురించి అధ్యయనం చేసినాను. నా శిష్యుడివైన నీవు వీరగల్లులను గురించి అధ్యయనం చేయడం నాకు చాలా సంతోషం కలిగించింది" అని మనసారా దీవించినారు. నాటినుండి కవిత్వంగురించి నాతో చర్చించడం వదిలేసి, పరిశోధనగురించి చెప్పసాగినారు. తమ కార్యక్షేత్రం గురించి నాకు వివరంగా చెప్పసాగినారు. అప్పుడు నాకు "నేను కూడా ఇదే రీతి విస్తారంగా క్షేత్రకార్యం చేయాల"నే ప్రేరణ దొరికింది.

నేటికీ వారి ఒక కోరికను ఒకటి నేను తీర్చలేదు. అది చెప్పితీరాలి. మా గురువుగారికి 'కవిత'లంటే విశేషప్రేమ. వారు 'చైతన్యకవిత' అనే పత్రిక తెచ్చేవారు. "అయ్యా శేషశాస్త్రీ, చైతన్యకవితకు చందాకట్టవయ్యా!" అని అడిగేవారు. వారిదగ్గర నాకున్న చనువువల్ల "లేదు సార్" అని ఖచ్చితంగా చెప్పేవాణ్ణి. ఒకసారి వారూ నేనూ ఎక్కడికో పోవాల్సి ఉండింది. బస్సుకోసం ఎదురు చూస్తూ ఉన్నాము. చాలాసేపటివరకు బస్సే రాలేదు. 'సార్, ఆటోలో పోదాము'' అన్నాను. ఆటో పిలిచి వారిని పిలుచుకొని పోయినాను. ఆటోచార్జి ఇవ్వబోయినారు. "లేదు సార్, ఇప్పుడు నేను నా పనిలో ఉన్నాను. నేనే ఇస్తాను" అన్నాను. "నీకెందుకయ్యా ఖర్చు?" అన్నారు. నేనే ఇచ్చినాను. ఆటోనుంచి దిగి నడిచి పోయేటప్పుడు "వెధవ, ఆటోకైతే ఇంతకర్చుపెడతావు. చైతన్యకవితకు చందా కట్టవయ్యా అంటే ఒప్పుకోవు" అని గొణిగినారు. 'సార్, మీకోసం ఎంతైనా ఖర్చుపెడతాను' అన్నప్పుడు 'సరే లే' అని గొణుక్కున్నారు. నేను వారికోసం ఖర్చుపెట్టిన దానికన్నా పొందిందే ఎక్కువ.

తెలుగు జానపదసాహిత్యంలో, అందులోనూ తెలుగు వీరగాథాసాహిత్యం గురించి మా గురువుగారు చేసినంత విస్తృతపరిశోధన ఇతరులెవ్వరూ చేయలేదు. పల్నాటియుద్ధవీరగాథలు, కాటమరాజుకథలు మొదలుకొని, రేనాటి సూర్యచంద్రుల వంటి ఆధునిక దానశూరవీరులపట్ల కూడా లోతుగా అధ్యయనంచేసి, అపూర్వమైన సమాచారాన్ని సంగ్రహించి ప్రకటించిన వారి జానపదసాహిత్యాసక్తి, శ్రద్ధ, సాహసం అనుకరణీయమైనవి; అనన్యమైనవి. వారికి అందవలసిన మన్నన, గౌరవాలు అందలేదు అనే బాధ నాకు ఉంది. ఈ విషయంలో వారికి నూవుగింజంత కూడా చింతలేదు. వారి దృష్టి ఎప్పుడూ తరువాతి ప్రకటనపట్ల ఉంటుంది.

డా॥ తంగిరాలగారు శిష్యవత్సలులు. బెంగళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఎ.చేసే విద్యార్థులకు, పిహెచ్.డి. చేసే విద్యార్థులకు వారు ఆశ్రయదాతలు.

నేను అనంతపురం శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకునిగా చేరిన తరువాత, వారు నాకు కన్నడ సాహిత్యంతోపాటు తెలుగు సాహిత్యంలోనూ పరిణతిని సాధించాలనే హెచ్చరిక చేశారు. శ్రీబండపల్లి ఓబళరెడ్డి, డా॥ కొలకలూరి ఇనాక్, డా॥ కోటేశ్వరరావు, డా॥ శలాక రఘునాథశర్మ, డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద, డా॥ పి.ఎల్.శ్రీనివాసులురెడ్డి, డా॥ చంద్రశేఖరరెడ్డి, డా॥ ఎం.కె. దేవకి మొదలైన వారితో కలసి మెలగడం నా జ్ఞానపరిధిని విస్తృతపరచింది. నా గురువూ, మిత్రులూ అయిన సదానందశాస్త్రిగారు తంగిరాలవారి వద్ద 'పంప నన్నయ తులనాత్మక అధ్యయనం' అనే విషయాన్ని స్వీకరించినప్పుడు ఏ సందేహం వచ్చినా నన్ను సంప్రదించాలని చెప్పడం వారి ఔన్నత్యం!

బెంగళూరు విశ్వవిద్యాలయం తెలుగు విభాగం నుండి పిహెచ్.డి డిగ్రీకి తెలుగు కన్నడ సాహిత్యాలకు సంబంధించిన పరిశోధనావ్యాసం సమర్పించినప్పుడు వారు నన్ను ఒక మూల్యాంకకునిగా చేసినారు. అటువంటి మూల్యాంకనం చేయాల్సివచ్చినప్పుడు నేను అధ్యయనం చేయాల్సివచ్చింది. ఈ విధంగా నన్ను పెంచినవారు నా గురువు సుబ్బారావుగారు.

నేను అనంతపురంలో ఉన్నప్పుడు రెండుసార్లు గురువుగారు మా ఇంట్లో బసచేసినారు. ఒకసారి తమ పత్నితోపాటు వచ్చి మమ్మల్ని ఆశీర్వదించారు.

ద్రావిడ విశ్వవిద్యాలయంలో ఉన్నప్పుడు అక్కడికీ వచ్చినారు. 'నా శిష్యుని ఇంట్లోనే నా బస' అని ప్రకటించే విశ్వవిద్యాలయానికి వచ్చినారు.

వారికి నేనంటే ఎనలేని అభిమానం, ప్రీతి, వాత్సల్యం. ఇవన్నీ అవ్యాజమైనవి; ఏ స్వార్థమూ లేనివి.

మా గురువుగారు అంతగా బ్రతుకనేర్చినవారు కారు. కొన్ని సందర్భాలలో తమ శిష్యులకోసం తమస్థాయినుండి దిగివచ్చి, "అయ్యా! వీడు బీదవాడు. పలుకబడి లేనివాడు. మంచివాడు. వీడికి ఉద్యోగం ఇచ్చి పుణ్యం కట్టుకోండి!" అని అక్షరాల ప్రాధేయపడటం నేను కళ్ళారా చూచినాను. (బహుశః వారు తమ పిల్లలకోసం కూడా ఇంత ఆరాట పడలేదు.) గొప్ప అధికారిగా ఉద్యోగం ఇవ్వగలిగిన ఉన్నత స్థానంలో ఉన్న ఎదుటివ్యక్తి, (అతడు గురువుగారికి బాగా తెలిసిన మిత్రుడే అయినా) వారి ముఖం మీదనే "లేదు, కుదరదు" అన్నాడు నిర్మొహమాటంగా. అయినా వారు దానిని అవమానంగా భావించలేదు. "సరేలేవయ్యా!" అని ముఖం చిన్నబుచ్చుకొని, బయటకు వచ్చి, ఆ శిష్యునితో "బాబూ! నువ్వు బాధపడవద్దు. దీని కంటే మంచి ఉద్యోగం నీకు వస్తుంది!" అని తమ బాధను దిగమ్రింగికొన్నారే కాని, ఆ అధికారిని గురించి ఏనాడు చెడ్డగా పెదవి విప్పి చెప్పలేదు. వారి ఆశీస్సులు పొందిన ఆ శిష్యునికి కొన్నాళ్లకి మరొకచోట ఇంకా మంచి ఉద్యోగం వచ్చింది! ఇక్కడ నేను మా గురువుగారు ఏదో మహిమగలవారు అని సాబీతు చెయ్యడానికి చెప్పడంలేదు. అలాంటి మహిమలు వారికి లేవు. నిండు హృదయంతో, శిష్యవాత్సల్యంతో దీవించే ఔదార్యం మాత్రం వారిలో మెండుగా ఉంది. ఇందులో లవలేశంకూడా స్వార్థంలేదు. ఆ శిష్యుడు బాగుపడిన తర్వాత "చైతన్యకవిత"కు చందా కట్టితే చాలు, గురువుగారు ఉబ్బితబ్బిబ్బయి పోతారు! అంతే!

గురువుగారిలో చూసిన ఒక విశిష్టగుణం వారి బంధుప్రేమ. వారికి తమ తల్లి అంటే అపారమైన గౌరవం, భక్తి. ఆమెను నే చూచిన ఐదారు దినాలు తుఫాన్ లాంటి ఆమె ఆదరాన్ని అనుభవించినాను. ఆమెకు గురువుగారు అక్షరాలా బెదిరేవారు. ఎదురు చెప్పేవారు కాదు. ఆమె ఎన్ని కష్టాలను ఎదిరించి సంసారం రక్షించుకొని పిల్లలను అభివృద్ధికి తెచ్చినారన్నదాన్ని పలుసార్లు గురువుగారు చెప్పి ఉన్నారు. గురువుగారికి తమ పెద్ద అన్నగారంటే అంతే గౌరవం, ప్రేమ. తమ్ముళ్లూ

అక్కయ్యలూ అంటే అంతే ప్రేమ, గౌరవం. వారికి తమ తమ్ముడైన కృష్ణమూర్తి అంటే ఎనలేని ప్రేమ, గౌరవం. ఒకవిధమైన కృతజ్ఞతాభావం.

మా గురుపత్నిగారిని గురించి ఒకటిరెండు మాటలు చెప్పకపోతే అది అపరాధమే అవుతుంది. ఆమే ఆ ఇంట్లో నాకున్న అపారమైన వెన్నుదన్ను. గురువుగారు నా పైన తమాషాకు రేగినా ఆమె నావైపున నిలిచేవారు. ఆమె నీడలో నిలిచి పలుసార్లు గురువుగారిని ఎదిరించాను, బెదిరించాను. ఆ తల్లిది నిర్మలమైన హృదయం. బెంగళూరికి వచ్చినప్పుడు వారి ఇంటికి పోకుండా అట్లే వెళ్ళిపోయినానని తెలిస్తే చాలు అగ్గిమీద గుగ్గిలమయ్యేవారు. మళ్ళీ ఇంటికి పోయినప్పుడు ఒక అరగంట తుఫానుగాలి. అప్పుడు నేను గురువుగారి వెనుక పిల్లిపిల్లలాగా దాక్కొనేవాణ్ణి. ఆ తరువాత తిండితీర్థాలకు ఆహ్వానం. తినేటప్పుడు గురువుగారిపై ఫిర్యాదుల జడివాన. వాన నిలిచిన తరువాత "నీవూ ఈయనంటివాడివే!" అని నవ్వుతూ ఊరకయ్యేవారు. **గురు-గురుపత్నులు నాకు రెండు తీరాలై ఉండేవారు. అటునుండి ఇటు, ఇటునుండి అటు తిరిగేవాణ్ణి. ఇప్పుడు నాకున్నది ఒకే తీరం!**

(ఈ చివరి రెండు వాక్యాలూ చదవగానే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దానితోపాటు, కేవలం పరిశోధన జడుడైన శేషశాస్త్రికి అంతో ఇంతో నా కవిత్వపు దురద అంటించగలిగాననే ఆత్మసంతృప్తికూడా కలిగింది! – తంగిరాల)

(కన్నడంనుండి అనువాదం: డా॥ జోస్యుల సదానందశాస్త్రి)

### 2.7.1.1 చిరంజీవి శేషశాస్త్రికి...ఉపనయన శుభాశీస్సులు!

**– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

(కోలారుజిల్లా సంతకల్లుపల్లెలో 11-04-1974నాడు ఉపనయనం చేసుకున్న నా ప్రియశిష్యుడు చిరంజీవి ఆర్.శేషశాస్త్రి ఎం.ఏ., కోసం వ్రాసిన ఆశీర్మణిమాల)

**ఎక్కడి గోదావరినది?**
**ఎక్కడి కోలారుజిల్లె ? ఏ జన్మల పెం**
**పెక్కిన వాసనయో, ఈ**
**బక్కయొడలివాఁడు వింత బందుగుఁడయ్యెన్!**

ఎంత కష్టమురాని, ఎంత నష్టముకాని
చిఱునవ్వు పెదవిని కరఁగిపోదు,
ఎట్టి దుష్టుఁడురాని, ఎట్టి భ్రాష్టుఁడుకాని
చెలిమి గుండెను వీడి చెదరిపోదు,
ఏమి విఘ్నమురాని, ఏమి భగ్నము కాని
హాస్యోక్తి నాలుక నాఱిపోదు,
ఏ సమస్యయురాని, ఏ సందియము కాని
దూరదృష్టి మనసుఁ దొలఁగిపోదు,

అట్టి నీకు నుపనయన మనుచుఁ బొంగి
కోటి గొంతుల నెత్తి నా గుండె పలుకు
మంగళాశీస్సు, శుభము లభంగముగను
భవ్యగాయత్రి నీకిచ్చు దివ్యశక్తి!

సంతకల్లు పల్లె సరసులో విరిసిన
జ్ఞానపద్మమయ్య శాస్త్రి నీవు!
అజ్ఞునకును గొఱయె యజ్ఞోపవీతంబు
తజ్ఞమూర్తి నీకు తగునుగాని!

ఊయిరప్పలోని వ్రాతకోతలఁ జూచి
గడ గడ గడఁ జదువు పిడుగవీవు
కష్టమగునె నీకు గాయత్రి మంత్రంబు?
శిష్యశేఖరుండ శేషశాస్త్రి!

రాముఁడు గాచుగాక ! బలరాముని తమ్ముఁడుఁ బ్రోచుగాక ! ఆ
సోముని మౌళిదాల్చిన త్రిశూలియు నాయువొసంగుగాక! ఆ
కామునిఁ గన్నతల్లి కలకాలము సంపద లిచ్చుగాక! సు
త్రాముని కన్న మిన్నయగు రాజితభోగము లబ్బుగాక ! శే
షా! మహనీయ యోగ్యపురుషా! ఘనసాహస! హాస్యమానసా!

– డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

(రచన: 14.04.1974; ముద్రణ: "బఫూన్" పత్రిక, 05.03.1975)

**ముఖ్యగమనిక:–** చి॥ శేషశాస్త్రి ఉపనయన సమయంలో నేను ఈ పద్యాలు గొంతెత్తి అతని తల్లిదండ్రులముందు, అన్నలముందు, బంధువులముందు చదవగానే ఒడక పెండ్లి కొడుకైన శేషశాస్త్రి మిక్కిలి ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయి వలవల ఏడుస్తూ నా పాదాలమీద పడిపోయాడు! ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళముందు కదలాడుతూనే ఉంది! అతని బంధుగణమంతా ఎంతో సంతోషించారు. ఇక్కడ ఒక ముఖ్యవిషయం చెప్పాలి. శేషశాస్త్రి మా యింటికి వచ్చి, నన్ను తన ఉపనయనానికి ఆహ్వానిస్తూ: "మీరు నన్ను ఆశీర్వదిస్తూ కవిత్వం వ్రాసి చదవాలి! అయితే మీ వచన కవిత్వం నాకు పనికిరాదు! మీరు ఛందోబద్ధమైన పద్యకవిత్వం వ్రాసి చదవాలి!" అని శాసించడంతో నేను ఎంతో కష్టపడి, నాకు అంతగా అలవాటులేని పై పద్యరచన చేశాను. అది పెద్ద ద్రావిడప్రాణాయామం అయిపోయింది నా ప్రాణానికి! 30.03.1995 నాడు నాకు షష్ఠిపూర్తి అయింది. అప్పుడు నేను, పూర్వం శేషశాస్త్రి నన్ను ఎలా అడిగాడో సరిగ్గా అలాగే, ప్రముఖ కవి గుంటూరు శేషేంద్రశర్మగారిని ఛందోబద్ధమైన పద్యాలలో నన్ను ఆశీర్వదించమని కోరాను. వారు నా కోరికను మన్నించి, రెండు మంచి పద్యాలు వ్రాసి పంపించారు. వాటినే నా గ్రంథాలన్నింటిలోను ఎంతో ఆనందంతో ముద్రించుకుంటున్నాను. – తంగిరాల)



**మ॥ ధర సింహాసనమై, నభంబు గొడుగై, తద్దేవతల్ భృత్యులై,**
**పరమామ్నాయములెల్ల వందిగణమై, బ్రహ్మాండమాగారమై,**
**సిరి భార్యామణియై, విరించి కొడుకై, శ్రీగంగ సత్పుత్రియై,**
**వరస న్నీఘనరాజసంబు నిజమై, వర్ధిల్లు నారాయణా!**

(–నారాయణ శతకము)

## 2.7.2 ఇష్టమైన తెలుగుగురువు - డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు

- శ్రీ మార్కండపురం శ్రీనివాస
(ఎం.ఏ. కన్నడ 1972-74 బ్యాచ్)

తెలుగు ఆచార్యులుగా, సీనియర్ సాహితీవేత్తగా, జానపద నిపుణులుగా, పరిశోధకులుగా తెలుగుసాహిత్యరంగంలో విశిష్టసేవలు అందించిన డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు ఆంధ్రప్రదేశ్‌లోని పశ్చిమగోదావరిజిల్లా, తణుకు తాలూక కాకుల ఇల్లిందలపఱ్ఱు గ్రామానికి చెందినవారు.

డా॥ తంగిరాలవారు మార్చి 30, 1935న శ్రీమతి సీతామహాలక్ష్మి మరియు శ్రీ వెంకట సుబ్బావధాని దంపతులకు జన్మించారు. స్వగ్రామం, రాజమండ్రి, భీమవరం, మరియు తిరుపతిలో చదివి తెలుగు ఎం.ఏ. (1963) డిగ్రీ తరువాత, "తెలుగు జానపద-వీరగాథలు"పై పరిశోధన చేసి Ph.D. (1969) పట్టాను పొంది, తిరుపతిలో కొంతకాలం పరిశోధకునిగా సేవలందించారు. 1969లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన కేంద్రంలో తెలుగు లెక్చరర్‌గా తన వృత్తిని ప్రారంభించారు. 1978 వరకు కన్నడ అధ్యయన కేంద్రంలో సేవలందించి, అనంతరం 1978-1980 లో బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు విభాగానికి ఛైర్మన్‌గా, 1980-1983లో గుల్బర్గా విశ్వవిద్యాలయంలో మొదటి పరీక్షానియంత్రణాధికారిగా, 1983-1987లో బెంగుళూరులోని తెలుగు అధ్యయన విభాగానికి రీడర్‌గా, 1983-1996లో తెలుగు అధ్యయన విభాగం ప్రొఫెసర్‌గా, 1998-2000 కాలంలో తెలుగు అధ్యయన విభాగంలో ఎమిరిటస్ ప్రొఫెసర్ (UGC)గా పనిచేశారు. ఆయన వ్యక్తిగతకృషితో బెంగళూరు విశ్వవిద్యాలయంలోని జ్ఞానభారతిలో తెలుగు అధ్యయన విభాగం ఏర్పాటైంది. తద్వారా కర్ణాటకలో వందలాదిమంది తెలుగు మాస్టర్స్ డిగ్రీలు, పరిశోధనలు చేయగలిగారు.

డా॥ తంగిరాలవారు కవిగా "హంసపదిక" (శృంగార కావ్యం) 1967, "వనదేవత" (బుర్రకథ) 1968, "గుండెపూసిన గులాబీ" (వచన కవిత) 1987, "నా ముద్దబంతిపువ్వు" (వచన కవిత) వంటి కవితా రచనలు చేశారు.

ముఖ్యంగా పరిశోధకులుగా "జానపద సాహిత్యం – వీరగాథలు" (1975), "కాటమరాజుకథలు" (1976), అంకమ్మకథలు" (1993), శ్రీకృష్ణకర్ణామృతము (సంపాదకులు) 1998, "రేనాటి సూర్యచంద్రులు" (1999) వంటి సుమారు 30 రచనలు చేశారు. ప్రధానంగా వీరి రచనలు జానపద అధ్యయనాలకు సంబంధించినవి. వీరి రచనలు ఎక్కువగా "శ్రీరస" ప్రచురణలు ద్వారా ప్రచురించబడ్డాయి.

డా॥ తంగిరాలవారు ఆంగ్లంలో కూడా అనేక రచనలు చేశారు.

అలాగే డా॥ తంగిరాలవారు కన్నడంలో "వేమన– ఎరడు అధ్యయనగళు" (1993), "విశ్వనాథ సత్యనారాయణ" (1995) అను రచనలు చేశారు. "హిమవద్ గోపాలస్వామి" (1997) అనేది వీరు సంపాదకత్వం వహించిన రచన.

తెలుగులో డా॥ జి.ఎస్. మోహన్, శ్రీమతి అంబికా అనంత్, డా॥ ముదిగండ వీరభద్రయ్య, డా॥ మల్లెల గురువయ్య మొదలుగా దాదాపు పదిమంది సాహితీవేత్తలు వారి రచనలను డా॥ తంగిరాలవారికి అంకితం చేశారు.

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు సుమారు 15 మందికి పిహెచ్.డి. డిగ్రీ మరియు 25 మందికి ఎం.ఫిల్. కోసం (గైడ్ గా) మార్గనిర్దేశం చేశారు. అలాగే, వారు కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు మొదలైన అనేక ప్రాంతాలకు అతిథిగా ఆహ్వానించబడి అనేక మౌలిక ఉపన్యాసాలు అందించారు.

డా॥ తంగిరాలవారు "చైతన్య కవిత" అనే అర్ధవార్షిక సాహిత్యపత్రికకు సంపాదకత్వం వహించారు.

డా॥ తంగిరాలవారు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో సాహిత్యపరంగా నిర్వహించిన కార్యక్రమాలలో 'భువన విజయం' (1974–1994), అర్థవంతమైన సాహిత్య కార్యక్రమం.

డా॥ తంగిరాలగారు 'శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య' ("శ్రీరస")ను తేది. 11. 04. 1994 ఉగాదినాడు స్థాపించి ప్రతినెలా ఎన్నో గొప్ప కార్యక్రమాలు నిర్వహించారు. ఈ కార్యక్రమాలలో ఎందరో ప్రముఖ సాహితీవేత్తలు, సాహితీ ప్రియులు పాల్గొని విజయవంతం చేశారు. ఇది నేటికీ కొనసాగుతోంది. బెంగుళూరులోని తెలుగు విజ్ఞాన సమితి మరియు అనేక ఇతర తెలుగుసంస్థలతో వీరికి సన్నిహిత సంబంధం ఉంది. వీరు అనేక రంగాలలో సలహాదారులుగా వ్యవహరించారు.

డా॥ తంగిరాలగారు తెలుగుభాష మరియు సాహిత్యానికి చేసిన అద్వితీయ సేవకుగాను  దాదాపు 30కి పైగా గొప్ప అవార్డులు సన్మానాలు పొందారు. అందులో "ఉగాది పురస్కారం" (1997) హైదరాబాద్, "కవిత్రయ పురస్కారం" (1998) నెల్లూరు, "సాహిత్య పురస్కారం" (2000) విజయవాడ, సాహిత్య పురస్కారం (2006) కుప్పం, 'తెలుగు భాషాపురస్కారం' (2007) బెంగళూరు, "ఉగాది పురస్కారం" (2003) బెంగుళూరు, గురువందనం-1 (2010) బెంగళూరు, గురువందనం-2 (10.06.2022) ప్రధానమైనవి. వీరికి "వీరగాథల సవరాలజిమ్మడు", "రసజ్ఞరాజశేఖరుడు" వంటి బిరుదులు లభించాయి.

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు 1969-1974 మధ్యకాలంలో నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన కేంద్రంలో కన్నడ బి.ఎ. (ఆనర్స్) మరియు ఎం.ఎ. చదువుకునే సమయంలో నాకు తెలుగు గురువర్యులు. బి.ఎ. (ఆనర్స్)లో తెలుగు సాహిత్యం ఒక చిన్న విషయంగా ఎం.ఎ.లో ప్రధాన విషయంగా చదువుకునే అవకాశం కలిగింది. తర్వాత తెలుగు చదివిన మాకు పరీక్షలో కన్నడంలో సమాధానాలు రాసే అవకాశం కల్పించారు.

డా॥ తంగిరాలగారు 1969 డిసెంబర్‌లో బెంగుళూరు వచ్చారు. అప్పటికి వారు బెంగుళూరుకు కొత్త. తెలుగు ప్రాంతంనుండి బెంగుళూరుకు వచ్చిన తంగిరాలవారికి కన్నడ రాదు. కానీ వారు మాకు తెలుగు మరియు కన్నడ భాషలలో తెలుగు పాఠాలు చెప్పవలసివచ్చింది. నేను కోలార్ జిల్లాకు చెందినవాడిని మరియు మా ఇంట్లో కన్నడ-తెలుగు భాషలు రెండూ ఉపయోగించేవాళ్ళం. నాలాగే కొంతమంది విద్యార్థులకు కన్నడ-తెలుగు రెండు భాషలూ సుపరిచితం. కాబట్టి డా॥ తంగిరాలగారు తెలుగు-కన్నడ రెండు భాషల మధ్య వారధిలా బోధిస్తూ అనతికాలంలోనే అందరికి అభిమాన ఉపాధ్యాయుడయ్యారు.

నాకు కన్నడ మరియు తెలుగు భాషలతో పరిచయం ఉంది మరియు సహజంగానే నాకు సాహిత్యరంగంలో చాలా ఆసక్తి ఉండేది. నేను బి.ఎ. (ఆనర్స్) విద్యార్థిగా ఉన్న సమయంలో కన్నడంలో కవితలు రాస్తుండేవాడిని. తెలుగు భాష తెలిసిన నేను తెలుగు దినపత్రిక, వారపత్రికలను అప్పుడప్పుడు చదువుతుండేవాడిని. ఆ కాలంలో తెలుగు పత్రికలలో కనిపించే ప్రముఖ తెలుగు కవి డా॥ సి.నారాయణరెడ్డిగారి కవితలను కన్నడలోకి అనువదించి, వాటిని నా కన్నడ, తెలుగు ఉపాధ్యాయులకు చూపిస్తుండేవాడిని.

ఆ సమయంలో డా॥ సి.నారాయణరెడ్డిగారికి మిత్రులు అయిన డా॥ తంగిరాలగారు నా కన్నడ అనువాద కవితలను ప్రస్తావిస్తూ డా॥ నారాయణరెడ్డిగారికి నన్ను పరిచయం చేస్తూ ఉత్తరం వ్రాశారు. అలా తెలుగునుండి కన్నడంలోకి అనువదించిన డా॥ సి. నారాయణరెడ్డిగారి "ఒక్కణ్ణే ఒకే ఒక్కణ్ణి" అనే తొలికవిత ఒక కన్నడ వారపత్రిక (11.03.1970)లో ప్రచురింపబడింది. అది కోలారుజిల్లా ప్రథమ సాహిత్యసమ్మేళన (1970) స్మారక సంచికలో ప్రచురితమైంది. ఆ తర్వాత డా॥ రెడ్డిగారి అనువాద కవితలు కొన్ని నా కన్నడ గురువుగారు డా॥ హంప నాగరాజయ్య సంపాదకత్వంలో 'జీవన' మాసపత్రిక మరియు 'కన్నడప్రభ', 'లోకవాణి' వంటి వార్తాపత్రికలలో వస్తూవున్నాయి. తర్వాత నేను వరుసగా 1976 లో డా॥ సి.నారాయణరెడ్డిగారి 'ఒక కొత్త ముఖం' (ఎంపిక కవితలు) 'విశ్వంభరా' (జ్ఞానపీఠ పురస్కారం పొందిన దీర్ఘకావ్యం), తాజాగా "కలం అలిగింది" (లేఖిని మునిగిపోయింది) చేరి ఇప్పటివరకు 15 కవితారచనలు కన్నడలోకి అనువదించాను. వాటిలో 12 కవితా రచనలు ప్రచురించబడ్డాయి.

డా॥ సి. నారాయణరెడ్డిగారిని నేను హైదరాబాద్, బెంగుళూరు, మైసూరులలో మరియు వారి ఇంటిలో చాలాసార్లు కలిశాను. బెంగళూరు, మైసూరు మరియు హైదరాబాద్‌లలో వారితో కలిసి నేను చాలా సమావేశాలు, కార్యక్రమాలకు హాజరయ్యాను.

డా॥ తంగిరాలగారు నాకు తెలుగులో పాఠం బోధించిన మహాకవి 'శ్రీశ్రీ'గారి 'మహాప్రస్థానం', ప్రముఖకవి డా॥ జె.బాపురెడ్డిగారి 'కాలం మాయాజాలం' (కాల మాయాజాల), ప్రముఖ కవి డా॥ ఎన్. గోపిగారి 'జలగీత' (దీర్ఘకవిత) ఇంకా అనేక తెలుగు కవుల కవితలను, చలంగారి 'అమీనా' మరియు 'అరుణ' నవలలను, కర్ణాటకలో గౌరవనీయులు గవర్నర్ అయిన డా॥ వి.ఎస్. రమాదేవిగారు రచించిన "అందరూ మనుష్యులే" (ఎల్లరూ మనుష్యరే) మరియు "అనుబంధం" (సంబంధాలు) అను నవలలను, మరియు కొన్ని ఇతర అనువాదాలను చేశాను. అవి ప్రచురించబడ్డాయి.

కన్నడ జాతీయకవి కువెంపు (డా॥ కె.వి.పుట్టప్ప)గారి 'పక్షికాశి' (కవితా సంపుటి) మరియు డా॥ పి.ఎస్.రామానుజంగారి ఎంపిక చేసిన కన్నడ కవితా సంకలనం "నదితో ప్రవాహించినప్పుడు" మొదలైన కొన్ని తెలుగు అనువాదాలు

చేయగా అవి ప్రచురించబడ్డాయి. ప్రధానంగా కన్నడలో సృజనశీల కవిగా ఇప్పటికి నేను నా సొంతంగా కన్నడంలో రచించిన "ఇణుకునోట" (1978) నుండి తాజాగా "బిళలుగళు" (2020) వరకు మొత్తం 16 కవితా సంపుటాలు ప్రచురించబడినవి.

డా॥ తంగిరాలగారి సహాయంతో నేను మొదట కన్నడ నుండి తెలుగులోకి అనువదించిన ప్రముఖ కన్నడకవి, నా కన్నడ గురువు డా॥ జి.ఎస్. శివరుద్రప్ప గారి మరియు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత కన్నడకవి కువెంపు (కె.వి.పుట్టప్ప) గారి కవితలలో కొన్ని తెలుగు వారపత్రికలు, మాసపత్రికలలో ప్రచురించబడ్డాయి.

1970లో ప్రచురితమైన నా తొలి తెలుగు వ్యాసం 'పల్లెలో ఆసుపత్రి' అని చెప్పాలి. ఇది సెంట్రల్ కాలేజీ వార్షిక సంచికలో ప్రచురితమైంది. దీనికి డా॥ తంగిరాలగారే కారణం మరియు మార్గదర్శకులు.

ప్రారంభంలో జాతీయకవి కువెంపుగారి కవితా సంపుటి "పక్షికాశి" అనే రచన నేను తెలుగులోకి అనువదించి ప్రచురించడానికి డా॥ తంగిరాలగారు మార్గనిర్దేశం మరియు సహాయం చేశారు. తదుపరి దీనిని ప్రచురించడానికి తెలుగు ఆచార్యులు సీనియర్ కవయిత్రి, సాహితీవేత్త అయిన డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు సహకరించారు.

డా॥ తంగిరాలగారు డా. పి.ఎస్.రామానుజంగారి తెలుగు కవితా సంకలనం "నదితో ప్రవహించినప్పుడు" (నదియొడనె హరిదాగ) అనువాదంలో నాకు మార్గనిర్దేశం చేసి సహాయం చేశారు. ఈ రచన విడుదల కార్యక్రమానికి వచ్చి నన్ను ఆశీర్వదించి, ఈ రచన గురించి మాట్లాడి ఆశీర్వదించడం ఆయన మొదటినుంచి నాపై చూపించిన వాత్సల్యానికి నిదర్శనమని చెప్పుకోవాలి.

1973-74లో, బెంగుళూరు సెంట్రల్ కాలేజీ అవరణలోని కన్నడ అధ్యయన కేంద్రం జ్ఞానభారతికి మార్చబడింది. అప్పుడు నేను బెంగుళూరు సెంట్రల్ కాలేజీ హాస్టల్‌లో ఉంటూ క్యారియర్‌లో భోజనం/టిఫిన్ తీసుకొస్తున్నాను. ఆ క్యారియర్‌ను గురువుగారు డా॥ తంగిరాలగారి ఇంటిలో పెట్టుకుంటూ అలా చాలాసార్లు వారితో కలిసి భోజనం చేసే అవకాశం కలిగింది. అప్పట్లో బెంగుళూరు యూనివర్శిటీలో తెలుగుశాఖ ప్రత్యేకంగా ప్రారంభించలేదు. నేను నా ఎం.ఏ. పూర్తిచేసిన తర్వాత అది ప్రారంభమయ్యింది. నేను 1974లో నా ఎం.ఎ. ముగించిన

తర్వాత హాసన్‌జిల్లాలోని అరకలగూడు ప్రభుత్వ జూనియర్ కళాశాలలో కన్నడ లెక్చరర్‌గా జీవితం ప్రారంభించాను.

డా॥ తంగిరాలగారు బి.ఎ. (ఆనర్స్) మరియు ఎం.ఎ తరగతులలో తెలుగు సాహిత్యంలోని తిక్కనభారతం విరాటపర్వంగురించి, అల్లసాని పెద్దన్న "మనుచరిత్ర" గురించి, వేమన పద్యాల గురించి ఎంతో ఉద్వేగంతో, గుండె దడదడలాడిస్తూ క్లాసుల్లో బోధించడం ఇప్పటికీ మరచిపోలేను. మనుచరిత్ర పద్యాలు ఇప్పటికీ నా నాలుకపై ఉన్నాయని చెప్పాలి. అలాగే, నేను కన్నడ ఎం.ఏ. పూర్తి చేసిన తర్వాత, "తిక్కన మరియు కుమారవ్యాస విరాటపర్వములు- ఒక తులనాత్మక పరిశీలన" పిహెచ్.డి. గురించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో గురువర్యులు డా॥ కె.ఎం. కృష్ణారావుగారి మార్గదర్శకత్వంలో పరిశోధన చేయాలని చదువుకోవాలని అనుకున్నాను. కాని అదే సమయంలో ప్రభుత్వ ఉద్యోగం కోసం వేరే చోటుకు వెళ్లినందున అది కుదరలేదు.

డా॥ తంగిరాలగారు నాకు డా॥ సి.నారాయణరెడ్డిగారిని పరిచయం చేయడమే కాకుండా తెలుగు సాహిత్యంలోని ఎందరో కవులను, వారి రచనలను పరిచయం చేశారు. ప్రముఖ తెలుగుకవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ 16.04.2000 న బెంగళూరు ప్యాట్రియా హొటల్‌లో, ప్రముఖ కవి శ్రీ పఠాభిరామిరెడ్డి, ప్రముఖ కవి డా॥ జె.బాపురెడ్డి, ప్రముఖకవి డా॥ ఎన్.గోపి, సీనియర్ కవి డా॥. రామ్మోహనరావుగార్లను వివిధ సందర్భాల్లో నాకు పరిచయం చేశారు.

మహాకవి "శ్రీశ్రీ" గారి "మహాప్రస్థానం" కవితా సంకలనం నాకు ఎం.ఏ. క్లాసులో పాఠంగా ఉండేది. అప్పటికే నేను ఆయన కవితలన్నింటినీ కన్నడలోకి అనువదించాను. డా॥ తంగిరాలగారు బోధించేటప్పుడు ఆయన గురించి మరింత అధ్యయనంచేసే అవకాశం నాకు లభించింది. ఆ రచనలోని కవితలన్నీ కన్నడలోకి అనువదించబడ్డాయి. ఆ తర్వాత 1991లో పూర్తి కన్నడఅనువాదాన్ని డా॥తంగిరాలగారి ముందుమాటతో ప్రచురించాను. ఈ కృతియొక్క రెండవ ముద్రణ 1996-97లో జరిగింది. ఈ అనువాదం మూడు సంవత్సరాల పాటు కర్ణాటక విశ్వవిద్యాలయంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కన్నడ ఐచ్ఛిక కోర్సులో పాఠ్యపుస్తకంగా నిర్ణయించబడింది.

డా॥ తంగిరాలగారు నా అనువాద పనికి మార్గదర్శకత్వం వహించడమే కాకుండా, తెలుగులోని అనేక ముఖ్యమైన రచనలను పోస్ట్ ద్వారా పంపి నాకు సహాయం చేశారు. వాటిలో 1980లో తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన "శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు" (6 సంపుటాలు) ఒకటి.

నేను 1974లో ఎం.ఎ.పట్టా పొందిన తరువాత 1975లో కన్నడ ఉపన్యాసకుడిగా నా వృత్తిని ప్రారంభించి, అరకలగూడు, మాలూరు ప్రభుత్వ జూనియర్ పాఠశాలల్లో పనిచేసి, తర్వాత 1980లో కన్నడ మరియు సాంస్కృతికశాఖలో సహాయ సంచాలకులుగా చేరి, కోలార్, బెంగుళూరు, మైసూరులలో వివిధ హోదాలలో పనిచేసి, చివరిగా బెంగుళూరులో శాఖ సంచాలకులుగా పనిచేసి, 2006లో నా వృత్తి నుండి విశ్రాంతి పొందాను.

1974లో ఎం.ఏ. డిగ్రీ పొందిన తర్వాత కొంతకాలం నేను తరచుగా అభిమానంతో కన్నడ అధ్యయన కేంద్రాన్ని సందర్శించి, నా గురువులను కలిసేవాడిని.

ఆ సమయంలో డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు, డా. ఎస్. విద్యాశంకర్ మరియు ప్రొ॥ హెచ్.కె. జయదేవ్ జ్ఞానభారతి క్వార్టర్స్‌లో పక్కపక్కనే ఉండేవారు. ముఖ్యంగా సెలవు దినాల్లో వారి నివాసాలకు వెళ్లి అనేక సాహిత్య విషయాల గురించి చర్చించేవాడిని.

సాధారణంగా సెలవు రోజుల్లో కన్నడ-తెలుగు అనువాద పనులకు సంబంధించి డా॥ తంగిరాలగారితో సమావేశమయ్యేవాడిని. ఆ సందర్భాలలో నేను ఆయనను, ఆయన ధర్మపత్ని శ్రీమతి శకుంతలాదేవిని దర్శించుకునేవాడిని. వారు నాపై చూపిన ఆదరణ, ప్రేమాభిమానాలు అపూర్వం.

డా॥ తంగిరాలగారి కుటుంబంలో అందరూ నాకు సుపరిచితులే. తంగిరాలగారి భార్య మరణం గురించి ఆలస్యంగా తెలుసుకొని నేను చాలా బాధపడ్డాను. తరువాత నేను వారిని ఓదార్చడానికి వారింటికి వెళ్ళి పరామర్శించి వచ్చాను. గురువుగారి కుమారుడైన శ్రీ సీతారామరాజు మరణం గురించి కూడా నేను ఈ మధ్యనే విన్నాను. చాలా బాధగా ఉంది. గురువుగారికి జరిగిన ఈ నష్టాన్ని తట్టుకునే శక్తిని ఇవ్వమని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను.

ఈ మధ్య డా॥ తంగిరాలగారిని కలవటం అరుదనే చెప్పాలి. అయితే తెలుగు విజ్ఞాన సమితి, సి.పి.బ్రౌన్ సేవా సమితి, రచయిత్రులయిన డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు, శ్రీమతి అంబికా అనంత్‌గారు, మరికొన్ని సంస్థలు నిర్వహించే సాహితీసభలలో నేను గురువుగారిని కలిసే అవకాశం కలిగింది. డా॥ తంగిరాల గారు నిండు నూరేళ్లు సంపూర్ణ ఆరోగ్యంతో ఉండాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను.

**(–కన్నడంనుండి అనువాదం: డా॥ తోట వెంకటస్వామి)**

### "ఆంధ్రకేసరి"

1954లో ఒకసారి విశ్వనాథ సత్యనారాయణగారికి కర్నూలులోని ఆంధ్ర రాష్ట్రసచివాలయంలో ఏదో పని కావలసి వచ్చింది. చాలా రోజులుగా ఆ వ్యవహారం తెమలకపోవడంతో ఏదో సందర్భంలో ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశంపంతులుగారిని కలిసినప్పుడు ఆ విషయం ప్రస్తావించారు. సచివాలయంలో వారికి కావలసిన పని ఎంతవరకు వచ్చిందో తెలుసుకోమని ప్రకాశంగారిని అడిగారు. అందుకు ప్రకాశంగారు కొంత విముఖత చెపుతూ – "ఈ సచివాలయం పెద్ద అడవి. దీనిలో పనులు అలాగే వుంటాయి" అన్నారు.

అందుకు విశ్వనాథ ఓ చిరునవ్వు నవ్వి "అందుకే కదండీ తమకు మనవి చేసుకున్నది. మీరు ఆంధ్రకేసరి కదా! ఈ అడవి మీ కొక లెఖ్ఖ కాదు" అన్నారు. ఆ మాట విన్నాక ఆంధ్రకేసరికి ఆ పని నెత్తిన వేసుకోక తప్పింది కాదు.

- ఒకసారి ముళ్ళపూడి వారికి డబ్బు కావల్సి ఒక ఆప్తమిత్రునికి ఫోన్ చేశారు. అప్పుడు వారిద్దరి మధ్య సాగిన సంభాషణ: "డబ్బు కావాలి..." – "ఎప్పటికి కావాలో చెప్పండి, పంపుతాను" – "మొన్నటికి...." మిత్రుడికి ఇంకేమి మాట్లాడాలో తోచలేదు.
- కాటూరివారికి రాత్రి పడుకోబోయే ముందు చుట్టలు చుట్టుకోడం అలవాటు. అదేమన్నా అంటే 'ఆదిశేషుడు కూడా చుట్టలు చుట్టుకునే పడుకునేవాడు" అనేవారు.

## 2.7.3 భాషతెచ్చిన అనుబంధం

- డా॥ మీరాసాబిహళ్లి శివణ్ణ
(కన్నడ ఎం.ఏ. 1972-74 బ్యాచ్)

నేను కన్నడ (ఆనర్స్) చదవడానికి బెంగళూరు యూనివర్సిటీ సెంట్రల్ కాలేజీలో చేరాను. అది 1969 కాలంలో. ప్రధాన విషయమైన కన్నడతోపాటు రెండు మైనర్ సబ్జెక్టులను చదవవలసి ఉంది. అలా మొదటి రెండేళ్లు చిన్న చిన్న విషయాలే ఉన్నాయి. కన్నడ ఆనర్స్ వాళ్ళకి సంస్కృతం తప్పనిసరి మైనర్ సబ్జెక్టు. హిందీ, ఎకనామిక్స్, తెలుగు కూడా మైనర్ విషయాలుగా అనుమతించబడ్డాయి. నేను మైనర్‌గా తెలుగు ఎంచుకున్నాను. ఎందుకంటే నేను చిత్రదుర్గజిల్లాలోని ఆంధ్రా సరిహద్దు సమీపంలోని చెళ్ళకెరె తాలూకాలోని మీరాసాబిహళ్లి గ్రామానికి చెందినవాడిని కాబట్టి. మా ఊరు సరిహద్దునుండి కేవలం 15-20 కిలోమీటర్ల దూరంలో ఉంది. మరియు మా చుట్టుపక్కల చాలా గ్రామాలలో తెలుగు మాట్లాడే ప్రజలు చాలా మంది ఉన్నారు. మా ప్రాంతంలో చాలామంది కూలీ కార్మికులకు తెలుగు ఇంటి భాష. నా మాతృభాష కన్నడ అయినప్పటికీ చుట్టుపక్కల వాతావరణంలో తెలుగు నా చెవిన పడింది. అలా చిన్నతనంలో తెలుగు వింటూ, తెలుగు సినిమాలు చూస్తూ పెరిగాను కాబట్టి సహజంగానే నాకు తెలుగు అర్థమైంది. అంతే కాకుండా కొన్ని వత్తులు తప్ప తెలుగులిపి కన్నడలిపిని పోలిఉండడంవల్ల నాకు తెలుగు చదవడం కష్టం అనిపించలేదు. కాబట్టి ద్విభాషాప్రాంతంనుంచి వచ్చిన నేను తెలుగు నేర్చుకోవాలనే కోరికతో సహజంగానే 'తెలుగు'ని ఎంచుకున్నాను.

కానీ అప్పుడు తెలుగు బోధించడానికి ఫుల్ టైం టీచర్లు లేరు, కొన్ని రోజులు పార్ట్ టైమ్ టీచర్లు వచ్చేవారు. అనంతరం శాశ్వత అధ్యాపకులుగా వచ్చిన డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు, చాలా ఆకర్షణీయమైన ప్రదర్శనతో ఉత్సాహభరితమైన యువకులు. వారి మనోహరమైన తెలుగు వాగ్ధాటి మమ్మల్ని మంత్రముగ్ధులను చేసింది. పద్యాలు చెప్పే విధానం పౌరాణిక సినిమాల్లో సీస పద్యాలు పాడినట్లు ఉండేది. వారి గానం చెవులకు ఇంపుగా ఉండేది.

తరువాత తెలిసింది, డా॥ తంగిరాలగారు తెలుగులో ప్రసిద్ధి చెందిన జానపద పండితులు అని. ఆయన మహాప్రబంధ ప్రబంధం- 'తెలుగు వీరగాథలు' అప్పటికి

ప్రచురించబడలేదు. తెలుగు చేతివ్రాతలో ఆ రచన వందలాది పేజీలు ఉంది. దాని సైజు చూసి మేమంతా ఆశ్చర్యపోయాం.

ఆయన పరిశోధనలోని అపారతను పరిచయం చేస్తూ రాసిన 'తెలుగు వీరగాథలు' అనే వ్యాసం కన్నడలోకి అనువదించబడి, బెంగుళూరు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'సాధనె' పత్రికలో ప్రచురించబడింది. ఆ వ్యాసం వారి అపార జానపద పాండిత్యానికి అద్దం పట్టింది. అపారమైన ఫీల్డ్‌వర్క్ ఫలితంగా వచ్చిన ఆ కృతియొక్క మూలగాథాకారులు తంగిరాలవారిని వెతుకుతూ చాలాసార్లు కళాశాలకు వచ్చిన కళాకారులను నేను కళ్ళారా చూచాను. వారి నాలుక కింద వాయించిన అతని వృత్తాకార తీగ వాద్యం, దానినుండి వెలువడే 'ఝుమ్–ఝుమ్' శబ్దం నన్ను పులకరింపజేసింది. వాద్యాల నేపథ్యంలో తెలుగువీరగాథలు ఆలపిస్తున్న కళాకారుల్లాగే, మనలో పుట్టిన సాంస్కృతిక నాయకుడు మాదేశ్వరుని గాథను పాడే గుడ్డరు కంసాలి, మంటెస్వామి కథను పాడే నీలగార్లు అద్వితీయమైన తంబూర వాయిస్తూ పాడుతారు. ఎత్తప్ప–జుంజప్పల కథలు పాడేవారు వేణువులాంటి వాద్యాన్ని ఉపయోగించడం నేను గమనించాను.

కాటమరాజు, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి వంటి ప్రముఖ హీరోల గురించిన జానపద గేయాలను, ఇతర జానపద ఇతిహాసాలను సేకరించిన తంగిరాల క్షేత్రస్థాయి కృషి ఎనలేనిది. తరువాతి కాలంలో నేను తంగిరాలగారిలాగే కన్నడ జానపదకథలపై పనిచేసి, గిరిజన సాంస్కృతిక వీరులైన ఎత్తప్ప–జుంజప్పల జానపద ఇతిహాసాలను సేకరించి, ఆ కథల ద్వారా కాడుగొల్లర్ల సంస్కృతిని నిర్వచించి, గొప్ప థీసిస్ రాసి, మైసూరు విశ్వవిద్యాలయంనుండి 'డాక్టరేట్' (1996) పొందటం నిన్నమొన్న జరిగినట్టు ఇప్పుడు నాకు అనిపిస్తుంది. తరువాత, నా జీవితమంతా గిరిజన జానపద సాహిత్యానికి అంకితం చేయడానికి ఈ రంగం నన్ను ప్రోత్సహించడమే కాకుండా, చిత్రదుర్గజిల్లాలోని జానపదసంస్కృతి మరియు గిరిజనులపై చేసిన కృషిని గుర్తించి దావణగెరె విశ్వవిద్యాలయం నాకు గౌరవ డాక్టరేట్ (2022) ఇవ్వడం యాదృచ్ఛికం కాదు. నేను సాధించిన ఈ ఘనత అంతా గురువు తంగిరాలగారి ప్రేరణ, ప్రోత్సాహంవల్లే జరిగిందని ఆనందంగా గుర్తు చేసుకుంటున్నాను.

తంగిరాలగారు మాకు తెలుగు వర్ణమాలను స్వయంగా నేర్పడం ప్రారంభించారు. చాలా త్వరగా వారు నాకు తెలుగు చదవడం, వ్రాయడం

నేర్పించారు. చాలా పరిణితి చెందిన తెలుగు పద్యాలను కంఠస్థం చేయించారు. కొన్ని నెలల్లో తెలుగు సాహిత్యానికి చిన్న పరిచయం కూడా అయింది. ఈనాడు దినపత్రిక, ఆంధ్రపత్రిక – ఆంధ్రప్రభ వారపత్రికలు చదివి తెలుగుభాషపై పట్టు సాధించాను. కాళీపట్నం రామారావు నవల 'యజ్ఞం'; కొర్లపాటి విజయలక్ష్మి, యుద్ధనపూడి సులోచనారాణి, ముప్పాళ రంగనాయకమ్మల నవలలు ఆసక్తిగా చదవడం మొదలుపెట్టాం. విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు నవల చదివాను. పాలగుమ్మి పద్మరాజు, పులికంటి కృష్ణారెడ్డి, కేతు విశ్వనాథరెడ్డి కథలు చదివి ఆనందించాను. కేతు విశ్వనాథరెడ్డిగారి రాయలసీమ కథలు మన కన్నడ వాతావరణానికి, భూస్వామ్య వ్యవస్థకు చాలా దగ్గరగా అనిపించాయి. దాంతో కేతు విశ్వనాథరెడ్డిగారి కథలను కన్నడలోకి అనువదించాలనే నా కోరికను తెలియజేసాను. కేతు విశ్వనాథరెడ్డిగారు తంగిరాలవారికి సుప్రసిద్ధ మిత్రులు. అనువదించడానికి అనుమతి ఇచ్చారు. కన్నడరాష్ట్ర వార్తాపత్రికలు ప్రజావాణి, మయూరలో ప్రచురితమైన కేతు విశ్వనాథరెడ్డిగారి కథలను తంగిరాలగారి మార్గదర్శకత్వంలో అనువదించాను. కేతు విశ్వనాథరెడ్డిగారి కథలను కన్నడశైలిలో అనువదించి మంచి పేరు తెచ్చుకున్నాను. కేతు విశ్వనాథరెడ్డిగారి కన్నడ అనువాద కథలకు వచ్చిన ప్రశంసలకు వారు ఎంతగానో సంతోషించి, తన కథలు వేటినైనా కన్నడంలోకి అనువదించి ప్రచురించడానికి ఉచిత అనుమతి ఇచ్చారు. అప్పటి వరకు ఆయన కథలన్నీ కలుపుకుని 'జప్తి' అనే సంపుటిగా ప్రచురించాను. ఆ కథలు మరియు అనువాదం గురించి పత్రికలలో మంచి సమీక్షలు వచ్చాయి. తరువాత తంగిరాల వారి 'నెనపు–నంజు' అనే కథను అనువదించాను. దీనితో మల్లాది వెంకట కృష్ణమూర్తిగారి కొన్ని ఆసక్తికరమైన కథలను అనువదించాను. దీని వెనుక ఉన్న శక్తి తంగిరాలగారే అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

నేను ఎం.ఏ. చేసిన తర్వాత చెళ్ళకెరెలో ఉన్నప్పటికీ తెలుగు కథలను అనువదించే సమయంలో ఎదురయ్యే కష్టమైన పదాలకు అర్థాలను గురువుగారిని ఉత్తరాల ద్వారానో, లేదా బెంగుళూరు వచ్చినప్పుడు ముఖాముఖి కలిసినప్పుడో అడిగి తెలుసుకునేవాడిని. నా క్రియేటివ్ వర్క్‌కి గురువుగారు సపోర్ట్ చేశారు. తర్వాత, కేతు విశ్వనాథరెడ్డిగారి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గెలుచుకున్న 'కేతు విశ్వనాథరెడ్డి కథలు' మొత్తం రచనలను అనువదించే అవకాశం వారి స్నేహితులు అయిన అగ్రహార కృష్ణమూర్తిగారి ద్వారా అందించబడింది. వీరు

అప్పుడు బెంగుళూరులోని కేంద్ర సాహిత్య అకాడమీ దక్షిణ భారతదేశ ప్రాంతీయ కార్యాలయానికి సంచాలకులుగా ఉన్నారు. కన్నడ అనువాదరచన విడుదల కోసం అకాడమీ కేతు విశ్వనాథరెడ్డిగారిని హైదరాబాద్‌నుండి పిలిపించింది. నా అనువాదానికిగాను మంచి ప్రశంసలు రావడమే కాకుండా కన్నడ–తెలుగు తెలిసిన పండిత రచయితలు తమ ప్రశంసను వ్యక్తం చేశారు. నా విద్యార్థి ఒకరు ఆ తెలుగు అనువాద కథలు చదివి ఎంతగా ముగ్ధుడయ్యాడంటే, 'ఇంత అద్భుతమైన కథలు రాసిన ఆ రచయితను కలుసుకుని వారి కాళ్ళకు నమస్కరిద్దాం పదండి నడుచుకుంటూ హైదరాబాద్ వెళ్దాం' అని అన్నాడు. ఈ సందర్భంలో డా॥ తంగిరాలగారు హాజరై శుభాకాంక్షలు తెలిపారు.

తంగిరాలగారితో కలిసి కేతు విశ్వనాథరెడ్డిగారి అనుబంధం పెరుగుతూ వచ్చింది. నేను వారి కథలన్నింటినీ అనువదించకముందే, కర్ణాటక జానపద మరియు యక్షగాన అకాడెమీ నుండి 'ఆంధ్రప్రదేశ్ రచయితల యాత్ర'కు నేను నియమించబడి, హైదరాబాద్‌కు వెళ్ళినప్పుడు వారి ఇంటికి వెళ్లి వారితో తెలుగు కథాసాహిత్యం గురించి చర్చించాను. విశ్వనాథరెడ్డిగారు ఒకసారి కేంద్ర సాహిత్య అకాడెమీ పనిమీద బెంగుళూరు వచ్చినప్పుడు నన్ను పిలిచి నాతో కలిసి భోజనం చేశారు. వారిని తీసుకొని మళ్లీ బెంగుళూరులోని మా ఇంటికి వెళ్లడం చాలా ఆనందంగా అనిపించింది. తర్వాత ఈ అనుబంధం 65 సంవత్సరాల వయస్సులో నాకు అంకితం చేసిన అభినంద గ్రంథావిష్కరణకు మా ఇద్దరి స్నేహానికి గుర్తుగా తెలుగులో వ్యాసం రాసి పంపారు. దానిని కన్నడంలోకి అనువదించి అభినందన గ్రంథంలో చేర్చాను.

మరియు చిత్రదుర్గలో జరిగిన నా అభినందన సమావేశానికి హైదరాబాద్‌నుండి భార్యాసమేతంగా, తన విద్యార్థిస్నేహితుడు తుమ్మల రామకృష్ణ, మరో తెలుగు కథకుడితో కలిసి కారులో రావడం మరిచిపోలేని గొప్ప అనుభూతి. గురువుగారు తంగిరాలగారే ఈ అనుభూతికి మూలకారణం.

నేను ఎం.ఎ. విద్యార్థిగా ఉన్నప్పుడు గురువుగారు నన్ను పలుమార్లు వారింటికి ఆహ్వానించి భోజనం పెట్టారు. వారి శ్రీమతి శకుంతలాదేవిగారి ఆతిథ్యం మరువలేనిది. ఆంధ్రాశైలిలో పెట్టిన ఆవకాయ, మాగాయ ఊరగాయల రుచి మరిచిపోలేను. అది గుర్తొస్తే ఇప్పటికీ నా నోరు ఊరుతుంది. దానిలో వేసిన

నువ్వులనూనె, ఆవపిండి వెల్లుల్లి వాసనలు నేను తినే మసాలతో కూడిన మాంస భోజనంయొక్క రుచిని నాకు గుర్తుచేసింది!

మేము కన్నడ బి.ఏ.ఆనర్స్ పూర్తిచేసి కన్నడ ఎం.ఏ.లో చేరినా తంగిరాలగారితో మా అనుబంధం కొనసాగింది. ఎంఏలో ప్రత్యేక అంశంగా 'జానపదం' తీసుకున్నాం. జానపద విభాగాన్ని ప్రారంభించాలనే ఉద్దేశ్యంతో సాగర్‌లోని ఓ ప్రైవేట్ కళాశాలలో పనిచేస్తున్న ప్రముఖ జానపద కవి డాక్టర్ చంద్రశేఖర కంబారను కన్నడ విభాగాధిపతి జి.ఎస్.శివరుద్రప్పగారు పిలిపించారు. వారు జానపద సిద్ధాంత పాఠాలను బోధించడానికి వచ్చినవారు. వారు ఏ జానపద సిద్ధాంతాలను బోధిస్తున్నారో ఆ జానపద సిద్ధాంత రూప కర్త డా॥ తంగిరాలవారు. వారు "సైద్ధాంతిక జానపదాన్ని" బోధించేది ఇంగ్లీషులో. అప్పుడుకూడ తంగిరాలగారు కన్నడ నేర్చుకునే పనిలో ఉన్నారు.

మేము విద్యార్థి జీవితాన్ని ముగించి (1969-74), ఉద్యోగంలో (1975-2012), 37 సంవత్సరాలు అయినప్పటికీ తంగిరాలగారితో నిరంతరం సంప్రదింపులు జరపడం మా అదృష్టభాగ్యం. గత పది సంవత్సరాలలో ఆయన తెలుగు వీరగాథలు (2013) మరియు వీరకావ్యాలు ప్రచురించబడ్డాయి. వాటినన్నింటిని కొనుగోలు చేయడం ద్వారా వారికి సహాయపడ్డాను అనే సంతృప్తి నాకు ఉంది.

నేను చెళ్ళకెరెలో ఉపాధ్యాయుడిగా ఉండడంవల్ల తెలుగుభాషతో పరిచయం మరింత దగ్గరైంది. ఎందుకంటే చెళ్ళకెరె పట్టణం ద్విభాషాప్రాంతం. అలాగే కాలేజీలో నాకు, ఇంటిలో తెలుగు మాట్లాడే సహోద్యోగి మిత్ర, చరిత్ర ఉపన్యాసకులు ఎన్. రామాంజనేయులు ఫలితంగా తెలుగు అనుబంధం మరింత బలపడింది. ఆ స్నేహితుడి దగ్గరే తెలుగు అనర్గళంగా మాట్లాడటం నేర్చుకున్నాను!

కానీ విధి స్నేహితుడిని ఆకర్షించింది. దాంతో తెలుగు మాట్లాడటం తగ్గింది. కాని మళ్లీ మా కాలేజీకి తెలుగు అధ్యాపకుడిగా వచ్చిన ప్రొ॥ దేవేంద్ర ద్వారా కొనసాగింది. అయితే గురువులు తంగిరాలగారి అనుబంధంతో యాభై ఏళ్లు దాటినా ఆ బంధం అలాగే ఉంది!

**(కన్నడం నుండి అనువాదం: డా॥ తోట వెంకటస్వామి)**



## 2.7.4 శిష్యవత్సల తంగిరాల

**– శ్రీ టి.ఎస్.నాగరాజశెట్టి**
**(కన్నడ ఎం.ఎ. 1973–75 బ్యాచ్)**

1970–71లో బెంగళూరు సెంట్రల్ కాలేజీలో ప్రథమ బి.ఎ. (ఆనర్స్)లో చేరాను. అప్పుడు జి.ఎస్. శివరుద్రప్పగారు "కన్నడ అధ్యయన కేంద్రం" సంచాలకులుగా ఉన్నారు. ఐచ్ఛిక విషయాలను ఎన్నుకునేటప్పుడు సాహిత్యాభిమానంతో సహజంగానే తెలుగు, సంస్కృతం ఎంచుకున్నాను. ఆ భాషలు నేర్చుకోవడానికి భయపడలేదు. ఎందుకంటే, ఆ భాషా సాహిత్యాన్ని అధ్యయనం చేసి వాటి సమాధానాలను కన్నడంలోనే రాయవలసివుంది.

అప్పుడు తెలుగుశాఖకు తంగిరాల వెంకట సుబ్బారావుగారు నాయకత్వం వహించారు. ఆకర్షణీయమైన ముఖకవళికలు, నవ్వుతున్న ప్రకాశవంతమైన కళ్ళు, నీట్ క్రాపు, ఎప్పుడూ చొక్కా, టై ధరించి, మెరిసే షూస్, తెలుగు నటుడు అక్కినేని నాగేశ్వరరావును తలపించే అందమైన మనిషి. వారి వేషధారణ ఇప్పటికీ నా దృష్టిని ఆకర్షిస్తోంది. ఆయన ఎంతో ఉత్సాహంగా సాహిత్యపాఠాలు చెప్పడం విశేషం. "పంచకన్యలు" పాఠం. ఇది తెలుగు ఇతిహాసాల కథానాయికల వర్ణనల విమర్శనాత్మక చిత్రణ, అదే కావ్యాన్ని పూరించింది. ఆ ప్రబంధాల కథానాయికా నాయకుల శృంగారంతో కూడిన చక్కని కథలు పాఠం బోధించిన తీరు బోధన పట్ల ఆయనకున్న మక్కువ మరువలేనిది, ఆదర్శనీయమైనది.

మాస్టారు ఆంధ్రానుంచి అప్పుడే రావడంతో విద్యార్థుల కన్నడ ప్రసంగాన్ని అర్థం చేసుకోవడం వారికి కష్టమైంది. ఆయన బోధన కూడ కన్నడ విద్యార్థులకు అర్థం చేసుకోవడం కూడా అంతే కష్టమైంది. అప్పుడు నేను వీరి మాటలను వారికి, వారి ప్రశ్నలను వీరికి అనువదిస్తూ "దుబాసి" నేనే అయ్యాను. ఈ అనువాద కార్యాన్ని నేను ఒక అనిర్వచనీయమైన గర్వంగా భావించేవాడిని. తర్వాత టి.వి.ఎస్.గారు కన్నడం చాలా త్వరగా నేర్చుకుని అనువాదరంగంలో ఉన్నత స్థాయికి ఎదగడం వారి సామర్థ్యం!

ఆ రోజుల్లో మా జవాబు పత్రాలను వేరే వేరే విశ్వవిద్యాలయాల ప్రొఫెసర్లు మూల్యాంకనం చేసేవారు. ఒకసారి టి.వి.ఎస్. "ఇలా రావయ్యా" అంటూ

నన్ను చెయ్యిపట్టుకుని వారిరూంలోకి తీసుకెళ్ళారు. “ఇటు చూడవయ్యా” అంటూ నా జవాబు పత్రానికి జతచేసిన ఒక చీటిని చూపించారు. దీనిని మైసూరు విశ్వవిద్యాలయం ఆచార్యులుగా ఉన్న ప్రముఖపండితులు కె. వెంకటరామప్పగారు రాశారు. అందులో “ఈ విద్యార్థి కన్నడ విద్యార్థి అయివుండి కూడా అల్లసాని పెద్దన్న వరూధిని గురించి ఇంత చక్కగా సమాధానం రాయడం చదివి ఆశ్చర్యపోయాను. చాలా సొగసైనది” అని రాశారు. ఇది చూసి టి.వి.ఎస్. మాస్టారు ఎంతో సంతోషించారు, ఇది వారి శిష్యవాత్సల్యానికి ప్రతీక.

ఆ సంవత్సరం నేను రెండవ బి.ఎ. పరీక్షలో తెలుగు, సంస్కృతం మరియు కన్నడభాషా పేపర్లలో అత్యధిక మార్కులతో ఉత్తీర్ణత సాధించాను. ఆ సమయంలో మా ఫలితాలు వార్తాపత్రికలలో ప్రచురించబడ్డాయి. (ఆ తర్వాత ఆ పద్ధతి ఆగిపోయింది.) మెరిట్ ప్రకారం మా రిజిస్ట్రేషన్ నంబర్లు ప్రచురించబడ్డాయి. నాదే మొదటి నంబర్ అయింది. అది ఇప్పటికీ గుర్తుంది (1545). నా ఘనతకు తెలుగుమాస్టారు టి.వి.ఎస్.గారు కూడా కారణం. వీరు మరియు సంస్కృత సాహిత్యాన్ని బోధించిన లక్ష్మీతాతాచార్యగారు, కన్నడ ప్రొఫెసర్ జి.ఎస్. శివరుద్రప్పగారు, హంప నాగరాజయ్యగారు, ఎన్. ఎస్. లక్ష్మీనారాయణభట్‌గారు, ఎం.చిదానందమూర్తిగారు మొదలైన వారందరూ కారణం.

అది 1975, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 7వ ర్యాంక్‌తో కన్నడ మాస్టర్స్ డిగ్రీని పూర్తి చేశాను. మే నెలలో పరీక్ష పూర్తయింది, జూన్‌లో ఫలితాలు వచ్చాయి. జూలై నెలలో తిపటూరులో కల్పతరు విద్యాసంస్థలో ఉపాధ్యాయుడుగా నియమించబడ్డాను. 36 సంవత్సరాల బోధనా అనుభవం నాదయింది. బెంగుళూరు వచ్చినప్పుడు సాహిత్య కార్యక్రమాల్లో పాల్గొనేవాడిని. టి.వి.ఎస్. మాస్టారుగారికి మరియు నాకు కొన్ని దశాబ్దాలుగా “గ్యాప్” వచ్చింది. మేము ఒక ఫంక్షన్‌లో కలుసుకున్నప్పుడు, వారు ఏర్పాటు చేస్తున్న సాహిత్య ఉపన్యాసాల గురించి చెప్పారు. అలాంటి రెండు కార్యక్రమాలకు నేను హాజరయ్యి, తెలుగు ఇతిహాసాలపై ఆసక్తికరమైన ఉపన్యాసాలు విని ఆనందించాను. అప్పుడు వారి సంపాదకత్వంతో ప్రచురిస్తున్న “చైతన్యకవిత” కొన్ని కవితాసంపుటాలు నాకు లభించాయి. వాటిని చదివి చాలా సంతోషించాను. మాస్టారు మంచి ఉపాధ్యాయులు మాత్రమే కాదు, మంచి నిర్వాహకులు, కవితాప్రియులుకూడా.

కేంద్రసాహిత్యఅకాడెమివారు కోవెల సంపత్కుమారాచార్యుల "విశ్వనాథ సత్యనారాయణ" అనే తెలుగు రచనను కన్నడలోకి అనువదించే బాధ్యతను నాకు అప్పగించగా అది 2020లో ప్రచురితమైంది. ఆ అనువాద కార్యంలో మాస్టారు నాకు చాలా సహాయం చేశారు. అనువాద సమయంలో ఒక సాంకేతిక సమస్య ఎదురైంది. తెలుగుకావ్యంలోని మూలపద్యాలను కోట్‌చేసిన తర్వాత ముందుమాటకోసం పంపారు. తెలుగు పాఠకులకు అది బాగానే ఉంది. కానీ మన కన్నడ పాఠకులు ఇలాంటి పద్యాలను ఎలా అర్థం చేసుకుంటారు?వాటికి అర్థం చెప్పాలి కదా? విశ్వనాథ సత్యనారాయణ మన కువెంపువలె గొప్ప పండితుడు, సంస్కృతాంధ్రాలు రెండింటిలోనూ గొప్ప పండితుడు. నాకు కొన్ని పదాలు అర్థం కాలేదు. అవన్నీ లిస్ట్‌రాసుకొని మాస్టారు ఇంటికి వెళ్ళాను. అలాంటి రెండు మూడు సందర్భాలలో ఆయన చేసిన సహాయాన్ని మరిచిపోలేను. కొన్ని పదాల అర్థం వారు కూడా పరిష్కరించలేకపోయారు. అప్పుడు వారు ఆంధ్రానగరాల్లో (హైదరాబాద్, రాజమండ్రి, ఖమ్మం మొదలైన ఊర్లలో) ఉన్న ప్రొఫెసర్లను ఫోన్ ద్వారా సంప్రదించి నాకు అర్థాలు అందించారు. ప్రచురణ తర్వాత ఈ రచన కువెంపు భాషాభారతి అథారిటీ సంస్థచే "ఉత్తమ అనువాదం" అనే అవార్డు కూడా అందుకుంది.

ఒకసారి మాస్టారు ఇలా అన్నారు, "శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద ప్రౌఢకావ్యం వచన రూపంలో ఉంది. దాని రచయిత డా॥ కాసల నాగభూషణం వారు నా స్నేహితులు. చెన్నైలో ఉన్నారు. నేను అనుమతి తీసిఇస్తాను. అనువదించమ"ని సూచించారు. నేను అంగీకరించాను. తన సొంత లైబ్రరీ నుండి ఒక కాపీని తీసి ఇచ్చారు. మాస్టారు దానిలోని కొన్ని కష్టమైన పదాలకు అర్థాలను సహితం వివరించారు. ఆ విధంగా వారు నాకు మార్గదర్శకులు మరియు నా శ్రేయోభిలాషులు. శిష్యులను ఎప్పుడూ వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ, ఆశీర్వదించే తంగిరాలవారికి ఈ వ్యాసం ద్వారా నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

**(కన్నడంనుండి అనువాదం: డా॥ తోట వెంకటస్వామి)**



# 2.8 కవితాపుష్పాంజలి - శిష్యులు, మిత్రులు

## 2.8.1 నవరత్నాభిషేకము-డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు

బెంగుళూరు విశ్వవిద్యాలయాంధ్రభాషావిభాగాధ్యక్షులు ఆచార్య తంగిరాల
వెంకట సుబ్బారావుగారికి విద్యాసంవర్ధనీ పరిషత్తుచేయు నవరత్నాభిషేకము

శ్లో॥ తంగిరాల కులాబ్ధీన్దుః - సుబ్బరాయ సుధీమణిః
వరివస్యాం వచోదేవ్యాః - కరోతు శరదశ్శతమ్ । 1

ఆ॥ బెంగుళూరు విశ్వవిద్యాలయాంధ్రభా
షావిభాగమునకు స్థాపకప్రథ
మాధినేతవైన ఆచార్య సుబ్రాయ!
అందుకొమ్మివె అభినందనములు! 2

ఆ॥ వాఙ్మయముల చరిత, భాషావికాసమ్ము,
వ్యాకరణము, ఛంద మమరభాష,
జానపదుల కళలు, సాహిత్యశాస్త్రంబు,
చదువు చెప్పగలవు సర్వమొకడె! 3

తే॥ శిష్టవంశమ్ము, దిగుమర్తి శిష్యవృత్తి,
తిలకుస్నేహమ్ము, తిమ్మావజ్ఝుల ప్రణయము,
పింగళిసుధీంద్ర శుశ్రూష, విష్ణుభొట్ల
సాహచర్యము నినుజేసె సత్తమునిగ 4

క॥ శ్రీ సుబ్రాయ సుధీవ
ర్యా సరసుండవును సహృదయమణివగుట నే
డే సర్వకళాశాలకు
వీ సీ గా నిన్ను జూడ వేడుక కలిగెన్! 5

సీ॥ కవితావిహంగమ గగనవిహారమ్ము, పరిశోధనాద్రుల ప్రాకులాట,
పరమ-ఛాందసశక్తి, విశ్వనాథుని భక్తి. విప్లవవాది కవిత్వరక్తి,

విప్రతాహంకృతి, వెలనాటియతిశయ, మాతృజావర్ణశాఖాంతరకృత
పరిణయమ్ములు, తెల్గుభాషాభిమానమ్ము కన్నడ చుట్టతికాల కలిమి.

తే॥ ప్రౌఢకావ్యాభిరుచి. జానపదపు కూర్మి,
బూటు సూటుల వేషమ్ము మోటు నమ్మ
కముల బాటించుతమి, విరుద్ధములకిట్లు,
సంగమ సమన్వయము నీకె సాధ్యమయ్యె 6

సీ॥ కారణమైతివి కర్ణాటదేశాన ఆంధ్రభాషాపీఠ మమరియుండ
కలుబుర్గిసీమలో ఖ్యాతిగాంచితి పరీక్షానియంత్రణ కధికారివగుచు
ఆరోహణముచేసి తాంధ్రభాషా విభా గాధ్యక్షపదవి సింహాసనంబు
ఆచార్యపద కిరీటాలంకృతుడవైతి వైయక్తిక ప్రతిభాన్వితుడవు

తే॥ అభిలషిత సర్వప్రేయములందినావు,
సొంతలాభపు మాటను సుంత మఱచి
ఇద్ధచారిత్ర, త్రికరణశుద్ధిగాగ,
పాటుపడుమితోధికముగ భాషకొఱకు. 7

శా॥ సంతోషింపము మేము బూటకములౌ సంఖ్యాధికత్వంపు పే
ట్రింతల్ మాత్రముతోడ; లోటుగలదే డిగ్రీల ఛత్రాకముల్
బంతుల్దీరు నిరక్షరాస్యులకు సద్వైదుష్య నిష్ణాతులౌ
అంతేవాసుల సార్థకమ్మగుత నీ ఆచార్యభావంబొగిన్! 8

శ్లో॥ ఆచార్యపదమారూఢం - విద్యాసంవర్ధనీ సభా
కురుతే సుబ్బరాయార్యం - నవరత్నాభిషేచితమ్! 9

స్నాతకోత్సవ సభావేదిక, బెంగుళూరు **- డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు**
23-1-1988 విద్యాసంవర్ధనీ పరిషత్
వ్యవస్థాపకాధ్యక్షులు

## 2.8.2 వెలుగులతీరం - శ్రీమతి అంబికా అనంత్:-

నాగేంద్రుడికి మీ తల్లిగారి మ్రొక్కులేనా
మీ గుండెల్లో వెలుగులమణిని పొదిగి
మీ ముఖవర్చస్సులో తేజస్సు నింపాయి?
హృదయ సంస్కారపు పరిమళ కిరణాలయ్యాయి?
మిమ్మల్ని జీవితపు నిబిడనిశీథతమస్సులకు అందని
వెలుగులతీరం చేశాయి?!
"ఆచార్య దేవోభవా...." అంటూ జోడించే కరకమలాల
కృతజ్ఞతాసుమమాలల, నిరంతర తోమాలసేవల
నిత్యవసంతానుభూతిలో
ఎన్నో విద్వద్దీపాలను వెలిగించి
ఎన్నో మనసులను విద్యోతించి
అక్షరసంపదనను అవిచ్ఛిన్నంగా పంచే
అక్షయ "జ్ఞానభారతి" రూపం మీరు!
మనిషికి, మనిషిలోని మనసుకి
మనసులోని మాటకి చలించే
అనుభూతుల అబ్ధి మీరు!
స్పందనల సందోహం మీరు!
సాహిత్య '(శ్రీ)రస' సాగరం మీరు!

అమ్మ ప్రేమ
సూదిమొనకూ సుమస్పర్శల మృదుత్వం ఇవ్వగలదు
జిల్లేడుగుండెలో విరితేనియ నింపగలదు
"అమ్మ ఎముకతో బొమ్మ" అనే
మీ కవితాక్షర కాంతిధారల్లో
మీ తల్లిగారికి అంజలి ఘటించి
అనంతకోటి అమ్మలనూ అభిషేకించారు.

అమ్మతనంలోని గొప్పతనాన్ని
అనంతకాలాల వసంతవనిలో తేజోపుష్పం చేశారు
మీకు జన్మనిచ్చిన ఆ అమ్మకు మనసారా నమస్కరిస్తూ
ఒక అమ్మగా మీకు నివాళులిస్తున్నాను-
"బ్రతుకు బంగారుతీగ చెఱుకు గడను
పళ్ళతో కొరికి రసం పీల్చుకునే
మీ రసాస్వాదన" చిరకాలం రసభరితంగా సాగాలని,
మీ "సంసార పద్మకాసారం"లో
ఆయురారోగ్య ఐశ్వర్యాలు
"తామర తంపరలై" నిరంతరం వికసించాలని.....

(శ్రీ కృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య అధ్యక్షులు, 'చైతన్యకవిత' సంపాదకులు అయిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారి 62వ జన్మదిన సందర్భంగా 30-3-1997నాడు బెంగుళూరులో వారికి బహూకరించిన కవిత.)

(చైతన్యకలిత-25, ఏప్రిల్-సెప్టెంబర్, 1997)

## 2.8.3 నవరత్నమాల-డా॥ యస్. జవాద్ హుసేన్ :-

తంగిరాల
మణిమాల! 1

తంగిరాల
కవితాజ్వాల! 2

తంగిరాల
నవరత్నమాల! 3

తంగిరాల
ప్రేమానురాగాల సుమమాల! 4

తంగిరాల
తన మన లేని నక్షత్రాలహేల! 5

తంగిరాల
తంబూరాల శ్రుతిమధురిమల హేల! 6

తంగిరాల
సాహిత్య కార్యక్రమాలకై ఎగసిన జ్వాల! 7

తంగిరాల
సాహితీ సముద్రంలో లేచే
అలల పూలమాల! 8

తంగిరాల
విజ్ఞాన వినోదాల్ని మోసుకొచ్చే
పూలనావ ఒయారపు హేల!! 9

రచన : 27-11-1996

(చైతన్యకవిత-26-A, అక్టోబర్ 1997 -మార్చి 1998)

## 2.8.4 మందారమాల-ఆచార్య శలాక రఘునాథశర్మ :-

గోదారి పడమటి గాలుల పవిత్రతతో
మాధుర్య పరీమళాలతో పరవశించిపోయే
తణుకు ప్రాంతాల తళుకు ఒకటి
ఎక్కడెక్కడో విహారవిన్యాసాలు నిర్వహించి
బెంగుళూరు బెళుకుగా ఇప్పుడు తళతళలాడుతున్నది!
కావేరీ తుంగభద్రల స్వచ్ఛతనూ తీయదనాన్నీ
అపఘనంలో అలంకరించుకుంటున్నది.

తలపై నల్లవెంట్రుక నలుసంతైనా లేకపోయినా
నిలువెల్లా తారుణ్యం తొణికిసలాడే
కమనీయరూపం కన్నులకు విందుచేస్తుంది.
సుందర దరహాస వీచికలు దోబూచులాడే ముఖారవిందం
అందరినీ హాయిగా పట్టి నిలుపుతుంది.
గలగలా నవ్వినప్పటి సెలయేటి

మధుర నాదాల గిలిగింతలు
ఎదలలో మువ్వల సవ్వడులను ముంచియెత్తుతూ ఉంటాయి.

తెలుగు మాగాణంలో విరుగ బండిన జానపదవిజ్ఞాన
సంపదను ఎడద పాతరలలో భద్రపరచుకొని
తెలుగుజాతికి ఆమెతలు పెట్టి ఆనందిస్తున్నది ఆ తళుకు!

తానేదో చెప్పాలనే తపన
దానికి మించి రసహృదయాలనుంచి
తానేదో ఆస్వాదించాలనే జ్ఞానదాహం
అచ్చమైన కవితాత్మలందించే రసఝరులను
తెలుగు పొలాలకు మళ్ళించాలనే ఆరాటం
చైతన్యం ఊపిరిగా కవిత్వం హృదయస్పందనగా
కదులుతున్న రసవాహిని

పదిమంది యింటికి రావాలనీ
ధర్మపత్ని ఆప్యాయంగా అమరించి అందించే
రసోపేత భోజనాలను స్వీకరించి
గర్రున త్రేన్పుతూ కదలాడాలనీ
కాంక్షించే ఆతిథేయ సౌందర్యం!

వ్యవహారంలోనే కాదు అభ్యవహారంలో కూడా
ఏ మాత్రమూ మొగమాటం లేని నిజాయతీ
ఉన్నంతలో అక్షరార్చనను చేసి
రాయలవారినో రాజరాజ నరేంద్రుణ్ణో
తలపింప చేయాలన్న ఆ కాంక్ష!

ఇలా కాంతికిరణాలను వెల్లిగొలుపుతున్న
ఒక అద్భుత మందారమాల
మా "తంగిరాల"!

(చైతన్యకవిత -33, ఏప్రిల్ 2001)

## 2.8.5 తంగిరాల గురుడు:-

– డా॥ పంపన సూర్యనారాయణ

ఆ. మనసు వెన్నపూస, మాటంత మెత్తన,
చెప్పలేని ప్రేమ శిష్యులన్న,
వీరగాథరంగ వీరహంవీరుండు,
నడచు కవితనౌక నాదు గురుడు!

(–చైతన్యకవిత–33, ఏప్రిల్ 2001)

## 2.8.6 వెన్నెలనవ్వు:-

– శ్రీమతి అంబికా అనంత్

'కవిత్వం ఒక మెస్మరిజం
కవి కన్ను ఒక ప్రిజం'
మా శ్రీరసాధ్యక్షులు
దీనికి ప్రత్యక్ష ప్రమాణం!
కవిత్వం అనే ఆల్కెమీ
కాళిదాసుకు, కృష్ణశాస్త్రికే కాదు
ఆయనకూ పూర్తిగా తెలుసు.
తెలిసినది మాతో పంచుకునే ఔదార్యం
మా ఆత్మస్పందనలకు, అక్షరావేశానికి
దారి చూపే మార్గదర్శకత్వం
కవిత్వాన్ని నాలుగు దిక్కులకూ పంచాలనే
'చైతన్యకవితా' వ్రతం
మంచికవితను వింటూ
ఉబ్బితబ్బిబయిపోయే బంగారు పసితనం!
ఆర్ద్రమైన పదాలు వింటూ
కన్నీరు వర్షించే శీతమయూఖం!
అనర్గళ సాహితీ ప్రసంగ ఆనందారావం!
నిస్తుల ప్రతిభను వెన్నెలనవ్వులో దాచుకున్న నిండువిగ్రహం!

తంగిరాల సుబ్బారావుగారి కిదే
మా అభినందన కవితాకుసుమం!

(ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి 69వ జన్మదిన సందర్భంగా 7-4-2004 నాడు జరిగిన సన్మానసభలో చదివిన కవిత)

(-చైతన్యకవిత-38+39, 2003 + 2004)

## 2.8.7 ఆశీరక్షతలు:-

**- డా॥ రాచకొండ నరసింహశర్మ, ఎం.డి. జనరల్ ఫిజీషియన్**

ఉ॥ సౌమ్యుడు, తంగిరాల కలశాంబుధి సోముడు, స్నేహపాత్రుడున్,
సామ్యములేని సత్పథమునన్ నడిపించుచునుండె పత్రికన్
రమ్యతయున్ మనోహరత రాజిలునట్లుగ రేబవళ్లదే
గమ్యముగా దలంచుచు ప్రగాఢ వినిర్మల చిత్తవృత్తుడై.

ఉ॥ అన్యుల మానసమ్ములకు రవంతయు ఖేదముగూర్చనట్టి సౌ
జన్యుని, పండితోత్తముని, జానపదాశ్రయ సాహితీ జగ
ద్ధన్యుని, వీరగాథల వదాన్యుని, సప్తతి నిండినట్టి స
న్మాన్యుని, సేమము న్నరయునట్లు సదా జగదీశువేడెదన్.

క॥ 'చైతన్యకవిత' భాసుర
సూతున్, శ్రీతంగిరాలసుబ్బారావున్
ఆతత శుభసంపదలిడి
ప్రీతిన్ బ్రోవుమయ! సుజన ప్రియ! శ్రీరామా!

(-చైతన్యకవిత, 41+42, ఏప్రిల్ +అక్టోబరు 2005)

## 2.8.8 సప్తతి ప్రస్తుతి:-

**- శ్రీమతి హైమా భార్గవ్, ఇతర కవిమిత్రులు**

డెబ్బయ్యేళ్ల వసంతం, నేటికీ నవనవోన్మేషం
తంగిరాల యువతరంగం
కదిలిస్తే కావ్యగంగ ప్రవహించే
ప్రసంగాలూ, రచనావ్యాసంగాలూ

ఆయన చైతన్యకవిత శ్వాసప్రక్రియలు
జనపదాలు ఆయన జవసత్త్వాలు
సాహితీ సభలు ఉత్సాహానికి నిదర్శనాలు
ఎర్రచొక్కా మిత్రులున్నవాడు; అయినాసరే
మధుర కవితా విపంచిని వినిపించే కామ్రేడ్
ప్రబంధ గంధాలను మనసుకు అలదుకున్నవాడు
పదబంధాలను అలవోకగా ప్రయోగించేవాడు
నిరంతర సాహితీ కృషీవలుడు
సభాపర్వాలను నిర్వహించే అలుపెరుగని కార్మికుడు
ఈ చిన్నవాడి చిరునామా..
ఉత్సాహం, ఉల్లాసం,
రసికజన మనోభిరామం
అవధానం చెయ్యని 'సీతావధానం'!
ఆచార్యా! జన్మదిన శుభాకాంక్షలు!
మీ నూరేళ్ల పండుగకోసం
మా ఎదురు చూపులు!
అభినందనలతో - వందనాలతో...

బెంగుళూరు - హైమాభార్గవ్, ఇతర కవిమిత్రులు
30.03.2005. (-చైతన్యకవిత-41+42, ఏప్రిల్-అక్టోబర్, 2005)

## 2.8.9 చిరుకానుక:-

**- శ్రీమతి రోహిణీ సత్య**

సుఖదుఃఖాల సంగమం జీవితమయినా-
దుఃఖరహిత సుఖజీవనం మీది కావాలని,
ఆటుపోట్లు అంతటి సముద్రానికున్నా-
ఆనందపు కడలిలో ఆణిముత్యం మీరవ్వాలని,
సిరిసంపదలు అతి చంచలమైనా-
సిరుల ఝరులు మీ ముంగిట పొంగిపొరలాలని,

గ్రీష్మవసంతాలు కాలగమన గతులయినా-
కేవలం కోకిలపాటలు మీ బాటన సాగాలని,
గెలుపోటములు ఆటలకు బొమ్మాబొరుసులయినా-
ఓటమిలేని విజయపు ఆటలు మీవి కావాలను,
ఎండుటాకులు, రంగుల పువ్వులు పూలవనాలయినా-
నవ్వుల పువ్వులు మాత్రం పూయాలి మీ జీవన వనాన,
ప్రేమానురాగాలు వలిగే ప్రమిదలుగా
ఆత్మీయతానుబంధాలు మంగళహారతులుగా
మీ యీ పుట్టిన రోజున మీకై ఈ శుభాకాంక్షల జల్లులు
అందుకున్న మీ కన్నుల మెరవాలి ఆ నింగిని మెరిసే మెరుపుల వల్లులు!
అది చూసి ఆనందంతో పొంగిపొరలాలి మా మనసులు!
ఇది మా గుండెలు నిండిన కోరిక!
ఈ కవిత మీకు మా చిరుకానుక!!
(శ్రీమతి శకుంతలాదేవి - ఆచార్య తంగిరాల సుబ్బారావు దంపతులకు)

- రోహిణీ సత్య

(చైతన్యకవిత, 41+42, ఏప్రిల్-అక్టోబర్, 2005)

## 2.8.10 ఒక గర్వకారణమైన అనుభూతి:-

**- కన్నడ విద్యార్థి వ్రాసిన కవిత**

(నేను 1969 డిసెంబరు 27వ తేదీ శనివారంనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో కన్నడవిభాగంలో తెలుగు ఉపన్యాసకుడుగా చేరాను. మూడునెలలపాటు కష్టపడి కన్నడభాష నేర్చుకొని, కన్నడ ఎం.ఏ., విద్యార్థులకు, కన్నడ బి.ఏ. ఆనర్స్ విద్యార్థులకు (కన్నడ మాధ్యమంలో) తెలుగు భాషా సాహిత్యాలు బోధించేవాడిని. నేను తెలుగు సాహిత్యం చెపుతుంటే కన్నడ విద్యార్థులు ఎంతగానో ఆనందించేవారు. దేవుని దయవల్ల, దిగుమర్తి సీతారామస్వామిగారు, పింగళి లక్ష్మీకాంతంగారు, తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు వంటి గురువుల ఆశీస్సుల వల్ల నాకు ఈ పాఠ ప్రవచన శక్తి వచ్చింది. 1971-72 బ్యాచ్ బి.ఏ. ఆనర్సు రెండవ సంవత్సరం విద్యార్థులలో చిరంజీవి నరహళ్ళి బాలసుబ్రహ్మణ్యం అనే విద్యార్థి ఉండేవాడు. రెండేళ్ళపాటు నా తెలుగు పాఠాలు విని ఆనందించిన

అతడు నన్ను గురించి ఈ క్రింది కవితను వ్రాశాడు. దీనిని కన్నడ మహాకవి కె.వి. పుట్టప్ప ('కువెంపు') రచించిన "శ్రీ రామాయణ దర్శనం" పుస్తకంలో వ్రాసి, సంవత్సరం చివరలో జరిగే వీడ్కోలుసభలో ఆ గ్రంథాన్ని విద్యార్థులపరంగా నాకు బహూకరించాడు. తరువాత బాలసుబ్రహ్మణ్యం కన్నడంలో ఎం.ఏ., పిహెచ్.డి. డిగ్రీలు పూర్తిచేశాడు. ఉపన్యాసక వృత్తిలో చేరాడు. కన్నడంలో గొప్ప విమర్శకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించాడు. ఇప్పుడు బెంగుళూరులోని శేషాద్రిపురం కళాశాలలో కన్నడ ప్రొఫెసర్‌గాను, ప్రిన్సిపాల్‌గాను పనిచేస్తున్నాడు. 35 ఏళ్ళక్రిందట ఇతడు వ్రాసిన ఈ కవిత నా అధ్యాపక జీవితానికి ఒక కలికి తురాయిగా భావిస్తున్నాను.)

– తంగిరాల

**నం మాస్తరు – నరహళ్ళి బాలసుబ్రహ్మణ్య**

భీమకాయద వ్యక్తి
ముగ్ధ ముఖదింద
ముగుళునగె నక్కాగ
ఎష్టు చెంద!
తలెయ తుంబిద తెలుగు
కన్నడదలి బరువాగ
అంబెగాలిన తొదలు
ముంజావ బిసిలు!

సరసదలి బుక్క బిచ్చి
ఎల్ల తలెగూ ముచ్చి
తృప్తియిందలి నగువ
ఇవర కెచ్చు
విద్యార్థిగలిగే బలు
అచ్చుమెచ్చు!!

**అనువాదం: మా మేష్టారు – నరహళ్ళి బాలసుబ్రహ్మణ్యం**

భీమకాయపు వ్యక్తి
ముగ్ధముఖంతో

చిరునవ్వు నవ్వినపుడు
ఎంత అందం!

తల నిండిన తెలుగు
కన్నడలో వస్తున్నపుడు
ప్రాకుతున్న చంటిబిడ్డ తడబాటు
ప్రొద్దుపొడుపు లేతఎండ దీటు!

సరసంగా బుక్కు తెరచి
అందరి తలలకూ గుచ్చి
తృప్తిగానవ్వే ఈయన నిక్కు
విద్యార్థులకు మిక్కిలి చొక్కు!! (– చైత్న్యకవిత 43–46, 2006–2007)

## 2.8.11 ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు:–

**– "సుశర్మ"**

29.02.2008 నాడు పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లులోని 'రసధుని" సంస్థవారు తంగిరాల వారిని "పెద్దిభొట్ల బ్రహ్మయ్యస్మారక పురస్కారం"తో సత్కరించారు. ఆ సందర్భంగా తణుకు నన్నయభట్టారక పీఠం కార్యదర్శి అయిన శ్రీ సుశర్మగారు చెప్పిన పద్యం:–

**మ॥ స్థిరచిత్తుండును, జ్ఞానశీలి, ఘనసౌశీల్య స్వభావుండు, సా**
**దరహాసద్యుతిమంతుడున్, సకల విద్యాపార చిద్రూపుడున్,**
**పరరాష్ట్రంబున తెల్గుతేజమునకున్ ప్రాణంబు, చైతన్యధీ**
**వరుడున్, శ్రీగురు, తంగిరాల సుబ్బారావుకున్ మా నతుల్!**

(–చైతన్యకవిత – 47,48, ఏప్రిల్–అక్టోబరు, 2008)

## 2.8.12 "సుబ్బారావు నా దేవుడే!"

శ్లో॥ తంగిరాల కులాంభోధౌ
సంజాతః స్వర్ణచంద్రమాః!

సుబ్బారాయః రసాకాశే
తనోత్యక్షర కౌముదీమ్॥

శా॥ నన్నున్ డాక్టరు చేసినట్టి గురుమందారంబు, సాహిత్యసం
పన్నుండాతడు, వక్తృతాగరిమ చెప్పంజాల, నా మోములో
నెన్నో నవ్వుల వెన్నెలల్ విరియు, సాహిత్యమ్ముతో జట్టులన్
వన్నెల్ దిద్దెడి తంగిరాలకుల సుబ్బారావు నా దేవుడే!

క॥ టీవీ సుబ్బారాయా!
చేవను గలిగించి నాదు జీవితమునకున్
ఠీవి నొసంగితివే గురు
దేవా! వందనశతమ్ము, దీవింపగదే!

నరసాపురం — **గురుసహస్రావధాని**
10.02.2022 — **డాక్టర్ కడిమెళ్ళ వరప్రసాద్**

## 2.8.13 అశీతిపూర్తి అభినందన:-

**-ప్రొ॥ వేదుల సుబ్రహ్మణ్యం**

**బ్రహ్మశ్రీ తంగిరాల సుబ్బారావు గారికి 80 వసంతములు నిండిన శు భసందర్భమున వారికిని వారి కుటుంబసభ్యులకును చిరాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుమని భగవంతుని ప్రార్థిస్తూ సమర్పించిన పద్యసుమము**

**'శ్రీరస' సార్వభౌమునికె చెల్లు, విశిష్ట రసజ్ఞ సమాఖ్యకెల్ల తా**
**సారథియై, మహామహులు సంతసమొందగ, సాహితీ జగం**
**బౌర యనంగ, మేటి కవులందరిగూడి ప్రసంగ మాధురీ**
**సారము నందజేసిన రసజ్ఞున కిత్తు శుభాభివందనల్ ॥**

బెంగుళూరు — **- వేదుల సుబ్రహ్మణ్యం**
30-03-2015 — **విశ్రాంతాచార్యులు**
**భారతీయ విజ్ఞాన సంస్థ**

## 2.8.14 జన్మదినోత్సవ శుభాకాంక్ష:-

**- "అవధాన చక్రవర్తి"-"ఆశుకవిశేఖర"**

**శ్రీ బులుసు వేంకట రామమూర్తి**

ఉ॥ శ్రీకర! తంగిరాల కులశేఖర! వేంకట సుబ్బరాయశో
భాకర! సత్యశోధన విభాసిత విశ్వకళాలయాంధ్ర శా
ఖా కమనీయ సద్గురు వికాసిత! కన్నడదేశవాస! వి
ద్యాకర! నీ కశేష శుభమస్తు! సమస్త దిశాప్రశస్తిగన్! 1

చ॥ సలలిత తంగిరాలకులసాగర చంద్రుఁడు డీ
యలఘుఁడు విశ్రుతంబయిన యభ్యుదయస్థితి నొప్పు సద్యశో
విలసితుఁడౌచు, నింకను కవిప్రకరాదృతుఁడౌచు, నిట్టులే
యలరుచు చేయుగావుత శతాధిక జన్మదినోత్సవమ్ములన్. 2

తే॥ ఆయురారోగ్య భోగభాగ్యాలతోడ
జన్మదినముల నీరీతి సలుపుకొనుచు
సంతసంబున నూఱు వసంతము లిల
శోభిలుము నీవు వేంకట సుబ్బరాయ! 3

రాజమండ్రి
30.03.1971.
(నా 36వ జన్మదినం)

ఇట్లు
భవదీయుడు
బులుసు వేంకట రామమూర్తి
అష్టావధాని

## 2.8.15 సి.పి.బ్రౌన్ స్మారక జీవితసాఫల్య పురస్కారం:-

**- శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డి**

**జానపద సాహిత్య పరిశోధనా ధురీణులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి సి.పి.బ్రౌన్ సేవామితి (రి), బెంగుళూరువారు సమర్పిస్తున్న విద్యావినయసంపన్నా!**

ఆంధ్రదేశంలో పశ్చిమగోదావరిజిల్లా పెదవాడపల్లిలో కీ.శే. సీతామహాలక్ష్మి – సుబ్బావధానులు పుణ్యదంపతుల నోములపంటగా జన్మించి, స్వగ్రామమైన కాకుల ఇల్లిందలపఱ్ఱులో ప్రాథమికవిద్యను, తాతగారివద్ద వేదవిద్యను, రాజమహేంద్రవరం, తణుకు, భీమవరం పట్టణాలలో ఉన్నతవిద్యను అభ్యసించి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగులో స్నాతకోత్తర పట్టభద్రులైన 'విద్యావినయ సంపన్ను'లైన మీకు ఇదే మా నమస్సుమనస్సులు!

**ఆదర్శవిద్యార్థీ!**

మీ అన్నగారు శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు, సాహితీవేత్తలు కీ.శే. దిగుమర్తి సీతారామస్వామిగారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, ఆచార్య జి.యన్.రెడ్డిగారు, ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు వంటి ఉద్దండుల శిక్షణలో తన విద్యకు మెరుగులు దిద్దుకొని, ఉత్తమసాహితీవేత్తగా రూపొందిన "ఆదర్శవిద్యార్థి" అయిన మీకు ఇవే మా అభినందనలు!

**పరిశోధనాప్రవీణా!**

జానపదసాహిత్య పరిశోధనలో సాటిలేని మేటి మీరు. తెలుగు, ఇంగ్లీషు, కన్నడ భాషలలో శతాధికంగా వెలువడిన మీ పరిశోధన పత్రాలు ఇందుకు సజీవ సాక్ష్యాలు. "తెలుగు వీరగాథాకవిత్వం"పై మీరు చేసిన మౌలిక పరిశోధన అనితరసాధ్యం. పిహెచ్.డి. పట్టాసాధించి, ఆగిపోక, అకుంఠిత దీక్షతో పురోగమించి, "కాటమరాజు కథాచక్రం" పై "పోస్టు డాక్టరేట్ రిసెర్చి" సాగించారు మీరు. మీ పర్యవేక్షణలో మీ పరిశోధక విద్యార్థులు సాధించిన 15కి పైగా పిహెచ్.డి. పట్టాలు, పాతికపైగా ఉన్న ఎం.ఫిల్. డిగ్రీలు మీ మహోన్నత మార్గదర్శకత్వ ప్రతిభకు ఆనవాళ్ళు. "పరిశోధనా ప్రవీణులైన" మీకు ఇవే మా ప్రణామసహస్రాలు!

**ఆచార్యవర్యా!**

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులుగా అడుగుపెట్టి, అధ్యయనశాఖ అధ్యక్షులుగా, గుల్బర్గా విశ్వవిద్యాలయంలో ప్రప్రథమ పరీక్షా నియంత్రణాధికారిగా, ఆచార్యునిగా, యు.జి.సి. ఎమిరిటస్ ప్రొఫెసర్‌గా వివిధ

దశల్లో భావిపౌరులను తీర్చిదిద్దే గురుతర బాధ్యతను అకుంఠిత దీక్షతో నిర్వహించిన ఉత్తమగురువు మీరు. ఆనాటి ముఖ్యమంత్రిని మెప్పించి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో "తెలుగు స్నాతకోత్తరశాఖ"ను ప్రారంభింపజేసిన అసాధారణ ప్రతిభ మీది. ఎందరో సాహితీవేత్తలను, పరిశోధకులను తీర్చిదిద్దిన శిష్యవాత్సల్య స్వరూపులు మీరు. మీ శిక్షణలో పర్యవేక్షణలో ఎందరో శిష్యులను విజయపథంలో నడిపించిన "ఆచార్యవర్యు"లైన మీకు ఇవే మా సవినయ నమస్కారములు.

**మహాగ్రంథరచనాధురీణా!**

తెలుగులో 'హంసపదిక' ప్రణయకావ్యంలో సృజనాత్మక రచనకు శ్రీకారం చుట్టి, బుర్రకథలు పరిశోధన ప్రబంధాలు, వచనకవితారచనలు, పుంఖాను పుంఖాలుగా వెలువరించిన సాటిలేని సామర్థ్యం మీది. 'శ్రీరస' ప్రచురణలుగా, విశ్వవిద్యాలయ ముద్రణలుగా ఎన్నెన్నో సాహిత్య సాంస్కృతిక ఆధ్యాత్మిక గ్రంథాలు వెలుగులోకి తెచ్చిన బాధ్యతాయుతమూర్తి మీరు. మీరు అంకితం తీసుకున్న విమర్శ గ్రంథాలు, పద్యకావ్యాలు, కథా, కవితాసంపుటాలు – అన్నీ మీ ఉత్తమాభిరుచికి దర్పణాలు. ఆంగ్ల, కన్నడ భాషలలో కూడా లెక్కకు మిక్కిలిగా రచనలు చేసిన 'మహాగ్రంథరచనాధురీణులైన మీకు ఇవే మా సాష్టాంగప్రణామములు.

**సర్వతోముఖ ప్రతిభాశాలీ!**

కవిత్వానికే అంకితమైన "చైతన్య కవిత" షాణ్మాసిక పత్రికను రెండున్నర దశాబ్దాలకు పైగా విజయవంతంగా నడిపిన సంపాదకులు మీరు. 'భువన విజయం' – 'శ్రీరస' మీరు నెలకొల్పిన సాహిత్య సంస్థలు. వీటి ద్వారా అసంఖ్యాకంగా సాహిత్య కార్యక్రమాలను వైవిధ్యభరితంగా నిర్వహిస్తూ సాహిత్యప్రియులకు మధురానుభూతులను పంచుతున్న మీ సాంస్కృతికసేవ అనన్యసామాన్యం. 'ఈ సంస్థల సత్కారం స్వీకరించని సారస్వతవక్తలేదు' అంటే ఆ మాట అభిమానపూరితం కావచ్చునేమోకాని, అసత్యంమాత్రం కాదు. అర్ధశతాబ్దికి పైగా సంపాదకులుగా, సాహిత్యోపన్యాసకులుగా, పరిశోధకులుగా, గ్రంథరచయితగా, సాహిత్య సంస్థల వ్యవస్థాపకులుగా విజయపథంలో పురోగమిస్తున్న "సర్వతోముఖ ప్రతిభాశాలి" అయిన మీకు ఇవే మా సహస్రాధిక సాష్టాంగ వందనాలు.

**బహుసత్కార బిరుద సమ్మాన్యా!**

గత ఆరు దశాబ్దాలుగా సాహిత్య సాంస్కృతిక పరిశోధనా రంగాలకు మీరు చేస్తున్న సేవలు అజరామరం. మీ విశిష్టసేవలకు పరవశించిన ఎందరో ప్రముఖులు, ఎన్నో సంస్థలు మీకు చేసిన సత్కారాలు, అందించిన పురస్కారాలు, సమర్పించిన బిరుదగౌరవాలు కోకొల్లలు. "వీరగాథల సవరాలజిమ్మడు"గా "రసజ్ఞ రాజశేఖరుడు"గా మీరు పొందిన బిరుదులు సార్థకాలు; అక్షరసత్యాలు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుంచి మీరు అందుకున్న ఉగాది పురస్కారాలు – అనేక సంస్థలు అందించిన 'సాహిత్య ప్రతిభా పురస్కారాలు', 'తెలుగుభాషాపురాస్కారాలు', సి.పి.బ్రౌన్‌పురస్కారం' – 'కవిత్రయ పురస్కారం' – 'పాల్కురికి సోమనాథ పురస్కారం' –మొదలైనవన్నీ మిమ్మల్ని వరించి, తమ ప్రజ్ఞను ఇనుమడింప జేసుకున్నాయి. "బహుసత్కార బిరుద సమ్మాన్యు"లైన మీకు ఇవే మా అభినందన హరిచందనాలు.

**సారస్వత తపోధనా!**

మీరు పది కాలాలపాటు ఆయురారోగ్య భాగ్యాలతో విలసిల్లుతూ, సారస్వత సంపదను పరిపుష్టం చేయగలరని, మీ ద్వారా జాతికి మరిన్ని సేవలు అందించగలరనీ నిండు మనస్సుతో ఆకాంక్షిస్తున్నాము.

మీకు "డా॥ మధునాపంతుల శతజయంతి" సభలో "సి.పి.బ్రౌన్ స్మారక జీవిత సాఫల్య పురస్కారం" అందించటం ఒక సువర్ణావకాశంగా "సి.పి.బ్రౌన్ సేవాసమితి, బెంగుళూరు" భావిస్తున్నది. "సారస్వత తపోధను"లైన మీ కీర్తి కిరీటంలో ఈ పురస్కారం మరో కలికితురాయి కాగలదని ఆకాంక్షిస్తూ, ముకుళిత హస్తాలతో అవనతశిరస్కులమై – మీకు ఈ పురస్కారాన్ని సగౌరవంగా సమర్పించుకుంటున్నాము.

| | |
|---|---|
| అధ్యక్షులు | ఇట్లు |
| ఇడమకంటి లక్ష్మిరెడ్డి | సభక్తిక ప్రణామాలతో... |
| ప్రధాన కార్యదర్శి | సి.పి.బ్రౌన్ సేవాసమితి (రి) |
| నిమ్మగడ్డ చంద్రశేఖర్ | బెంగుళూరు |
| 93425 40479 | 07-03-2020. |

(సన్మానపత్ర రచయిత ఆచార్య మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు)

# 2.9 నన్నుగురించి శిష్యులు, మిత్రులు

## 2.9.1 "క్రోధములేని సాధువు" ఆచార్య తంగిరాల

### (గోదావరినుండి - కావేరివరకు)

**- డా॥ తోట వెంకటస్వామి**

తంగిరాలవారిది తరతరాలుగా వేదకుటుంబం (కృష్ణయజుర్వేదం). వీరు వెలనాటి వైదిక బ్రాహ్మణులు (శ్రీవత్సగోత్రం). వీరి పూర్వీకులు గుంటూరుజిల్లా వినుకొండ తాలుకాలోని ''తంగిరాల'' అనే గ్రామంలో ఉండేవారు. గుంటూరుజిల్లాలో రెండు సీమలున్నాయి: వెలనాటిసీమ, పలనాటిసీమ. వీరు వెలనాటిసీమకు చెందినవారు. ఏడు తరాలకు ముందు, అంటే క్రీ.శ. 1700 ప్రాంతంలో, కొన్ని తంగిరాల కుటుంబాలవారు ఆ వెలనాటిసీమనుండి పశ్చిమ గోదావరిజిల్లాలోని "రేలంగి" - 'ఇరగవరం' అనే గ్రామాలకు వలసపోయారు. వేదపండితులైన వీరికి అక్కడి జమీందారులు ఎవరో కొన్ని వందల ఎకరాల భూములు ఈనాములుగా ఇచ్చారు. నిరంతరం వేదపఠనం చేస్తూ, చేయిస్తూ వీరు ఆ ప్రాంతంలోనే స్థిరపడిపోయారు. (వెలనాటి బ్రాహ్మణుల యింటి పేర్లన్నీ ఊర్లపేర్లే. ఆ ఊర్లన్నీ గుంటూరుజిల్లా వెలనాటిసీమలోనే ఉన్నాయి.)

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారి "మూలపురుషుడు" వేంకటకృష్ణ సోమయాజులుగారు. వీరికి ఐదుగురు కుమారులు: "వెంకన్న, హనుమాన్లు, రామస్వామి, శేషావధాని, అయ్యవారిశాస్త్రి''. వీరిలో చివరివారైన అయ్యవారిశాస్త్రిగారికి ఇద్దరు కుమారులు: "ఎగ్గెన్నశాస్త్రి", "జగ్గన్నశాస్త్రి". వీరిలో రెండవవారైన జగ్గన్నశాస్త్రిగారి కుమారుడు "వేంకట సుబ్బావధానులు". వీరికి "సీతామహాలక్ష్మి'' అనే ధర్మపత్నియందు నలుగురు కొడుకులు పుట్టారు. వారు వరుసగా "వేంకటకృష్ణ సోమయాజులు - వెంకటసుబ్బారావు - భాస్కరరావు - కృష్ణమూర్తి. వీరిలో రెండవ వారైన వెంకట సుబ్బారావుగారే మన తెలుగు ఆచార్యులు. వీరి భార్య "శకుంతలాదేవి". వీరికి ముగ్గురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. వీరి స్వగ్రామం: పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, (ఇరగవరం మండలం)లోని "కాకుల ఇల్లిందల పఱ్ఱు''. కాని, వీరు 1948లో

చదువుల నిమిత్తం తణుకువచ్చి, అక్కడ స్థిరపడ్డారు. అప్పటినుండి తణుకే వీరి స్వగ్రామం అయింది.

సుబ్బారావుగారి ప్రాథమికవిద్య స్వగ్రామంలోను, రాజమండ్రిలోను జరిగాయి. హైస్కూలువిద్య తణుకులోను, కళాశాలవిద్య భీమవరంలోను జరిగాయి. 1957లో తెలుగు బి.ఏ.లో ఉత్తీర్ణులయ్యారు.

వీరికి ఇంటర్మీడియేట్‌లోను, బి.ఏ.లోను ప్రముఖ విమర్శకులు, కవి అయిన దిగుమర్తి సీతారామస్వామిగారు తెలుగు బోధించారు. ఈ గురుదేవుల దయవల్ల వీరికి తెలుగు సాహిత్యంమీద మిక్కిలి అభిరుచి ఏర్పడింది. బి.ఏ. తరువాత తెలుగులో ఎం.ఏ. మరియు పిహెచ్.డి. చేయాలని వీరి కోరిక. కాని ఆర్థిక పరిస్థితులు అనుకూలించక పోవడంవల్ల నాలుగేళ్ళపాటు (1957–61 మధ్య) పోస్టాఫీసులో గుమాస్తాగా పనిచేశారు. తరువాత 1961లో వీరి తమ్ముడు కర్నల్ కృష్ణమూర్తిగారు (మిలిటరీలో మెకానికల్ ఇంజనీరు) అందించిన ఆర్థికసహాయంతో, శ్రీ తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ.లో చేరారు. అక్కడ ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు, డా.కోరాడ మహదేవశాస్త్రిగారు, డా.జి.ఎన్.రెడ్డిగారు, డా.జీరెడ్డి చెన్నారెడ్డిగారు, డా.తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మొదలైన హేమాహేమీలయిన గురువుల దగ్గర చదివి, ఎం.ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తరువాత ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి మార్గదర్శకత్వంలోను (1963–65), ఆచార్య జి.యన్.రెడ్డిగారి మార్గదర్శకత్వంలోను (1965–68) "తెలుగు వీరగాథాకవిత్వము" అనే అంశంమీద పరిశోధనచేసి, 1969లో పిహెచ్.డి. డిగ్రీ పొందారు. వీరి సిద్ధాంతగ్రంథం మిక్కిలి ఉన్నతప్రమాణంలో ఉందని, వీరికి మౌఖిక పరీక్ష (Viva-voce) లేకుండానే డిగ్రీ ఇవ్వవచ్చునని, న్యాయనిర్ణేతలు (ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ఆచార్య యస్వీ. జోగారావుగారు, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు) సిఫార్సు చేశారు. 1500 పుటల సుదీర్ఘమైన వీరి సిద్ధాంతగ్రంథాన్ని (అముద్రితమైన దానిని) అమూలాగ్రం చదివిన ప్రముఖ విమర్శకులు కె.వి.రమణారెడ్డి గారు వీరికి ఈ క్రింది విధంగా ఒక లేఖ వ్రాశారు:

"This is not 'Research'

This is not 'Search' even!

This is an 'Adventure'!

Hats off to you!

I want to see you!"

వీరి పరిశోధనకు మార్గదర్శకత్వం వహించిన గురువర్యులు ఆచార్య జి.ఎన్. రెడ్డిగారు ఈ క్రింది విధంగా ప్రశంసించారు:–

"He has collected many Telugu ballads which are not known to the educated public and when he publishes them, I am sure, he will put the Telugu public indebted to him for his work."

వీరి సిద్ధాంతగ్రంథంలోని ప్రతి అక్షరాన్ని పరిశీలించి తీర్చిదిద్దిన గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ క్రింది విధంగా కొనియాడారు:–

"His laborious collection of a good number of new ballads from different parts of Andhra Pradesh won admiration of the Telugu scholars and he threw new light on the subject."

ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు కేవలం పరిశోధకులు మాత్రమే కాదు, మంచి కవితాప్రతిభ కలిగినవారు. వీరికి మిక్కిలి చిన్నతనంలోనే కవిత్వాభిరుచి ఏర్పడింది. వీరి స్వగ్రామం ప్రక్కన చిన్నపల్లె ఉంది. దానిపేరు "గోపాలపురం". ఒక ప్రక్కన పంటకాలువ, మరొక ప్రక్కన మట్టిరోడ్డు, చుట్టూ వరిచేలు, చెరకుతోటలు, మామిడి తోటలు, నిండా పాతిక కొంపలు కూడా లేని ఊరు. మనోహరమైన ప్రకృతి. ఇక్కడ వీరి కుటుంబం 1939 నుండి 1948 వరకు నివసించింది. ఆ చుట్టు ప్రక్కల రైతు కూలీలు పాడే పల్లెపాటలు, తమ తల్లిగారు పాడే ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవర నవ్వు, కుశలవుల యుద్ధం, శ్రీకృష్ణుని చల్దులు, లాలిపాటలు, జోలపాటలు, మేలుకొలుపులు మొదలైన పాటలు వినడం వల్ల వీరి లేతహృదయంలో ఏదో తెలియని కవిత్వపు పులకరింత కలిగింది. 1942లో రెండవ తరగతిలో ఉండగా, ఎక్కాల పుస్తకంలో ఉన్న "ఋతువులు" చదువుతూ కంఠస్థం చేయగానే, వీరి మనస్సులో (పెద్దయ్యాక "మనుచరిత్ర" చదువుతుంటే కలిగిన ఆనందంలాంటి) ఆనందం కలిగిందట,

"చైత్ర-వైశాఖ మాసములు-వసంతఋతువు-చెట్లు చిగిర్చి పూవులు పూయును."

"జ్యేష్ఠ-ఆషాఢ మాసములు-గ్రీష్మ ఋతువు-ఎండలు మెండుగా కాయును."

అలాగే వర్షఋతువులో-"వానలు కురియును" - శరద్రుతువులో 'మంచి వెన్నెల కాయును, బురద యింకును" - హేమంత ఋతువులో "మంచు కురియును" - శిశిర ఋతువులో "చెట్ల ఆకులు రాలును" అనే వర్ణనలు చదవటంతోనే ఈ ఋతువులన్నీ తన చుట్టూ ఉన్న ప్రకృతిలో ప్రతిసంవత్సరమూ తాను చూస్తున్నవే, తాను ఆనందిస్తున్నవే కదా! అని అనిపించాయి.

సుబ్బారావుగారి పెద్దక్కయ్యగారు చల్లా పెదవెంకటరామలక్ష్మిగారు. వీరికి చిన్నతనంలోనే తెలుగు నెలల పేర్లు, సంవత్సరముల పేర్లు, శతక పద్యాలు చెప్పేవారు. వీరి అన్నగారు సోమయాజులుగారు సంస్కృతాంధ్రాల్లో గొప్ప పండితుడు, కవి. భాషాప్రవీణ చదివి హైస్కూల్లో తెలుగుపండితుడుగా పనిచేసేవారు. సుబ్బారావుగారు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలు వ్రాయగానే సోమయాజులుగారు వీరిచేత శ్రీశ్రీ "మహాప్రస్థానం" చదివించారు. వీరు కేవలం దానిని చదవడం కాదు, మొత్తం కంఠస్థం చేసేశారు. దీనితో వీరికి కవిత్వం వ్రాయాలనే ఆవేశం కలిగింది. అలాగే వీరి అన్నగారు తరచుగా ఇంట్లో గొంతెత్తి చదువుతూ ఉండే పారిజాతాపహరణం పద్యాలు, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణం పద్యాలు, జాషువా పద్యాలు, కరుణశ్రీ పద్యాలు-మొదలైనవి వింటూ ఉండటంవల్ల తెలుగుసాహిత్యంమీద వీరికి వల్లమాలిన అభిమానం ఏర్పడింది. 1952లో అడివి బాపిరాజుగారు చనిపోయినపుడు, వారిని గురించి ఒక స్మృతిగీతం వ్రాశారు. అదే వీరి మొట్టమొదటి కవిత. పత్రికలు, ముఖ్యంగా "భారతి" క్రమం తప్పకుండా చదివేవారు. 1955లో - దసరా సెలవులలో (సెప్టెంబరు నెలలో) తణుకులో ఉన్న ప్రముఖ ఆధునిక కవి దేవరకొండ బాలగంగాధర తిలక్‌ను సుబ్బారావుగారి మిత్రుడు శ్రీపాద కృష్ణమూర్తి పరిచయం చేశాడు. అంతకుముందే జూన్ నెల 'భారతి' మాసపత్రికలో మొదటి పుటటో వచ్చిన తిలక్‌గారి "ఆర్తగీతం" అనే వచన కవిత చదివి, సుబ్బారావుగారు మిక్కిలి ప్రభావితులయ్యారు. దానిని కంఠస్థంచేసి మిత్రుల దగ్గర బిగ్గరగా చదువుతూ ఉండేవారు. మొట్టమొదట, తిలక్‌గారిని చూచినప్పుడు (1955లో) ఆయన ఎదురుగా కూడా ఈ కవిత

చదివారు. ఆయన వీరిని మెచ్చుకొని, "చాలా బాగుంది! ఇంకొంచెం 'పాజ్' ఇచ్చి చదివితే ఇంకా బాగుంటుంది!" అన్నారు. 1955 నుండి 1961లో ఎం.ఏ. చదవడానికి తిరుపతి వెళ్ళేవరకూ తిలక్‌గారికి మిక్కిలి ఆత్మీయంగా, ప్రియతమ శిష్యునిగా కొనసాగారు. వీరి కోరికమీద తిలక్‌గారు "తపాలా బంట్రోతు" అనే కవిత, "సుచిత్ర ప్రణయం" అనే నాటిక వ్రాశారు. ఈ నాటికలో సుబ్బారావుగారు హీరోగా నటించారు. తిలక్‌గారు "సుందరీ – సుబ్బారావు" అనే కథను కూడా తన శిష్యుడైన సుబ్బారావుగారిని దృష్టిలో పెట్టుకొనే రచించారు. తరువాతి కాలంలో, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖాధ్యక్షులుగా ఉన్నప్పుడు (1974 ప్రాంతంలో) ప్రముఖకవి గుంటూరు శేషేంద్రశర్మగారితో తంగిరాలవారికి పరిచయమయింది. పిమ్మట వారికి ఆప్తమిత్రులయ్యారు. ఈ విధంగా తంగిరాలవారికి కవిత్వ రచనలో శ్రీశ్రీ – తిలక్ – శేషేంద్రలు గురుత్రయంగా భాసిల్లారు. "హంసపదిక" – "మానసావర్తాలు" – "గుండెపూచిన గులాబీ" – "నా ముద్దబంతిపువ్వు" – వంటి కవితా సంపుటాలు వెలువరించారు.

కవిత్వంమీద తంగిరాలవారికిగల గాఢానురాగంవల్ల, కేవలం కవిత్వానికే అంకితమైన ఒక పత్రికను 1986లో ప్రారంభించారు. దీనిపేరు "చైతన్యకవిత". దీనిని మైసూరులోని "ధ్వన్యాలోకం"లో ప్రా॥ యస్వీ.జోగారావుగారు, ప్రా॥ సి.డి. నరసింహయ్యగారు ప్రారంభించారు. ఈ పత్రికకు వీరి ఆత్మీయ మిత్రులు ప్రా॥ ఆర్వీయస్.సుందరంగారు సహసంపాదకులుగా ఉండేవారు. ఇది ఆరుమాసాలకొకసారి (వసంత ఋతువులోను, శరదృతువులోను) వెలువడేది. దీనిని 2009 వరకూ నడిపారు. 48 సంచికలు వెలువడ్డాయి. దీనిలో వచన కవితలు, పద్యకవితలు అన్నీ ప్రచురింపబడేవి. ప్రసిద్ధ ఆధునిక కవుల ముఖచిత్రాలతో వెలువడటం దీని ప్రత్యేకత. ఈ పత్రికకు "దాన చింతామణి" కీ.శే. డి.కె. (దళవాయి కృష్ణస్వామి) ఆదికేశవులుగారు ధనసహాయం చేసేవారు.

సాహిత్య సంస్థలను స్థాపించడం, వాటి ద్వారా "నెలనెలా వెన్నెల" పేరుతో సాహిత్య సభలు నిర్వహించడం తంగిరాల సుబ్బారావుగారికి మిక్కిలి యిష్టమైనపని.

**1. భువన విజయం**

1974 నుండి 1994 వరకు 20 సంవత్సరాలపాటు బెంగుళూరు

విశ్వవిద్యాలయంలో "భువన విజయం" అనే సాహిత్యసంస్థను తెలుగు అధ్యయనశాఖకు అనుబంధంగా నిర్వహించారు. ఈ సంస్థ అనేక సాహిత్య కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. ముఖ్యంగా 1977 నుండి 2000 వరకు ప్రతిసంవత్సరం సెప్టెంబరు 10వ తేదినాడు "విశ్వనాథ జయంతి"ని జరుపుతూ వచ్చింది. దీనికి "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు ధనసహాయం చేసేవారు.

**2. శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ("శ్రీరస")**

భావనామ సంవత్సర ఉగాదినాడు-అంటే 11.4.1994నాడు "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") అనే సాహిత్యసంస్థను స్థాపించి, ప్రతినెలా మూడేసి ఉపన్యాసాలతో ఒక సాహిత్యసభను నిర్వహిస్తూవస్తున్నారు. తెలుగు ప్రాచీనసాహిత్యంగురించి, ఆధునికసాహిత్యంగురించి – జానపద సాహిత్యంగురించి ఎందరో కవులు, పండితులు ప్రసంగాలు చేశారు. (1994–2020 మధ్య "శ్రీరస"లో సుమారు 600 ప్రసంగాలు, 60 గోష్ఠులు జరిగాయి).

**ఉద్యోగాలు**

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు, బెంగుళూరులోని బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 1969 నుండి 1978 వరకు ఆంధ్రోపన్యాసకులుగా, 1978 నుండి 1980 వరకు రీడరుగా, తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేశారు. వీరు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నప్పుడే 1971లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావుగారికి లేఖ వ్రాసి, మూడు లక్షల రూపాయల గ్రాంటును సంపాదించి, 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు స్నాతకోత్తర శాఖ (Post-Graduate Department) ను స్థాపించారు. ఇది వీరు తమ జీవితంలో సాధించిన గొప్ప విజయంగా మిత్రులు ఇప్పటికీ కొనియాడుతారు.

1980 నుండి 1983 వరకు గుల్బర్గా విశ్వవిద్యాలయంలో మొట్టమొదటి పరీక్షానియంత్రణాధికారి (Controller of Examinations) పదవిని

నిర్వహించారు. తిరిగి బెంగుళూరు వచ్చి 1983 నుండి 1987 వరకు బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో రీడరుగా ఉన్నారు. అదే తెలుగుశాఖలో 1987నుండి 1995వరకు ప్రొఫెసర్ మరియు తెలుగు అధ్యయనశాఖకు అధ్యక్షులుగా పనిచేశారు.

నేను 1987-89 మధ్య గురువుగారి వద్ద ఎం.ఏ. తెలుగు చదవటం నిజంగా నా అదృష్టంగా భావిస్తాను. నేను ఎం.ఏ. తెలుగులో చేరిన కొద్ది కాలానికే గురువుగారు రీడర్నుండి ప్రొఫెసర్ అయ్యారు. గురువుగారు ఓ రోజు మాతో "మీరు ఎం.ఏ. తెలుగు చదివారంటే మీ దగ్గర కనీసం ఈ పుస్తకాలు ఉండాలి" అని చెప్తూ, ఉండవలసిన పుస్తకాలను వారే వారి డబ్బులతో తెప్పించి మాకు ఇచ్చేవారు. అంతేకాక మాకు వారంలో ఒకరోజు అంటే ప్రతిగురువారం ఓ క్లాసు పద్యపఠనం ఉండేది. ఆ పద్యపఠనంలో పద్యాన్ని ఎలా పఠించాలి. పద్యంలో ఎక్కడ బ్రేక్ ఇవ్వాలి, దాన్ని రాగయుక్తంగా ఎలా పఠించాలి అనే విషయాన్ని నేర్పిస్తూ ఉండేవారు. ఏ విద్యార్థి అయినా గురువుగారు చెప్పినట్లు చెప్పకపోతే "నాయనా! హాస్టల్లో మాంసాహారాన్ని తినటం తగ్గించి, ఉదయాన్నే కాస్త పద్యపఠనం చేయండి" అని చెబుతుండేవారు. "నాయనలారా! ఎం.ఏ. తెలుగు అయిపోయేలోపు మీకు కనీసం వంద వృత్తపద్యాలు కంఠతా వచ్చి ఉండాలి. అప్పుడే మీరు ఎం.ఏ. విద్యార్థులు అనిపించుకుంటారు" అని చెప్తూ ఆచార్య కోరాడ మహదేవశాస్త్రిగారి "తెలుగు వాఙ్మయ పరిచయం" అనే పుస్తకాన్నితెప్పించి ఇచ్చి, దానిలో ఉన్న అన్ని పద్యాలను మా చేత కంఠతా పెట్టించేవారు. మేము ఆ పుస్తకం మొత్తాన్ని అవలీలగా ఆకళింపు చేసుకోవటమే కాక, వాటిని సందర్భానుసారంగా నిజజీవితంలో వాడుతుండేవాళ్ళము కూడా.

గురువుగారు తమ ఉద్యోగ విరమణానంతరం 1998 నుండి 2000 వరకు తెలుగు అధ్యయనశాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఎమెరిటస్ ప్రొఫెసర్గా కూడ ఉన్నారు.

**ముద్రిత గ్రంథాలు**

జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం ఒక భాగం. ఈ జానపద సాహిత్యంలో జానపద కవిత్వం ఒక భాగం. ఈ జానపద కవిత్వంలో వీరగాథలు ఒక ప్రత్యేకశాఖ. ఈ వీరగాథలను గురించి గురువుగారు ఆచార్య తంగిరాల

వెంకట సుబ్బారావుగారు అయిదు సంవత్సరాలపాటు (1963-68) కష్టపడి పరిశోధన చేసి, "వీరగాథ (Ballad)"ను చక్కగా నిర్వచించారు. "వీరగాథ అంటే 'వీరుణ్ణి గురించిన గాథ'. 'గాథ' అనే శబ్దానికి 'చరిత్ర, గానం, పాట' అని మూడు అర్థాలున్నాయి. ఈ మూడూ కలిపితే వీరగాథా నిర్వచనం అవుతుంది." అంటే "వీరుని చరిత్రను గానంచేసే పాట వీరగాథ". అయితే వీరుడంటే ఎవరు? "అన్యాయాన్ని అధర్మాన్ని ఎదిరించి, తన జాతిజనుల మేలుకోసం యుద్ధంచేసి, ప్రాణత్యాగం చేసేవాడు వీరుడు". ఇటువంటి వీరులనుగురించి, వీరవిద్యావంతులు, సుద్దులగొల్లలు, కొమ్ములవారు, పంబలవారు, జంగములు, మాలదాసరులు మొదలైన వృత్తిగాయకులు వాద్యసహితంగా గ్రామవీథులలో పాడే జానపద కథాగేయాలే వీరగాథలు. పరశురాముని కథలు, అంకమ్మకథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, ఆరెమరాటీలకథ, సర్వాయిపాపడుకథ, కాకమ్మకథ, లక్ష్మమ్మకథ, చిన్నపరెడ్డికథ మొదలైనవి తెలుగులో మిక్కిలి ప్రసిద్ధమైన వీరగాథలు.

ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి ముద్రిత గ్రంథాలను నాలుగు రకాలుగా విభజించవచ్చు. అవి: 1) సృజనాత్మక రచనలు, 2) పరిశోధనాత్మక రచనలు, 3) ఆంగ్ల రచనలు, 4) కన్నడ రచనలు.

**2) పరిశోధనాత్మక రచనలు**

వీరు అనేక తాళపత్ర గ్రంథాలను సేకరించి సిద్ధంచేసిన 'కాటమరాజుకథలు' మొదటి సంపుటాన్ని 1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ప్రచురించారు. ఇది వేయిపుటల వీరగాథల సంకలనం. దీనికి గురువుగారు సుమారు 300 పుటల విమర్శనాత్మకమైన పీఠికను రచించారు. అలాగే 1978లో అదే అకాడెమీవారు ప్రచురించిన మరో వేయి పుటల "కాటమరాజుకథలు" ద్వితీయ సంపుటానికి "కాటమరాజు కథలలోని భాష"ను గురించి తంగిరాలవారు చక్కని పీఠికను వ్రాశారు.

వీరు 1993లో "అంకమ్మ కథలు" అనే పుస్తకాన్ని వెలువరించారు. దీనిలో "అంకమ్మ కథ" - "రవద్దేవిరాజుకథ" - "గంగురాజుకథ" అనే మూడు వీరగాథలను సవిమర్శకంగా పరిచయం చేశారు.

19వ శతాబ్ది మధ్యలో (క్రీ.శ.1806–1847) జీవించిన, రేనాటి సీమకు చెందిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి అనే యుద్ధవీరునిగురించి, క్రీ.శ. 1822–1900 మధ్య జీవించిన అదే ఉయ్యాలవాడకు చెందిన బుడ్డా వెంగళరెడ్డి అనే దానవీరుని గురించి ప్రత్యేక పరిశోధనచేసి, 1999లో "రేనాటి సూర్యచంద్రులు" అనే 600 పుటల విమర్శగ్రంథాన్ని వెలువరించారు. తరువాత ఈ గ్రంథానికి అనుబంధంగా 2000 సంవత్సరంలో రెండవ సంపుటాన్ని, 2011లో మూడవ సంపుటాన్ని ప్రకటించారు.

2013లో ''తెలుగు వీరగాథాకవిత్వము'' అనే సమగ్రసంపుటాన్ని (బృహద్గ్రంథాన్ని) ప్రచురించారు ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు. దీంట్లో 25 ప్రకరణాలు ఉన్నాయి. వీటిని నాలుగు భాగాలుగా విభజించారు. మొదటి భాగంలో "వీరగాథల నిర్వచనము, ఉత్పత్తి, లక్షణము, వర్గీకరణము'' ఇత్యాదిగా తొమ్మిది ప్రకరణాలు ఉన్నాయి. రెండవభాగంలో "శక్తికథాచక్రము, పల్నాటి వీరకథాచక్రము, కాటమరాజు కథాచక్రము, బొబ్బిలికథలు, పదములు – జంగంకథలు, వీరగాథానికలు లేక లఘువీరగాథలు లేక వీరగీతములు, వీరగాథానుకరణములు – బుఱ్ఱకథలు' అనే ఏడు ప్రకరణాలు ఉన్నాయి. తృతీయభాగంలో "వీరగాథలు–రసపోషణ, వీరగాథా కవిత్వము – వారాను వర్తనములు, వీరగాథల భాష, వీరగాథల ఛందస్సు, గాథాగానము–సంగీతము" అనే ఐదు ప్రకరణాలు ఉన్నాయి. చతుర్థభాగంలో "వీరగాథల వైశిష్ట్యము, గాథాకారులు, క్షీణతాకారణములు, సేకరణ–పరిరక్షణ" అనే నాలుగు ప్రకరణాలు ఉన్నాయి. ఈ 25 ప్రకరణాల చివర 16 వివిధానుబంధాలు చేర్చారు. వీటిలో ఒక ముఖ్యమైన అనుబంధం ఉంది. అది క్రీ.శ. 1842లో సి.పి.బ్రౌన్‌దొర ఒక జంగమునుండి సేకరించిన "బొబ్బిలికథ" వీరగాథ. ఈ వీరగాథకు 1956లో మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇంగ్లీషులోను తెలుగులోను బొబ్బిలియుద్ధం ఎలా జరిగిందో మిక్కిలి వివరంగా తెలిపిన రెండు విలువైన పీఠికలు కూడా చేర్చబడ్డాయి.

భావాత్మకమైన జానపద గేయాలనుంచి (అంటే Lyrical Folk Songs నుంచి) కథాత్మకములు, వీరరస ప్రధానములు, చారిత్రములు అయిన వీరగాథలను (Ballads) ను విడదీసి, వాటిని "వీరగాథాచక్రములు" (Ballad - Cycles) లేక ''జానపదేతిహాసాలు'' (Folk Epics) – ''వీరగాథలు'' (Ballads) –

"వీరగాథానికలు'' (Balladlings)-అని మూడు విధాలుగా వర్గీకరించడం, వీరగాథలలో "వారానువర్తనములు (Ballad Commonplaces) "అభివర్ధిత పునరుక్తులు (Incremental Repetitions) గుర్తించడం, ప్రపంచవ్యాప్తంగా ప్రతిసాహిత్యంలోను స్వతంత్రంగా ఉన్న వీరగాథాప్రక్రియ వైశిష్ట్యాన్ని చాటిచెప్పడం తంగిరాలగారి జానపద సాహిత్య విమర్శలోని ప్రత్యేకతగా మనం గుర్తించవచ్చు.

"వాల్మీకి రామాయణం-కిష్కింధకాండ ప్రాముఖ్యం", "మహాభారతం-ధర్మశాస్త్రం", "భారతంలో కర్ణునిపాత్ర", బిల్వమంగళ లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతానికి "సువర్ణ చషకం" అనే పేరుతో వ్రాసిన 60 పుటల విమర్శనాత్మకమైన పీఠిక (1998), "పోతన భాగవతము-శ్రీకృష్ణుని బాల్యక్రీడలు", "రాయల ప్రకృతి వర్ణనలు'', "వేమన కవితావైభవం" మొదలైన వ్యాసాలు వీరి ప్రాచీనసాహిత్య విమర్శనాభిరుచిని తెలియజేస్తాయి.

"విశ్వనాథ రామాయణ కల్పవృక్షం - జానపద సాహిత్య ప్రభావం'', "రామాయణ కల్పవృక్షం - అవతారిక", "విశ్వనాథవారి ఋతుసంహారం", "భావాభ్యుదయకవి స్వర్గీయ దేవరకొండ బాలగంగాధర తిలక్'', "తిలక్ వచన కవితా శైలి'', "శేషేంద్ర కవితా వైభవం", "కవిత్వ నిర్మాణ కళ" మొదలైన వ్యాసాలు వీరి ఆధునిక సాహిత్య విమర్శకు మంచి ఉదాహరణాలు.

"పంప-నన్నయ: తులనాత్మక పరిశీలన", "తెలుగు - కన్నడ భారతాలలో కర్ణునిపాత్ర", "వేమన-సర్వజ్ఞ", "విశ్వనాథ రామాయణ కల్పవృక్షము - కువెంపు రామాయణ దర్శనము", "తెలుగు-కన్నడ సాహిత్య సంబంధం", "అడిగ భూమిగీత - తిలక్ వసుధైకగీతం: తులనాత్మక పరిశీలన" మొదలైన వ్యాసాలు గురువుగారి తులనాత్మక సాహిత్య విమర్శనాశక్తికి నిదర్శనాలు.

"జానపద కవిత్వం-కావ్య లక్షణాలు'' అనే వ్యాసంలో జానపద కవిత్వాన్ని మన ప్రాచీన అలంకారశాస్త్రాలతో పోల్చి దాని నిగ్గు తేల్చారు. జానపద సాహిత్య విమర్శలో తంగిరాలగారికి అపారమైన ప్రవేశం ఉంది. వీరగాథా సాహిత్య విశ్లేషణలో మౌలికమైన ప్రతిపాదనలను ఆయన చేశారనడంలో అతిశయోక్తిలేదు.

ఇవే కాక, ఇంకా వీరి సంపాదకత్వంతో 2006లో "ఏటిన ముత్యాలు", 2009లో "జ్ఞాన రత్నాలు" శ్రీరస ప్రచురణల ద్వారా ప్రచురించారు. అలాగే 2011లో వీరు రాసిన "రేనాటి సూర్యచంద్రులు" (మూడవ సంపుటము), 2013లో

"తెలుగు వీరగాథాకవిత్వము" (సమగ్ర సంపుటము), శ్రీరస ప్రచురణల ద్వారానే ప్రచురితమయ్యాయి. 2017లో వీరి సంపాదకత్వంలో "వీరగల్లు" (మొదటి సంపుటము), "జ్ఞానతరంగాలు", 2018లో "భగవద్గీతాప్రబోధము" అనే గ్రంథాలను కుప్పం, ద్రావిడ విశ్వవిద్యాలయంవారి ప్రచురణల కేంద్రం వెలువరించింది.

**పరిశోధన**

1. తెలుగు, ఇంగ్లీషు, కన్నడ భాషలలో సుమారు 100 పరిశోధన పత్రాల రచన, సమర్పణ. ఒక్క "భారతి" సాహిత్య పత్రికలోనే 40 వ్యాసాలవరకు ప్రచురింపబడ్డాయి.
2. వీరి పర్యవేక్షణలో 15 మందికి పిహెచ్.డి. డిగ్రీలు, 25 మందికి ఎం.ఫిల్. డిగ్రీలు వచ్చాయి.
3. 1997-1998 యు.జి.సి. మేజర్ రీసెర్చ్ ప్రాజెక్టుగా 'పల్నాటి వీరగాథాచక్రం- సామాజిక సాంస్కృతిక అధ్యయనం" అనే అంశాన్ని గురించి పరిశోధన చేశారు.
4. 1998-2000 యు.జి.సి. ఎమెరిటస్ ప్రొఫెసర్‌గా 'కాటమరాజు కథాచక్రం-సామాజిక సాంస్కృతిక అధ్యయనం" అనే అంశాన్ని గురించి పరిశోధన చేశారు.
5. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలోని అనేక ప్రాంతాలలో పర్యటించి, సాహిత్యోపన్యాసాలు చేశారు.

**పురస్కారాలు**

ఆచార్య తంగిరాలవారు సాహిత్యజీవితంలో ఎన్నో పురస్కారాలను పొందారు. వాటిలో మచ్చుకు కొన్ని –

1. శ్రీ ఎన్.టి. రామారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండగా 1987లో "ఉగాది పురస్కారం".
2. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచే "కవిత్రయ పురస్కారం", నెల్లూరు, 1998.
3. విజయవాడ సిద్ధార్థ కళాపీఠంవారిచే "సాహిత్య పురస్కారం", 23-9-2000.

4. డా. ఆవంత్స సోమసుందర్ సాహిత్య పురస్కారం, పిఠాపురం, 18-11-2001.
5. ద్రావిడ విశ్వవిద్యాలయంవారిచే సాహిత్య పురస్కారం, కుప్పం, మార్చి,2006.
6. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. వై.యస్. రాజశేఖరరెడ్డిగారిచే "ఉగాది పురస్కారం", బెంగుళూరు, 3-4-2006. మొదలైనవి సుమారు 20 వరకు వున్నాయి

**వీరి బిరుదులు:**

"వీరగాథల సవరాల జిమ్మడు" (పల్నాటి యుద్ధంలో అలరాజు అధిరోహించే గుఱ్ఱంపేరు "సవరాల జిమ్మడు") - "రసజ్ఞ రాజశేఖరుడు"

**"క్రోధములేని సాధువు, అకుంఠిత నైతికశీలశాలియున్,**
**ఆధునికాంధ్రవాఙ్మయ మహార్ణవ నౌక, కవిత్వమాధురీ**
**శీధుపిపాసి, మిత్రజనసింధు శరద్వరపౌర్ణమాసియున్,**
**సౌధములేని రాజునకు సాంద్ర నమస్సులు తంగిరాలకున్."**

**- శేషేంద్ర**



## "అచ్చంగా షాజహాను గడ్డంలా"

ఆరుద్రగారు కొత్తగా గడ్డం పెంచారు. దానిని చక్కగా ట్రిమ్ చేసుకున్నారు. చూడటానికి చాలా బాగుంది. డా॥ పప్పు వేణుగోపాలరావు అనే మిత్రుడు ఆరుద్రగారిని చూసి. "అయ్యా! మీ గడ్డం చాలా అందంగా ఉంది. అచ్చంగా షాజహాను గడ్డంలా ఉంది!" అన్నారు. వెంటనే ఆరుద్రగారు. "ఈ మాట నాతో అంటే అన్నారు కాని మా ఆవిడతో మాత్రం అనకండి! నన్ను తాజ్‌మహల్ కట్టించమంటుంది!" అన్నారు. అక్కడున్న మిత్రులంతా పగలబడి నవ్వారు.

**- తంగిరాల**

## 2.9.2 పరమప్రేమమూర్తి-(మా అన్నగారు తంగిరాల)

- ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ

పరమ ప్రేమమూర్తి, సాహిత్యతత్త్వమే తప్ప అన్యమెరుగని అమాయకచక్రవర్తి ఆదర్శ పరిశోధనానువర్తి అన్న ఆచార్య తంగిరాల వారికి ఆలస్యంగా జన్మదిన శుభాకాంక్షలు...

నిండు నూరేళ్లు అన్నగారిచేత ఆంధ్రసారస్వతారాధనను నిర్విఘ్నంగా చేయించాలని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను..

“వారికి సోదర సమానులైన...” వారిలో బే.రా. గారే కాదు, మా వంటి అన్యులూ ఉన్నారు.... 90 ల మొదట్లో కూడా వారు రాసిన ఒక పుస్తకం (లేదా చైతన్యకవిత ప్రత్యేక సంపుటి?) మున్నుడిలో, తనకు సొంత అన్నదమ్ములే కాక, దైవమిచ్చిన మరో ఐదుగురు స్వంత తమ్ముళ్ళున్నారు, అన్నారు. అందులో మొదటి పేరు మా మేష్టారు ఆచార్య LBS గారిది, మధ్యలో నాది చివర అప్పట్లో ఎస్వీలో ఉన్న చంద్రశేఖర్ ది...

వారితో నాకు ఎస్వీలో విద్యార్థిదశలోనే పరిచయం. ఒక నాటకానికి, అప్పట్లో తెలుగు డిపార్ట్మెంట్‌లో ఉన్న వారు దర్శకత్వం వహించారు. ఆ మరుసటి ఏడాది వారి తొల్సి కవితాసంపుటి ‘హంసపదిక’ ను అచ్చేశారు. ఆంధ్రప్రభ వారాపత్రికలో రాయలసీమ కోడిపందేలమీద, కోడి కత్తుల మీద, ఇంకా వారి క్షేత్రపరిశోధనలో లభ్యమైన అనేక పరికరాలమీద, ఫొటోలతో సహా, వరసగా వ్యాసాలు రాస్తుండేవారు. జానపద ‘వస్తుసంస్కృతి’మీద అలా రాయలసీమలో ముఖ్యంగా, తెలుగునాట అంతటాను అత్యంత ప్రజాదరణ చేకూర్చిన మొదటి జానపద పరిశోధకులు వారే! ఆయన జానపదంలో ఆచార్య రామరాజుగారి తర్వాత స్మరించదగ్గ ఏకైక శిఖరం. వారి పల్నాటి వీరచరిత్ర పరిశోధకులుగా ఆచార్య పింగళిగారే ఉండడం గొప్ప అదృష్టం. మాకు అప్పట్లో వారి ఆ వ్యాసాల విలువ తెలియదు, అర్థమయ్యేదీ కాదు... ప్రతి సంక్రాంతికి చూసే కోడికత్తులుమీద ఈ వ్యాసాలు ఏమిటి? అనుకొనే వాళ్ళం. “ఎవరూ స్పృశించని ఏరియాలో, చాలా కొత్త టాపిక్ మీద పరిశోధన చేయాలని ఉంది అన్నయ్యా!” అంటూ, నేను

టాపిక్ కోసం తపన పడుతూ, కాలయాపన చేస్తున్న రోజుల్లో, బెంగళూరులో ఒక ఆదివారం ఉదయాన్నే, పనిగట్టుకుని మా ఇంటికి వచ్చి చిన్నపిల్లలంతటి సంబరంతో, "నీకు తగ్గ మంచి టాపిక్! జానపదకథలుమీద చేసేయ్... ఇంతవరకూ ఆ రంగంలో ఎవరూ చేయలేదు. నువ్వే తొలివాడివవుతావు" అని చెప్పారు... "అబ్బే, జానపదం వద్దు లెండి అన్నయ్యా! నాకు ఏదైనా క్లాసికల్ టాపిక్కే కావాలి" అంటే, ఆయన ముఖం చిన్నబోయిన తీరు నాకు బాగా జ్ఞాపకం "నువ్వోట్టి తెలివితక్కువ వాడివి. నీకు కథ మీద పిచ్చి కదా అని సజెస్ట్ చేస్తుంటే, దాని లోతు ఎలాటిదో నీకు అర్థం కావటం లేదు. ఎంతయినా, ఎన్ని కోణాల నుంచయినా చెప్పవచ్చు" అన్నారు... అన్నగారి మాటలు నిజంగానే నాకు అర్థం కాలేదు.. తెలుగు విశ్వవిద్యాలయం ఏర్పడ్డ తొలిరోజుల్లో, దొణప్ప మేస్టారు, నాకు ఇష్టం లేకపోయినా నన్ను జానపద కళల విభాగానికి ఇన్చార్జిగా నియమించి, బలవంతంగా నాతో కొన్ని పుస్తకాలు చదివించేదాకా, అన్నగారు చెప్పిన ఆ సబ్జెక్టు లోతుపాతులు రేఖామాత్రంగా కూడా నాకు తెలియలేదు అని చెప్పుకోటానికి నేను సిగ్గుపడటం లేదు...

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే తన వద్ద పరిశోధనకు చేరేవారికోసం, వారికంటే కూడా ఆయన ఎంత ఎక్కువగా శ్రమ తీసుకొని, ఆలోచించే, ఆదర్శ మార్గదర్శకులో చెప్పటానికి మాత్రమే. అతి స్వచ్ఛమైన ప్రేమతో, నిర్మలమైన, నిండైన తననవ్వువంటి ప్రేమతో, ఆయన తన విద్యార్థి మిత్రుల (అందర్నీ ఆయన మిత్రులుగానే, సోదరులుగానే చూసేవారు) విద్యాత్మిక ప్రగతిని ఆకాంక్షించేవారో అందుకోసం శ్రమించేవారో! 71 లో నా బెంగళూరు జీవితం ప్రారంభం కావడంలో ఒక విధంగా వారికి ఋణపడి ఉన్నా, వారి వద్ద వెంటనే పరిశోధనకు చేరవచ్చనే ఉద్దేశ్యం తోనే. బెంగళూరుకు వెళ్లినా, వారి వద్ద పరిశోధన చేయటం కుదరలేదు. ఆ తర్వాత 12 చివర పూనా దక్కన్ కళాశాలలో, లింగ్విస్టిక్స్ కోసం డా॥ బిళిగిరిగారి వద్ద, పార్ట్ టైమ్ పరిశోధకునిగా చేరటం జరిగింది. అదో ఘట్టం. అక్కడున్న ఒక ఘట్టమ పరోక్ష ఫలితం.

అయినా, అన్నగారి ప్రేమను, అంతకంటే ముఖ్యంగా మా వదిన గారి నిష్కపట వాత్సల్యాన్ని జీవితమంతా మరచిపోలేను!

నూరేళ్లు మా అన్నగారి సేవలను ఇలానే శక్తిమంతంగా అందుకోవాలని సరస్వతీమాతను ప్రార్థిస్తున్నాను. వారికి జన్మదిన శుభాకాంక్షలు నా పక్షాన కూడా తెలుపుతున్నాను.

(30-03-2022 బుధవారం నాడు నా 87వ జన్మదిన సందర్భంగా తెలిపిన శుభాకాంక్షలు - తంగిరాల)



## గుల్లానికి సన్మానం

బెజవాడలో కొందరు మిత్రులు ఒక సాహిత్య సంస్థను ఏర్పాటు చేశారు. ప్రతిసంవత్సరం ఉగాదినాడు ఒక మహాకవిని సత్కరించాలని నిర్ణయించు కున్నారు. మొదటి సంవత్సరం విశ్వనాథ సత్యనారాయణగారిని సన్మానించారు. ఆయన సంతోషించారు. రెండవ సంవత్సరం జాషువాగారిని సన్మానించాలని సభను ఏర్పాటు చేశారు. ఆ సభకు విశ్వనాథవారిని అధ్యక్షులుగా ఆహ్వానించారు. విశ్వనాథవారికి ఆ సంస్థవారు జాషువాను సన్మానించడం యిష్టంలేదు. లోపల కుతకుత ఉడికిపోతున్నారు. అధ్యక్షుని తొలిపలుకులలో చాలా కోపంగా ఆ సంస్థ నిర్వాహకుల్ని తిట్టడం మొదలు పెట్టారు. "వీళ్ళు శుద్ధబడుద్ధాయిలు. వీళ్ళకి ఏమాత్రం బుద్ధిలేదు. వీళ్ళకి గుర్రానికీ గాడిదకీ తేడా తెలియదు" అంటూ ఇంకా తిడుతున్నారు. వెంటనే జాషువాగారు లేచి, విశ్వనాథవారికి చేతులు జోడించి "అయ్యా! ఇప్పుడు గుర్రానికి సన్మానం చేస్తున్నారు!" అని కూర్చున్నారు. సభంతా గొల్లుమంది. ఇంతకి అసలు విషయం ఏమిటంటే జాషువాగారి ఇంటిపేరు "గుర్రం!" విశ్వనాథవారు చిన్నబోయారు!

(-"ఆశుకవిశేఖర", "అవధాన చక్రవర్తి"
శ్రీ బులుసు వేంకటరామమూర్తిగారు చెప్పిన ఛలోక్తి - **తంగిరాల**)

## 2.9.3 "సాంద్ర నమస్సులు తంగిరాలకున్"

- డా॥ దివాకర్ల రాజేశ్వరి

శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారు జానపదవిజ్ఞానవేత్త. సాహిత్యచైతన్య సంపాదకులు. కర్ణాటక తెలుగు రాష్ట్రాలలో ఆచార్యులుగా, ప్రముఖ వక్తగా, పేరు పొందారు.

జీవనోత్సాహానికి వీరినవ్వు తోరణం కడుతుంది. శిష్యప్రేమకు వీరి మనసు పెద్దపీట వేస్తుంది. స్నేహానికి వీరి హృదయం పాదుగొలుపుతుంది. గంపకెత్తిన కృష్ణుని నడురాత్రి వసుదేవుడు గోకులానికి చేర్చినట్లు, బ్రతుకు కష్టాల వానలో వాఙ్మయవాసుకినీడ ననుసరించి సదా ఆనందగోకులానికి గుండె భారాన్ని చేర్చుకుంటారు. వీరి గుండెపూసిన గులాబీ సహధర్మచారిణి సౌభాగ్యవతి శకుంతలమ్మగారు. వారి వియోగాన్ని గులాబీముళ్ళు గుచ్చుకోని మట్టితొట్టెలో మరపురాని స్మృతుల వెలుగుకిటికీ దగ్గర ఉంచేసుకున్నారు. వీరి వ్యక్తిత్వం కుటుంబ సారాన్ని విడువని అపురూప వీరగాథాకావ్యం. వీరి సోదరప్రేమ జానపద గేయం.

తంగిరాలవారు దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారికి ఆప్తులు. ఆ మహాకవి "తపాలా బంట్రోతు" కవితకు వీరు దోహదమయ్యారు. పఠాభిగారి ఆధునికతను, ఉద్యమశీలత్వాన్ని అభిమానించారు. మహాకవి శేషేంద్రగారికి ఆత్మీయులయ్యారు. వారు బెంగళూరు మీదుగా ఊటీకి వేసవి విశ్రాంతికి వారి సతీమణితో వెళ్ళేటప్పుడు, వారితో సందర్శనానికి తదితరులు అనేకులకు అవకాశం కలిగించారు.

శ్రీ తంగిరాలవారికి సోదర సమానులయిన బేతవోలు రామబ్రహ్మంగారి వంటి కవిమిత్రులున్నారు. అసంఖ్యాకమైన వారి కవిమిత్రకోటి పరిచయాలకు వారిలోని నిత్యజాగృత కావ్యసంపాదనాప్రీతి, మైత్రీస్వభావములే కారణం.

బెంగళూరులో స్థానిక తెలుగు సాంస్కృతిక సంఘసంస్థలు ఘనమైనవి ఉన్నాయి. వాటన్నింటిలో 'శ్రీరస' సమాఖ్య ప్రత్యేకమైనది. శ్రీరస సాహిత్యవిశేష సమాఖ్య, 1994 భావనామ సంవత్సర ఉగాదినాడు ఆరంభమయింది. ఈ సమాఖ్య శ్రీ తంగిరాలవారి వ్యవస్థాపక ఆధ్వర్యాన నెలకొని ఈ నాటికీ నిర్విరామంగా కొనసాగడం సాహిత్యపరమైన సమాఖ్యలలో రజతోత్సవాలను దాటి స్వర్ణోత్సవాలకు దరిచేరడం, చరిత్రపుటలలో పేర్కొనదగిన అంశం.

కవిత్వమంటే గల మిక్కుటమైన ఆసక్తితో "చైతన్యకవిత" ను వెలువరించారు. చైతన్యకవిత షాణ్మాసిక కవిత్వపత్రిక. కవిత్వానికి అంకితమైన ఆ పత్రిక ఆయా కవుల ముఖచిత్రాలతో 48 సంచికలు వెలువడింది. కవిత్వాన్ని గూర్చిన సమ్యక్ స్వరూప విశ్లేషణలు, కావ్యపరిచయాలు గీటురాళ్ళు. వివిధకవుల కవితలు–వీటితో ఆ సంచికలు భద్రపరచుకొనుటకు తగినవయ్యాయి.

ఒక జాతి సంస్కృతిలో జానపదసంస్కృతి ప్రధానమైన భాగం. దానిని అధ్యయనం చేయకుండా ఆ జాతి సంస్కృతిని పూర్తిగా అర్థంచేసుకోవడం కష్టం.

విభిన్న దేశాలు వివిధ ఉద్దేశాలు ఉన్నంతకాలం యుద్ధాలు వస్తాయి. యుద్ధ సమయంలో యువకులు ఉత్సాహంగా సైన్యంలో చేరి దేశాన్ని రక్షించుకోవాలి. వీరగాథాగానం యువకులలో యుద్ధోత్సాహాన్ని నింపుతుంది. అందువల్ల వీరగాథలనుగురించి తెలుసుకోవాలి. పలనాటి వీరకథలను, కాటమరాజుకథలను, ఇతర వీరగాథలను సేకరించ బూనుకోవడమనే గొప్ప శ్రమను కష్టసహిష్ణుతను కార్యదీక్షతో ధరించారు. ఎకడమిక్‌స్థాయి పరిశోధనకు కఠినపరిశ్రమల గౌరవాన్ని కలిగించారు. తంగిరాలవారు "తెలుగు వీరగాథా కవిత్వము" అన్న అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ సంపాదించారు.

అనేక సృజనాత్మక రచనలు కావించారు. వివిధ పురస్కారాలను పొందారు.

తంగిరాలవారు సాహిత్య సర్వస్వానికి వ్యక్తిగతంగా మమేకమౌతుంటారు. శ్రీరస సమాఖ్య పరంగా ప్రతినిధిత్వం వహిస్తారు. కుర్తాళం పీఠాధిపతిగారి కోరికనమసరించి స్థానికకవుల కవిత్వపఠన సమావేశాన్ని నిర్వహించారు. శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారి ఆశయానికి అనుగుణంగా శ్రీ బుచ్చిబాబుగారి స్మారక ఉపన్యాసాలను ఏర్పాటు చేశారు. స్థానిక కవయిత్రులను ప్రోత్సహించి, వారి కవిత్వ సంపుటాలని, కథానికా సంపుటాలను శ్రీరస సమాఖ్య తరఫున ప్రకటించారు. మిత్రులు మల్లెల గురవయ్యగారి "శ్రీసీతారామరాజీయము" కావ్యప్రచురణను కావించారు. శివకవి శివనగౌడుగారి "శ్రీకృష్ణ కర్ణామృతము" పద్యానువాద గ్రంథానికి సంప్రీతితో సంపాదకత్వం వహించారు. శ్రీ హిమవద్గోపాలస్వామి చరిత్రను ఆవిష్కరించారు.

శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారి జన్మదినం ఈ రోజు. వారు 87 మెట్లెక్కారు. శ్రీ తంగిరాలవారు బెంగళూరు విశ్వవిద్యాలయంలో తెలుగువిభాగం

స్థాపనకు ముఖ్య కారకులు. వారు బెంగళూరుకు 1969 డిసెంబర్ 27 వ తారీఖు విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా ప్రారభించి, అక్కడే రీడర్‌గా తెలుగు శాఖాధిపతిగా కొనసాగారు. నడుమ గుల్బర్గా విశ్వవిద్యాలయం కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్‌గా పనిచేసారు. ప్రత్యక్ష గురువులు, ఆత్మీయులు శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారికి జన్మదిన శుభాకాంక్షలు-రాజేశ్వరి దివాకర్ల.

(30-03-2022, బుధవారంనాడు నా 87వ జన్మదిన సందర్భంగా
తెలిపిన శుభాకాంక్షలు - తంగిరాల)



## అయ్యబాబు! అయ్యబాబు! ఆరుద్రగారంటే మీరేనా?

ఒకసారి ఆరుద్రగారు ఒక సభలో ప్రసంగించటానికి రాజమండ్రి వచ్చారు. వారికి గవర్నమెంటు గెస్ట్‌హౌస్‌లో బస ఏర్పాటుచేశారు సభానిర్వాహకులు. సాహిత్య ప్రియుడు ఉత్సాహవంతుడు అయిన ఒక యువకుడు ఆరుద్రగారిని చూడటానికి గెస్ట్‌హౌస్‌కి వడివడిగా వచ్చాడు. అతడు అంతకుపూర్వం ఆరుద్రగారిని ఎప్పుడూ చూడలేదు. ఇదే మొదటిసారి. మాసిపోయిన గడ్డం, కాషాయిరంగు పైజమా, అదేరంగు లాల్చీ తొడుక్కుని, మిక్కిలి నిరాడంబరంగా ఉన్న ఒకవ్యక్తి, గెస్ట్ హౌస్ ముందు పచార్లు చేస్తున్నాడు. అతన్ని చూసి ఆ యువకుడు "ఏయ్! ఆరుద్రగారు ఉన్నారా?" అని అధికారదర్పంతో అడిగాడు. ఆ వ్యక్తి మెల్లగా "నేనే ఆరుద్రను నాయనా!" అన్నాడు. మిక్కిలిగా ఆశ్చర్యపోయిన ఆ యువకుడు గోదావరి మాండలికంలో "అయ్యబాబు! అయ్యబాబు! ఆరుద్రగారంటే మీరేనా? ఇంకా నయం! నేనెవడో ఇక్కడి వాచ్‌మన్ అనుకున్నానండి బాబూ!" అన్నాడు గట్టిగా. "అనుకుంటే అనుకున్నావు నాయనా! నాతో చెప్పడం ఎందుకు?"అన్నారు ఆరుద్ర వేదాంతిలా ముఖంపెట్టి.

**(-తంగిరాల)**

# 2.10 ఇతరములు

## 2.10.1 ఆచార్య తంగిరాలవారి జీవనరేఖలు

**1. పూర్తిపేరు** : తంగిరాల వెంకట సుబ్బారావు

**2. జననం** : పశ్చిమ గోదావరిజిల్లా, కొవ్వూరు తాలుకా, 'పెదవాడపల్లి' గ్రామం (మాతామహుల గృహం), 30-03-1935, భావనామ సంవత్సరం, ఫాల్గున బహుళ ఏకాదశి, శనివారం, రాత్రి 7.43 గంటలకు

**3.తల్లిదండ్రులు** : కీ.శే. సీతామహాలక్ష్మి, కీ.శే. వేంకట సుబ్బావధానులు.

**4. స్వగ్రామం** : పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, 'కాకుల ఇల్లిందలపఱ్ఱు'

**5. విద్యాభ్యాసం** :

* **ప్రాథమిక విద్య** : స్వగ్రామం (1940-1944 మరియు 1945-46)
* **వేదాధ్యయనం** : తాతగారు (పితామహులు) జగన్నశాస్త్రిగారి దగ్గర (1944-45)
* **ఉన్నత పాఠశాలవిద్య:** రాజమండ్రి: (1946-1948), తణుకు: (1948-1952), SSLC (High School First)
* **కళాశాల విద్య** : భీమవరం, W.G..B.కళాశాల, ఇంటర్మీడియేట్ (1952-54), బి.ఎ. (తెలుగు) (1955-57)
* **విశ్వవిద్యాలయ విద్య** : శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, ఎం.ఏ. తెలుగు (1961-63), ప్రథమశ్రేణి; పిహెచ్.డి. (1963-68) "తెలుగు వీరగాథా కవిత్వము" (ఆచార్య పింగళి లక్ష్మీకాంతం, ఆచార్య జి.యన్. రెడ్డిగారల పర్యవేక్షణలో); పోస్ట్-డాక్టరల్ రిసెర్చ్ (1968-69) "కాటమరాజు కథాచక్రము"

**6. గురువులు:**

శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు (అన్నగారు); కీ.శే. దిగుమర్తి సీతారామస్వామిగారు; ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు; ఆచార్య జి.యన్.రెడ్డిగారు; ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు.

**7. ఉద్యోగాలు :**

* 1969-1978: ఆంధ్రోపన్యాసకుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.
* 1978-1980: రీడరు మరియు తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.
* 1980-1983: మొట్టమొదటి పరీక్షానియంత్రణాధికారి (First Controller of Examinations), గుల్బర్గా విశ్వవిద్యాలయం, గుల్బర్గా-585 106.
* 1983-1987: రీడరు, తెలుగు అధ్యయనశాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు-560 056.
* 1987-1994: ప్రొఫెసరు మరియు తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు-560 056.
* 1994-1996 : ప్రొఫెసరు, తెలుగు అధ్యయనశాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.
* 1998-2000 : ప్రొఫెసరు, ఎమెరిటస్ (యు.జి.సి.), తెలుగు అధ్యయనశాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు-560 056.

**8. ముఖ్య విషయం:**

1971లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారికి లేఖ వ్రాసి, మూడు లక్షల రూపాయల గ్రాంటు సంపాదించి, 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు స్నాతకోత్తర శాఖ (Post-Graduate Department) ను స్థాపించడం.

**9.సంసారం:**

వివాహం (మేనరికం): 1954. భార్య: 'భళ్ళమూడివారి చిట్టి' (శ్రీమతి తంగిరాల శకుంతలాదేవి). సంతానం: 'కాళిదాసు' (వెంకట సుబ్బావధానులు),

'రామయ్య' (సీతారామరాజు); 'సీత' (సీతామహాలక్ష్మి); 'శీను' (శ్రీనాథ కవిసార్వభౌమ); 'శశి' (రేవతీ శశిప్రియ). భార్యావియోగం: 31–08–2006; సీతారామరాజు మరణం: 19–08–2018.

**10. ముద్రిత గ్రంథాలు:**

**10.1 సృజనాత్మకాలు:**

1. 'హంస పదిక'(ప్రణయ కావ్యం), 1967.
2. 'వనదేవత' (బుఱ్ఱకథ), 1968.
3. 'గుండెపూచిన గులాబి' (వచన కవితలు), 1987.
4. 'నా ముద్దబంతి పువ్వు' (వచన కవితలు), (త్వరలో)

**10.2. పరిశోధనాత్మకాలు:**

1. జానపద సాహిత్యము – వీరగాథలు, 1975, ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాదు–4
2. కాటమరాజుకథలు (మొదటి సంపుటము) 1976, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు – 500 004.
3. కాటమరాజుకథలు (రెండవ సంపుటము) 1978, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు – 500 004.
4. తెలుగు వీరగాథాకవిత్వము (రెండవ సంపుటము), 1983, తంగిరాల ప్రచురణలు.
5. 'అంకమ్మ కథలు', 1993, తంగిరాల ప్రచురణలు.
6. శ్రీకృష్ణకర్ణామృతము (సం.), 1998, శ్రీరస ప్రచురణలు.
7. రేనాటి సూర్యచంద్రులు (మొదటి సంపుటము), 1999, శ్రీరస ప్రచురణలు.
8. రేనాటి సూర్యచంద్రులు (రెండవ సంపుటము), 2000, శ్రీరస ప్రచురణలు.
9. తెలుగు వీరగాథాకవిత్వము (మొదటి సంపుటము), 2000, శ్రీరస ప్రచురణలు.
10. ఏఱిన ముత్యాలు (సం.) 2006, శ్రీరస ప్రచురణలు.
11. జ్ఞానరత్నాలు (సం.) 2009, శ్రీరస ప్రచురణలు.
12. రేనాటి సూర్యచంద్రులు (మూడవ సంపుటము), 2011, శ్రీరస ప్రచురణలు.

13. తెలుగు వీరగాథాకవిత్వము (సమగ్రసంపుటము), 2013, శ్రీరస ప్రచురణలు.
14. దేవరకొండ బాలగంగాధరతిలక్ - లభ్యరచనల సంకలనం, (సేకరణ, సంపాదకత్వం), 2013, ఎమెస్కో ప్రచురణలు, హైదరాబాద్. (మనసు ఫౌండేషన్ సహకారంతో)
15. జ్ఞానతరంగాలు (సం.), 2017, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
16. వీరగల్లు - మొదటి సంపుటము (సం.), 2017, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
17. భగవద్గీతాప్రబోధము (సం.), 2018, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
18. శ్రీ సింహాద్రి నారసింహ శతకము (సం.) 2019, శ్రీరస ప్రచురణలు.
19. వేణుగోపాల శతకం (సం.) 2020, 'శ్రీరస' ప్రచురణలు.
20. కాటమరాజుకథలు-మూడవవ సంపుటం (సం.) 2021, 'శ్రీరస' ప్రచురణలు.
21. "రసగంగాధర తిలకం" (దేవరకొండ బాలగంగాధర తిలక్, అభిరుచులు-అలవాట్లు, ఇతర వ్యాసాలు), శతజయంతి నివాళి, 2021, 'శ్రీరస' ప్రచురణలు.
22. "రక్తతిలకం" (ముఖ్యమైన మూడు బుఱ్ఱకథలు) (సం.) 2021, 'శ్రీరస' ప్రచురణలు.
23. "అశ్రుతర్పణం" (కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారి జీవితం-సాహిత్యం), 2021, 'శ్రీరస' ప్రచురణలు.
24. పలనాటి వీరచరిత్ర - అలరాజు రాయబారం - (తెలుగు వీరగాథలు - మొదటిసంపుటం) - 2022, ప్రాచీన తెలుగు విశిష్ట అధ్యయన కేంద్రం, నెల్లూరు-మైసూరు (2,3,4 సంపుటాలకు కూడా వీరే ప్రకాశకులు)
25. తెలుగు వీరగాథలు (రెండు, మూడు, నాలుగు సంపుటాలు) - 2022
26. గురువందనం-2022 (తంగిరాల వ్యాసమాల-మొదటిసంపుటం), 2023, 'శ్రీరస' ప్రచురణలు, బెంగుళూరు.
27. వీరభాగవతము - ముదిగొండ వీరభద్రకవి - 2023, అజో-విభొ-కందాళం ఫౌండేషన్, హైదరాబాద్.
28. సాహిత్యసాగరంలో ఏటినముత్యాలు - టి.వి.కె. సోమయాజులు - 2023, అజో-విభొ-కందాళం ఫౌండేషన్, హైదరాబాద్.

29. స్త్రీలపాటలు (ఒకటి, రెండు, మూడు సంపుటాలు)–నందిరాజు చలపతిరావుగారు – (త్వరలో)
30. సువర్ణచషకం (తంగిరాల వ్యాసమాల–రెండవ సంపుటం) – (త్వరలో)

### 10.3 English:

1. Ranganatha Ramayanam, 'Nikumbhila Yagam, (along with others)
2. 'Sumathi Satakam' (Poetry), (along with others)
3. "VIJAYA LIPI" (Kannada-Telugu Common Script) (along with others), 1989.

### 10.4 కన్నడం:

1. వేమన–ఎరడు అధ్యయనగళు, 1993, కర్ణాటక రెడ్డిజనసంఘ ప్రచురణ, బెంగుళూరు.
2. విశ్వనాథ సత్యనారాయణ, 1995, కర్ణాటక సాహిత్య–అకాడమీ ప్రచురణ, బెంగుళూరు.
3. హిమవద్ గోపాలస్వామి (సం.), 1997, హిమవద్ గోపాలస్వామి టెంపుల్ ట్రస్ట్ ప్రచురణ, గుండ్లుపేట, మైసూరు జిల్లా.

### 10.5 అంకితం పొందిన గ్రంథాలు:

1. వేయిపడగలు – నవలాశిల్పం (విమర్శ) – డా॥ ముదిగొండ వీరభద్రయ్య, 1996.
2. శ్రీ సీతారామరాజీయము (వీరమహాకావ్యము) – డా॥ మల్లేల గురవయ్య, 1997.
3. నా గోదావరి (వచన కవితా సంపుటి) – డా॥ కావూరి పాపయ్యశాస్త్రి, 1999.
4. Folk Arts of Andhra Pradesh and Karnataka - Prof. G.S. Mohan, 2002.
5. మంచుముత్యాలు (కథల సంపుటి) – శ్రీమతి అంబికా అనంత్, 2005.
6. పురుషోత్తముడు (వీరమహాకావ్యము) – శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి, 2006.

7. శ్రీ బుడ్డా వేంగళరెడ్డీయము (పద్యకావ్యము) – శ్రీ గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రి, 2013.
8. మన్యభారతం–చెర్లకోట చరిత్ర (సహస్రాధిక పద్యకావ్యం) – మాల్యశ్రీ, 2016.
9. తంగిరాలవారు ఎన్నో గ్రంథాలకు పీఠికలు వ్రాశారు.

**11.పరిశోధన:**

1. తెలుగు, ఇంగ్లీషు, కన్నడ భాషలలో సుమారు 100 పరిశోధన పత్రాల రచన, సమర్పణ. ఒక్క 'భారతి'లోనే 40 వ్యాసాలవరకూ ప్రచురించబడ్డాయి.
2. ఈయన పర్యవేక్షణలో 15 మందికి పిహెచ్.డి. డిగ్రీలు, 25 మందికి ఎం.ఫిల్. డిగ్రీలు వచ్చాయి.
3. 1997–1998: 'పల్నాటి వీరకథాచక్రం – సామాజిక సాంస్కృతిక అధ్యయనం' అనే అంశాన్ని గూర్చి U.G.C. Major Research Project చేశారు.
4. 1998–2000 'కాటమరాజు కథాచక్రం – సామాజిక సాంస్కృతి అధ్యయనం' అనే అంశాన్ని గురించి U.G.C. Emeritus Professor గా పరిశోధన చేశారు.
5. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో అనేక ప్రాంతాలలో పర్యటించి, సాహిత్యోపన్యాసాలు చేశారు.

**12. కవిత్వపత్రిక:**

'చైతన్య కవిత' – కేవలం కవిత్వానికే అంకితమైన పత్రికకు 24 సంవత్సరాలు (1986–2009) సంపాదకత్వం వహించారు. ఇది ప్రముఖకవుల ముఖచిత్రాలతో ఆరు మాసాలకొకసారి అందంగా వెలువడుతూ వచ్చింది: వసంతం (ఏప్రిల్) – శరత్తు (అక్టోబరు). ఈ కవిత్వపత్రిక 1986లో మైసూరులో 'ధ్వన్యాలోకం'లో ప్రొ॥ సి.డి. నరసింహయ్య, ప్రొ॥ యస్వీ. జోగారావుగార్లచేత ప్రారంభించబడింది. ఇది 2009 వరకు నడిచింది. అప్పటివరకు 48 సంచికలు వెలువడ్డాయి. ఈ పత్రికకు "దానచింతామణి" కీ.శే. డి.కె. ఆదికేశవులుగారు ధనసహాయం చేసేవారు.

**13. సాహిత్య సంస్థలు:**

**13.1 "భువన విజయం":–** 1974 నుండి 1994 వరకు 20 సంవత్సరాల పాటు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో "భువన విజయం" అనే సాహిత్య సంస్థను తెలుగు అధ్యయనశాఖకు అనుబంధంగా నిర్వహించారు. ఈ సంస్థ అనేక సాహిత్య కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. ముఖ్యంగా 1977నుండి 2000 వరకు ప్రతి సంవత్సరం సెప్టెంబరు 10వ తేదీనాడు "విశ్వనాథ జయంతి"ని జరుపుతూ వచ్చింది. దీనికి "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు ధనసహాయం చేసేవారు.

**13.2 "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస"):–** భావనామ సంవత్సర ఉగాదినాడు – అంటే 11-4-1994 నాడు "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") అనే సాహిత్యసంస్థను స్థాపించి, ప్రతినెలా ఒక సాహిత్య సభను నిర్వహిస్తూ వస్తున్నారు. తెలుగు ప్రాచీనసాహిత్యంగురించి, ఆధునికసాహిత్యంగురించి, జానపద సాహిత్యంగురించి ఎందరో కవులు, పండితులు ప్రసంగాలు చేశారు. 1994-2020 మధ్య "శ్రీరస"లో సుమారు 600 ప్రసంగాలు, 60 గోష్ఠులు జరిగాయి. శేషేంద్ర, ఆవంత్స సోమసుందర్, ఇస్మాయిల్, శలాక రఘునాథశర్మ, బేతవోలు రామబ్రహ్మం, మైలవరపు శ్రీనివాసరావు, మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, వద్దిపర్తి పద్మాకర్, గరికిపాటి నరసింహారావు, ప్రసాదరాయ కులపతి, అమళ్ళదిన్నె గోపీనాథ్, ఆర్వీయస్. సుందరం, అద్దేపల్లి రామమోహనరావు, అక్కిరాజు సుందరరామకృష్ణ, ముదిగొండ వీరభద్రయ్య, నాగళ్ల గురుప్రసాదరావు, కె. మలయవాసిని, బొడ్డుపల్లి గిరిజాలక్ష్మి, మృణాళిని, కాత్యాయనీ విద్మహే, నగ్నముని, ఎండ్లూరి సుధాకర్, శిఖామణి, రెంటాల శ్రీవెంకటేశ్వరరావు, మీగడ రామలింగస్వామి మొదలైన ప్రముఖులు "శ్రీరస"లో ఉపన్యసించి బెంగుళూరు తెలుగువారిని ఆనందపరవశు ల్ని చేశారు. రామాయణ సప్తాహం, మహాభారత సప్తాహం, భాగవత సప్తాహం, భువన విజయసభ, ఇంద్రసభ, మహాభారతంపై తీర్పు – ఇత్యాదులు "శ్రీరస" నిర్వహించింది. శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు 2001 నుండి ఈనాటి వరకు (2020 వరకు) "శ్రీరస"లో ఇంచుమించు ప్రతినెలా మూడేసి ఉపన్యాసాలు చేస్తున్నారు. వీరు మహాభారతాన్ని గురించి 36 ఉపన్యాసాలు, రామాయణంగురించి 27 ఉపన్యాసాలు, "సౌందర్యలహరి"నిగురించి 15 ఉపన్యాసాలు, "భగవద్గీత"ను

గురించి 9 ఉపన్యాసాలు, "ప్రబంధ సుగంధం" అనే పేరుతో 20 ఉపన్యాసాలు చేశారు. 2019లో "రజతోత్సవం" (1994-2019) జరుపుకున్న "శ్రీరస" - ఇప్పటికీ తెలుగు సాహిత్యసేవ చేస్తూనే ఉన్నది.

**14. పురస్కారాలు : ముఖ్యమైనవి కొన్ని -**

1. శ్రీ ఎన్.టి. రామారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండగా "ఉగాది పురస్కారం", హైదరాబాదు, 1987.
2. శ్రీ బెడవాడ గోపాలరెడ్డిగారిచే "కవిత్రయ పురస్కారం" నెల్లూరు, 1998.
3. విజయవాడ సిద్ధార్థ కళాపీఠంవారిచే "సాహిత్య పురస్కారం", 23.9.2000.
4. డా. ఆవంత్స సోమసుందర్ సాహిత్య పురస్కారం, పిఠాపురం, 18.11.2001.
5. ద్రావిడ విశ్వవిద్యాలయంవారిచే సాహిత్య పురస్కారం, కుప్పం, మార్చి 2006.
6. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, డా॥ వై.యస్.రాజశేఖరరెడ్డిగారిచే "ఉగాది పురస్కారం", బెంగుళూరు, 3.4.2006.
7. ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘంవారిచే "తెలుగుభాషాపురస్కారం", బెంగుళూరు, 4.11.2007.
8. యోగివేమన విశ్వవిద్యాలయంవారిచే "సి.పి.బ్రౌన్‌పురస్కారం", కడప, 10.11.2007.
9. కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ స్మారక సాహిత్యపురస్కారం, హైదరాబాద్, 27.1.2008.
10. కీ.శే. పెద్దిబొట్ల బ్రహ్మయ్య స్మారక రసధుని సాహితీ పురస్కారం, పాలకొల్లు 29.2.2008.
11. తెలుగు విజ్ఞానసమితివారిచే శ్రీకృష్ణదేవరాయ కళాపురస్కారం (ఉగాది పురస్కారం), 25.4.2008.
12. గురువందనం-1, పూర్వ విద్యార్థుల సత్కారం, బెంగుళూరు. 29.08.2010

13. డా॥ జియస్వీ ప్రసాద్‌గారి ఉగాది పురస్కారం, శ్రీనన్నయభట్టారక పీఠము, తణుకు, 6.4.2011.

14. ఆచార్య ఆర్వీయస్. సుందరంగారి "సౌశీల్య పురస్కారం, మద్రాసు విశ్వవిద్యాలయం, చెన్నై, 24.5.2012. (రూ. 10,000/–)

15. పాల్కురికి సోమనాథ సాహిత్య పురస్కారం, పాలకుర్తి, వరంగల్ జిల్లా, 24.6.2012.

16. ఆచార్య జి.యస్. మోహన్‌గారిచే "డా॥ చిలుకూరి నారాయణరావు సాహిత్యపురస్కారం", మద్రాసు విశ్వవిద్యాలయం, చెన్నై, 14.9.2014. (రూ. 10,000/–)

17. "శ్రీ నీలంరాజు నరసింహారావు – శ్రీమతి శకుంతలమ్మ సాహిత్య పురస్కారం" (2014వ సంవత్సరానికి), అద్దంకి సృజన సాహిత్య సంస్థ వారిచే, బెంగుళూరు, 11.9.2016.

18. "ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డిగారి 171వ వర్ధంతి పురస్కారం" – 'రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి' అధ్యక్షులు శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారిచే ఘనసన్మానం (రూ. 50,000/–), నంద్యాల, 22.2.2018.

19. "జీవిత సాఫల్య పురస్కారం" – సి.పి.బ్రౌన్ సేవాసమితి వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డిగారిచే – తెలుగు విజ్ఞానసమితి ప్రాంగణంలో – బెంగుళూరు, 07.03.2020.

20. గురువందనం–2, పూర్వవిద్యార్థుల సత్కారం, బెంగుళూరు విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయనశాఖ, జ్ఞానభారతి, బెంగుళూరు, 10.06.2022.

**15. బిరుదులు:**

**1.** "వీరగాథల సవరాల జిమ్మడు". (పల్నాటి యుద్ధంలో అలరాజు అధిరోహించే గుఱ్ఱంపేరు "సవరాల జిమ్మడు". పెద్దన్న బాదరాజు గుఱ్ఱంపేరు "కారుబొల్లడు". అలరాజుకు – పెద్దన్నకు చంద్రవంక నది ఒడ్డున ద్వంద్వయుద్ధం జరుగుతుంది.

బ్రహ్మానాయుడు దానిని నివారిస్తాడు) - జానపద సాహిత్యవేత్తలైన మిత్రులు ఇచ్చినది.

2. "రసజ్ఞ రాజశేఖరుడు" - ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారు ఇచ్చినది.

**16. అభిరుచులు:**

ఆధునిక కవిత్వం, జానపద కవిత్వం, తులనాత్మక సాహిత్యం, ప్రాచీన సాహిత్యం, కవి పండిత గోష్ఠి, సాహిత్యసభల నిర్వహణ, గ్రంథ ప్రచురణ.

**17. Address :**

Prof. T.V. Subba Rao, 1708 "Sitavadhanam", 11th Cross, 1st 'G' Main, Kengeri Satellite Town, BENGALURU - 560 060, Cell: 99454 22742

**18. ఇ-మెయిల్:** tangiralasubbarao@gmail.com

---

**అనుబంధం-1:**

*(About his Ph.D. Thesis running into 1450 pages in Three Volumes -unpublished, 1968) (Published, 2013)*

**BALLAD POETRY IN TELUGU**
**by Prof. T.V. Subba Rao**

This is not 'Research'!
This is not 'Search' even!
This is an 'Adventure'!
Hats off to you!
I want to see you!!

**- Prof. K.V. Ramana Reddy**

He has collected many Telugu ballads which are not known to the educated public and when he publishes them, I am sure, he will put the Telugu public indebted to him for his work.

**- Prof. G.N.Reddy**

His laborious collection of a good number of new ballads from different parts of Andhra Pradesh won admiration of the Telugu scholars and he threw new light on the subject.

**- Prof. T. Kodandaramaiah.**

అనుబంధం - 2: **విద్వత్కవి - తంగిరాల**

**ఉ॥ క్రోధములేని సాధువు, అకుంఠిత నైతికశీలశాలియున్**
**ఆధునికాంధ్రవాఙ్మయ మహార్ణవనౌక, కవిత్వమాధురీ**
**శీధుపిపాసి, మిత్రజనసింధు శరద్వర పౌర్ణమాసియున్,**
**సౌధములేని రాజునకు సాంద్రసమస్సులు తంగిరాలకున్.**

**శా॥ సాయంకాల శశాంకరేఖ, మధుమాసాయాత చూతాంకుర**
**చ్ఛాయాపాయి కిశోర కోకిలము, విశ్వాకాశ కోశాంతర**
**ప్రేయోవాయు సుపర్ణ బిందువు, వచః పీయూష యోషిత్ కృపా**
**శ్రేయోజన్ముని, 'తంగిరాల' సుఖునిం బ్రేమింతు, శేషేంద్రుడన్!**

**"యుగకవి" డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారు**

---

అనుబంధం-3: **జానపదము - జ్ఞానపథము**

**సప్తపది: తే.గీ. దాని వాక్కుచేఁ దెల్పెడి తత్త్వమెదియొ**
**అనుభవమునకుఁ దుదిహద్దటంద్రు బుధులు**
**'తంగిరాల' సతీర్థ్యుఁ దుద్దామయశుఁడు**
**జానపదవాఙ్మయాంబోధి సలిల (సార)మెల్ల**
**పుడిసిలించు నగస్త్యుఁ దద్భుత వచస్వి**
**'జ్ఞానభారతి'కిన్ జతురాననుండు**
**కన్నడము - తెల్గు సంధానకారకుండు!**

**-డా॥ మల్లేల గురవయ్య**

---

"వీరగాథలను గుఱించి ఈ ఆంధ్రదేశములో నీవొక్కనివే ప్రసంగింపగలవు!"

**- గురుదేవులు శ్రీదిగుమర్తి సీతారామస్వామిగారు**

---

"తంగిరాల వెంకట సుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయసేకరణ చేశారు. కాలికి బలపం కట్టుకొని దేశమంతా తిరిగారు. చేతి వ్రేళ్ళు అరిగేదాకా కలానికి పనిపెట్టారు... ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యులయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోనూ సాఫల్యం పొందారు."

**- ప్రొ॥ కె.వి. రమణారెడ్డిగారు (భారతి, జూన్ 1988)**

**అనుబంధం-4: మా సుబ్బన్నబావ**

"మధురకవి" - "సరసకవి" - "సారకవితాభిరామ" - "కవిసుధాకర" - శ్రీదుగ్గిరాల రామారావుగారు తంగిరాలవారినిగురించి "మా సుబ్బన్నబావ" అనే పేరుతో 51 పద్యాలు వ్రాశారు. ఇవి "చైతన్యకవిత"లో మొదట ప్రచురితమయ్యాయి. తరువాత దుగ్గిరాలవారు ప్రకటించిన "సుమనోభిరామము" (2005) అనే పుస్తకంలో వచ్చాయి. వాటిలో నుండి మూడు పద్యాలు:-

**చ.** **పలుకులదేవి సేవలను పండిన శీర్షము, దబ్బపండుతోఁ**
**గలఁబడుమేను, కాశసువికాసము వాసము మీసకట్టు, మ**
**ల్లెలు విరఁబూయు లేనగవు రేకలు, "సుబ్బనబావ' పండు వె**
**న్నెల దిగజారు మేరుధరణీధరశృంగముభంగిఁ గన్పడున్.** 1

**సీ.** **'చైతన్యకవిత'కు సంపాదకుండు, స**
**ద్గ్రంథ సంతతికి ముద్రాపకుండు;**
**అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు,**
**ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుండు;**
**వలచి చేకొను 'శకుంతల'కు దుష్యంతుండు,**
**పరిణతిఁగన్నట్టి పండితుండు;**
**'సోమయాజులు' కుఁ గూర్చు సహోదరుఁడు, తంగి**
**రాలాబ్ధి తరుణ సారంగధరుఁడు;**
**తే.** **భావబంధుర మధుర సంభాషణుండు,**
**ముచ్చటం గొల్పు వినయ విభూషణుండు,**
**జానపద సాహితీ విశేషముల తావు,**
**సుగుణముల ప్రోవు, వేంకటసుబ్బరావు!** 2

**సీ.** **అభ్యుదయ కవులం దధికుండు 'బాలగం**
**గాధర తిలకు' సంగాతకాఁడు,**
**అభినవ పెద్దన్న యనఁదగు 'గుంటూరు**
**శేషేంద్రశర్మ' మెచ్చిన బుధుండు,**

'బుల్లో'కులాబ్ధి జాబిల్లి 'సుబ్బారావు'
ప్రాణమ్ము ప్రాణమైనట్టి సఖుఁడు,
'దళవాయి' పారిజాతమ్ము 'కృష్ణస్వామి
ఆదికేశవుల' వీరాభిమాని,
తే. దొరకవివరుఁడు 'మల్లెల గురవయ' కవి
విమల కృతికన్యఁ జేకొన్న పెండ్లికొడుకు,
ధన్యజీవి, మా 'ఆచార్య తంగిరాల'
వర్ధిలునుగాత నూఱు సంవత్సరాలు! 3

– దుగ్గిరాల రామారావుగారు

## మా తంగిరాలవారు

– శ్రీమతి అంబికా అనంత్

కళ్ళనిండా చైతన్య (కవితా) రాగాలు
నవ్వులో చల్లని వెన్నెల కిరణాలు
వాక్కులో వాగ్దేవీ నాట్యాలు
హృదయంలో రససంపన్న తరంగాలు
వెరసి, మా తంగిరాలవారు!
ప్రాచీనమూ, ఆధునికమూ
రెంటికీ వారధి వారి సమన్వయభావం
కవితల మాలల్ని చేస్తారు చైతన్యద్వారతోరణాలు
'నెలనెలా వెన్నెల'లో వినిపిస్తారు నవ్యనాదస్వరాలు
అచేతన, అలుపు, అహంకారమనే మా మెదడు చీకట్లలో
వెలుతురుఉలితో కాంతికవితారూపాలు చెక్కుతారు
మమ్మల్ని ప్రాథమికదశనుండి ప్రజ్ఞాపాటవాలకు చేరుస్తారు
మా 'వ్యావహారికానికి' మెరుగులు దిద్ది కాంచనవాక్యాలు చేస్తారు
ఆయనలో అంతర్వాహినిగా సాగేసాహిత్యం
నింపుతుంది మాలో కవితామహత్వం
మాకు అందే అభినందనల అపూర్వ ఆనందం
మాలో ఆయన నింపిన ఉద్దీపనశక్తికి నిదర్శనం
మా శ్రీరసాధ్యక్షులు తంగిరాలవారికి వేల వేల వెన్నెలకోళ్ళు....!!

## బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు-560 056

## తెలుగు అధ్యయనశాఖ (స్థాపన 1974)

## 2.10.2 కొందరు పూర్వవిద్యార్థుల పట్టిక

| క్ర.సం. | విద్యార్థి పేరు | చదివిన సంవత్సరం | సెల్ నెంబరు |
|---|---|---|---|
| 1. | డా॥ ఇ. నాగరాజు | 1986-88 | 94408 44235 |
| 2. | ఎ. గురుమూర్తి | 1986-88 | 94486 07817 |
| 3. | శ్రీమతి ఉష | 1986-88 | 99026 97500 |
| 4. | శ్రీమతి నాగమణి | 1986-88 | - |
| 5. | శ్రీ వై. రామాంజనేయులు | 1986-88 | 97571 77517 |
| 6. | డా॥ తోట వెంకటస్వామి | 1987-89 | 94926 31323 |
| 7. | శ్రీ వి.మాధరెడ్డి | 1987-89 | 94485 93990 |
| 8. | ప్రొ॥ ఎం.రామనాథంనాయుడు | 1988-90 | 86623 57990 |
| 9. | శ్రీ సూర్యప్రకాష్ | 1988-90 | - |
| 10. | శ్రీ పి. లక్ష్మీనారాయణ | 1989-91 | 99660 88257 |
| 11. | శ్రీమతి నిర్మల(విజయలక్ష్మి) | 1989-91 | 80504 10763 |
| 12. | శ్రీమతి మారుతి శ్రీలత | 1989-91 | 77807 98494 |
| 13. | శ్రీమతి పి. మాధవి | 1990-92 | 75697 71854 |
| 14. | శ్రీ హెచ్.కృష్ణమూర్తి | 1990-92 | 63617 34205 |
| 15. | డా॥ వి. నారాయణప్ప | 1990-92 | 99586 07783 |
| 16. | శ్రీ వై. రామమోహన్ | 1990-92 | 99017 59190 |
| 17. | శ్రీ సగ్రాజు మురళీకృష్ణ | 1990-92 | 76619 67160 |
| 18. | డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి | 1991-93 | 94934 23695 |
| 19. | శ్రీమతి నూకవరపు రాజేస్వరి | 1991-93 | 83094 48158 |
| 20. | శ్రీమతి పి. జ్యోత్స్నారాణి | 1991-93 | 94929 20948 |
| 21. | శ్రీమతి కె. మంజులమ్మ | 1991-93 | 94410 75140 |
| 22. | శ్రీ జి. చిత్తనగిరి | 1991-93 | 94935 61358 |
| 23. | శ్రీ గొల్ల కృష్ణప్ప | 1991-93 | 91828 36318 |
| 24. | శ్రీ ఏటిగడ్డ అశ్వత్థనారాయణ | 1991-93 | 89855 93098 |

| | | | |
|---|---|---|---|
| 25. | శ్రీ ఎం.రవిశేఖర్ | 1991–93 | 92900 44437 |
| 26. | శ్రీ సి. కృష్ణమూర్తి | 1991–93 | 99726 96694 |
| 27. | శ్రీ ఎస్.జగన్నాథేశ్వర | 1992–94 | 94918 29492 |
| 28. | శ్రీమతి వై. శ్రీరంగనాయకి | 1992–94 | 95737 93475 |
| 29. | శ్రీ బాబు రాజేంద్రప్రసాద్ | 1992–94 | – |
| 30. | డా॥ ఎన్.భీమన్న | 1993–95 | 99490 60771 |
| 31. | శ్రీ ఎన్. చంద్రప్ప | 1993–95 | 89859 31871 |
| 32. | శ్రీ ఎన్. పాండురంగప్ప | 1993–95 | 94924 40419 |
| 33. | శ్రీ జి. మైలారప్ప | 1993–95 | 86393 96694 |
| 34. | శ్రీ ఎల్. రాజన్న | 1993–95 | 94908 58279 |
| 35. | శ్రీ తిప్పేస్వామి | 1993–95 | – |
| 36. | శ్రీ ఎస్. హఫీజ్ | 1994–96 | 94402 63782 |
| 37. | శ్రీ యు.గంగప్ప | 1994–96 | 94913 55216 |
| 38. | శ్రీ డి. జయరాం | 1994–96 | 99897 92271 |
| 39. | శ్రీ వి. విజయకుమార్ | 1994–96 | 94419 51961 |
| 40. | శ్రీ సుధాకర్ | 1994–96 | – |
| 41. | శ్రీ మునికృష్ణ | 1994–96 | – |
| 42. | శ్రీమతి పార్వతి | 1994–96 | – |
| 43. | శ్రీ కె. రమేష్ | 1995–97 | 94926 23781 |
| 44. | శ్రీ బి. చంద్రశేఖర్ | 1995–97 | 94918 36686 |
| 45. | శ్రీమతి లీలారాణి | 1995–97 | 85209 92022 |
| 46. | శ్రీ దేవరాజు | 1996–98 | – |
| 47. | శ్రీ సన్న హనుమప్ప | 1996–98 | – |
| 48. | శ్రీ సురేష్ | 1997–99 | – |
| 49. | శ్రీ ఉమేష్ | 1997–99 | – |
| 50. | శ్రీ భూతరాజు | 1998–2000 | 98850 84576 |
| 51. | శ్రీ శివకుమార్ | 1998–2000 | 82175 93211 |
| 52. | శ్రీ ఎం. నాగరాజు | 1999–2001 | – |
| 53. | శ్రీ ఎ. చిట్టిబాబు | 2000–2002 | 87908 68289 |

| | | | |
|---|---|---|---|
| 54. | శ్రీ కె. షానవాజ్ | 2002-2004 | 98850 84576 |
| 55. | శ్రీ జోగేంద్ర | 2002-2004 | 85550 17591 |
| 56. | శ్రీ ఆదిశేషు | 2002-2004 | 78922 66975 |
| 57. | డా॥ బోడి నాగశేషు | 2003-2005 | 99855 09053 |
| 58. | శ్రీ ఎం.శ్రీకాంత్ | 2003-2005 | 63630 86827 |
| 59. | శ్రీ కె. శివలింగప్ప | 2003-2005 | - |
| 60. | శ్రీ లోకేష్ | 2003-2005 | - |

**ముఖ్యగమనిక:**

**I. 1969-76 మధ్య నా దగ్గర తెలుగు చదివిన కన్నడ విద్యార్థులలో ఈనాడు ప్రముఖులుగా కీర్తి గడించినవారు:-**

1. డా॥ హెచ్.ఎస్. వెంకటేశమూర్తి - ప్రముఖ కన్నడకవి, రచయిత
2. డా॥ బాలసుబ్రహ్మణ్యం - ప్రముఖ కన్నడ విమర్శకుడు
3. డా॥ పి.బి.శివణ్ణ ("మీరాసాబిహళ్ళి శివణ్ణ") - తెలుగునుండి కన్నడం లోనికి అనేక ప్రసిద్ధ కథానికలను అనువదించినాడు - (ముఖ్యంగా ప్రొ॥ కేతువిశ్వనాథరెడ్డి కథలను) - ప్రసిద్ధ జానపద సాహిత్యవేత్త. కన్నడ ఎం.ఏ. 1972-74 బ్యాచ్.సెల్ నెం.94485 66928.
4. శ్రీ వి.శ్రీనివాస్ ("మార్కండపురం శ్రీనివాస్")తెలుగునుండి కన్నడంలోకి అనేక కవితలను అనువదించినవాడు - (ముఖ్యంగా డా॥ సి. నారాయణరెడ్డిగారి కావ్యాలను). "కువెంపు" గారి "పక్షికాశి"ని తెలుగులోకి అనువదించాడు. గవర్నరు వి.యస్. రమాదేవిగారి నవలల్ని కన్నడంలోకి అనువదించాడు. (ఇతడు కన్నడ ఎం.ఏ. 1972-74 బ్యాచ్). సెల్ నెం.98457 20016.
5. ప్రొ॥ టి.యస్. నాగరాజశెట్టి (కన్నడ ఎం.ఏ. 1973-75 బ్యాచ్):- ఇతడు కూడా మార్కండపురం శ్రీనివాస్‌లాగే ఎన్నో తెలుగు గ్రంథాలను కన్నడంలోకి అనువదించాడు. ఇతడు కన్నడంలో రచించిన బాలలగేయాలకు కేంద్రసాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. డా॥ కాసల నాగభూషణంగారు తెలుగువచనంలో రచించిన రాయల

ఆముక్తమాల్యదను నాగరాజశెట్టి కన్నడంలోకి అనువదించాడు. దీనిని I.B.H.వారు ముద్రించారు. సెల్ నెం. 94489 79537.

6. ఈనాడు ప్రసిద్ధ కన్నడ కవి, చలనచిత్రగీత రచయిత అయిన శ్రీ దొడ్డరంగెగౌడ నా దగ్గర జానపదసాహిత్యం చదివాడు.
7. ప్రొ॥ ఆర్.శేషశాస్త్రి – ఇతడు నాకు "ఏకలవ్య శిష్యుడు". శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో కన్నడ ప్రొఫెసర్‌గా పనిచేశాడు. కన్నడ వీరగల్లులను గురించి గొప్ప పరిశోధన చేశాడు. డా॥ జోస్యుల సదానందశాస్త్రిగారితో కలిసి "కళాపూర్ణోదయం"వంటి కొన్ని తెలుగు క్లాసిక్స్‌ను కన్నడంలోకి అనువదించాడు. కన్నడ–తెలుగు నిఘంటువును నిర్మించాడు. ఇతని అనువాద గ్రంథాలను కేంద్రసాహిత్య అకాడెమీ ప్రచురించింది. సెల్ నెం. 94404 66599.

### II. హిందీ అధ్యయన విభాగంలో కూడా "తెలుగు":–

నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఉద్యోగం చేసిన రోజుల్లో హిందీ అధ్యయన విభాగానికి అధ్యక్షులుగా ఆచార్య సరగు కృష్ణమూర్తిగారు ఉండేవారు. వారు నాకు ఆప్తమిత్రులు. ఆయన బళ్ళారికి చెందినవారు; మాతృభాష తెలుగు. హిందీలోను తెలుగులోను కవిత్వం వ్రాసేవారు. కన్నడ అధ్యయనకేంద్రాన్ని చూచి, ఆయన కూడా హిందీ ఎం.ఏ. విద్యార్థులకు తెలుగుసాహిత్యం ఒక ఐచ్ఛిక విషయంగా పెట్టారు. అలాగ నా దగ్గర తెలుగు చదివిన హిందీ ఎం.ఏ. విద్యార్థులు కూడా కొందరు ఉన్నారు. వారు కూడా ఉత్తరోత్తర జీవితంలో గొప్ప అభ్యుదయాన్ని సాధించారు. వారిలో డా॥ బి.ఆర్. మృత్యుంజయ (1973–75 బ్యాచ్) అనే అతడు, హిందీలో పిహెచ్.డి. చేసి, B.E.L లోను, M.E.S కాలేజిలోను ఉద్యోగాలు చేశాడు. అతని సెల్ నెం. 94486 70086.

### III. 1974–76 మొట్టమొదటి తెలుగు ఎం.ఏ. బ్యాచ్‌లో చదివిన కొందరు:–

1. ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి – 87625 46968
2. డా॥ బి. మహాలక్ష్మికుమారి –
3. డా॥ ఎం. రుక్మాంగదనాయుడు – 94480 87783
4. శ్రీ వి. నారాయణ రెడ్డి – 94497 66589
5. శ్రీమతి కె. సౌజన్యకుమారి – 94909 87069

మొదలైనవారు 18 మంది చదివారు. వీరందరూ ఉత్తరోత్తర జీవితాల్లో మంచి మంచి ఉద్యోగాలలో స్థిరపడ్డారు. శ్రీమతి చన్నాప్రగడ జయలక్ష్మి, బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలోనే ప్రొఫెసర్ & హెడ్‌గా పనిచేసింది. డా॥ ఎం. రుక్మాంగదనాయుడు పి.ఇ.ఎస్. కాలేజీలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేసి, తరువాత సొంతంగా 10 కోట్ల రూపాయలతో తన యిష్టదైవమైన శ్రీకృష్ణుని పేరుతో పెద్ద కళాశాలను స్థాపించి, B.Sc., B.Com., B.B.A. అనే U.G. తరగతులే కాకుండా M.Sc., M.Com. M.B.A. అనే P.G. తరగతులను కూడా నిర్వహిస్తున్నాడు. ఇప్పుడు ఆ కళాశాలలో 3,000 మంది విద్యార్థులు చదువుతున్నారు. తరువాతి కాలంలో ఇక్కడ చదివిన విద్యార్థులలో డా॥ ఎం. రామనాథంనాయుడు Karnataka State Open University లో Telugu Professor and Head గా ఉన్నాడు. డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా ఉన్నాడు. డా॥ వి. నారాయణప్ప ఢిల్లీ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. డా॥ తోట వెంకటస్వామి ద్రావిడ విశ్వవిద్యాలయంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. డా॥ ఎన్. భీమన్న తిరుపతి ఎస్.వి. ఆర్ట్స్ కళాశాలలో తెలుగుశాఖాధ్యక్షుడుగా ఉన్నాడు. డా॥ బి. మహాలక్ష్మీకుమారి, శ్రీ వి. నారాయణరెడ్డి (మొదటి బ్యాచ్) మహారాణి ప్రభుత్వ మహిళా కళాశాలలో తెలుగు ప్రొఫెసర్లుగా పనిచేసి రిటైరయ్యారు. శ్రీమతి కె. సౌజన్య కుమారి (మొదటి బ్యాచ్) మదనపల్లి బి.టి. కళాశాలలో తెలుగు ప్రొఫెసరుగాను, హెడ్‌గాను పనిచేసింది. ఈ విధంగా ఇక్కడ చదివిన ఎందరో విద్యార్థులు అభివృద్ధి పథంలో పయనించారు. ఇంకా పయనిస్తున్నారు. వీరందరికీ నా అనంతమైన ఆశీస్సులు...

**IV. పిహెచ్.డి. విద్యార్థులలో కొందరు:-**

1. డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు - (కీర్తిశేషులు)
2. ప్రొ॥ జి.యస్. మోహన్ - 94484 05110
3. ప్రొ॥ చన్నాప్రగడ జయలక్ష్మి - 87625 44968
4. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు - 93437 16723
5. డా॥ పి.యు.బి. శర్మగారు - 94920 79494

| | | |
|---|---|---|
| 6. | డా॥ కె.కె.వి. శర్మగారు | – 99120 41792 |
| 7. | డా॥ కడిమిళ్ళ వరప్రసాద్‌గారు | – 92478 79606 |
| 8. | ప్రొ॥ ఎం. రామనాథంనాయుడు | – 87623 57996 |
| 9. | డా॥ వి. నారాయణప్ప | – 99586 07783 |
| 10. | డా॥ ఎం. రుక్మాంగద నాయుడు | – 94480 87783 |
| 11. | డా॥ వి.వై.వి. సోమయాజిగారు | – (కీర్తిశేషులు) |
| 12. | డా॥ అమళ్లదిన్నె వెంకట రమణప్రసాద్ | – 94400 05273 |
| 13. | డా॥ ఎ. అంజనప్ప | – 99000 97584 |
| 14. | శ్రీ కె. మన్మథరావు (ఎం.ఫిల్.) | – 94409 43937 |



## శుభాకాంక్షలు

**– శతావధాని డా॥ పాలపర్తి, శ్యామలానందప్రసాద్**

**మ॥ పరమాత్మీయులు, తంగిరాలశశి, సుబ్బారావు, విద్వన్మణిన్,**
**సరసాహ్లాదమనోజ్ఞభాషణ కళాచార్యాగ్రణిన్, ధీఫణిన్,**
**చిరునవ్వే మునుదోచు జానపదరాశీభూత చైతన్య, మీ**
**కరణిన్ నూరుశరత్తులొప్పగ శుభాకాంక్షల్ గొనన్ గొల్చెదన్!**

పుట్టుపండువు సోబానాలతో **– పాలపర్తి**

(30–03–2022, బుధవారంనాడు నా 87వ జన్మదిన
సందర్భంగా – తంగిగాల)

# గురువందనం-2022

## మూడవభాగం

**(చైతన్యకవిత - స్పందనలు - ఛలోక్తులు - కవితా! ఓ కవితా!)**

# మూడవభాగం

# 3. చైతన్యకవిత – స్పందనలు – ఛలోక్తులు – కవితా! ఓ కవితా!

## 3.1 చైతన్యకవిత

### 3.1.1 చైతన్యకవితపై స్పందన

సుమారు 35 ఏళ్ళక్రితం (1998నాటికి), శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారు నన్ను వెతుక్కుంటూ, మాచర్లలో మా యింటికి వచ్చారు. అప్పటికి 15 సంవత్సరాల నాటికి ముగిసిన మహత్తర తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటకాలంనాటి సాహిత్య సేకరణ కొరకు, వారు తిరుపతి యూనివర్శిటీ నుండి, తెలంగాణా పోరాట ప్రాంతాలకు వెళ్ళారు. అప్పటికే ఆ పోరాటంలో పాల్గొన్న ప్రజల నోటి గుర్తులుగా ఉన్న పోరాట సాహిత్యాన్ని కొంత సేకరించుకొని, రచయితగా ఆ ప్రజల జ్ఞాపకాల్లో ఉన్న నన్ను కలుసుకొనే కుతూహలంతో నావద్దకు దయచేశారు.

ఆ పోరాటసాహిత్యం విలువను గుర్తించి, ఆ ప్రాంతాలన్నీ ఓపికగా తిరిగి, అచ్చులోగానీ, వ్రాతలో గానీ లేకుండా కేవలం నోటిగుర్తులతో లభ్యమయ్యే ఆ సాహిత్యాన్ని తొట్టతొలిగా సేకరించిన వారు సుబ్బారావుగారే! ఆ తరువాత అన్ని విశ్వవిద్యాలయాలనుండి పిహెచ్.డి.డిగ్రీల కొరకు చాలామంది సేకరించారు. తుదకు, 25 ఏండ్లకు, పోరాట రజతోత్సవ సందర్భంగా రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ఆదేశంతో నేనూ ఆ ప్రజల నోటి గుర్తులనుండి కొంత సాహిత్యం సేకరించటం జరిగింది.

ప్రస్తుతాంశం, 35 సంవత్సరాలకు, శ్రీ సుబ్బారావుగారు, నన్ను జ్ఞాపకముంచుకొని, వారి సంపాదకత్వాన వెలువడుతున్న 'చైతన్య కవిత' రజతోత్సవ సంచికను నాకు ప్రేమతో పంపించారు. వారికి నా కృతజ్ఞతలు!

సంచిక సర్వాంగసుందరంగా ఉంది. పూర్తిగా చదివించింది. సంపాదకీయంలో సుబ్బారావుగారు 'అస్పష్టత అనేది ఆధునిక కవిత్వ లక్షణాలలో ఒకటి' అనీ, ఈనాటి ప్రసిద్ధ అప్రసిద్ధ అనుభూతి కవుల్లో కటికి చీకటి కవిత్వం

ఎక్కువైపోతోందనీ, సంపుటి సాంతంలో ఒక్కటిగూడా నాకు అర్థంగాక, మరొక కవయిత్రికిచ్చి చదివిస్తే, ఆమె స్థితికూడా అలాగే ఉందనీ, నిర్మొహమాటంగా రాశారు.

ప్రసిద్ధులని వారికవిత్వం చదివేందుకు ఎంతో ఆశతో పుస్తకం విప్పితే, తలబద్దలు కొట్టుకున్నా అర్థంగాక, నేనూ అనేకసార్లు ఆ స్థితినే అనుభవించాను.

సుబ్బారావుగారిలాంటి ప్రసిద్ధులకే కొరుకుడుపడని అలాంటి కవిత్వం ప్రయోజనం ఏమిటో రాస్తున్న కవి దిగ్గజాలు ఆలోచించాలి!

నేతాజీని గురించి నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారి అనువాదవ్యాసం కొన్ని క్రొత్త విషయాలు తెలుసుకునేందుకు ఉపయోగకరంగా ఉంది. ఇక పద్య కవితల్లో, దుగ్గిరాల రామారావుగారి 'గ్రీష్మము' లో, 'కుత్తుకల నుత్తరించెడి మిత్తి కత్తికోత వలెనున్న విద్యుత్తు,కోత' లాంటి, నేటి, సామాజిక స్థితి చక్కని ఉపమానంతో హత్తుకునేలా చెప్పినా 'పొగలేని మర్మురమ్ములు వోలె ప్రియురాలి పొగరు గుబ్బలు గూడ సెగలు జిమ్మె, శశవిషాణమ్మయ్యె జలువ కొమ్మల నీడపట్టులందును పైటగుట్టులందు, మృగతృష్ణ జలమయ్యె దృప్తి భోగుల గాలి విందులందును ఆలి పొందులందు' లాంటి పచ్చి శృంగారాన్ని పద్యాల్లో నింపటం పాతవరవడినే స్ఫురింపజేస్తుంది.

కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'నాగరికత' ఖండికలో, నేటినాగరకతకు తామే సిసలైన ప్రతినిధులమని విర్రవీగే కలవారిలోని అమానుషత్వం, ఒక సామాన్య స్త్రీ, పనిమనిషిలోని మానవతా విలువలను పద్యకవితలో ప్రతిభావంతంగా చూపారు.

దుగ్గిరాలవారి మరో చక్కని రచన 'ఈశ్వరాగమనం', 'ఎంతని విన్నవింతు గతియించిన ఏబది తొమ్మిదేండ్ల వృత్తాంతము… కథయంతయు వీసము వీడకుండ నేకరువిడుమంచు నన్నడుగగా వలదు… పాతరంకులు బయల్పడు సూదికి సోదికేగినన్' అని, భయపడుతూనే 'వ్యయమైపోయిన దైకమత్యము' అనే పద్యంతో ప్రారంభించి, నేటి సమాజంలో పీఠమేసుకొని కూర్చున్న చెడుగులన్నింటినీ, సరళమైన భాషలో చెవులకింపైన పలుకులతో అతిసొంపుగా కూర్చి, తుదిమెరుపుగా వచ్చినవాడివి వచ్చావు. కళ్ళుమూసుకొని వచ్చిన దారిన పోయిన నపాయము కల్గదు. ఎచ్చటనైన తలదూర్చావా, నీ చిచ్చరకన్ను గూడా పనిచేయదు మా బాంబుల ముందు!' అంటూ చేసిన చమత్కారం – నాటి శ్రీనాథకవి గరళము

మ్రింగిన ఈశ్వరుని సవాలు జేస్తూ, పలనాటి జొన్నఅన్నము తింటే నీ పస తెలుస్తుందన్నట్లుంది గదూ?

'జడానికీ, ఆ బాలగోపాలనికీ ఆత్మబంధువు కాలం' అంటున్న బాపురెడ్డిగారి కవిత బాగుంది. ఆదూరి సత్యవతిగారి 'పిక్నిక్ బస్సు' కవిత 'మన సిగ్గులేని అలక్ష్యాన్ని క్షణంక్షణం గుర్తుజేస్తూ రెప్పపాటులో పిండిపిండైపోయిన ఆ రంగురంగుల పసినిగారింపుల పిక్నిక్ పెట్టె' రచన హృదయాన్ని కదిలించింది.

సుబ్బారావుగారి జన్మదిన బహూకరణ అంబికా అనంత్‌గారి కవిత, 'నిర్భీతి శిరమెత్తితే' అడిగోపుల కవితలు బాగున్నాయి. ఈశ్వర ఉగాది రచనల్లో, తంగిరాల వారి రచన 'ఆకలి పోలియోతో చచ్చుబడిన కాళ్ళతో ముందుకెలా నడువగలను? పీకలదాకా మెక్కిన వాళ్ళకే ఈ నవవసంత శోభలో దర్శనమిస్తాయి, బహువర్ణ పుష్పతరంగాల పరిమళ మాలికలు, తేనెసోనల ఓడికలు, తుమ్మెదల ఝుంకారాల డోలికలు,– పువ్వుల వసంతాన్ని ఆశ జూపి ప్రజల్ని నవ్వుల పాలుజేసి రిగ్గింగు ఎండమావుల్లో పడేసి తొక్కాడు... ఎదలో ఉగాది చిగుళ్ళ గాయాలు క్రక్కే నెత్తుటి నదులకు ఆనకట్టలు కట్టాలి". ఇంతవరకు నిజంగా నేటిసమాజ రుగ్మతని చక్కగానే వివరించారు. పరిష్కారం? 'నా దేశాన్ని రక్షించు, ఈ ఆధునిక రాక్షసుల్ని శిక్షించు, ప్రపంచ మానవసమాజం కల్లోల కాలకూట విషాన్ని భక్షించు...' అంటూ, ఈశ్వరునికి కర్తవ్యాన్ని పురమాయించటం, నడుము బిగించవలసిన మానవ ప్రయత్నాన్ని నిద్రకుపక్రమింప జేయటమే అవుతుందిగదా? 'జడానికీ, చేతనకూ, ఆబాలగోపాలానికి ఆత్మబంధువు కాలమేగదా'? నా అవగాహన తప్పయితే క్షమించండి.

'విశ్వసుందరి విశ్వసోదరి' సహదేవుడుగారి కవిత హృద్యంగా ఉంది. 'రెండు కొమ్మలు – మూడుకోయిలలు' కవితా సమీక్ష, మూడు కవితా సంపుటాలను కలిపి సమీక్షించటం విశేషం. సమీక్ష చాలా బాగుంది. అయితే, వీరభద్రయ్యగారు –సిద్ధాంతాలతో కవిత్వోత్పత్తి జరిపేవాళ్ల రచనలు ఎవడి గుండెనీ కదిలించలేవు?' అన్నారు. ఇక్కడ వారి 'సంయమనా'న్ని సందేహించవలసి వస్తుంది.

చైతన్యకవిత నాసాంతం చదివి ఆనందించాను. ఇంత మంచి సాహిత్య సంచికను పంపించిన శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారికి నూతన వత్సర శుభాభినందనాలర్పిస్తున్నాను.

మాచర్ల **– తిరునగరి రామాంజనేయులు**

ది.11–01–1998. (చైతన్యకవిత–26A., అక్టోబర్, 1997–మార్చి, 1998)

## 3.1.2 "అసలు ఎవరు చదువుతారు ఈ పత్రికని?"

– తంగిరాల

ఈ మధ్య మా స్వగ్రామం తణుకువెళ్ళి వారంరోజులు ఉన్నాను. ఒక్కరోజు కూడా ఖాళీగా ఉండకుండా, కవి మిత్రుల్నీ దాతల్ని కలిసి, 'చైతన్య కవిత' ను గురించి వారికి చెప్పి, ఇటీవలి సంచిక (Latest Issue)ను వారికి చూపించి, చందాదారులుగా చేరమని బ్రతిమిలాడాను. (ఏ ఊరు వెళ్ళినా ఇదే పని. ఈ 'భిక్షాటనం' చూచి మా ఆవిడ మాటిమాటికీ నా మీద చిర్రుబుర్రులాడుతూ ఉంటుంది. అయినా నేను పట్టు విడువని విక్రమార్కుడిని!). నా అవస్థ అంతా చూచి మా మరదలు (మా 'బుల్లి తమ్ముడు' కల్నల్ టి.కె.మూర్తి భార్య) చి.సా. శంకరి "ఎందుకు బావగారూ! రిటైరయ్యాక కూడా ఇంత అవస్థ పడుతున్నారు ఈ పత్రిక కోసం? అసలు ఎవరు చదువుతారీ పత్రికని?" అని ప్రశ్నించింది. "అవును; నిజమే; అసలు ఎవరు చదువుతారీ పత్రికని?" అని నాలో నేను చాలాసార్లు ప్రశ్నించుకున్నాను.

ఈ మాయదారి టి.వి.లు వచ్చాక అసలే అంతంత మాత్రంగా ఉన్న చదువరుల సంఖ్య నశించిపోయింది. ఒక వేళ ఎవరైనా చదివితే కథలకోసం వార పత్రికలు చదువుతారు. లైబ్రరీల నుంచి నవల్స్ తెచ్చుకొని చదువుతారు. బాడుగకు తెచ్చుకొని డిటెక్టివ్ నవలలు చదువుతారు. సెక్సు పుస్తకాలు ఇంకా ఎక్కువ చదువుతారు. కవిత్వ పత్రికను చదివే వాళ్ళెవరు? మిక్కిలి తక్కువమంది ఉంటారని నాకు బాగా తెలుసు. (12 సంవత్సరాల నుండి 'చైతన్య కవిత'ను ప్రకటిస్తూ ఉంటే చందాదారుల సంఖ్య 400 దాటలేదు. 1000 కాపీలు వేస్తున్నాను; 600 కాపీలు ఉపాదానంగా ఇచ్చివేస్తున్నాను).

కవిత్వం లలిత కళల్లో ప్రధానమైనది. సంగీతం అందరూ పాడలేరు. చిత్రాలు అందరూ గీయలేరు. నృత్యం అందరూ చేయలేరు. అలాగే కవిత్వం కూడా అందరూ చెప్పలేరు; అందరూ ఆస్వాదించలేరు. విద్వాన్లు, భాషాప్రవీణలు, తెలుగు ఎం.ఏ.లు చదివిన వాళ్ళంతా కవులు కాలేరు; కవిత్వాన్ని ఆస్వాదించలేరు. మన ప్రసిద్ధ కవులందరూ ఈ తెలుగు డిగ్రీలు తీసుకున్నవాళ్ళుకారు. లాయర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, ఇంకా ఇతర వృత్తులలో ఉన్నవాళ్ళు అద్భుతమైన కవిత్వం చెపుతారు.

అసలు మన గొప్ప కవులందరూ ఇటువంటి వాళ్ళే. (శ్రీశ్రీ –జువాలజీ బి.ఏ.; శేషేంద్ర–బి.ఏ.బి.యల్.). లలిత కళ అయిన కవిత్వం అల్లడం కాని, కవిత్వాన్ని విని ఆనందించడం కాని ఒక విధమైన ఉత్తమ సంస్కారం. ఇది చాలా కొద్దిమందిలో మాత్రమే ఉంటుంది. ఈ నాగరిక సంస్కారం పూర్వజన్మసుకృతంవల్ల వస్తుందని నమ్మేవాళ్ళల్లో నేనొకణ్ణి. ఈ అపురూపమైన సంస్కారం ఉన్న వ్యక్తులకోసం వెతుక్కుంటూ నేను ప్రయాణం చేస్తున్నాను. వీరి సంఖ్య అత్యంతాల్పమని తెలిసి తెలిసే ఈ అన్వేషణ కొనసాగిస్తున్నానా, ఆ అనర్ఘమణుల కోసం పరితపిస్తున్నాను.

మనది ఎంత గొప్ప ప్రజాస్వామ్యమైనా సంఖ్యాబలాన్ని బట్టి ఒక పని మంచిదనీ, మరొక పని చెడ్డదనీ నిర్ణయించలేం. మంచి పనులు చాలా కొద్దిమంది చేస్తారు. చెడ్డ పనులు ఎక్కువమంది చేస్తారు. పొద్దున్నే లేచి వ్యాయామం చేయడం, కాఫీ, టీలు త్రాగకుండా, సిగరెట్లు కాల్చకుండా, మద్యం జోలికి పోకుండా, నియమ నిష్ఠలతో జీవితాన్ని గడపడం, సత్యాన్ని పాటించడం, ధర్మాన్ని అనుసరించడం – ఇత్యాదిగా ఉండేవారు మిక్కిలి తక్కువమంది ఉంటారు. దీనికి వ్యతిరేకంగా ప్రవర్తించేవారు ఎక్కువమంది ఉంటారు. అలాగే కవిత్వం లాంటి ఉత్తమ లలితకళని ఆస్వాదించే సహృదయుల్ని వ్రేళ్ళపైన లెక్క పెట్టవచ్చును. నూటికి ఒక్కరు ఉంటారని కూడా ఖచ్చితంగా చెప్పలేను. కాగా మల్లంపల్లి శరభయ్యగారు చెప్పినట్టు కవిత్వం అష్టమవ్యసనం! ఈ వ్యసనం ఒక పిచ్చి. ఈ కొద్దిమంది 'పిచ్చివాళ్ళ' కోసం ఈ 'చైతన్యకవిత'!!

"కవిత్వాన్ని ఎవరు చదువుతారు? కవులు మాత్రమే చదువుతారు" అని ఆక్షేపిస్తూ ఉంటారు కొందరు. నిజమే, కాని కేవలం కవులు మాత్రమే కవిత్వం చదివినా మనం ధన్యులమే! అలాగా జరగడంలేదు. (కొందరు కవులు కేవలం తమ కవిత్వాన్ని మాత్రమే చదువుకొని మురిసిపోతూ ఉంటారు. ఇతరుల కవితల్ని కన్నెత్తి చూడరు). ఈ కవుల్లో మళ్ళీ రెండు రకాలు: పద్యకవులు, వచనకవులు. పద్యకవులలో ఎక్కువమంది పద్యకవిత్వమే చదువుతారు. కొందరు ఉదార స్వభావులు పద్యాలతోపాటు వచనకవితలు కూడా చదువుతారు. వచనకవులు మాత్రం కేవలం వచనకవిత్వమే చదువుతారు. పద్యకవిత్వం చదవరు (చదవ లేరు పాపం!) సరికదా, దానిని అకారణంగా ద్వేషిస్తారు. ఈ ద్వేషానికి ప్రధానకారణం పాండిత్యం లేకపోవడం, ప్రాచీనసాహిత్యంతో ఏమీ పరిచయంలేక

పోవడం, దురహంకారం, అజ్ఞానం కూడా మరి కొన్ని కారణాలు, పద్యకవుల్లో పాండిత్యం ఉన్నవాళ్ళు ఎక్కువ. అలాగే ఛాందసులూ ఎక్కువే! ఇక్కడ మనం ఒక విషయాన్ని ముచ్చటించుకోవాలి. శేషేంద్రశర్మగారి 'ఆధునిక మహాభారతం', 'జనవంశం' అనే కావ్యాలను సమీక్షించబోతూ, ఈ క్రింది వాక్యాలతో తమ విశ్లేషణను ప్రారంభిచారు ప్రముఖ విమర్శకులు శ్రీ వడలి మందేశ్వరరావుగారు.

"మనకు సంప్రదాయాన్నెరిగి, ఆధునికత అంటే సచేలస్నానం చేసే పండితులు, కవులూ ఉన్నారు. ఆధునికతను ఆలింగనం చేసుకొని, సంప్రదాయమొక రోత అన్న ఫోబియాఉన్న మేధావులు, మేధావికవులూ-ఉన్నారు. సంప్రదాయాన్నెరిగినట్లు నటించే ఆధునికులు, ఆధునికత నవగాహన చేసికొన్నట్టు భావించే సంప్రదాయ నిష్ఠులూ ఉన్నారు. కాని, సంప్రదాయం రక్తనిష్ఠమై ఉంటూ, ఆధునికత అవశ్యకతను గుర్తించి, దానిని కవితకు అవహింపజేసిన కవులు చాల కొద్దిమంది ఉంటే, వారికి శేషేంద్రశర్మ నాయకస్థానంలో ఉంటారు". (విమర్శ: నాటి నుండి నేటివరకు)

ఈ మాటల్ని పద్యకవులూ వచనకవులూ ప్రతినిత్యం మననం చేసుకోవాలి. సంప్రదాయాన్ని ఆధునికతనూ సమన్వయం చేసుకొంటూ ముందుకుపోవాలి.

అత్యల్పసంఖ్యలో ఉన్న కవులూ కవిత్వ రసికులూ సంఘటితమై కవితాస్వాదన అనే ఉత్తమసంస్కారాన్ని ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపింపజేస్తారని ఆశిస్తున్నాను. వారిప్రయత్నానికి మా "చైతన్యకవిత" ఒక సమర్థమైన వాహికగా ఉంటుందని కూడా హామీ ఇస్తున్నాను.

'చైతన్యకవిత' చాలా బాగున్నదని కొంతమందీ, ఏమీ బాగుండలేదని కొంతమంది వ్రాస్తూ ఉంటారు. (మొదటి రకం ఎక్కువ, రెండవ రకం తక్కువ). ఈ రెండురకాల వాళ్ళూ అతివాదులే. మొదటివర్గంవాళ్ళు అల్పసంతోషులు. రెండవవర్గంవాళ్ళు సినిక్స్ - కళ్ళకు గంతలు కట్టుకున్న వాళ్ళు. అందువల్ల వీళ్ళమాటలు నేను నమ్మడం లేదు. నాకు తోచిన రీతిలో నేను ముందుకు వెడుతున్నాను.

So Called 'మహాకవు' లెవ్వరూ కవితలు వ్రాసి మా పత్రికకు పంపరు. అడిగి అడిగి విసుగెత్తి నేను ఇక ఆ 'మహాకవు' ల్ని అడగడం మానేశాను. వాళ్ళు ఎప్పుడో అమావాస్యకీ పున్నానికీ ఓ చిన్న కవిత వ్రాస్తారు; అది విప్లవ కవిత అంటారు. కాని దానిని 'బూర్జువా' పత్రికలకు పంపుతారు. (చైనాను,

రష్యాను సమర్థిస్తూ, తమ పిల్లల్ని మాత్రం అమెరికాకు పంపే కమ్యూనిస్టు మేధావుల్లాంటి వాళ్ళే ఈ కవులు కూడా). అసలు ఈ చైతన్యకవిత చేయితిరిగిన కవులకు ఉద్దేశించింది కాదు. మా చైతన్య కవితా వేదిక ఉపాధ్యక్షులైన శ్రీ బుల్లా సుబ్బారావుగారు పదేపదే చెపుతూ ఉంటారు–చైతన్యకవిత క్రొత్తగా కవిత్వం వ్రాసే యువతీయువకుల్ని ప్రోత్సహించడంకోసం స్థాపించామని ఈ విషయాన్ని చైతన్యకవిత బాగుండలేదనేవారికి జ్ఞాపకం చేస్తున్నాను. పోనీ చాలా గొప్ప కవిత్వాన్ని ప్రచురించే తెలుగుపత్రిక లేవి ఉన్నాయో ఈ 'మహానుభావులు' నా దృష్టికి తీసికొనివస్తే వాటిని చదివి ఆ మార్గంలో నడుస్తాను నేను.

ఇంగ్లీషులో కవిత్వపత్రికలు చాలా ఉన్నాయి. Standard విషయంలో ఒక్కటీ బాగుండ లేదు. వీళ్ళంతా కవులతోనూ, అమెరికా డాలర్లతోను ఏదో వ్యాపారం చేస్తున్నట్టున్నారు. ఇప్పుడు మన దేశంలో ఉన్న మంచి సాహిత్యపత్రిక కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురిస్తున్న "Indian Literature" (ద్వైమాసిక). ఇతర భారతీయభాషలలో ఎలాంటి కవిత్వం వస్తోందో తెలుసుకుందుకు కవులూ కవితా ప్రియులూ ఈ పత్రికను తప్పక చదవాలి. 'భారతి" ఆగిపోయాక తెలుగు వాళ్ళకు సరియైన సాహిత్యపత్రిక లేదు. తెలుగు అకాడమీవారి 'తెలుగు', పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి 'వాఙ్మయి' మొక్కుబడి పత్రికలు; తప్పనిసరి పత్రికలు. ఎదో గుడ్డిలో మెల్ల, ఫరవాలేదు. అయినా ఇవి పరిశోధనపైనే తమ దృష్టిని కేంద్రీకరిస్తాయి కాని సృజన్మాక సాహిత్యాన్ని స్పృశించవు.

వ్యాపారపత్రికలు చిన్నచిన్న కవితల్ని తప్ప ప్రచురించవు. 10–12. పాదాలలోపు ఉంటేనే ప్రచురిస్తాయి. కవితకు ఒక నిర్దిష్ట స్వరూపం ఉంటుంది. మనిషికి తల, శరీరం, కాళ్ళు ఉన్నట్టుగానే కవితకు కూడా ప్రారంభం–మధ్యభాగం–ముగింపు ఉంటాయి. పది పంక్తులలోనే కవిత వ్రాయాలని శాసిస్తే, అందరూ అలా వ్రాయలేరు. నూరుపుటల పత్రికలో కవిత్వానికి రెండు పుటల్ని కూడా కేటాయించవు. కొందరు సుదీర్ఘమైన కవితలు వ్రాస్తారు. (ఈ సంచికలోని జ్వాలాముఖిగారి 'మదరిండియా–92 లాగ). వీటిని ఏ వ్యాపారపత్రిక ముద్రిస్తుంది? ఈ లోటులన్నీ తీర్చడంకోసం చైతన్యకవిత ఉద్భవించింది. కవిత్వాన్ని సీరియలైజ్ చేయడం కూడా చైతన్యకవితే ప్రారంభించింది.

'చైతన్యకవిత' కేవలం కవిత్వానికే అంకితమైన పత్రిక. ఇది అన్నిరకాల కవిత్వాన్ని ప్రచురిస్తుంది. పద్యకవిత, గేయకవిత, వచనకవిత, విప్లవకవిత, శృంగారకవిత, స్త్రీవాదకవిత, దళితకవిత ఇత్యాది అన్ని కవితల్ని సాదరంగా ఆహ్వానిస్తుంది. ఇలాంటి తెలుగు కవిత్వ పత్రిక ఆంధ్రదేశంలో కాని, ఇతరచోట్లకాని లేదు. ఇది ప్రముఖకవుల ముఖచిత్రాలతో ప్రతిసంవత్సరం ఆరు మసాలకొక సారి అత్యంతసుందరంగా వెలువడుతుంది. మొదటిసంచిక వసంతఋతువు (ఏప్రిల్ నెల)లోనూ, రెండవసంచిక శరదృతువు (అక్టోబరు నెల) లోనూ వెలుగు చూస్తాయి. కాబట్టి తమ కవితలు పంపవలిసిందిగా కవులకూ, చందాదారులు. కావలిసిందిగా కవిత్వాభిమానులకూ, ప్రకటనలు ఇవ్వవలిసిందిగా వ్యాపారవేత్తలకు మనవి చేస్తున్నాను.

'సౌరభ' — సంపాదకుడు

బెంగుళూరు (చైతన్యకవిత-27, ఏప్రిల్-సెప్టెంబర్ 1998)



**ఉ॥ శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులన్**
**జారుతరంబులయ్యె, వికసన్నవకైరవగంధ బంధురో**
**దార సమీర సౌరభము దాల్చి, సుధాంశు వికీర్యమాణ క**
**ర్పూరపరాగ పాండురుచిపూరము లంబరపూరితంబులై.**

(-నన్నయ భారతము, అరణ్య 4-142-ఇది నన్నయగారి చివరి పద్యం)

**చ॥ స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి, నిరస్తనీరదా**
**వరణములై, దళత్కమలవైభవజృంభణముల్లసిల్ల, ను**
**ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ,**
**గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్!**

(-ఎఱ్ఱాప్రెగ్గడ, భారతము, అరణ్య 4-143,
ఇది ఎఱ్ఱనగారి మొట్టమొదటి పద్యం)

## 3.1.3 కవితాలేఖలు

**– డా॥ నందూరి రామకృష్ణమాచార్య, ఇతరులు**

1. గురువర్యులు డా॥ నందూరి కృష్ణమాచార్యులవారి ఆశీస్సులు – అభినందనలు

**1. ఏదో ఒక ఆదర్శము**
**నేదో ఒక పని సమష్టి హితమునకై తా**
**నౌదల దాల్చిన త్యాగికి**
**నైదు పదినిజేసి లోకమారాధించున్.**

నీవు ధన్యజీవివి. పరమ ప్రయోజకుడవు. బహుళ కర్తవ్యములు నిర్వహించుచున్న కార్యశూరుడవు. ప్రవాసాంధ్రుడుగ బెంగుళూరులో నీవు ఆర్జించిన కీర్తి పలుకుబడికి నాబోటులు గర్వించవచ్చు. నీకు నా ఆశీస్సులు. అభినందనలు.(05–11–1996)

**2. (i) పండుగ దీపావళి ధాం**
**ధాం ధాం చంచచ్చటుల పటాటోపముగా**
**మండిత గగన స్ఫుట ది**
**ఙ్మండల కాంతిచ్ఛట మతిమతి మ్రోగున్.**

**(i) వ్యక్తి – గొప్పవాడు – వాగ్దానములు చేసి**
**తరచు – బ్రతుకులోన – తప్పవచ్చు**
**విఘ్నములకు వివిధ వికట హేతువులుండు**
**అతని మంచితనము నభినుతింతు.**

**(i) ధనికుడైనవాడు దానాల నెన్నియో**
**చేయవచ్చు ఎడమచేతితోడ**
**శక్తిలేనివాడు సల్పు దానము మిన్న**
**శీలమునకు ఆత్మ – చిత్తశుద్ధి.**

**చైతన్యకవితా పత్రికా**
**వర్ధతా మభివర్ధతామ్ –**

దీపావళి శుభాకాంక్షలతో...(10–11–1996)

3. **వివిధవాద భేద విషయ విస్తీర్ణమ్ము**
**ఎదదలోన సంగ్రహించుకొనుచు**
**తత్త్వచరితయందు - ధర్మసూక్ష్మమువోలె**
**సూత్రధారి తోచు సుబ్బరావు!** (27-11-1996)

4. **కవితా కైవల్యం - కవి దేవోభవ!**
**కవితలు చదివిన చాలును**
**కవితలపై ప్రేమ చాలు - కమ్మని హృదితో**
**కవితల నల్లిన చాలును**
**కవితయె - కైవల్యమవని - కనరా సుమతీ!**

"శ్రీ కైవల్యపదంబు కోరుటకునై" పోతన భాగవతం వ్రాశాడు. "కవిత నాకు కైవల్యంబే!"-అని నేను వ్రాశాను 'ప్రగతి గీత'లో... నీవు పోతనను నన్నూ మించినావు గదా! జీవితం కవితకు అంకితం చేశావు! ఏ అక్షరంలో కవిత్వం కనిపించినా నీవు ఆరాధించుచున్నావు. సంతోషం. (01-12-1996)

5. **ఓ యభిమాన సంభృత మహోదయ! సంచిక వేసి సాహితీ**
**న్యాయము కూర్చినాడవు గదా! చరితార్థుడ-తెల్గులో ఉపా**
**ధ్యాయుడ నౌట - నాబ్రదుకు ధన్యము - శిష్యుడ వీవెగా - రస**
**స్థాయికి చేర్చి ఇచ్చు గురుదక్షిణ మెచ్చితి - సుబ్బరాట్కవీ!**
(1-12-1996)

6. **చచ్చిపోకముందె - శ్రద్ధాంజలిని నాకు**
**కూర్చె సుబ్బరావు సుకవి వరుడు;**
**సాహితీ స్రవంతి - చైతన్యకవితలో**
**సంచిక వెలయించె ఛాత్రసూరి.**

ఆశీస్సులు... భీమవరం సభావిశేషాలు తెలుపవలెను. కీర్తిశేషులు దిగుమర్తి సీతారామస్వామిగారి పేరు నీవు నిలుపుచున్నందుకు సంతోషం.

చైతన్యకవిత సంచిక చూచిన వారందరు నీవు చేసిన కృషి చిరస్మరణీయమైనదని శ్లాఘించుచున్నారు. నా సంతోషమునకు మేరలేదు.

-నండూరి రామకృష్ణమాచార్య, సికింద్రాబాదు, 18-12-1996

I. **"వీరగాథల ఖజానా**
**తెలుగు సాహిత్యానికి నజరానా**
**పరిశోధకులకు షానామా**
**'తంగిరాల' ధీనామా!"**

– డా॥ జవాద్ హుస్సేన్,
తిరుపతి, 12-06-1998

II. **"చైతన్య కవిత లందెను;**
**చేతన ముదమొందె; కృషి విశిష్టముగద!; సం**
**ప్రీతార్థ గౌరవైక**
**ద్యోతకములు కాన్కలంపుదున్ త్వరలోనే!"**

– డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ,
గుంటూరు, 23-6-1998

III. **జీవిత సభ్యత్వమునకు**
**నే విత్తము పంపుచుంటి నిర్మలహృదయా!**
**శ్రీవాణీ జనయిత్రిని**
**సేవించెడి సుబ్బరాయ! చేకొనుము నతిన్-**

– 'శతావధాని' శ్రీ కొండపి మురళీకృష్ణ
కందుకూరు, 05-12-1998
(చైతన్యకవిత-30, అక్టోబర్, 1999)



ఉ॥ **"నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్,**
**మిమ్ముఁ బురాణదంపతుల మేలుభజింతుఁగదమ్మ! మేటిపె**
**ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిసేయుమమ్మ! నిన్**
**నమ్మినవారికెన్నఁటికి నాశములేదుగదమ్మ! యీశ్వరీ!"**

(–పోతన భాగవతము, రుక్మిణీకల్యాణము)

స్పందన-1

## 3.1.4 చైతన్యశీలి తంగిరాల

**- 'జింబో', (డా॥ మంగారి రాజేంద్ర)**

చైతన్య కవిత కేవలం కవిత్వానికే అంకితమైన పత్రిక. ఈ పత్రిక సంపాదకుడు, నిర్వాహకుడు తంగిరాల వెంకట సుబ్బారావు. ప్రముఖకవుల ముఖచిత్రాలతో ఆరుమాసాలకొకసారి, అంటే వసంతం- శరత్తులలో వెలువడుతుంది. ఇప్పటివరకు 39 సంచికలు వెలువడ్డాయి. చైతన్యకవిత 1986లో అక్షయ ఉగాదినాడు మైసూరులోని 'ధ్వన్యాలోకం'లో ప్రొ॥ సి.డి. నరసింహయ్య, ప్రొ॥ యస్వీ జోగారావు గార్లచే ప్రారంభించబడింది. అప్పుడు దాని ఖర్చు మూడువేల రూపాయలు. ఇప్పుడు 30 వేలు. పోస్టేజి ఖర్చులు అదనం. ఎన్నో వ్యయప్రయాసలకు గురైతే తప్ప పత్రికను వెలువరించలేము. మరి ఇంత శ్రమపడి తంగిరాలగారు ఎందుకు ప్రచురిస్తున్నట్టు? - ఆయన కవిత్వం పదిమంది చదవడానికా? కానే కాదు. నిజానికి తంగిరాలవారు గొప్ప పరిశోధకుడు. కె.వి. రమణారెడ్డిగారి మాటల్లో చెప్పాలంటే 'తంగిరాల వెంకట సుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయ సేకరణ చేశారు. కాలికి బలపం కట్టుకొని దేశమంతా తిరిగారు. చేతివ్రేళ్ళు అరిగేదాకా కలానికి పనిపెట్టారు.. ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యులయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోను సాఫల్యం పొందారు.' అలాంటి సుబ్బారావు మరి 'చైతన్యకవిత' ని ఎందుకు ప్రచురిస్తున్నారు? ఇది అందరిని తొలిచే ప్రశ్న.

కవిత్వాన్ని ఎవరు చదువుతారు? కవులు మాత్రమే చదువుతారు అన్నది ఆక్షేపణ. ఈ విషయం తంగిరాలకి తెలియదా? తెలుసు. కవిత్వాన్ని కవులు చదివినా ధన్యులమేనన్న సంగతి కూడా ఆయనకు తెలుసు. ఎందుకంటే అలా కూడా జరగడం లేదన్నది కొంతమేరకు వాస్తవం. కొందరు కవులు కేవలం తమ కవిత్వమే చదివి మురిసిపోతారు. ఇతరుల కవిత్వాన్ని కన్నెత్తి కూడా చూడరు. ఇవన్నీ తంగిరాలకి తెలుసు. అయినా ఎన్నో కష్టాలు భరించి పత్రికను వెలువరిస్తున్నారు. అది ఆయన ఉత్తమసంస్కారానికి నిదర్శనం. కవిత్వం రాయడం, కవిత్వం విని ఆనందించడం ఒక్క ఉత్తమసంస్కారమని నమ్మిన వ్యక్తి తంగిరాల. అలాంటి అపురూపమైన వ్యక్తులకోసం ఆయన 'చైతన్యకవిత'ని ప్రచురిస్తున్నారు.

అలాంటి ఉత్తమ సంస్కారం వున్న వ్యక్తులకోసం ఆయన ప్రయాణం. అలాంటి వ్యక్తుల సంఖ్య అత్యంతల్పమని తెలిసీ ఆయన ప్రయాణం చేస్తున్నారు. మల్లంపల్లి శరభయ్యగారు చెప్పినట్టు కవిత్వం అష్టమవ్యసనం. ఈ వ్యసనం ఒక పిచ్చి. ఈ కొద్దిమంది 'పిచ్చివాళ్ళ' కోసం చైతన్య కవితను వెలువరిస్తున్నానని ఆయనే చెప్పారు– 'అసలు ఎవరు చదువుతారీ పత్రికని' అన్న వ్యాసంలో. అలాంటి ఉత్తమ సంస్కారం వున్న వ్యక్తి తంగిరాల వెంకట సుబ్బారావు. ఆ సంస్కారాన్ని చిరుకోపంతో ఆయన భార్య మందలించినా, ఆయన అవస్థను చూసి ఆయన మరదలు జాలిపడ్డా, ఇంకా ఎవరైనా పిచ్చి అనుకున్నా ఆయన వెనుకంజ వేయలేదు. అందరి కవితల్ని చైతన్యకవిత ద్వారా తెలుగుప్రజలికి అందించడం తంగిరాల 'పిచ్చి'. ఈ మాట సరదాకైనా అనడం సరైంది కాదు. అది ఆయన సంస్కారం. (ప్రముఖకవి శ్రీ వేగుంట మోహనప్రసాద్ తంగిరాలవారిని సరదాగా 'పిచ్చి ప్రొఫెసర్' అంటూ ఉంటారు చైతన్యకవితను వెలువరించినప్పుడల్లా.)

'భారతి' ఆగిపోయిన తరువాత తెలుగులో సాహిత్యపత్రికలు లేవు. విరసం నిర్వహిస్తున్న 'అరుణతార', జనసాహితి నిర్వహిస్తున్న 'ప్రజాసాహితి', 'చూపు', 'సాహితీకౌముది', 'భావవీణ' లాంటివి మినహాయిస్తే తెలుగులో సాహిత్యపత్రికలు లేవు. అవి అన్నిరకాల కవిత్వాలని ప్రచురించవు. చైతన్యకవిత అన్నిరకాల కవిత్వాలను ప్రచురిస్తుంది. పద్యకవిత, గేయకవిత, వచనకవిత, విప్లవకవిత, శృంగారకవిత, స్త్రీవాదకవిత, దళితకవిత లాంటి అన్ని వాదాలకీ రూపాలకీ స్థానం ఇస్తుంది. ఇట్లాంటి పత్రిక తెలుగులో మరొకటి లేదు. ఒక రకంగా చెప్పాలంటే చైతన్యకవిత ఒక వేదిక, ప్రజాస్వామ్యవేదిక. అట్లాగే నిడివితో సంబంధం లేదు. కవిత నిడివి ఎంత వున్నా చైతన్యకవిత ప్రచురిస్తుంది. అంతేకాదు అనువాద కవితలని, వ్యాసాలని, సమీక్షలని, ఇంటర్వ్యూలని, సాహిత్య కార్యక్రమాల వివరాలని చైతన్యకవిత ప్రచురిస్తుంది. కవుల ఫొటోలని ప్రచురిస్తుంది. సుబ్బారావుకి చందాదారులుగా చేరమని అడగడం తెలుసుగానీ ఊరు ఊరు తిరిగి, అక్కడ ఆవిష్కరణసభలు జరిపి తన ప్రాచుర్యాన్ని పెంచుకోవడం తెలియదు. ఒక్క మాటలో చెప్పాలంటే 'చైతన్యకవిత'ని ఆయన వ్యాపారవస్తువు చేయలేదు. అది కవిత్వలక్షణం కూడా కాదు.

తంగిరాల ఎనిమిది పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. ప్రతిదీ – ముఖ్యమైందే. అయితే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన 'కాటమరాజు

కథలు' రెండు సంపుటాలు తెలుగు సాహిత్యానికి ఆయన అందించిన విలువైన పుస్తకాలు. 'హంసపదిక' ప్రణయకావ్యం, 'వనదేవత' బుఱ్ఱకథ, 'గుండె పూచిన గులాబి' వచనగీతాలు కూడా ఆయన వెలువరించారు. తంగిరాల మిత్రుడు, బెంగుళూరు అరసం శాఖ అధ్యక్షుడు అయిన శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావును గురించి రాసిన 'నా ఎఱ్ఱచొక్కా మిత్రుడు' అన్న కవిత కొత్తసంచికలో వుంది. అందులో స్నేహమే కాదు ఆత్మీయత, వేదనా వున్నాయి.

"పల్లెలో/ నాలుగు దిక్కులకూ పరచుకున్న/ మండువా లోగిలి పోయి
పట్టణంలో / సిమెంట్ కీకారణ్యంలో / ఇరుకు పావురాళ్ళ గూళ్ళలో
చిట్టచివరి అరలో / ఒదిగిన వృద్ధకపోత దంపతులు / శనికి భయపడి
మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో దాక్కున్న / పార్వతీపరమేశ్వరులు"

ఇట్లా సాగుతుంది కవిత. ఇది ఎందుకు చెప్పాల్సి వచ్చిదంటే ఆయన సంప్రదాయాన్ని ఎంతగా ప్రేమిస్తాడో అట్లాగే అభ్యుదయాన్నీ కాంక్షిస్తాడు. ఆయన అరుణ పతాకాన్నీ ఇష్టపడతాడు, కరుణ పతాకాన్నీ ఎగరేస్తాడు. వయస్సు మీద పడినా, గుండెకు ఆపరేషన్ అయినా ఇంకా చైతన్యకవితని విడువలేదు. అదే చైతన్యాన్ని కొనసాగిస్తున్నాడు తంగిరాల.

ఇంగ్లీషులో కవిత్వ పత్రికలు చాలా వున్నాయి. తెలుగులో లేవు. తెలుగు అకాడమీవారి 'తెలుగు', పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి 'వాఙ్మయి'లు కన్పించవు. కన్పించినా వాటిల్లో కవిత్వం ఉండదు; పరిశోధన వ్యాసాలు మాత్రమే ఉంటాయి. కవిత్వానికే అంకితమైన పత్రికని 1986 నుంచి నిరంతరాయంగా, 69 ఏళ్ళ వయస్సులో కూడా వెలువరిస్తున్న తంగిరాలను అభినందించడం తప్ప మరేం చెయ్యలేకపోతున్నాను. నా చేతిలో అధికారం వుంటే ఆయనకు ఓ విశిష్టపురస్కారాన్ని ఇచ్చి గౌరవించేవాడిని. అతను నా కోర్టులో కన్పిస్తే ఏ తప్పు చేయకున్నా ఆయనకు ఓ శిక్ష వేసి నా బరువుని దించుకుంటాను.

జీవితాంతం అవస్థలు పడైనాసరే చైతన్యకవితను వెలువరించమని ఆదేశిస్తాను. 'ఆదేశం' అన్న పదం వాడినందుకు క్షమార్హుణే!

('ఆంధ్రభూమి' దిన పత్రిక సౌజన్యంతో... ఆంధ్రభూమి దినపత్రిక, 15 నవంబరు 2004, 'ప్రియదర్శిని' అనుబంధం, 'సాహితి', 'గుండె తడి')

(-చైతన్యకవిత-40, అక్టోబర్, 2004)



## 3.1.5. CHAITANYA KAVITHA VOL 38 & 39 EDITED BY TANGIRALA SUBBA RAO PP.168, Rs.40/-

Chaitanya Kavitha is a collection of reviews, essays and poetry. A combined anthology of classical, modern and free verse poetry, the volumes 38 and 39 of Chaitanya Kavitha are an assorted bouquet of creativity, imagination and emotion. It is commemorative, nostalgic and full of tributes to many literatures past and present.

Edited by Acharya Tangirala Venkata Subba Rao, the first few pages pay a glowing tribute to Nidamarthi Uma Rajeswara Rao, President Progressive Writers' Association, to whom the first volume is dedicated and for Mukkamalla Narayana Reddy and Basireddy Srinivasulu Reddy to whom the second volume is dedicated.

The contributors are stars in a glittering galaxy of erudite scholars. Utpala Satyanarayanacharya, this year's Kendra Sahitya Akademi winner for his *kavyam Sri Krishna Chandrodayam*, Duggirala Rama Rao and Prof. G. V. Subrahmanyam, Vice Chancellor, PS Telugu University.

The great Avadhani of Visakhapatnam, the Late Perala Bharata Sharma's poetic prowess is eulogized by Velcheti and his verses, entitled *Bharata Bharati* and *Bharatendira* - the latter on Indira Gandhi - are included in the volume.

An illustrated, detailed essay on the patron Yarlagadda Venkata Subba Rao, who was conferred the title *Karshaka Kavi Sarvabhowma*, gives an insight into literary giant's unparalleled stature. The Late Dr. Pampana Suryanarayana, a versatile writer, is fondly remembered by his pals, Madhura Mohana Rao and Josyula Krishna Babu.

The rest of the volume is a fragrant garland of poetry from the pen of eminent poets of the highest calibre. In fact, these should have been separated from the tributes and essays mentioned above. The volume is a wonderful addition to the libraries of the lovers of poetry.

While Erasu Ayyapu Reddy reveals in his Seesa Padyam metre, excerpts from the Late Miriyala Ramakrishna's mega philosophical epic, Sri Gita, which has been serialized, is engrossing. A relatively unknown *Bhagavadgita* in lyrics by the Late Achanta Satyavathamma, contributions by Kavuri Papaiah Sastry, love poetry by G Subrahmanya Sastri, excerpts of *Raja Sathakam* by Gidugu Rajeswara Rao, and translation of French poetry by Vegunta Mohan Prasad, Pakistan Women's poetry translated by Ambika Ananth and many more add to the myriad hues of the volume. Book Reviews, aptly titled Touchstones and brief reports on literary events, mostly from Bangalore, and congratulatory letters from readers conclude the fare.

A sample from Acharya Tangirala's work: "The Editorial: *Daruna Ugadi*"

...This isn't the time of *Tarana Ugadi*
This is the spring of election violence and ennui
Here flowers do not blossom
Only wild lions growl and roam
Here bees do not zoom in joy
Only slies dance in dirty shapsody
Here cuckoos do not sing in sweet abandon
Only bleak and cruel clouds rumble on
And vile deception thrives in holy political guise.
This river does not have velvet blue ripples

Neither surging sand dunes nor angelic swans
Peasants who chose death over life
Their grieving daughters, sons and wives
Hunger, joblessness and famine
Marxism, Leninism, guns and landmines
Hell on earth and merciless battles
This river stinks of life's murk and death's tattle
These waves swirl in blood and gore
......Because
Power has always been a red lotus
Abloom in a pond of blood
And he who seeks the lotus crown
Has to swim heedlessor go down

-(Translation by USHA REVELLI)

The combined volume is priced at a delighfully low price of Rs. 40 and the Permanent Membership fee is Rs. 1000/-. Copies are available at Vishalaandhra Book House in Hyderabad and with Prof. Subba Rao at # 1708, "Sitavadhanam" 11th Cross, 1st Main, Kengeri Satellite Town, Bangalore-560 060.

A very valuable addition to any aficionado's collection, *Chaitanya Kavitha* is a volume that one can go back to time and again.

**-Turaga Janaki Rani**
(-చైతన్యకవిత-40, అక్టోబర్, 2004)

**"A thing of beauty is a joy for ever!"**

**- John Keats**

# 3.2 నా రచనలు - స్పందనలు, సమీక్షలు

## 3.2.1 MAKINEEDI'S REVIEW ON RASA GANGADHARA TILAKAM Devarakonda B.G.Tilak Interests-Hobbies and Other Essays

Authored by Prof. Tangirala Venkata Subbarao, this is a unique book of its kind, as its content is composed most adorably by his staunch disciple. And as the title indicates, the first chapter 'Interests and Hobbies' is a 'ununique' and an exclusive one for it is written as a Boswell to Tilak.

This first chapter is quite read-worthy which has elucidated the most common interests and hobbies of Tilak in a more informal tone. The author is closely associated with him, who spent almost the complete days for about six years. The narrative is totally composed in the language of the common.

Sharing his acquaintance with Tilak, the author gradually takes the reader into his fold by telling the history of Tilak. Starting with Tilak's birth particulars, the author interestingly depicts his hobbies like playing cards, bracket betting and ever-chewing nut powder and inhaling tobacco powder. Tilak was indulged in smearing 'amruthanjan'. The author exclaims that over cleanliness and hypersensitive nature of Tilak caused him feel constant ill-health than the real situation. Anyway, Tilak had suffered a lot from nervous breakdown for long eight years. "Actually, Tilak suffered a lot of valetudinarism than the real disease" adds the author. And one more thing is the nature of obligation.

Tilak was very fond of watching dramas and movies. He wrote some dramas and poems with the requests of people, and especially the author, which have proved successful, among which the drama 'Spider's Web' and the poem 'The Postman' were very well popularized.

The author classified the literary career of Tilak into three phases; pre-ill-health, ill healthy and post-health. The extreme phases are fruitful naturally and the middle phase is marked with few literary outcomes.

The first phrasal versifications like 'Letter of a Soldier', 'Toulon' and stories like 'In Libya Desert' and 'Moving Shadows' are influenced by the Second World War. 'Zinnia in the Mirror' is an excellent sketch, says the author. 'Goruvankalu' is a marvelous work in classical prosody. The third phase is of bounteous and much popularized outcome of Tilak.

Bio-briefs of favourite poets and writers of Tilak are outlined and his opinions on his contemporaries are worth read. The views of Tilak on politics, sex, faith on God and seasonal worship are insinuated beautifully.

The last miserable days of Tilak for needful money disturb the reader very much. The eighty pages long essay is ended in a mixed tone of distress and contempt-

"No longer are you...But your song is there!"

Kakinada, **- Makineedi Surya Bhaskar**
26-10-2021

**గమనిక:** ఈ సమీక్షను నాకు పంపించారు శ్రీమాకినీడి సూర్యభాస్కర్‌గారు. ఇది చాలా బాగుందనే ఉద్దేశంతో దీనిని నేను "శ్రీరస" గ్రూపులోను, "తంగిరాల" గ్రూపులోను ఉంచాను. కాని ఇప్పుడు ఈ గ్రంథంలో చేర్చాలంటే మాత్రం ఎక్కడా దొరకలేదు. రచయిత దగ్గరకూడా లేదు. అప్పుడు బెంగుళూరులోని నా ప్రాణమిత్రులు శ్రీ నారపరాజు సుబ్బారావుగారు సుమారు రెండు సంవత్సరాల తర్వాత ఎంతో కష్టపడి, ఇంటర్‌నెట్ అంతా వెదకి, ఈ ఆంగ్లసమీక్షను సేకరించి యిచ్చారు. వారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను. - తంగిరాల)



## స్పందన:-

### 3.2.2 తిలక్‌పై ఒక సాధికారిక గ్రంథం

- ప్రొ।। రామా చంద్రమౌళి

తన 'అమృతం కురిసిన రాత్రి' కవితా సంపుటితో తెలుగు వచన కవిత్వానికి కొత్త మితులను నిర్వచించి, కొత్త సొబగులద్ది, కొంగ్రొత్త పోకడలతో నూతన అక్షర పరీమళాలను వెదచల్లుతూనే చాలా హడావుడిగా చాలా చిన్న వయసులోనే అంటే.. నలభై ఐదు సంవత్సరాలకే ఈ లోకాన్ని వదలి వెళ్ళిపోయిన మధురకవి దేవరకొండ బాలగంగాధర తిలక్ 1921లో పుట్టి 1966 లో మరణించేనాటికి అతని ఏ రచనా అచ్చయి పుస్తకంగా వెలువడలేదన్న విషయం ఇప్పటి చాలామంది రచయితలకు తెలియదు. 1966 జూన్ 30 వ తేదీ రాత్రి తిలక్ గారు మరణిస్తే 1967 లో విశాలాంధ్ర ప్రచురణాలయంవారు 'తిలక్ కథలు' ను మొదటిసారి వెలువరించారు. తర్వాత 1968 లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్ వారు తిలక్ వచన కవితలనూ, గేయాలనూ కలిపి 'అమృతం కురిసిన రాత్రి' అనే మకుటంతో ముద్రించి తెలుగు వచన కవితాభిమానులకు మహోపకారం చేశారు. శ్రీశ్రీ మహాప్రస్థానంను కూడా విశాలాంధ్ర 1950లో ప్రచురించింది. ఈ రెండు కావ్యాలను అనేకానేక మార్లు పునర్ముద్రించి వీటి ఖ్యాతిని ఖండాంతరం చేసింది. తన మరణానికి ముందే తన కవితలన్నీ ఒక పుస్తకంగా రావాలని తిలక్ చాలా ఆదుర్దా పడేవాడనీ, ఆ పుస్తకానికి 'కఠినోపనిషత్' అనే పేరు పెట్టాలని తనతో అనేవాడని ఈ గ్రంథ రచయిత, తిలక్‌కు శిష్యతుల్య మిత్రుడు బెంగుళూరు విశ్వవిద్యాలయ నివృత్త ఆంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు చెప్పి మనల్ని చకితుల్ని చేశారు. విశాలాంధ్ర ప్రచురణాలయంవారి కోరికపై "వచనకవితాపితామహుడు" కుందుర్తి తిలక్ మొట్టమొదటి కవితాసంపుటికి 'మావాడు-మహగట్టివాడు' అనే శీర్షికతో పీఠిక రాస్తూ తిలక్ కవితా సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేయగల అత్యద్భుతమైన 'అమృతం కురిసిన రాత్రి' అన్న ఆ పుస్తకంలోని ఒక కవితా శీర్షికనే పుస్తక మకుటంగా ఉంచారు. దీనిముందు ఇదివరకు తిలక్ అనుకున్న 'కఠినోపనిషత్తు' అన్న శీర్షిక వెలవెలబోతున్నట్టు మనకు తెలుస్తోందికదా!

తన సమకాలికులైన మల్లవరపు విశ్వేశ్వరరావు, పాలగుమ్మి పద్మరాజు, పిలకా గణపతిశాస్త్రి, సంపత్ రాఘవాచారి, సూరంపూడి భాస్కరరావు, అనిశెట్టి సుబ్బారావు, అబ్బూరు వరదరాజేశ్వరరావు, రాయప్రోలు రాజశేఖర్, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, ఆవంత్స సోమసుందర్ ఇత్యాదులు ఆయనకు సన్నిహిత మిత్రులు. తిలక్‌తో తనకున్న వ్యక్తిగత పరిచయం వల్ల ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు తన 80 పుటల దీర్ఘ వ్యాసం 'తిలక్ అభిరుచులు-అలవాట్లు' పేర విపులంగా అందిస్తూ, తిలక్ సాహిత్య పరిచయం, తిలక్ వచన కవితా వైభవం, తిలక్ వచన కవిత్వం-భాషా శైలి, తిలక్ పద్యకవితా వైభవం, తిలక్ లేఖలు-ఒక పరిశీలన లతోపాటు సందర్భోచిత ఇతర తిలక్‌కు సంబంధించిన సాహిత్యవిశేషాలను కూడా అనేక ఛాయాచిత్రాలతోపాటు పొందుపరిచారు. తిలక్ శతజయంతి సంవత్సరంలో అందించబడుతున్న ఈ విలువైన గ్రంథం నిస్సందేహంగా జిజ్ఞాసువులను అలరిస్తుంది.

రసగంగాధరతిలకం (దేవరకొండ బాలగంగాధర తిలక్‌పై వ్యాసాలు), రచయిత: ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు, పుటలు: 318, వెల: రూ. 300/-, ప్రతులకు: అన్ని ప్రముఖ సాహిత్య పుస్తకశాలల్లో.



**శా॥ ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దానింతై, నభోవీథిపై**
**నంతై, తోయదమండలాగ్రమునకల్లంతై, ప్రభారాశిపై**
**నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపైనంతై, మహర్వాటిపై**
**నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై**

(-పోతన భాగవతము, వామనచరిత్ర)

## 3.2.3 "రసగంగాధర తిలకం!" (స్పందన)

**- శ్రీ వరిగొండ కాంతారావు**

మాన్యమహాశయులు

ఆచార్య టి.వి. సుబ్బారావుగారికి నమస్కారములు!

సంక్రాంతి పండుగ శుభాకాంక్షలు.

మీరు పంపిన రసగంగాధర తిలకాన్ని తనివితీరా చదివాను. రసగంగలో ఈదులాడాను. అమృతపానం చేశాను.

కవిత్వాన్ని, జీవితాన్ని ఇంతబాగా పరిచయం చేయవచ్చునా? అని ఆశ్చర్యపడ్డాను. నలభై ఐదేండ్ల కాలంలో ఒక మనిషి అజరామరమైన సాహిత్యాన్ని సృజించవచ్చునా! అందులో మొదటి ఏడేండ్లు లోకజ్ఞానం లేకుండానే గడచిపోతుంది కదా!

తిలక్‌గారు కవిత్వాన్ని సృజించడం ఒక ఎత్తైతే ఆ కవిత్వాన్ని ప్రకాశింపచేయడం ఒక ఎత్తు. మల్లినాథసూరి లేకుంటే కాళిదాసు లేడంటారు. సుబ్బారావుగారు లేకుంటే తిలక్‌గారు లేరనడం ఎంత మాత్రమూ అతిశయోక్తికాదు.

తిలక్‌గారి అమృతం కురిసిన రాత్రి పుస్తకాన్ని గ్రంథాలయంలో అరువుకు తీసుకుని కాజీపేట స్టేషన్‌కు వెళ్ళాను. మా అత్తగారి ఊరు భీమవరం. మా ఆవిడకు రైలుటిక్కెట్టు రిజర్వేషన్ నిమిత్తం వెళ్ళాను. హనుమకొండనుండి సిటీబస్సులో ప్రయాణం. టిక్కెట్టు తీసుకొని బస్సులో సగందూరం వచ్చాక గుర్తుకు వచ్చింది - చేతిలో పుస్తకం ఉండాలికదా! అని. వెంటనే బస్సు దిగి వెనుకకు వెళ్ళాను పుస్తకం లేదు. రిజర్వేషన్ క్లర్కు నడిగాను. మీకు తెలుసు ఆయన ఏం సమాధానం చెప్పివుంటాడో. స్టేషనంతా కలియతిరిగాను పుస్తకం దొరకలేదు. జిల్లాకేంద్ర గ్రంథాలయంలో పుస్తకం వెల చెల్లించాను. మరొక ప్రతి లేదు ఆ గ్రంథాలయంలో. నష్టం నా ఒక్కటిదే కాదు గ్రంథాలయానిదికూడా! భవిష్యత్ పాఠకులది కూడా! ఈ విషయం నన్ను చాలాకాలం బాధించింది. నేనప్పటికింకా కవిని కాలేదు. 1976 ఉత్తరార్థం, పెళ్ళయినకొత్త.

విచిత్రంగా అప్పట్నించిప్పటివరకు తిలక్‌గారిని చదవడానికి కుదరలేదు. తమాషా మీరు పుస్తకం పంపారు. కాదు కాదు, దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారిని మా ఇంటికి పంపించారు. లేదు వారంతటవారే నాపైన వాత్సల్యంతో

నా వద్దకు నడచివచ్చారు.

పుస్తకాన్ని చదువుతున్నట్లు లేదు తిలక్‌గారితో మాట్లాడుతున్నట్లున్నది. మీరూ ఆయనా మాట్లాడుకొంటుంటే నేను వచ్చి మీ సంభాషణల్లో పాలుపంచుకొంటున్న అనుభూతి!

మనకేదో బాదరాయణ సంబంధమున్నట్లు తోస్తుంది. మీరు భీమవరంలో చదువుకొన్నారు. మా అత్తవారిది భీమవరం. మీరు తణుకులో కాపురమున్నారు. మా మేనమామ భార్య పుట్టింటివారు తణుకు వాస్తవ్యులు. పదేండ్ల వయస్సులో – అప్పటికి తిలక్‌గారు ఇంకా ఉండి ఉంటారు–తణుకు మా మేనమామతో వచ్చి రెండు రోజులున్నాను.

మీ అన్నయ్యగారి స్మృతిలో రచించిన కావ్యాన్నింకా చదువలేదు. చదివాక ఉత్తరం రాస్తాను. తీవ్రమైన స్పందనగలిగిన సున్నితమనస్కులు మీరు. అందుకే ఇంత బాగా రాస్తారు. ఉంటాను.

వసంత పంచమి రథసప్తమి గణతంత్ర దినోత్సవ శుభాకాంక్షలతో.

**(– వరిగొండ కాంతారావు)**

**సీ॥ మీఁగాళ్ళ జీరాడు మేలైన కుచ్చెళ్ళ**
**తీరున మడిచీర తీర్చికట్టి,**
**బిగువు గుబ్బలమీఁద నిగనిగల్ దళుకొత్తు**
**నోరపయ్యెదకొంగు జాఱవిడిచి,**
**వలపులకొక వింత గలుగఁగా గొప్పలౌ**
**కురులు నున్నగదువ్వి కొప్పువెట్టి,**
**నెలవంక నామంబు సలలితంబుగ నుంచి**
**తిరుచూర్ణ మామీఁదఁ దీర్పుచేసి,**
**తే॥ యోరచూపుల విటులఁ దా నూరడించి,**
**గిల్కుమెట్టెల రవరవల్ గుల్కరింపఁ,**
**జికిలిచేసిన తామ్రంపుఁజెంబు పూని,**
**వీథినేతెంచె సాతానివేడ్కలాఁడి!**

(శ్రీనాథుని చాటువు)

## 3.2.4 'తిలక్' ఆంతర్యాల్ని ఆవిష్కరించిన తంగిరాల

- శ్రీ కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి

తెలుగువారికి గొప్పగా చెప్పుకోదగిన రెండు జానపద ఇతిహాసాలున్నాయి. అవి "పల్నాటి వీరచరిత్ర" మరియు "కాటమరాజు చరిత్ర". వీటిని గురించి పరిశోధనాత్మకంగా పరిశీలించి, పరిశోధించి తెలుగు వీరగాథాకవిత్వంగా మూలాలలను పట్టుకొని, అవి ఎన్ని వీరగాథలుగా ఉన్నాయో చెప్పినవారు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు. వీరు 1963 నుంచి 1968వరకు "తెలుగు వీరగాథాకవిత్వం" అనే అంశంమీద పరిశోధన చేశారు. ఆ పరిశోధనలో పల్నాటి వీరచరిత్రలో 25 వీరగాథలు, కాటమరాజుచరిత్రలో 32 వీరగాథలు ఉన్నాయని తేల్చారు. ఈ జానపద సాహిత్యాన్ని చరిత్రలో బ్రతికిస్తూ వచ్చినవారు వీరవిద్యావంతులు - "కొమ్ములవారు" - "గొల్లసుద్దులవారు". ఆచార్య తంగిరాలవారు అనగానే కాటమరాజుకథలు గుర్తుకొస్తాయి. 12-13 శతాబ్దములనాటి సామాజిక రాజకీయ, ఆర్థిక అంశాలు కళ్ళముందు కనబడతాయి.

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు ఏ అంశం మీద స్పందించి రాసినా లోతైన విషయ సంగ్రహణ, నిష్ఠతో నియమ నిబద్ధతతో వెల్లడించడం వీరి ప్రత్యేకతగా చెప్పుకోవచ్చును. తెలుగుజాతి సాహితీ పరిమళాలను నాల్గు దిశలా వెదజల్లడంలో తనదంటూ, తనదైన ముద్రతో, సాహితీలోకంలో నడుముకట్టి నిలచిన వాడీయన.

ఆచార్య తంగిరాలవారిలో వృత్తిపట్ల నిబద్ధత రచనపట్ల సత్యనిష్ఠ, సమగ్ర విషయపరిజ్ఞానం, భాషమీదపట్టు - వీరి యోగ్యతలుగా భావించవచ్చును. వీరి జీవనపోరాటాన్ని నిశితంగా గమనిస్తే, కష్టాలకు వెరవకుండా అందివచ్చిన దానిలో ఆనందాన్ని వెతుక్కుంటూ, ఓటములను ఓర్పుతో దాటి గెలిచిన యోధుడుగా భావించవచ్చును. దుర్భర స్థితులనుండి ఎదిగినవాడు. అపురూపమైన వ్యక్తిత్వంతో ఆశలకు, ఆశయాలకు గౌరవప్రదమైన రూపమిచ్చినవాడు. చరిత్రను చిరస్మరణీయంగా మార్చేది అక్షరమేనన్న ఆంతర్యం ఎరిగినవాడు. ఈయన సాహిత్య, సౌజన్య వాతావరణ సంకల్పుడు గనుకనే, దేవరకొండ బాలగంగాధరతిలక్

జీవితవిశేషాలను చూచినవి చూచినట్లుగా ఏ విధమైన దాపరికం లేకుండా "రసగంగాధర తిలకం" శీర్షికతో తిలక్ అభిరుచులు, అలవాట్లు నిర్మొహమాటంగా దృశ్యమానం చేశారు.

తిలక్ జీవితంలోని రెండు పార్శ్వాలను – అంటే వ్యక్తిగతజీవిత విశేషాలు, రచనాజీవిత విశేషాల్ని బయటపెడుతూ, ఒకదానినొకటి ఏ విధంగా ప్రాభావితం చేసుకుంటూ పోయేది, ఒక్కోసారి రెండు పార్శ్వాల మధ్య ఇతరేతర కారణాల వలన వైరుధ్యాలు ఏ విధంగా తలెత్తేది, ఏ విధంగా పరిహరించుకొనేది అద్భుతంగా ఆవిష్కరించారు ఆచార్య తంగిరాలవారు. జీవన సమరంలోంచే ఆయన అందరికీ తెలసిన రచయితగా, తననుతాను ఆవిష్కరించుకొనిన విధానాన్ని ఎత్తిచూపాడు రచయిత.

తిలక్ సిరిసంపదలతో తులతూగే వెలనాటి వైదిక బ్రాహ్మణ కుటుంబంలో సత్యనారాయణమూర్తి, రామసోదెమ్మ దంపతులకు 1921 ఆగస్టు నెల ఒకటవ తేదిన పశ్చిమగోదావరిజిల్లా 'మండపాక' గ్రామంలో జన్మించారు. తిలక్‌కు ఏడుగురు అన్నదమ్ములు, ఐదుగురు అప్పచెల్లెండ్రు. మొత్తం 12 మంది సంతానంలో ఈయన ఆరవవాడు. తిలక్ హైస్కూల్‌విద్య తణుకులోనూ, ఇంటర్మీడియేట్ మద్రాసులోను చదివాడు. అయితే ఇంటర్మీడియేట్ అనారోగ్య కారణాలవలన పూర్తిచేయలేకపోయాడు. తిలక్ తండ్రిగారు పుస్తకాలు కొనడానికి ఎంత డబ్బు ఖర్చుపెట్టినా ఏమీ అనేవారు కాదు. అందుచేత పుస్తకాలుకొని బాగా అధ్యయనం చేసేవాడు తిలక్.

"మనిషికి విశ్వాసం, పరోపకారబుద్ధి వుండాలి. ఇవిలేని వాడు మానవుడే కాదు" అనేవాడు తిలక్. ఈయన మంచి వ్యసనపరుడు. పేకాట, బ్రాకెట్టు ఎక్కువగా ఆడి డబ్బు ఎక్కువగా పోగొట్టుకునేవాడు. జీవితంలో డబ్బు పోగొట్టుకుని తణుకు పెద్దల దృష్టిలో విలువలేకుండా చేసుకున్నాడు. తణుకులో పెద్దలంటే తిలక్‌కు చాలాకోపం. వీరిని "జరీకండువా పెద్దపులు"లనీ, "పరువు ప్రతిష్ఠల గాడిద"లనీ, అధిక్షేపించేవాడు ఆయన కవిత్వంలో తిలక్. ఈయన పేకాట వ్యసనాన్ని హాబీ క్రింద చెప్పుకునేవాడు.

తిలక్ ఎక్కువగా వక్కపొడిని వేసుకునేవాడు, ముక్కుపొడిని పీల్చేవాడు. ఎక్కువగా పడిశం వదిలించుకోడానికి అమృతాంజనం వాడేవాడు. తిలక్ దుస్తులు

తెల్లవి ధరించేవాడు. గ్లాస్కో పంచె, లాల్చీ ఎక్కువ ధరించేవాడు. ఈయన ఆరోగ్యం సరిగ్గా ఉండేది కాదు. ఒకసారి "నెర్వస్ బ్రేక్‌డౌను" వ్యాధివలన ఎనిమిదేళ్లపాటు మంచానికే పరిమితమయ్యాడు. ఈయనలో ఒక బలహీనత ఉండేది. వీరికి రోగం కంటే అనుమానమే ఎక్కువగా ఉండేది. ఈయన ఎవ్వరినీ బెడ్‌రూమ్‌లోకి రానిచ్చేవాడు కాదు. ఎవరొచ్చినా డ్రాయింగ్ రూమ్ లోనే మాట్లాడి పంపించేవారు. తిలక్‌గారి సతీమణి పేరు ఇందిరమ్మ. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. తిలక్‌గారు ''ముండాకొడుకు'' అనే పదాన్ని తిట్టుగాను ప్రేమతోను ఉపయోగించేవారు.

వీరి పిల్లలంతా అమెరికాలో స్థిరపడ్డారు. తిలక్‌గారికి బంధుప్రీతి ఎక్కువ. ఈయన ముఖ్యమైన స్నేహితులు, మల్లవరపు విశ్వేశ్వరరావు, పాలగుమ్మి పద్మరాజు, పిలకా గణపతిశాస్త్రి, సంపత్ రాఘవాచారి, సూరంపూడి భాస్కరరావు, భీమశంకరం. వీరు ఎంతో సన్నిహితంగా ఉండేవారు.

తిలక్ ఎప్పుడూ మొహమాటం లేకుండా మాట్లాడేవారు. తరువాత కొంచెం యోచించి జాలిపడేవాడు. అక్రమంగా సంపాదిస్తూ, శ్రీరంగనీతులు చెప్పే పెద్దమనుషులంటే తిలక్‌గారికి విపరీతమైన కోపం. ఔత్సాహిక నాటకాలన్నా సినిమాలన్నా, ఈయనకు చాలా ఇష్టం. నవ్యాంధ్ర సాహిత్యసృష్టిలో పద్యం, గేయం, వచనగీతం, నాటకం, కథానిక, వ్యాసం, లేఖలు ప్రక్రియలలో రచనలు చేసేవాడు. తిలక్ మీద కృష్ణశాస్త్రి ప్రభావం కనిపించేది. ఈయన అనేక గ్రంథాలు రాశాడు. వీరి రచనల్లో "అమృతం కురిసినరాత్రి" చాలా ప్రసిద్ధిపొందిన కవితాసంపుటి. ఈనాటికీ అనేకసార్లు ముద్రింపబడినది. దీన్ని ఆంగ్లంలోకి "The Night The Nectar Rained" శీర్షికతో డా॥ వెల్చాల కొండలరావుగారు అనువదించారు. ఏలూరులోని "ప్రజా ప్రచురణలు" అనే సంస్థవారు తిలక్ రాసిన కొన్ని కథలు, నాటకాలు, పుస్తకాలుగా ప్రచురించారు. తిలక్ మరణించే నాటికి వీరి కవితలన్నీ పుస్తకాలుగా ప్రచురించారు. కవితలన్నీ పుస్తకరూపంలో రావాలని చాలా ఆదుర్దా పడేవారు. అకాలమరణంవలన ఆ కోరిక నెరవేరలేదు. తన కవితా సంపుటికి "కఠినోపనిషత్" అని పేరు పెట్టాలని రచయిత తంగిరాల వారితో చెప్పేవారట. వీరి మరణానంతరం విశాలాంధ్రవారు వచనకవి కుందుర్తి

ఆంజనేయులుగారి ద్వారా పీఠిక రాయించి "అమృతం కురిసిన రాత్రి" శీర్షికతో కవితా సంపుటిని ప్రచురించారు.

తిలక్, విశ్వనాథవారి బహుముఖ ప్రజ్ఞను మెచ్చుకున్నా, వారి అభిప్రాయాలతో ఏకీభవించేవాడు కాదు.

1966లో రాసిన "కాస్మోపాలిటిన్' కవితలో "ఎపిటాఫ్" రాస్తూ "దేవుడూ, మానవుడూ, వీరిద్దరే యీ అనంత విశ్వంలో మూర్ఖులు ఏ కోణంలోంచి చూసినా వీరిద్దరూ మిజరబుల్ ఫెయిల్యూర్స్" అంటారు. ఇది బహుశః తన ఆఖరికవితలో రాయబడిన వాక్యాలుగా ఉన్నవి. ఆనాటికి తన మానసిక పరిస్థితి, విసికి తీవ్ర అస్వస్థతతో జోగుతూ ఈ వాక్యాలు రాసివుండవచ్చునేమో అనేది పలువురి అభిప్రాయం.

తానేమిటో, తన కవిత్వమేమిటో "అమృతం కురిసిన రాత్రి" కవితలో విపులంగానే వ్యక్తపరిచాడు. స్వీయకవితా లక్షణాలను వివరిస్తూ "నా కవిత్వం కాదొక తత్త్వం / మరి కాదు మీరనే మనస్తత్త్వం / కాదు ధనికవాదం, సామ్యవాదం / కాదయ్యా అయోమయం జరామయం" అంటూ తన అక్షరశక్తి ఏమిటో చెప్పారు. "నా అక్షరాలు – కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు / నా అక్షరాలు – ప్రజాశక్తుల వహించే విజయఐరావతాలు / నా అక్షరాలు – వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు'' అంటూ స్వీయకవితా లక్షణాలు చెప్పుకున్నారు.

కవితా లక్షణాలేమిటో కూడా మరో మంచికవితలో స్పష్టంగా వ్యక్తీకరించారు. "కవి వాక్కు, నవకవిత, త్రిమూర్తులు'' అనే కవితల్లో "నా కవిత్వంలో నేను దొరుకుతాను'' అంటూ కవి దృక్పథాన్ని తెలియచెప్పాడు. మూడుముక్కల్లో "కరుణలేని కవివాక్కు సంకుచితమవుతుందని, ఇజంలో ఇంప్రిజన్ అయితే యింగితజ్ఞానం నశిస్తుందని, ప్రిజంలాంటిది జీవితం, అనేక కోణాలు ప్రదర్శిస్తుందని, మూడో అభిప్రాయంగా – కవిత్వం ఒక ఆల్కెమీ, దాని రహస్యం కవికే తెలుసు" నని వ్యక్తపరచాడు.

సాహిత్య శక్తిమంతుణ్ణి ఎంతో శ్రద్ధగా భక్తిగా కొలిచే తత్త్వం తిలక్‌గారిది. సారంగు నరసింహారావుగారికి ఎంతో గొప్పభావనతో చూసేవారు, వారి పాండిత్యాన్ని గౌరవించేవారు. వారు తణుకువాసి. తెలుగు, ఇంగ్లీషు, ఫ్రెంచి సాహిత్యాలు బాగా తెలిసిన వ్యక్తి.

తిలక్ డబ్ల్యు.హెచ్ ఆడెన్, టి.యస్. ఇలియట్ కవిత్వాన్ని ఎక్కువగా చదివేవాడు, బెర్నార్డ్‌షా నాటకాల్ని ఎక్కువగా అభిమానించేవాడు. పాలగుమ్మి పద్మరాజు, మల్లవరపు విశ్వేశ్వరరావుగారు – తిలక్ కవిత్వం ఆంగ్లంలోని అడెన్ కవిత్వంలా ఉంటుందనే వారు.

"విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలంటే తిలక్‌కు ఎంతో అభిమానం; ఈ ముగ్గురినీ ఆధునిక తెలుగు కవిత్వానికి త్రిమూర్తులుగా భావించేవాడు. ఈ సందర్భంగా ఆచార్య తంగిరాలవారు "ఈ ముగ్గురూ కలిస్తేనే "తిలక్"గా చెప్తారు. ఎందుచేతనంటే తిలక్‌సాహిత్యంలో విశ్వనాథలోని రచనాగాంభీర్యం, కృష్ణశాస్త్రిలోని భావసౌకుమార్యం, శ్రీశ్రీలోని అభ్యుదయం గమనించవచ్చు నంటారు.

తిలక్, ఆరుద్ర కవిత్వాన్ని చదివి స్పష్టలేని కవిగా పేర్కొన్నాడని, దాశరథిని చదివి ఈయన కవిత్వం కొంతవరకు పర్వాలేదని, నారాయణరెడ్డి (సి.నా.రె.) కవిత్వంలో విశేషం ఏమీ కనపడలేదని వక్కాణించారని తనతో ఈ విషయాలు తిలక్ స్వయంగా చెప్పారని ఆచార్య తంగిరాలవారు వ్రాశారు.

తిలక్ పోస్టుమెన్ మీద రాసిన కవిత "తపాలా బంట్రోతు; విచిత్ర ప్రణయం నాటిక; "సుందరీ–సుబ్బారావు" కథ, ఆచార్య తంగిరాలను ఉద్దేశించి రాసినవి. తంగిరాలవారి పోస్టాఫీసులో ఉద్యోగం, నిరుపేదరికం, తిలక్‌గారు గుర్తించి ఈ రచనలు చేసినట్లుగా తిలక్ సుబ్బారావుగారితో చెప్పారట.

తిలక్ "కమ్యూనిస్టు సానుభూతిపరుడు కూడా కాదు" కాని వీరి రచనలు కమ్యూనిస్టు భావజాలాన్ని కలిగి ఉండేవి. కమ్యూనిస్టు పార్టీకి మాత్రం సాలుసరిగా చందా యిచ్చేవారు తిలక్. తిలక్ రచనలు కొన్ని పచ్చిగా కమ్యూనిస్టులను వ్యతిరేకించేవిగా ఉండేవి: "శాంతి కోసం యుద్ధాన్ని ప్రజ్వలింపజేస్తారు / సుఖం కోసం ఆరక్తవిప్లవాన్ని తరింపజేస్తారు / శ్మశానభూమిని వికసిస్తుంది మీరు నాటిన పూలచెట్టు / కాని ఎవరు తుడుస్తారు తల్లీ! నీ కన్నీటిబొట్టు?" అంటూ కవివాక్కు కవితలో రాశారు తిలక్.

నటించే పతివ్రతలన్నా, పెద్ద మనుషులన్నా తిలక్‌కి నచ్చేది కాదు. "ప్రార్థన" కవితలో "దేవుడా! / రక్షించు నా దేశాన్ని / పవిత్రులనుండి, పతివ్రతలనుండి / పెద్దమనుషులనుండి / పెద్దపులులనుండి / నీతుల రెండు నాల్కలు సాచి బుసలు

కొట్టే / నిర్హేతుక కృపాసర్పాలనుండి / లక్షలాది దేవుళ్ళనుండి, వారి పూజారులనుండి / వారి వారి ప్రతినిధులనుండి / సిద్ధాంత కేసరులనుండి / సిద్ధులనుండి / శ్రీమన్మద్గురుపరంపరనుండి" అంటూ నటనతో నమ్మింపజూచే వారిని గూర్చి అయిష్టతను ఖండితంగా చెప్పారు తిలక్.

ఆచార్య తంగిరాలవారు గ్రహించినంతవరకు తిలక్‌గారికి పరకీయ శృంగారం ఉన్నట్లు లేదు. కవులకూ కళాకారులకు సాధారణంగా ఉండే మూడులోపాలు, పొగత్రాగడం, ఆల్కాహాలు త్రాగడం, వ్యభిచారం తిలక్‌గారికి లేవనే చెప్పొచ్చు- అంటారు ఆచార్య తంగిరాల.

దైవప్రీతి, భీతి ఉన్న కవి తిలక్. వీరు వచనకవిత్వంతోపాటు ఛందోబద్ధమైన పద్యాలుకూడా రాసేవారు. వీరు రాత్రివేళల్లోనే ఎక్కువగా రాసేవారు. ఉపన్యసించుటలో తిలక్‌గారికి ఉత్సాహం ఉన్నా అనారోగ్యంవలన ఇంటికే పరిమితమయ్యేవారు – అంటారు తంగిరాల.

తిలక్‌గారితో మాట్లాడ్డం మాత్రం నిజంగా ఒక ఎడ్యుకేషనే. ఎన్నో రచనా సంబంధమైన రహస్యాలు వారినుండి నేను నేర్చుకున్నాను అంటారు ఆచార్య తంగిరాల.

1955-1961 ప్రాంతంలో తిలక్ ఆగర్భశ్రీమంతునిగా పుట్టినా డబ్బుకోసం చాలా ఇబ్బంది పడ్డారు. ఈ ఇబ్బందులే ఆయనచేత "భూమి తన చుట్టూ తాను తిరుగుతూ / ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది" అనిపించాయి. ఆర్థిక యిబ్బందులు ఎన్ని ఎదురైన తన ఇద్దరు కుమారులను డాక్టరు కోర్సు చదివించారు. అమ్మాయిని మంచి సంబంధంతో వివాహం జరిపించారు. అందరు పిల్లలు ఇతర దేశాల్లో హాయిగా జీవిస్తున్నారు.

తిలక్ శబ్దశక్తి అలంకారపుష్టి ఎరిగినవాడు. అపార భావుకత కలిగినవాడు. తిలక్‌గారి కథారచన పరిపక్వత, నిపుణత, సంపూర్ణత, ముప్పేట పెనగిన మానవతాదృక్పథంతో ఉంటుంది. తిలక్ రాసిన నాటకాలు ఆచార్య తంగిరాల వారిని దృష్టిలో పెట్టుకొని ఆయన్నే హీరోగా తలుస్తూ వ్రాసిన నాటకాలు. తంగిరాలవారిని ఆయన నాటకాల్లో ఆవిష్కరించాడు తిలక్. తంగిరాలవారు "సుచిత్ర ప్రణయం" వంటి తిలక్ నాటికలలో హీరోగా నటించి ప్రేక్షకుల్ని మెప్పించారు.

తిలక్‌గారి వ్యక్తిత్వంగురించి చెప్పాలంటే, "ఆయన స్నేహశీలి". ప్రేమా, ఆప్యాయత, కరుణ, సౌందర్యాన్వేషణ, అనారోగ్యాన్ని లెక్కచేయకుండా జీవన మాధుర్యాన్ని ఆస్వాదించే ధైర్యశాలి. ఛాందసభావాల్ని, సంప్రదాయవాదుల మూఢవిశ్వాసాలను తీవ్రంగా ఖండించేవారు. బాధలలో ఉన్నవారి కన్నీరు తుడిచే దయార్ద్ర హృదయం కలవాడు" అంటారు తంగిరాలవారు.

తిలక్ 1996 జూన్ 30వ తేది రాత్రి తుదిశ్వాస విడిచారు. కానీ పత్రికల్లో వచ్చిన మరణవార్త ప్రకారం 1996 జూలై ఒకటవతేదిగా అందరూ అనుకుంటారు. ఇది యథార్థం కాదు అంటారు ఆచార్య తంగిరాల. జూన్ 30వ తేది రాత్రి వేళ తిలక్ స్వర్గస్థులయ్యారు అనేది యథార్థం.

తిలక్‌గారి శతజయంతి నివాళిగా ఈ వ్యాససంపుటి 'రసగంగాధర తిలకం' వెలువరిస్తున్నానంటూ 01.08.2021న ప్రచురించారు రచయిత తంగిరాల ఈ గ్రంథాన్ని.

తిలక్ మరణవార్త విన్న శ్రీశ్రీ "వయస్సు సగం తీరకముందే / అంతరించిన ప్రజాకవి / నభస్సు సగం చేరకముందే / అస్తమించిన ప్రభారవి / మరి కనిపించడా?" అంటూ వాపోయాడు.

ఈ "రసగంగాధర తిలకం" (దేవరకొండ బాలగంగాధర తిలక్) గ్రంథంలో తిలక్‌తో స్నేహితునిగా వుంటూనే తంగిరాలవారు తిలక్‌గారికి గురుస్థానాన్ని యిచ్చారు. ఎన్నో లోతైన బాహ్యప్రపంచానికి తెలియని విషయాలను విప్పి చెప్పారు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు.

కనిగిరి **– కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

18.11.2022

**"కవిత్వం ఒక ఆల్కెమీ**
**దాని రహస్యం కవికే తెలుసు**
**కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు**
**కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు"**

– తిలక్

స్పందన:-

## 3.2.5 "అశ్రుతర్పణం"

**- ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ**

నేను ఇంటికి రాగానే పలకరించిన అపురూప గ్రంథాల్లో ఆచార్య తంగిరాలగారు, తమ అన్నగారు కీ.శే.శ్రీ టి.వి.కె. సోమయాజులుగారి స్మృత్యంకితంగా వెలువరించిన. అశ్రుతర్పణం ఒకటి. పూజ్యులు వారి అన్నగారి గూర్చి వీరిరచన, వారి రచనలు, 'సూక్తి ముక్తావళి', 'వేదాంతకథలు' వంటి వారి సంకలిత సాహిత్యంతో కలిపి, 462 పేజీల అత్యమూల్య గ్రంథం. భ్రాతృభక్తికి నేను చూచిన మేరలో పరమోత్కృష్ట తార్కాణం....

అందులో వారు ఒక విలువైన ప్రశ్నను లేవదీశారు.

జీవితం అంటే ఏమిటి?

ఇది నిజానికి తంగిరాలవారు లేవదీసిన ప్రశ్న కాదు... వారి అన్నగారి ఆధ్యాత్మిక శిష్యురాలు కీ.శే.చిట్టూరి విజయలక్ష్మిగారు ఆచార్య తంగిరాల గారిని అడిగిన ప్రశ్న! ఒక 30-40 ఏళ్ల క్రితం.

పైకి ఎంత సరళంగా అగుపిస్తుందో, లోన అంత లోతైన ప్రశ్న! ప్రశ్న ఉన్నంత సూటిగా సమాధానం చెప్పటం సాధ్యం కాని ప్రశ్న.

ఆ మాటే వారికి చెప్పి అప్పటినుంచి మా అన్నగారు, ప్రస్తుతం కుర్తాళం పీఠాధిపతి శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి (పూర్వాశ్రమంలో డా॥ ప్రసాదరాయ కులపతి, డా॥ తంగిరాల గారి సహాధ్యాయి) వారినుంచి, తెలిసిన అనేకులనుంచి, చూచిన అనేక రచనలనుంచి ముఖ్యాంశాలను సేకరించి ఒక వ్యాసంగానే రాశారు. అందులో ముక్తాయింపుగానే ఒకప్పుడు ప్రతిచోటా దర్శనమిచ్చిన పై అష్టాదశ సూక్తి ముక్తావళి.

ఇంతకీ "జీవితమంటే ఏమిటి?" అనే ప్రశ్నకు సిరికోనీయ కవులారా!, కథకుల్లారా!, చింతకుల్లారా! మనమూ ఆలోచిద్దామా? మన ఆలోచనలకు సరైన సాహిత్య అభివ్యక్తుల నిద్దామా? ఇంతకంటే గీతాజయంతి జరుపుకొనే ఉత్తమ పద్ధతి ఏముంది?!!

మన పెద్దలలో పెద్దలు, నిడదవోలు మాలతమ్మగారు మొదటగా స్పందిస్తే బాగుణ్ణు!! (వారెందుకో ఇటీవల మనపై కినుక బూనినట్లున్నారు కదా! లేదంటే తప్పక స్పందిస్తారు).

ఆచార్య తంగిరాలగారు సేకరించిన సమాధానాల్లో నాకన్నిటికంటే నచ్చినది ఒకటుంది:

కీ.శే. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పినది.

దాన్ని భరతవాక్యంగా మనవిచేస్తాను.

"జీవితం అంటే ప్రతిజీవి తన సుఖాన్ని అన్వేషిస్తూ ప్రయాణం చేయడం!"

(పై పుస్తకం మీద ఆసక్తి ఉన్నవారికి: ఇది బెంగళూరు "శ్రీరస" పక్షాన ఆచార్య తంగిరాలగారు సొంతవ్యయంతో వెలువరించిన ప్రచురణ, 2022 సం. అన్ని ప్రముఖ తెలుగుపుస్తక విక్రయశాలల్లోను లభిస్తుంది. వెల: రూ. 400/-)



**సీ॥ సొగసుకీల్జడదాన! సోగకన్నులదాన!**
**వజ్రాలవంటి పల్వరుసదాన!**
**బంగారుజిగిదాన! బటువుగుబ్బలదాన!**
**నయమైన యొయ్యారి నడలదాన!**
**తోరంపుఁగటిదాన! తొడలనిగ్గులదాన!**
**పిడికిటనడఁగు నెన్నడుముదాన!**
**తళుకుఁజెక్కులదాన! బెళుకుముక్కరదాన!**
**సింగాణి కనుబొమ చెలువుదాన!**
**తే॥ మేలిమిపసిండి రవకడియాలదాన!**
**మించిపోనేల రత్నాల మించుదాన!**
**తిరిగిచూడవె ముత్యాలసరులదాన!**
**చేరిమాటాడు చెంగావిచీరదాన!** (-శ్రీనాథుని చాటువు)

## సమీక్ష:-

## 3.2.6 సాహిత్య ప్రియులకు షడ్రసోపేతమైన విందు "అశ్రుతర్పణం"

**- డా॥ తోట వెంకటస్వామి**

"టి.వి.కె. సోమయాజులు"గా ప్రసిద్ధికెక్కిన "తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు" తమ రచనల ద్వారా - ముఖ్యంగా "ఏటినముత్యాలు" - "జ్ఞానతరంగాలు" - "భగవద్గీతాప్రబోధము" అనే గ్రంథాల ద్వారా ఎంతో ఘనమైన కీర్తి గడించిన సాహిత్యవేత్త. వీరి స్వగ్రామం పశ్చిమగోదావరిజిల్లాలోని తణుకు పట్టణం. వీరు 1930లో జన్మించి, 2021లో స్వర్గస్థులయ్యారు. వీరి తమ్ముళ్ళైన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు, శ్రీ భాస్కరరావుగారు, కర్నల్ కృష్ణమూర్తిగారు కలిసి తమ అన్నగారికి నివాళిగా ఒక చక్కని సంస్మరణ గ్రంథాన్ని గత మహాశివరాత్రినాడు (01-03-2022 నాడు) వెలువరించారు. ఇది ఆనవాయితీగా ప్రచురించే సంస్మరణ గ్రంథం వంటిది కాదు, సాహిత్య ప్రియులకు ఒక షడ్రసోపేతమైన విందుగా దీనిని ఎంతో భక్తిశ్రద్ధలతో తీర్చిదిద్దారు; తమ భ్రాతృభక్తిని వేనోళ్ళ చాటుకున్నారు. ఈ గ్రంథంపేరు: "అశ్రుతర్పణం".

ఈ ముగ్గురు తమ్ముళ్ళ మాటలలో చెప్పాలంటే-టి.వి.కె. సోమయాజులు గారు "ఉత్తమ సాహిత్యవేత్త. సంఘజీవి, బుద్ధిజీవి, నియమబద్ధజీవి, గాంధీయవాది, నిత్యఖద్దరుధారి, నిరంతర వ్యాయామకర్కశ వజ్రశరీరుడు, ఉభయభాషాప్రవీణుడు, ఉత్తమకవి, ఉద్దండ పండితుడు, అద్భుతవక్త, విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, సాహిత్య రసజ్ఞశేఖరుడు!" ఈ విశేషణాలన్నింటినీ సమర్థించే రచనలు ఈ గ్రంథంలో నిండుగా ఉన్నాయి.

"అశ్రుతర్పణం" అనే ఈ గ్రంథం 1/8 డెమీసైజులో 472 పుటలతో, మూడు భాగాలుగా సర్వాంగ సుందరంగా, కొన్ని నలుపు తెలుపు ఛాయాచిత్రాలతో, మరికొన్ని రంగుల ఛాయాచిత్రాలతో బౌండ్ బుక్‌గా వెలువడింది. మొదటిభాగంలో సోమయాజులుగారి జీవితచరిత్ర, రెండవభాగంలో వారి స్వీయరచనలు, మూడవభాగంలో వారు సంకలనంచేసిన సాహిత్యవిశేషాలు ఉన్నాయి.

మొదటిభాగంలో సోమయాజులుగారి విద్యాభ్యాసం, ఉద్యోగాలు, సాహిత్యజీవితం – తణుకు పట్టణంతో వారికిగల అవినాభావ సంబంధం – అక్కడున్న వారి ప్రాణమిత్రుల విశేషాలు – సోమయాజులుగారు తమ అనుభవంతో జీవితాన్ని కాచి వడబోసి చెప్పిన కొన్ని యథానికలు, కథానికలు – వారు సజీవులై ఉన్నప్పుడు కవిమిత్రులు వారినిగురించి చెప్పిన కవితలు – సోమయాజులుగారు స్వర్గస్థులైన పిమ్మట బంధుమిత్రుల కవితాబాష్పాంజలి – తంగిరాలవారి వంశవృక్షం – ఇత్యాదులన్నీ కలిపి మొత్తం 98 పుటలలో వివరించబడ్డాయి. తండ్రి అమాయకుడు కావడంతో, తాతగారు పెట్టే నరకయాతనలతో – తల్లిగారు అష్టకష్టాలు పడుతూ సంసారాన్ని నెట్టుకొని వస్తుంటే, చేతికి ఎదిగిన పెద్దకొడుకు సోమయాజులుగారు తల్లికి కుడిభుజంగా నిలిచి, తమ్ముళ్ళను చదివించి, సన్మార్గంలో నడిపించిన తీరు ఈ గ్రంథంలో ఎంతో హృద్యంగా చిత్రించబడింది. సంసారంకోసం, తమ్ముళ్ళ అభివృద్ధికోసం సోమయాజులుగారు చేసిన త్యాగాలెన్నో ఈ మొదటి భాగంలో వివరింపబడ్డాయి. ఒక సందర్భంలో ఈ రచయిత తమ అన్నగారు తాను కన్న బిడ్డలకంటె తమ్ముళ్ళను ఎక్కువగా ప్రేమించేవారని చెప్పడం, సోమయాజులుగారి భాతృప్రేమకు ఎత్తిన విజయపతాక! కాని, తమ అన్నగారు ఎంత గొప్పవాడైనా, ఆయన కన్నా గొప్ప అన్నయ్యలు – పురాణకాలంలో రాముడు, ధర్మరాజు – ఆధునికకాలంలో కాళోజీ నారాయణరావుగారి అన్నగారు కాళోజీ రామేశ్వరరావుగారు; కాటూరి వెంకటేశ్వరరావుగారి అన్నగారు కాటూరి రామకృష్ణయ్యగారు ఉన్నారని సోమయాజులుగారి తమ్ముళ్ళు గుర్తించడం వారి విజ్ఞతకు, లోకజ్ఞతకు గొప్ప నిదర్శనం. మహాబలశాలి – దండమూడి రాజగోపాలరావు, కామినేని ఈశ్వరరావులగురువు – అయిన కొల్లి రంగదాసుగారు – మానవుడు నియమబద్ధంగా బ్రతికితే 120 సం॥లు బ్రతకవచ్చునని చెప్పినవారు, హఠాత్తుగా 68 సం॥ల వయస్సులో మోటర్ సైకిలు ప్రమాదంలో చనిపోవడం విధివైపరీత్యానికి మృత్యుహేలకి ఉదాహరణంగా చెప్పారు. ఒక రైతు తన ఒక్కగానొక్క కొడుకును బాగా చదివించి, అమెరికా పంపించి, వైద్యవిద్యలో అరితేరేలా చేశాడు. హైదరాబాదులో కొడుకుకోసం పెద్ద ఆసుపత్రి కట్టించి ఇచ్చాడు. ఆ కొడుకు తన తండ్రికి జ్వరం వస్తే ఏమీ పట్టించుకోక పోవడం, ఆసుపత్రికి వెళ్ళి కాంపౌండర్ చేత మాత్రలు పంపించడం. – నేటి కొడుకులకు వృద్ధులైన తల్లిదండ్రుల ఎడ

ఉండే ఉపేక్షా భావాన్ని వ్యక్తంచేస్తోంది. "వాస్తుదోషం" అనే కథ వాస్తుశాస్త్రంలో హేతుబద్ధంకాని ఆలోచనలను బట్టబయలు చేసింది.

సోమయాజులుగారు ఎంత నిర్మొహమాటంగా మాటలాడేవారో తెలియజేయడానికి ఒక హాస్య సంఘటన ఈ మొదటి భాగంలో పేర్కొనబడింది. ఒకసారి భీమవరం కళాశాలనుండి ఒక తెలుగు ఆచార్యులు ఉపన్యాసం చేయడానికి తణుకు నన్నయపీఠానికి వచ్చారు. ఆయన నన్నయభారతంలోని ఒకే ఒక్క పద్యాన్ని తీసికొని, అందులో శంకరాద్వైతం సమస్తమూ దాగి ఉందని, రెండు గంటలు ప్రసంగించి, శ్రోతలందరినీ విసిగించి వదిలిపెట్టారు. ఇటువంటి చాదస్తం సాహిత్యోపన్యాసాలంటే సోమయాజులుగారికి ఒళ్ళుమంట! ఆ వక్త తన ఉపన్యాసం అయిపోయిన తర్వాత నిశ్శబ్దంగా వెళ్ళిపోయి ఉంటే బాగుండేది. కాని ఆయన తిన్నగా పెద్దలైన సోమయాజులుగారి దగ్గరకు వచ్చి, "అయ్యా! గురువుగారూ! ఎలా ఉంది నా ఉపన్యాసం?" అని అడిగాడు. అసలే లోపల కుతకుత ఉడికిపోతున్న సోమయాజులుగారు వెంటనే వెటకారంగా: "మీరు ఇలాగే ఉపన్యాసాలు చేస్తూ ఉంటే కొన్నాళ్ళకి మిమ్మల్ని రోడ్లమీద పిచ్చివాడుగా చూడవలసి వస్తుంది మాకు!" అన్నారు. ఆ ఉపన్యాసకుని ముఖం మాడిపోయింది! చల్లగా జారుకున్నాడు.

సోమయాజులుగారి జీవితాన్ని తెలియజేసే ఈ మొదటిభాగంలో ఒక అతిముఖ్యమైన సంఘటన - ఒక జటిలమైన వేదాంతప్రశ్న - దాని సమాధానంకోసం రచయిత ఆచార్య సుబ్బారావుగారు చేసిన అన్వేషణ - ఏడు పుటలలో సవిస్తరంగా తెలియజేయబడింది. తంగిరాల సోదరుల కుటుంబానికి తణుకు ఎం.ఎల్.ఏ.గా పనిచేసిన శ్రీ చిట్టూరి బాపినీడుగారు ఎంతో ఆప్తమిత్రులు. వారి ధర్మపత్ని శ్రీమతి చిట్టూరి విజయలక్ష్మిగారు గొప్ప ఆధ్యాత్మికదృష్టి కలవారు; సోమయాజులుగారికి పరమభక్తురాలైన శిష్యురాలు. ఆమె ఒకసారి ప్రొ॥ సుబ్బారావుగారిని ఒక ప్రశ్నవేశారు: "జీవితం అంటే ఏమిటి? పుట్టడం, పెరగటం, చదువుకోవడం, ఏదో ఉద్యోగం చేయడం, పెళ్ళి చేసుకోవడం, పిల్లల్ని కనడం, ధనము-ఆస్తులు సంపాదించడం, వాటిని పిల్లలకి పంచి యివ్వడం, ముసలితనంలో శరీర బాధలు పడటం, చివరకి చనిపోవడం - ఇంతేనా? ఇంకేమైనా ఉందా?"

ఈ ప్రశ్నకు సుబ్బారావుగారు: "అమ్మా! ఇది చాలా క్లిష్టమైన ప్రశ్న. దీనికి వెంటనే సమాధానం చెప్పడం కష్టం. నాకు కొంత వ్యవధి యివ్వండి. నేను పండితుల్ని, కవుల్ని, వేదాంతుల్ని అడిగి తెలిసికొని మీకు సమాధానం చెపుతాను" అన్నారు.

విజయలక్ష్మిగారు వేసిన ప్రశ్న పైకి సరళంగా కనబడుతోంది కాని మిక్కిలి జటిలమైన ప్రశ్న. దీనిని సరళంగా అర్థంచేసికొని, "జీవితమంటే జననమరణాల మధ్యనుండెడి స్థితి" అని చెప్పవచ్చు. కాని ఆమె ఆశించే సమాధానం అది కాదు. జనన మరణాల మధ్యస్థితి జీవితమని అందరికీ తెలుసు; ఆమెకీ తెలుసు! అది కాదు ఆమె ప్రశ్నించేది; "జీవిత పరమార్థమేమిటి?" అని ఆమె ప్రశ్నలోని ఆంతర్యం. ఈ ప్రశ్నకు సమాధానాన్ని వెతుక్కుంటూ ఎన్నో ఏండ్లు కృషి చేశారు ఆచార్య తంగిరాలవారు. ఎందరో మహనీయుల్ని కలిశారు. కొన్ని ఉత్తమ గ్రంథాలతోపాటు సోమయాజులుగారి గ్రంథాలను కూడా పరిశీలించారు. జిల్లెళ్ళమూడి అమ్మగారి అమృత వాక్కులను ఆకళింపు చేసికొన్నారు. ఇలా జరుగుతూ ఉండగా, ఒకసారి నెల్లూరులో డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఈ ప్రశ్నకు చటుక్కున చెప్పిన సమాధానం సుబ్బారావుగారికి నచ్చింది: "ప్రతిజీవీ తన సుఖాన్ని అన్వేషిస్తూ ప్రయాణం చేయడమే జీవితం!". అలాగే జిల్లెళ్ళమూడి అమ్మగారు చెప్పిన "ఆశా అసంతృప్తుల కలయికే జీవితం!" అనే నిర్వచనం కూడా బాగుంది. సుఖదుఃఖాల మిశ్రమం జీవితమని మనం స్థూలంగా అర్థంచేసుకోవచ్చును. అందువల్లనే ప్రముఖ వేదాంతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు "Life is a music of tears and smiles" అన్నారు.

**జీవితానికి - జీవిత ధ్యేయానికి మరికొందరు పండితుల నిర్వచనాలు:- (వీటిలో కొందరు చెప్పిన జీవిత నిర్వచనాలు-నిజానికి జీవిత పరమార్థాలే!):-**

కర్మలు మూడు రకాలు:- (1) ప్రారబ్ధ కర్మలు= పూర్వజన్మనుండి ఈ జన్మకు సంక్రమించినవి; (2) సంచితకర్మలు = ఈ జన్మలో చేస్తున్నవి; (3) ఆగామి కర్మలు = పునర్జన్మలోకి వచ్చేవి.

(1) "పుట్టుటనుండి గిట్టుటవరకూ జీవి తనకర్మఫలాన్ని అనుభవిస్తూ ఉండటమే జీవితం!" (-ఆచార్య శలాక రఘునాథశర్మగారు.)

(2) "మానవుడు సత్త్వరజస్తమో గుణాలలో సత్త్వగుణాన్ని పెంపొందించు కోవడమే జీవిత పరమార్థం" (-శ్రీ కాశీభొట్ల సత్యనారాయణగారు)

(3) "జననం-మరణం- ఈ రెండూ రెండు అట్టలు - ఈ అట్టలమధ్య కుట్టబడిన పుస్తకం జీవితం" (-శ్రీ భువనచంద్రగారు)

(4) "సంచిత ఆగామి కర్మలను నశింపజేసికొనుటకు మానవుడు ఈ జన్మలో చేయు ప్రయత్నమే జీవితము" (-డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు)

(5) "జంతు లక్షణాలున్న మనిషి అసలైన మానవుడుగా ఈ లోకంలో తన ఉనికిని, తన పుట్టుకకు గల అర్థాన్ని తెలుసుకోవడమే జీవితం!" (-డా॥ ఎం.సుగుణరావు).

ఈ గ్రంథ నాయకులైన టి.వి.కె. సోమయాజులుగారు, జీవితాన్ని - జీవిత పరమార్థాన్ని ఇలా నిర్వచించారు:-

(i) "జీవితం పెద్ద కల. మృత్యువు దానికి ముగింపు. కన్ను తెరిస్తే పోయేది స్వప్నం! కన్నుమూస్తే అంతరించేది జీవిత స్వప్నం" (-సత్యసందర్శనం)

(ii) "ధర్మార్థకామమోక్ష సాధనమే జీవిత లక్ష్యం!" (-జ్ఞానతరంగాలు)

శ్రీమతి చిట్టూరి విజయలక్ష్మిగారు వేసిన "జీవితమంటే ఏమిటి?" అనే పరిప్రశ్నకు - ప్రొ॥ సుబ్బారావుగారు ఎంతో కష్టపడి తాను సేకరించిన సమధానాన్ని ఈ మొదటి భాగంలో పొందుపరచడం ఆధ్యాత్మిక జిజ్ఞాసువులందరికీ గొప్ప విందుగా ఉన్నది; ఇది తప్పక వారి మన్ననలను పొందుతుంది.

"అశ్రుతర్పణం"లోని రెండవభాగం సోమయాజులుగారి స్వీయరచనలకు ప్రత్యేకింపబడింది.

సోమయాజులుగారు ఈ క్రింది రచనలు చేశారు:-

1) కీరకోకిలమ్ - ఖండకావ్యం

2) కాఫీ ఆరాధన - హాస్యశతకం:
ఈ రెండింటిని కలిపి చిన్న పుస్తకంగా, వీటి కృతిభర్తయైన శ్రీ భమిడిపాటి గౌతమ సుబ్బావధానిగారు, 31-08-1975నాడు, సాహితీ సమితి - కైకలూరు, కృష్ణాజిల్లా పరంగా ముద్రించారు.

3) ఏటినముత్యాలు - "శ్రీరస" ప్రచురణ, 2006; ద్వితీయ ముద్రణ 2016; (ప్రస్తుతం తృతీయ ముద్రణ సిద్ధమవుతోంది)

4) జ్ఞానరత్నాలు – "శ్రీరస" ప్రచురణ, 2009.
5) సత్యసందర్శనం – డా॥ తాతిని రామబ్రహ్మంగారి ప్రచురణ, 2010.
6) శ్రీ గురుభ్యో నమః – "శ్రీరస" ప్రచురణ, 2011 (కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం శతజయంతి సందర్భంగా ఈ ముద్రణ జరిగింది.)
7) జ్ఞానతరంగాలు – ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణ, 2017.
8) భగవద్గీతా ప్రబోధము – ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణ, 2018.

సోమయాజులుగారు రచించిన గ్రంథాలలో "ఏటిని ముత్యాలు" – "సత్యసందర్శనం – "జ్ఞానతరంగాలు" – "భగవద్గీతాప్రబోధము" – అనే నాలుగు రచనలూ చాలా గొప్ప రచనలు. వీటి తరువాత ఎన్నదగినవి మూడు మంచి వ్యాసాలున్నాయి. వారి తల్లిదండ్రులను గురించి వ్రాసిన "మాతృదేవో భవ!" – "పితృదేవో భవ!" అనే రెండు వ్యాసాలు; "జ్ఞానరత్నాలు" అనే గ్రంథాన్ని వారి తల్లిగారికి అంకితమిస్తూ వ్రాసిన "మా అమ్మ" అనే వ్యాసము. అలాగే "శ్రీ గురుభ్యో నమః" అనే చిన్న పుస్తకంలో తమ గురువులైన "జటావల్లభుల పురుషోత్తంగారు కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు – వేదుల రామశాస్త్రిగారు – చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు"–అనే నలుగురు ఉద్దండులైన పండితులగురించి వ్రాసిన వ్యాసాలూ కూడా మిక్కిలి శ్రేష్ఠమైన రచనలు. ప్రసిద్ధకవి "రసరాజు"గారు రచించిన "రసభారతి" అనే ఖండకావ్యాన్ని, దుగ్గిరాల సోదరకవులు రచించిన "త్రివేణి" అనే ఖండకావ్యాన్ని ఎంతో నిశితంగా, సూక్ష్మాతి సూక్ష్మంగా వివేచన చేస్తూ రెండు విమర్శ వ్యాసాలు వ్రాశారు. వీటిలోని కవిత్వచర్చ ఉన్నతశ్రేణి విమర్శకు చెందినది. అలాగే "వార్ధక్యంలో ఎలా బ్రతకాలి?" అనే వ్యాసం ఎంతో విశిష్టమైన వ్యాసం; నేటి వృద్ధులందరూ తప్పక చదవవలసిన వ్యాసం. కన్నపిల్లలు తల్లిదండ్రుల ఎడ చూపే నిర్దారణ, అలాగే ముసలివాళ్ళైన తల్లిదండ్రులు కొడుకుల్ని కోడళ్ళని పెట్టే బాధలు – ఈ విధంగా నాణానికి రెండువైపులూ చూపించారు సోమయాజులుగారు ఈ వ్యాసంలో.

సోమయాజులుగారి మొత్తం రచనలను "కవిత్వం–తత్త్వవివేచన – వ్యాసాలు" అని మూడు విభాగాలుగా విడదీశారు. "తత్త్వవివేచన" అనే విభాగంలో "జ్ఞానరత్నాలు" అనే గ్రంథం నుండి "ఆస్తిక–నాస్తిక వాదాలు" – "శిష్యప్రశ్నలు: శంకర సమాధానాలు" మొదలైనవి తీసి ఇక్కడ ముద్రించారు. అలాగే

"సత్యసందర్శనం" అనే గ్రంథంనుండి "పరిప్రశ్నలు" (జ్ఞానాన్ని గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో వేసే ప్రశ్నలు) - "భగవద్గీతా ప్రబోధం" అనే గ్రంథంనుండి "జ్ఞానకిరణాలు" సేకరించి ఇక్కడ చేర్చారు. తాత్త్విక విషయాలను ఇష్టపడేవారికి ఇవి మొదదుకు మేతవేస్తాయి!

"అశ్రుతర్పణం" మూడవభాగంలో సోమయాజులుగారు సమకూర్చిన "సంకలిత సాహిత్యం" ఉన్నది. దీనిలో మూడుశాఖలున్నాయి: (1) సాహిత్య సాగరంలో ఏఱినముత్యాలు; (2)సూక్తిముక్తావళి; (3) వేదాంతకథలు.

**1) సాహిత్యసాగరంలో ఏఱినముత్యాలు:-**

ఇది సోమయాజులుగారి రచనలన్నింటిలోను మొట్టమొదట పేర్కొనదగిన ఉత్తమ గ్రంథం. ఇది కొన్ని అపూర్వకవితల సంకలనం. ఇందులో ఆణిముత్యాల వంటి తెలుగుపద్యాలు 252 ఉన్నాయి; 310 ఉత్తమ శ్లోకాలున్నాయి. తెలుగు పద్యాలను "చమత్కారం - శృంగారం - హాస్యం - ఏకాంత శృంగారం" అనే నాలుగు రకాలుగా విడదీశారు. సంస్కృత శ్లోకాలను కూడా నీతి - చమత్కారం -శృంగారం - హాస్యం" అనే నాలుగు. విధాలుగా వర్గీకరించారు. తన బాల్యంనుండి - తనకు 75 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ ఎంతో కష్టపడి ఇటువంటి ప్రాస్తానిక పద్యాలను, సభారంజక శ్లోకాలను సేకరించి, అన్నింటికీ తాత్పర్యాలు వ్రాసిన మహనీయులు టి.వి.కె. సోమయాజులుగారు. (ఈ "ఏఱినముత్యాలు" తృతీయ ముద్రణను "అజో-విభొ-కందాళం" ఫౌండేషన్‌వారు త్వరలో చేపట్టబోతున్నారు.) వీటిలోనుండి ఎంపిక చేసిన 15 పద్యాలు-శ్లోకాలు ఈ గ్రంథంలో చేర్చబడి ఉన్నాయి.

**2) సూక్తిముక్తావళి:-**

సోమయాజులుగారికి మహనీయుల సూక్తులంటే మహాప్రాణం! వీరు ఏ గ్రంథాన్ని ముద్రించినా, దానిలో ప్రతి పుటలోను దిగువభాగంలో ఒక మంచి సూక్తిని వేయాలని పట్టుపట్టేవారు. వారు సేకరించిన అటువంటి సూక్తులు కొన్నివందలు ఉన్నాయి. (వీటిలో కొన్ని ఆంగ్లసూక్తులు కూడా ఉన్నాయి.) సంపాదకులు వీటిని ఈ గ్రంథంలో చేర్చారు. "సత్యసందర్శనం" నుండి 90 సూక్తులు; "జ్ఞానతరంగాలు" నుండి 107 సూక్తులు; "భగవద్గీతాప్రబోధం" నుండి

45 సూక్తులు - మొత్తం 242 తెలుగు సూక్తులు ఈ గ్రంథంలో ఉన్నాయి. ఆంగ్లసూక్తులు ప్రత్యేకంగా 43 ఉన్నాయి. వీటిలో 19 సూక్తులు మహాత్మాగాంధీగారి సూక్తులు కావడం విశేషం.

**3) వేదాంతకథలు:-**

వేదాంత విషయాలు బోధించేటప్పుడు అవి శ్రోతలకు సులభంగా అర్థంకావడంకోసం చిన్నచిన్న కథలు చెప్పాలని ఆదిశంకరులు చెప్పారు ("సుఖావబోధార్థం ఆఖ్యాయికాఖ్యానమ్" - జగద్గురు శంకరాచార్య). అందువల్ల టి.వి.కె. సోమయాజులుగారు తాము రచించిన "సత్యసందర్శనం" - "జ్ఞానతరంగాలు" - "భగవద్గీతాప్రబోధం" - అనే మూడు వేదాంత గ్రంథాలలో సుమారు 200 కథలు చెప్పారు. వీటిలోనుండి గ్రంథ సంపాదకులయిన ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు 50 కథలను ఎంపికచేసి ఈ పుస్తకంలో ఇచ్చారు. ఇవన్నీ ఎంతో ఆసక్తికరంగా జీవితసత్యాన్ని ఆవిష్కరిస్తూ, జ్ఞానాన్ని గోరుముద్దలుగా చేసి పాఠకులకు అందిస్తాయి. ఒక్కొక్క కథ ఒక్కొక్క కొసమెరుపుతో తళుక్కుమంటుంది. ఇవన్నీ జ్ఞానజిజ్ఞాసువులు తప్పక చదువవలసిన కథలు! ఇవి "బ్రహ్మసత్యం - జగన్మిథ్యా" అనే వేదాంతాన్ని వేనోళ్ల చాటే ఉత్తమకథలు!

"సత్యసందర్శనం" అనే గ్రంథంలోని "శిష్టరక్షణ : దుష్టశిక్షణ - దైవయోగం - గోపికల అనన్యభక్తి - ఏషణత్రయంలో ధనమే ముఖ్యమైనది - మమకారం - జీవనగంగ - మనం ఎప్పుడు చావాలో, ఎక్కడ చావాలో, అంతా భగవంతుని నిర్ణయమే! - ధనం అంటే మృత్యువు - దేహప్రీతి: మృత్యుభీతి" మొదలైన కథలు పై కోవకు చెందుతాయి. అలాగే "జ్ఞానతరంగాలు" అనే పుస్తకంలోని "దైవబలం-అహంకారం - మాత్సర్యం - ఋణానుబంధం - తేనెబొట్లు" - అనే కథలు; "భగవద్గీతాప్రబోధం"లోని "స్థల మాహాత్మ్యం-మోక్షం కావాలంటే కోరికలన్నీ పూర్తిగా విడిచిపెట్టాలి- 'బలవాన్ ఇంద్రియగ్రామో...' - నిష్కామ కర్మయోగి జనకుడు - అపవిత్ర ఆహార ప్రభావం - ప్రతిజీవి కర్మబద్ధుడు" - అనే కథలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. వీటిలో "ప్రతిజీవి కర్మబద్ధుడు" అనే కథ ఎంతో విశిష్టమైనది. మనలో చాలామందికి మనసులో పీడించే ఒక అనుమానానికి ఒక ధర్మసందేహానికి ఈ కథ చక్కని సమాధానం చెపుతోంది.

మహాభారతంలో సాక్షాత్తు ధర్మదేవత అవతారమైన ధర్మరాజు మహాత్ముడు, సకల సద్గుణ సంపన్నుడు. అటువంటివాడు - సప్తవ్యసనాలలో ఒకటియైన జూదం ఎందుకు ఆడాడు? ఒకసారి కాదు, వరుసగా ఒక్కరోజులో రెండుసార్లు ఆడాడు. మొదటిసారి భార్య ద్రౌపదిని పణంగా పెట్టి ఆడాడు. ఇంతకన్నా దారుణం మరొకటి ఉంటుందా? శత్రువులు ఆమెకు వస్త్రాపహరణం చేసి అవమానించాలనుకున్నారు. కృష్ణపరమాత్మ ఆమెకు అక్షయ వస్త్రాలిచ్చి కాపాడాడు. ధృతరాష్ట్రుడు ఆమెకు వరాలిచ్చాడు. పాండవులు దాస్యవిముక్తులయ్యారు. వారి రాజ్యం వారికి వచ్చింది. తిరిగి తమ ఇంద్రప్రస్థానికి వెళ్ళిపోతున్నారు; ఇంకా వెళ్ళలేదు; మార్గమధ్యంలో ఉన్నారు. కుటిలుడు, అసూయాపరుడు అయిన దుర్యోధనుడు, చేజిక్కిన పాండవులరాజ్యం తన తండ్రివల్ల తిరిగి చేజారిపోయినందులకు మిక్కిలి ఆందోళనపడి, తండ్రిని బలవంతంగా ఒప్పించి, మార్గమధ్యంలో ఉన్న ధర్మరాజును పునర్ద్యూతానికి ఆహ్వానించాడు. ధర్మరాజు ఏమాత్రమూ సిగ్గులేకుండా, అంతకు కొన్ని ఘడియలకు పూర్వమే తన భార్యకు జరిగిన ఘోరమైన అవమానాన్ని కూడా పరిగణించకుండా, తిరిగివచ్చి, మళ్ళీ జూడమాడాడు. ఇంతకన్నా బుద్ధితక్కువపని ఈ ప్రపంచంలో ఎంత తెలివిమాలినవాడైనా చేస్తాడా? కాని సకల సద్గుణ సంపన్నుడైన ధర్మరాజు చేశాడు. రాజ్యమంతా ఒడ్డి, ఓడిపోయి, అడవులు పాలయ్యాడు. 12 ఏళ్ళు అరణ్యవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం చేశాడు. "ఇంత తెలివి తక్కువ పని ధర్మరాజు ఎందుకు చేశాడు?" అని ఏమాత్రం తెలివితేటలు ఉన్నవాడికైనా అనుమానం వస్తుంది. అంతేకాదు; ఇంకో విచిత్రం చూడండి. ధర్మరాజు అరణ్యవాసానికి వెడుతూ ఏమి పట్టుకొని వెళ్ళాడో తెలిస్తే పాఠకులు ఆశ్చర్యచకితులైపోతారు. తాను, తన నలుగురు తమ్ములు, తన భార్య అష్టకష్టాలు పడటానికి ముఖ్యకారణమైన జూదంలోని పాచికలు పట్టుకొని వెళ్ళాడు; బంగారు పాచికలు- వెండి పాచికలు - ఇనుప పాచికలు - మూడు సెట్లు భద్రంగా మూటకట్టుకొని తీసికొని వెళ్ళాడు! (ఈ పాచికలతోనే అజ్ఞాతవాసంలో విరాటరాజును ఆనందపరిచాడు.) ఇంతకన్నా వ్యసనపరుడు, బుద్ధిహీనుడు ఈ భూమండలంలో ఇంకెవడైనా ఉంటాడా? ధర్మరాజువంటి సకలసద్గుణసంపన్నుడు ఇలా ఎందుకు చేశాడు? ఇది మన అందరకూ వచ్చే అనుమానం. ధర్మరాజు పెద్ద తప్పుచేశాడని మనం అనుకోవడమే కాదు, ఆనాటి పాండవుల మునిమనుమడైన జనమేజయ మహారాజు కూడా

అనుకున్నాడు. ఈ విషయమై అతడు వ్యాసుణ్ణి నిలదీశాడు. ధర్మరాజు జూదం ఆడటం చాలా పెద్ద తప్పు అని వ్యాసునితో వాదించాడు. వ్యాసుడు చిరునవ్వునవ్వి, జనమేజయునకు ఒక చిత్రమైన పరీక్ష పెట్టాడు. ఆ విచిత్ర పరీక్షయే "ప్రతి జీవుడు కర్మబద్ధుడు" అనే అద్భుతకథ. మన ధర్మసందేహానికి ఈ కథయే సమాధానం! చదవండి.

"అశ్రుతర్పణం" అనే ఈ గ్రంథానికి "రచయిత - సంపాదకుడు - ప్రకాశకుడు" - ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు. వీరు ఈ పుస్తకానికి అనుబంధాలుగా కొన్ని ఆసక్తికరమైన విషయాలు రచించి, చేర్చారు.

అనుబంధం-1: మా అమ్మ నుడికారంలో 'గోదావరి' శబ్దం (భాషాశాస్త్ర వ్యాసం)

అనుబంధం-2: మా అక్కయ్యలు (కరుణరసభరితమైన సంఘటనలు)

అనుబంధం-3: లభించిన తిలక్ నూతన పద్యకవిత "కవితాసుమాంజలి"

అనుబంధం-4: తిలక్ - మరికొన్ని సంగతులు.

అనుబంధం-5: ఆదిభట్ల నారాయణదాసుగారు - శ్రీశ్రీ (నిజంగా జరిగిన ఒక హాస్య సంఘటన)

ఆత్మీయతలు, కుటుంబ సంబంధాలు అంతరించిపోతున్న ఈ రోజుల్లో అందరూ చదువదగిన మంచి పుస్తకం ఇది. ఎంతో శ్రమించి ఇటువంటి ఉత్తమగ్రంథాన్ని సిద్ధంచేసిన ఆచార్య తంగిరాలవారు మిక్కిలి అభినందనీయులు. అన్నగారి ఎడల తమకుగల భక్తిశ్రద్ధలతో రూ. 1,50,000-00 ఖర్చుచేసి, సర్వాంగ సుందరంగా దీనిని ముద్రించారు. తమ్ముళ్ళిద్దరూ వీరికి సహకరించారు. పుటలు: 472; వెల: రూ. 400-00. ప్రాప్తిస్థానం: ప్రముఖ పుస్తక కేంద్రాలు.



**మ॥ "కలయో! వైష్ణవమాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!**
**తలపన్నేరకయున్నదాననొ! యశోదాదేవిఁగానో! పర**
**స్థలమో! బాలకుడెంత! యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర**
**జ్వలమైయుండుట కేమిహేతువొ! మహాశ్చర్యంబు చింతింపగన్!"**

(-పోతన భాగవతము, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు)

# 3.3 కవుల ఛలోక్తులు

## 3.3.1 "కవులలోపల బమ్మరాకాసి వీవు!" (విశ్వనాథవారిని ఆటపట్టించిన మిత్రులు):-

"కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారి కాలంలో బెజవాడ (నేటి విజయవాడ)లో ఆయుర్వేదవైద్యుడైన గూడూరి వియ్యన్నగారు అనే సాహిత్య ప్రియుడు ఉండేవారు. ఆయన ఇల్లు ఒక సాహిత్యకేంద్రం. బెజవాడలోని సాహిత్యవేత్తలందరూ సాయంకాలం అయ్యేసరికి వియ్యన్నగారి యింటిలో సమావేశమయ్యేవారు. అటువంటి సమావేశాల్లో ఒకరోజు సాయంకాలం మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అప్పటికి బాగా యువకులైన రాచకొండ నరసింహమూర్తిగారు – వీరంతా వియ్యన్నగారి యింట్లో కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. ఇంతలో విశ్వనాథ సత్యనారాయణ గారు కూడా వచ్చి వారిలో చేరారు. అప్పుడు విశ్వనాథవారు అక్కడ సమావేశమైన సాహిత్యమిత్రులతో ఇలా అన్నారు:– "కవుల సాంగత్యం చేసి బాగుపడ్డవాడెవడూ నాకు కనిపించడం లేదు. మనల్ని దగ్గరకు చేర్చి దివాలా తీసినవాడేగాని బాగుపడినవాడు ఒకడూ లేడు. కావాలంటే నా విషయమే తీసుకోండి. నా పుస్తకాలు అంకితం పుచ్చుకున్న వాడెవడూ సవ్యంగా బ్రతికి బట్టకట్టలేదు" అంటూ ఎవరెవరికి ఎన్నెన్ని కష్టాలు వచ్చిందీ చెప్పడం ప్రారంభించారు. అదంతా సావధానంగా విని సహజగంభీరులైన కాటూరివారు సైతం నవ్వుకున్నారు. నవ్వులు ఆగీ ఆగకుండానే మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రివగారు శంఖంవొత్తినట్లు తమకంఠం ఎత్తి విశ్వనాథపై ఒక సీసపద్యం అందుకున్నారు:–

**సీ॥ పండువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుడు నీ కృతిచే దరిద్రుడయ్యె!"**

ఈ పద్యాన్నిగురించి పూర్తిగా చెప్పేముందు, విశ్వనాథవారు ఎవరెవరికి ఏయే కావ్యాలు అంకితమిచ్చారు, తరువాత వాళ్ళగతి ఏమైనది – అనే విషయాలు ముందుగా తెలియజేయాలి. లేకపోతే పద్యంలోని స్వారస్యం పాఠకులకు అర్థంకాదు.

**(1) "వేనరాజు" (నాటకం):–** కృతిభర్త: "పైడిపాటి" అగ్రహారీకుడైన బెల్లంకొండ

రాఘవరావుగారు. ఈ నాటకాన్ని అంకితం పుచ్చుకున్నాక ఆయన అగ్రహారం పోయి దరిద్రుడయ్యాడు!

**(2) "శృంగారవీథి" (కావ్యం):-** కృతిభర్త: నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు అయ్యవార్లు ఈయన 'పెన్నాడ' అగ్రహారీకుడు. ఈయనను "పెన్నాడ అయ్యవార్లు" అని పిలిచేవారు. వీరు విశ్వనాథవారి "శృంగారవీథి" కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నాక అగ్రహారం పోవడమే కాకుండా కనీసం ఉండటానికి ఇల్లు లేకుండా, చివరికి భోజనం కూడా లేకుండా పోయాడు!

**(3) "శ్రీమద్ రామాయణ కల్పవృక్షం" (మహాకావ్యం):-** దీనిని విశ్వనాథవారు స్వగ్రామంలో "నందమూరు"లోని శివునకు అంకితమిచ్చారు. ముక్త్యాల జమీందారుగారు కేవలం శ్రోతమాత్రమే! అంతమాత్రానికే ఆయన జమీందారీ ఊడిపోయింది.

**(4) "శశిదూతం" (కావ్యం):-** దీనిని ప్రముఖ రంగస్థలనటుడు, శ్రీకృష్ణపాత్రధారి బందా కనకలింగేశ్వరరావుగారు, ఏలూరులో క్రొత్తగా ఇల్లుకట్టుకొని, గృహప్రవేశ సమయంలో ఈ కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నారు. అంతే! ఆయన భార్య చనిపోయింది!

**(5) "కడిమిచెట్టు" (నవల):-** దీనిని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, "ఆంధ్రకేసరి" బిరుదాంకితులు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రం ముఖ్యమంత్రి అయిన టంగుటూరి ప్రకాశం పంతులుగారికి అంకితమిచ్చారు. అంతే! ఆయన ముఖ్యమంత్రి పదవి ఊడిపోయింది!

**(6) "త్రిశూలం" (నాటకం):-** దీనిని "దేశోద్ధారక" - "విశ్వదాత" అయిన కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి అంకితమిచ్చారు. ఇంతే సంగతులు - ఆయన స్వర్గస్థులయ్యారు!

పై సంఘటనలన్నీ పాఠకులు దృష్టిలో పెట్టుకుంటే, విశ్వనాథవారిని గురించి ఆయన మిత్రులు ఆశువుగా చెప్పిన సీసపద్యం బాగా అర్థమవుతుంది, కడుపుబ్బ నవ్వుకుంటారు!

ఇప్పుడు పద్యాన్ని గమనించండి. సీసపద్యంలో ఒక్కొక్క పాదాన్ని ఒక్కొక్క కవిమిత్రుడు చెప్పాడు:-

(1) మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు:–

**"పండువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుడు నీ కృతిచే దరిద్రుడయ్యె!"**

(2) తరువాతి పాదాన్ని వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు ఇలా పొడిగించారు: – **"కోరి నీ కృతిని గైకొన్న పెన్నాడయ్య**
**వారి కయ్యెను స్థలభాండశుద్ధి!"**

(3) మూడోపాదం రాచకొండ నరసింహమూర్తి చెపుతాడని వేదులవారు ప్రకటించారు. నరసింహమూర్తిగారు ముందు కొంత భయపడినా, తరువాత విశ్వనాథవారు కూడా ఉత్సాహపరచడంతో –

**"కొన్నది లేదు, ఊకొన్న పాపానికే**
**ముక్త్యాలదొర రాజ్యమునకు బాసె"** – అన్నారు.

(4) నాలుగో పాదం దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వంతు అయింది:–

**"శుభమంచు క్రొత్తింట జొచ్చుచు నీ కృతి**
**గొన్న లింగము కొంప కూలిపోయె!"** – అన్నారు.

("లింగము" అంటే "బందా కనకలింగేశ్వరరావుగారు". వారికి ప్రథమ భార్య గతించింది.) ఇంక ఎత్తుగీతి మిగిలింది.

**తే॥గీ॥ "జారె నీ 'కడిమి'ని టంగుటూరి పదవి!"**

– అన్నారు కాటూరి వెంకటేశ్వరరావుగారు ("కడిమి" అంటే "కడిమిచెట్టు" నవల.) సీసపద్యాన్ని మొదలు పెట్టిన బుచ్చిసుందరరామశాస్త్రిగారు మళ్ళీ అందుకొని

**"కూలె కాశినాథుడు నీ 'త్రిశూల' హతిని!"** – అన్నారు.

ఇంతవరకూ అయ్యాక కాటూరి వెంకటేశ్వరరావుగారు సీసపద్యం అల్లుతున్న కవులందరినీ నిలబడమన్నారు. అందరూ నిలబడ్డారు. "మీరంతా రెండు చేతులూ జోడించి, విశ్వనాథవారి వైపు తిరిగి, నేను చెప్పినట్టు చెప్పండి!" అని ఎత్తుగీతిలోని మిగిలిన రెండు పాదాలూ ఈ క్రింది విధంగా పూరించారు:–

**"కవులలోపల బమ్మరాకాసి వీవు**
**దండమురా బాబు! నీదు కైతలకు నీకు!"**

సీసపద్యం ఎత్తుగీతిలో సహా మొత్తం పూర్తి అయింది. అక్కడి వాతావరణమంతా నవ్వులతో నిండిపోయింది!

ఈ సంఘటనతో ప్రమేయం ఉన్న రాచకొండ నరసింహమూర్తిగారు ప్రముఖ హాస్యరచయిత "శ్రీ రమణ"గారితో చెపితే, ఆయన తన "హాస్యజ్యోతి" (2003)లో గ్రంథస్థం చేశారు. (చూ.పుటలు 134-136). "శ్రీరమణ"గారికి నా కృతజ్ఞతలు. తెలియజేస్తున్నాను.

ఇప్పుడు సీసపద్యమంతా ఒక్కచోట ఇస్తున్నాను. (పైన ముక్కలు ముక్కలుగా వ్యాఖ్యానంతో చెప్పాను. అది పాఠకులకు అంతగా తృప్తినివ్వక పోవచ్చును.)

"కవులలోపల బమ్మరాకాసి" (ఇది పద్యశీర్షిక).

**సీ॥ పందువంటి గృహస్థు పైడిపాట్యగ్రహా**
**రికుఁడు నీ కృతిచే దరిద్రుఁడయ్యె!**
**కోరి నీకృతిని గైకొన్న పెన్నాడయ్య**
**వారి కయ్యెను స్థలభాండశుద్ధి!**
**కొన్నదిలేదు, ఊకొన్న పాపానికే**
**ముక్త్యాలదొర రాజ్యమునకుఁ బాసె!**
**శుభమంచుఁ గ్రొత్తింటఁ జొచ్చుచు నీ కృతిఁ**
**గొన్న 'లింగము' కొంప కూలిపోయె!**
**తే.గీ. జాతె నీ 'కడిమి'ని టంగుటూరి పదవి!**
**కూలె కాశినాథుఁడు నీ 'త్రిశూల' హతిని!**
**కవులలోపల బమ్మరాకాసి వీవు**
**దండమురబాబు! నీదు కైతలకు నీకు!!"**

(ఆధారం : శ్రీరమణగారి 'హాస్యజ్యోతి')

## 3.3.2 విశ్వనాథవారి సౌందర్యదృష్టి:-

పరమేశ్వరుని సృష్టియైన ఈ చరాచరప్రకృతిలో దాగియున్న అద్భుత సౌందర్యాన్ని చూడగలిగిన దృష్టి గలవాడే మహాకవి అవుతాడు. ఈ సౌందర్యదృష్టి ఆకవిని జీవితాంతమూ వదలిపెట్టదు. ఒక మహాకవి జీవితంనుండి ఒక తార్కాణం. 1976 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారికి జబ్బుచేసి చాలా సీరియస్ అయింది. శిష్యులు అభిమానులు ఆయన్ని విజయవాడనుండి గుంటూరు తీసికొనివెళ్ళి, అక్కడ పెద్ద ఆసుపత్రిలో చేర్చించారు. అప్పటికి పది పదిహేను

రోజులనుండి రోగంతోబాధపడుతూ ఉండటంవల్ల వారిగడ్డం బాగా మాసిపోయింది. అందువల్ల ఆయన తన శిష్యుల్ని దగ్గరకు పిలిచి: "ఒరేయ్! గడ్డం గీసుకోవాలిరా!" అన్నారు. వాళ్లు కొంచెం అసహనంగా – "ఇదేమిటండీ! పుట్టెడు రోగంతో బాధపడుతూ ఇప్పుడు గడ్డం గీసుకోవడం ఏమిటండీ?" అన్నారు గట్టిగా. అప్పుడు ఆయన చిరునవ్వు నవ్వుతూ: "ఒరేయ్ ఇంత అందమైన నర్సులు ఈ ఆసుపత్రిలో అటూ ఇటూ తిరుగతూ ఉంటే నేను గడ్డం గీసుకోకుండా ఉంటే ఏం బాగుంటుందిరా?" అన్నారు. శిష్యులందరూ పగలబడి నవ్వుకున్నారు. అంటే మరణోన్ముఖుడై ఉన్నప్పుడు కూడా మహాకవిలో సౌందర్యదృష్టి ఏమాత్రమూ నశింపదు – అనడానికి ఇది గొప్ప ఉదాహరణం!

## 3.3.3 విశ్వనాథవారి పీఠికలు:-

**పీఠిక-1:** విశ్వనాథవారు వివిధ కవుల కావ్యాలకు వ్రాసిన కొన్ని పీఠికలలో ఎంతో వ్యంగ్యము, హాస్యము ధ్వనిగర్భితంగా ఉంటాయి. 1969లో వి.వి.గిరిగారు భారతరాష్ట్రపతిగా నీలం సంజీవరెడ్డిగారిమీద గెలుపొందారు (ఇందిరాగాంధీ పన్నిన కుట్రవల్ల). గిరిగారి ధర్మపత్ని శ్రీమతి సరస్వతీబాయిగిరిగారు "బీజాక్షరమాల" అనే పేరుతో శివుని మీద కొన్ని "కందపద్యాలవంటివి" వ్రాసి, ఒక చిన్నపుస్తకంగా ముద్రించారు. నిజానికి అవి కందపద్యాలు కావు. కందపద్య లక్షణాలు కాని, గణాలు యతి ప్రాసలు కాని వాటిలో ఏమీ లేవు. ఒక పాదం పొట్టిగాను, ఇంకొక పాదం పొడుగ్గాను వ్రాశారు. అంతే! ప్రతి పద్యం చివర్లో "శివా" అణే మకుటం ఉంది. ఆ పుస్తకాన్ని దేశంలోని ప్రముఖ కవులకు, పండితులకు, విమర్శకులకు – అందరికీ పంపించి, వారి వారి అభిప్రాయాలు సేకరించారు. ఆమె భారతరాష్ట్రపతిగారి భార్య! అందుకు (శ్రీశ్రీ, రాళ్లపల్లివారలతోసహా) ఆ "కావ్యం" చాలా చాలా గొప్పగా ఉందని ప్రశంసిస్తూ అభిప్రాయాలు వ్రాసి పంపించారు. అవన్నీకలిపి ఒక ప్రత్యేక పుస్తకంగా వేశారు సరస్వతీబాయిగిరిగారు. అసలు పుస్తకంకన్నా ఈ కొసరుపుస్తకం పెద్దదిగాఉంది. "బీజాక్షరమాల" 40–50 పుటలు ఉంటే, ఈ అభిప్రాయాల పుస్తకం 80–100 పుటలు ఉంది. "చద్దికన్నా గోంగూర బలం" అన్నట్టుగా ఉంది. ఆ బీజాక్షరమాలను

కవులు, పండితులు, విమర్శకులు అందరూ గొప్పగా ప్రశంసించినా ఒక్క విశ్వనాథవారు మాత్రం ఎంతో వ్యంగ్యంగా ధ్వనిగర్భితంగా "కవయిత్రి"ని అధిక్షేపించారు. ఆయన కవిసమ్రాట్ కాబట్టి వారి పీఠికను ముందుగా ముద్రించారు సరస్వతీబాయిగిరిగారు. విశ్వనాథవారి పీఠికను ఉదాహరించే ముందు, ఒక సంఘటన చెప్పాలి.

నేను 1969లో ఎస్వీ.యూనివర్సిటీలో యు.జి.సి. సీనియర్ రీసెర్చి ఫెలోగా ఉన్నాను. రాష్ట్రపతిగారు తిరుపతికి వచ్చారు. తిరుమలకొండమీద "బీజాక్షరమాల" ఆవిష్కరణసభ పెట్టారు. (నిజానికి కొండమీద పుస్తకావిష్కరణలు, సభలు, సమావేశాలు పెట్టకూడదని తి.తి.దే. నియమం. కాని అది రాష్ట్రపతిగారి ఆదేశం!! "రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా?") తిరుపతిలో ఉన్న కవి పండితులందరినీ కొండమీదికి పట్టుకొని పోయారు. వారిలో గురువర్యులు జి.యన్.రెడ్డిగారూ నేనూ కూడా ఉన్నాం. కారులో కొండమీదికి వెడుతుంటే జి.యన్.రెడ్డిగారు "బీజాక్షరమాల" అభిప్రాయాల పుస్తకం నాచేతికిచ్చి, విశ్వనాథవారి పీఠికను నాకు చూపుతూ! "సుబ్బారావ్ – ఈ పీఠిక చదువు!" అన్నారు. నేను చదివాను. ఆశ్చర్యపోయాను! ఆ పీఠిక ఈ క్రింది విధంగా ఉంది:-

**"ఇది ఒక గ్రంథము కాదు. అక్షరమాల. అక్షరముల వాసన. ఇందులో అక్షరములు లేవు. శబ్దములు లేవు. అన్వయము లేదు. ఉన్నను వాని దారి వానిదే! ఒక పెద్ద అఱపు. ఒక పెద్ద ఆక్రోశము. ఒక జీవుడు – ఆజీవుడు స్త్రీ. ఇప్పుడు గొప్ప స్త్రీ, ఒక గొప్ప పదవిలోనున్న పురుషుని భార్య. కడివెడు పిల్లలను కన్న స్త్రీ. ఆమె సంతతి తామరతంపరగా నున్నది. గొప్ప లౌకికజ్ఞానము కల స్త్రీ. తన భర్త పదవికి తాను హేతువు ననుకొన్నంత వివేకవతి! ఈ జీవునకు, ఈ అఱచిన జీవునకు సంబంధములేదు. ఇది ఒక ఆశ్చర్యము. పూర్వజన్మ విశిష్ట సంస్కారమో, ఒక లక్షణమో, ఒక విలక్షణమైన సాధనమో కాని, ఈ అఱపులో ఆ జీవుడు – లోకమునందొక లౌకికజ్ఞానము కలవాడన్న లక్షణమున్నది. అది ఇది గ్రంథమనిపించుచున్నది.**

**ఈ అఱచిన యీమె, యీమెకానిచో నిది సహజము. ఎవరో యోగిని. ఒక యోగినియొక్క యున్మత్తప్రలాపము! కాని యీమె, యీమె సాధన యొక ఆశ్చర్యము!**

**ఈ అఱుపునకు, ఈ కేకకు, ఈ ఆక్రోశమునకు ఒక వైలక్షణ్యము తెచ్చినది. ఇట్టి సాధన నాన్యతోదర్శనీయము. పరమేశ్వరుడు విన్నాడు. వినక తప్పదు. అట్టికేక!"**

ఈ పీఠిక చదివి నేను గురువర్యులతో కలిసి హాయిగా నవ్వుకున్నాను. ఒక రకంగా ఆశ్చర్యపోయాను. ఉన్నత పదవులలో నున్న వ్యక్తులను కూడా లెక్కచేయకుండా తాను చెప్పదలచుకొన్న సత్యాన్ని ఎంతో ధ్వనిగర్భితంగా చాటిచెప్పారు–కవిసమ్రాట్ విశ్వనాథ. పై పీఠికలో నేను క్రీగీత ఉంచిన వాక్యాన్ని జాగ్రత్తగా పరిశీలించండి. **"తన భర్త పదవికి తానే హేతువు ననుకొన్నంత వివేకవతి"** దీనిలో అత్వసంధి ఉంది: **"అనుకొన్నంత + అవివేకవతి"** అని ధ్వని!

ఈ "బీజాక్షరమాల" ప్రకటింపబడిన కొద్దిరోజుల తర్వాత ఆంధ్రపత్రిక దినపత్రిక ఆదివారంసంచికలో ఒక అజ్ఞాతకవి ("శిశిర" అనే గుప్తనామంతో) "శివుడికి తలనొప్పి"అనే పేరుతో కొన్ని "కందపద్యాలు" వ్రాశాడు. ఆ పద్యాలభావం తెలియజేస్తాను. ఒకరోజు శివుడు దిగాలుగా తలపట్టుకొని కూర్చున్నాడు. పార్వతి వచ్చి "ఏమిటండీ! అలా కూర్చున్నారు?" అంది. శివుడు "విపరీతమైన తలనొప్పితో బాధపడుతున్నాను" అన్నాడు. "ఎందుకొచ్చింది తలనొప్పి?" అని అడిగింది పార్వతి. "భూలోకంలో ఒక భక్తురాలు 'శివా!' అనే మకుటంతో కొన్ని పద్యాలు వ్రాసి నాకు వినిపించింది" అన్నాడు శివుడు. "అడ్డమైనవాళ్ల పద్యాలూ వినవద్దని ఎన్నిసార్లు చెప్పాను మీకు?" అని మందలిస్తుంది పార్వతి. శివుడు: "అది నాకు అంకితమట! చదవక ఛస్తానా మరి?" అంటాడు. పార్వతి: "వెల్లుల్లి నూరితేనా? బెల్లము సున్నమ్ము పట్టువెయ్ మంటారా?" అని అడుగుతుంది. శివుడు: "పట్టొద్దుకానీ, ఆ గూట్లో యాస్పిరిన్ మాత్ర ఉంటుంది పట్టుకురా! ఇక మీదట కవిత ముట్టుకుంటే ఒట్టు!" అంటాడు. పూర్తి పద్యాలు దిగువ ఇస్తున్నాను:–

## శివుడికి తలనొప్పి

రచన: "శిశిర"

**"పరమేశా! ఏమైనది?**
**తరచుగ తలనొప్పి మీకు తగులుచునుండెన్!"**
**"గిరిజా! కవిత్వమంటూ**
**అరుదుగ సరుకొకటి దిగుమతైనది లేవే!"** 1

**"అది మీరెందుకు చదివిరి?**
**కుదురుగ తాండవము నేర్చుకొనకుండ శివా!"**
**"చదవక ఛస్తానామరి,**
**అది నా కంకితమొసంగిరట శర్వాణీ!"** **2**

**"అంకితమును పుచ్చుకొనే**
**వెంకాయ్‌లందరునూ చదివేస్తున్నారా?**
**శంకర! భక్తవశంకర!**
**ఇంకా ఈ దొడ్డిదోవనే ఉన్నారా?"** **3**

**"మల్లయ్యా! అని నా చెవి**
**చిల్లులుపడ అరతు రేమిచేతునె పారూ!"**
**"వెల్లుల్లి నూరితేనా?**
**బెల్లము సున్నమ్ము పట్టువెయ్‌మంటారా?"** **4**

**"పట్టెందుకుగానీ ఆ**
**గూట్లో ఒక యాస్పిరునుది గోళీ ఉంటే**
**పట్టుకురా! ఇక నీమీ**
**దొట్టు సుమీ! కవిత మట్టుకుంటే గౌరీ!"** **5**

**పీఠిక-2:** విశ్వనాథవారికి బీర్నీడి మోషేకవి, మల్లవరపు జాన్, యస్.టి. జ్ఞానానందకవి మొదలైన ఎందరో దళితకవులు (క్రైస్తవులు) ప్రియశిష్యులుగా ఉండేవారు. వారికి గురువుగారంటే ప్రాణం. జ్ఞానానందకవిగారయితే 24 గంటలూ విశ్వనాథవారితోనే ఉండేవారు. ఒకసారి ఆయన ఒక పద్యకావ్యం వ్రాశారు. దానికి పీఠిక వ్రాసిపెట్టమని గురువుగారికిచ్చారు. యస్.టి. జ్ఞానానందకవి గారి పూర్తిపేరు "సురగాలి తిమోతి జ్ఞానానందకవి". విశ్వనాథవారి పీఠిక ఇలా ప్రారంభమవుతుంది:-

"సురగాలి" అనగా "సుడిగాలి". "జ్ఞానానందుడు" అనగా "తనకు జ్ఞానము కలదని ఆనందించువాడు" కాని నడుమనున్న ఈ "తిమోతి" యననేమో తెలియకున్నది.

## 3.3.4 "అతివినయం - అతిధూర్తం!"

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి మొదటి భార్యకు ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్లు. కొడుకు "అచ్యుత దేవరాయలు" మంచి కవిగా సుప్రసిద్ధుడు. కుమార్తెలలో రెండవ ఆమె పేరు "స్వాహాదేవి". ఆమెను విశ్వనాథవారు తన మేనల్లుడైన శ్రీ గుంటూరు సుబ్బారావుగారికిచ్చి పెండ్లిచేశారు. కాని ఆయన పరమదుర్మార్గుడు. భార్య స్వాహాదేవిగారిని ఎన్నో చిత్రహింసలకు గురిచేశాడు. అందువల్ల విశ్వనాథవారికి ఆ చిన్నల్లుడంటే ఒళ్లు మంట. ఆతనిమీద పీకలదాకా కోపం ఉండేది.

1970లో జ్ఞానపీఠ బహుమతివచ్చాక ఒకసారి విశ్వనాథవారు హైదరాబాద్ వెళ్లారు. డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారి రెండవ భార్యయైన రాజకుమారి ఇందిరాదేవి ధనరాజ్‌గిరిగారు తమ జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్‌లో జ్ఞానపీఠ పురస్కృతుడైన విశ్వనాథవారికి బ్రహ్మాండమైన సన్మానసభ ఏర్పాటు చేశారు. నగరంలో ఉన్న కవి పండితులందరూ ఆ సభలో పాల్గొన్నారు. ఆ తరువాత శేషేంద్రశర్మగారు తమ గురువుగారైన విశ్వనాథవారిని ఆ ప్యాలెస్‌లో నాలుగు రోజులపాటు తనతోపాటు ఉంచేసుకున్నారు. అప్పుడు ఒకరోజు విశ్వనాథవారు మధ్యాహ్నం భోజనం చేసి, కాసేపు విశ్రమించి, లేచి, మంచం మీద కూర్చున్నారు. ఆయన మంచి మూడ్‌లో ఉన్నారని గ్రహించి శేషేంద్రశర్మగారు విశ్వనాథవారిని సమీపించి: "అయ్యా! గురువుగారూ! దివాకర్ల వేంకటావధానిగారు చాలా మంచివారు కదండీ?" అని ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు విశ్వనాథవారు ఈ క్రింది విధంగా జవాబిచ్చారు:-

"ఆ! అవును అవధానీ మంచివాడే! మా అల్లుడు గుంటూరు సుబ్బారావూ మంచివాడే! అయితే ఇద్దరికీ ఒక చిన్న తేడా వుంది. చెపుతాను, శ్రద్ధగా విను. అవధాని భుజంమీద కండువా వేసుకొని, చేతిలో ఒక చిన్న సంచీ పట్టుకొని హడావిడిగా రోడ్డుమీద వెడుతూ ఉంటాడనుకో! అప్పుడు ఒక కుక్కపిల్ల ఎదురుపడి: "అయ్యా అవధానిగారూ! ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగిందనుకో; వెంటనే అవధాని చేతులు జోడించి నమస్కరించి: అయ్యా! నమస్కారం! ఆంధ్రసారస్వత పరిషత్తులో నా ఉపన్యాసం ఉంది వెడుతున్నానండి! చిత్తగించండి!" అంటాడు.

ఇక మా గుంటూరు సుబ్బారావు సంగతి చెబుతా, విను. మా సుబ్బారావుకి కాళ్లకీ చేతులకీ పెద్ద పెద్ద సంకెళ్లువేసి, నడివీధిలో మండుటెండలో నిలబెట్టామనుకో!

(ఆ అల్లుణ్ణి అలాగ శిక్షించాలని విశ్వనాథవారికి మనసులో కోరిక ఉంది కాబోలు!) అప్పుడు భారతదేశ ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారు ఆ దారిని వెడుతున్నారనుకో! మా సుబ్బారావు ఆయన్ని చూచి, తోకత్రొక్కిన త్రాచుపాములా లేచి, నెహ్రూగారితో: "ఏరా! నేనిక్కడ వున్నా, నన్ను చూడకుండా వెళ్లిపోతున్నావ్? కళ్లు నెత్తికెక్కాయా? ఇలా రారా? నా జేబులో బీడికట్ట, అగ్గిపెట్టె ఉన్నాయి. ఒక బీడి తీసి నా నోట్లో పెట్టి, వెలిగించి పోరా!" అంటాడు. ఇదీ అవధానికీ మా సుబ్బారావుకీ ఉన్న తేడా! తెలిసిందా?" – అన్నారు విశ్వనాథవారు. శేషేంద్రవారు పగలబడి నవ్వారు.

(ఈ విషయాన్ని శేషేంద్రగారు నాతో స్వయంగా చెప్పారు – తంగిరాల)

## 3.3.5 "జేబులో పిస్తోలు లేదు కదా!":-

ఒకసారి నేను ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎం.ఏ.(తెలుగు) పరీక్ష పేపర్లు దిద్దడానికి (స్పాట్ వాల్యుయేషన్) విశాఖపట్టణం వెళ్లాను. ఆ సమయంలో ఒక రోజు ప్రజాకవి కాళోజి నారాయణరావుగారు విశాఖపట్టణం వచ్చారు. విశ్వవిద్యాలయ తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య యస్వీజోగారావుగారు ఓ సాయంత్రంవేళ కాళోజీగారిని తమయింటికి ఆహ్వానించారు. ఆ విషయం ఎక్జామినర్లుగా వచ్చిన నాలాంటి తెలుగు ప్రొఫెసర్లందరికీ తెలియజేశారు జోగారావుగారు. మేమంతా ఆ సాయంత్రం వారియింటికి వెళ్లాం. వారిక్వార్టర్సు పెద్దమేడ. మేడపైన జోగారావుగారి స్టడీరూం. మేమంతా మేడమీదికి వెళ్లి కాళోజీగారి రాకకోసం ఎదురుచూస్తున్నాం. పది–పదిహేను నిమిషాల్లో కాళోజిగారు, జోగారావుగారి యింటికి వచ్చి, మేడమెట్లు ఎక్కుతూ పైకి వస్తున్నారు. జోగారావు, మా అందరితోనూ కలిసి, కాళోజీగారికి స్వాగతంచెప్పడానికి మెట్లవైపు వెళ్లారు. కాళోజీగారు మెట్లన్నీ ఎక్కి పైకిరాగానే జోగారావుగారు వారిపాదాలకు నమస్కరిస్తూ: "అన్నా! కాళన్నా! నువ్వు మహాత్ముడివి!" అన్నారు. వెంటనే కాళోజీగారు "జేబులో పిస్తోలు లేదుకదా!" అన్నారు. మేమంతా గొల్లున నవ్వాం! 1948లో గాడ్సే, గాంధీ మహాత్ముని పాదాలకు నమస్కరించి, లేచి, కాకీ నిక్కరు జేబులోనుండి పిస్తోలుతీసి, ఠప్! ఠప్‌మని కాల్చివేశాడు. మహాత్ముడు "హేరాం! హేరాం!"అంటూ నేలకు ఒరిగిపోయాడు. కాళోజీగారు స్వాతంత్ర్య సమరయోధులు

– ఎప్పుడూ పొందూరు ఖద్దరు జరీఅంచుపంచ కట్టి, ఖద్దరులాల్చీ తొడుగుకొని, బుజంపైన ఖద్దరు కండువా వేసుకొని, తెల్లని గుబురు మీసాలతో మంచి హుందాగా ఆకర్షణీయంగా ఉండేవారు! ముఖంలో రాజసం ఉట్టిపడుతూ ఉండేది!

## 3.3.6 "చచ్చికూడా మనుషుల్ని తనచుట్టూ త్రిప్పుకుంటున్నాడు!"

**– యస్వీ జోగారావుగారు**

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా పనిచేసిన గొప్ప పండితుడు, కవి, పరిశోధకుడు అయిన ఆచార్య యస్వీ. జోగారావుగారు యూనివర్శిటీకి దగ్గరకో ఉన్న సిరిపురం క్వార్టర్స్‌లో ఉండేవారు. చుట్టూ మామిడిచెట్లు, మధ్యలో పెద్దమేడ, బాగా ఉండేది ఇల్లు. ఆ యింటికి ఎదురుగుండా నాలుగురోడ్ల కూడలి ఉంది. దానిని "సిరిపురం జంక్షన్" అంటారు. ఆ జంక్షన్ మధ్యలో ఆంధ్ర విశ్వవిద్యాలయం మొట్టమొదటి ఉపకులపతి అయిన డా॥ సి.ఆర్.రెడ్డి (కట్టమంచి రామలింగారెడ్డి) గారి విగ్రహం ఉంది. ఆ జంక్షన్ నాలుగురోడ్ల కూడలి కావడంతో దానిచుట్టూ ఎప్పుడు మనుషులు, వాహనాలు హడావిడిగా తిరుగుతూ ఉంటాయి. ఒకసారి జోగారావుగారు ఆ జంక్షన్ నడుమ ఉన్న డా॥ రెడ్డిగారి విగ్రహాన్ని నాకు చూపెడుతూ: "చూడు ఆ సి.ఆర్. రెడ్డిగారు బ్రతికి ఉన్నంతకాలమూ మనుషుల్ని తన చుట్టూ త్రిప్పుకున్నాడు. చచ్చిపోయాక కూడా అదే పనిచేస్తున్నాడు!" అన్నారు.

## 3.3.7 "మహప్రభో! వడ్డించమనండి, వచ్చేస్తున్నాను!"

**–ఆదిభట్ల నారాయణదాసుగారు:**

ఆనందగజపతి మహారాజుగారు ప్రతిశుక్రవారమూ తన ప్యాలెస్‌లో కవులకు, పండితులకు, సంగీత విద్వాంసులకు, ఇతర పురప్రముఖులకు గొప్ప విందు ఏర్పాటు చేస్తూ ఉండేవారని ఆదిభట్లనారాయణదాసుగారు తమ స్వీయచరిత్ర "నాయెఱుక"లో వ్రాశారు. అటువంటి ఒక విందులో జరిగిన హాస్య సంఘటనను గురించి శ్రీశ్రీగారు నాతోను, మిత్రుడు ప్రొ॥ ఆర్వీయస్. సుందరంతోను విపులంగా వర్ణించి చెప్పారు. దాసుగారు తమ స్వీయచరిత్రలో రెండు సంకేతపదాలు వాడారు: (1) "చిన్నగురుడు" (అంటే "నల్లమందు" లేక "గంజాయి"); (2) "పెద్దగురుడు" (అంటే "విస్కీ" లేదా "బ్రాందీ"). ఈ రెండూ దాసుగారికి చాలా యిష్టమైన

అలవాట్లు! ఇందులో "పెద్దగురుడు" ప్రభావాన్ని గురించి శ్రీశ్రీగారు మాకు వివరించినది:-

ఒకసారి ఆనందగజపతిమహారాజుగారు లండన్‌నుండి ప్రత్యేకంగా ఒక "పెద్దగురుణ్ణి" (స్కాచ్ విస్కీని) ఆవకాయ జాడీ అంత పెద్దసీసాతో తెప్పించారు. కోటలో ఒక శుక్రవారం కవిపండితులకు, సంగీతవిద్వాంసులకు, పురప్రముఖులకు బ్రహ్మాండమైన పార్టీ ఏర్పాటు చేశారు. దాసుగారు సంతోషంగా విచ్చేశారు ఆ పార్టీకి. ఆరోజు పానగోష్ఠి అనంతరం భోజనాలు కూడా సిద్ధంచేశామని మిత్రులందరికీ ముందుగానే చెప్పారు రాజావారు. పార్టీ మొదలయింది. అందరూ కొద్దికొద్దిగా స్కాచ్ సేవిస్తున్నారు. కబుర్లు చెప్పుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. 30-40 మంది అతిథులు ఒక్కొక్కరు తమకు కావలసినంత "తీర్థం" పుచ్చుకున్నా కూడా ఇంకా కొంచెం మిగిలిపోయింది అట్టడుగున సీసాలో – (అంత పెద్ద సీసా అది!). దాసుగారు మద్యపాన ప్రియులు. "ఈ కాస్తా ఉంచడం ఎందుకూ! నేను సేవిస్తాను!" అని ఆ మిగిలిన కాస్త పెద్దగురుణ్ణి కూడా తీసేసుకున్నారు! ఆనందలోకాల్లో విహరిస్తున్నారు...

తరవాత అందరూ భోజనాలకు కూర్చున్నారు. మహారాజావారు అతిథులందర్నీ స్వయంగా పర్యవేక్షిస్తున్నారు. నారాయణదాసుగారు కనిపించలేదు. "దాసుగారేరీ?" అని అడిగారు మహారాజావారు. "ఆయన ఇల్లు తమకోటకు సమీపంలోనే ఉంది కదండీ! ఇంటికి వెళ్ళిపోయి ఉంటారు!" అన్నారు కొందరు కవిపండితులు. "ఓహో! అలాగా!" అన్నారు మహారాజావారు. షడ్రసోపేతమైన రాజావారి విందును అందరూ మిక్కిలి ఆప్యాయంగా ఆరగించారు. మరికొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడుకొని ఎవరి ఇళ్ళకు వాళ్లు వెళ్ళిపోయారు.

మహారాజావారు ప్రతిదినమూ తెల్లవారుజామున ఐదుగంటలకు లేస్తారు. వారి పడకగదికి దగ్గరలోనే శౌచాలయం. దాని ప్రక్కన నాలుగు పలకల పెద్ద సిమెంటు తొట్టి. ప్రతి దినమూ సాయంకాలం ఆరుగంటలకల్లా ఆ సిమెంటు తొట్టెను నీళ్ళతో నింపివేయాలి. అది రాజావారి స్టాండింగ్ ఆర్డర్స్! విందు జరిగిననాడు సాయంకాలం కూడా సేవకులు. ఆ తొట్టెను యథాప్రకారం నీటితో నింపివేసి ఉంచారు. తెల్లవారుజామున లేచిన రాజావారు ఒక పెద్ద చెంబు తీసికొని, నీళ్ళకోసం తొట్టెలో ముంచబోయారు. ఇంతలో ఆ తొట్టెలోనుండి:

"మహాప్రభో! వడ్డించమనండి! వచ్చేస్తున్నాను!!" అని నారాయణదాసుగారి మాటలు వినబడ్డాయి! రాజావారు ఆశ్చర్యంతో తొట్టిలోకి తొంగిచూశారు. దాసుగారు ఆ చల్లని నీటితొట్టెలో హాయిగా పడుకొని ఉన్నారు!

రాత్రి పెద్దగురుణ్ణి ఫుల్‌గా సేవించిన దాసుగారు, లఘుశంక తీర్చుకొనేందుకు వెడుతూ ఆ నీటితొట్టెలో పడిపోయారు. తెల్లవారుజామున ఐదుగంటలకు నిషాకొంత తగ్గి మహారాజుగారిని గుర్తించారు! పానగోష్ఠి అయిపోయిన తరువాత భోజనాలు ఉన్నాయని రాజావారు చెప్పిన సంగతికూడా జ్ఞప్తికి వచ్చింది! అందువల్ల! "మహాప్రభో! వడ్డించమనండి! వచ్చేస్తున్నాను!" అన్నారు.

రాజావారు పకపక నవ్వుకొని, దాసుగారిని తొట్టెలోనుండి బయటకు తీయించి, పొడిబట్టలు కట్టించి, భద్రంగా వారిని ఇంటికి పంపించారు – ఆనందగజపతి మహారాజావారు!

## 3.3.8 హంపీ శిథిలాలు!:–

బళ్ళారి రాఘవగారి అభినందన సభకు శ్రీశ్రీ, శివశంకరశాస్త్రి, దేవులపల్లి యిత్యాదులు వెళ్ళారు. రాఘవాచార్యులగారింట్లోనే వీరందరికీ ఆతిథ్యం. అప్పటికి రాఘవగారు బాగా వయోవృద్ధులైపోయారు. నాలుగైదు రోజులు వీరంతా సరదాగా వారితో కాలక్షేపం చేశారు. తిరుగు ప్రయాణానికి వీరు సిద్ధం అవుతుంటే "ఈ దగ్గర్లోనే హంపీ వుంది. అక్కడ చారిత్రక శిథిలాలు చూచి పోదురుగాని" అన్నారు రాఘవ. వెంటనే శ్రీశ్రీ "మిమ్మల్ని చూస్తున్నాంగా..." అన్నారు. రాఘవగారితో సహా అంతా నవ్వారు.

## 3.3.9 తిట్టు ఖరీదు రెండు రూపాయలు:–

* ఆఫీసు ఎక్కౌంట్స్ రాయడంలో నిష్ణాతుడైన శ్రీఅనుమకొండ సూర్య నారాయణగారు, సుప్రసిద్ధ చిత్రనిర్మాత, దర్శకుడు అయిన శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి వద్ద ప్రొడక్షన్ మేనేజరుగా చాలాకాలం పనిచేశారు. శ్రీ రామబ్రహ్మం యెంత విశాల హృదయుడో అంత కోపిష్ఠి కూడా. ప్రతి చిన్నవిషయానికి ఆగ్రహపడి ఆఫీసులో అందర్నీ కసురుకునేవారు. వారి ఉదార స్వభావం అందరికీ తెలిసిందే కనుక యెవరూ అంతగా పట్టించుకునేవారు కాదు.

ఒక చిత్రం పూర్తి అయి విడుదల అయ్యాక ఆఫీసులో అందరికీ రిలీజ్ లెటర్లు యిచ్చారు. శ్రీ సూర్యనారాయణగారికి కూడా యిచ్చి, చిత్రనిర్మాణపు లెక్కలన్నింటినీ అప్పజెప్పమన్నారు. ఆ లెక్కల జాబితాలో "నన్ను తమరు ఈ చిత్రనిర్మాణసందర్భంలో 642 సార్లు తిట్టారు" అని చివరన రాశారు శ్రీ సూర్యనారాయణగారు. ఇది చూసిన శ్రీ గూడవల్లివారు తిట్టుకు రెండు రూపాయల వంతున లెఖ్ఖకట్టి 1284 రూపాయలను అందజేసి తన ఉదార స్వభావాన్ని ప్రదర్శించుకున్నారు.

* 'వంశవృక్షం' నిర్మాత బాపుగారితో ఆమాటా ఈమాటా మాట్లాడుతూ "ఇంతకుముందు మీరు ట్రాజెడీలు తీసినట్లులేదు" అన్నారు. "అఫ్‌కోర్స్... తీశాక చాలా చిత్రాలు ట్రాజెడీలే అయ్యాయి'' అన్నారు బాపు చిరునవ్వులోంచి.
* కాకనాడలో జరిగిన సన్మానసభలో ప్రసంగిస్తూ శ్రీశ్రీ - "నన్ను మొట్టమొదట అచ్చేసి దేశంమీదకు వదిలింది పురిపండా" అన్నారు. ఆయన మొదటి కావ్యం పబ్లిషర్ శ్రీ పురిపండా.

## 3.3.10 పద్మశ్రీ గరికిపాటివారి పేరడీలు :-

**"మహాసహస్రావధాని"-"పద్మశ్రీ" డా॥ గరికిపాటి నరసింహారావుగారు చెప్పిన ఒక పేరడీ శ్లోకం:-**

పంచతంత్రంలో ఒక శ్లోకం ఉంది. ఉత్తమురాలైన ధర్మపత్ని ఎలా ఉండాలో ఈ శ్లోకంలో చెప్పబడింది:-

**శ్లో॥ కార్యేషు దాసీ - కరణేషు మంత్రీ**
**రూపేచ లక్ష్మీ - క్షమయా ధరిత్రీ ।**
**భోజ్యేషు (స్నేహేచ) మాతా - శయనేషు వేశ్యా**
**షట్కర్మయుక్తా - కులధర్మపత్నీ॥**

తా॥ ఇంటిపనులలో దాసిగాను, కార్యాలోచనలో మంత్రిగాను, రూపసంపదలో లక్ష్మీదేవివలెను, ఓరిమియందు భూదేవివలెను, భోజనం పెట్టడంలో (లేదా, స్నేహంలో) తల్లివలెను, పడకగదిలో వేశ్యవలెను - ప్రవర్తిస్తూ, నేర్పరిగా ఉన్న స్త్రీయే "కులపత్ని" అనదగును.

ఇటీవల ఒకసారి డా॥ గరికిపాటి నరసింహారావుగారు అమెరికాలో ఒక అష్టావధానం చేస్తూ ఉంటే, అప్రస్తుత ప్రసంగం చేసే వ్యక్తి పై శ్లోకాన్ని ఉదాహరించి, "ఈ శ్లోకంలో ఉన్న విషయాలు ఒక పురుషుడు తన భార్య ఎలా ఉండాలో కోరుకొనే విషయాలు; అలాకాకుండా, నేటి సమాజంలోని భార్యలు తమ భర్తలు ఎలా ఉండాలని కోరుకుంటున్నారో, ఈ శ్లోకానికి పేరడీ (Parody)గా మరొక శ్లోకం చెప్పండి" అని అడిగితే – డా॥ గరికిపాటివారు చెప్పిన శ్లోకం:–

**శ్లో॥ కార్యేషు మిక్సీ – శయనేషు సెక్సీ,**
**భరణే చ కూలీ – తరుణీషు శూలీ**
**రూపే చ హీరో – కోపే చ జీరో,**
**షట్కర్మయుక్తా – కలికాలభర్తా ॥**

## 3.3.11 పోతనగారి ప్రసిద్ధ సీసపద్యానికి పేరడీ:–

పోతన భాగవతంలోని "కమలాక్షునర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" అనే ప్రసిద్ధ సీసపద్యానికి డా॥ గరికిపాటి నరసింహారావుగారు చెప్పిన పేరడీ పద్యం:–

**సీ॥ కంప్యూటరును తాకు కరములు కరములు,**
**సెల్ఫోనులో వాగు జిహ్వజిహ్వ;**
**వాట్సాపు చూచెడి వాల్గంటి వాల్గంటి,**
**వెంటనే లైక్కొట్టు వేలు వేలు;**
**ట్విట్టరులో పెట్టి తిట్టు తిట్టే తిట్టు,**
**ఫేసు బుక్కైపోవు ఫేసు ఫేసు;**
**వీడియో చాటింగు విద్యార్థి విద్యార్థి,**
**స్మార్టు ఫోనును చెప్పు చదువు చదువు;**

**తే॥ ఆరు సిమ్ముల వాడెపో ఆధునికుడు,**
**అప్పు లెగ్గొట్టు వాడెపో గొప్పవాడు,**
**ఇవి యెరుంగని వాడెపో చవట యనగ,**
**నాగరికమున సర్వము నాశమగుటె!**

## 3.3.12 ఒక చమత్కారశ్లోకం:-

**సేకరణ:- శ్రీ చావలి దీక్షితులు**

**శ్లో॥ అంబలిద్వేషిణం వందే**
**చింతకాయ శుభప్రదమ్।**
**కూరగాయ కృతత్రాసం**
**పాలనేతిగవాం ప్రియమ్॥**

తెలుగూ, సంస్కృతమూ కలగూరగంపలా కలగలిసిపోయిన ఈ శ్లోకం చూశారా?

కవిగారి అభావ చేష్ట అని, పోనీలెమ్మని, సరిపెట్టుకుందామంటే అర్థం కూడా అదోలా లేదూ?

**అర్థం:** అంబలిని ద్వేషించే వాడికి వందనమట!
చింతకాయ చాలా శుభదాయకమట!
కూరగాయ భయోత్పాతకమట!
ఆవుపాలనేయి ప్రియమైనదట!

ఏమిటీ కారుకూతలూ అనుకుంటున్నారా? కాదు, అసలు అర్థం చూడండి:

బలిద్వేషిణం = బలిని ద్వేషించిన; అం = విష్ణువునకు; వందే= నమస్కారం! (అతడు) (చింతత + అయ) = చింతకాయ (సంస్కృతశబ్దం) = నామస్మరణ చేసేవారికి; శుభప్రదమ్ = సకల శుభాలు ఇచ్చేటివాడు. కు + ఉరగాయ = దుష్టసర్పమునకు (కాళీయునికి) కృతత్రాసం = భయము కలిగించినవాడు; గవాం పాలనే = గోవులను రక్షించడంతో; అతిప్రియం = మిక్కిలి మక్కువగలవాడు; (అయినటువంటి శ్రీకృష్ణునికి నమస్కరిస్తున్నాను.) ఇది శ్రీకృష్ణనామస్మరణ చేసే శ్లోకం. (ఈ శ్లోకం టి.వి.కె. సోమయాజులుగారి 'ఏటిన ముత్యాలు'లో ఉంది. చూ: చమత్కార శ్లోకములు-19)

## 3.3.13 ఇతరములు:-

### 3.3.13.1 సాహిత్యలోకంలో నా అన్నదమ్ములు-తంగిరాల:-

నాకు జన్మతః ఒక అన్నయ్య (కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు), ఇద్దరు తమ్ముళ్లు: "బాచితమ్ముడు" (చి॥ తంగిరాల భాస్కరరావు) - "బుల్లితమ్ముడు"

(కర్నల్ చి॥ తంగిరాల కృష్ణమూర్తి) ఉన్నారు. వీరు కాకుండా, సాహిత్యలోకంలో కొందరు అన్నదమ్ములున్నారు. డా॥ ఆవంత్స సోమసుందర్‌గారు, ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారు, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, జువ్వాడి గౌతమరావుగారు – వీరిని నేను "అన్నగారు'' అని పిలిచేవాడిని.

పల్నాటియుద్ధంలో బాలచంద్రునకు ఉన్నట్లుగా సాహిత్యలోకంలో నాకు ఏడుగురు తమ్ముళ్లు ఉన్నారు: – ఆచార్య లింగమనేని బసవశంకరరావు (ప్రెసిడెన్సి కళాశాల, మద్రాసు); ఆచార్య ఆర్వీయస్. సుందరం (మైసూరు విశ్వవిద్యాలయం); ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ (తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్); ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య (హైదరాబాద్ విశ్వవిద్యాలయం); ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానందం (శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం); శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రి ("కవిసమ్రాట్'' విశ్వనాథ సత్యనారాయణగారిపుత్రుడు); ఆచార్య టి.యస్. గిరిప్రకాశ్ (మధురై కామరాజు విశ్వవిద్యాలయం). వీరు ఏడుగురూ నా యెడల "తమ్ములు రామచంద్రునకు తమ్ములు... తమ్ములు ధర్మరాజునకు తమ్ములు" అన్నట్లుగా ఉంటారు. నన్ను "సుబ్బన్నా!" అని ఎంతో ఆప్యాయంగా పిలుస్తారు. రాజమండ్రిలో ఉన్న ప్రసిద్ధపాత్రికేయుడు శ్రీ యఱ్ఱాప్రగడ రామకృష్ణగారు; మా తణుకులో ఉన్న ప్రముఖకవి 'రసరాజు''గారు కూడా నన్ను "అన్నగారు" అని పిలుస్తారు. ఇటీవల ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా వచ్చిన ఆచార్య తుమ్మల రామకృష్ణగారు కూడా నన్ను "అన్నా" అని ఆదరంగా పిలుస్తారు. అందువల్ల నా తమ్ముళ్ళు ఏడుగురు కాదు; పదిమంది అని చెప్పాలి.

(–చైతన్యకవిత, 25, ఏప్రిల్–సెప్టెంబర్, 1997)

### 3.3.13.2 పరమమూర్ఖులు: –

"పద్యము చచ్చిపోయిం"దని ఆనందంతో చిందులు త్రొక్కే పరమమూర్ఖులు బయలుదేరారు ఈనాడు. ఈ పద్యద్వేషం అన్నిద్వేషాలవలె అనారోగ్యకరమైనది. పద్యమైనా, గేయమైనా, వచనమైనా, కవిత్వమనే పదార్థం దానిలో ఉంటే, అది తప్పక పదికాలాలపాటు బ్రతుకుతుంది. ఛందస్సులోని అందచందాలూ, వడుపులూ, ఒయ్యారాలూ, వంపులూ, బిగింపులూ తెలిసినవాడెవ్వడూ పద్యాన్ని పరిత్యజించలేదు.

నరుడు వానరుడుగా మారి, పిచ్చిగంతులు వేయనంత వరకూ, గంగా, యమునా, గోదావరీ, కావేరీ నదులలో నీళ్ళున్నంత వరకూ; నన్నయ్య, తిక్కన, పోతన్నల ఆత్మలు తెలుగు హృదయాలను ఆవహించి ఉన్నంత వరకూ-హృద్యమూ, అనవద్యమూ, సహృదయైక వేద్యమూ అయిన పద్యం బ్రతికే ఉంటుంది!"

-కరుణశ్రీ (సేకరణ: శ్రీ పెద్ది సత్యనారాయణ, బెంగుళూరు)
(-చైతన్యకవిత - 26A, అక్టోబరు 1997-మార్చి 1998)

## 3.3.13.3 జీవితమంటే ఏమిటి:-

ఈ ప్రశ్నను గత నాలుగైదు సంవత్సరాలుగా కనపడిన ప్రతిపండితుణ్ణి, కవిని, విమర్శకుణ్ణి, మేధావిని, వేదాంతిని అడుగుతూ వచ్చాను. నాకు సంతృప్తికరమైన సమాధానం ఎవ్వరూ చెప్పలేదు. ఒకసారి కవిత్రయ అవార్డు తీసుకొనేందుకు, నేను సతీసమేతంగా నెల్లూరు వెళ్లాను. డా॥ బెజవాడు గోపాలరెడ్డిగారు. మా దంపతులను ఉదయం అల్పాహారానికి పిలిచారు. అప్పుడు మాటల సందర్భంలో వారిని "జీవితమంటే ఏమిటి?" అని ప్రశ్నించాను. వారు ఒక్కక్షణం దిగ్భ్రాంతికిలోనై: "అరె! ఉన్నట్టుండి చాల కష్టమైన ప్రశ్నవేశావే? ఇంత హఠాత్తుగా సమాధానం చెప్పమంటే ఎలాగ? అయినా చెపుతాను విను: "ప్రతిజీవీ తన సుఖాన్ని అన్వేషిస్తూ ముందుకు ప్రయాణం చేయడం!" ఇంతకన్నా గొప్ప నిర్వచనం నాకు మరెవ్వరూ చెప్పలేదు.

- తంగిరాల
(చైతన్యకవిత, ఏప్రిల్-సెప్టెంబర్, 1997)



**ఉ॥ పువ్వులు కొప్పునం దురిమి, ముందుగఁ గొనసియాడుచుండఁగా,**
**జెవ్వన జంగసాఁచి, యొకచేతను రోఁకలిఁ బూని యొయ్యనన్,**
**నవ్వుముఖంబుతోడఁ, దననందనుఁబాడుచు, నాథుఁజూచుచున్,**
**'సువ్వియసువ్వి' యంచు, నొకసుందరి బియ్యముదంచె ముంగిటన్.**

(- శ్రీనాథుని చాటువు)

(జెవ్వన = జెప్పున = త్వరగా; జంగ = అంగ = కాలుచాచి పెట్టిన అడుగు)

# 3.4 కవితా! ఓ కవితా! (తెలుగు కవితావైభవం)

## 3.4.1 విశ్వనాథవారి "పాషాణపాకం" - శ్రీశ్రీ ఆక్షేపణ:-

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు కవిత్రయముతో పోల్చదగిన మహాకవి. ఆయన రామాయణ కల్పవృక్ష మహాకావ్యానికి జ్ఞానపీఠ బహుమతి వచ్చింది (1970). దానిలో శివధనుర్భంగ ఘట్టం. రాముడు విల్లు విరిచాడు. (1) దానినుండి మిక్కిలి భయంకరమైన ఒక పెద్ద శబ్దం పుట్టింది. (2) ఆ శబ్దం శైవలోకాలలో వినపడింది; (3) రాక్షసలోకాలలో వినపడింది; (4) రాజలోకాలలో వినపడింది; (5) సర్వలోకాలలోనూ వినపడింది- అని వర్ణిస్తూ, ఒక్కొక్క సంఘటనకు ఒక్కొక్క పద్యం చొప్పున ఐదు పద్యాలు వ్రాశారు. ఈ పద్యాలలో ఒక చిత్రమైన శిల్పాన్ని పాటించారు. అది మిక్కిలి భయంకరమైన శబ్దం కాబట్టి ఐదు పద్యాలూ శార్దూల విక్రీడ ఛందస్సులోనే వ్రాశారు. పెద్దపులి భయంకరమైన జంతువుకదా! పైగా అన్నీ దీర్ఘసమాస భూయిష్ఠాలే! పద్యంలో 4 పాదాలుంటే, వాటిలో 3½ పాదాలు ఒకే సంస్కృత సమాసం! చివర్లో ½ పాదం మాత్రం సమాస రహితంగా వ్రాశారు. (ఈ పద్యాలు రాయలవారి ఆముక్తమాల్యదలోని "కాంచెన్ వైష్ణవుడర్ధయోజన జటాఘాటోత్తశాఖోపశాఖాంచత్..." లాంటి పద్యాలు)

మొదటి పద్యాన్ని పరిశీలిద్దాం:-

శివుని విల్లు విరిగింది - దానినుండి పెద్దశబ్దం పుట్టింది. దానిని గురించి వ్రాసిన పద్యం:

శా॥ **నిష్ఠావర్ష దమోఘ మేఘపటలీ నిర్గచ్ఛదుద్యోతిత**
**స్పేష్ఠేరమ్మదమాలికా యుగపదుజ్జృంభన్మహాఘోర బం**
**హిష్ఠ స్ఫూర్జ థుషండమండిత రవాహీన క్రియాప్రౌఢి ద్రా**
**ఘిష్ఠంబై యొక రావ మంతటనె సెసంగెన్ ఛిన్నచాపంబునన్.**

**అర్థం:** నిష్ఠా = నిరంతరంగా, వర్షత్ = వర్షించుచున్న, అమోఘ = మొక్కవోని (వ్యర్థము కాని = జలహీనముల కాని = జలసమృద్ధిగల) మేఘ=మేఘముల (మబ్బుల), పటలీ = సమూహమునుండి, నిర్గచ్ఛత్ = బయల్వెడలుచున్న, ఉద్యోతిత = ప్రకాశమానములైన, స్పేష్ఠ = అధికములైన, ఇరమ్మద = మెరుపులయొక్క ('మేఘ జ్యోతి రిరమ్మద' అని అమరం), మాలికా = వరుసలతో, యుగపత్ =

ఏకకాలమందు, ఉత్+జృంభత్ = గొప్పగా చెలరేగుచున్న, మహాఘోర=మిక్కిలి భయంకరమైనవాని, బంహిష్ఠ = బాహుళ్యతచే, స్ఫూర్జ = వజ్రముయొక్క (ఇంద్రుని ఆయుధముయొక్క), ధు = ధ్వని (పిడుగుల చప్పుడు), షండ = సమూహముచే, మండిత=ప్రకాశించు, రవ = శబ్దముకంటె, అహీనక్రియా = తక్కువకాని విధమైన, ప్రౌఢి = గొప్పదనము గల్గి (అతిశయమై), ద్రాఘిష్ఠంబై = మిక్కిలిదీర్ఘమైన, ఒక రావము = ఒక ఉత్కృష్టమైన ధ్వని, ఛిన్న = విరిగిన, చాపంబునన్ = ధనుస్సు నుండి, అంతటన్=అప్పుడు (విల్లు విరువగనే) లేదా సర్వత్ర, ఎసంగెన్ = ఒప్పెను.

**తాత్పర్యం:** నిరంతరంగా వర్షిస్తున్న కారుమేఘాల మాటునుండి మెరిసే మెరుపులు మాలలతోపాటే కల్గి ఉరుముల ధ్వనులకు తోడుగా భయంకరంగా, అంతులేకుండా పడే పిడుగుల చప్పుళ్ళ కంటే కూడా ఏ మాత్రం తగ్గని విధంగా విరిగిన ధనుస్సునుండి ధ్వని వెడలింది. ఉరుములు, పిడుగుల కంటె అధికమైన ధ్వని పుట్టిందని తాత్పర్యం.

**అలంకారం:** అతిశయోక్తి. ఉపమానాలకంటే ఉపమేయాధిక్యత ఉంది. ఘకార ప్రాస, మహాప్రాణాక్షర ప్రయోగం, సుదీర్ఘ సమాస ఘటన, ఛిన్న ధనుర్ధ్వని వ్యంజకత్వానికి ఉద్దేశ్యం.

ఈ పద్యం తిరిగి (396వ సంఖ్యతో), ఇష్టంచేత విశ్వనాథ మళ్ళీ రాసుకున్నాడు. “కాంచెన్ వైష్ణవుఁడర్ధయోజన జటాఘాటోత్థశాఖోపశాఖానిచత్ ఝాట...” వంటి (ఆముక్తమాల్యద) పద్యములకు దీటైనదీపద్యము. అన్వయం సులభీకృతం కాలేదని పాషాణపాక ప్రభువని విశ్వనాథుని సమకాలికులన్న మాటలు జ్ఞప్తికివస్తాయి. కాని ఇట్టి ఓజోగుణప్రధాన రచనలు కావ్యములందు ఔచిత్యవంతంగా ఉన్నప్పుడు సహజమే. “పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన, “(శృంగారనైషధం) అని శ్రీనాథుడూరికే సమర్థించడు గదా!

(–డా॥ సంగనభట్ల నరసయ్య)

ఇలాంటి పద్యాలే వరసగా ఇంకో నాలుగున్నాయి. అన్నింటికీ టీకాతాత్పర్యాలు వ్రాయించాను నా మిత్రులు డా॥ సంగనభట్ల నరసయ్యగారిచేత.

ఈ పద్యాలను చూచి శ్రీశ్రీగారు ఒక ఛలోక్తి విసిరారు: “ఈ పద్యాలను అర్థంచేసుకోవడం కన్నా, శివధనుస్సు విరగ్గొట్టడం చాలా సులభం!” శ్రీశ్రీగారు ఇలా ఆక్షేపించారనే నేను పట్టుపట్టి డా॥ నరసయ్యగారిచేత టీకాతాత్పర్యాలు

వ్రాయించి మా "చైతన్యకవిత"లో ముద్రించాను (చూ.చైతన్యకవిత, 43-46 సంచికలు, 2006-2007)

ఇంకోసారి శ్రీశ్రీగారు కల్పవృక్షాన్ని గురించి ఇలా అన్నారు: "నేను సంస్కృతం చదువుకోలేదు; అయినా వాల్మీకి రామాయణం అర్థమయింది. నేను తెలుగు చదువుకున్నాను; కాని విశ్వనాథవారి రామాయణం అర్థం కాలేదు!"

విశ్వనాథవారిది "నారికేళపాక"మనీ, "పాషాణపాక"మనీ ఆక్షేపించారు కవులు, విమర్శకులు ఆ రోజుల్లో. "పాషాణపాకప్రభూ!" అనే మకుటంతో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు ఆంధ్రపత్రికలో కొన్నిపద్యాలు వ్రాశారు. శ్రీశ్రీగారు విశ్వనాథవారినిగురించి చిన్నపుస్తకం వ్రాస్తూ దానికి "కవ్యుద్ధ విశ్వనాథ" అని పేరుపెట్టారు. "కవ్యుద్ధ" అంటే "కవిశ్రేష్ఠుడు" అని అర్థం ("ఉద్ధము" - శ్రేష్ఠతా వాచకము). విశ్వనాథ నారికేళపాకంలో వ్రాస్తారని సూచించడానికి ఈ శబ్దం వాడారు.

కాని శ్రీశ్రీగారి మాట పూర్తి సత్యం కాదు. కల్పవృక్షంలో 60% పద్యాలు అందరికీ అర్థమవుతూ ఉంటాయి. 40% పద్యాలు అర్థంకావు. ఏదిఏమైనా రామాయణ కల్పవృక్షం శ్రీనాథుని శృంగారనైషధంలాగ, రాయల"ఆముక్తమాల్యద" లాగ, భట్టుమూర్తి "వసుచరిత్ర"లాగ వ్యాఖ్యానాన్ని అపేక్షించే కావ్యమే అనడంలో సందేహం లేదు.

విశ్వనాథ రామాయణంలోని సులభమైన పద్యాలకు రెండు మూడు ఉదాహరణాలు:-

(1) సీతారాముల ప్రణయ వర్ణన:-

**తే॥ సీత-శ్రీరామచంద్రుని చిత్తపదము,**
**రామచంద్రుండు - జానకీ ప్రాణపదము;**
**రామసర్పఫణామణి - రమణి సీత,**
**ధరణిజా జీవితాతప తరణి-స్వామి!**

తా॥ రాముని హృదయస్థానము - సీత; సీత ప్రాణములకు నెలవు - రాముడు. రాముడనే సర్పం పడగమీది మణి-సీత; సీత జీవితానికి వెలుగునిచ్చే సూర్యుడు- రాముడు.

(2) అశోకవనంలో ఉన్న సీత ఎల్లప్పుడూ రాముణ్ణే ధ్యానిస్తూ ఉంది. అందువల్ల భ్రమరకీట న్యాయంగా సీతయే రాముడుగా మారిపోయింది! మోహంతో ఆమెను చూడటానికి వచ్చిన రావణునికి ఆమె రాముడుగానే కనపడింది! ఆ వర్ణన చేస్తున్నారు విశ్వనాథ:-

**ఉ॥ ఆకృతి రామచంద్ర విరహాకృతి; కన్బొమతీరు స్వామి చా**
**పాకృతి; కన్నులన్ ప్రభు కృపాకృతి; కైశికమందు రామదే**
**హాకృతి; సర్వదేహమునయందున రాఘవవంశమౌళి ధ**
**ర్మాకృతి; కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞమూర్తియై!**

(-సుందర, పరరాత్ర, 139)

"ఇటువంటి పద్యం తెలుగుసాహిత్యంలో మరెక్కడైనా ఉందా? ఉంటే నాకు చూపించండి!" - అని నన్ను ఛాలెంజ్ చేశారు మల్లంపల్లి శరభయ్యగారు. నిజమే! ఎక్కడా లేదు! నేనే కాదు. నాకన్నా కొమ్ములు మొలిచిన మొనగాళ్లు కూడా చూపించలేరు!

(3) మరొక్క సులభమైన పద్యం:- రావణుడు సీతను ఎత్తుకొని వచ్చి, లంకలో ఉంచడం ఎలా ఉన్నదంటే - ఒక మూర్ఖుడు ఒక మండుచున్న దీపాన్ని తెచ్చి, దాన్ని జాగ్రత్తగా తన పెట్టెలో దాచుకున్నాడట! అది వేడి యెక్కియెక్కి ఆ పెట్టెనే కాల్చివేసిందట! రావణుడు సీతనెత్తుకొని రావడం వల్ల, హనుమంతుడు వచ్చి లంకనంతా కాల్చివేశాడు. అలా కాల్చివేయబోయే దీపంలాగా ఉంది సీతాదేవి - అని ఈ పద్యంలో ధ్వని.

**ఆ॥ మండుచున్నదాని మందసంబున దాచ**
**నొక్కమూర్ఖు, వేఁడి యెక్కి యెక్కి**
**అల్ల మందసంబె యంటుకోఁబోయెడు**
**తీరుగాఁగ నున్న దివ్వె వోలె** - (సీతాదేవి ఉన్నది).

(-సుందర, పరరాత్ర, 144)

## 3.4.2 పరబ్రహ్మమూర్తి -శేషేంద్ర:-

**కవితామ్నాయ రహస్యముల్ దెలియగా గాక్షించినావేని, పొ**
**మ్మవనిన్ నీ వెవనిన్ దలంపక తదేకాసక్తితో జేరుమా**

**కవిసమ్రాట్టగు విశ్వనాథు ప్రతిభాగంభీరవారాన్నిధిన్**
**శివకోటీరఝరీతురీయ వచనశ్రీ సన్నిధిన్ బెన్నిధిన్!**

**ఎవని యాకృతి మించు హిమశైలశిఖరమై**
**కవులలో పుడమి మానవులలోన**
**ఎవని భారతి వెల్గు నేకైకదీపమై**
**జగములం దాగామి యుగములందు**
**ఎవని మన్గడ యొప్పు శ్రవణపీయూషమై**
**కథలలో సూరి వాక్సుధలలోన**
**ఎవని స్థానము గ్రాలు నవనవోన్మేషమై**
**ఋషులలో నిఖిలానిమిషులలోన**
**అతడు కవియును ఋషియు దేవతయు గాడు**
**కవులు ఋషులును దివిజులుం గలసి మెలసి**
**మ్రొక్కు సాక్షాత్ పరబ్రహ్మమూర్తి గాక**
**విశ్వనాథుండు కేవలావిర్భవుండె !**

(–చైతన్యకవిత–15,16, ఏప్రిల్–అక్టోబర్, 1995)

## 3.4.3 కవిసమ్రాట్‌కు వందిమాగధ కైవారాలు:–

ఆరోజు – అంటే 1974 మార్చి 17వ తేదీనాడు, బెంగుళూరు గాయన సమాజంలో బ్రహ్మాండంగా జరిగిన విశ్వనాథవారి సన్మానసభలో, వారు సభలోకి ప్రవేశిస్తూ ఉండగా, నేను, పూర్వం రాజులు చక్రవర్తులు సభలో ప్రవేశిస్తూ ఉంటే వందిమాగధులు చేసే కైవారములవంటి స్తోత్రాలు చదివాను. ఆయనను అనుసరించి వస్తున్న తిరుపతిరావుగారు, ఇతర మిత్రులు విశ్వనాథవారిపై పుష్పవర్షం కురిపించారు. ఆ రోజు నేను విశ్వనాథవారిపై చదివిన వందిమాగధ స్తోత్రాలు:–

**జయీా భవ!**
**విజయీా భవ!**
**దిగ్విజయీా భవ!!**

**సకల కళాప్రపూర్ణా!**
**సముల్లసిత సహస్ర పద్మభూషణా!**

**నవ్యాంధ్ర కవిసమ్రాట్పదవీ విరాజమానా!**
**సమధిరూఢ జ్ఞానపీఠ సింహాసనా!!**

**జయీా భవ!**
**విజయీా భవ!**
**దిగ్విజయీా భవ!!**

**స్థిరీకృత జరఠవ్యాళ సహస్రఫణా!**
**సహస్రముఖ సముజ్జృంభ దసాధారణ ధిషణా!!**

**జయీా భవ!**
**విజయీా భవ!**
**దిగ్విజయీా భవ!!**

**సరస సాహితీ విశ్వనాథా!**
**విశ్వనాథవంశ పయః పారావార రాకాసుధాకరా!**
**సనాతనధర్మ ప్రతిష్ఠాపనా పరాయణా!**
**శివసుందర సత్యనారాయణా!!**

**జయీా భవ!**
**విజయీా భవ!**
**దిగ్విజయీా భవ!!** **(స్తోత్రరచన: డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు)**

అప్పటి బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన డా॥ హెచ్. నరసింహయ్యగారు మిక్కిలి నిరాడంబరంగా ఉండేవారు. ఆయన తన బాల్యంలోనే గాంధీగారిని దర్శించి, వారి ఆశీస్సులు పొందినవారు. (చిన్నతనంలోనే గాంధీగారితో కలిసి ఫోటో తీయించుకున్నారు.) అప్పటినుండి బ్రతికినంతకాలమూ నిరంతరం ఖద్దరు వస్త్రధారణ చేసేవారు. తెల్లటి ఖద్దరు లుంగీ, తెల్లటి ఖద్దరు ఫుల్‌హాండ్స్ షర్టు, నెత్తిమీద గాంధీటోపీ – ఇదీ వారి వేషం. పైగా ఆజన్మ బ్రహ్మచారి! విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైనాసరే! ఇదే వేషం! ఆ రోజు విశ్వనాథసభకు ఇలాగే వచ్చారు వారు. "వీరే బెంగుళూరు విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్" అని నరసింహయ్యగారిని విశ్వనాథవారికి పరిచయం చేశారు

తిరుపతిరావుగారు. విశ్వనాథవారు ఆశ్చర్యపోయారు! వి.సి. అంటే సూటుబూటుతో ఉంటారనుకున్నారు. ఆయన నిరాడంబర రూపాన్ని చూసి వెంటనే ఆశువుగా ఒక కందపద్యం చెప్పారు:–

**క॥ 'వీసీ'యన మావైపున**
**ధీశాతము గౌరవమ్ము తిరమధికారా**
**వేశము, మఱియిక మీ యీ**
**'వీసీ' యిదియేమి సాధు 'వీసీ'! పటువున్.**

## 3.4.4 విశ్వనాథవారు – నేను:–

**–తంగిరాల**

బెంగుళూరులోని "గాయనసమాజం"లో 1974 మార్చి 17వ తేదీన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి జరిగిన ఘన సన్మానసభలో నేను ఒక వచనకవిత వ్రాసి చదివాను. విశ్వనాథవారు కొన్ని వేల పద్యాలు మహాద్భుతంగా వ్రాసిన మహాకవి. పైగా సంప్రదాయవాది. ఆయన ఎదురుగా వచనకవిత్వం చదవడం ఏమిటి? హనుమంతుని ముందు కుప్పిగంతులు వేయడం కదా! కోపంతో నన్ను ఆయన ఛడామడా తిడతారేమో! అని చాలా భయపడ్డాను. ఏం చెయ్యను? నేను ఛందోబద్ధమైన పద్యాలు వ్రాయలేను. చిన్నప్పటినుండి వచనకవిత్వమే వ్రాస్తున్నాను. వచనకవితలోనే నా భావాలు బాగా వ్యక్తీకరించ గలను. ఏమైనా సరే అని, ధైర్యంచేసి "సత్యమప్రియమ్" అనే పేరుతో ఒక వచనకవిత వ్రాసి, నా గంభీరమైన యువకంఠంతో మైకులో ఐదారు నిమిషాలపాటు కవిత చదివాను. సభంతా చప్పట్లతో దద్దరిల్లి పోయింది! భయంభయంగానే వచ్చి నా స్థానంలో కూర్చున్నాను. సభానంతరం విశ్వనాథవారు చిరునవ్వుతో నావైపు చూచి "నీ కవిత్వానికి అక్షరలక్షలివ్వాలి!" అన్నారు. నేను ఆనందంతోను, ఆశ్చర్యంతోను ఉబ్బితబ్బిబ్బైపోయాను! ఎన్నో ఏండ్ల క్రిందట, శ్రీశ్రీగారు యువకుడుగా ఉన్నప్పుడు, విశ్వనాథవారు అధ్యక్షత వహించిన సభలో తన "కవితా! ఓ కవితా" అనే గేయాన్ని చదివారు. విశ్వనాథవారు ఆ కవిత విని, పులకించిపోయి. అమాంతంగా శ్రీశ్రీని కౌగిలించుకొని "అభివృద్ధిలోకి వస్తావు!" అని ఆశీర్వదించారు.

ఆ సంఘటన నాకు జ్ఞాపకం వచ్చి, విశ్వనాథవారి సహృదయతకు రసజ్ఞతకు మనసులోనే వేయి నమస్కారాలు పెట్టాను. ఆనాడు చదివిన నా వచన కవితను ఈనాటి నా శిష్యులకోసం, మిత్రులకోసం దిగువ ఇస్తున్నాను; చదవండి.

**"సత్యమప్రియమ్"**

**నేనూ కవినే!**
**నువ్వూ కవివే!**
**వాడూ కవే!**
**ఈ తెలుగుగడ్డ మీద**
**ప్రతివాడూ కవే!**
**కాని,**
**నువ్వు**
**సాధారణ కవిమాత్రుడవు కావు**
**"విశ్వ" కవివి!**
**వినూత్న ఋషివి!**
**రసధునివి, మణిఖనివి!!**
**సమస్త సాహిత్య ప్రక్రియలకూ "నాథు"డవు!**
**"సత్యా"న్ని గొంతెత్తి చెప్పడానికి జంకని ధీరుడవు!**
**ఈ యిరవయ్యోశతాబ్దవ్యోమాన్ని**
**నీ ప్రతిభాకిరణాలతో ముంచెత్తిన**
**సాక్షా "న్నారాయణు"డవు!!**
**తెలుగుకవులలో సమ్రాట్టువి**
**వెలుగుగుడిలో మూలవిరాట్టువి!**

* * *

**మేమంతా గాలివాటుగాళ్ళం**
**ఏయెండ కా గొడుగు పడతాం**

ఏటివాలులో పడి ఎనుముల్లా కొట్టుకుపోతాం
తాగుతాం తందనాలాడుతాం
దేవేంద్రభోగాలతో తులతూగుతాం
దరిద్ర సమాజాన్ని గురించి తెగవాగుతాం
గొఱ్ఱెలమందల్ని సింహాలుగా వర్ణించి చెపుతాం
వాటికి సలాంకొడతాం
ప్రియమైన అసత్యాన్ని ప్రీతిగా ఏకరువుపెడతాం
నరాల బలహీన కేంద్రాలు వెదకి, ఉద్రేకంగా మీటుతాం!
మఱి నువ్వో...?
నో... నో...
ఏటికి ఎదురీదుతావు?
పరవళ్ళు త్రొక్కుతూ
వరదరానీ బురదరానీ
గజీత కొడతావు!
మండుటెండలో నిలబడి మాడుతావు!
తుపానుగాలికి ఎదురొడ్డి పోరాడుతావు!!
అంతేకాని–
ఎంత మొత్తుకు చచ్చినా,
ఆ దేవుడే దిగివచ్చినా,
గాడిదను మాత్రం గుఱ్ఱమని చెప్పవు!
వెఱ్ఱిమొఱ్ఱి విలువల్ని ఒప్పవు!!
(నీకు చిఱ్ఱెత్తుకొస్తే
ఒక్కొక్కప్పుడు
గుఱ్ఱాన్ని కూడా గాడిద అనేస్తావు! – అది వేరే విషయం)
భారతీయ సంస్కృతి అమూల్య భాండారం గోడౌన్స్ –

తాళంచెవులగుత్తి నీ మొలలో వ్రేలాడుతోంది!
అందుకే ఒక్కొక్క నవల ఒక్కొక్క విజ్ఞానసర్వస్వం!
తెలుగువాళ్ళకి భారతసంపత్తు ఎంత ఉన్నా
రామాయణదారిద్ర్యం మాత్రం
రావణకాష్ఠంలా
రాజుకుంటూనే ఉంది.
అందుకే -
నందనవనంనుండి
"కల్పవృక్షా"న్ని పెకలించి తెచ్చి
తెలుగు "సత్య" పెరట్లో నాటావు!
మా పాలిటి కన్నయ్యవు నీవు!!

* * *

ఆఁ! మా గొడవెందుకులే!
మాకు నిన్నలేదు, మొన్నలేదు
తండ్రిలేదు, తాతలేదు
(ఉన్నారని నువు చెప్పినా మేం నమ్మం)
ఎలా పుట్టామో, ఎందుకు పుట్టామో, ఏం చేస్తున్నామో
మాకే తెలియదు.
నీ వయస్సు దాకా మేం బ్రతకం
అర్ధాయుష్షుగాళ్ళం!
అనుమానాల పిడకలగూళ్ళం!!
పశ్చిమ సంస్కృతి సంపర్కంతో
ఓపలేని వాళ్ళం
ఓపికలేని వాళ్ళం!
శతాధిక గ్రంథాలమాట దేవుడెరుగు

**శతాధిక పాదాలు కూడా వ్రాయలేని వాళ్ళం!**
**నువ్వు వ్రాసింది జీర్ణంచేసుకోలేని అర్భకులం!**
**'స్పూన్‌ఫుల్ పొయిట్రీ' భావుకులం!!**
**ఊటలేని పాడుదిగుడుబావులం!!**
**అసలు –**
**మాకూ నీకూ పోలికేమిటి?**
**నక్కెక్కడ? నాగలోకమెక్కడ?**

* * *

**అంతెందుకు?**
**అసలు విషయం చెపుతున్నానిక –**
**అప్రియమైనా సత్యం కనుక –**
**కవిత్రయం తరువాత మనకు**
**"కవి" అన్నవాడు ఎవడున్నాడు?**
**"బ్రాహ్మీదత్తవరప్రసాదు"నకు తోడు?**
**"బ్రాహ్మీమయమూర్తి"**
**విశ్వనాథుడు**
**ఒకే ఒక్కడు!!**
**"తాంబూలాలిచ్చేశాను, ఇహ**
**తన్నుకు చావండి!"**

(రచన 12.03.1974)
(ముద్రణ "బఫూన్" పత్రిక, 05.02.1975)

## 3.4.5 జాబిల్లి నవ్వుల్లో జలకాలాడుదాం నాతో వస్తారా!:–

సూర్యుణ్ణి ఎటునుంచి చూసినా సూటిగా కిరణమే గుచ్చుకొంటుంది.
శేషేంద్రను చదివినా అంతే! ఆయన కవిత్వపు కిరణం బాణంలా దిగుతుంది.
ఆకాశాన్ని పసిపిల్లాణ్ణి చేసి ఊయ్యాలతో జోలపాడే జోదునెరుగుదురా!...మీరు?

మలయానిలానికి మందగమనాన్ని నేర్పే నాగరకుణ్ణి ఎరుగుదురా!
అనలానికి ఉత్సాహాన్నిచ్చే అగ్నివేశుణ్ణి,
జలపాతాల గుఱ్ఱాలమీద స్వారీచేసే ఆశ్వికుణ్ణి ఎరుగుదురా!
అతడే "విప్లవ భాషా విధాత" – "కవిసేన మేనిఫెస్టో" ప్రణేత శేషేంద్ర!
ఇంద్రధనుస్సుకు రంగులద్దే చిత్రకారుడాయన
మెరుపుతీగకు లాస్యం నేర్పే నాట్యాచార్యుడు
మాటలనుండి మకరందధారలను పిండే దోహనుడు
సీతాకోకచిలుక కట్టుకున్న చీరకు
"మ్యాచింగు" నేర్పే "బ్యూటీషియన్"
అతడే "శేషేంద్ర"!

షోడశకళాపరిపూర్ణుడైన రాకాశశాంకుని "షోడశి"ని భూలోకవాసులకు చూపించిన
మంత్రశాస్త్ర రహస్య రసపట్టు ... శ్రీ శేషంభట్టు!
చింతామణీమంత్ర తపస్సిద్ధుడైన శ్రీ హర్షుని "స్వర్ణహంపి" ని మనకు చూపించిన
మహాతాంత్రికుడు శ్రీ శేషేంద్రశర్మ!
రాళ్ళు పగిలే రోహిణీ కార్తెలో,
మిట్టమధ్యాహ్నం మండుటెండలో రోళ్ళుచెక్కడం ఎంత కష్టమో....
చంద్రకాంత శిలలు కరిగే శారదరాత్రిలో రాకానిశాకరుని కౌముదీశీకరంలో
జ్యోత్స్నావిహారం చెయ్యడం కూడా అంతే కష్టం!
అందుకే... "మండే సూర్యుడు" "శేషజ్యోత్స్న" రెండూ ఆయనే!
పూలబరువు మొయ్యలేని సుకుమారుడాయన.

జీవితంలో వంచనాశిల్పం తెలీని పక్షుల్లా, పువ్వుల్లా బ్రతికే "ఋతుఘోష" ఆయన. ఇంద్రధనుస్సును ఎక్కుపెట్టి స్వప్నాలను బాణాల్లా సంధించే మహాస్వాప్నికుడాయన.

వసంతంలో పూచిన ఈ చెట్ల పూలన్నీ ... తుపాకులై పేలితే ఎంత బాగుండను!... అని విప్లవ భావాన్ని వెళ్ళగ్రక్కిన నోటితోనే, పిడికెడు వసంతాలను అందరికీ భిక్షపెట్టమని ప్రభుత్వాన్ని, ధనాఢ్యులను వేడుకొంటాడు.

"సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు, తుఫాను గొంతు చిత్తం

అనడం ఎరగదు, పర్వతం ఎవడికీ వంగి సలాంచెయ్యదు. నేనింతా పిడెకెడు మట్టేకావచ్చు, కానీ కల మెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది" (జనవంశం)

అదీ శేషేంద్ర వ్యక్తిత్వం...

"కర్ణాటక్షితిపాల మౌక్తికసభాగారాంతర స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్టు" నని గర్వంతో పలికిన శ్రీనాథుడూ; "మృద్వీకా మధ్య నిర్వన్మస్రుణ మధురుఝరీ మాధురీ భాగ్యభాజాం, వాచామాచార్యతాయాః పదమనుభవితం కోస్తి ధన్యోమదన్యః" – అని ఆత్మవిశ్వాసంతో పలికిన పండితరాజ జగన్నాథుడూ పురిటిల్లైన తెలుగుగడ్డమీద మమకారంతో మళ్ళీ పుట్టేరు!

ఒక శేషభట్టుగా – ఒక శేషేంద్రశర్మగా

వేయి సంవత్సరాల ఆంధ్రసాహితీ పరిమళ నందనోద్యానం అతడే!

"సహస్ర సాహితీ శేషకౌముది" శేషేంద్ర

స్వస్తిః ప్రజాభ్యః, పరిపాలయంతాం

న్యాయ్యేన మార్గేణ జనరాజ్యతంత్రాః

శుభమస్తు పశుపక్షి వృక్ష కీటేభ్యః

లోకాః సమస్తాః సుఖినోభవంతు...

– ఇతి శమ్–

'నవకవితా పితామహ' బిరుద ప్రదానం– కాకినాడ కవిపండిత సంఘం

కాకినాడ ఇట్లు

18–3–1997 ఆహ్వానసంఘం

(చైతన్యకవిత–26బి అక్టోబర్ 1997–మార్చి 1998)

### 3.4.6 కవితా ఖండికలు:–

1. వర్షం వెళిపోయింది మబ్బులరథాలెక్కి
   జలదానం చేసిన మేఘాలకి
   జోహార్లు చెప్పాయి చరాచరాలు
   భూమిలో ఉన్న చిన్నారిగింజ

మెడ బయటపెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది కృతజ్ఞతతో... – **శేషేంద్ర**

2. సముద్రం ఒకడి కాళ్లదగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు "చిత్తం" అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాంచెయ్యదు.
నేనింత పిడికెడు మట్టేకావచ్చు
కానీ, కలమెత్తితే
ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది! – **శేషేంద్ర**

3. **తాజ్‌మహల్**
ప్రేమ ఎక్కడ పుట్టిందో కాని
ఇక్కడ సమాధైనా ఇంకా బ్రతికే ఉంది! – **ఆసు రాజేంద్ర**

4. **ప్లీడరు**
చంకలో పెట్టుకొని తిరిగే కాగితపు పులుల్ని
వాయిదాలవనంలో వదిలిపెట్టె
కేసుల్నీ కాలాన్నీ జీళ్లపాకంలా సాగదీస్తూ
పార్టీపర్సులమీద పండుగ చేసుకొనేవాడు! – **ఆసు రాజేంద్ర**

5. **ఎవరైనా**
కాళ్లు తడవకుండా
మహాసముద్రాలను దాటిన మేధావికూడా
కళ్లు తడవకుండా జీవితాన్ని దాటలేడు! – **వసీరా**

6. "స్త్రీకి కూడా శరీరం ఉంది–
దానికి వ్యాయామం ఇవ్వాలి!
ఆమెకు మెదడు ఉంది –
దానికి జ్ఞానం ఇవ్వాలి!
ఆమెకు హృదయం ఉంది–
దానికి అనుభవం ఇవ్వాలి! – **చలం**

7. "There are only three things in the world:
one is to read poetry;
the other is to write poetry;
and the best of all is -
to live poetry!"

8. **వెన్నెల్లో గోదారి**
ఇవాళ పొద్దున్న
చందమామను పట్టుకొని
ఏ పేపరు మిల్లులో పారేశారో ఏమిటో
ఇక్కడికొచ్చి చూస్తే
గోదావరే పెద్ద తెల్లకాగితం!
దాని మీద కవిత్వం రాయడానికి
ఆ సూర్యుడే దిగిరా నక్కరలేదు,
నేనిక్కడ నిలబడి
చిన్నరాయి పడేస్తే చాలు! **– వసీరా**

9. **బందిపోట్లు (స్త్రీవాదకవిత–1)**
"పాఠం ఒప్పచెప్పకపోతే నీ పెళ్లిచేస్తా" నని
పంతులుగారన్నప్పుడే భయమేసింది;
"ఆఫీసులో నా మొగుడున్నాడు
అవసరమొచ్చినా సెలవివ్వ" డని
అన్నయ్య అన్నప్పుడే అనుమానమేసింది;
"వాడికేం? మగమహారా" జని
ఆడా మగా వాగినప్పుడే అర్థమైపోయింది –
"పెళ్లంటే పెద్ద శిక్ష" అని;
"మొగుడంటే స్వేచ్ఛాభక్షకు" డని;
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని! **– సావిత్రి** (మార్చి 1984)

(చైతన్యకవిత 19 & 20, ఏప్రిల్ & జూలై 1995)

10. **పైట (స్త్రీవాద కవిత-2)**
"నామీద
తరాలనుంచి మోపిన
అపనింద పైట!

నన్ను అబలను చేసిన
పితృస్వామ్యపు అదృశ్యహస్తం పైట!

దోపిడీ సంస్కృతి
నా వ్యక్తిత్వాన్ని శవంగా చేసి
దాని పైన కప్పిన తెల్ల దుప్పటి పైట!

నేను నడిచేశవాన్ని కాకుండా ఉండాలంటే
ముందుగా పైటని తగలెయ్యాలి!" **-జయప్రభ**

(చైతన్యకవిత-19 & 20, ఏప్రిల్ & జూలై 1995)

11. **వంటిల్లు (స్త్రీవాద కవిత -3)**
మన రక్తం పీల్చేసి, మన ఆశల్నీ, కలల్నీ కాజేసి
కొద్దికొద్దిగా జీవితాంతం పీక్కుతింటున్న
రాకాసిగద్ద ఈ వంటిల్లు
వంటింటి సంస్కృతి, వంటింటి ముచ్చట్లు
వంటలక్కలమైన మనం,
మనం ఏమైనా మన అంతిమ కర్తవ్యం
'గరిట తిప్పటం' గా చేసిన ఈ వంటిళ్లను
ధ్వంసం చేద్దాం రండి!
. . . . . . . . . . . . . . . . . . .
మళ్ళీ మన పాపలు ఈ వంటరి వంటిళ్లలోకి
అడుగిడబోతున్నారు
మన పిల్లలకోసం
వంటరి వంటగదులు కూల్చేందుకు రండి! (**-విమల,** 'వంటిల్లు' కవితనుండి)

(చైతన్యకవిత 19 & 20, ఏప్రిల్ & జూలై, 1995)

## 3.4.7 పెద్దబేరం...అణాలు! (దండి–కాళిదాసు):–

**(సేకరణ: శ్రీమతి అంబికా అనంత్)**

ధారానగరంలో ప్రజలంతా అంతో యింతో కవిత్వం చెప్పగలిగేవారుట. ఒకసారి కాళిదాసు, దండికవీ యిద్దరూ సాహిత్యగోష్ఠి చేస్తూవుండగా వాళ్లకు తాంబూల సేవనం చెయ్యాలనిపించింది.

చూసుకుంటే దండిదగ్గర సున్నం అయిపోయింది; కాళిదాసు దగ్గర తమలపాకులు లేవు. ఇద్దరూ నడుచుకుంటూ ఒక దుకాణానికి వెళ్ళారు. అక్కడ ఒక పడుచుపిల్ల దుకాణాన్ని నడుపుతున్నది.

దండి ఆమెతో "తూర్ణ మానీయతాం చూర్ణం పూర్ణచంద్ర నిభాననే" అన్నాడు (ఓ పూర్ణచంద్రునివంటి ముఖం కలదానా! కొంచెం త్వరగా సున్నం యిప్పించవమ్మా!)

వెంటనే కాళిదాసు "పర్ణాని స్వర్ణవర్ణాని కర్ణాన్తాకీర్ణలోచనే" (చెవుల వరకూ వ్యాపించిన విశాలనేత్రాలుగల సుందరీ బంగారు వన్నెగల తమలపాకులు కూడా ఆ చేత్తోనే యిప్పించు.) అన్నాడు. ఆ చిన్నది ముందు కాళిదాసుకు ఆకులిచ్చి తర్వాత దండికి సున్నమిచ్చింది.

దండి చిన్నబుచ్చుకొని, "ముందు నేను కదా సున్నమడిగింది? మరి ముందు కాళిదాసు కెందుకు ఆకులిచ్చావు? భోజరాజులాగా నీవుకూడా కాళిదాసు పక్షపాతివా?" అన్నాడు.

నిజానికి ఆ నెరజాణ కూడా కాళిదాసు కవిత్వమంటే చెవికోసుకుంటుంది. అందుకే ఆయనను గౌరవిస్తూ ముందు ఆయనకు ఆకులిచ్చింది. కానీ ఆమె లౌక్యం తెలిసిన వ్యవహారదక్షురాలు. ఉన్నమాట చెప్పి దండిని నొప్పించట మెందుకని తెలివిగా సమాధాన మిచ్చింది:–

"అయ్యా! నేను దుకాణంలో సరుకు అమ్మటానికి కూచున్నాను. మహాకవుల గుణదోషాలు నిర్ణయించటానికి నేనెంతటి దాన్ని? నాది చిన్న బుర్ర. కాళిదాసుగారు చెప్పిన శ్లోకపాదంలో 'పర్ణాని స్వర్ణ వర్ణాని కర్ణాన్తాకీర్ణలోచనే' అంటే నా చెవికి ఐదు'ణ'లు వినిపించాయి. తమరు సెలవిచ్చిన శ్లోకంలో 'తూర్ణమానీయతాం చూర్ణం పూర్ణచంద్ర నిభాననే' అన్న దాంట్లో నా చెవికి మూడు 'ణ' లు

వినిపించాయి. మూడు నాణాల కంటే ఐదు నాణాలు యెక్కువకదా! అందుకని పెద్దబేరానికి ముందు ప్రాధాన్యమిచ్చాను. అంతేగానీ నాకు పక్షపాతం ఏమాత్రమూ లేదు. మిమ్మల్ని నొప్పించి వుంటే క్షమించాలి" అంది. దండికి కోపంపోయి నవ్వు వచ్చింది.

"ఈ ధారానగర వాసులతో యిదే చిక్కు! అందరూ కవులే! అందరూ పండితులే! సమయస్ఫూర్తి కలవారే!" అంటూ కాళిదాసుతో కలిసి తాంబూలం నములుతూ వెళ్లిపోయాడు.

## 3.4.8 కవిత్వం అల్లడం చేతకానివాడు :-

మహాకవి కాళిదాసు ధారానగరం రాజధానిగా మాళవదేశాన్ని పాలించిన భోజుని ఆస్థానంలో ఉండేవాడని, వారిద్దరిని గురించిన కథలు ("భోజ-కాళిదాసు కథలు") లోకంలో మిక్కలి వ్యాప్తిలో ఉన్నాయి. భోజుని కాలం క్రీ.శ. 1005-1054 (కాని చారిత్రకంగా కాళిదాసు భోజుని కన్నా వేయి సంవత్సరాలు ముందువాడు. అతడు క్రీ.పూ. ఒకటవ శతాబ్దంలో ఉజ్జయిని రాజధానిగా పాలించిన విక్రమార్కుని ఆస్థానంలోవాడు). ఆ కథలలో ఒక చమత్కారమైన కథ.

భోజమహారాజు గొప్ప కవితాప్రియుడు. కాళిదాసువంటి మహాకవులను పోషించినవాడు. స్వయంగా కవిత్వం అల్లగలవాడు. అంతవరకూ పరవాలేదు; కాని ఆ మహారాజు తన రాజ్యంలో ప్రతివ్యక్తియు కవిత్వం అల్లగలిగి ఉండాలని, కవితాశక్తి లేనివాడిని తనదేశంనుండి తరిమివేయాలని శాసనం చేశాడు. దానిని అమలుచేయమని తన భటులకు ఆజ్ఞాపించాడు. రాజభటులు ధారానగరమంతా వెదికారు. ఒక సాలెవాడు దొరికాడు. తాను కవిత్వం అల్లలేనన్నాడు. వెంటనే వాడిని బంధించి మహారాజు ముందు ప్రవేశపెట్టారు. వాడిని చూచి భోజమహారాజు "కవిత్వం చెప్పగలవా?" అని ప్రశ్నించాడు. వాడు గడగడ వణికిపోతూ ఏమి చేయాలో తోచక రాజుగారి ముఖంలోకి దీనంగా చూశాడు. (భోజమహారాజుగారి ముఖం చూస్తే ఎంతటి మూర్ఖునికైనా హృదయంలోనుండి కవిత్వం తన్నుకొని పైకి వస్తుందని ఆరోజుల్లో ప్రజలు చెప్పుకొనేవారు!) ఆ సాలెవాని మనసులో కవితాభారతి ప్రవేశించింది. వెంటనే వాడు ఈ క్రింది విధంగా కవిత్వంలో రాజుగారికి సమాధానం చెప్పాడు:-

**శ్లో॥ "కావ్యం కరోమి, నహి చారుతరం కరోమి,**
**యత్నాత్ కరోమి, యది చారుతరం కరోమి!**
**భూపాలమౌళి మణి రంజిత పాదపీఠ!**
**హే! సాహసాంక! కవయామి – వయామి–యామి!!"**

**తా॥** "కావ్యం (కవిత్వం)" అల్లగలను; కాని అందంగా అల్లలేను. ప్రయత్నిస్తే అందంగా చెప్పగలను. సామంతరాజుల మణికిరీట కాంతులతో ప్రకాశించే పాదపీఠంగల ఓ మహారాజా! "సాహసాంక" బిరుదం కలవాడా! నేను "కవయామి" = కవిత్వం అల్లగలను; "వయామి" = నేత నేయగలను; "యామి" = ఇక నే వెడుతున్నాను!" అన్నాడు ఆ ధారానగరంలో అతి సామాన్యుడైన చేనేతకార్మికుడు! భోజరాజు సంతృప్తిగా నవ్వుకున్నాడు. అతణ్ణి బంధించి తెచ్చిన భటులు తెల్లమొహాలు వేశారు!

## 3.4.9 శరభసూక్తుల సౌరభాలు:–

**(ప్రాచీనకవులనుగురించి, కావ్యాలనుగురించి మల్లంపల్లి శరభయ్యగారి అభిప్రాయాలు)**

### వాల్మీకి

"వాల్మీకి కంఠంలోనే కరుణగంధం ఉన్నది. అది వెంటనే గుండెను ఒడిసి పట్టుకుంటుంది–కోకిల కంఠస్వనంవలె. కోకిల హృదయ గ్రాహీ – అని ఆయనే అన్నారు. ఎంతయినా ఆయనది స్త్రీ ప్రకృతి! ఆయనను చదువుతూ ఉంటే అమ్మబడిలో ఉన్నట్లే ఉంటుంది".

### వ్యాసుడు

"వ్యాసునిది పురుషకంఠం! 'ఆయన చెప్పినట్లు వినకపోతే ఏమవుతుందో' అని భయంవేస్తుంది. ఆయన ప్రేమ పైకి కనబడదు. ఫలిత సమయానికి కాని అనుభవంలోకి రాదు. సరిగ్గా మా నాన్నగారి వంటివాడు".

### కాళిదాసు

"ఈ సృష్టిలో కాళిదాసు కవిత్వంకన్నా నిజమైన ప్రియురాలు ఉండటం అసంభవం. ప్రియురాలి విశ్వరూపమే ఆయన కావ్యప్రపంచంగా మారింది."

**భవభూతి**

"భవభూతి అసాధారణమైన కవి ! మొగలిఱేకులవలె ఆయన శ్లోకాలు ప్రాణాలలోనికి సొరవేసుకొని పోతాయి."

**భాసుడు**

"భాసుడు సన్నజాజిపూవువంటి కవి! ఆయన ప్రతిభ ఱేకగా ఉన్న నెత్తావివలె, గుండెకి పట్టి, ఉల్లాసం కలిగిస్తుంది."

**నన్నయ**

"నన్నయ్య మాటల చుట్టూ వెన్నెల కాస్తూ ఉంటుంది. ఆయన రాత్రివలె ఆప్యాయనమైన కవి! వాల్మీకిదివలె ఈయనదీ స్త్రీప్రకృతి!"

**తిక్కన**

"తిక్కన్న పట్టపగటి వంటివాడు! ఈయన శిల్పం చతురస్ర శోభితంగా ఉంటుంది. సూక్ష్మాతిసూక్ష్మమైన రేఖలు కూడా విస్పష్టంగా ఉంటాయి. పురుష ప్రకృతి." (వ్యాసునివంటి వాడు)

**ఎఱ్ఱన**

"ఎఱ్ఱన్న ఇటు పగలుగానో, అటు రాత్రిగానో కరిగిపోయే స్వభావం కల సంధ్యారాగంవంటి కవి! ఈయనలో దివానిశాలక్షణాలు సమపాళంగా ఉంటాయి. ఈయన అసలు స్వరూపం వ్రేపల్లెలలోని కీలారాలలోనే వెదకి పెట్టుకోవాలి." (కీలారం = పసులమంద)

**నాచన సోమన**

"నాచన సోమన మండునెల మధ్యలో ఉన్న నిండునెల. ముందు ఆ గ్రీష్మతాపానికి తట్టుకోగలిగి ఉండాలి!"

**శ్రీనాథుడు**

**"అందరి హృదయాలలోనికి ప్రియాతిథివలె సరాసరి ప్రవేశించే ఒకేఒక తెలుగుకవి శ్రీనాథుడు!** ఈయన మాటలలోనుండి ఎన్ని శతాబ్దులు గడచినా, ఎప్పటికప్పుడు క్రొత్తగా అక్షయ్యమైన కస్తూరీ సౌరభం తెరలు తెరలుగా వీస్తూనే ఉంటుంది."

**పోతన**

"ఏ జాతి అయినా తరించటానికి ఇటువంటి కవి ఒక్కడు ఉంటే చాలును."

**శ్రీకృష్ణ దేవరాయలు**

"శ్రీకృష్ణదేవరాయలు మూర్తీభవించిన వర్షఋతువు."

**అల్లసాని పెద్దన**

"మలయానిలానికి రేగిన మల్లెల పుప్పొడీ,
ఆ పుప్పొడితో చిక్కబడిన వెన్నెలా,
ఆ వెన్నలతో విచ్చిన కలువతేనే,
ఆ తేనెతో మత్తెక్కిన తుమ్మెద పాటా,
ఆ రీతి తుమ్మెద పాటతో
కట్టలు తెంచుకొని పారే విరహిణి యేడుపూ
ఇవి–
పెద్దన కవిత్వానికి మూలద్రవ్యాలు!"

**ముక్కుతిమ్మన**

**"సాయంకాలం పూసే చంద్రకాంతం పూవంత సుతిమెత్తనైన ఒకే ఒక తెనుగుకవి ముక్కుతిమ్మన."**

**వసుచరిత్ర**

"ఐశ్వర్యప్రదర్శనాభిలాషకల శ్రీమంతులైన వర్తకుల సౌధములలోని నానావిధమైన ఫర్నిచరూ, వస్తువాహన సామగ్రీ."

**తెనాలి రామకృష్ణకవి**

"మంచుతో మెఱిసే హేమంత ప్రాతః శాద్వలస్థలి!"

**పింగళి సూరన**

"చెఱుకు తోటలతో,
పండి ఒరిగిన వరిచేలతో,
పోకలకు ప్రాకించిన తములపాకుతీగలతో,

అరటి తోటలతో,

సమశీతోష్ణమైన శరత్కాలము!"

**చేమకూర వేంకటకవి**

"చేమకూర వేంకటకవి, తిరుపతి వేంకటకవులకు మూలపురుషుడు!"

**కవితానిర్వచనం**

"తన భర్త చేసిన అసమగ్రసృష్టిని చక్కపరిచి, సమగ్రం చెయ్యటానికే సరస్వతీదేవి 'కవిత' పేరుతో ఈ లోకానికి దిగివచ్చింది. "

**సహృదయ నిర్వచనం**

"కవి నివసించే - (కావ్య నిర్మాణ ఫలమైన) శాశ్వత స్వర్గధామం (ఈ లోకంలో) సహృదయుడు !"

**కవితాప్రయోజనం**

"దుఃఖమయమైన యీలోకాన్ని ఆనందమయంగా పరిణమింప చేయటానికే 'కవిత' ఆవిర్భవించింది."

**అష్టమవ్యసనం**

మన పెద్దలు సప్తవ్యసనాలను మాత్రమే చెప్పారు. నా ఉద్దేశంలో వాటికి ఇంకొకటి కూడా చేర్చాలి, అదే కవిత్వం! కవిత్వం అష్టమవ్యసనం!"

**- మల్లంపల్లి శరభయ్య**

(చైతన్యకవిత - 15,16, ఏప్రిల్-అక్టోబర్, 1993)



**శా॥ కుల్లాయుంచితిఁ, గోఁక సుట్టితి, మహాకూర్పాసముం దొడ్గితిన్,**
**వెల్లులిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ,**
**జల్లాయంబలిఁ ద్రావితిన్, రుచులు దోసంబంచుఁ బోనాడితిన్,**
**దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుఁడన్.**

(- శ్రీనాథుని చాటువు)

# 3.5 తత్త్వవివేచన

## 3.5.1 వేదాలు - ఉపనిషత్తులు:-

**(1) వేదాలు:-** "వేదం" అంటే "జ్ఞానం" అని అర్థం. వేదాలు నాలుగు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం. వీటిలో ఋగ్వేదం క్రీ.పూ. 10 వేల సంవత్సరాలనాడు పుట్టింది.

**(2) శాస్త్రాలు:-** "శాస్త్రం" అంటే "శాసించేది" అని అర్థం. పవిత్రమైన సిద్ధాంతాన్ని వివరించే గ్రంథాన్ని "శాస్త్రం" అంటారు. ఉదా॥ వేదాంతశాస్త్రం, వ్యాకరణశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం మొ॥

**(3) "పురాణం":-** "పురా అపి నవం" - అతి ప్రాచీనమైనదయినప్పటికిని, నవీనంగా కనిపించేది. అనగా అన్ని కాలాలకు ఉపయోగపడేది - అని అర్థం. ఉదా॥ వాయుపురాణం, స్కాందపురాణం మహాభాగవతం మొ॥ 18 ఉన్నాయి "అష్టాదశ పురాణాలు" అంటారు. వీటికి మరో 18 ఉపపురాణాలు కూడా ఉన్నాయి.

**(4) ఇతాహాసం:-**ప్రాచీనచరిత్రను బోధించే గ్రంథాన్ని "ఇతిహాసం" అంటారు. ఉదా॥ వాల్మీకి రామాయణం, వ్యాస మహాభారతం. రామాయణం క్రీ.పూ. 6 వేల సంవత్సరాల నాటిది. మహాభారతం క్రీ.పూ. 3 వేల సంవత్సరాల నాటిది.

**(5) ఉపనిషత్తులు:-** వీటికి మూడు రకాల అర్థాలు చెప్పవచ్చును:- (1) జన్మరాహిత్యానికి, లేక మోక్షప్రాప్తికి ఉపయోగించే మంత్రవాక్య సముదాయము, (2) ఆత్మజ్ఞానము, (3) ఆత్మజ్ఞానాన్ని ఉపయోగించే గురువుకు సమీపంగా ఉండటం.

సామాన్యంగా ఉపనిషత్తులు వేదాలకు చివరి భాగాల్లో ఉంటాయి. అందుచేత ఉపనిషత్తులకు "వేదాంతములు" అని ఇంకొక పేరుకూడా ఉంది.

ఈ ఉపనిషత్తుల సంఖ్య 108గా "ముక్తికోపనిషత్తు" పేర్కొన్నది. వీటిలో ప్రధానమైన ఉపనిషత్తులు పది అని కూడా దాంట్లో ఉన్నది: "ఈశ-కేన-కఠ-ప్రశ్న-ముండక-మాండూక్య- తైత్తరీయ-ఐతరేయ-ఛాందోగ్య-బృహదారణ్యక" ఉపనిషత్తులు.

**(6) "మహావాక్యాలు":-** నాలుగు వేదాలలోను, నాలుగు గొప్పవాక్యాలు ఉన్నాయి. వీటని "మహావాక్యాలు" అంటారు. ఇవి ఉపని,త్తులలో కూడా వస్తాయి.

6.1 ఋగ్వేదం - **"ప్రజ్ఞానం బ్రహ్మ"** (ఐతరేయోపనిషత్తు)

"సృష్టికి మూలమైన, నిరుపాధికమైన, శుద్ధచైతన్యమే పరబ్రహ్మ"

6.2 యజుర్వేదం - **"అహం బ్రహ్మాస్మి"** (బృహదరణ్యకోపనిషత్తు)

"నేను పరబ్రహ్మమును అయి ఉన్నాను"

6.3 సామవేదం - **"తత్త్వమసి"** (ఛాందోగ్యోపనిషత్తు)

"అది (అంతటా వ్యాపించి ఉన్న చైతన్యం) నీవు అయి ఉన్నావు"

6.4 అధర్వణవేదం - **"అయమాత్మాబ్రహ్మ"** (మాండూక్యోపనిషత్తు)

"ఈ జీవాత్మయే పరబ్రహ్మము"

**(7) అరుణోపనిషత్తులోని శాంతిమంత్రము:-**

**7.1** **భద్రం కర్ణేభిః శ్రుణుయామదేవాః**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరైరంగైస్తుష్టు వాగీం సస్తనోభిః**
**వ్యశేమ దేవహితం యదాయుః ॥**

తా॥ ఓ దేవతలారా! చెవులతో మంగళమును విందుముగాక! యజ్ఞ రక్షకులారా! కళ్ళతో మంగళమును చూతుముగాక! స్థిరమగు అంగములుగల శరీరముతో స్తోత్రములు చేయుదుముగాక! ఆయువు ఉన్నంతదాక దేవతాప్రీతిని కలిగించు పనులు చేయుదుముగాక!

**7.2** **స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః**
**స్వస్తినః పూషావిశ్వవేదాః**
**స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః**
**స్వస్తి నో బృహస్పతిర్దధాతుః ॥**

తా॥ బహువిషయములు విన్న ఇంద్రుడు, సర్వజ్ఞుడు సూర్యుడు, అరిష్టములను మాన్పు గరుత్మంతుడు, బృహస్పతియు - మనకు శుభములను కలిగింతురుగాక!

(పై మంత్రములకు తాత్పర్య రచన: డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు)

**(8) బృహదారణ్యకోపనిషత్తులోని అతిప్రసిద్ధమైన వచనములు – వాటి అర్థములు:–**

**"అసతోమా సద్గమయ!**
**తమసోమా జ్యోతిర్గమయ!**
**మృత్యోర్మా అమృతం గమయ!"**

అర్థం:– (1) నన్ను అసత్తునుండి (చెడునుండి, లేక జడత్వంనుండి) సత్తు (మంచి లేక చైతన్యం) వైపునకు నడిపించుము"

(2) "తమస్సు (చీకటి లేక అజ్ఞానం) నుండి జ్యోతి (వెలుగు లేక జ్ఞానం) వైపునకు నడిపించుము.

(3) మృత్యువు (death) నుండి (అశాశ్వతమైనదానినుండి) అమృతత్వం (శాశ్వతమైనది – immortality) వైపునకు నడిపించుము.

**(9) "ఓం శాంతిః శాంతిః శాంతిః"** అనే శాంతి పాఠానికి అర్థం ఏమిటి?

ప్రతి మనిషిని మూడు రకాల దుఃఖాలు బాధించడానికి అవకాశం ఉన్నది. వాటిని ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలు (లేక, తాపాలు) అంటారు.

**9.1 ఆధ్యాత్మిక దుఃఖాలు:–** శరీరంలో ఉద్రేకాలవలన కలిగే రోగాలు; సోమరితనం, కపటం మొదలైన దుర్గుణాలవలన కలిగే ఉపద్రవాలు.

**9.2 ఆధిభౌతిక దుఃఖాలు:–**పంచమహాభూతాలనుండి(ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథ్వినుండి); శత్రు, చోర, మృగ, కీటకాదులవలనకలిగే ఉపద్రవాలు.

**9.3 ఆధిదైవిక దుఃఖాలు:–** అతివృష్టి, అనావృష్టి, పిడుగుపాటు, గ్రహబాధలు – మొదలగు వాటివలన కలిగే ఉపద్రవాలు.

పరమాత్మ చింతనము ఈ పై మూడు రకాల దుఃఖములను శాంతింప జేయుగాక! – అని ఈ శాంతి పాఠం బోధిస్తోంది. (మూడు రకాల దుఃఖాలు శాంతించాలి అని చెప్పడంకోసం మూడుసార్లు "శాంతిః" అనే పదం వాడబడింది.)

(– శ్రీ అరిపిరాల వేంకట సోమాచార్యులుగారి ఈశావాశ్యోపనిషత్తు)

("వేదాలు–ఉపనిషత్తులు" అనే పై తాత్త్వికచింతనకు ఆధారం: "వేదశాస్త్రాల సంక్షిప్త పరిచయం" – "ఉపనిషత్తుల సంక్షిప్త పరిచయం", సంకలనం: కళానిధి సత్యనారాయణమూర్తి – డా॥ రేమిళ్ళ అవధానులు, శ్రీ వేదభారతి, హైదరాబాద్, 2011, 2012. వారికి కృతజ్ఞుడను.)

## 3.5.2 గీతాసారాంశము:-

- శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

అయ్యిందేదో మంచికే అయింది.
అవుతున్న దేదో అదీ మంచికే అవుతుంది.
అవ్వబోయేదేదో కూడా మంచికే అవుతోంది.
నీవేమి పోగొట్టుకున్నావని నీవు విచారిస్తున్నావ్?
నీవేమి తెచ్చావని నీవు పోగొట్టుకుంటావ్?
నీవేమి సృష్టించావని నీకు నష్టం వాటిల్లింది?
నీవు ఏదైతే పొందావో అది ఇక్కడనుండే పొందావు
ఏదైతే ఇచ్చావో ఇక్కడే ఇచ్చావు.
ఈనాడు నీవు నా సొంతం అనుకున్నదంతా,
నిన్న ఇంకొకరి సొంతం కాదా?
మరి రేపు మరొకరి సొంతం కాగలదు!
పరివర్తనం చెందడం అనేది లోకంయొక్క పోకడ.
ధర్మాన్ని ఆచరించు!
ధర్మమే నిన్ను రక్షిస్తుంది!!

## 3.5.3 గీతాసారం-శాంతికి మార్గం:-

-శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు:

- మిత్రమా! ఎందుకు బాధపడుతున్నావ్? అయిందేదో అయింది. పోయిందేదో పోయింది. ఈ లోకానికి వచ్చేటప్పుడు-వట్టి చేతులతో వచ్చావ్! పోయేటప్పుడు లగేజీతో పోవాలనుకుంటున్నావ్. అందుకే నీకీ ఆరాటం, అశాంతి. నీవేమి పోగొట్టుకున్నావని విచారిస్తున్నావ్? నీవేమి తెచ్చావని నీవు పోగొట్టుకుంటావ్? నీవేమి సృష్టించావని నీకు నష్టం వచ్చింది? నీవు ఏదైతే పొందావో-అది ఇక్కడినుండే పొందావు. ఏదైతే ఇచ్చావో - ఇక్కడిదే ఇచ్చావు.

- ఈనాడు నీవు నీసొంతం అనుకున్నదంతా నిన్న ఇంకొకరి సొంతం కాదా? రేపు మరియొకరి సొంతం కాగలదు.
- కావున జరిగేదేదో జరుగక మానదు. అనవసరంగా ఆందోళన పడకు. ఆందోళన అనారోగ్యానికి మూలం. ప్రయత్నంలోపం లేకుండా ప్రయత్నించు. ఫలితం ఏదైనా దైవప్రసాదంగా స్వీకరించు.
- కారు లేదని చింతించవద్దు – కాలు వున్నందుకు సంతోషించు!
- కోట్లు లేవని చింతించవద్దు – కూటికి వుందిగదా? సంతోషించు!
- కాలిలో ముల్లు గుచ్చుకున్నదని చింతించవద్దు – కంటిలో గుచ్చుకోలేదని సంతోషించు!
- కాలం విలువైనది–రేపు అనుదానికి రూపం లేదు – మంచి పనులు వాయిదా వేయకు!
- అసూయను రూపుమాపు– అహంకారాన్ని అణగద్రొక్కు!
- హింసను విడనాడు – అహింసను పాటించు!
- కోపాన్ని దరిచేర్చకు – ఆవేశంతో ఆలోచించకు!
- ఉపకారం చేయలేకపోయినా – అపకారం తలపెట్టకు!
- మతిని శుద్ధంచేసేది మతం – మానవత్వంలేని మతం మతం కాదు!
- దేవుని పూజించు – ప్రాణికోట్లకు సహకరించు!
- తద్వారా భగవదాశీర్వాదంతో శాంతి నీ వెంట, ఇంట, చెంత వుండగలదు!

ఓం శాంతిః శాంతిః శాంతిః

## 3.5.4 భరతవాక్యమ్:–

శ్లో॥ సత్యమేవ జయతే, నాఽనృతం
సత్యేన పంథాః వితతో దేవయానః!
యేన ఆక్రమంతి ఋషయోహి ఆప్తకామాః
యత్ర తత్ సత్యస్య పరమం నిధానమ్॥

(–"ముండకోపనిషత్తు' లోని ఒక మంత్రము)

తా॥ సత్యమే జయించును; అసత్యము కాదు (అసత్యము జయించదు). దేవయానము (మోక్షము) సత్యమార్గములోనే అల్లుకొనిపోయినది. అన్ని

కామములను జయించిన ఋషులు ఈ సత్యముయొక్క పరమపదమును చేరుకొందురు.

(తాత్పర్యకర్త: శతావధాని డా॥ ఆర్. గణేశ్‌గారు)

**శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః, పరిపాలయంతాం**
**న్యాయేన మార్గేణ మహీం మహీశాః,**
**గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం,**
**లోకాస్సమస్తా స్సుఖినో భవంతు!!**

తా॥ ప్రజలకు స్వస్తియగుకాక! (మంచికలుగుకాక!) రాజులు, న్యాయము తప్పని మార్గములో భూమిని పాలింతురుగాక! గోవులకును, బ్రాహ్మణులకును శుభము కలుగుగాక! లోకములన్నియు సుఖవంతములగుగాక!

**శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ ।**
**దేశోఽయం క్షోభరహితో, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥**

తా॥ వానదేవుడు యోగ్యమగు కాలమున వర్షించుగాక! భూదేవి సస్యములతో (పంటలతో) విరాజిల్లునది అగుకాక! ఈ దేశము క్షోభలేనిది (ఉపద్రవములు లేనిది) అగుగాక! బ్రాహ్మణులు భయములేనివారగుదురుగాక!

**శ్లో॥ అపుత్రాః పుత్రిణ స్సంతు, పుత్రిణ స్సంతు పౌత్రిణః ।**
**అధనా స్సధనా స్సంతు, జీవంతు శరదాం శతమ్॥**

తా॥ పుత్రులు లేనివారు పుత్రులు కలవారగుదురుగాక! పుత్రవంతులు మనుమలు కలవారగుదురుగాక! ధనహీనులు ధనవంతులగుదురుగాక! అందరును నూరేండ్ల ఆయువు కలవారగుదురుగాక!

(తాత్పర్యకర్త: ఆచార్య శలాక రఘునాథశర్మగారు)

(కీ.శే.టి.వి.కె.సోమయాజులుగారు రచించిన "జ్ఞానరత్నాలు" అను గ్రంథంనుండి)

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!**

అనుబంధం-1

# అనవద్యం-తెలుగుపద్యం

## బెంగుళూరు విశ్వవిద్యాలయం - తెలుగు అధ్యయనశాఖ
## పద్యపఠనం-ప్రత్యేక తరగతులు (1974 నుండి 1996 వరకు)

నిర్వహణ: ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!
(-బమ్మెర పోతన భాగవతము)

చ॥ నుతజల పూరితంబులగు నూతులు నూటిటికంటె, సూనృత
వ్రత! ఒక బావి మేలు, మరి బావులు నూటిటికంటె నొక్క స
త్క్రతువది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడగన్.
(-నన్నయ భారతము)

ఉ॥ సారపు ధర్మమున్, విమల సత్యము, పాపముచేత, బొంకుచే
పారము పొందలేక చెడబారినదైన యవస్థ, దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది వారల చేటగుగాని, ధర్మ ని
స్తారకమయ్యు, సత్యశుభదాయక మయ్యును దైవముండెడిన్.
(-తిక్కన భారతము)

తే॥ జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందు తెలుఁగు లెస్స!
జగతి తల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాడుబిడ్డ మేలు కాదె? (-శ్రీనాథుని క్రీడాభిరామము)

ఉ॥ తొండము, నేకదంతమును తోరపుబొజ్జయు, వామహస్తమున్,
మెండుగ(మ్రోయు గజ్జెలును, మెల్లని చూపులు, మందహాసమున్,
కొండొక గుజ్జురూపమున, కోరిన విద్యలకెల్ల నొజ్జయై -
యుండెడి పార్వతీతనయ! ఓయి గణాధిప! నీకు మ్రొక్కెదన్.

(-ప్రార్థనపద్యం, చాటువు)

శా॥ తల్లీ! నిన్నుఁ దలంచి పుస్తకము చేతన్ బూనితిన్, నీవు నా
యుల్లంబందున నిల్చి, జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందుబింబాననా!

(-ప్రార్థనపద్యం, చాటువు)

ఆ॥ తెలుఁగదేల యన్న, దేశంబు తెలుఁ, గేను
తెలుఁగు వల్లభుండ, తెలుఁగొ కండ
ఎల్లనృపులుఁ గొలువ నెఱుగవే బాసాడి?
దేశభాషలందు తెలుఁగు లెస్స!

(- శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద)

ఉ॥ అమ్మలగన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల పె
ద్దమ్మ, సురారులమ్మ కడు పారడిపుచ్చిన యమ్మ, తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా
యమ్మ, కృపాబ్ధి, యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్.

(- బమ్మెర పోతన భాగవతం)

శా॥ 'నానాసూనవితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల?' దటంచు గంధఫలి, బల్ కాకన్, తపంబంది, యో
షానాసాకృతిఁ బూని, సర్వసుమనస్సౌరభ్య సంవాసమై
పూనెన్ - ప్రేక్షణమాలికా మధుకరీపుంజము లిర్వంకలన్.

(- రామరాజభూషణుడు, వసుచరిత్ర)

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు,
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ!
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు,
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము!
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు,
మధువైరిఁ దవిలిన మనము మనము!
భగవంతు వలగొను పదములు పదములు,
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి!
తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము,
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు,
కుంభినీధవుఁ జెప్పెడి గురుడు గురుడు,
తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి!

(– బమ్మెర పోతన, భాగవతము)

చ॥ నిరుపహతి స్థలమ్ము, రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడె, మాత్మకింపయిన భోజన, ముయ్యెల మంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్,
దొరకిన గాక – ఊరక కృతుల్ రచింపుమటన్న శక్యమే!

(– అల్లసాని పెద్దన, చాటువు)

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపలనుండు లీనమై,
ఎవ్వనియందు డిందు, పరమేశ్వరుఁ డెవ్వఁడు, మూలకారణం
బెవ్వఁ, డనాది మధ్యలయుఁ డెవ్వఁడు, సర్వము తానయైనవా
డెవ్వఁడు, వాని, నాత్మభవు, నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

(– బమ్మెర పోతన, భాగవతము)

మ॥ జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో, వామపాదంబునన్

తొలగన్ ద్రోఁచె లతాంగి, అట్లయగు, నాథుల్ నేరముల్ సేయ, పే
రలుకన్ జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే?

(-ముక్కుతిమ్మన, పారిజాతాపహరణం)

ఉ॥ నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు, మౌళిపరిసర్పిత ఫించమువాఁడు, నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు, చెల్వల మానధనంబు దెచ్చె, నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ! చెప్పరే?

(-బమ్మెర పోతన, భాగవతము)

సీ॥ కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి,
రత్నాంబరంబు లేరాయఁడిచ్చు?
రంభఁగూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు,
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి, మఱి
హేమపాత్రన్న మెవ్వని పంక్తిఁగలదు?
కైలాసగిరిఁబండె మైలారు విభుఁడేగి,
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?
గీ॥ భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ,
గలియుగంబున నిఁకనుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ దమరపురికి!

(-శ్రీనాథుని చాటుపద్యం)

శా॥ లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్,
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపందగున్ దీనునిన్,
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

(-బమ్మెర పోతన, భాగవతము)

శా॥ కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ? సిరి మూటగట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాయులై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా?

(–బమ్మెర పోతన, భాగవతము)

శా॥ ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ,
బాదాబ్జంబులపైఁ, గపోల తటిపైఁ, బాలిండ్లపై, నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట, మీఁదై నా కరంబుంట మే
ల్గాదే?, రాజ్యము గీజ్యమున్ సతతమే?, కాయంబు నాపాయమే?

(–బమ్మెర పోతన, భాగవతము)

మ॥ అల వైకుంఠపురంబులో నగరిలో, నా మూలసౌధంబు దా
పల, మందార వనాంతరామృతసరః ప్రాతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాప్రపన్న ప్రపన్నుండు వి
హ్వల నాగేంద్రము "పాహిపాహి" యనఁ, గుయ్యాలించి సంరంభియై.

మ॥ సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, దే
పరివారంబును జీరఁ, దభ్రగపతిం బన్నింపఁ, దాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు, వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు, గజప్రాణావనోత్సాహియై.

(– బమ్మెర పోతన, భాగవతము)

సీ॥ శ్రీ మనోహర! సురార్చిత! సింధుగంభీర!
భక్తవత్సల! కోటిభానుతేజ!
కంజనేత్ర! హిరణ్యకశిపునాశక! శూర!
సాధురక్షణ! శంఖచక్రహస్త!
ప్రహ్లాదవరద! పాపధ్వంస! సర్వేశ!
క్షీరసాగరశయన! కృష్ణవర్ణ!

పక్షివాహన! లసత్భ్రమరకుంతలజాల!
పల్లవారుణపాదపద్మయుగళ!
తే॥ చారు శ్రీగంధ నాగరు చర్చితాంగ!
కుందకుట్మలదంత! వైకుంఠధామ!
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!!

(-శేషప్పకవి, శ్రీ నరసింహశతకము

మ॥ ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

సీ॥ మందారమకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు?
లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు?
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు?
తే॥ అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు?
వినుత గుణశీల! మాటలు వేయునేల?

(-బమ్మెర పోతన, భాగవతము)

చ॥ అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన

**స్ఫుట నటనాను కూల(రూప) పరిఫుల్ల కలాప కలాపిజాలమున్**
**గటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్!**

(-అల్లసాని పెద్దన మనుచరిత్ర, 2-3)

**అర్థం:-** భూమిసురుఁడు = బ్రాహ్మణుఁడు (ప్రవరుఁడు), చని =పాదలేపన మహిమచేత హిమగిరికిపోయి, అటన్ = అచ్చట, అంబర.... జాలమున్ - అంబర = ఆకాశమును, చుంబి = ముద్దిడుకొనుచు, (సోకుచున్న అని భావము), శిరః = శిఖరములనుండి, సరత్ = ప్రవహించుచున్న, ఝరీ = సెలయేళ్లయొక్క, పటల = సమూహమందు, ముహుర్ముహుః = (ముహుః + ముహుః) = మాటిమాటికి, లుఠత్ = దొరలుచున్నట్టియు, అభంగ = ఎడతెగని, తరంగ = కెరటములనెడి, మృదంగ= మద్దెలయొక్క, నిస్వన = ధ్వనులచేత, స్ఫుట = స్పష్టమగుచున్న, నటన = నాట్యమునకు, అనురూఢ = తగినట్లుగా ('అనుకూల' - పాఠాంతరము), పరిఫుల్ల = పూర్తిగా విప్పబడిన, కలాప = పింఛములుగల, కలాపి జాలమున్ = మగనెమళ్లగుంపు గలదియును; కటక...సాలమున్ - కటక = కొండనడిమితావులందు, చరత్ = సంచరించుచున్న, కరేణు = (ఆడు)ఏనుగులయొక్క, కర = తొండములచేత, కంపిత = కదల్పబడిన, సాలమున్ = వృక్షములుగలదియు (సాలము=మద్దిచెట్టు), (అగు) శీతశైలమున్ = మంచుకొండను (హిమగిరిని) కాంచెన్ = చూచెను.

**తాత్పర్యం:-** ఆ రీతిగా వెళ్లి ప్రవరుడు ఆకాశాన్ని ముద్దుపెట్టుకున్నట్లుగా ఉన్న శిఖరాలనుండి సెలయేళ్లు ప్రవహిస్తూ ఉండగా, వాటి చప్పుళ్లు మద్దెల ధ్వనులనుకొని నాట్యంచేస్తున్న మగనెమళ్లతోను, కొండ నడిమి ప్రదేశంలో ఉన్న మద్దిచెట్లను తొండములతో పట్టుకొని విరుచుకుటకు కదిలిస్తున్న (ఆడ)ఏనుగులతోను ఉన్న హిమాలయ పర్వతాన్ని చూచాడు.

**విశేషాలు:-** ఈ పద్యంలో "అతిశయోక్తి" - "రూపకము" అనే అర్థాలంకారా లున్నాయి. "శిరస్సరజ్ఝరీ" - "అభంగ తరంగ మృదంగ" - "వృత్యనుప్రాసము" అనే శబ్దాలంకారం ఉన్నది. అలాగే "జాలము-సాలము-శైలము" అనే పదాలనుబట్టి "అంత్యానుప్రాసం" అనే శబ్దాలంకారం ఉన్నది.

**మరికొన్ని విశేషాలు:-** ఈ పద్యంలో ఉన్న "కలాపి" - "కరేణు" అనే శబ్దాలను ఉద్దండ పండితుడైన కీ.శే. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు తమ వ్యాఖ్యానంలో ఈ క్రింది విధంగా వివరించారు:-

"కలాపి" – అంటే ఆడనెమలి. కాని ఆడనెమలికి పింఛం ఉండదు. అందువల్ల ఇక్కడ "కలాపి" అంటే "మగనెమలి" అని అర్థం చెప్పుకోవాలి.

"కరేణు" – అంటే "ఆడయేనుగు". కాని ఈ శబ్దం ఇక్కడ ప్రయోగించడంలో అర్థవిశేషం ఏమీలేదు. అసలు ఈ శబ్దం సంస్కృతంలో స్త్రీలింగంగాను, పుంలింగంగాను కూడా ఉంది. కాబట్టి "కరేణు" శబ్దానికి "ఆడయేనుగు" "మగఏనుగు" అనే రెండర్థాలూ వస్తాయి. కాబట్టి ఈ శబ్దాన్ని ఇక్కడ జాతివాచకంగా చెప్పుకొని "ఏనుగు" అని అర్థం చెప్పుకుంటే చాలు. (కాని కొందరు మనుచరిత్ర వ్యాఖ్యాతలు "కరేణు" శబ్దానికి "ఆడఏనుగు" అనే అర్థం వ్రాశారని వెంపరాలవారే అన్నారు)

కాని నేను తెలుగు ఎం.ఏ. విద్యార్థులకు "మనుచరిత్ర" Spicial Study గా పాఠంచెపుతున్న రోజులలో హిందూపురం కళాశాలలో "కట్టా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు" అనే గొప్ప పండితుడు విమర్శకుడు తెలుగు లెక్చరర్‌గా ఉండేవారు. ఆయన మనుచరిత్రను విమర్శిస్తూ ఒక చిన్న పుస్తకం వ్రాశారు. అందులో వారు "కరేణు" శబ్దన్ని గురించి చాలా గొప్పగా వ్యాఖ్యానించారు:–

"ఇక్కడ 'కరేణు' శబ్దానికి "ఆడఏనుగు" అనే అర్థం. ఈ శబ్దాన్ని అల్లసాని పెద్దనగారు గొప్పధ్వనితో ప్రయోగించారు. ఆడఏనుగులు బలమైన మద్దిచెట్లను కదిలిస్తున్నాయి; అంతే! వాటిని విరచలేకపోతున్నాయి. ఈ ద్వితీయాశ్వాసంలో ఈ వర్ణన, తర్వాత ముందురాబోయే కథలో "వరూధిని" అనే అప్సరస, నిష్ఠాగరిష్ఠుడైన ప్రవరుణ్ణి తన మోహపువలలో వేసుకుందామని ఎంతో ప్రయత్నించింది. అతడు ఏమీ లొంగలేదు. అతడు మద్దిచెట్లగుంపులాగ స్థిరంగా నిలబడ్డాడు. వరూధిని ఆడ ఏనుగుల గుంపులాగ మద్దిచెట్లను విరిచి పారెయ్యాలని చూసింది. ఆమె ప్రయత్నం ఏమీ ఫలించలేదు. ఈ ధ్వనిని దృష్టిలో పెట్టుకొని పెద్దనగారు "ఆడఏనుగులగుంపును వరూధినికిని, "మద్దిచెట్లగుంపును"ను ప్రవరునికి ప్రతీకలుగా ఇక్కడ ప్రయోగించాడు" అని వ్రాశారు.

ఇది చాలా గొప్ప విమర్శ. ఇది "నభూతో నభవిష్యతి" వంటి విమర్శ. ఇది చదివి నేను ఎంతో ముగ్ధుడనైపోయాను! వారిని బెంగుళూరు పిలిపించి, ఆయనచేత మా ఎం.ఏ. విద్యార్థులకు ఉపన్యాసం ఇప్పించాను. వారి విమర్శ వ్యాసాన్ని జిరాక్స్ చేయించి విద్యార్థులందరికీ పంచిపెట్టాను. "That is Tangirala!" ఆనాడు ఇంత శ్రద్ధతో తెలుగు పాఠాలు చెప్పాను కాబట్టే ఈనాడు ఇంతమంది ఆనాటి తెలుగు ఎం.ఏ. విద్యార్థులు, కన్నడ ఎం.ఏ. విద్యార్థులు ఈ గ్రంథంలో నన్ను మిక్కిలిగా ప్రశంసించారు. నేను ధన్యుడనయ్యాను!!

ఈ సందర్భంగా ఈ పుస్తకం చదివే పాఠకులకు మరో విషయాన్ని, జ్ఞాపకం చేస్తున్నాను, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రాయలవారి ఆముక్తమాల్యదకు పీఠిక వ్రాస్తూ "ఆముక్తమాల్యద బెనారస్ పట్టుచీర! దానినిండా బంగారు పువ్వులే! దాని జరీఅంచు మాలదాసరికథ!" అన్నారు. పట్టుచీరలలో మనదేశంలో నా ఉద్దేశంలో "కంచిపట్టుచీర" గొప్పది. ఈయన బెనారస్ పట్టుచీర అన్నారేమిటి? అనే అనుమానం వచ్చింది. నేను పట్టుచీరలకు ప్రసిద్ధికెక్కిన బెంగుళూరులో ఉన్నాను. ఆవర్తకులలో ఒకాయన, పేరు: శ్రీ దొంతి నాగభూషణ్, "భూషణ్ సిల్కుహౌస్" అధినేత నా ప్రాణమిత్రులు. ఆయన దగ్గరకు వెళ్ళాను. "మీ పట్టుచీరలలో కంచిపట్టుచీర గొప్పది కదా! బెనారస్ పట్టుచీర విశేషమేమిటి?" అని అడిగాను. ఆయన వివరించారు. అన్ని గొప్ప పట్టుచీరల మీదా బంగారు పూలతో 'బుటా' ఉంటుంది. మనం బాగా పరిశీలిస్తే చీరమీద ఉన్న బంగారు పూలన్నీ ఒకే రకంగా ఉంటాయి. ఒకదానికి మరొక దానికి ఏమీ తేడా ఉండదు. కాని ఒక్క బెనారస్ పట్టుచీర మాత్రం మిక్కిలి ప్రత్యేకమైనది! దాని మీద ఉన్న బంగారు పువ్వులలో ఒకదానికి మరొక దానికి ఏమీ సంబంధం ఉండదు. ప్రతిపువ్వు ప్రత్యేకంగా ఉంటుంది. అంత శ్రద్ధగా కుడతారు చేనేతవారు దానిమీద పువ్వులను" అన్నారు. దానితో విశ్వనాథవారి విమర్శ నాకు అర్థమయింది. మనుచరిత్రాది ప్రబంధాలలో ఒక్క పద్యం చదివితే చాలు; తక్కిన పద్యాలన్నీ అలాగే ఉంటాయని మనకు తెలిసిపోతుంది. కాని ఒక్క రాయలవారి ఆముక్తమాల్యదను మాత్రం అలా అంచనా వేయడానికి కుదరదు. ఒక పద్యం ఉన్నట్టుగా మరో పద్యం ఉండదు. రాయలవారు ప్రతి పద్యాన్నీ ప్రత్యేకమైన శిల్పంతో రచిస్తాడు. ఆముక్తమాల్యదలో ఒక పద్యాన్ని చదివి, తక్కిన పద్యాలను బ్రహ్మదేవుడు కూడా ఊహించలేడు! అది "బెనారస్ పట్టుచీర!" అన్నీ బంగారు పువ్వులే! కాని ఒక పువ్వు మరొక పువ్వును పోలకుండా ప్రత్యేకంగా ఉంటుంది. దీనినిబట్టి విశ్వనాథవారు ఎంత గొప్ప విమర్శకుడో ఊహించుకోండి. నేను ఆముక్తమాల్యదను కూడా మా తెలుగు ఎం.ఏ. విద్యార్థులకు Special Studyగా పాఠం చెప్పాను. "బెనారస్ పట్టుచీర" సంగతి మా విద్యార్థులకు వివరించి చెప్పాను. పాఠం చెప్పడంలో ఇంత శ్రద్ధ తీసుకొనే వాడిని. అందుకే నా శిష్యులకు ఈ నాటికీ నా మీద ఇంత అభిమానం!!

**దేవకీసుతుఁ డేవేళ దిక్కు నాకు!:**

**సీ. కుప్పించి యెగసినఁ గుండలమ్ముల కాంతి**
**గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ,**

**నుతికిన నోర్వక యుదరంబులో నున్న**
**జగముల వ్రేఁగున జగతి గదలఁ**
**జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ**
**బైనున్న పచ్చని పటము జాఱ,**
**'నమ్మితి నాలావు, నగుఁబాటు సేయక**
**మన్నింపు, మని క్రీడి మరలఁ దిగువఁ**
**తే. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి,**
**'నేఁడు భీష్మునిఁ జంపుదు, నిన్నుఁగాతు,**
**విడువుమర్జున' యనుచు మద్విశిఖవృష్టిఁ**
**దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు!**

**తా.** ఆనాడు యుద్ధరంగంలో నా శరవర్షానికి తట్టుకోలేక, నన్ను చంపి అర్జునుని రక్షించాలనే ఉద్దేశంతో, నా పైకి చక్రాన్ని చేపట్టి దుముకుచున్న నీ వీరగంభీర స్వరూపం నాకు ఇప్పటికీ కన్నులకు కట్టినట్లుగానే ఉంది. రథంపైనుండి ఎగిరి దూకుతున్నప్పుడు నీ కుండలాల కాంతి ఆకాశమంతటా వ్యాపించింది. ముందుకు లంఘిస్తున్నప్పుడు కుక్షిలోనున్న పిండాండం కదలిపోగా, దాని బరువుకు వెలుపలనున్న బ్రహ్మాండమంతా కంపించింది. చక్రాన్ని చేత ధరించి ముందుకు దూకుతున్నప్పుడు పైనున్న బంగారు ఉత్తరీయం క్రిందకు జారిపోయినా, భక్తసంరక్షణార్థం నడుముకట్టిన స్వామి, వేషాన్ని చక్కదిద్దుకోవడంలో శ్రద్ధ చూపలేదు. నా పరాక్రమంపై నాకు విశ్వాసం ఉందని నమ్ముకొన్న నన్ను నలుగురిలో నవ్వులపాలు చేయవద్దని, క్రీడి వెనుకకు లాగుతున్నా, ఆ ఆర్తత్రాణ పరాయణుడు పట్టించుకోలేదు. ఏనుగుపై లంఘించే సంహింపిల్లలాగ ముందుకు దుమికివేశాడు. "ఈ రోజు భీష్ముణ్ణి చంపి, అర్జునుణ్ణి రక్షిస్తాను" అని అరిచాడు. "నన్ను విడిచిపెట్టు. ఈ గాంగేయుని సంగతి నేటితో సరి" అని పై బడిన భక్తరక్షణపరాయణుడు నాకు సదా రక్షగా నుండుగాక!

**మ. కనియెన్ రుక్మిణి, చంద్రమండలముఖున్, గంఠీరవేంద్రావల**
**గ్ను, నవాంభోజదళాక్షుఁ, జారుతరవక్షున్, మేఘసంకాశదే**
**హు, నగారాతి గజేంద్ర హస్తనిభ బాహుం, జక్రిఁ, బీతాంబరున్,**
**ఘన భూషాన్వితుఁ, గంబుకంఠు, విజయోత్కంఠున్, జగన్మోహనున్.**

(-పోతన భాగవతము)

**తా॥** రుక్మిణి శ్రీకృష్ణుని చూచింది. ఆయన ఎలా ఉన్నాడో వర్ణిస్తున్నాడు కవి. చంద్రబింబంవంటి ముఖం కలిగినవాడు. శ్రేష్ఠమైన సింహంయొక్క నడుమువంటి నడుము కలవాడు. అప్పుడే వికసించిన తామరరేకులవంటి కన్నులు కలవాడు. చాలా అందమైన బొమ్మగలవాడు. నల్లమబ్బును పోలిన శరీరవర్ణం కలవాడు. ఇంద్రుని ఐరావతంయొక్క తొండంతో సమానమైన భుజములు కలవాడు. చేతిలో చక్రం కలవాడు. పసువన్నె పట్టుబట్ట (పీతాంబరం) కట్టుకున్నవాడు. గొప్పగొప్ప ఆభరణాలు ధరించినవాడు. శంఖంలాంటి కంఠం గలవాడు. విజయమునందు వేడుక (విజయోత్సాహం) కలిగినవాడు. లోకాలను మోహింపజేసేవాడు. ఇటువంటి కృష్ణుణ్ణి రుక్మిణి (తన జీవితంలో మొట్టమొదటిసారిగా) చూచింది.

**మథురానగరంలో ప్రవేశించిన శ్రీకృష్ణుని చూస్తూ అక్కడి ప్రజలు తమలో తాము ఇలా అనుకంటున్నారు:-**

**సీ॥ వీఁడఁటే! రక్కసి విగతజీవిగఁ జన్నుఁ**
**బాలు ద్రావిన మేటి బాలకుండు!**
**వీఁడఁటే! నందుని వెలఁదికి జగమెల్ల**
**ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు!**
**వీఁడఁటే! మందలో వెన్నలు దొంగిలి**
**దర్పించి మెక్కిన దాఁపరీఁడు!**
**వీఁడఁటే! యెలయించి వ్రేతల మానంబు**
**చూఱలాడిన లోకసుందరుండు!**

**తే॥ వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు!**
**వీనిఁ బొందని జన్మంబు విగతఫలము!**
**వీనిఁ బలుకని వచనంబు విహగరుతము!**
**వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు!**

(-పోతన భాగవతము, 10-1248)



# కోడిపోరు

– శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర

పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కలు పొరిపొరి నార్చి
కనుల నిప్పులురాలు కైవడి నవ్వి
ఉగ్రంపుదృష్టిని నొండొంటి జూచి
కులగిరు లదరంగ కూయుచు జేరి
ముక్కు ముక్కులు చేర్చి మొనసి రోషమున
మెడయీక లుబ్బగా మెడవంచి రెండు
ఉప్పరం బెగయుచు నురవడి తన్ను
తన్నిన తూలక దట్టంపు గోళ్ల
మిట్టిమీదికెగసి మీరుచు తన్ని
కరవంగ వచ్చిన గతి చూచి బరిని
వలయంబుగా వచ్చి వడి తన్నుటయును
చిరచిర తిరుగుచు చేరి యాలోన
ఉరవు వ్రేయగ జూచి యొక్కటై యుబ్బి
రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ
పెంధూళి యెగసియు పెంపగుచుండ
సంగ్రామకేళికి సంతసంబంది
ఉరికించి తన్నగా నురముల నాటి
రక్తంబు దొరగంగ రాగంబు నొందె
తన్నుట తాకుట తమకు నొచ్చుటయు
తలపక మగటిమి తలకొని రెండు
తలపడెనట దేవతలు చోద్యపడగ!



**సీ॥ మగమీల నగఁజాలు తెగఁ గీలుకొను వాలుఁ**
**గనుఁగవ కొక వింతకాంతి యొదవె,**
**వలిజక్కవల పెక్కువలు దక్కువగ నిక్కు**
**చనుదోయి కొక వింతచాయ దోఁచె,**
**నెలతుమ్మెదల దిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము**
**గల వేణికొక వింతనలుపు మీఱె,**
**నల చెందొవలవిందు చెలువెందు[1] వెదచిందు**
**మొగమున కొక వింతజిగి దొలంకెఁ,**
**తే॥ జక్కఁదనమున కొక వింతచక్కదనము,**
**జవ్వనంబున కొక వింతజవ్వనంబు,**
**విభ్రమంబున కొక వింతవిభ్రమంబు,**
**గలిగె నద్దివ్య కుసుమంబు కతన సతికి!**

– నంది (ముక్కు) తిమ్మన–పారిజాతాపహరణము, 1–56)

**అర్థములు**:–మగమీలన్=మగచేపలను; నగఁజాలు=నవ్వగలిగిన (తిరస్కరించు); తెగ=విధముగా; కీలుకొను=అమరియుండు; వలి=గ్రుండని; జక్కువల= చక్రవాకములయొక్క; పెక్కువలు = ఆధిక్యము; ఎల తుమ్మెదల= లేత తుమ్మెదల; దిమ్ము=గర్వమును; వెలిఁజిమ్ము=పోగొట్టు; చెన్ను+తొవల–చెందొవల=ఎఱ్ఱకలువల యొక్క; విందు=బంధువు(చంద్రుడు); చెలువు = అందమును; ఎందున్ = ఎచ్చటను; వెదచిందు = ప్రసరింపజేయు; విభ్రమము–విలాసము; కతన = కారణమున.

**తా॥** మగచేపలను పరిహసించే విధంగా ఒప్పారే రుక్మిణీదేవి వాలుకన్నులలో ఒక వింతకాంతి మెరిసింది. చక్రవాక పక్షుల ఆధిక్యాన్ని చిన్నబుచ్చేలా అందాలు చిందే చనుదోయికి ఒక వింత చాయ అబ్బింది. లేతదుమ్మెదల గర్వాన్ని పోగొట్టే సొగసుగల కొప్పునకు ఒక వింత నలుపు అమరింది. ఎఱ్ఱకలువల బంధువు అయిన చంద్రునివలె అందం వ్యాపించిన ఆమె ముఖానికి ఒక కొత్త విలాసము ఏర్పడింది. ఆ దివ్యపుష్పం అలంకరించుకోవడం కారణంగా రుక్మిణీదేవి చక్కదనానికి ఒక వింత చక్కదనం, యౌవనానికి ఒక క్రొత్తయౌవనం, విలాసానికి ఒక వింత విలాసం, కలిగాయి. (1."చెలువందు" – పాఠాంతరం) ■

అనుబంధం-2

## అనర్ఘమణిఖని-అమరవాణీ రసధుని

# 1 శ్రీకృష్ణకర్ణామృతం

శ్లో॥ కస్తూరీ తిలకం లలాటఫలకే, వక్షస్థలే కౌస్తుభం,
నాసాగ్రే నవమౌక్తికం, కరతలే వేణుం, కరే కంకణమ్ ।
సర్వాంగే హరిచందనం, చ, కలయన్, కంఠేచ ముక్తావళిం,
గోపస్త్రీ పరివేష్టితో, విజయతే, గోపాలచూడామణిః ॥
(-బిల్వమంగళ లీలాశుకుడు)

మ. నుదుటం గస్తురిబొట్టు, నాసిక తుదన్ ముత్తెంబు, శ్రీగంధసం
పద నెమ్మేనఁ, గరంబులం గటకముల్, వంశంబు హస్తాగ్రమం,
దెదపై నిస్తుల కౌస్తుభంబు, నఱుతన్ శృంగారహారంబు, నిం
పొదవం, గృష్ణుఁడు గోపికావృతుఁడు, సర్వోత్కృష్టుడై౦ వర్తిలున్.
(-వెలగపూడి వెంగనామాత్యుడు)

శ్లో॥ అంసాలంబిత వామకుండల భరం, మందోన్నత భ్రూలతం,
కించిత్కుంచిత కోమలాధరపుటం, సాచిప్రసారేక్షణమ్,।
ఆలోలాంగుళి పల్లవై ర్మురళికా మాపూరయంతం ముదా,
మూలే కల్పతరో, స్త్రిభంగి లలితం, జానే, జగన్మోహనమ్॥

**తా॥** వేణువు నూదుచున్న జగన్మోహనుడైన శ్రీకృష్ణుణ్ణి ధ్యానించి తెలుసుకుంటున్నాను. ఆ మురళీకృష్ణుడు ఎలా ఉన్నాడంటే - ఎడమ ప్రక్కగా తల వంచడంచేత ఆ ప్రక్కనున్న చెవిపోగు బరువు ఎడమమూపుపై ఆనింది. కనుబొమలతీగ కొంచెం పైకిలేచింది. కొద్దిగా ముడిచిన మృదువైన పెదవులు కలవాడు. (పిల్లనగ్రోవిని ఊదేటప్పుడు మృదువైన పెదవులు కొంచెం ముడిచాడు.) చూపులు అడ్డంగా వ్యాపిస్తున్నాయి. (తల కొంత వంచి ఒక ప్రక్కకు వాల్చి, వేణువును ఊదేటప్పుడు చూపులు అడ్డంగా నిగుడుతున్నాయి - చూపులు ప్రక్కలకు వాలుతున్నాయి - ప్రక్కచూపులు చూస్తున్నాడు.) చలిస్తున్న (అంటే మురళిపై రంధ్రాల మీదుగా సంచరిస్తున్న) చిగుళ్ళవంటి వ్రేళ్ళచేత వేణువును సంతోషంగా పూరిస్తున్నాడు. కల్పవృక్షం (మందారవృక్షం) మూలంలో

(మొదలు దగ్గర) ఉన్నాడు. మూడు వంపులచేత (త్రిభంగిచేత) సుందరమైనవాడు. (పాదాలనుండి కటివరకు ఎడమవైపుగా ఒక వంపు; కటినుండి తలవరకు కుడివైపుగా ఒక వంపు; తల ఎడమవైపుగా ఒక వంపు.) లోకాలను మోహింపజేసేవాడు.

**శ్లో॥ మధురైకరసం వపుర్విభోః**
**మధురావీథి చరం భజామహే।**
**నగరీ మృగశాబలోచనా**
**నయనేందీవరవర్ష వర్షితమ్॥** (-శ్రీకృష్ణకర్ణామృతము, 3-19)

**తా:** మేము (కౌమార)కృష్ణుని కాంతివంతమైన శరీరాన్ని పూజిస్తాము. అది ఎటువంటిదంటే - శృంగారంయొక్క లేదా సౌందర్యంయొక్క ముఖ్యమైన సారంలాంటిది (the important essence of beauty)! మథురానగర వీథుల్లో సంచరించేటువంటిది. ఆ నగరంలోని, లేడిపిల్లల కన్నులవంటి కన్నులు కలిగిన యువతులయొక్క కన్నులనే నల్లకలువల వానలో తడిసిపోతున్నటువంటిది!

**శ్లో॥ బాలాయ, నీలవపుషే, నవకింకిణీక-**
**జాలాభిరామజఘనాయ, దిగంబరాయ,**
**శార్దూల దివ్యనఖభూషణ భూషితాయ,**
**నందాత్మజాయ, నవనీతముషే, నమస్తే!**

(శ్రీకృష్ణకర్ణామృతము,2-74)

**తా॥** పసివాడవును; నల్లని ఒడలు కలవాడవును; కొత్త చిరుగంటల గుత్తులచేత అందగించిన మొలకలవాడవును; దిస్సమొలవాడవును; (మెడలో) మంచి పులిగోరు పతకముతో అలంకరింపబడినవాడవును; నందుని కొడుకువును; వెన్నదొంగిలించు వాడవును - అయిన ఓ బాలకృష్ణా! నీకు నా నమస్కారం!

**శ్లో॥ రక్షంతుత్వామ్, అసితజలజై రంజలిః పాదమూలే,**
**మీనా నాభీసరసి, హృదయే మారబాణా మురారేః।**
**హారాః కంఠే హరిమణిమయా, వక్త్రపద్మే ద్విరేఫాః,**
**పింఛాపీడాశ్చికురనిచయే, ఘోషయోషిత్కటాక్షాః॥**

(-శ్రీకృష్ణకర్ణామృతము, 3-86)

**తా॥** (కృష్ణుడు నిలబడి ఉన్నాడు. ఎదురుగా గొల్లపడుచులు ఉన్నారు. వారు వలపు నిండిన కడగంటి చూపులతో కృష్ణుని నఖశిఖ పర్యంతమూ చూస్తున్నారు. ఆ చూపులు ఎలా ఉన్నాయో కవి వర్ణిస్తున్నాడు లీలాశుకుడు.) గోపికల కడగంటి చూపులు కృష్ణుని పాదాలపై ప్రసరించినప్పుడు, నల్లకలువల దోసిళ్ళవలె ఉన్నాయి! నాభిపై పడినప్పుడు, నాభి అనే సరస్సులో ఈదుతున్న చేపలవలె ఉన్నాయి! గుండెలమీద పడినప్పుడు, మన్మథుని బాణాలవలె ఉన్నాయి! కంఠంమీద ప్రసరించినప్పుడు, మెడలో ఇంద్రనీలమణిహారంలా ఉన్నాయి, ముఖపద్మంమీద ప్రసరించినప్పుడు తుమ్మెదలవలె ఉన్నాయి, కురుల సమూహంమీద పడినప్పుడు నెమలికన్నులవలె ఉన్నాయి! అటువంటి గోపికల కడగంటి చూపులు నిన్ను రక్షించుగాక! (స్త్రీల చూపులు నల్లగా ఉంటాయని భావించి వాటిని నల్లకలువలతోను, చేపలతోను, మన్మథుని బాణాలతోను, ఇంద్రనీల మణులతోను, తుమ్మెదలతోను, నెమలికన్నులతోను పోల్చడం కవిసమయం.)

**శ్లో॥ "మాతః-కిం యదునాథ? - దేహి చషకం-కింతేన? - పాతుంపయః-**
**తన్నాస్త్యద్య-కదాస్తివా? -నిశి-నిశాకావా? -అన్ధకారోదయః"।**
**ఆమీల్యాక్షియుగం, "నిశాప్యుపగతా, దేహీ" తి, మాతుర్ముహుః**
**వక్షోజాంశుక కర్షణోద్యతకరః కృష్ణస్స పుష్ణాతు నః ॥**

(శ్రీకృష్ణకర్ణామృతము, 2-60)

**తా:** ముద్దుకృష్ణుడికీ తల్లి యశోదకీ పగలు సంభాషణ జరుగుతోంది: "ఓ అమ్మా!"- ఏమిరా! నాయదురాజా?" "నా ఆపుకోర (పాలుత్రాగే గిన్నె) ఇయ్యి!"-"దానితోం ఏంపని?"-"పాలు త్రాగడంకోసం!"-"పాలు ఇప్పుడులేవు"-"మరి ఎప్పుడు ఉంటాయి?"-"రాత్రివేళ"-"రాత్రి అంటే ఏమిటి?"-"చీకటి పడటం"అని తల్లి చెప్పగానే, ఆ బాలకృష్ణుడు తన రెండు కళ్ళూ గట్టిగా మూసుకొని, "అమ్మా! ఇదిగో రాత్రి వచ్చేసింది! నా పాలగిన్నె యియ్యి!" అంటూ తల్లి అయిన యశోద పైటకొంగు పట్టి లాగడంకోసం చేతులు పైకి ఎత్తిన ఆ చిన్నికృష్ణుడు మమ్మల్ని కాపాడుగాక!

**శ్లో॥ "కస్త్వం బాల? -బాలానుజః! - కిమిహతే? - మన్మందిరా శంకయా!-**
**యుక్తం తన్నవనీతపాత్ర వివరే హస్తం కిమర్థం న్యసేః? - ।**
**మాతః! కంచన వత్సకం మృగయితుం, మాగా విషాదం క్షణాత్"**
**ఇత్యేవం వరవల్లకీ ప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః ॥**

(శ్రీకృష్ణకర్ణామృతము, 2-82)

**తా:** బాలకృష్ణుడు వెన్న దొంగిలించడంకోసం ఒక గోపిక యింట్లోకి చొరబడ్డాడు. అప్పుడు అతనికి ఆ గోపికకు ఇలా సంభాషణ జరుగుతోంది: "బాలకా! ఎవడవు నీవు?" – "బలరాముని తమ్ముడను!" – "ఇక్కడ నీకేంపని?" – "మాయిల్లు అనుకొని వచ్చేశాను!" – "అది బాగానే ఉంది. కాని వెన్నకుండలో చేయి ఎందుకు పెడుతున్నావు?"–"అమ్మా! (ఈ పాత్రలో) ఒక లేగదూడను వెతుకుతున్నాను. కొంచెం సేపు బాధపడకు!"–అని ఈ విధంగా చిన్నికృష్ణుడు గోపికకు ఇచ్చిన మేలైన సమాధానం మమ్మల్ని కాపాడుగాక!

## 2. శ్రీరామకర్ణామృతం:-

**వ్యాఖ్యాత డా॥ ఏల్చూరి మురళీధరరావు**

**శ్లో॥ శ్రీరాఘవం, దశరథాత్మజ, మప్రమేయం,**
**సీతాపతిం, రఘుకులాన్వయ రత్నదీపమ్ ।**
**ఆజానుబాహుం, మరవిందదళాయతాక్షం,**
**రామం, నిశాచరవినాశకరం, నమామి ॥** 1-2

**తా॥** రఘువంశ సంతానము, దశరథపుత్రుడు, ఇంతటివాడని ప్రమాణించి చెప్ప శక్యముకానివాడు, సీతకు పెనిమిటియు, రఘుమహారాజుయొక్క శ్రేష్ఠమైన వంశమునకు రత్నదీపమైనవాడు, మోకాళ్ళ పర్యంతము చేతులు కలిగినవాడు, పద్మపురేణువులవలె విశాలమైన కన్నులు కలవాడు, రాక్షస నాశనము చేయువాడు అయినటువంటి రామునికి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ మాతా రామో, మత్పితా రామచంద్రో**
**భ్రాతా రామో, మత్సఖా రాఘవేశః ।**
**సర్వస్వం మే రామచంద్రో దయాళుః**
**నాన్యం దైవం నైవ జానే న జానే ॥** (1-40)

**తా॥** తల్లి, తండ్రి, సోదరుడు, స్నేహితుడు – అన్నియునాకు రామచంద్రుడే! వేరే దైవాన్ని నేను ఎరుగనే ఎరుగను.

**శ్లో॥ విమలకమలనేత్రం, విస్ఫురన్నీలగాత్రం**
**తపనకులపవిత్రం, దానవధ్వాంతమిత్రమ్ ।**

**భువనశుభచరిత్రం, భూమిపుత్రీకళత్రం,**
**దశరథవరపుత్రం, నౌమి రామాఖ్య మిత్రమ్ ॥** (1-52)

**తా॥** స్వచ్ఛమైన పదములవంటి నేత్రములు కలిగినవాడు, ప్రకాశించుచున్న నల్లని శరీరము కలిగినవాడు, సూర్యవంశమునందు పవిత్రుడైనవాడు, రాక్షసులు అను చీకటికి సూర్యుడైవాడు, లోకములకు శుభకరమైన చరిత్రకలిగినవాడు, సీతాదేవి భార్యగా గలవాడు దశరథుని కుమారుడైనవాడు, స్నేహితుడైనవాడు - అయినటువంటి కామునికి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ రామాభిరామం, నయనాభిరామం,**
**వాచాభిరామం, వదనాభిరామమ్ ।**
**సర్వాభిరామం చ సదాభిరామం**
**వందే సదా దాశరథిం చ రామమ్॥** (1-96)

**తా॥** సుందరులలో సుందరుడైనవాడు; నేత్రములకు మనోహరమైనవాడు; మాటలచే ఇంపుగానుండువాడు; సుందరమైన ముఖము కలవాడు; అందరికిని ఇష్టమైనవాడు, ఎల్లప్పుడును ఇంపైనవాడు; దశరథ పుత్రుడైనవాడు - ఇటువంటి రామునికి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ జయజయ రఘురామ! శ్రీముఖాంభోజభానో!**
**జయజయ రఘువీర! శ్రీమదంభోజనేత్ర ।**
**జయజయ రఘునాథ! శ్రీకరాభ్యర్చితాంఘ్రే !**
**జయజయ రఘువర్య! శ్రీశ కారుణ్యసింధో! ॥** (1-97)

**తా॥** శ్రీలక్ష్మియొక్క (సీతయొక్క) ముఖపద్మమునకు సూర్యుడవైన ఓ రఘురామా! సర్వోత్కృషటడవై యుండుము!! శోభగల పద్మములవంటి నేత్రములుగల ఓ రఘువీరా! సర్వోత్కృష్టుడవగుము! లక్ష్మియొక్క (సీతయొక్క) హస్తములచే పూజింపబడు పాదములు గల ఓ రఘునాథా! సర్వోత్కృష్టుడవగుము! - లక్ష్మికి (సీతకు) అధిపతివైన దయా సముద్రుడవైన ఓ రఘుకులశ్రేష్ఠుడా! సర్వోత్కృష్టుడవగుము!

**శ్లో॥ వేదవేద్యే పరేపుంసి - జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేతసా దాసీత్ - సాక్షాద్రామాయణాత్మనా ॥** (1-99)

**తా॥** వేదములచేత తెలియదగిన పరమపురుషుడు దశరథుని పుత్రుడైన రాముడుగా పుట్టగానే, వేదములు సాక్షాత్తు రామాయణ స్వరూపాన్ని పొందు వాల్మీకి వలన జన్మించాయి.

**శ్లో॥ వందే నీలసరోజకోమలముఖిం, వందే జగద్వందితం**
**వందే సూర్యకులాబ్ధి కౌస్తుభమణిం, వందే సురారాధితమ్ ।**
**వందే పాతకపంచకప్రహరణం, వందే జగత్కారణం,**
**వందే వింశతిపంచతత్త్వరహితం, వందే సదా రాఘవమ్ ॥** (2-67)

**తా॥** నల్లకలువవలె సొగసైన కాంతి కలిగినవాడు, జగత్తులచేత నమస్కరింపబడుచున్న వాడు; సూర్యవంశమను సముద్రమునకు కౌస్తుభమణియైనవాడు; దేవతలచే పూజింపబడుచున్నవాడు; పంచమహాపాతకములను హరించువాడు; జగత్తులకు కారణమైనవాడు; ఇరువదియైదు తత్త్వములు లేనివాడు; ఇరువదియారవ తత్త్వముచే ప్రకాశించువాడు - ఇటువంటి రామునికి ఎల్లప్పుడును నమస్కరించుచున్నాను.

**శ్లో॥ కరే దివ్యచక్రం, పరే చారు శంఖం**
**గళే తారహారం, లలాటే లలామమ్ ।**
**భుజంగే నిషణ్ణం, పరానంద రూపం,**
**సదా భూమిజాయుక్త, మీళే హృదంతే ॥** (2-91)

**తా॥** ఒక చేతియందు చక్రమును, వేరొక చేతియందు శంఖమును, కంఠమునందు పరిశుద్ధమైన ముత్యాలహారమును, నుదుటియందు బొట్టును, ధరించినట్టియు; శేషునిపై పవళించినట్టియు; పరమానందరూపుడైనట్టియు ఎల్లప్పుడును సీతతో కూడినట్టియు నగు రాముని నా హృదయములో స్తోత్రము చేయుచున్నాను.

**శ్లో॥ కరతలధృతచాపం, కాలమేఘస్వరూపం,**
**సరసిజదళనేత్రం, చారుహాసం, సుగాత్రమ్ ।**
**విచినుతవనవాసం, విక్రమోదగ్రవేషం,**
**ప్రణమత రఘునాథం, జానకీప్రాణనాథమ్ ॥** (3-72)

**తా॥** చేతిలో ధనుస్సు ధరించాడు; నల్లని మేఘమువంటి రూపము కలిగినవాడు. పద్మదళముల వంటి కన్నులు కలిగినవాడు; సుందరమగు నవ్వుకలిగినవాడు; మంచి

దేహము కలిగినవాడు; వనమందు నివాసము కలిగినవాడు; పరాక్రమముచే ఉన్నతమగు వేషము గలవాడు-ఇటువంటి సీతాప్రాణనాథుడైన రామునికి నమస్కరింపుడు!

**శ్లో॥ జయతు విజయకారీ, జానకీమోదకారీ,**
**తపనకులవిహారీ, దండకారణ్యచారీ ।**
**దశవదనకుఠారీ, దైత్యవిచ్ఛేదకారీ,**
**మణిమకుటకధారీ, చండకోదండ ధారీ॥** (3-94)

**తా॥** జయమును కలిగించువాడు; సీతకు సంతోషమును చేయువాడు; సూర్య వంశమునందు వహరించువాడు; దండకారణ్యమునందు సంచరించువాడు; రావణునకు గొడ్డలివంటివాడు; రాక్షస సంహారము చేయువాడు; రత్నకిరీటమును ధరించువాడు. దీర్ఘమైన ధనుస్సును ధరించినవాడు – అయినటువంటి రాముడు జయంచుగాక!

**శ్లో॥ విశాలనేత్రం, పరిపూర్ణగాత్రం,**
**సీతాకళత్రం, సురవైరిజైత్రమ్ ।**
**జగత్పవిత్రం, పరమాత్మతంత్రం,**
**శ్రీరామచంద్రం ప్రణమామి చిత్తే ॥** (4-27)

**తా॥** గొప్పకన్నులు కలవాడు; నిండైనదేహము కలవాడు; సీతను భార్యగా కలవాడు; రాక్షసులను జయించినవాడు; జగత్తులలో పవిత్రుడైనవాడు; పరబ్రహ్మవ్యాపారుడు – ఇటువంటి రామమూర్తికి నా మనస్సులో నమస్కరించుచున్నాను.

**శ్లో॥ లంకావిరావం, రణరంగభీమం,**
**రాజీవనేత్రం, రఘువంశమిత్రమ్ ।**
**కారుణ్యమూర్తిం, కరుణాప్రపూర్తిం,**
**శ్రీరామచంద్రం, శరణం ప్రపద్యే ॥** (4-43)

**తా॥** లంకను పాడుచేసినవాడు; యుద్ధమునందు భయంకరుడైనవాడు; పద్మములవంటి నేత్రములు గలవాడు; రఘువంశమునకు మిత్రుడు; దయాస్వరూపుడు; దయాపూర్ణుడు-ఇటువంటి శ్రీరామచంద్రుని నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ నమో నమస్తేఽఖిలపూజితాయ,**
**నమో నమశ్చంద్రనిభాననాయ ।**
**నమో నమస్తే రఘువంశజాయ,**
**నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ ॥** (4-62)

**తా॥** ఓరామా! ఎల్లవారిచే పూజింపబడు నీకు నమస్కారము! చంద్రునితో సమానమైన ముఖముగల నీకు నమస్కారము! రఘువంశమునందు పుట్టిన నీకు నమస్కారము! లక్ష్మణునితో కూడిన నీకు నమస్కారము!!

**శ్లో॥ వదతు వదతు వాణీ రామనామేతి నిత్యం**
**జపతు జపతు చిత్తం రామపాదారవిందమ్ ।**
**నమతు నమతు దేహం సంతతం రామచంద్రం**
**న భవతు మమ పాపం జన్మజన్మాంతరేషు ॥** (4-66)

**తా॥** నా మాటలు ఎల్లప్పుడును "రామ!రామ!" అని పలుకునుగాక! నా మనస్సు ఎల్లప్పుడును రాముని పాదారవిందములను జపించుగాక! నా దేహము ఎల్లప్పుడును రామునికి నమస్కరించుగాక! నాకు బహు జన్మాంతరము లయందైనను పాపము లేకుండుగాక!!

**ఆశ్వాసాంత శ్లోకములు:- (తాత్పర్యరచన: డా॥ కొడిమడుగు నాగేశ్వరరశాస్త్రిగారు)**

**శ్లో॥ విమలకమలమూర్తే! విస్ఫురన్నీలమూర్తే!**
**శమదమగుణవర్తీ! సాధుసంతాపహర్తీ!**
**సుమశరసమగాత్రా! సూరిసంస్తోత్రపాత్రా!**
**సమదదనుజజైత్రా! క్ష్మాతనూజాకళత్రా!** (1-103)

**తా॥** స్వచ్ఛమైన పద్మమువంటి ఆకృతికలవాడా! ప్రకాశించుచున్న నల్లని శరీరము కలవాడా! శమము దమము అనుగుణములచే ప్రవర్తించువాడా! సజ్జనుల దుఃఖాలను పోగొట్టువాడా! మన్మథునివంటి సుకుమారమైన శరీరము కలవాడా! పండితుల స్తోత్రములకు పాత్రుడైనవాడా! గర్వించిన రాక్షసులను జయించినవాడా! భూమిపుత్రికయైన సీతను భార్యగా కలవాడా!

**శ్లో॥ హరిపదయుగధారీ! వీర్యచిత్తానుసారీ!**
**పరమపదవిహారీ! భక్తలోకోపకారీ!**
**శరధిశరధిమిత్రా! శత్రుసంఘాతజైత్రా!**
**సరసిజదళనేత్రా! సన్మునిస్తోత్రపాత్రా!** (2-112)

తా॥ విష్ణుపాదయుగళమును (జంటను) ధరించినవాడా! సత్పురుషులచిత్తమును అనుసరించువాడా! మోక్షమునందు విహరించువాడా! భక్తసమూహమునకు ఉపకారము చేయువాడా! సముద్రమును అమ్ములపొదిగా చేసికొన్న శివునకు మిత్రుడైనవాడా! శత్రుసమూహమును గెల్చువాడా! పద్మదళములను పోలిన కన్నులు గలవాడా! మహామునుల స్తోత్రములకు పాత్రుడైనవాడా!

**శ్లో॥ వనదనిభశరీరా! వర్ణితామర్త్యవారా!**
**కనకశిఖరిధీరా! కంధిగర్వాపహారా!**
**దనుజఘనసమీరా! ధాత్రిజాచిత్తచోరా!**
**మునిజనసువిచారా! మోక్షలక్ష్మీవిహారా!** (3-115)

**తా॥** మేఘమువంటి శరీరము కలవాడా! దేవతలచే వర్ణింపబడువాడా! బంగారు పర్వతము (మేరుగిరి) వంటి ధైర్యముగలవాడా! సాగరగర్వమును అణచినవాడా! రాక్షసులను మేఘములకు వాయువువంటివాడా! భూమినుండి పుట్టిన సీతాదేవియొక్క మనస్సును దొంగిలించినవాడా! మునిజనులచే చక్కగా తలపబడువాడా! మోక్ష లక్ష్మియందు విహరించువాడా!

**శ్లో॥ రఘుకులవరనాథో! జానకీప్రాణనాథః**
**పితృవచనవిధాతా! కీశరాజ్యప్రదాతా!**
**ప్రతినిశిచరనాశః! ప్రాప్తరాజ్యప్రవేశో!**
**విహితభువనరక్షః! పాతు పద్మాయతాక్షః** (4-111)

తా॥ రఘుమహారాజు వంశమునందు పుట్టినవాడా! సీతాదేవికి మిక్కిలి ప్రియమైనవాడా! తండ్రి చెప్పినపని చేయువాడా! సుగ్రీవునికి రాజ్యమిచ్చినవాడా! శత్రువులైన రాక్షసులను

నశింపజేసినవాడా! రాజ్యమును పొందినవాడా! లోకములను రక్షించినవాడా! పద్మములవంటి అందమైన కన్నులుగలవాడా! ఓ శ్రీరామా! నన్ను రక్షించుము! (ఈ "శ్రీరామకర్ణామృతము"లోని శ్లోకాలలో చాలాభాగం బిల్వమంగళ లీలాశుకుని "శ్రీకృష్ణ కర్ణామృతము"లోని శ్లోకాలకు అనుకరణములు - తంగిరాల)

**రామమంత్ర గర్భితమైన మూడు శ్లోకాలు - బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు:-**

**శ్లో॥ శ్రీరామ రామ రామేతి - రమే రామే మనోరమే ।**
**సహస్రనామ తత్తుల్యం - రామనామ వరాననే ॥**

**తా॥** "రామ రామ రామ" అని అనుట వెయ్యి నామములతో సమానము. చక్కని మోముగల పార్వతీ! ఓ మనోహరీ! సతీమణీ! దీనిని గ్రహింపుము - (అని శివుడు పార్వతితో చెప్పినాడు.) అచ్చులు=5; వర్గములు=5; 'ర' నుండి 'మ' వరకు = 10; రామ × రామ × రామ = 10 × 10 × 10 = 1000

**శ్లో॥ రామాయ రామభద్రాయ - రామచంద్రాయ వేధసే ।**
**రఘునాథాయ నాథాయ - సీతాయాః పతయే నమః ॥**

**తా॥** "రామా! రామభద్రా! రామచంద్రా! బ్రహ్మస్వరూపుడా! రఘునాథా! నాథా!" అని తల్లిదండ్రులు, సోదరులు, గురువులు, సీతయు పిలుచునట్టి శ్రీరామునకు వందనములు!

**శ్లో॥ ఆపదామపహర్తారం - దాతారం సర్వసంపదామ్ ।**
**లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహమ్ ॥**

**తా॥** ఆపదలు తొలగించువాడును, సకలసంపదలు ఇచ్చువాడును, లోకసుందరుడును (ప్రపంచములోకెల్ల గొప్ప అందగాడును) అయిన శ్రీరామునకు పునః పునః (మరల మరల) నేను మ్రొక్కులిడుదును.

(పైన తెల్పిన మూడు శ్లోకాలలోను "రామమంత్రం" ఇమిడి వున్నదని బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు "యూట్యూబ్"లో పదే పదే చెపుతున్నారు. కాబట్టి పై వాటిని నిరంతరం జపించండి! తరించండి! - తంగిరాల)

## మంగళశ్లోకము

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ, మహనీయగుణాబ్ధయే
చక్రవర్తితనూజాయ, సార్వభౌమాయ మంగళమ్ ।
వేదవేదాంతవేద్యాయ, మేఘశ్యామలమూర్తయే
పుంసాం మోహనరూపాయ, పుణ్యశ్లోకాయ మంగళమ్॥

తా॥ కోసల దేశాధిపతియైనవాడు; మంచి (గొప్ప) గుణములకు సముద్రమైనవాడు; చక్రవర్తికి పుత్రుడైనవాడు, ఎల్లభూమిని ఏలినట్టివాడు - అయిన రామునకు శుభము కలుగుగాక! వేదములచేతను వేదాంతముల (ఉపనిషత్తుల) చేతను తెలియదగినట్టివాడు; మేఘమువలె నల్లనైన శరీరముగలవాడు; పురుషులను కూడ మోహింపజేయు రూపము కలిగినవాడు; పవిత్రమైన కీర్తికలిగినవాడు - అయిన రామునకు శుభము కలుగుగాక!!

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

## పక్షులు-కిరాతుడు

దువ్వూరి రామిరెడ్డిగారికి, గుఱ్ఱం జాషువాగారికి-ఇద్దరికీ కూడా "కవికోకిల" అనే బిరుదు ఉంది. వీరిద్దరూ ఒకసారి విజయవాడ రేడియో స్టేషన్‌లో ఒక మామిటి చెట్టుక్రిందనున్న సిమెంటుబెంచీమీద కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంతలో విశ్వనాథ సత్యనారాయణగారు రేడియోస్టేషన్ లోపలినుండి బయటకు వస్తూ, మామిడిచెట్టుక్రింద వున్న ఈ కవులిద్దరినీ చూచి, వేళాకోళంగా: "ఏవిఁటి? పక్షులు రెండూ ఒక చోటకు చేరాయి?" అన్నారు. వెంటనే జాషువా: "కిరాతుణ్ణి చూచి భయపడి!" అన్నారు. ముగ్గురూ కలిసి నవ్వుకున్నారు. విశ్వనాథవారు రామాయణం వ్రాస్తున్నారు. కాబట్టి ఆయన వాల్మీకితో సమానం. వాల్మీకి కిరాతుడు కదా! ఇదీ ఈ ఛలోక్తిలోని గమ్మత్తు!



"మధురకవి"

శ్రీ దుగ్గిరాల రామారావుగారు

అనుబంధం-3

# మా సుబ్బన్నబావ

"మధురకవి"-"సరసకవి"-సారకవితాభిరామ"
- శ్రీ దుగ్గిరాల రామారావుగారు.

బెంగుళూరున నాచార్య తంగిరాల
సుబ్బరా వెవ్వరోకాదు శ్రోతలార!
మీకడను దాచ నేటికి? నాకు నాలి
వంక బంధువు వరుసకు బావమఱఁది. 1

నావంటి కవివరుఁడు తన
బావయి వెలయంగ నొక ప్రబంధము నడుగం
గావలె గడుసరి యగుచో,
నేవో పద్యమ్ము లడుగునే! తనపైనన్. 2

"వ్రాసితి చెళ్లపిళ్లపయి, వ్రాసితి శ్రీపద కృష్ణమూర్తిపై,
వ్రాసితి లక్ష్మీకాంతుపయి, వ్రాసితి వాంధ్రపురాణకర్తపై,
వ్రాసితి రామచంద్రుపయి, వ్రాసితి కృష్ణయపైన, బావ! నేఁ
జేసిన పాపమేమి? విరచింపవు నాపయి నొక్క పద్యమున్. 3

కనుదెఱవక మునుపే నీ
కనుపమ కవితావిలాస మలవడెను,
పురాజననమున మహాసుకృతం
బొనరింపక యట్టి కవన మొదవదు బావా! 4

పదవులుఁ బట్టభద్రతలుఁ బాయని వైభవముల్ కవిత్వ సం
పద నిడునే? కళాభిరతి పైకొన మేకొని కైతలల్లుచో
నెదఁ గదలించి, మోద మెనయించి, రసమ్మొలికించి, మెత్త నౌ
కుదుపులులేని శయ్య, కులుకున్ బదబంధము లుండఁగా వలెన్. 5

శైలియు, భావము, మృదుశ
బ్దాలుఁ, జమత్కృతియు లేని పరుషపుఁ గవితా
లీల లవేటికి? బేలనె?
గోలనె? నే నట్టి కాకిగోలలు మెచ్చన్. 6

అందమైనట్టి కవనమ్ము నమృతరసము
చిప్పిలఁగఁ జెప్పు నీకేను చెప్పనేల?
యెవ్వరైనను తల్లి పుట్టింటిఁ గూర్చి
మనవి చేయుదురే? మేనమామ తోడ. 7

మనసార నీవు తలఁచిన
క్షణమున, నీ సరసకవనశారద గంగా
ధునియై, రసికజనము తల
మునుకలుగా మధురసమ్ము పొంగులు వాఱున్. 8

నీ కవనంపు ధోరణి గణించి నుతించె మదగ్రజుండు-సు
శ్లోకుఁడు సత్కవీశ్వరుఁడు - సూరి కులాగ్రణి-సోమయాజు, లా
పోకడ రామచంద్ర కవిపుంగవుడుం గడు మెచ్చె, నే ననన్
వాకొన నేల? పద్యము వినంగనె మైకము క్రమ్మినట్లగున్. 9

నీ వెఱిఁగినవే కద! నా
జీవనరేఖలనుగూర్చి చెప్పుము కవితా
జీవీ! నా జీవనమిఁకఁ
బావనమగు నీ కవిత్వభాగీరథిచే." 10

అని అతఁడు వేఁడు వరకును
మనమున "నిది పెరటిచెట్టు మందునగునే!"
యనుకొంటి నిపుడు తెలిసెను
వినుఁడీ! మా పెరటిచెట్టు వేలుపుచెట్టే! 11

గౌతమీ తీరమందు విఖ్యాతులైన
బ్రాహ్మణులలోన వెలనాటి వారియందుఁ

దనరు వేంకట సుబ్బావధాన్లుగారి
కొడుకు– సీతామహాలక్ష్మి కడుపు పంట. 12

ప్రభవమందెను పెదవాడపల్లి లోనఁ
దాతగారింటఁ; దన తండ్రి తండ్రిగారు
వరలు కాకులిల్లిందలపఱ్ఱు నందుఁ
బెరిగె మా సుబ్బరావొక పరభృతముగ. 13

మహితాత్ముఁడగు పితామహుని సన్నిధి బాల్య
మందున వేదాధ్యయనము చేసి,
నగ్రజుండగు "సోమయాజి" పండితునొద్దఁ
సంస్కృతాంధ్రాంగ్ల భాషలను జదివి,
"దిగుమర్తి" "నండూరి' దేశికోత్తములతో
సాహితీ జగతిలో సంచరించి,
కోవిదాగ్రణులు "తిమ్మావజ్ఝుల యును "పిం
గళి"యు "జీ.యన్. రెడ్డి" గారవమునఁ
దిరుపతి క్షేత్రమందునఁ దీర్చిదిద్దఁ
బడసి పరిశోధన క్రియాపాటవమ్ముఁ,
దంగిరాల నందన వనాంతర కిశోర
పరభృతగళమ్ము పంచమస్వరము లొలికె. 14

గురువఁట! పింగళికాంతుఁడు,
గురుగురువఁట! చెళ్లపిళ్ల, కులమును గోత్రం
బరయఁగ శ్రోత్రియమఁట! తం
గిరాల జానపదవాణి కేలుంబట్టెన్! 15

అనుపద రమణీయములగు
జనపదములఁ దిరిగి పెరిగి జానపదుల నో
టను వెలువడు పాటలు విని
మనసు పరవశించిపోయె మా సుబ్బనకున్. 16

ఆ జానపద పదమ్ముల
రాజిలు మృదుమధురభావ రసవత్కవితా
నైజము వెదకుచు, నిదురయు
భోజనమును మాని దేశములు తెగఁదిరిగెన్. 17

క్రమముఁ దప్పక చేయు కసరత్తుచే మంచి
కండపట్టిన కాయ మెండిపోయె,
గాంగేయ సచ్ఛాయఁ గయ్యమ్మునకుఁ బిల్చు
నిగెన మైచాయ కగ్గిపోయెఁ,
గంచు మ్రోఁగినయట్లు ఖంగున మ్రోఁగెడి
కంఠస్వరమ్ము గద్గదికవడియె,
నుత్సాహరసము పెల్లుబుకు చూపులతోడఁ
గొమరారు కనుజంట గుంటలయ్యె,
నైన సడలని గుండె ధైర్యమ్ము తోడ,
విక్రమార్కుని వలెఁ బట్టు విడువకుండఁ,
దెలుఁగు దేశమ్ము నాల్గు మూలలను తిరిగి
తిరిగి యనుకొన్న దాని సాధించినాఁడు. 18

మెట్టిన గుమ్మమున్ మఱలమెట్టక, యేగిన యూరి కేగకే,
పట్టుదలన్ వహించి, పనిభారము దూరము నెంచకుండఁ, జే
పట్టినయట్టి జానపదవాఙ్మయమోహిని సౌరుతీరులున్
గుట్టును మట్టునున్ దెలిసికోగలిగెన్ దుదముట్ట గట్టిగన్. 19

పలనాటి మేటి జోదుల వీరగాథల
పుట్టుపూర్వోత్తరమ్ముల నెఱింగి,
వెలమ వీరుల శౌర్య విక్రమమ్ములు దెల్పు
బొబ్బిలికథల సొంపులు గ్రహించి,
కనిగిరి ప్రాంతానఁ గాటమరాజు క
థాప్రధానాంశముల్ త్రవ్వి తీసి,

పలుకు పల్కునఁ దేనె లొలుకు జానుతెనుంగు
    పల్లెపదాల వైభవము నరసి,
జానపద సాహితీ-క్షీరసాగరమును
ద్రచ్చి మోహినియై సుధారసముఁ దెచ్చి,
విబుధవర్గమ్ముచేతఁ ద్రావించినాఁడు;
సుబ్బన నిజముగాఁ బురుషోత్తముండు. 20

పరిశోధిత విషయమ్ములు
పరికించిన గురువులు జయపత్రమ్ము "భిష"
గ్బిరుదమ్మిడ గురువృత్తిన్
గురుపదవికి నర్హుఁడైన కోవిదుఁడయ్యెన్. 21

"వన్నెయు వాసియున్ గలుగు వంగడమున్, నిలువెత్తు విగ్రహ
మ్ము, న్నెనరూరు చూపులును, ముచ్చటయౌ కనుముక్కుతీరు, మై
వన్నియఁ జూచి జానపదవాణి తనంత వరించి వెంట రాఁ,
గన్నడ సీమకేగి యటఁ గాపురముండెను బెంగుళూరులో. 22

అచట విశ్వవిద్యాలయమ్మందు నాంధ్ర
శాఖ నెలకొల్పి యందు నాచార్యుఁడై య
నంతరమ్మున నధ్యక్షుఁడై యనేక
శిష్యులను దీర్చిదిద్ది ప్రసిద్ధిఁగాంచె. 23

చల్లని వాతావరణము,
బుల్లా సుబ్బన్న చెలిమి ముదమొనఁగూర్పన్,
బిల్లలతో జెల్లలతో
నిల్లాలును దాను నచటనే స్థిరపడియెన్. 24

ఏయే పురమ్మందు నెంతెంత పఠియించె,
    గురులంచు నెవ్వరెవ్వరి వరించె,
నేయే కృతుల్ వ్రాసె, నేయే కృతుల నంకి
    తమునందె నాచార్య తంగిరాల

యెచ్చోట నేవృత్తి నెందాఁకఁ గావించెఁ,
దమ్ములెవ్వారు, సంతానమెంత,
యెందఱ శిష్యుల కెన్ని డిగ్రీలిచ్చె,
మొదలైన సంగతుల్ వదలకుండ
విస్తరించి విశేషించి ప్రస్తుతించి
వ్రాసినాఁడు సీతారామరాజ వీర
చరిత కృతియందు మల్లెల గురవయకవి;
వలయువారు దానినిఁ జదువంగవచ్చు. 25

అన్నిటికేమి గాని, హృదయమ్మున జానపదమ్ము మోజు పై
కొన్నను సంప్రదాయమునకున్ విడియాకు లొసంగలేదు, సు
బ్బన్నకుఁ దెన్గుపద్యమనఁ బ్రాణము, పత్రికపెట్టి డబ్బు లే
కున్నను దానినిన్ నడుపుచుండు ఋణమ్మొ పణమ్మొ చేయుచున్. 26

ఇచ్చెడి వాఁడిచ్చును, అది
వెచ్చమునకుఁ జాలదేని, బిచ్చమ్మునకై
రచ్చలకెగఁబడు, బలిని - వి
యచ్చరలను బ్రోవ నడుగు నచ్యుతు పగిదిన్. 27

ఇచ్చిన నీయకున్న నొకటే యని యెంచఁడు గాని, పద్యముల్
నచ్చినఁజాలు నా సుకవినాథు పటమ్మును గూడ వానితో
నచ్చొనరించి పత్రికల నంపును వారికి సొంతఖర్చుతో,
సచ్చరితుడు సుబ్బనకుఁ జాలుదురే! భువినెంతవారలున్. 28

కనకమున కెత్తుకెత్తైన కవిత యగునొ
కాదా తులఁదూఁచి, సరితూఁగఁ గలిగినట్టి
కవితలనె వేయుఁ 'జైతన్యకవిత' యందు,
నతఁడు సమవర్తి యా వ్యవహారమందు. 29

సభ్యకవులకె గాని యసభ్యకవుల
కెవరికినిఁ గూడఁ జైతన్యకవితయందుఁ

జోటు దొరకదు, నిజము నామాట, సంశ
యమ్ము గలవారు మా బావ నడుగవచ్చు. 30

షష్ట్యబ్ది సంపూర్తి సందర్భములయందు,
సప్తతివత్సరోత్సవములందు,
సాహస్ర చంద్రదర్శనపు వేడుకలందు,
జన్మదినోత్సవ సమయములను,
వైవాహిక దినోత్సవములందుఁ, బ్రముఖులు
పదవులు విరమించు పట్టులందు,
గురుపూజ లొనరించు తరుణమ్ములందు, ను
గాది మహాపర్వకాలమందుఁ,
దత్తదర్హతలెంచి, చైతన్యకవిత
పుటలు పెంచి, తగినవారి పటములుంచి,
సంతరించును ప్రత్యేక సంచికలుగ;
నర్థవంతమ్ము లతనికార్యమ్ములెల్ల. 31

శరభపండిత తాత్పర్య సంయుతముగ
నచ్చువేయించి కృష్ణకర్ణామృతమును
బులుసు మణి కిడె బిల్వమంగళుని కృతిని;
నతని సాహసచర్యలత్యద్భుతములు. 32

దేనికదె చెప్పుకొనవలె, దానిలో సు
వర్ణచషక మొకటి, సుధాపానమునకుఁ
దాన స్వయముగ సమకూర్చె, దాని విలువ
కట్టిచెప్పంగ నాకు శక్యమ్ముగాదు. 33

వెలగపూడి మహాకవి తెలుఁగు పద్య
ములు గలవు కదా! తాత్పర్య ముద్రణముకు
హేతు వేమన్న, సుబ్బన్న కృష్ణభక్తి
కారణము- సాహితీ రక్తి ప్రేరణమ్ము. 34

అనాఁటి తెలుగు వీరుల
నీ నాఁటి ప్రపంచమెల్ల నెఱుఁగుట కొఱకై
"రేనాటి సూర్యచంద్రులు"
నా, నేఁటికిఁ గూర్చె, నొక ఘనంబైన కృతిన్. **35**

రాయలసీమలో మును పరాక్రమవంతులు-ధైర్యసాహస
శ్రీయుతు-లాత్మగౌరవ విశిష్టగుణోన్నత వీరమూర్తు, లాం
గ్లేయ నిరంకుశత్వ మణఁగించి స్వదేశము నుద్ధరింపఁగా,
సాయుధులై యెదిర్చిన మహాత్ముల సచ్చరితల్ నుతించుచున్. **36**

వారును వారుఁ బాడుకొను పాటలలోఁగల వీరగాథ లా
ధారముగా నొనర్చుకొని, తాఁ బరిశోధనలో మతిన్ని యా
ధారములన్ గ్రహించి, బహుధా వ్యయమున్ శ్రమనోర్చి, కూర్చె సాం
పారఁగ "సూర్యచంద్రుల" బృహత్కృతి నందని మ్రాని పండుగన్. **37**

లోకము వాకొనినది తన
వాకొనినది పుటలు నాల్గువందలు పైఁగా,
నాకృతి యందును వెలయం
దా కృతి రూపొందె నొక మహాభారతమై. **38**

దాని మూల్యమ్ము నాల్గువందలకుఁ బైన,
కొనుటయన నాకు పరువు తక్కువ, యతండొ!
యుచితముగ నీఁడు, కరపత్ర నిచయలిఖిత
సంగతులు తప్పఁ గృతి నేను చదువలేదు. **39**

సౌమ్యుఁడు, విమర్శకుండును, సత్కవియును,
పండితుండు, ప్రవక్తయు, భావుకుండు,
సోమయాజు లితని జ్యేష్ఠ సోదరుండు
విజయునకు ద్వాపరమున ధర్మజుఁడు వోలె!. **40**

ఛాత్రుఁడు, సోమయాజి కనుజన్ముఁడు గూడను నౌటఁ, దత్సుచా
రిత్రునియందు గౌరవముఁ బ్రేమయు సుబ్బన కగ్గలమ్ము, లో

క్షత్రయరాజ్య మబ్బినను కాదనఁ దన్నను, భ్రాతృభక్తి సౌ
మిత్రిని సవ్యసాచిని సమీరకుమారునిఁ ద్రోసి రాజనున్. 41

కరమనురక్తి సంకలిత కాటమరాజ కథావితాన సం
భరితకృతిన్ సమంచిత విమర్శనమున్ రచియించి యగ్ర సో
దరునకు నంకిత మ్మిడెను; తత్సమయమ్మున నేమి వ్రాసెనో
యరసినఁ దెల్లమౌ నతని కన్నపయిన్ గల భక్తిభావముల్. 42

ఒకసారి యాంగ్లభాషోద్యానవనకృతి
ప్రసవగుచ్ఛభ్రమద్భ్రమరమగును,
ఒకసారి సరసగేయకవిత్వ మంథాన
గోత్రోద్ధరణ చేయు కూర్మమగును,
ఒకసారి సంప్రదాయకవిత్వ మాకంద
కుజశాఖపై గండుకోయిలగును,
ఒకసారి యత్యాధునిక సాహితీ నభో
మండలమ్మునఁ జందమామ యగును,
ఒక్కతఱి పరిశోధన ద్యోధునీ త
రంగరాజీ విరాజన్మరాళమగును,
అన్నిటను సమర్థుండు సుబ్బన్నబావ;
ఆతఁ డెత్తని యవతార మవని లేదు. 43

జానపదవాణి యొకవంక-సంప్రదాయ
సాహితీసతి యొక్క పార్శ్వమునఁ జెవులు
పట్టియాడింప నతఁ డాడినట్టిదెల్ల
నాటయై పాడినట్టిది పాటయయ్యె! 44

కమ్మనిపద్యమున్ విని ఫకాలున సుబ్బన నవ్వెనేని కుం
దమ్ములు విచ్చినట్టులు, సుధారస మొల్కిన యట్లు, చంద్రబిం
బమ్మది చెక్కలైనటులు, పాలసముద్రము పొంగినట్లు, ము
త్యమ్ములు ముక్కలై చెదరినట్టులు తోఁచును చూచువారికిన్. 45

అరువది యేండ్లు దాఁటెను వయస్సను మాటయెకాని, లేశమున్
దఱుగని దేహదార్ఢ్యము, సతమ్మును వాఙ్మయసేవయన్నచోఁ
గరఁగని కౌతుకమ్ము, నధికమ్ముగ సుబ్బనకున్నవంచుఁ ద
త్పరిచయమున్న వాఁడెఱుఁగుఁ, బ్రాయముతోఁ బనిలేదు వానికిన్.46

పలుకులదేవి సేవలను పండిన శీర్షము, దబ్బపండుతోఁ
గలఁబడు మేను, కాశసువికాసము వాసము మీసకట్టు, మ
ల్లెలు విరఁబూయు లేనగవురేకలు, సుబ్బనబావ పండు వె
న్నెల దిగజాఱు మేరుధరణీధరశృంగముభంగిఁ గన్పడున్. 47

తనకృతు లచ్చువేయ నొకదాత సహాయమొనర్చెనేని యా
తనికిఁగలట్టి కీర్తి దురదన్ వదలించఁగ నూరుకాని యూ
రున సభలంచుఁ జేతిచమురున్ వదలించుకొనున్ ఘనమ్ముగన్;
వినుతి యొనర్ప సుబ్బన వివేకము నే కవికైన శక్యమే? 48

చూచును మిత్రకోటిఁదన సోదరులట్టుల, శిష్యసంతతిన్
జూచును పుత్రులన్‌బలెఁ, దెనుంగునఁ గన్నడమందుఁ గీరితిన్
మోచెను, లేరు వాని సరిపోలెడువారని యందు రందఱున్,
మా చినబావగా రొక యమాయికుఁడే యెవరెన్ని చెప్పినన్. 49

'చైతన్యకవిత'కు సంపాదకుండు, స
ద్గ్రంథ సంతతికి ముద్రాపకుందు;
అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు,
ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుందు;
వలచి చేకొను 'శకుంతల'కు దుష్యంతుండు,
పరిణతిఁగన్నట్టి పండితుండు;
'సోమయాజులు' కుఁ గూర్చు సహోదరుఁడు, తంగి
రాలాబ్ధి తరుణసారంగధరుఁడు;
భావబంధుర మధుర సంభాషణుందు,
ముచ్చటం గొల్పు వినయ విభూషణుందు,

జానపద సాహితీ విశేషముల తావు,
సుగుణముల ప్రోవు, వేంకటసుబ్బరావు! 50

అభ్యుదయ కవులం దధికుండు 'బాలగం
గాధర తిలకు' సంగాతకాఁడు,
అభినవ పెద్దన్న యనఁదగు 'గుంటూరు'
శేషేంద్రశర్మ' మెచ్చిన బుధుండు,
'బుల్లా'కులాబ్ధి జాబిల్లి 'సుబ్బారావు'
ప్రాణమ్ము ప్రాణమైనట్టి సఖుఁడు,
'దళవాయి' పారిజాతమ్ము 'కృష్ణస్వామి
ఆదికేశవుల' వీరాభిమాని,
దొరకవివరుఁడు 'మల్లెల గురవయ' కవి
విమల కృతికన్యఁ జేకొన్న పెండ్లికొడుకు,
ధన్యజీవి, మా 'ఆచార్య తంగిరాల'
వర్ధిలునుగాత నూఱుసంవత్సరాలు! 51

(బెంగుళూరు విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖ పూర్వాధ్యక్షులు ఆచార్య
తంగిరాల సుబ్బారావు బావగారి గురించి-1999)
(సుమనోభిరామము, పుటలు 14-26)



మ॥ రవిబింబంబుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై,
శ్రవణాలంకృతమై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిస్థలినుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై, వటుఁడు దా బ్రహ్మాండమున్నిండుచోన్!
(-పోతన భాగవతము, వామనచరిత్ర)

## అనుబంధం-4

# నా ప్రాణమిత్రుడు - సరస్వతీపుత్రుడు

## (డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు)

**- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

80 ఏళ్ళు దాటిన నా జీవితంలో ఎందరో మిత్రులు తారసపడ్డారు. కాని వీరిలో కొద్దిమంది మాత్రమే నా హృదయానికి దగ్గరగా వచ్చి ప్రాణమిత్రులయ్యారు. అటువంటి వారిలో పండితకవిమిత్రులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు (1925-2006) ఒకరు. వీరి స్వగ్రామం గుంటూరుజిల్లా తెనాలితాలూకా 'కోవెలమూడి' గ్రామం. వీరు శుక్లయజుర్వేద శాఖీయులు. ప్రాచీన మహాకవి తెనాలి రామకృష్ణుడిదీ ఇదే శాఖ. ఆధునికకాలంలో భారత మాజీరాష్ట్రపతి డా॥ వి.వి.గిరిగారు, ప్రఖ్యాత రంగస్థల నటుడు, స్త్రీ పాత్రధారణలో అఖండ ఖ్యాతినార్జించినవాడు అయిన స్థానం నరసింహారావుగారు, మరొక ప్రఖ్యాత రంగస్థల నటుడు, అర్జున పాత్రధారణలో సుప్రసిద్ధుడు పులిపాటి వెంకటేశ్వర్లుగారు, సుందరాకాండ గానంచేసిన ఎమ్.ఎస్. రామారావుగారు ప్రముఖ హాస్యరచయిత "శ్రీరమణ"గారు, ప్రఖ్యాత పాత్రికేయులు ఆంధ్ర శేషగిరిరావుగారు, వారి పుత్రిక ప్రసిద్ధ సాహిత్యవేత్త ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారు - మొదలైనవారందరూ శుక్లయజుర్వేదీయులే. వీరిని "ప్రథమశాఖ" అంటారు.

తిరుపతిరావుగారి బాల్య, యౌవన దశలు నాకు తెలియవు. వారు తమ మధ్యవయస్సులో నాకు పరిచయమయ్యారు. 1962లో నేను తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఎ.ఫైనల్ ఇయర్ - చదువుతున్నాను. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తెలుగుశాఖాధిపతి. ఆయన "ఇంగ్లీషు - తెలుగు డిక్షనరీ స్కీమ్' ఒకటి చేపట్టారు. బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు ఆ స్కీముకి డైరెక్టరుగా చేరారు. వారి దగ్గర రీసెర్చ్ అసిస్టెంట్ గా తిరుపతిరావుగారు చేరారు. వీరి సెలెక్షన్ పింగళివారే చేశారు. తిరుపతిరావుగారి పాండిత్యాన్ని గమనించి వారికి ఆ ఉద్యోగమిచ్చారు. రెండేళ్ల తర్వాత 1964లో బెంగుళూరులోని "ఆచార్య పాఠశాల కళాశాల"లో తెలుగు ఉపన్యాసకుని ఉద్యోగం ప్రకటింపబడింది. ఈ

విషయం మైసూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా ఉన్న ప్రొ.కె. సుబ్బరామప్పగారు, లక్ష్మీకాంతంగారికి తెలియజేస్తే, ఆయన తిరుపతిరావుగారికి చెప్పారు. తిరుపతిరావుగారు అప్లికేషన్‌పెట్టారు. వారికి ఆ ఉద్యోగం వచ్చింది. వారు 1964లో బెంగుళూరు వచ్చారు. (నా కన్న ఐదేళ్లు ముందుగానే తిరుపతిరావుగారు బెంగుళూరు వచ్చారన్నమాట) అప్పటినుండి 2006లో మరణించేవరకూ ఇక్కడే ఉన్నారు.

తిరుపతిరావుగారు బమ్మెర పోతనగారిలాగ సహజపాండిత్యుడు. ఎస్.ఎస్.ఎల్.సి. వరకు మాత్రమే తెనాలి హైస్కూలులో చదివారు. తరువాత అంతా స్వయం కృషే. ఇంటర్మీడియట్, బి.ఎ ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ప్రైవేటుగా కట్టారు. హిందీభాషలో కూడా కృషిచేసి, 'విశారద'లో ఉత్తీర్ణులయ్యారు. కొన్నాళ్ళు గుంటూరు హిందూకళాశాలలో తెలుగుట్యూటర్‌గా పనిచేశారు. అప్పుడు డా॥ ప్రసాదరాయకులపతిగారు వీరి సహోద్యోగి. తరువాత తెలుగు ఎం.ఏ.కి ప్రైవేటుగా కట్టాలనే ఉద్దేశంతో తెలంగాణాకు వెళ్ళారు. ఖమ్మంజిల్లాలోని నాగులవంచ మునిసిపల్ హైస్కూలులో ఉపాధ్యాయుడుగా చేరారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ (తెలుగు) డిగ్రీలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తరువాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో నిఘంటునిర్మాణ సంస్థలో చేరారు. అక్కడి నుండి బెంగుళూరు వచ్చారు. నేను కూడా 1969లో పిహెచ్.డి డిగ్రీ పూర్తిచేసుకొని, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగులెక్చరర్‌గా చేరాను. అప్పటినుండి మా మధ్య ప్రగాఢమైనస్నేహం ఏర్పడింది. ఇద్దరం అన్నదమ్ముల్లా ప్రవర్తించాం. బెంగుళూరులో తెలుగు సాహిత్యానికి ఎంతో సేవ చేయగలిగాము.

నేను 1969 డిసెంబర్ నెలలో, (27వ తేది శనివారంనాడు) బెంగుళూరు విశ్వవిద్యాలయంలో, కన్నడశాఖలో తెలుగు లెక్చరర్‌గా చేరాను. తెలుగుభాషకు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఒక పీఠంకాని, ప్రత్యేకశాఖ కాని ఏర్పాటు చేయాలనే ఆలోచన నాకు, తిరుపతిరావుగారికీ వచ్చింది. మరో పండిత మిత్రులు, ప్రభుత్వ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు అయిన డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రి గారు మాకు వంత పలికారు. ముగ్గురం కలిసి ఒక లేఖ సిద్ధం చేసాం. ఆ లేఖను బెంగుళూరులోని ప్రసిద్ధ తెలుగుసంస్థ 'తెలుగు విజ్ఞాన సమితి' ద్వారా ఆంధ్రప్రదేశ్

ప్రభుత్వానికి పంపించాము. అప్పుడు తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులైన చెలికాని అన్నారావుగారు, ఉపాధ్యక్షులైన విశ్వనాథశాస్త్రిగారు చాలా సహాయం చేశారు.

మేము ఈ లేఖ వ్రాసి పంపినది 1971లో. అప్పుడు సాహిత్యప్రియులైన శ్రీ పి.వి.నరసింహారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నారు. ఆయన వారం రోజులు తిరక్కుండా మా లేఖకు స్పందించి, మూడులక్షల రూపాయల గ్రాంటును బెంగుళూరు విశ్వవిద్యాలయానికి పంపించారు. (1971లో మూడు లక్షల రూపాయలంటే, ఇప్పుడు మూడుకోట్లతో సమానం). ఆ గ్రాంటుతో, 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు స్నాతకోత్తరశాఖ ఏర్పడింది. దీనికి ఆనాటి ఉపాధ్యక్షులు డా॥ హెచ్. నరసింహయ్యగారు. ఆర్ట్స్ ఫ్యాకల్టీ డీన్, కన్నడ శాఖాధిపతి అయిన డా॥ జి.ఎస్. శివరుద్రప్పగారు చాలా సహాయపడ్డారు. ఈ విధంగా బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ ఏర్పడింది. దీనికి నాతోపాటు తిరుపతిరావుగారు, విశ్వనాథశాస్త్రిగారు ముఖ్యకారకులు.

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ ఏర్పడటానికి ముందుగానే తిరుపతిరావుగారు నా దగ్గర పిహెచ్.డి డిగ్రీ పూర్తి చేశారు. 1973లో పొందిన ఈ డిగ్రీ, తెలుగుశాఖలోనే కాదు, కన్నడశాఖలో కూడా మొట్టమొదటి పిహెచ్.డి డిగ్రీ. ఇది తెలుగు – కన్నడ సాహిత్యాల తులనాత్మక అధ్యయనం. ("నంది తిమ్మన పారిజాతాపహరణము – రుద్రభట్టు జగన్నాథవిజయము: తులనాత్మక పరిశీలన"). నా పర్యవేక్షణలో వచ్చిన గొప్ప సిద్ధాంతగ్రంథాలలో ఇది మొట్ట మొదటిది. (రెండవది: తిరుపతిరావుగారి కుమార్తె శ్రీమతి జయలక్ష్మి చేసిన "విశ్వనాథ – కువెంపుల రామాయణములు: తులనాత్మక పరిశీలనము". ఈ రెండు సిద్ధాంతగ్రంథాలను మించినవి తరువాత కాలంలో నా దగ్గర రాలేదు). తిరుపతిరావుగారు 1976లో బెంగుళూరు విశ్వవిద్యాలయంనుండి సంస్కృత సాహిత్యంలో కూడా ఎం.ఏ. డిగ్రీ తీసుకున్నారు.

తిరుపతిరావుగారు స్వయంకృషితో తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, హిందీ భాషలలో లోతైన పాండిత్యాన్ని గడించారు. బెంగుళూరు వచ్చాక కన్నడభాషలో కూడా ఎంతో కృషిచేసి, ఆ సాహిత్యాన్ని ఆపోశన పట్టివేసారు. పాండిత్య సంపాదనలో గొప్ప పట్టుదలగల మనిషి తిరుపతిరావుగారు. వారు తెలుగు –

సంస్కృతం – ఇంగ్లీషు – హిందీ – కన్నడ – మొత్తం ఐదు భాషలలో ప్రవీణులు; పంచభాషా విశారదులు!

డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు 1974లో 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారిని బెంగుళూరుకు ఆహ్వానించి, వారికి జ్ఞానపీఠ పురస్కా రం వచ్చినందులకుగాను 17.03.1994 నాడు 'గాయనసమాజం'లో ఎంతో ఘనమైన సన్మానం ఏర్పాటుచేశారు. (ఆ సందర్భంగా విశ్వనాథవారు మూడురోజులపాటు తిరుపతిరావుగారి యింట్లో అతిథిగా ఉన్నారు. వారి రెండవ అబ్బాయి శ్రీ పావని శాస్త్రి, శిష్యురాలు శ్రీమతి మల్లాది వసుంధర కూడా ఉన్నారు. ఒకరోజు నేనూ మా ఆవిడ శకుంతలాదేవి విశ్వనాథవారిని చూద్దామని వెళ్లాం. వారు మా దంపతులిద్దరినీ ఎగాదిగా చూచి "మీది మేనరికం పెండ్లికదూ?'' అన్నారు. "అయ్యబాబోయ్! మీకెలా తెలిసిందండి బాబూ?" అన్నాను నేను మా గోదావరి యాసలో. ఆయన చిరునవ్వు నవ్వుతూ "మీ ముఖాల్లో పోలికలున్నాయ్!" అన్నారు.) ఆ సన్మానసభకు బెంగుళూరు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన డా॥ హెచ్. నరసింహయ్యగారు అధ్యక్షత వహించారు. ఆ సభలో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖను స్థాపించమని విశ్వనాథవారు నరసింహయ్య గారికి సూచించగా, వారు అందులకు అంగీకరించడం ముదావహం.

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 1974లో (జూన్ – జూలై మాసాలలో) తెలుగుశాఖ ప్రారంభమైనప్పుడు నేను కాకుండా, ముగ్గురు గొప్ప పండితులు ఇక్కడ విద్యార్థులకు పాఠ ప్రవచనం చేసారు. వారు డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రి గారు, విద్వాన్ శ్రీరత్నాకరం శంకరనారాయణరాజుగారు, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు. వీరివల్ల తెలుగుశాఖకు మంచి పునాదులు ఏర్పడ్డాయి.

తిరుపతిరావుగారి సహాయంతో నేను విశ్వవిద్యాలయంలో ఎన్నో సెమి నార్లు, సాహిత్యసభలు నిర్వహించాను. ముఖ్యంగా తిరుపతిరావుగారి ప్రోత్సా హంతో సుమారు 20 సంవత్సరాలపాటు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో "విశ్వనాథ జయంతి" (సెప్టెంబర్ 10వ తేది) నిర్వహించాను. తిరుపతిరావు గారు ప్రత్యేకంగా "విద్యా సంవర్ధినీ పరిషత్తు"ను స్థాపించి, బి.ఎ.లోను, ఎం.ఎ. లోను తెలుగుభాషలో పోటీపరీక్షలు నిర్వహించి, వాటిలో ఎక్కువ మార్కులు

వచ్చిన వారికి బంగారు పతకాలు ఇచ్చేవారు. వీరికి విశ్వనాథవారంటే ఎంతో ఇష్టం. కాని ఎన్నికలు వస్తే కమ్యూనిస్టుపార్టీకి ఓటు వేసేవారు!

కాటమరాజుకథలకు సంబంధించిన 40 తాళపత్ర గ్రంథాలను నేను సేకరించాను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు వీటిని పరిష్కరించి పంపమన్నారు. ఆ పరిష్కరణలో మిత్రులు తిరుపతిరావుగారు నాకు ఎంతో సహాయం చేశారు. ఆ కాటమరాజుకథలను 1976లోను, 1978లోను రెండు సంపుటాలుగా సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు.

విశ్వనాథశాస్త్రిగారివల్ల, తిరుపతిరావుగారివల్ల నాకు బెంగుళూరులో ఉన్న ఎందరో ప్రముఖులు పరిచయమయ్యారు. శ్రీ డి.నాగభూషణ్ (భూషణ్ సిల్కు హౌస్), శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు (ప్రతిభ జ్యూయలరీ హౌస్), కీ.శే. వై.వి.వెంకటేశ్వరరావుగారు (ఇన్ కంటాక్స్ ఆఫీసర్), శ్రీ కె.పి.రావుగారు (ఆడిటర్) మొదలైనవారు. వీరి వల్ల నేను జీవితంలో ఎన్నో ఉపకారాలు పొందాను.

తిరుపతిరావుగారు ఎవరి దగ్గరనైనాసరే(నాతోసహా)చాలా నిర్మొహమాటంగా మాట్లాడేవారు. సత్యాన్ని కుండబద్దలు కొట్టినట్లుగా చెప్పేవారు. ఎవరికీ జంకేవారు కారు. ఒకసారి కోపం వచ్చి ఒక సభలో "తెలుగు విజ్ఞాన సమితి"ని "తెలుగు అజ్ఞాన సమితి" అనేశారు. ఈ ముక్కుసూటిగా అప్రియసత్యాలు పలకడంతో తిరుపతిరావుగారు చాలమంది మనసులు నొప్పించారు. పైగా వారు నాతో "నాకు నాలుకమీద శనివుంది!" అనేవారు.

నేనూ – తిరుపతిరావుగారూ మాత్రమే కాదు, మా కుటుంబాలు కూడా ఎంతో సన్నిహితంగా ఉండేవి. తిరుపతిరావుగారి ధర్మపత్ని శ్రీమతి హనుమత్ సీతారామమ్మగారిని, మా ఆవిడ శకుంతలాదేవిని అందరూ అక్కాచెల్లెళ్ళు అనుకునేవారు. పైగా సీతారామమ్మగారు "ఈమె నా చెల్లెలు" అని అందరికీ చెపుతూ ఉండేవారు. వారి అబ్బాయి శ్రీ చన్నాప్రగడ లక్ష్మీనరసింహమూర్తి (చలన మూర్తి అనేవాళ్ళం), వారి అమ్మాయి శ్రీమతి జయలక్ష్మి మా పిల్లలతో కలిసిపోయి, అన్నదమ్ములుగా, అక్కాచెల్లెళ్ళుగా సంబోధించుకుంటూ అన్యోన్యంగా ఉండే వారు. తిరుపతిరావుగారి శ్రీమతిగారు "స్థానం" వారి ఆడబడుచు.

తిరుపతిరావుగారు సంప్రదాయ సాహిత్యాన్ని మాత్రమే అభిమానించేవారు. ఆధునిక సాహిత్యమంటే ఇష్టం ఉండేది కాదు. కాని వారి మనస్సులో హేతు వాదము, కమ్యూనిజము ఉండేవి. బాబాలను, మహిమలను నమ్మేవారు కాదు. కాని వారి అబ్బాయి 'చలనమూర్తి' సత్యసాయి బాబాగారి విశ్వవిద్యాలయంలో సంస్కృతశాఖలో ఉపన్యాసకుడుగా చేరినప్పుడు మాత్రం అడ్డు చెప్పలేదు!

ప్రసిద్ధ తెలుగు కథా రచయిత 'శ్రీరమణ' గారు తిరుపతిరావుగారికి దగ్గర బంధువు. ఒకసారి శ్రీరమణగారిని, తిరుపతిరావుగారి యింటికి వచ్చినప్పుడు. పరిచయం చేసుకున్నాను.

మా ఆవిడ 2006 ఆగస్టు నెలలో చనిపోయింది. అప్పుడు నన్ను పరా మర్శించడానికి తిరుపతిరావుగారు కష్టపడి మా యింటికి వచ్చారు. అప్పటికే వారికి 81 సంవత్సరాలు. ఆరోగ్యం అంత సరిగా లేదు. అదే సంవత్సరం డిసెంబర్‌నెలలో వారు స్వర్గస్థులయ్యారు. శరీరంలో సగ భాగమైన భార్య, గుండెకు దగ్గరగా వచ్చిన మిత్రుడు ఒకే ఏడాదిలో కనుమరుగుకావడం నాకు తట్టుకోలేని విషయమయింది! "చలనమూర్తి" కూడా అకాల మరణాన్ని చెందడం – ఇంకా బాధాకరమైన విషయం!

తిరుపతిరావుగారికి, తెలుగు సాహిత్యంలో "సత్యభామ" అంటే చాలా ఇష్టం. "పంచకన్యలు" అనే పుస్తకంలో ఈమెనుగురించి చక్కటి వ్యాసాన్ని వ్రాశారు. వారి సిద్ధాంతగ్రంథం కూడా సత్యభామ కథే! అది తెలుగు సాహిత్యంలో మిక్కిలి విలువైన గ్రంథం.

నంది తిమ్మన హరివంశాన్ని, రుద్రభట్టు విష్ణుపురాణాన్ని ఆధారంగా చేసికొని తమ తమ ప్రబంధాలు నిర్మించారని తిరుపతిరావుగారు తమ సిద్ధాంత గ్రంథంలో నిరూపించారు.

1987లో నేను ప్రొఫెసర్ అయినప్పుడు, తిరుపతిరావుగారు ఎంతో సంతోషించి, నన్ను ఆశీర్వదిస్తూ తొమ్మిది శ్లోకాలు పద్యాలు వ్రాసి, "నవరత్నాభిషేకం" అనే పేరుతో ముద్రించి, ఫ్రేము కట్టి, నాకు బహూకరించారు. తెలుగులోను, సంస్కృతంలోను చక్కని కవిత్వం వ్రాయగల నేర్పరి తిరుపతిరావుగారు.

డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు కేవలం "ఆంధ్ర భాషాభిమాని" మాత్రమే కాదు; "ఆంధ్ర దేశాభిమాని" కూడా. 1952 ప్రాంతంలో, కోస్తా జిల్లాలలో స్వామిసీతారాంగారు జరిపిన ఆంధ్రోద్యమంలో తిరుపతిరావుగారు చురుగ్గా పాల్గొన్నారు. ఎంతో త్యాగం చేశారు.

1981లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలోని బాటనీ ప్రొఫెసర్ అండ్ హెడ్‌గాఉన్న డా॥ ఎం.నాగరాజుగారు గుల్బర్గా విశ్వవిద్యాలయానికి వైస్-ఛాన్సలర్‌గా నియమితులయ్యారు. ఆయన నా మీది వాత్సల్యంతో నన్ను ఆ విశ్వవిద్యాలయానికి కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్‌గా తీసికొనివెళ్ళారు. అక్కడ మూడేళ్ళుండి, 1983లో తిరిగి బెంగుళూరు విశ్వవిద్యాలయానికి వచ్చాను. నేను వచ్చేసరికి తెలుగుశాఖలో పెద్ద మార్పు జరిగింది. మైసూరు మహరాజా కళాశాలలో తెలుగు రీడర్‌గా పనిచేసే డా॥ బాడాల రామయ్యగారు ఇక్కడ తెలుగుశాఖకి ప్రొఫెసర్ అండ్ హెడ్‌గా నియమింపబడ్డారు. నేను వారికింద రీడరుగా చేరవలసివచ్చింది. ఆ పరిస్థితిలో నన్ను చూడటానికి వచ్చారు నా ప్రాణమిత్రులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు వచ్చారు. అప్పుడు వారు నా గదిలోకి ప్రవేశిస్తూ "చీమలు పెట్టిన పుట్టలు /పాముల కిరవైనయట్లు" అనే సుమతి శతక పద్యాన్ని చదువుతూ నా దగ్గరకు వచ్చారు. ఇద్దరం కలిసి నవ్వుకున్నాం. 1974లో నేనూ తిరుపతిరావుగారూ ఎంతో కష్టపడి స్థాపించిన తెలుగుశాఖ పరహస్తగతం అయిందని వారు చాలా బాధపడ్డారు.

డా॥ బాడాల రామయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. (తెలుగు) థర్డ్‌క్లాసులో ప్యాసయ్యారు. ఆయన్ని ఇక్కడ ప్రొఫెసర్‌గా నియమించిన కమిటీలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడరుగా పనిచేస్తున్న డా॥ అమరేశం రాజేశ్వరశర్మగారు ఉన్నారు. ప్రొఫెసర్ సెలక్షన్ కమిటీలో రీడరు ఎలా ఉంటాడు? అతి పెద్ద glaring mistake! రామయ్యగారి నియామకం చట్టవిరుద్ధం. వారి పిహెచ్.డి. పరిశోధనాంశం "బసవేశ్వరుని కాలనిర్ణయం". బసవేశ్వరుని కాలానికి తెలుగు సాహిత్యానికి ఏమిటి సంబంధం? ఈ లోపాలన్నింటినీ నేను కోర్టులో సవాలు చేద్దామనుకున్నాను. సరైన లాయరు దొరక్కపోవడం వల్ల ఊరుకున్నాను.

బాడాల రామయ్యగారు నియామకంలో జరిగిన ఈ లోపాలన్నీ అప్పటి వి.సి.గారైన డా॥ డి. శంకరనారాయణగారికి ఫిర్యాదు చేశాను. ఆయన సోషియాలజీ ప్రొఫెసరయిన డా॥ రాజగోపాల్‌గారిని ఏకసభ్యకమిటీగా నియమించారు. ఆ రాజగోపాల్‌గారు విచారణ జరిపి, నేను చూపిన లోపాలన్నీ సరియైనవే అని నివేదిక ఇచ్చారు – (నాతోకూడా చెప్పారు). అయినా సరే వి.సి.గారు ఏమీ చర్యతీసుకోలేదు.

ఏ మాటకామాటే చెప్పుకోవాలి. డా॥ బాడాల రామయ్యగారిలో ఉండే ఒకే ఒక సుగుణం – తెలుగు పద్యాన్ని ఎంతో శ్రావ్యంగా, ఎంతో అద్భుతంగా చదవడం. డా॥ ప్రసాదరాయ కులపతిగారు శ్రీనాథపీఠంపరంగా నిర్వహించే "భువనవిజయం" సాహిత్యరూపకంలో రామయ్యగారు అల్లసాని పెద్దన వేషం వేసి, పెద్దన రచించిన "పూతమెఱుంగులున్ పసరుపూపబెడంగులు చూపునట్టి వాకైతలు..." అనే ఉత్పలమాలికను "నభూతో నభవిష్యతి"గా చదివేవారు. భువన విజయాలలో పెద్దనపాత్ర ధరించిన ఇతరులెవ్వరూ అలాగ చదవడం నేను వినలేదు. అంత గొప్పగా తెలుగు పద్యపఠనం చేసేవారు డా॥ బాడాల రామయ్యగారు! వీరితోపాటు నా యెరుకలో తెలుగుపద్యాన్ని మధురాతి మధురంగా, కోకిలకలకూజితంగా, శ్రోతలు తన్మయత్వంతో పరవసించిపోయేలా చదివే మహానుభావులు కొందరున్నారు. కీ.శే. మల్లంపల్లి శరభయ్యగారు, కీ.శే. జువ్వాడి గౌతమరావుగారు, డా॥ ప్రసాదరాయ కులపతిగారు, కీ.శే. డా॥ కట్టి నాగార్జునశ్రీగారు, డా॥ బోచ్కర్ ఓంప్రకాశ్ – మొదలైనవారు.



**మ॥ "ఘనుఁడాభూసురుఁడేఁగెనో; నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో;**
**విని కృష్ణుండిది తప్పుగాఁ దలఁచెనో; విచ్చేసెనో; యీశ్వరుం**
**డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో; యార్యామహాదేవియున్**
**నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో; నాభాగ్యమెట్లున్నదో!"**

(– పోతన భాగవతము, రుక్మిణీ కల్యాణము)



## అనుబంధం-5

# సంస్మరణం
# కీ.శే. చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు
# (క్రీ.శ. 1934-2018)

**- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

నాకు సుమారు 30 ఏండ్లుగా మంచి మిత్రులు. కల్లాకపటం తెలియని స్వచ్ఛమైన మనస్సుగల మనిషి. మంచి సాహిత్యాభిరుచి కలవారు. నేను రచించిన "రేనాటి సూర్యచంద్రులు" అనే గ్రంథాన్ని చదివి, నన్ను వెతుక్కుంటూ, బెంగుళూరులో మా యింటికి వచ్చారు.

**జననం** : 31-12-1934

**మరణం** : 22-06-2018

**ధర్మపత్ని** : శ్రీమతి చిలకల పార్వతమ్మగారు (అమెరికా) - మేనరికంపెళ్ళి. ఈమె జననం 08-10-1942

**సంతానం** : (జ్యేష్ఠానుక్రమంగా)

1. శ్రీ సుదర్శనరెడ్డి (అమెరికా)
2. డా॥ శ్యామలారెడ్డి (జమైకా)
3. శ్రీ శ్రీకాంత్‌రెడ్డి (అమెరికా)
4. శ్రీమతి శకుంతలారెడ్డి (ఆస్ట్రేలియా)
5. శ్రీ నాగార్జునరెడ్డి (అమెరికా)

వెంకట సుబ్బారెడ్డిగారు తన కొడుకుల్ని కూతుళ్లను చక్కగా చదివించి, విద్యావంతుల్నిచేసి, విదేశాలలో స్థిరపడేటట్లుగా చేశారు.

**స్వగ్రామం:** ప్రకాశంజిల్లా మోక్షగుండం అగ్రహారం. కాని వృత్తిరీత్యా బెంగుళూరులో ఉండేవారు.

మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు తమ గ్రామంవారని సగర్వంగా చెప్పుకొనేవారు. స్వగ్రామంలో విశ్వేశ్వరయ్యగారి విగ్రహం స్థాపించారు. తమ గ్రామంలోని వేలాది ఎకరాల అగ్రహారం భూములు వాటిని దున్నే రైతులకే చెందాలని ఎన్నో పోరాటాలు చేసిన చంద్ర పుల్లారెడ్డిగారంటే సుబ్బారెడ్డిగారికి

ఎంతో అభిమానం. స్వగ్రామంలో పుల్లారెడ్డిగారి విగ్రహాన్ని, వేమన విగ్రహాన్ని కూడ ప్రతిష్ఠించారు సుబ్బారెడ్డిగారు.

**వృత్తి:-** చిన్న కాంట్రాక్టరు. నీటిటాంకులు కట్టించేవారు. ఎంతో నియమబద్ధంగా నీతినియమాలతో జీవించడంవల్ల ఒక్క పైసా కూడా సంపాదించలేకపోయారు. బెంగుళూరులో వారికి సొంత ఇల్లుకూడా ఉండేది కాదు. అద్దెయింట్లో ఉండేవారు. "వ్యాపారం ద్రోహచింతనం" అని నాతో తరచుగా అనేవారు.

**ప్రవృత్తి:-** చిన్నప్పటినుండీ సాహిత్యమే! పోతన భాగవతం, వేమన పద్యాలు కొన్ని వందలు, వేలు కంఠతా వచ్చును. ఎన్నో పరిశోధనాత్మకములైన గ్రంథాలు రచించారు.

**విద్య:-** కళాశాలలో ఇంటర్మీడియేట్ వరకు చదివారు. తరువాత 70 ఏళ్లు వచ్చాక, ప్రయివేటుగా చదివి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ. పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులయ్యారు.

రాజకీయాలలో అంతగా ప్రవేశంలేదుకాని, నీలం సంజీవరెడ్డిగారికి వీరాభిమాని. ఆయన 1969లో భారత రాష్ట్రపతి పదవికోసం వి.వి.గిరిగారితో పోటీచేసి ఓడిపోయినప్పుడు, వారిని తమ గ్రామానికి పిలిపించి, నూరుజతల ఎడ్లబండ్ల మీద ఊరేగించి, సన్మానం చేశారు.

**వస్త్రధారణ:-** వెంకటసుబ్బారెడ్డిగారు సన్నగా పొడుగ్గా అచ్చంగా సంజీవరెడ్డిగారిలాగే ఉండేవారు. వస్త్రధారణకూడా అలాగే ఉండేది. ఎప్పుడూ ఖద్దరు పంచె, ఖద్దరు జుబ్బా, నెహ్రూకోటు ధరించేవారు. అచ్చంగా స్వాతంత్ర్య సమరయోధుడులాగ ఉండేవారు.

**రెడ్డిగారి రచనలు:**

**ముద్రిత గ్రంథాలు:-**

1. వేమన కాలనిర్ణయం. ఎంతో పరిశోధన చేసి యోగివేమన కాలాన్ని క్రీ.శ.1352-1430గా నిర్ణయించారు.
2. The Secret of Amanaska Yoga (English)
3. Life History of Sir Mokshagundam Visweswarayya (English
4. సామెతలు - ఆర్యోక్తులు - కొన్ని సంఘటనలు

5. భారతీయ వాఙ్మయము - తొమ్మిది అంకె ప్రస్తావన.
6. భూమివయస్సు
7. శ్రీరాముడు - శ్రీకృష్ణుడు
8. ఉయ్యాలవాడ నరసింహారెడ్డి నాటకం (అముద్రితం)

చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు మన దేశ భవిష్యత్తును గురించి తీవ్రంగా ఆలోచిస్తూ ఉండేవారు. ఆ విషయాలు నాతో అప్పుడప్పుడు చర్చిస్తూ ఉండేవారు. “స్వామీ! మనదేశంలో కష్టపడి పనిచేసేవాళ్లు - ముఖ్యంగా వ్యవసాయం చేసే వాళ్లు రోజురోజుకీ తగ్గిపోతున్నారు. కొన్నాళ్లుపోతే మనకు తిండిగింజలకు కూడా కరవు ఏర్పడుతుంది!” అని వాపోయేవారు.

రెడ్డిగారికి పిల్లలు బెంగుళూరులో ఒక ఫ్లాట్ కొని ఇచ్చారు. భార్యతో అందులో ఉండేవారు. చివరి రోజుల్లో వారికి పక్షవాతం వచ్చింది. ఎంతో బాధపడేవారు. వైద్యంతో కొంత తగ్గుముఖం పట్టింది. కాని ఏదో నాటువైద్యం చేయించుకొని రోగం ముదరబెట్టుకున్నారు. కదలలేని స్థితివచ్చింది. అలాగ అనారోగ్యంతో బాధపడుతూనే రెండు మూడు పుస్తకాలు రచించి ముద్రించారు. సాహిత్యమంటే అంత పట్టుదల వారికి.

పక్షవాతంతో బాధపడుతున్న వారిని చూడటానికి మిత్రులు తరచుగా రావటం లేదని బాధపడుతూ ఉండేవారు. నాకు పదే పదే ఫోను చేసేవారు. నేను కూడా ఏవో పనుల తొందరలో ఉండి రెండు మూడుసార్లు కన్నా చూడలేకపోయాను. మనం ఆరోగ్యంగా తిరుగుతున్నంతసేపే బంధువులు మిత్రులు మనలను పట్టించుకుంటారు. ఒక్కసారి మంచాన పడ్డామంటే ఎవ్వరూ దరిదాపులలో కూడా కనిపించరు. మిత్రులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు చెప్పినట్టుగా అందరూ ఎవరి పనుల్లో వారు బిజీగా ఉంటారు. ఎవరు ఎవరినీ పట్టించుకోరు. ఈ సందర్భంగా సుబ్బారెడ్డిగారు నాతో అన్న ఒక మాట జ్ఞాపకం వచ్చి, మనసులో ముల్లుగుచ్చుకున్నట్టుగా బాధపడుతూ ఉంటాను. ఒక రోజు ఫోనుచేసి నాతో ఇలా అన్నారు:- స్వామీ! ఈ పక్షవాతంతో బాధపడేకన్నా, ఆత్మహత్య చేసుకోవడం మంచిది - అని అనిపిస్తూ ఉంటుంది ఒక్కొక్కసారి నాకు! కాని ధైర్యం చాలటం లేదు స్వామీ!” సుబ్బారెడ్డిగారు నా కన్నా ఎక్కువ పెద్దవారు కాదు; సరిగ్గా మూడు మాసాలే పెద్దవారు. వారు 31.12.1934లో పుట్టారు. అప్పటినుండి

సరిగ్గా మూడు నెలల తర్వాత 30.03.1935నాడు నేను పుట్టాను. ఇప్పుడు ఆరోగ్యంగా ఉన్నాను. కాని భవిష్యత్తులో ఏమి అవుతుందో తెలియదుకదా! మా అన్నయ్యగారు నాతో తరచుగా ఒక మాట అంటూ ఉండేవారు: "ఒరే సుబ్బారావ్! ఇప్పుడు ఆరోగ్యంగానే ఉన్నాను. కాని ending ఎలా వస్తుందో తెలియడంలేదురా!" వారు 90 ఏళ్లు సంపూర్ణ ఆరోగ్యంగా బ్రతికి, చివరికి పొట్టలో క్యాన్సర్ అనే అనుమానంతో (అది కేవలం అనుమానమే! ఇంకా వైద్యులు నిర్ధారించి చెప్పలేదు) వైద్యం చేయించుకోకుండా, ప్రాయోపవేశం చేసి (అన్నపానాలు వర్జించి) బలవంతంగా చనిపోయారు. వైద్యం చేయించుకోమని, ఆహారం తీసుకోమని బంధువులు, మిత్రులు ఎంత బతిమాలినా వినలేదు. బ్రహ్మ మన నుదుట వ్రాసిన వ్రాతను ఎవరూ తప్పించుకోలేరు. విధి అవశ్యప్రాప్తము కదా!

30-03-2016నాడు నాకు 81 సం॥లు నిండాయి. ("సహస్ర చంద్రదర్శనం"). సుమారు 30 మంది కవి పండితుల్ని సత్కరించాను. సుబ్బారెడ్డిగారు సభకు రాలేరు కాబట్టి నేనే వారియింటికి వెళ్ళి వారిని సన్మానించి వచ్చాను. ఎంతో సంతోషించారు.

ఒకసారి మాటల సందర్భంలో రెడ్డిగారితో "నేను మంగళవారము, శుక్రవారము గడ్డం గీసుకోను. క్షవరం చేయించుకోను; గోళ్లు తీసుకోను!" అన్నాను - వారు వెంటనే: "మంగళవారం క్షవరం చేయించుకో కూడదు; సరే! ఆ రోజు మంగలషాపులు కూడా మూసివేస్తారు. నాకు తెలిసి శుక్రవారం చేయించుకోవచ్చు; శనివారం మాత్రం చేయించుకోకూడదు!" అన్నారు. ఈ విషయంలో అనుమానం వచ్చి గంటల పంచాంగం తిరగేశాను. "నేను తప్పు; రెడ్డిగారే ఒప్పు! - అని గ్రహించాను. మన సాంస్కృతిక విషయాలలో రెడ్డిగారికి లోతైన పరిజ్ఞానం ఉంది. అలాగే మానవునకు "సహస్ర చంద్ర దర్శనోత్సవం" 81 ఏండ్లనిండాకనా? లేక 82 ఏండ్లు నిండాకనా? - అనే విషయంలో కూడా ఇద్దరం చర్చించుకున్నాం. అందరూ మామూలుగా లెక్కలు కట్టి 82 ఏండ్లు నిండాక మానవుడు వేయి నిండుపున్నములను చూస్తాడు అని అనుకుంటారు. ఇది తప్పు. నాలుగేళ్లకి ఒకసారి అధికమాసం వసూవుంటుంది. ఈ అధికమాసాలను కూడా లెక్కవేసుకోవాలి. అలాగ చేస్తే 81 సంవత్సరాల 8 మాసాలకు "సహస్రచంద్రదర్శనోత్సవం" అవుతుంది. ఇక్కడ "చంద్ర" అంటే "పూర్ణచంద్ర" అనే అర్థం. ఈ విషయం నేనూ రెడ్డిగారూ ఒక జ్యోతిషుని సంప్రదించి తెలుసుకున్నాం.

# కీ.శే. చిలకల వెంకట సుబ్బారెడ్డిగారి కవితలు

**(చైతన్యకవితనుండి)** **- తంగిరాల**

### 1. గురువు:-

కII జనయిత్రి యిచ్చు జన్మము
జనకుఁడు పోషణముఁజేయు, శంకరుఁడిచ్చున్
తనకుఁ దగిన వరమడిగిన,
తన గురువిచ్చును సమముగఁ దన విద్యలిలన్!

కII గురువే బ్రహ్మకు నధికుఁడు,
గురువే విష్ణువున కాది గుట్టును దెలుపన్,
గురువే హరునకు మూలము,
గురువందఱకు నధికుఁడని గుఱి నిల్పుమదిన్!

### 2. జ్ఞానషట్కము

(1) బ్రహ్మజ్ఞాని (చీమ)

అజ్ఞానంబును వీడుచు
విజ్ఞానముఁ బడసి చీమ - వేదోక్తంబై
ప్రజ్ఞానంబలరఁగ బ్ర
హ్మజ్ఞానము పొంది వరలె - మహిని సుగతులన్

(2) కాలజ్ఞాని (కోడి)

నిద్దుర పోయిన వేళన్
బ్రొద్దునడక తెలియనట్టి - భువి రాత్రులలోఁ
బెద్దలు లేవనియెడలన్
గ్రుద్ది తెలుపు కాలగతినిఁ - గుక్కుటమిలలోన్

(3) దివ్యజ్ఞాని (కుక్క)

అజ్ఞానముచేఁ దమ్ములు
విజ్ఞానము పొందలేక విడిపోయిరిలన్

ప్రజ్ఞాని యమజుతో ది
వ్యజ్ఞానమున శునకము దివంబున కరిగెన్.

(4) తత్త్వజ్ఞాని (గోవు)

ఆడిన మాటలు తప్పక
నాఁడిచ్చెను గపిలగోవు - నందీశ్వరునిన్
మూడుకనులయ్యకొఱకై
వాఁడొసగె నలువకుఁ బై నివాసస్థలమున్

(5) అజ్ఞాని (మానవుడు)

సుజ్ఞానమున్న మనుజుడు
విజ్ఞానము నూఁతగొనుచు - విష్ణుపదమునన్
ప్రజ్ఞను జూపెను గానీ
అజ్ఞానము వదలఁడయ్యె నంతయు నెఱుకై.

(6) విజ్ఞాని (మానవుడు)

కలవు సమముగ సకల జీ
వులయందు నిద్రాభయంబు లట్లె భోజనకామం
బులు మనుజుఁడు జ్ఞానేంద్రియ
ముల బుద్ధివలన వెలసెను భుని విజ్ఞుండై.

(చైతన్యకవిత-25, ఏప్రిల్-సెప్టెంబర్, 1997)

### 3. ద్వాదశ శంకరాద్వైత కందపద్యమంజరి

త్రిగుణాతీతుడు శివుడే
సగుణాకృతి నొంది యాదిశంకర రూపం
బుగఁ బృథ్వి నుద్భవించెను.
జగమున నద్వైతసిద్ధి చాటె గురుండై॥ 1

కాలగతిన్ కేరళలోఁ
గాలడి యనుగ్రామమందుఁ గల దంపతులన్
చాల విశిష్టులు నుత స
చ్ఛీలురు; ఆర్యాంబ సతిగ శివగురుఁ డలరున్॥ 2

ద్వాదశ సంవత్సరములు
బోధగురువు నాశ్రయించి పొందెను విద్యల్
వేదోపనిషత్సారము
మోదమున గ్రహించి భాష్యములను రచించెన్ 3

ముక్కంటి శివుడు నరుఁడై
చక్కగ విద్యలను నేర్చి సకల మతములం
దొక్కటియే సత్యంబని
వక్కాణించెను జనులకు బ్రహ్మపదమ్మున్ 4

నిత్యము నీ యనుభవమున
సత్యమనుట యీ జగత్తు సరి కానీ, యీ
సత్యమ్ము వ్యావహారిక
సత్యమ్మే కాని పరమసత్యమ్మెటులౌ॥ 5

నిత్యము కంటికి నగపడు
సత్యము వ్యవహార మగును శాశ్వతమగు నా
సత్యమె బ్రహ్మము; లోకమ
సత్యమనుచు శంకరుఁడు నిజస్థితి దెలిపెన్॥ 6

పరమార్థమైన సత్యము
పరమగు బ్రహ్మంబుగూర్చి పలికెను గానీ
పరమార్థము దృష్ట్యా యీ
చరము నచరమెల్ల భ్రాంతిచక్రమ్మనియెన్॥ 7

ఉన్నవి జన్మకు మూలము
లన్నవి యెడతెగక ముఖ్యమైన త్రికర్మల్
నిన్న-యిపుడు-రేపును నిను
వెన్నంటియె వచ్చు వరుస విధివ్రాత యనన్॥ 8

ప్రారబ్ధకర్మ సంచిత
మా రెండును వర్తమానమందునఁ దోడై

మారాము చేసి మిక్కిలి
పోరాడును జీవి ప్రాణములు విడువఁకున్॥ 9

భువి నెది లేదది మాయయె
అవివేకమె దాని యిల్లు నజ్ఞానంబే!
అవధిగఁ గారణ రహితము
వివిధ గుణమ్ములను బూని తిరుగుచునుండున్॥ 10

మాయామేయ జగంబున
మాయకు నజ్ఞానమె పరమ సఖుండాయెన్
మాయకు శత్రువు జ్ఞానము
మాయను గనినట్టివాఁడు మహిలోఁ గలఁడే? 11

త్రిగుణ సహితుండు జీవుడు
త్రిగుణాతీతుండు శివుఁడు దేవుండయ్యెన్
జగమున నెవ్వఁడు గుణములఁ
దెగఁద్రెంచునొ యతఁడె యద్వితీయుఁడు శివుఁడౌ॥ 12

(–చైతన్యకవిత, 31+32, ఏప్రిల్ + అక్టోబర్ 2000)

### 4. సంసారబాధలు

క॥ ఉప్పుకొఱత యున్నప్పటి
చప్పిడి మెతుకులు పిడికెడు చాలును జీవా!
పప్పన్న మవసరంబని
అప్పునఁ బడితిమనఁగానె అగచాటులగున్. 1

క॥ ఆలి విడిచె రాముఁ, డటులె
ఆలిని విడనాడి నలుఁడు అగచాట్లు పడెన్,
ఆలి హరిశ్చంద్రుఁడు గ
య్యాళి మగనికమ్మె – ఇల్లెయగు నిల్లాలున్. 2

క॥ ధనమున్నవాని కిహమున
గొనమున్నను లేకయున్నఁ గులము పదవియున్

దనతోడ గలిసి వచ్చును
గొనమువలనఁ గీర్తి నిలుచుఁ గువలయమందున్. 3

కఙ శనిదేవుని దయగలిగినఁ
దనివారఁగ శుభము సుఖము తనరు నరునకున్
శని దయతప్పిన యెడల న
శనివారము నెత్తిపడిన సరణి వ్యధలగున్. 4

కఙ దుఃఖము సంసారం బది
దుఃఖము జన్మయు జనులకు దోషము జగతిన్
దుఃఖము జరయును జీవా!
దుఃఖములను పొందనట్టి త్రోవను గనుమా! 5

(చైతన్యకవిత – 33, ఏప్రిల్, 2001)

### 5. వాంఛలు

తిరుపతి దేవుఁడు కనకము,
వరపండరినాథుఁ డెపుడు వలయును నాదం,
బరయఁగ నుడిపి నివాసుడు
ధరలోపలఁ గోరు నన్నదానము నెపుడున్ 1

రమ్మని కంచిన్ కామా
క్షమ్మయుఁ గాశీపురిని విశాలాక్షియు, ని
ట్లమ్మధుర వెలయు మీనా
క్షమ్మయు సౌఖ్యముల నిచ్చుఁ జక్కగ మనకున్. 2

సిరిగలవానినిఁ గోరిన
వరమిచ్చును సిరులొసంగు వసుధఁ దలంపన్
హరికి సిరిగలదు గావున
హరినే సిరినిమ్మనవలె, హరువేలనయా? 3

బూడిద దాల్చిన యీశుఁడు
గాఢముగా కోర్కె దీర్పఁగలడా కరుణన్?

వేడెను భిక్షను శంకరుఁ
దాడుది సగమైన సాంబుఁ డతఁడేమిచ్చున్? 4

దృష్టమనఁ గనబడునది, య
దృష్టము గోచరముకానిదేకద? కానీ
దృష్టము వలదని అందర
దృష్టమ్మునె కోరుచుందురే! యెందులకో? 5

(చైతన్యకవిత-38+39, 2003+2004)

నా ప్రియమిత్రులు కీ.శే. చిలకల వెంకటసుబ్బారెడ్డిగారికి, పరబ్రహ్మము పరిపూర్ణము లేక సంపూర్ణము అని చెప్పే ఉపనిషత్తులలోని ఈ క్రింది శాంతివచనం అంటే చాలా ఇష్టం. దీనిని గురించి నా దగ్గర తరచుగా ప్రస్తావించేవారు:-

**"ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే**
**ఓం శాంతిః శాంతిః శాంతిః"**

**తా॥** భగవంతుడు పూర్ణం (అదఃపూర్ణం). ఈ విశ్వమూ పూర్ణమే (ఇదం పూర్ణం). పూర్ణమైన భగవంతునినుండే ఈ పూర్ణమైన విశ్వంకూడా ఆవిర్భవించింది. పూర్ణమునుండి పూర్ణమును పరిహరిస్తే మిగిలేదీ పూర్ణమే!

**వివరణ:** బ్రహ్మంనుండి నామరూపాలుగా విశ్వం ఆవిర్భవించినప్పుడు, మళ్ళీ ప్రళయం వచ్చినప్పుడు విశ్వం బ్రహ్మంలో లీనమైనప్పుడు - అంటే అన్ని పరిస్థితులలోను బ్రహ్మం పూర్ణమే. విశ్వం అశాశ్వతం, బ్రహ్మం శాశ్వతం. విశ్వం శాశ్వతం అనుకోవడమే అవిద్య. విశ్వం శాశ్వతం కాదని ఆధునిక సృష్టిసిద్ధాంతం (Modern Cosmology) కూడా చెపుతుంది. ఈ విషయాన్ని వేల సంవత్సరాల నాడు వేదం ఈ మంత్రంద్వారా సూచించింది. సృష్టికి కావలసిన ద్రవ్యం (matter) ఏది? అనే ప్రశ్నకు ఆధునిక శాస్త్రజ్ఞుల దగ్గర సమాధానం లేదు. బ్రహ్మమే - శుద్ధచైతన్యమే ద్రవ్యంగా విశ్వావిర్భావం జరిగిందని ఈ మంత్రం ద్వారా సూచించి, ఆధునిక శాస్త్రజ్ఞులకంటె ఒక అడుగు ముందరే ఉంది మన వేదవిజ్ఞానం! ఈ మంత్రం పిల్లలతో సహా అందరికి రావలసిన శుభకరమంత్రం.

(-ఉపనిషత్తుల సంక్షిప్త పరిచయం, శ్రీ వేదబారతి, హైదరాబాద్, 2012)■



## అనుబంధం-6: శ్రద్ధాంజలి:-

# "దానరాధేయ"

## స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు

**జననం:** 21.03.1926 (అక్షయ శ్రీరామనవమి)
**మరణం:** 15.03.2023 (బుధవారం: అర్ధరాత్రి)

**శ్లో॥ శతేషు జాయతే శూరః - సహస్రేషు చ పండితః ।**
**వక్తా దశసహస్రేషు - దాతా భవతి వా న వా ॥**

తా॥ కొన్ని వందలమందిలో - వీరుడైనవాడు ఒక్కడు ఉంటాడు!
కొన్ని వేలమందిలో - పండితుడైనవాడు ఒక్కడు ఉంటాడు!
కొన్ని లక్షలమందిలో - చక్కగా ప్రసంగించగలిగినవాడు ఒక్కడు ఉంటాడు!
కాని కొన్ని కోట్లమందిలో - దాత అయినవాడు ఒక్కడు ఉంటాడో ఉండడో చెప్పలేం!!

అటువంటి మిక్కిలి అరుదైన వ్యక్తులలో స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు ఒకరు! వీరు మహాదాత; "దానరాధేయ" బిరుదాంకితులు.

సకలావారి స్వగ్రామం ఆంధ్రప్రదేశ్‌లో-అనంతపురంజిల్లాలో - హిందూపురం. వీరు 1926వ సంవత్సరం మార్చి 21వ తేదీ ఆదివారంనాడు - అక్షయనామసంవత్సరం శ్రీరామనవమినాడు జన్మించారు. వీరి తల్లి "కనకమ్మగారు" - తండ్రి "సకలా సంజీవయ్యగారు". పితామహుడు: "సిద్ధయ్యగారు"; పితామహి: "సుబ్బమ్మగారు". సకలావారిది "పునగశిల" గోత్రం-అంటే "పౌలస్త్యఋషి" గోత్రం. "పౌలస్త్య" శబ్దమే కాలక్రమంలో జనవ్యవహారంలో "పునగశిల" అయింది. అప్పుడప్పుడు సకలావారు నాతో "మాది రావణాసురుడిగోత్రమండీ!" అని పకపక నవ్వేవారు. వీరు పదిమంది అన్నదమ్ములు; అక్కలు, చెల్లెళ్ళు లేరు. అందరిలోకి నరసింహులుగారే పెద్దవారు.

సకలావారి తల్లివైపువారు "నూతివారు". వీరిది చిత్తూరుజిల్లా "మదనపల్లె". కొన్నివందల ఎకరాల భూమి కలిగిన సంపన్న వ్యవసాయదారుల కుటుంబంవారిది. వారిది వ్యవసాయమే ప్రధానవృత్తి కాని, వ్యాపారం కాదు. నరసింహులుగారి

మాతామహుడు "నూతి గోపన్నగారు"; మాతామహి (అమ్మమ్మ) "నారాయణమ్మ గారు". ఈ దంపతులకు ఐదుగురు కూతుళ్ళు; ముగ్గురు కొడుకులు. కూతుళ్ళలో నరసింహులుగారి తల్లి కనకమ్మగారు ఐదవది; మొత్తం సంతానంలో ఏడవది. నూతివారిది "గౌంటకుల" గోత్రం. నూతి గోపన్నగారి సంతానంలో చిట్టచివరివారు నూతి రాధాకృష్ణయ్యగారు గాంధీజీ అడుగుజాడలలో నడచిన గొప్ప దేశభక్తుడు. జైలుశిక్షలు అనుభవించినవారు. వీరికి "మదనపల్లెగాంధీ" అని పేరు హరిజనోద్ధరణ చేసినవారు. పేదలకు దానధర్మాలు ఎన్నో చేసినవారు. తన వాటాకు వచ్చిన 70 ఎకరాల భూమి వీరి దేశసేవలో కర్పూరంలా కరిగిపోయింది! ఈ చిన్నమేనమామగారి పోలికలు నరసింహులుగారిలో చాలా ఉన్నాయి. ఆయన ప్రభావంతోనే చిన్నతనంనుండీ ఖద్దరువస్త్రధారణ చేశారు. నా ప్రియమిత్రుడు, ప్రముఖకవి, పండితుడు, మదనపల్లె కళాశాలలో తెలుగు ప్రొఫెసరు అయిన డా॥ మల్లెల గురవయ్య నూతి రాధాకృష్ణయ్యగారిని గురించి "మదనపల్లెగాంధీ" అనే పేరుతో మంచి పుస్తకాన్ని రచించాడు. దానిని నేను సకలావారి దృష్టికి తెచ్చాను. ఆయన ఎంతో సంతోషంతో, మేనమామమీది భక్తిశ్రద్ధలతో దానిని ముద్రించి యిచ్చారు. ఆ గ్రంథావిష్కరణసభ బెంగుళూరులోని మా "శ్రీరస"లోనే జరిగింది.

నరసింహులుగారి తండ్రి సంజీవయ్యగారికి రెండు వివాహాలు జరిగాయి. మొదటిభార్య రుక్మిణమ్మగారికి పదిమంది సంతానం. పోయినవారు పోగా, వారిలో "నారాయణమూర్తి, కృష్ణమూర్తి, లక్ష్మీదేవమ్మ" అనేవారిని నరసింహులుగారి చిన్నతనంలో చూచారట. పెద్దభార్య చనిపోగా, సంజీవయ్యగారు ద్వితీయ వివాహం చేసుకున్నారు. రెండవభార్య, కనకమ్మగారికి పదిమంది మగపిల్లలు. ఆడపిల్లలు లేరు. వీరిలో చిన్నతనంలో ముగ్గురు గతించారు. మిగిలిన ఏడుమంది బెంగుళూరు వచ్చి స్థిరపడ్డారు. (వీరిలో 2013 నాటికి ఇద్దరు చనిపోయారు) అందరిలోకీ నరసింహులుగారే పెద్దవారు.

నరసింహులుగారు. ఎస్.ఎస్.ఎల్.సి. వరకు హిందూపురంలో చదువుకున్నారు. తరువాత అమ్మమ్మగారి ఊరు మదనపల్లె వెళ్ళి, బి.టి. కాలేజీలో ఇంటర్మీడియేట్ చదివారు. 6-11-1941లో 15 సం॥ల వయస్సులో వీరికి వివాహమయింది. బెంగుళూరులో శ్రీదేవత రామయ్యశ్రేష్ఠిగారి కుమార్తె శ్రీమతి

రంగనాయకమ్మగారు వీరిధర్మపత్ని. పెండ్లినాటికి ఆమె వయస్సు 14 సం.లు. నరసింహులుగారు తెలుగు సంవత్సరాలలో చిట్టచివరిది అయిన "అక్షయ"లో పుడితే, రంగనాయకమ్మగారు అక్షయ తరువాత వచ్చే మొట్టమొదటి సంవత్సరమైన "ప్రభవ"లో పుట్టారు. 1944లో ఇంటర్మీడియేట్ పాస్కాగానే వీరికి రాయల్ మిలిటరీలో ఉద్యోగం వచ్చింది. దేశభక్తుడైన వీరి మేనమామగారికి తన మేనల్లుడు బ్రిటీషువారి బానిస కొలువులో చేరడం ఇష్టంలేక, నరసింహులుగారిని బెంగుళూరు పంపివేసి, గృహస్థాశ్రమంలో ప్రవేశపెట్టారు. మామగారి బంగారం కొట్టు (నగల దుకాణం)లో చేరి పనినేర్చుకున్నారు. తరువాత 1952లో తన మొట్టమొదటి బిడ్డయైన "ప్రతిభ" పేరుతో సొంతంగా "ప్రతిభ జ్యుయల్రీహౌస్"ను స్థాపించి పేరు ప్రతిష్ఠలు గడించారు. 2012లో ఈ అంగడికి వజ్రమహోత్సవం కూడా జరిగింది.

సకలా వారికి ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు. శ్రీమతి ప్రతిభ, శ్రీమతి నిర్మల, శ్రీశరత్కుమార్, శ్రీమురళీమోహన్. వీరికి మనుమలు, మనుమరాండ్రు, మునిమనుమలు, మునిమనుమరాండ్రు ఉన్నారు. వీరందరితోనూ కలకలలాడుతూ – పండిన దోసతోటలాగ, దేవేంద్రుని నందనవనంలాగ ఉంటుంది సకలావారి సంపూర్ణ సంసారం! ఇంజనీరింగ్లో పట్టభద్రులైన కొడుకులిద్దరూ ఉద్యోగాల జోలికి పోకుండా, తండ్రిగారి వ్యాపారంలో చేరి, దానిని మూడు పువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధిచేస్తున్నారు. వీరి అంగడి కర్ణాటకరాష్ట్రంలోనే పేరుమోసిన నగలదుకాణం. బెంగుళూరులో ఉన్న ఆర్యవైశ్యకులానికి సకలావారు ఒక కోహినూరు వజ్రంలాంటివారు!

శ్రీసకలావారికి మధ్యవయస్సులోనే-45 సం.ల వయస్సులోనే భార్యావియోగ దుఃఖం సంభవించింది. వీరి ధర్మపత్ని శ్రీమతి సకలా రంగనాయకమ్మగారు 1971 ఏప్రిల్ 4వ తేదీనాడు 44 సం.ల వయస్సులో స్వర్గస్థులయ్యారు. అన్ని దుఃఖాలలోకి భార్యావియోగదుఃఖం చాలాచెడ్డది.

**శ్లో॥ భార్యావియోగశ్చ, జనాపవాదో, – ఋణస్యశేషః, కుజనస్యసేవా, ।**
**దారిద్ర్యకాలే ప్రియదర్శనం చ – వినాగ్నినా పంచ దహంతి చిత్తమ్ ॥**

తా॥ భార్యావియోగము, జనాపవాదము, ఋణశేషము, నీచసేవ, దరిద్రావస్థలో ప్రియదర్శనము – ఈ ఐదును అగ్ని లేకుండగనే మనస్సును

దహించి వేయు సందర్భములు. ఇలాగ మధ్యవయస్సులో ప్రియమైన భార్యను కోల్పోయినా కూడా, తిరిగి వివాహం చేసికొనకుండా తన నలుగురు పిల్లలనూ తనే తల్లియు తండ్రియునై పెంచి పెద్దచేశారు. విద్యాబుద్ధులు నేర్పించారు. వారికి యోగ్యమైన వివాహాలు చేశారు.

సకలావారు గొప్ప సాహిత్యప్రియులు. ఎన్నో వందల పద్యాలు శ్లోకాలు వీరికి కంఠతావచ్చు. పోతన భాగవతంలోని ప్రహ్లాదచరిత్ర, వామనచరిత్ర, గజేంద్రమోక్షణము, రుక్మిణీకల్యాణము – మొదలైన ఉపాఖ్యానాలన్నీ వీరికి నోటికి వచ్చును. వీటిని ఎంతో అందంగా విరిచి, కావ్యధోరణిలో చక్కగా చదివేవారు. వీరి తెలుగుపద్యపఠన కౌశలాన్ని వీరి మనుమలు ఎంతో శ్రద్ధతో రికార్డు చేశారు. 1974లో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని బెంగుళూరు పిలిచి నేను తిరుపతిరావుగారు ఘనంగా సన్మానించినప్పుడు సకలావారు మాకు అండగా నిలిచారు. 1976లో విశ్వనాథవారు స్వర్గస్థులుకాగా, 1977 నుండి 2000 సంవత్సరంవరకూ ప్రతిసంవత్సరం సెప్టెంబరు 10వతేదీన బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ విశ్వనాథవారి జయంతిని ఘనంగా జరిపించిన మహనీయులు సకలావారు. వీరు ఎన్నో గ్రంథాలను అంకితం పొందారు, ఎందరో కవులకు కళాకారులకు ధనసహాయం చేశారు. నేను 1994లో స్థాపించిన "శ్రీరస" (శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య)కు చనిపోయే వరకూ ధనసహాయం చేస్తూనే ఉన్నారు. 1986 నుండి 2009 వరకూ నేను ప్రచురించిన "చైతన్య కవిత" అనే కవిత్వపత్రికను ఎంతగానో ప్రోత్సహించారు.

ఇక్కడ ఒక సంఘటన గురించి చెప్పాలి. 1986లో నేను, సోదరుడు ప్రొ॥ ఆర్వీయస్. సుందరంతో కలిసి "చైతన్య కవిత" అనే కవిత్వ పత్రికను ప్రారంభించాను. విరాళాలు వసూలు చేయడానికి నేను సుందరం కలిసి, ప్రొ॥ సరగు కృష్ణమూర్తి (బెంగుళూరు విశ్వవిద్యాలయంలో హిందీ ప్రొఫెసర్) మొదలైన నలుగురైదుగురు మిత్రులతో కూడి 'సకలా'వారి యింటికి వెళ్ళాము. అది వైశాఖమాసం. ప్రభాతకాలం. సకలావారు అందరికీ మంచి టిఫిన్ (దోసెలు) పెట్టించారు. ఒక్కొక్కరికి ఒక పెద్దమామిడి పండు, తాంబూలంలో పెట్టి ఇచ్చారు. మిత్రులు నా "చైతన్య కవిత"ను గురించి చెప్పారు. ఆయన వెంటనే "తంగిరాలవారు ఎప్పుడువస్తే అప్పుడు నేను రూ.1500/-లు ఇస్తాను" అన్నారు. (1986లో రూ.1500/-లు అంటే ఇప్పుడు రూ.15,000/-లు). సంతోషించి అందరం బయటకు వచ్చాం. అప్పుడు

మిత్రుడు ప్రొ॥ సరగు కృష్ణమూర్తి నాతో "సుబ్బారావుగారు! ఈ రోజుల్లో కూడా ఇటువంటి మంచి వ్యక్తులు ఉన్నారా?" అని ఆశ్చర్యపోయాడు!

**మరికొన్ని సంగతులు:-**

1. నేను ఎప్పుడు ఫోన్‌చేసినా "హలో! సుబ్రావ్‌గారూ! బాగున్నారా!" అని బెంగుళూరు తెలుగులో ఎంతో ఆప్యాయంగా కుశలమడిగేవారు. ఆ మాట ఇప్పుడు తలచుకుంటే నాకు దుఃఖం కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది. నన్ను ఇకమీదట అలా పలకరించేవారు ఎవరున్నారు?
2. సకలావారు గొప్ప రామభక్తులు, ఆధ్యాత్మికవేత్త. స్వామి చిన్మయానందకు ఆప్తులు. వారి గ్రంథాలన్నీ పఠించారు. ప్రతివారమూ తప్పక రామకృష్ణా మిషన్‌ను దర్శించేవారు. ఒక సాహిత్యోపన్యాసాన్ని కాని ఒక ధార్మికో పన్యాసాన్ని కాని విని ఆనందించడంలో సకలావారిని మించినవారులేరు – అంతటి రసజ్ఞుడు ఆయన. ఏదైనా మంచి జరిగితే 'అంతారామునిదయ!'
3. 1976లో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు పరమపదించారు. 1977 నుండి బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రతి సంవత్సరం అక్టోబరు 10వ తేదీనాడు "విశ్వనాథ జయంతి" జరపాలని మిత్రులు తిరుపతిరావుగారు ప్రతిపాదించారు. నేను సరే అన్నాను. మొదలుపెట్టాం. 2000 సంవత్సరం వరకూ కొనసాగింది. ఈ జయంతికి సకలావారే వెన్నుదన్ను. ఇది శాశ్వతంగా జరపడానికి సకలావారు రూ. 25,000/- తెలుగుశాఖకు విరాళంగా ఇచ్చారు (కాని నా తరువాత శాఖాధ్యక్షులుగా వచ్చిన శిష్యుడు ఆచార్య జి.ఎస్. మోహన్ "Accounts Maintain చెయ్యడం కష్టమండీ! నా వల్లకాదు!" అని అనడంతో ఆ చెక్కు సకలావారికి తిరిగి ఇచ్చివేశాను.)
4. నేను ముద్రించిన ప్రతిగ్రంథానికీ విరాళమిచ్చారు సకలావారు. (నేను సుమారు 30-40 పుస్తకాలు ముద్రించాను.) 2013లో నా పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం -1500 పుటల బృహద్గ్రంథం 1/4 డెమ్మి సైజులో ముద్రించాలనుకున్నాను. సుమారు 3 లక్షల 50 వేల రూపాయల అంచనా. సకలావారి దగ్గరకు వెళ్లాను. "ఎంతకావాలి?" అని అడిగారు. "మా అన్నదమ్ములు, మిత్రులు, శిష్యులు కొంత సహాయం చేశారండి. సుమారు

రెండు లక్షలవరకూ ప్రోగుబడ్డాయి. మీరు రూ.30,000/- ఇస్తే చాలు!" అన్నాను. వెంటనే సంతోషంగా ఇచ్చివేశారు. ఆఖరికి ఆ పుస్తకానికి 4½ లక్షలు ఖర్చుఅయింది! ఫరవాలేదు. సకలావారివంటి ఉదారులవల్ల నేను గట్టెక్కాను. ఈ సందర్భంగా నంద్యాలలో ఉన్న మరొక మహాదాతను గురించి కూడా చెప్పుకోవాలి. ఇప్పటి నంద్యాల ఎం.పి. పోచా బ్రహ్మానందరెడ్డిగారు, రాయలసీమ మహాదాత బుడ్డా వెంగళరెడ్డిగారి వంశంలోనివారు. కోవెలకుంట్లలోని నా మిత్రులు ముక్కమళ్ళ నారాయణ రెడ్డిగారు బ్రహ్మానందరెడ్డిగారి దగ్గరకు వెళ్ళి నా బృహద్గ్రంథంగురించి చెప్పారు. "ఎంత అవుతుంది?" అని అన్నారు బ్రహ్మానందరెడ్డిగారు. "మూడు లక్షలు అవుతుంది" అన్నారు నారాయణరెడ్డిగారు. "అంతా మనమే ఇద్దాము!" అన్నారు బ్రహ్మానందరెడ్డిగారు. దానికి నారాయణరెడ్డిగారు "వద్దు! ఆయన 2½ లక్షలు సేకరించుకొన్నారు. మీరు 50 వేల రూపాయలు ఇస్తే చాలు!" అన్నారు. ఆయన వెంటనే 50 వేలు నాకు పంపివేశారు! వైశ్యులలోను, రెడ్లలోను, కాపుల (బలిజల) లోను దాతృత్వం చాలా ఎక్కువ!

**5.** 1994 ఉగాదినాడు నేను స్థాపించిన "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") కు సకలావారు చనిపోయే వరకూ విరాళాలు ఇస్తూనే ఉన్నారు. 2018లో "శ్రీరస ట్రస్టు"ను రిజిస్టరు చేశాం. దానికి రూ.50 వేల రూపాయలు విరాళమిస్తూ "మీరు 10-15 లక్షలు సేకరించ గలిగితే, దానిమీద వచ్చే వడ్డీతో సాహిత్య కార్యక్రమాలు హాయిగా నిర్వహించుకోవచ్చు" అన్నారు. (ఇప్పటికి 5 లక్షలు సేకరించగలిగాం.) మా "శ్రీరస" సకలావారిని "దానరాధేయ" బిరుదంతో సత్కరించింది.

**6.** సకలావారిలోని ఒక గొప్ప విషయాన్ని గురించి చెప్పదలచుకున్నాను:- ఏదైనా ఒక సాహిత్య కార్యక్రమానికి 10 వేలు విరాళం కావాలని ఫోనుచేస్తే: "సరే! వచ్చి తీసికొని వెళ్లండి" అనేవారు. నేను - "సకలావారి దగ్గరి డబ్బు ఎక్కడికి పోతుంది? తరువాత వెడదాంలే!" అని బద్ధకించేవాడిని. నాలుగైదు రోజులు కాగానే వారే నాకు ఫోనుచేసేవారు: "సుబ్రావ్‌గారూ! మీ సొమ్ము నా దగ్గర ఉండిపోయింది. వచ్చి తీసికొని వెళ్ళండి!" అనే వారు. నేను సిగ్గుపడి, వెంటనే వెళ్ళి ఆ డబ్బు తెచ్చుకొనేవాడిని. వారు

ఒకసారి ఒక విరాళమిస్తానని వాగ్దానం చేస్తే, తక్షణమే ఆ సొమ్ము అడిగిన వాడిది అయిపోతుంది కాని, వారిది కాదన్నమాట! అంత గొప్పదాత సకలావారు!

**7.** బెంగుళూరులో నాకు ఎక్కడ సన్మానం జరిగినా సరే, నా జన్మదిన సత్కారసభ జరిగినా సరే, అక్కడికి సకలావారు తప్పకుండా హాజరయ్యేవారు. ఒక శాలువా, ఒక దండ, కొంతసొమ్ము ఉంచిన కవరుతో వారు ప్రత్యేకంగా నన్ను సత్కరించేవారు. ఈ విధంగా 2005లో జరిగిన నా "సప్తతిపూర్తి"కి, 2010లో నా పూర్వవిద్యార్థులు చేసిన "గురువందనం" సత్కారానికి, 2015లో నా "అశీతిపూర్తి"కి, 2016లో నా "సహస్ర చంద్రదర్శనోత్సవానికి సకలావారు వచ్చి నన్ను గౌరవించారు.

**8.** గుంటూరుజిల్లా పల్నాడులోని "గామాలపాడు" (నాయకురాలు నాగమ్మ స్వగ్రామం)కు చెందిన ప్రముఖ పండికకవి శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారిని సకలావారికి పరిచయం చేశాను. ఆ కవి తాను రచించిన "పురుషోత్తముడు" పద్యకావ్యాన్ని నాకు, "అక్షర దేవాలయం" ఖండకావ్యాన్ని సకలావారికి అంకితం చేశారు. సకలావారు సంతోషించి స్వర్ణకంకణంతో ఆ కవిని సత్కరించారు. "పురుషోత్తముడు" కావ్యానికి కేంద్రసాహిత్య అకాడెమీ బహుమతి వచ్చింది. అప్పుడు గుంటూరులో చిటిప్రోలు కృష్ణమూర్తిగారికి వారి మిత్రులు గొప్ప సన్మానం చేశారు. ఆ సందర్భంగా సకలావారు మరో స్వర్ణాభరణాన్ని ఆ కవికి పంపించారు. తమ సామాజికవర్గంలో అంత గొప్పకవి ఉన్నాడని సకలావారికి సంతోషం. అప్పుడప్పుడు నా దగ్గర, నిఘంటువులు నిర్మించిన "శంకరనారాయణ"గారిని; శతావధాని, చెళ్లపిళ్లవారి శిష్యుడు అయిన దోమా వెంకటస్వామిగుప్తాగారిని; శ్రీకాళహస్తి దగ్గర వ్యాసాశ్రమాన్ని స్థాపించిన శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వామివారిని "సగర్వంగా" తలచుకొనేవారు సకలావారు. గుల్బర్గా విశ్వవిద్యాలయంలో జి.యస్. బలరామగుప్తగారు ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా ఉండేవారు. ఆయన "Indian Writing in English" అనే పేరుతో ఒక ఆంగ్ల సాహిత్య పత్రికను నడిపేవారు. ఆయనకు ఎంతో ధనసహాయం చేసేవారు సకలావారు.

**9.** నేను బెంగుళూరులో తెలుగు సాహిత్యానికి ఎంతో సేవచేస్తున్నానని, కనపడిన అందరితోనూ పదే పదే చెప్పే ఒకే ఒక వ్యక్తి స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు! వారి ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను!

**10.** నాకేకాదు, మా ఆవిడకు, మా మగపిల్లలకు, ఆడపిల్లలకు, అందరికీ ఆప్తులు శ్రీ సకలావారు. అప్పుడప్పుడు నా ఆహ్వానంమీద మా యింటికివచ్చి భోజనం చేసేవారు. మా ఆవిడ వంటను ఎంతో మెచ్చుకొనేవారు. ఆయన మరణానికి నాతోపాటు మా పిల్లలంతా ఎంతో బాధపడ్డారు.

**11.** బెంగుళూరు విశ్వవిద్యాలయంలో సివిల్ ఇంజినీరింగ్ డిపార్టుమెంటులో ప్రొఫెసర్‌గా పనిచేసిన నా మిత్రులు డా॥ వీరారెడ్డిగారు ఒకసారి మాటల సందర్భంలో సకలావారి ప్రసక్తి వస్తే నాతో "He is the most respected gentlemen! in his community" అన్నారు. దీనికి నా చిన్న సవరణ "in his community" కాదు, "in all the communities in Bangalore"

**12.** సకలావారి "ప్రతిభ జ్యూయల్రీ హౌస్"కి తనిఖీకోసం వచ్చే Commarcial Tax Offciers కూడా వారిని ఎంతో గౌరవించేవారు.

**13.** **కష్టసుఖాల్లో నాకు ఇంటికి వచ్చి ధైర్యం చెప్పేవారు సకలావారు:-**

**13.1:** 2002లో నాకు heart attack వచ్చింది. Trinity Hospitalలో డా॥ సి. మంజునాథ్‌గారు angioplasty చేసి, ఒక stent పెట్టారు. ఈ విషయం తెలిసి వెంటనే సకలావారు ఆ ఆసుపత్రికి వచ్చి నన్ను పరామర్శించారు. నేను అడగకుండానే తమ ట్రస్టు ("శ్రీమతి రంగనాయకమ్మ-శ్రీసకలా నరసింహులుచెట్టి ట్రస్టు") నుండి కొంత ధనసహాయం చేశారు.

**13.2:** 2006 ఆగస్టు 31వ తేదీ రాత్రి మా ఆవిడ శకుంతలాదేవి చనిపోయింది - వెంటనే మర్నాడు సకలా నరసింహులుశ్రేష్ఠిగారు మా యింటికి వచ్చి "అన్నీ తెలిసినవారు. మీకు నేను ప్రత్యేకంగా చెప్పేదేముంది?" అని ఓదార్చారు. "ఏమైనా డబ్బుకావాలా?" అని రెండు మూడు సార్లు నన్ను రెట్టించి, రెట్టించి అడిగారు. నేను వద్దని సున్నితంగా చెప్పాను.

**13.3:** 2017లో నాకు ఒకరోజు Sodium level తగ్గిపోయి స్పృహతప్పిపోయి ఆసుపత్రి పాలయ్యాను. వారంరోజుల తర్వాత కుదురుకొని యింటికి వచ్చాను – అప్పుడు నన్ను చూడటానికి వచ్చారు సకలావారు. నేను వారితో: "అంతా సర్దుకొన్నదికాని, అప్పుడప్పుడు తలతిరిగి తూలుతున్నాను. చేతికఱ్ఱవాడమన్నారు డాక్టర్లు. మీ చేతిలో ఉన్న కఱ్ఱ చాలా బాగుందే!" అన్నాను. "దీనిని మా పిల్లలు అమెరికా నుండి తెప్పించారు. మీకు కూడా ఒకటి తెప్పించి ఇస్తాను" అని వారంరోజుల్లో సరిగ్గా వారిచేతికఱ్ఱ వంటి కఱ్ఱే తెప్పించి నా కిచ్చారు. దానినే నేను ఇప్పటికీ వాడుతున్నాను. నేను తాటాకు పుస్తకాలు చదువుకునేందుకు వీలుగా ఒక భూతద్దం కూడా ఇచ్చారు నాకు సకలావారు.

**13.4:** ఒకరోజు నా పుట్టినరోజునాటికి ధరించడానికి ఒక ఉంగరం చేయించుకోవాలని వారి నగలషాపుకి వెళ్లాను. ఒక ఎఱ్ఱరాయి ఉంగరం సెలెక్ట్ చేసుకున్నాను. (మా అమ్మ ఎఱ్ఱరాయి ఉంగరం పెట్టుకొనేది. ఆమె చనిపోయినప్పుడు దానిని మా పెద్దక్కయ్యకు ఇచ్చేశాం. అటువంటి ఉంగరం చేయించుకోవాలనే కోరికపుట్టింది.) దాని ఖరీదు సుమారు 40–50 వేల మధ్య ఉంటుంది. నేను సొమ్ము ఇవ్వబోయాను. "దీని సంగతి మీరు మరిచిపోండి! నేను చూసుకుంటాను!" అని ధనం తీసుకుందుకు నిరాకరించారు.

**13.5:** మా ఆవిడ చనిపోయేముందు తన నగలన్నీ ఇద్దరు కూతుళ్ళకీ సమానంగా ఇచ్చివేయమని నాతో చెప్పింది–వాటిని ఎలా పంచాలో నాకు తెలియలేదు. అందువల్ల ఆ నగలన్నీ మూట కట్టుకొని, మా యిద్దరు అమ్మాయిల్ని వెంటపెట్టుకొని, సకలావారి బంగారు దుకాణానికి వెళ్లాను. వారు వాటిని ఒక్కొక్కటే తన చేతిలోకి తీసికొని, పైకి ఎగరవేస్తూ ఉజ్జాయింపుగా వాటి బరువు తెలిసికొని, రెండు వాటాలువేసి, మా యిద్దరు అమ్మాయిలకూ సమంగా పంచివేశారు. బంగారు నగల వ్యాపారంలో తనకుగల విశేషానుభవాన్ని పురస్కరించుకొని, ఆ నగలను త్రాసులోవేసి తూచకుండానే వాటి

బరువు లెక్కకట్టకలిగారు. వారి నేర్పునకు నేను మిక్కిలి ఆశ్చర్యపోయాను!

**13.6: ఓంకార్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్:-** నా పుస్తకాలన్నీ ఈ ప్రెస్సులోనే ముద్రిస్తూఉంటాను. దీని ప్రస్తుత అధినేత శ్రీ పి.యస్. వెంకటేశబాబుగారు. వీరి తండ్రిగారు ఈ ప్రెస్సును స్థాపించారు. వారు సకలావారికి మంచి మిత్రులు. ఒకసారి నేను సకలావారితో: "నా పుస్తకాలన్నీ సరసమైన ధరలకు ముద్రించమని వెంకటేశ బాబుగారితో ఒక మాట చెప్పండి!" అని అడిగాను. వారు వెంటనే, ఫోనుచేసి బాబుగారితో చెప్పారు. అప్పటినుంచీ ఆయన నా పుస్తకాలు ముద్రించేటప్పుడు అసలు ధరకన్నా ఒక ఐదువేలు తగ్గిస్తూ ఉంటారు.

**14. సౌజన్యధన్యులు, వినయసంపన్నులు:-** సకలావారు, వారి పిల్లలు అందరూ సౌజన్యధన్యులు. ఎంతో వినయ విధేయతలు కలవారు. ఎవరినీ పల్లెత్తి ఒక్కపరుషవాక్యం ఎప్పుడూ పలకనివారు. 'ఎన్నడు బెండుపల్కొదవ దెవ్వనినాల్కకు' అన్నట్లు ఉంటారు. వారితో సంభాషిస్తూ ఉంటే వెన్నెలత్రాగుతున్నంత హాయిగా ఉంటుంది. అమృతపానం చేస్తున్నంత ఆనందంగా ఉంటుంది.

**15. మా పెద్దబ్బాయి వ్యాఖ్య:-** అయిదారు సంవత్సరాల క్రిందట న్యూజిలాండ్‌లో ఉన్న మా పెద్దబ్బాయి చి॥ కాళిదాసు (చి॥ అవధానులు) బెంగుళూరు వచ్చాడు. వాడు వాడి భార్య గొప్ప దైవభక్తులు. మనదేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ పదే పదే దర్శిస్తూ ఉంటారు. వాళ్లు మానససరోవరయాత్రకు వెళ్లినప్పుడు "ఏకముఖి" రుద్రాక్షలు రెండు కొన్నారు. ఒకటి మా అబ్బాయికి, ఒకటి నాకు. వీటిని ఇతర పంచముఖి, షణ్ముఖి రుద్రాక్షలతో కలిపి, జపంచేసుకొనేందుకు వీలుగా బంగారంతో రెండు తావళాలు చుట్టించాలని, నేను వాడు కలిసి సకలావారి షాపుకి వెళ్లాం. రెండు తావళాలకు ఆర్డరు చేశాం. ఈ సందర్భంగా మా అబ్బాయి సకలావారితోను, వారి పిల్లలు శ్రీశరత్‌తోను, శ్రీ మురళీతోను కాసేపు మాటలాడాడు. మేం తిరిగి కారులో యింటికి వస్తూంటే మా అబ్బాయి నాతో ఇలా అన్నాడు: "నాన్నగారూ! సకలావారితోను, వారి పిల్లలతోను, ఎవరైనా రెండు మూడు నిమిషాలు మాటలాడితే చాలు, 'సభ్యత' అంటే ఏమిటి? 'సంస్కారం' అంటే ఏమిటి? అసలు

'నాగరికత' అంటే ఏమిటి? అనే విషయాలు స్పష్టంగా తెలుస్తాయి! వీళ్లు చాలా గొప్పవ్యక్తులు!" That is Sakala and his sons!!

**16.** ఒక వ్యక్తికి దానగుణం, ఎదుటివ్యక్తికి సంతోషకరంగా మాటలాడటం, గంభీరంగా ఉండటం, ఇది ఉచితం - ఇది అనుచితం అనే జ్ఞానం - ఈ నాలుగు గుణాలు మానవునకు పుట్టుకతో రావలసిన గుణాలేకాని, నేర్చుకొంటే వచ్చేవికావు.

**శ్లో॥ దాతృత్వం, ప్రియవక్తృత్వం - ధీరత్వ, ముచితజ్ఞతా ।**
**అభ్యాసేన నలభ్యన్తే - చత్వారః సహజా గుణాః ॥**

(- ఏటినముత్యాలు - టి.వి.కె. సోమయాజులుగారు)

**17.** సకలావారు శ్రీ చిన్మయానందస్వామికి పరమభక్తులు. ఆయన రచనలన్నీ పూర్తిగా తాను చదివినట్లుగా నాతో చాలాసార్లు చెప్పారు. అలాగే శ్రీ చిన్మయానంద స్వామికి కూడా సకలావారంటే ఎంతో అభిమానం. ఒకసారి స్వామీజీ సకలావారి యింటికి వచ్చి, అల్పాహారం స్వీకరించారు! విశ్వేశ్వరపురంలో సకలావారి యింటికి సమీపంలో రామకృష్ణమిషన్‌వారి ఆశ్రమం ఉంది. సకలావారు ప్రతిదినము ఆ ఆశ్రమానికి వెళ్లి రామకృష్ణ-శారదాదేవి-వివేకానందల ఛాయాచిత్రాలకు నమస్కరించి, అక్కడి స్వామీజీని పలుకరించి వచ్చేవారు.

**18. సకలావారి వ్యాపారదక్షత:-** ఇది 1970-80 దశకంలోని మాట. అప్పుడు సకలావారి "ప్రతిభా జ్యుయల్రీహౌస్" ఎవిన్యూరోడ్డులో ఉండేది. దాని వెనుకవీథిలోనే "భూషణ్ సిల్క్‌హౌస్" ఉంది. దాని అధినేత శ్రీ దొంతి నాగభూషణంగారు నాకు ఆత్మీయ మిత్రులు. ఒకసారి ఏదో పనిమీద వారి దగ్గరకు వెళ్లాను. అప్పుడు వారి నాన్నగారు శ్రీ దొంతి శ్రీరాములశ్రేష్ఠిగారు కూడా బ్రతికి ఉన్నారు. ప్రతిదినమూ సకలావారు ఏదో ఒక సమయంలో భూషణ్ సిల్క్‌హౌస్‌కి వచ్చి కాస్సేపు కూర్చొని, శ్రీరాములుశ్రేష్ఠిగారితో మాటామంతీ జరిపి వెళ్లేవారు. ఒకసారి నాగభూషణంగారు సకలావారిని గురించి నాతో ఒక మాట చెప్పారు. "ఎవిన్యూరోడ్డులో ఎన్నో బంగారం షాపులున్నాయి. ఒక్క సకలావారి షాపులో తప్ప, తక్కిన అన్ని అంగళ్లలోను ఈగలు తోలుకుంటూ కూర్చుంటారు. సకలావారి అంగడికి జనం తీర్థప్రజలాగ గుమిగూడుతారు. ఆయన బంగారం ఉచితంగా పంచుతున్నట్టుగా తండోప తండాలుగా వస్తారు! అది ఆయన అదృష్టం!

రోజుకి ఖర్చులుపోను నికరలాభం లక్షరూపాయలు ఉంటుంది!" (అది ఆరోజుల్లో. ఇప్పుడు చాలా ఎక్కువ లాభం వస్తూ ఉంటుంది) నా ఉద్దేశంలో అది సకలావారి అదృష్టంకాదు, వారి మాటతీరు, వారి వ్యాపారదక్షత! పిల్లలు కూడా వారి అడుగుజాడల్లోనే నడుస్తూ, వారిలాగానే ఎంతో ప్రియభాషణులుగా మసలుకుంటారు. ఎవెన్యూరోడ్డులో వారి షాపు చిన్నగదిలో ఉండేది. ఒకసారినాతో: "నా దగ్గరున్న సువర్ణ ఆభరణాలన్నీ ప్రదర్శించడానికి ఈ గది చాలడంలేదు. వచ్చేవారికి చాలా ఇరకాటంగా ఉంటోంది!" అన్నారు. అలాగే కొన్నేళ్ల తర్వాత, "రిచ్‌మండ్ సర్కిల్"లో స్థలంకొని, గ్రానైట్‌తో పెద్దషాపు కట్టించారు. విశాలమైన ఆ భవనంలో మొదటిఅంతస్తులో బంగారు నగలు, రెండవఅంతస్తులో ప్లాటినం నగలు, మూడవ అంతస్తులో వెండిసామగ్రి ఉంటాయి.

ఒకసారి ఈ భవనాన్ని నా కవిమిత్రులు శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారికి (ఆయనా ఆర్యవైశ్యుడే!) వర్ణించి చెపుతున్నాను. అంతావిని, ఆయన "ఇన్ని ఉన్నా ఆయన పద్యం వ్రాయలేరుకదా!" అన్నారు. అంటే ఆయన ఉద్దేశంలో వ్యాపార దక్షుడు, మిక్కిలి ధనవంతుడు అయిన ఆర్యవైశ్యునికన్నా, కవిత్వం వ్రాయగలిగిన సాహిత్యవేత్త అయిన ఆర్యవైశ్యుడు గొప్పవాడు! కాని నా ఉద్దేశంలో కవియైన ఆర్యవైశ్యునికన్నా దాతయైన ఆర్యవైశ్యుడు గొప్పవాడు! (కవియైన చిటిప్రోలు కృష్ణమూర్తిగారు కూడా గొప్ప ధనికుడే! ఆయనకు పల్నాడులో 100 ఎకరాల భూమి ఉన్నది.) "కొన్ని కోట్లమందిలో దాత అయినవాడు ఒక్కడు ఉంటాడో ఉండడో చెప్పలేం" అని "శతేషు జాయతే శూరః..." అనే సుభాషితం ఘోషిస్తోంది కదా! కొన్ని వేలమందిలో పండితుడైనవాడు (కవి) ఒక్కడు ఉంటాడు. కాని కొన్ని కోట్లమందిలో ఒక్కదాతను పట్టుకోలేంకదా! కృష్ణమూర్తిగారు కొన్ని వేలమందిలో ఒకడు; సకలావారు కొన్ని కోట్లమందిలో అరుదుగా తటస్థపడేవ్యక్తి!

**19.** సకలావారు చనిపోయేముందు తన కొడుకులను కోడళ్ళను, కూతుళ్ళను అల్లుళ్ళను, మనుమలను, మనుమరాండ్రను, తమ్ముళ్ళను వారి పిల్లలను అందరినీ పిలిపించి వారితో: "ఒక గంటసేపట్లో నేను చనిపోతాను. అమెరికాలోను, ఆఫ్రికాలోను ఉన్న మనుమరాండ్రకు ఫోనుచేసి చెప్పండి. మీ యెడల నేను ఏమైనా తప్పులు చేసి వుంటే నన్ను క్షమించండి!" అని అన్నారుట! ఇంత గొప్ప ఉదాత్తమానవుడు ఎక్కడైనా ఉంటాడా?

**20.** బెంగుళూరులో నేను గడించిన పేరు ప్రతిష్ఠల కీర్తిసౌధానికి మూలస్తంభం స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు. మిగిలిన నాలుగు స్తంభాలూ: 1) డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు – 2) శ్రీ వై.వి. వెంకటేశ్వరరావుగారు (Income Tax Officer) – 3) శ్రీ బుల్లా సుబ్బారావు (I.A.S.Officer)గారు – 4) "దానచింతామణి" శ్రీ డి.కె. ఆదిశేషవులుగారు. వీరు నలుగురూ ముందుగానే కీర్తిశేషులయ్యారు. ఇప్పుడు మూలస్తంభం కూడా కూలిపోయింది! నేను నా కీర్తిసౌధం శిథిలాల మధ్య ఒంటరిగా మిగిలిపోయి, బిక్కుబిక్కుమంటూ దిక్కులు చూస్తున్నాను!

**సారాంశం (ముగింపు):**

స్వర్గీయ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు ఎన్నో విద్యాసంస్థలకు, ధార్మిక సంస్థలకు, సాహిత్య సంస్థలకు, కవులకు, పండితులకు–చేతికి ఎముకలేకుండా దానాలు చేశారు.

నేను 1969 డిసెంబరు నెలలో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా చేరాను. చేరిన రెండు మూడు నెలల్లోనే నా మిత్రులు, సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితులు అయిన డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు, శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారిని నాకు పరిచయం చేశారు. అప్పటినుండి ఇప్పటివరకు అంటే గత 53 సంవత్సరాలపాటు నాకు వారితో ప్రగాఢమైన స్నేహం ఉంది. బెంగుళూరు విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖ సాహిత్య కార్యక్రమాలకు – ముఖ్యంగా "విశ్వనాథ జయంతి"కి సకలావారు ఎంతో సహాయం చేశారు. నేను మొదలుపెట్టిన "చైతన్యకవిత" అనే సాహిత్యపత్రికకు, "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" అనే సాహిత్యసంస్థకు ఎన్నో రకాలుగా, ఎన్నో పర్యాయాలు చేయూత నిచ్చారు. వేలకొలది రూపాయలు విరాళంగా ఇచ్చి పోషించారు. నేను ప్రచురించిన అనేక గ్రంథాలకు (సుమారు 30 గ్రంథాలకు) ఆర్థికసహాయం అందించారు. వారి మరణం నాకు తీరని లోటు.

మా నాన్నగారు చనిపోయినప్పుడు నేను ఎంత దుఃఖించానో, మా అన్నగారు చనిపోయినప్పుడు నేను ఎంత దుఃఖించానో, ఇప్పుడు సకలావారి మరణంతో అంత బాధపడుతున్నాను!

నా 88 సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో నేను చూచిన – "The Most Perfect Gentleman"–"సంపూర్ణ నాగరక దివ్యమానవుడు"–

**స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు!**

సకలావారితో నాకున్న ఆత్మీయానుబంధాన్ని పురస్కరించుకొని ఒక చిన్నకవిత వ్రాశాను. దానిని దిగువ ఇస్తున్నాను:–

**తేనెవంటి తీయని పలుకుల్లో**
**చల్లని పిల్లతెమ్మెరల హాయి!**
**కుసుమపేశలమైన మెత్తని మనసులో**
**విరిసిన పండువెన్నెల రేయి!**
**సింపుల్ ఖాదీలుంగీ, ఖాదీలాల్చీ,**
**మెడచుట్టూ ఖద్దరు సిల్కుకండువా,**
**మేనమామ "మదనపల్లెగాంధీ" ఆనవాలు!**
**బొండుమల్లెలరాశిలా**
**తెల్లని దుస్తుల సింగారం!**
**నిండైన ఆయన వ్యక్తిత్వంముందు**
**ఓడిపోతుంది మేలిమిబంగారం!**

**తన్మయీభూత శ్రీరామభక్తి,**
**చిన్మయానంద వేదాంతరక్తి,**
**విరామరహిత సమాజసంసేవానురక్తి,**
**కవిపండిత పోషణాభివ్యక్తసంపత్తి!**

**"రిచ్‌మండ్ సర్కిల్"లోని**
**సువర్ణవ్యాపారపారావారానికి**
**ఆయన 'ప్రతిభ' ఒక లైట్‌హౌస్!**
**బెంగుళూరు ఆర్యవైశ్యప్రపంచానికి**
**ఆయన నాయకత్వం ఒక వైట్‌హౌస్!**

**50 వసంతాల మా చెలిమి,**
**పాతిక విశ్వనాథ జయంతుల కలిమి,**

సౌమ్య సౌజన్య సౌశీల్య సౌహార్ద సౌమనస్యాల బలిమి!
ఒక నవరసభరిత లలితకళాగోష్ఠి,
శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠి!!

బంగారానికి పరిమళాన్ని
జోడించలేకపోయాడు బ్రహ్మ!
ఆ లోపాన్ని సరిచేసుకోవాలని
సకలసద్గుణసంపన్నులైన
మా శ్రేష్ఠిగారిని సృష్టించాడు ఆ పరమేష్ఠి!!

కూతుళ్ళు, అల్లుళ్ళు
కొడుకులు, కోడళ్ళు,
మనుమలు, మనుమరాండ్రు,
మునిమనుమలు, మునిమనుమరాండ్రు,
నిండుకుటుంబ నందనవనంలో విహరిస్తూ
ఆయురారోగ్య భోగభాగ్యాలతో తులతూగుతూ
97 వసంతాలు వర్ధిల్లిన మీరు సంపూర్ణయశఃకాయులు
చేతికి ఎముకలేకుండా దానాలుచేసిన అపరరాధేయులు!

మధుమాసంతో శ్రీరామనవమి మీకు స్వాగతం చెపుతూవుంటే
మీరు శ్రీకైవల్యపదం చేరడం, ఆ శ్రీరామునిలో లీనంకావడం
బంధుకోటికి, నావంటి మిత్రవాటికి తీరనిలోటు!
ఉన్నట్టుండి పడిన ఉరుములేని పిడుగుపాటు!!

ఇప్పుడు మీరులేని ఈ బెంగుళూరునగరం -
అలనాడు రాముడులేని అయోధ్యానగరం!!

– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

1. సౌమ్యం=శాంతం; 2. సౌజన్యం=సుజనత్వం (మంచితనం); 3. సౌశీల్యం=సుశీలత్వం (మంచిగుణం కలిగి ఉండటం); 4. సౌహార్దం=స్నేహం (చెలిమి); 5. సౌమనస్యం= సుమనోభావం (మంచి మనస్సు కలిగి ఉండటం) - ఇవన్నీ సకలావారి సద్గుణాలు.

## ఆచార్య మల్లాప్రగడవారి ప్రవచన ప్రారంభ ప్రార్థన

ఆచార్య మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు గొప్ప ప్రవచనకారులు. తెలుగుదేశమంతటా (ఆంధ్ర + తెలంగాణా) పర్యటిస్తూ, రామాయణ భారత భాగవతాలను గురించి ఎన్నో ఉపన్యాసాలు చేశారు; చేస్తున్నారు. మా "శ్రీరస" ("శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య")లో 2001 నుండి 2020 వరకు ఏకధాటిగా 20 సంవత్సరాలపాటు ఉపన్యసించి బెంగుళూరు తెలుగువారికి షడ్రసోపేతమైన సాహిత్యపు విందులు చేశారు. వారు ప్రతి ఉపన్యాసానికి ముందు గురుస్తుతిగా "నారాయణ సమారంభాం" అనే సంస్కృత శ్లోకం చదివి, తరువాత ఈ క్రింది తెలుగు ప్రార్థన చేస్తారు; ఎంతో శ్రావ్యంగా పద్యాన్ని చదువుతారు:-

**భద్రమైనట్టి సుమధుర పదములెపుడు**
**వీనులారగ ఓ ప్రభూ! వినగ నిమ్ము!**
**నిస్తులానందమున హృది నింపునట్టి**
**సుందరములగు విషయముల్ చూడనిమ్ము!**
**నీదు మహిమల పాడుచు, నీదుపనికి**
**జీవితము నంతికమ్ముగ జేయుకొఱకు**
**నాదు దేహము దృఢముగా నడువనిమ్ము!**
**ఒడలు మరపించి మది శాంతిబడగజేయు**
**మలయ పవనపు వీచికల్ మందగతుల**
**విశ్వమున నెల్లకాలము వీవనిమ్ము!**

("భద్రంకర్ణేభిః...." అనే అరుణోపనిషత్తులోని శాంతిమంత్రానికి పై కవిత అనువాదం - తంగిరాల)

---

## Women's Rights (Feminism)

"Too many women
In too many countries
Speak the same language
Of silence!"

**- Anasuya Sen Gupta,**
**(a college student in Delhi in 1985)**

## సానుభూతి


శ్రీ ఖండాపు మన్మథరావు

చిరంజీవి ఖండాపు మన్మథరావు మన తెలుగు అధ్యయనశాఖలో ఎం.ఫిల్.డిగ్రీ చేశాడు (1986). మంచి వినయ విధేయతలుగల విద్యార్థి. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ. చేసి ఇక్కడికి వచ్చాడు. ఆచార్య యస్వీ. జోగారావుగారికి ప్రియశిష్యుడు. ఇక్కడ ఎం.ఫిల్. పూర్తిచేశాక, విజయవాడ పి.బి. సిద్ధార్థ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా చేరాడు. చాలాఏండ్లుగా అక్కడే పనిచేస్తున్నాడు. మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించాడు. ఆ కళాశాలలో తెలుగు ప్రొఫెసర్ అండ్ హెడ్‌గా ఉన్న శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారికి కుడిభుజంగా పనిచేశాడు. ఆ కళాశాలలో వారంవారం జరిగే సాహిత్య వెబినార్‌లన్నీ ఇతడే నిర్వహించేవాడు. నేను ఏదైనా ఒక గ్రంథాన్ని ముద్రిస్తున్నానని తెలిస్తే, నేను అడగకుండానే విరాళం పంపించేవాడు. ఇటీవల నేను అతనికి ఫోను చేశాను – కుశలం తెలుసుకోవడం కోసం. దుర్భరమైన ఒక విషాద వార్త చెప్పాడు. 2022 ఉగాదినాడు అతనికి మెదడులో ఏదో తేడావచ్చి, శరీరంలోని ఎడమవైపు భాగమంతా చచ్చుబడిపోయిందట! మంచానికే పరిమితమైపోయాడట! పక్షవాతంవంటి వ్యాధితో బాధపడుతున్నాడు. ఎంతో చిన్నవాడు; ఎంతో భవిష్యత్తు ఉన్నవాడు; ఇలాగ అనారోగ్యం పాలైపోవడం నా మనస్సును కలచివేసింది. లక్షలు లక్షలు ధనం మంచినీళ్లప్రాయంగా ఖర్చయిపోతోంది. ఇంకా పూర్తిగా కోలుకోలేదు. అతడు త్వరలో సంపూర్ణ ఆరోగ్యవంతుడు కావాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను!

మన్మథరావుకి చిన్నతనంలో భార్యావియోగదుఃఖం కలిగింది. ఒకే ఒక కొడుకు. అతనిని బాగా చదివించాడు. అతడు ఇప్పుడు మద్రాసులో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. చిన్నతనంలోనే పెళ్లాం చనిపోయినా, అతడు మళ్లీ పెళ్లి చేసుకోకుండా ఏక పుత్రుణ్ణి శ్రద్ధగా పెంచి పెద్దచేశాడు. ఇది అతనిలోని గొప్ప లక్షణం! మన్మథరావుతో పరిచయం ఉన్నవారు అతనికి ఫోను చేసి సానుభూతి తెలుపువలసిందిగా కోరుతున్నాను. అతని సెల్ నెంబరు94409 43937.

బెంగుళూరు — **– తంగిరాల వెంకట సుబ్బారావు**

15.01.2023, (శుభకృత్ సంక్రాంతి)



"మేలుకలయిక" సంస్థాపకులు, కళాపోషకులు,

"అభినవకృష్ణరాయ" బిరుదాంకితులు

శ్రీ వై.వి. వెంకటేశ్వరరావుగారు

**(Income Tax Officer, Bangalore)**



కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు

| | |
|---|---|
| జననం | మరణం |
| **10.09.1895** | **18.10.1976** |



శ్రీ పి.వి. నరసింహారావుగారు
(1971లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు)



డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు
(కన్నడ అధ్యయన కేంద్రంలో
తెలుగు ఉపన్యాసకుడుగా చేరినప్పుడు - 1969)



డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు

జననం: 04.03.1925 మరణం: 16.12.2006



డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు
(ఉద్యోగకాలం: 1974-1981)



50 వసంతాల తంగిరాల
(30.03.1985)



తంగిరాలవారి రేఖాచిత్రం
చిత్రకారుడు : "శంకర్" (బాపుగారి తమ్ముడు)



బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. (తెలుగు) మొట్టమొదటి బ్యాచ్ (1974-76)

## I. తెలుగుశాఖ వ్యవస్థాపకులు:-



"కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారు (1895-1976)



శ్రీ పి.వి. నరసింహారావుగారు
(ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి-భారతదేశ ప్రధానమంత్రి)
జననం: 28 జూన్ 1921 - మరణం: 23 డిసెంబరు 2004)



"పద్మభూషణ" డా॥ హెచ్. నరసింహయ్యగారు
1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయం ఉపకులపతి
జననం: 06.06.1920 – మరణం: 31.01.2005



డా॥ జి.యస్. శివరుద్రప్పగారు
కన్నడ అధ్యయన కేంద్రం నిర్దేశకులు, మరియు
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ (1974)
జననం: 07.02.1926 – మరణం: 23.12.2013



ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
(ఉద్యోగకాలం: 1969–1996)

## II. తెలుగుశాఖ అధ్యాపకులు :-



ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
(60 వసంతాల తంగిరాల: 30.03.1995)




విద్వాన్ శ్రీ రత్నాకరం శంకరనారాయణరాజుగారు, ఎం.ఏ.
(ఉద్యోగ కాలం: 1974-1981)



డా॥ బాడాల రామయ్యగారు
(ఉద్యోగ కాలం: 1983–1990)



ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి
(ఉద్యోగ కాలం: 1983–2014)



**"నవ్వుల వెన్నెలరాణి" - "సువర్ణసుందరి"**
**ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతి**
**(ఉద్యోగ కాలం: 1994 నుండి)**

## III. గ్రంథముద్రణ దాతలు :-



కీ.శే. చిలకల (మోక్షగుండం) వెంకట సుబ్బారెడ్డిగారు
(జననం: 31.12.1934 - మరణం: 22.06.2018)



శ్రీమతి చిలకల పార్వతమ్మగారు
(జననం: 08.10.1942)




బెంగుళూరు విశ్వవిద్యాలయంలో జరిగిన "శ్రీరస" సాహిత్యసభలో శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారిని సత్కరిస్తున్న
"దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు



సప్తతిసభలో నన్ను అభినందిస్తున్న శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు **(30.03.2005)**



"శ్రీరస" సాహిత్యసభకు హాజరయిన శ్రీ పిలకల వెంకట సుబ్బారెడ్డిగారు తదితరులు



“శ్రీరస” సభలో ప్రసంగిస్తున్న శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు



నా సహస్రచంద్రదర్శనోత్సవ సందర్భంగా (30.03.2016) శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారికి సత్కారం



శ్రీ వడ్డె బాలనరసింహుడు - శ్రీమతి వడ్డె కీర్తి దంపతులు
తమ చిరంజీవులతో
(నంద్యాల)




సుబ్బారెడ్డిగారి రచనలు-2




సుబ్బారెడ్డిగారి రచనలు-3



శ్రీ డి. రఘురాం-శ్రీమతి కె. మంజులమ్మ - చి॥ డి. ఆదిత్య



శ్రీమతి ఎస్. జమున - శ్రీ ఎ. చిట్టిబాబు దంపతులు



శ్రీ పి. లక్ష్మీనారాయణ - శ్రీమతి ఎం. శ్రీశైలకుమారి దంపతులు



శ్రీ ఏటిగడ్డ అశ్వత్థనారాయణ - శ్రీమతి ప్రమీల దంపతులు



శ్రీ జి. చిత్తనగరి-శ్రీమతి తిమ్మరాజమ్మ దంపతులు




సభాప్రాంగణాన్ని పూలమాలలతో అలంకరిస్తున్న
పూర్వవిద్యార్థి శ్రీ కె. షానవాజ్



ఆచార్యులకు శ్రీ ఎస్. జగన్నాథేశ్వర స్వాగతం
(ప్రక్కన శ్రీ జి. చిత్తనగరి - డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి)



ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మిగారి
ఇంటికి వెళ్ళి సత్కరించిన పూర్వవిద్యార్థులు



కీ.శే. భళ్లమూడి ప్రభాకరరావు – శ్రీమతి వెంకటరమణ దంపతులు



ప్రియశిష్యుడు
డా॥ తోట వెంకటస్వామి – ధర్మపత్ని శ్రీమతి భారతలక్ష్మి



ప్రియశిష్యుడు డా॥ వి. నారాయణప్ప (డిల్లీ)



ప్రియశిష్యులు డా॥ పి.యు.బి. శర్మగారితో... (2022)



డా॥ ఎం. రుక్మాంగదనాయుడు
అధినేత, శ్రీకృష్ణ గ్రూప్ ఆఫ్ ఇన్‌స్టిట్యూషన్స్, బెంగుళూరు



డా॥ నాగమ్మగారి భీమన్న



సాహిత్యసభలో ప్రసంగిస్తున్న
"వెన్నెల నవ్వుల మల్లెపందిరి" ఆచార్య తంగిరాల



శ్రీ ఎం. రవిశంకర్ - శ్రీమతి సుశీలమ్మ దంపతులు
(హిందూపురం)

## IV. మరికొన్ని ఛాయాచిత్రములు :-



ఏప్రిల్ 1996లో రిటైరయిన ఆచార్య తంగిరాలకు వీడ్కోలు
సత్కారం చేస్తున్న ఆచార్య జి.యస్. మోహన్



ఎం.ఏ. (తెలుగు) 1986-88 బ్యాచ్,
1987-89 బ్యాచ్ మరియు 1988-90 బ్యాచ్



ఎం.ఏ. (తెలుగు 1989-91 బ్యాచ్ మరియు 1990-92 బ్యాచ్



ఎం.ఏ. (తెలుగు 1991-93 బ్యాచ్



ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపకులపతి
ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారిచే సత్కారం (మార్చి **2006**)



"బెంగుళూరులో రెండు పూలచెట్లు"
ప్రముఖ కవయిత్రులు డా॥ దివాకర్ల రాజేశ్వరి (ఎడమ) –
శ్రీమతి అంబికా అనంత్ (కుడి) మధ్యలో ఆచార్య తంగిరాల



గురువందనం-2010
(29.08.2010) ఆచార్య తంగిరాలవారికి సత్కారం



గురువందనం-2010
(29.08.2010) ఆచార్యులు - పూర్వవిద్యార్థులు



జానపద ఆచార్యత్రయం ప్రొ॥ జి.ఎస్. మోహన్ – ప్రొ॥ తంగిరాల – ప్రొ॥ ఆర్వీయస్. సుందరం



మా తల్లిదండ్రులు

కీ.శే. తంగిరాల (భళ్లమూడి) సీతామహాలక్ష్మిగారు (1907-1990)

కీ.శే. తంగిరాల వెంకట సుబ్బావధానులుగారు (1904-1968)



మా అన్నయ్య
కీ.శే. శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు
(కీ.శే.తంగిరాల వేంకటకృష్ణసోమయాజులుగారు) (1930–2021)



మా అన్నదమ్ములు: సోమయాజులు, సుబ్బారావు, భాస్కరరావు, కృష్ణమూర్తి



నేను - నా కుటుంబం (1978)



ధర్మపత్ని శ్రీమతి శకుంతలాదేవితో (1974)



శ్రీమతి తంగిరాల (భళ్లమూడి) శకుంతలాదేవి
జననం: 30.04.1940 – మరణం: 31.08.2006



చి॥ తంగిరాల వెంకట నాగ వైజయంతి ("పింకీ")

27వ జన్మదినం 31-03-2023



తంగిరాల దంపతులు - శేషేంద్ర దంపతులు (1994)



శేషేంద్రతో ఆత్మీయానుబంధం



అభ్యుదయకవి ఆవంత్స సోమసుందర్‌గారితో
తంగిరాల దంపతులు



ప్రముఖకవి 'పఠాభి' గారితో తంగిరాల




ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వై.యస్. రాజశేఖరరెడ్డిగారిచే ఆచార్య తంగిరాలకు ఉగాది పురస్కారం (3.4.2010)



కేంద్రమంత్రి డా॥ వీరప్పమొయిలిగారిచే ఆచార్య తంగిరాలకు సత్కారం (27.01.2013)




మా చిరంజీవులు
(కాళి–రాము–సీత–శీను–శశి)



"అశీతిపూర్తిసభ"లో ఆత్మీయశిష్యురాలు ఆచార్య చన్నాప్రగడ
జయలక్ష్మితో (30.03.2015)



“అశీతిపూర్తి”కి ఆచార్య మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి కుటుంబసభ్యులతో కలిసి సత్కారం (30.03.2015)



"సహస్రచంద్రదర్శనోత్సవం" - ఆత్మీయశిష్యుల పురస్కారం
(30.03.2016)
(ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి - డా॥ జోస్యుల సదానందశాస్త్రి)




"శ్రీరస" ట్రస్టుబోర్డు సభ్యులతో (19.11.2018)



"సి.పి.బ్రౌన్ సేవాసమితి" (శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డిగారి)చే
ఆచార్య తంగిరాలకు జీవితసాఫల్య పురస్కారం (07.03.2020)



జీవితసాఫల్య పురస్కారవేళ పుష్పాభిషేకం చేస్తున్న
శ్రీమతి అంబికా అనంత్ – ఆచార్య కె. ఆశాజ్యోతి



"దానచింతామణి"
శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు
బెంగుళూరు



ప్రాణమిత్రులు శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.ఎస్.గారితో



ధర్మపత్ని శకుంతలాదేవితో (1995)



"సప్తతిపూర్తి" - తంగిరాల దంపతులకు
"శ్రీరస" మిత్రుల సత్కారం,
(గాంధీ సాహిత్య సంఘం, మల్లేశ్వరం, 30.03.2005)



మిత్రులు శ్రీ కె.పి.రావుగారిచే సప్తతిపూర్తి సత్కారం



శ్రీనిడమర్తి ఉమారాజేశ్వరరావు-శ్రీమతి శ్యామల దంపతులచే
సప్తతిపూర్తి సత్కారం



శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారిచే ఘనసన్మానం




తెలుగు విజ్ఞానసమితి అధ్యక్షులు
డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారిచే సప్తతిపూర్తి అభినందన.
(వారికి కుడిప్రక్క మిత్రులు శ్రీ పంతులుగారు)



సప్తతిపూర్తిసభ - శ్రీమతి అరిపిరాల సువర్ణగారి అభినందన




సప్తతిపూర్తిసభ - కన్నడ పూర్వవిద్యార్థి
శ్రీ మార్కండపురం శ్రీనివాస్ అభినందన



నాకు సప్తతిపూర్తి సత్కారసభ ఏర్పాటు చేసిన మిత్రులలో కొందరు



ఆచార్య తంగిరాల అశీతిపూర్తి (80 సం॥) -
శ్రీ పెద్ది సత్యనారాయణగారి సత్కారం,
భారతీయ విజ్ఞానసంస్థ, బెంగుళూరు, 30.03.2015)



"ఆచార్యత్రయం" శలాక-తంగిరాల-మల్లాప్రగడ
("శ్రీరస" సభ, 28.10.2018)



సి.పి.బ్రౌన్ సేవాసమితిచే జీవితసాఫల్య పురస్కారం
శ్రీ కృష్ణదేవరాయ కళామందిరం, 07.03.2020




కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి- శ్రీమతి శంకరి దంపతులు

## V. గురువందనం-2022, కార్యక్రమం




ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతి స్వాగతవచనాలు



ఆచార్య తంగిరాలవారికి స్వాగతం చెపుతున్న ప్రొ॥ ఆశాజ్యోతి



బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపకులపతి ప్రొ॥ డా. ఆర్. వేణుగోపాల్‌గారు



శ్రీ ఎ. సురేంద్రనాథ్ - శ్రీమతి మారుతి శ్రీలత దంపతులు



ఆచార్య జి.యస్. మోహన్ – ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు



గురువందనం-2022 కార్యక్రమంలో ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారి ప్రసంగం



ఆచార్య జి.యస్. మోహన్‌గారి ప్రసంగం



డా॥ పి.బి. శివణ్ణ ప్రసంగం (కన్నడ పూర్వవిద్యార్థి)



భోజన విరామంలో... ప్రొ॥ హెచ్.నాగరత్న (హిస్టరీ)తో...




భోజన విరామంలో... చి॥ తంగిరాల స్కంద్ (మా మనుమడు)



శ్రీమతి డా. మంజులమ్మ (హిందూపురం) ప్రసంగం



డా॥ ఎన్.ఆర్. సదాశివరెడ్డి, (అనంతపురం) ప్రసంగం



డా॥ ఇ. నాగరాజు, (మడకశిర) ప్రసంగం



శ్రీ ఎం. రవిశేఖర్ (హిందూపురం) ప్రసంగం



శ్రీ ఎ. గురుమూర్తి (బెంగుళూరు) ప్రసంగం
(Retired District Judge)



శ్రీ పి. లక్ష్మీనారాయణ (గుంతకల్లు) ప్రసంగం



శ్రీ వెలగట్ల లక్ష్మీనారాయణ ఆచార్యులవారికి స్వాగతం



ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి పూర్వవిద్యార్థుల సత్కారం



ఆచార్య జి.యస్. మోహన్‌గారికి పూర్వవిద్యార్థుల సత్కారం



నాతో కలిసి 1994లో "శ్రీరస"ను స్థాపించిన ప్రముఖ కవయిత్రి
డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు (అమెరికా)
(ప్రముఖ పండితులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి అమ్మాయి)



తణుకు నన్నయపీఠం, కార్యదర్శి శ్రీ "సుశర్మ"గారినుండి
"తిలక్ సాహిత్య పురస్కారం" స్వీకరిస్తున్న
శ్రీ దుగ్గిరాల రామారావుగారు (2007)




"శ్రీరస" సభలో శ్రీసకలా–శ్రీమల్లాప్రగడతో
– తంగిరాల (16–05–2005)



"శ్రీరస" సభలో ప్రొ॥ తంగిరాల – శ్రీసకలా (2005)




డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారిని సత్కరించిన శ్రీసకలావారు
(24-04-2005)



శ్రీచిటిప్రోలు కృష్ణమూర్తిగారు రచించిన “పురుషోత్తముడు”
కావ్యాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీసకలావారు (09-04-2007)



శ్రీచిటిప్రోలు కృష్ణమూర్తిగారిని సత్కరిస్తున్న శ్రీసకలావారు
(09-04-2007)



"తెలుగు వీరగాథాకవిత్వము" ఆవిష్కరించి,
ప్రొ॥ తంగిరాలను సత్కరిస్తున్న శ్రీసకలావారు (22-12-2013)



శ్రీబుల్లా సుబ్బారావు I.A.S.గారిని సత్కరిస్తున్న శ్రీసకలావారు
(22-12-2013)



ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారిని సత్కరిస్తున్న శ్రీసకలావారు
(22-12-2013)



శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారిని సన్మానిస్తున్న
ప్రొ॥ తంగిరాల - ప్రొ॥ ఆర్.యస్.రాజుగారు (22-12-2013)



ఆచార్య శలాక రఘునాథశర్మగారినుండి గ్రంథాన్ని స్వీకరిస్తున్న
శ్రీసకలావారు (30-03-2016)



నా "సహస్రచంద్ర దర్శనోత్సవసభ"లో
శ్రీసకలావారి సత్కారం (30-03-2016)



"దానరాధేయ"
శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారు



"శ్రీరస" సాహిత్యసభలో
ప్రసంగిస్తున్న శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారు
ప్రక్కన అధ్యక్షులు ఆచార్య తంగిరాల



శ్రీసకలా నరసింహులుశాస్త్రిగారికి "దానధర్మ" బిరుదప్రదానం చేస్తున్న "శ్రీరస" కార్యవర్గం మరియు శ్రీ మల్లాప్రగడగారు



"బుచ్చిబాబు"గారి శతజయంతిసభలో ప్రముఖ చలనచిత్రనటి
శ్రీమతి షావుకారు జానకిగారితో మాట్లాడుతున్న శ్రీసకలావారు



"దానరాధేయ" శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారు
"శ్రీరస" సాహిత్యసభలో ప్రసంగించుట



"దానరాధేయ" స్వర్గీయ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు
(1926-2023)



ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మిగారికి సత్కారం




ఆచార్య కొలకలూరి ఆశాజ్యోతిగారికి సత్కారం

గురువందనం-2022 తంగిరాల వ్యాసమాల - మొదటి సంపుటం

– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు



గురువందనం-2022లో పాల్గొన్న పూర్వవిద్యార్థులు
10.06.2022, శుక్రవారం

గురువందనం-2022 - తంగిరాల వ్యాసమాల - మొదటి సంపుటం